అట్టలోపలి వైపు అచ్చువేసిన శిల్పంలో కనబడేది శుద్ధోదన మహారాజుకు గౌతమ బుద్ధుని తల్లియైన మహారాణి మాయాదేవి కన్న స్వప్నం గురించి జ్యోతిష్కులు వ్యాఖ్యానిస్తూ ఉండిన దృశ్యం. వారికి దిగువున వారి వ్యాఖ్యను వ్రాసుకుంటున్న లేఖకుడు కనిపిస్తాడు. భారతదేశంలో లేఖన కళ చిత్ర శిల్పంలో నిబద్ధమై లభించే దృష్టాంతాలలో ఇదే ప్రాచీనమైనది.

నాగార్జున కొండ క్రీ॥ శ॥ 2వ శతాబ్దం.

(జాతీయ పురావస్తు ప్రదర్శనశాల, న్యూఢిల్లీవారి సౌజన్యంతో)

# స్వాతంత్ర్యం

(సాహిత్య అకాడెమీ బహుమతి పొందిన ఆంగ్ల నవల)

ఆంగ్ల మూలం :

**చమన్ నహల్**

తెలుగు సేత :

**డాక్టర్ యన్.సి. రామానుజాచార్యులు**



**సాహిత్య అకాడెమీ**

SWATANTRAM . Telugu Translation by N C. Ramanujacharyulu 'Srivirinchi' of Chaman Nahal's Akademi Award Winning English Novel '*Azadi*' Sahitya Akademi, 1999. Rs. 160/-



First Published 1999
ISBN : 81-260-0785-0

సాహిత్య అకాదెమీ

రవీంద్ర భవన్, 35 ఫిరోజ్‌షా రోడ్, న్యూఢిల్లీ - 110 001

*విక్రయ విభాగం :*

స్వాతి మందిర్ మార్గ్, న్యూఢిల్లీ - 110 001.

సెంట్రల్ కాలేజ్ క్యాంపస్, యూనివర్శిటీ లైబ్రరరీ బిల్డింగ్,
Dr. అంబేద్కర్ వీధి, బెంగుళూరు - 560 001.

గుణా బిల్డింగ్, 304-305, అణ్ణాసాలై, చెన్నై - 600 018.

జీవన్‌దారా బిల్డింగ్, 4వ అంతస్తు,
23A/44X, డైమండ్ హార్బర్ రోడ్, కలకత్తా - 700 053.

172, ముంబాయి మరాఠి గ్రంథ సంగ్రహాలయ మార్గ్,
దాదర్, ముంబాయి - 400 014.

రూ 160/-

Printed at . **Gee Bee Graphics,** 40/3, M S. Naidu Street, Chennai-21

**రచయిత :**

ఈ నవలలోని పాత్రలన్నీ - చారిత్రిక పాత్రలు మినహా - ఊహాజనితమైనవి. గాంధీ పంజాబ్ పర్యటన, ప్రిన్స్ ఆఫ్ వేల్స్, సియాల్‌కోట సందర్శనం పూర్తిగా కల్పితం అక్కడక్కడ ప్రస్తావించిన తేదీలు కూడా యదార్థానికి ఒదిగి వుండవు.

**కర్తార్ దేవి**

**దివ్య స్మృతికి**

మనస్సు భయవిహ్వలం కాకుండా
శిరస్సు ధాటిగా నిలచి వుండే సీమకు -
జ్ఞానం స్వచ్ఛందం అయిన చోటుకు -
సంకుచితమైన అడ్డుగోడల మధ్య
ప్రపంచం ఛిన్నా భిన్నం అవని అవనికి -
సత్యగర్భం నుంచే పలుకులు వచ్చే ప్రాంగణానికి -
సహేతుకం, అకలుషితం అయిన సెలయేరులు
కరుడుకట్టిన అలవాట్ల భయానక ఎడారులలో
దారితప్పిపోని ప్రదేశానికి
ఆ స్వతంత్ర స్వర్గ ధామానికి -
నా తండ్రీ !
నా దేశం జాగరూకమై మేల్కొనవలె !

**(రవీంద్రనాథ్ ఠాకూర్)**

# ఈ నవలలో వచ్చే ప్రధాన పాత్రలు

లాలా కాన్షీరామ్ — సియల్‌కోటలో ఒక ధాన్యపు వర్తకుడు (సియల్‌కోట పశ్చిమ పంజాబ్ [యిప్పటి పాకిస్తాన్ దేశం]లో వుంది) బీబీ అమరావతి భవనంలో ప్రధానమైన అద్దెవాటాదారు

ప్రభారాణి — ఆయన భార్య

మధుబాల : వారి కుమార్తె

అరుణ్ కుమార్ : వారి కొడుడు

బీబీ అమరావతి . సియల్ కోటలో ఓ భూస్వామిని

గంగుమల్ . ఆమె భర్త

సూరజ్ ప్రకాశ్ · వారి కొడుకు

సునందబాల — సూరజ్ ప్రకాశ్ భార్య

సర్దార్ జోధా సింగ్ · సియల్‌కోటలో ఎండిన పళ్ల దుకాణదారు. బీబీ అమరావతి యింట మరో అద్దె వాటాదారు.

సర్దార్ తేజసింగ్ : అతని కొడుకు

ఈషర్ కేర్ : తేజసింగ్ కుమార్తె

నిరంజన్ సింగ్ : ఈషర్ కేర్ భర్త

పద్మిని : బొగ్గుల కొట్టు యజమానురాలు. బీబీ అమరావతి యింట మరో అద్దె వాటాదారు.

చాందిని : ఆమె కుమార్తె

| | | |
|---|---|---|
| లాలా బిహారీ లాలా<br>ఫూల్ చంద్<br>భగవాన్ దేవి<br>మంగత్ రాం<br>రాంకాలి<br>ముకుందుని తల్లి | } | బీబీ అమరావతి యింట యితర వాటా దార్లు |
| ఛౌద్రి బర్కత్ అలి | : | సియల్‌కోటలో స్టోర్స్ (ఆటల) వస్తు సామాగ్రి వర్తకుడు. లాలా కాన్సీరామ్‌కు ఆత్మీయుడు |
| బీగం బర్కత్ అలి | : | అతని భార్య |
| మునీర్ అహ్మద్ | : | వారి కొడుకు |
| నూరల్ నిసార్ | : | వారి కుమార్తె |
| డాక్టర్ చంద్రభాను | : | సియల్‌కోటలో ఒక వైద్యుడు |
| అబ్దుల్ ఘని | : | సియల్‌కోటలో హుక్కా పరికరాలు తయారుచేసే వర్తకుడు |
| ప్రాణనాథ్ ఛద్దా | : | డిప్యూటి కమిషనర్ |
| అస్ఫర్ అహ్మద్ సిద్దికి | : | పోలీసు సూపరెండెంట్ |
| ఇనాయత్ ఉల్లాఖాన్ | : | పోలీసు ఇన్‌స్పెక్టర్ |
| సార్జెంట్ విలియం డేవిడ్‌సన్ | : | బ్రిటిష్ ఆర్మీ అధికారి |
| కెప్టెన్ రహ్మత్ ఉల్లాఖాన్ | : | పాకిస్తానీ ఆర్మీ అధికారి |
| మేజర్ జంగ్ బహదూర్ సింగ్ | : | భారత ఆర్మీ అధికారి. |

# మొదటి అధ్యాయం

1947 సంవత్సరం జూన్ నెల మూడవ తేదీ. ఈ సాయంకాలం వైశ్రాయి గారు ఓ ప్రముఖమైన ప్రకటన చేయవలసి వుంది. ఈ విషయం లాలా కాన్షీరామ్ తన భార్య ప్రభారాణికి చెప్పి వుంచాడు. ఆమెకు విద్యాగంధం అమర్చడం కాన్షీరామ్ చేపట్టిన ప్రత్యేక కార్యం అతడికీ అంతగా చదువురాదు. హైస్కూలు చదువు పూర్తి చేశాడే లేదో అనుమానమే. కాని జీవితానుభవం అతన్ని అనేక చుట్లు తిప్పింది. ఎన్నో దౌర్భాగ్యాలు వచ్చాయి, పోయాయి. వాటివల్ల అతని వివేకం పదునుబారింది. స్థానిక భాష ఉరుదూ అతనికి క్షుణ్ణంగా తెలుసును. బడిలో యిదే 'మొదటి భాష'గా చదవను వ్రాయను నేర్చుకున్నాడు అతని మాతృభాష మటుకు 'హిందీ', అదీ నామ మాత్రంగానే. ఇరవై సంవత్సరాలుగా అతను ఆ జిల్లా ఆర్యసమాజ శాఖతో సభ్యుడుగా సన్నిహిత సంబంధం పెట్టుకున్నాడు. ఆ సమాజం చేసిన అనేక పనుల్లో ఒకటి యేమిటంటే - బీదలకు కడజాతుల వారికి సాంఘిక ప్రతిపత్తిని యివ్వడం. అతడు శ్రీమంత కుటుంబం నుంచి వచ్చాడా లేక గర్భ దరిద్రుడా? అతడికి వారసత్వంగా భూమి పుట్ర, వచ్చినాయా లేదా? - యిటువంటి ప్రశ్నలను ఆర్య సమాజం వేయదు. తలకు తెల్లటి తలపాగ తీరుగా చుట్టుకుని, నైతిక వర్తనంలో తగుమాత్రం పేరుతెచ్చుకున్నవాడు అయివుంటే చాలు ; నాగరికుడుగా చలామణీ అయిపోవచ్చు. సమాజం అతనికి ఒక విషయం ఖచ్చితంగా నేర్పింది. అది యేమిటంటే - భారతీయుల పరంపరాగత జ్ఞానం - వేద సంస్కృతి అనీ , భారతీయుల నిజమైన భాష సంస్కృతం అనీని. సంస్కృతమే వేద భాష. ఇది పురాతనమైన భాష గనుక, దీని ఆధునిక రూపం 'హిందీ' గనుక దీనిని చేర్చుకోగలిగితే చాలు - మరీ అంత వెనకకు వెళ్లలేకపోయినా. ప్రతి పది సంవత్సరాలకు ఒక మారు జనాభా లెక్కలు వ్రాయిస్తారు ప్రభుత్వం వారు. ఆ లెక్కలలో తన మాతృభాష 'హిందీ' అని నమోదు చేయించుకున్నాడు లాలా కాన్షీరామ్. అయితే అతడికి హిందీ చదవడం రాదు, వ్రాయడం అంతకన్నా రాదు. మాట్లాడవలసినప్పుడు అతడి నోటివెంట వచ్చేది - ఆ రాష్ట్రంలో బహుళ

ప్రచారంలో వున్న పుష్టికరమైన భాష 'పంజాబీ' యే వ్రాయవలసి వచ్చినప్పుడు మాత్రం ఉరుదూ వ్రాస్తాడు దుకాణం లెక్కల పుస్తకంలో అయినా, ఎవరికేనా వ్యావహారికమైన జాబు వ్రాయాలన్నా అతడు ఉపయోగించేది ఉరుదూ భాషనే. ఇది ముస్లిముల భాష - అని ఎవరు అన్నారు ? అతడు ఈ భాషను తండ్రి గారి దగ్గర నేర్చుకున్నాడు ; సియాల్ కోటకు కొద్దిమైళ్ల దూరంలో వున్న బడిలో పంతులు గారి దగ్గర నేర్చుకున్నది కూడా ఈ భాషే. వీరిద్దరూ ముస్లిములు కారు గదా! అంతకంటె ముఖ్యమైన సంగతి, ప్రతిరోజూ ఉదయం లఘుభోజనం అయిన తర్వాత ఉర్దూ భాషలో వచ్చే దినపత్రికను ఓ అరగంటసేపు చదువుతాడు. ఈ అరగంట సమయమూ అతి పవిత్రమైనది అన్నట్లుగా యింట్లో ఎవరూ నోరు మెదపగూడదని శాసనం! కుర్రవాడు అరుణ్ యేమాత్రం సవ్వడి చేసినా, తల్లి ప్రభారాణి 'మీ నాన్నగారు పేపరు చదువుకుంటున్నారు, కనిపించటం లేదూ ?' అని మందలిస్తుంది. ఆ మందలింపులో ఎంతో స్వాతిశయం, దర్జా ఉట్టి పడతాయి. ఈ ఇరుగుపొరుగు అంతటా కాస్తో కూస్తో చదువుకున్నవాడు లాలాజీ ఒక్కడే కదా మరి ! ఆమెకు సంబంధించినంత వరకు, లాలాజీ విష్ణువు యొక్క అవతారం తప్ప మరేమీ కాదు!

ఆ క్షణాలలో లాలా కాన్షీరామ్ తన పరుపుల మంచం మీద తీరుగా కూర్చుని వుంటాడు. స్నానం అయిపోతుంది ; ఉదయపు ప్రార్థనలు చేయడం కూడా ముగుస్తుంది ; యిక 'నాస్తా' అనే ఉరుదూ మాట కాన్షీరామ్‌కు చాలా యిష్టమైనది ; దీనికో ప్రతిపత్తి కూడా ఉన్నది. ఇంతకూ ఉదయం పూట తీసుకునేది ఓ గ్లాసెడు పాలు మాత్రమే. ఎక్కువగా తినడం - ఆ సమయంలో - అతని ఆరోగ్యానికి నప్పదు. ప్రభారాణి ఆవుపాలు కాస్తుంది, తగినంతగా చల్లారుస్తుంది; ఓ పెద్ద ఇత్తడి గ్లాసులో అతనికి నివేదన చేసుకుంటుంది. అతడి ఆరోగ్యం, దేహ సౌకర్యం తనకు, కుటుంబానికీ గూడా ఎంత ముఖ్యమో ఆమెకు నిస్సందేహంగా తెలుసును. ఆయన లేకుండాపోతే తనకు యింకెవరు దిక్కు ? ఈ విశాల ప్రపంచంలో యింక తనను గమనించే వాళ్లు, పట్టించుకునే వాళ్లూ ఎవరు వుంటారు? ఇలాంటి ఆలోచనలతో కళు

చమరుస్తూ వుండగా ఆమె ఆ పాలలో నిన్నటిపాలు కాచినప్పుడు విడిగా శ్రద్ధగా తీసిన మీగడ కూడా భారీగా కలుపుతుంది ఒలిచిన బాదం పలుకులు కూడా కలుపుతుంది ఆ పాలకు , ఓ గుప్పెడు. ఈ బాదం పలుకులు మామూలివి కాదు, క్రితం రాత్రి పడుకునే ముందు నీళ్లలో నానబెట్టినవి. తెల్లవారి ఆ పప్పులను కొద్దిగా నొక్కితే చాలు పై చర్మం వూడిపోయి తెల్లటి పలుకులు సుతారంగా యివతలకు వస్తాయి.

ఈ వేడిపాలు - పైన తేలుతున్న మీగడ, తెల్లటి బాదం పలుకులు - రుచి కోసం కలిపిన నాలుగు చంచాల పంచదార - ఈ సమ్మిశ్రాన్ని ఆమె వినయంగా లాలా కాన్షీరామ్‌కు అందిస్తుంది, అతడు పక్కమీద ఠీవిగా కూర్చుని వుండగా ఈ పక్కే దివాన్ గూడా మధ్యతరగతి యిల్లు. ప్రత్యేకించి గదులంటూ యేమీ లేవు. బల్లలు కుర్చీలు వున్నాయి గాని వాటిని ఎప్పుడేనా అతిథులు వచ్చినప్పుడు మటుకే వాడుతారు. కుటుంబ సభ్యులంతా పక్కల మీద పరుపుల మీదనే కూర్చుంటారు లాలా కాన్షీరామ్ మటుకు పాతకాలపు 'ఈజీఛైర్'లో కూచుంటాడు సాయంకాలాలు ఆయన పడకగది చతురస్రాకారంలో వుంటుంది. ఆ తరువాతి గది ప్రభారాణిది. దాని అవతల వున్నది అరుణ్ వాడుకుంటాడు. అయితే రాత్రిపూట ఈ యేర్పాటంతా మారిపోతుంది. ఆ రాత్రికి యిక్కడ ఎంతమంది అతిథులు వున్నారనే విషయం మీద ఆధారపడివుంటుంది ఆ యేర్పాటు ఏమయినా ఆ చతురస్రపు గదిని మటుకు ఎవరూ ఆక్రమించరు. కుటుంబ యజమాని మాత్రమే ఉపయోగించుకునే ప్రత్యేక స్థలం అది. ప్రభుత్వ లెక్కల ప్రకారం ఆయనే కుటుంబ యజమాని. ఆ గదిలో ఒక్కడే హాయిగా కూర్చుని యేమాత్రం యితరుల జోక్యం లేకుండా గడిపివేస్తాడు.

లాలా కాన్షీరామ్ భార్య చేతుల్లోంచి పొడగాటి యిత్తడి గ్లాసు - పాలు మిశ్రమంతో నిండినది - అందుకుంటాడు. ఆయన శాలువ కప్పుకుని వుంటాడు వెనకాల ఆనుకుందుకు గుండ్రటి దిండ్లు వున్నాయి. అప్పుడు ఉదయపు వార్త పత్రిక పుటలు తెరచి చదవనారంభిస్తాడు కళ్లద్దాలు సరిచేసుకుని భార్యకు చదువునేర్పడం ప్రారంభిస్తాడు. నోటిలో పాలునిండి

పొర్లుతూ వుంటాయి. బాదం పలుకులు సుతిమెత్తగా కొరుకుతూ వుంటాడు. పాలు తాగడాన్ని ఆహ్లాదంగా ఆనందంగా కొనసాగిస్తూ కళ్లు మాత్రం పేపరు వార్తలవయిపు ఆత్రంగా చూస్తూవుంటాయి. అప్పుడప్పుడు పైకి మాట్లాడుతూ వుంటాడు

'అరుణ్ తల్లీ ! నీకీ సంగతి తెలిసిందా ? జర్మనీ ఎదురు తిరిగి రూస్ మీద దాడిచేస్తోంది' నోటినిండా పాలు ఆప్యాయంగా రుచిగా కదులుతూ వుండడం వల్ల 'రస్యా' అనే మాట రూస్‌గా మాత్రమే రూపాంతరం చెందింది

'వాళ్లు జపానే మీద ఆటంబాంబు వేసేశారు '

'ఈ రోజు గాంధీగారు నిరాహారదీక్ష ఆరంభిస్తారు '

'మనకిప్పుడో కొత్త వైశ్రాయి గారువచ్చారు. ఆయన పేరు లార్డ్‌మౌంట్ బేటన్. ఆయన సాక్షాత్తు సార్వభౌముల వారికి బంధువు కూడాను!'

అతి తరచుగా ఆయన పేపరు చదవడం ఆపి, కళ్లద్దాల ఫ్రేము మీద నుంచి నిదానంగా భార్యవైపు చూస్తాడు, సాలోచనగా. అతి నిదానంగా అడుగుతాడు. 'ఆమరణ నిరాహారదీక్ష అంటే యేమిటో నీకు తెలుసునా ?' ఆమె తెలుసునన్నట్లుగా నింపాదిగా తల ఆడిస్తుంది. అయినా కాన్షీరామ్ చెప్పుకుపోతూనే వుంటాడు. 'అంటే ... మనిషి చచ్చిపోయేంత వరకు యేమీ తినకుండా వుండడం !' ఆయన గొంతు మారిపోతుంది. 'ఈమారు గాంధీగారు చనిపోవచ్చును.... అంతే.... అంతా అయిపోతుంది !' ప్రభారాణి నిస్పృహగా నిట్టూర్చి 'హాయ్ రామ్ !' అంటుంది. తగినట్లుగా వాతావరణ కల్పన చేయగలిగానని ఆయనకు ధైర్యం యేర్పడుతుంది. అప్పుడు తరువాతి వార్తయేమిటో పరిశీలిస్తాడు. లేదా మరో ప్రశ్న వేస్తాడు : 'ఆటంబాంబు అంటే ఏమిటో నీకు తెలుసునా ?' ఆమె అనుమానంగా తల ఊపుతుంది. తనకు తెలియదని చెబుతుంది. లాలా కాన్షీరామ్‌కు గొప్ప అవకాశం సంప్రాప్త మయినట్లు సంతోషం కలుగుతుంది. ఇటువంటి సందర్భాలలో తనను తాను సంబాళించుకుని సృష్టిలోను విశాల విశ్వంలోను ఉన్న రహస్యాలు విప్పి చెప్పటానికి ప్రయత్నిస్తాడు. పాపం, యీ పేదరాలుకు యేం తెలుసును

గనుక ! పదమూడవ యేట తనను పెళ్లిచేసుకుంది 'అ' అంటే 'క్ష' రాదు. అర్థాలు అసలే తెలియవు. భూమి గుండ్రగా వుంటుందన్న పంగతి కూడా తెలియదు, పాపం. ఇంకా చట్టచదరంగానే వున్నదని అనుకుంటూ వుంటుంది. ఈ అమాయకురాలికి ఆయన అనేక కొత్త కొత్త సంగతులు చెప్పాడు. సంతకం చేయడం ఎలాగో తెలియచెప్పాడు. అయితే ఆమెకు యింకా చదవను వ్రాయను మాత్రం రాదు. ఆమెకు నేర్పవలసినవి యింకా ఎన్నో వున్నాయి - అని ఆయన ఎరుగును.

'అయితే నీకు ఆటంబాంబు అంటే యేమిటో తెలియదన్నమాట !' అంటాడు ఆయన అతి గంభీరంగా. ప్రభారాణి నేలచూపులు చూస్తూ యేదో తప్పుచేసిన దానిలాగ కూర్చుని వుండిపోతుంది.

'ఆటంబాంబు అంటే యేమనుకుంటున్నావు ? నిప్పుల వర్షం కురిపించటానికి వీలుగా బాంబు నిండా అగ్ని కరిగించి పోస్తారు' అంటాడు నిదానంగా. ఇంకా ఆయన నోట్లో పాలు పరుగులు తీస్తూనే వుంటాయి. అయినా ఆయనకు అనుమానమే - తాను సరిగా వ్యాఖ్యానం చేయగలుగుతున్నానా లేదా అని ! ధైర్యం కూడగట్టుకుని సాగిస్తాడు. 'ఆ బాంబు పేలిస్తే లక్షలాది జనం చనిపోతారు'. ఇంత వరకు నిజమే.... ఈ విషయం వార్తాపత్రికలలో స్పష్టంగా రాసివుంటుంది. అయినా నిజంగా 'బాంబు' అంటే యేమిటి ? దాని వెనక - అంతర్గతంగా - వున్న తత్త్వం యేమిటి ?

'నీకు మహాభారత కథ గుర్తువున్నది గదూ ! అంటూ భార్యవంక చూస్తాడు ఆమెకు అవగాహన శక్తి అంత చురుకుగా లేకపోడం చికాకు అనిపిస్తుంది ఆయనకు. 'కురుక్షేత్ర యుద్ధం చివరి రోజుల కథ గుర్తువున్నది కదూ !' ఇప్పుడు ఆమె 'అవును - అవును' అన్నట్లుగా బాహాటంగా తల ఊపుతోంది. 'వాళ్లు ఒక్కొక్కళ్ల మీద యిలాంటి బాంబులే విసిరేసుకున్నారు. కౌరవులు - పాండవులు ఉపయోగించారు ఇలాంటివి' అని కాస్సేపు ఆగి 'ఆటంబాంబు అంటే అలా వుంటుంది. అంతే ! నీ శత్రువుల మీదికి దాన్ని విసిరేస్తావు, ప్రయోగిస్తావు. .. వాళ్లంతా తగలబడి నాశనం అయిపోతారు.'

'అయితే ఈ ఇంగ్లీషు వాళ్లు కొత్తగా కనిపెట్టింది యేమీలేదన్నమాట.'

ఈ రకమైన ఆలోచనా ధోరణి లాలా కాన్షీరామ్‌కు బాగా యిష్టం. ఎక్కువ లోతుకు వెళ్లవలసిన అవసరం వుండదు. అదీగాక ఆయనలో సుప్తంగా వున్న జాతీయతా అభిమాన దాహానికి సంతృప్తి కలిగిస్తుంది

'కొత్తదా ? ఏమిటి నీవు మాట్లాడుతున్నది ! ఒక్క విషయం బాగా గుర్తు వుంచుకో. ప్రపంచంలో యే యితర దేశం గూడా మన వేద సంస్కృతిని నాగరికతను మించి మరేమీ కనుక్కోలేదు. మనం కనిపెట్టి అవతల పడవేసిన వాటినే వాళ్లు తమ అదృష్టం వల్ల కనుక్కోగలుగుతారు అందులోనూ ముఖ్యంగా ఈ ఇంగ్లీషు వాళ్లు నిన్న మొన్నటి దాకా కోతిజాతికి చెందిన వాళ్ళు. ఆ కోతులు కొన్ని వందల సంవత్సరాల క్రితం వరకు అరణ్యంలోనే వుండేవి. నీవు "సత్యార్థ ప్రకాశిక" చదవడం అవసరం. యూరపు ఖండం అంతా ఓ మురికి గుంట. భరత వర్షంలో గొప్ప గొప్ప నాగరిక రాజ్యాలు విస్తరిల్లాయి '

ప్రభారాణి అత్యంత ఆసక్తిగా 'జపానులో చాలా మంది చనిపోయారా?' అనడిగింది. భర్త చెబుతున్న విషయాలన్నీ తనకు యెంతో అభురుచిదాయకంగా వున్నాయని ఆయన్ను నమ్మించాలని ఆమె ఆసక్తి. మనసులోమాత్రం వంటగదిలో యే పదార్థాలు మాడిపోతాయోనని-భయం.

'లక్షలాది -' అన్నాడు దుఃఖంగా లాలా కాన్షీరామ్. కష్టంలో వున్న మనుషులు యెక్కడున్నా సానుభూతి చూపవలసిందే.

బ్రిటిష్ రాచకుటుంబం గురించి వర్తమానం వచ్చినందుకు ఆయనకు ఆనందంగా వుంది. అందరు భారతీయులమాదిరిగానే అతనికీ బ్రిటిష్ వారంటే కొంత అయిష్టత, అసహ్యాము ఉన్న మాట నిజమే. (అంగ్రేజీలు.... అనే మాట వాడతాడు) ఈ దేశానికి వాళ్లు చేసిన అపకారం తలుచుకుని ద్వేషపడతాడు. రెండవ ప్రపంచ యుద్ధం జరుగుతున్నన్నాళ్లు వాళ్లు జర్మనీ చేతుల్లో వోడిపోతే బాగుండునని ప్రార్థించాడు. ఒక్కో రంగంలో జర్మనీ గెలుస్తూ వస్తుంటే అతని ఆనందానికి మేరలేదు. కాని చివరకు బ్రిటిష్ వాళ్లు ఎదురుదెబ్బ కొట్టి వాళ్లను అదుపు చేయగలిగినప్పుడు అతడిని నిరాశే

ఆవరించింది. అయినా పూర్తిగా సమాధానపడలేదు. ఎప్పటికయినా జర్మనీ వాళ్లు తుది విజయం సంపాదించి ఈ 'కోతి మూక'ను - ఇంగ్లీషు జాతిని అదుపులోనికి తీసుకుని తీరుతారని ఆశిస్తూ వచ్చాడు 1944 ఫ్లయింగ్ బాంబులు వచ్చాయి. ప్రతి రోజూ లండన్ నగరం మీద వందలాది వి - రెండు బాంబులు వర్షిస్తూనే వున్నాయి.

కాని అంతరాంతరాలలో అతడికి బ్రిటిష్ వారంటే కొంత అప్యాయత, గౌరవం వున్నాయి. ఈ రాజరికం అందించే 'రక్షణ' తాను అనుభవిస్తున్నాడు. రక్షణలో వీళ్లను మించిన వాళ్లు లేరు. ఏదియేమయినా యెవరు యేం అనుకున్నా, కక్షలు ద్వేషాలతో కొట్టుకుపోతున్న ఈ దేశానికి బ్రిటిష్ వారు ఓ రకమైన శాంతి, సమాధానం తీసుకువచ్చారు. మహారాజు రంజిత్ సింగ్ తరువాత సిక్కుల విషయం యేమయిందో చూడండి. అలాగే మరాఠీల తరువాతనూ ! ఢిల్లీ పరిసరాలలో, దక్కను పీఠభూమి మీద ముస్లిముల పరిస్థితి ఎలా వుందో గమనించండి. ఈ దేశం ఎప్పుడు ఒకటిగా యేకతాటి మీద వుండింది గనుక ? పురుషోత్తముడిని, పృధ్వీరాజును త్రోసి రాజు అన్నది ఎవరు ? బ్రిటిష్ వాళ్లతో పోట్లాడుతున్న మొగలాయి రాజులను భంగపుచ్చి దేశ విచ్ఛిత్తికి కారణం అయింది ఎవరు ? వీళ్లందరూ స్వదేశీయులే కాదూ ? మన వాళ్లే, మన బంధువర్గమే !

బ్రిటిష్ వాళ్లు ఎలాగయితేనేమి, మన నందరినీ కలిసికట్టి ఒక 'జాతీయదేశం'గా తయారు చేశారు. ఆ పనిచేసింది గాంధీగారా యేమిటి ? - ఈ విషయం మీద లాలా కాన్షీరామ్‌కు సందేహం వుండనే వున్నది - అది ఎప్పటికీ తీరేది కాదు. అయితే ఈ సందేహంతో తన వాదనాబలాన్ని తక్కువ చేసుకోకుండా ముందుకు వెళ్లిపోతూ వుంటాడు అతను. గతంలో కంటె, గడిచిన రెండు వందల సంవత్సరాలలో బ్రిటిష్ రాజ్యం అయిన ఈ దేశంలో రక్తపాతం, రక్తప్రవాహం తక్కువే ఆమాట ఎవరూ కాదనలేరు. గాంధీగారయినా నెహ్రూ అయినా దీనితో అంగీకరించ వలసిందే. న్యాయం తీసుకువచ్చారు. వాళ్లు మతపరంగా మ్లేచ్ఛులు కావచ్చును. చెప్పుకోదగ్గ మతం వాళ్లకేమీ

పుండకపోవచ్చును 'ఆత్మ' విషయం వాళ్లకు అవగింజ అంత అయినా తెలియకపోవచ్చును వాళ్లచర్చి సర్వీస్‌లన్నీ బూటకమేనని అతనికి తెలుసు వాళ్ల మత గురువులు తెచ్చుకోలు మందహాసం ముఖాలకు పులుముకుని ఈ దేశస్థులందరినీ మతాంతీకరణం చేయటానికి ఉత్సాహంగా తిరుగుతూ వుంటారు దయానంద సరస్వతిగారి ధర్మమా అని ఈ విషయాలన్నీ లాలా కాన్షీరామ్‌కు క్షుణ్ణంగా అవగాహన అయినాయి. నిష్పక్షపాతంగా ప్రవర్తించడం- అనే విషయంలోమటుకు వాళ్ళా యే స్వదేశీయునితోను - భారతీయుడితో - పోల్చటానికి కుదరదు. వాళ్ల నిష్పక్షపాత బుద్ధి చాల ఉన్నతమైనది ! భారతీయులను బోల్తా కొట్టించడం తేలిక. నాలుగు రూపాయలు వాడి జేబులో పడవేశావంటే నీవు యేం పనిచేయమంటే అది చేస్తాడు వాడు ! అదే ఇంగ్లీషు వాడిని అలా లంచం యిచ్చి మరిపించగలవా ? ఈ ఆలోచన వచ్చినప్పుడల్లా శరీరమంతా వణికిపోతుంది.

బ్రిటిష్ వాళ్లంటే అతనికి యింత మక్కువ యేర్పడటానికి ఓ చిన్నకారణం వుంది అది అతని చిన్నతనంలో - బడికి వెడుతూ వుండే రోజులలో కళ్లబడిన దృశ్యం. వాళ్ల కవాతులు, బ్యాండ్ మేళాలు, పేరేడ్‌లు... రంగు రంగుల యూనిఫారాలు అతన్ని ఎంతో ఆకర్షించాయి. అతను రోజూ తెప్పించే వార్తాపత్రిక సంపాదకుడు బల్జిత్ రైజాదా మటుకు యింకో రకంగా రాస్తాడు. ఈ పైపై మెరుగులన్నీ చూచి బ్రిటిష్ వాళ్లంటే మక్కువ పెంచుకునే వారంతా అల్పసంతోషులు, అల్పజ్ఞులు అంటాడు అతను. మనం అనుకున్నంత నీతిపరులు, నిజాయితీపరులు కాదు బ్రిటిష్ వారు. విభేదాలలో తమకు ప్రత్యక్షంగా యెలాంటి సంబంధమూ లేనప్పుడు నిష్పక్షపాతంగా నిర్మొగ మాటంగా వుండడం యేమంత కష్టం ? బ్రిటిస్ వాళ్లు ఈ దేశం అంతటికీ యెంత దురన్యాయం చేశారో, యెలా కాల్చుకుతింటున్నారో గమనించు. బ్రిటిష్ వాళ్లకు నెల జీతాలు కాగితం డబ్బుగా కాదు, బంగారు నాణేల రూపంలో యిస్తారు ! ప్రతి సంవత్సరం ఈ బంగారు మూటలు వాళ్ల స్వదేశానికి - కోతుల రాజ్యానికి - పడవలలో తరలి వెడుతాయి. కోతి రాజులు, రాణులు అక్కడ పరిపాలన చేస్తూవుంటారు. ఉరుదూ దినపత్రిక 'ఇన్‌క్విలాబ్'

సంపాదకుడు రైజదా ప్రశ్న వేస్తాడు వాళ్లు కొల్ల గొట్టుకుపోతున్న డబ్బు అంతా ఎక్కడి నుండి వస్తోంది ? ఆయనే సమాధానం చెబుతాడు కూడా 'అది స్వదేశీయుల - భారతీయుల జేబులలోంచి వస్తోంది !'

రైజదా ఈ వాక్యలు అతి తరచుగా వాడుతూ వుంటాడు అతడి సంపాదక వ్యాసాలలో అది చదివిన ప్రతిసారీ కాన్షీరామ్ తన జేబులు తడుముకుంటూ వుంటాడు మొదటిసారయితే, పూర్తిగా భయపడిపోయి, జేబులోని డబ్బు ప్రతిపైస లెక్కబెట్టుకు మరీ చూచుకున్నాడు. ఇప్పుడయితే జేబు బరువు తడిమి చూచుకోవడంతో సరిపెట్టుకుంటున్నాడు కాని, ప్రతిమారు తన జేబులో డబ్బు భద్రంగానే వుంటూంది. రైజదా మాటలలో చెప్పాలంటే బ్రిటిష్ రాజు నిజానికి రాజు కానే కాడు, అతనో 'ఆలీబాబా !' ఇంగ్లండ్ దేశం అంతా దొంగల రాజ్యం, దోపిడీ ముఠా. ప్రపంచంలోని సిరిసంపదలు దోచుకువచ్చి యిక్కడ చేరుస్తున్నారు, అంతే ! ఇలా వ్రాస్తూవుండేవాడు రైజదా ! కాన్షీరామ్‌కు యిదంతా రుచించేది కాదు. అయినా ఆసక్తిగా చదివేవాడు అతని వ్యాసాలన్నీ. రోజులకు తగినట్లుగా నడుచుకోవాలి గద ! అతనికీ విప్లవవాది అనిపించుకోవాలని ఆసక్తి. 'నేనూ జెయిలుకు వెళ్లాను' అంటూంటాడు, తన శ్రోతలతో తరచుగా. ఈ జెయిలు నిజమైనదో ఊహా లోకంలోనిదో తెలియదు. నిజానికి అతను జెయిలులో గడిపింది ఒకే రాత్రి. తతిమ్మా వర్తకులతో కలసి 'సేల్స్‌టాక్స్'కు వ్యతిరేకంగా ఊరేగింపు చేశాడు , హర్తాల్ చేశాడు - వ్యక్తిగతంగా అతనికి అంత యిష్టం లేకపోయినా సంఘంలో సభ్యుడుగా అలా చేయవలసి వచ్చింది అంతే. కొందరు సహవర్తకులతోపాటు అతన్నీ కస్టడీలోనికి తీసుకున్నారు పోలీసులు. నా కుటుంబం యేమయిపోతుంది - అని కళవెళ పడ్డాడు అప్పుడు. జిల్లా జైలులో ఒక రాత్రంతా గడపవలసి వచ్చింది. ఇంతకూ విషయం యేమిటంటే... ఒకరాత్రంతా నాలుగు గోడల మధ్య జైలులో యేకాంతంగా గడిపి, ఆలోచనలు చేసినందు వల్ల - తాను గూడ స్వాతంత్ర్య సమరంలో భాగం వహించినట్లే అనిపించింది. ఇటువంటి జైళ్లలోనే గదూ - గాంధీ నెహ్రూల వంటివారు

మగ్గిపోయి జీవితాలు వృధా చేసుకున్నది ? తన 'స్వానుభవం' ఆసరాగా వాళ్లూ యేమేమి ఆలోచించుకు వుంటారో ఊహించడం సులభం అయింది. కన్నీళ్ల పర్యంతం అయింది ! భగత్ సింగ్ వంటి నాయకులు సాహసోపేతమైన పనులు చేసి జీవితాలను కోల్పోయారు ఆ రాత్రి తాను చేసింది కూడా యిటువంటి పనే కదూ ! లాలా కాన్షీరామ్ అనే ధ్యాన్యపు వర్తకుడు - ఆ వర్తకం చేయడానిక తగిన అనుమతి పత్రం పొందినవాడు సియల్ కోట వ్యాపారస్తుడు.... ఆ రాత్రి ఎంత సాహసోపేతమైన పని చేశాడు ! అయినా, దేశ గౌరవం, ప్రతిష్టలముందు ఒక వ్యక్తిగత జీవితం ఎంత పేలవమయినది !

క్షణికమైన ఉద్రేకాలకు లోనయిపోయి, రైజదా చివరి వ్యాసం చదివి ఎంతో మరిగిపోతూ అరిచాడు. 'ఈ ఇంగ్లీషు వాళ్లు కుటిలురు ! కుక్కలు !' అ రకమైన మానసిక ఉద్రేకం నుంచి బయట పడటానికి చాలా సమయమే పట్టింది. వాళ్ల 'కుక్క స్వభావం' గురించి ఎన్నోమార్లు - తెలియకుండానే పైకి అరవడం జరిగింది. రైజదా వ్రాసిన దానితో పూర్తిగా యేకీభవించడం అసాధ్యమైన విషయం ! వాళ్లు చేసే సైనిక కవాతులు, పేరేడులు సామాన్యజనాన్ని మభ్యపెట్టటానికేననీ, దాని వెనుక యేదో కుట్ర వుంటుందనీ నమ్మటం అసాధ్యం ! తనమటుకు తను - సామాన్య ప్రజతో లెక్కకాదు. కాస్త పై స్థాయికి చెందినివాడే. మరి తాను ఈ కవాతులను ఆకర్షితుడు అయినాడు గదా ! వాటి ప్రదర్శన వల్లనే బ్రటిష్ వారి గౌరవం తన మనసులో అత్యధికం అవుతూ వచ్చింది.

ఇటువంటి స్మృతులు యెన్నో వున్నాయి అతని మనసులో. వాటిన్నిటినీ ఆప్యాయంగా తలుచుకుంటాడు. ఇటీవలి కాలంలో జరిగినది 1945 నాటి విక్టరీ పెరేడ్. బ్రిటిష్ వారు ఎట్టకేలకు గెలిచారు. జర్మనీ ఓడిపోయింది. జపాను వారూ పరాజయం పొందారు. 'హోయ్ ! బహన్‌ఛోత్' అనుకున్నాడు లాలా కాన్షీరామ్, నింపాదిగా - ఈ తిట్టు, శాపం.... ఇంగ్లీషు వారికో, జర్మనీ వారికో సందిగ్ధంగానే వుంచుతూ. ఇలాంటి సందిగ్ధతలు పంజాబీ భాషలో పెక్కువున్నాయి. అవంటే అతనికి యిష్టం. చెప్పేపద్ధతిని బట్టి, ఉద్ఛారణ

ధోరణిని అనుసరించి, ఒక తిట్టు ఎన్నో అర్థాలను సమకూర్చుగలదు 'బహన్‌ఛోత్', 'మదర్ ఛోత్' అనేవి సామాన్యంగా వాడే బూతుపదాలు. భాషలో వున్న లాలిత్యం యేమిటంటే... యివి పూర్తిగా బూతు మాటలు కావు. శ్లీలానికి, అశ్లీలానికి అంచులో వుంటాయి. కులీనులయిన పంజాబీలు యింకా కొన్ని క్లిష్టపదాలు కనిపెట్టారు అవి ఎంత లోతయిన తిట్టు పదాలో తెలుసుకోవాలంటే కొంత గణిత శాస్త్ర ప్రజ్ఞ అవసరం అవుతుంది. లాలా కాన్షీరాం యీ విషయం తెలుసు ! అయితే సభ్యుడైన ఆర్యసమాజికుడుగా అటువంటి తిట్టు పదాలనుంచి బహుదూరంగా వుంటూ వుంటాడు. బహన్ ఛోత్, మదర్ ఛోత్ అనేవి అక్కను, అమ్మను ఉద్దేశించి అశ్లీలాన్ని ప్రేరేపింటే మాటలు ! తేలికగానే అర్థం అవుతాయి క్లిష్టమైన పదం యేదంటే - తల్లిగారి తండ్రిగారి కూతురుపరంగా ఉపయోగించేది ; లేదా తండ్రి తల్లిగారిని గురించినది! ఈ రెండోది తేలికగానే స్ఫురిస్తుంది కాని మొదటిది డొంకతిరుగుడు. నీ తల్లిగారి తండ్రిగారి కుమార్తె నీ తల్లే కానక్కరలేదు. ఏ పిన్నిగారో పెద్దమ్మగారో కావచ్చును ! ఈసంబంధం కూడా మీ తల్లిగారికి ప్రత్యక్షంగా సంబంధించింది కావచ్చు. లేదా సవతి సంబంధం కావచ్చు అందుచేత 'బహన్‌ఛోత్' అనే మాట వాడుతున్నప్పుడు అతను చాల మర్యాదగానే వ్యవహరిస్తున్నాడన్న మాట !

అదే తిట్టుపదాన్ని స్తుతివాక్యంగా కూడా ఉపయోగించవచ్చు. 'ఈ గంగాజలం, బహన్‌ఛోత్, చల్లగా వుంది', అన్నప్పుడు గంగాజలాన్ని ప్రస్తుతిస్తున్నాడన్న మాట, ఆ మనిషి ! గంగా మాతను తక్కువ చేసి మాట్లాడే ధైర్యం ఎవరికి వుంటుంది ? ఇదో కొత్త రకం గదూ ! ఈరకమైన కవితా ప్రయోగం సాధ్యమైన భాష ప్రపంచంలో మరెక్కడయినా వుందా ? సరే.... సరే.... హిందీ నా స్వంత భాష అని మీరు అనవచ్చు. కాని పంజాబ్ భాషతో పోల్చిచూస్తే అది గణనకు నిలవదు అంతెందుకు, ఉరుదూ భాషకూడా పంజాబీ అంత సుందరంగా హుందాగా వుండదు. దీన్ని ఎటువయిపయినా సాగతీయ వచ్చు. ఉదారతకు భంగం కనిపించకుండా గొప్ప ప్రభావం చూపించగల మాటలను పట్టుకోవడం కష్టం. ఓ భగవాన్ ! హిందీ మరీ తమాషా అయిన భాష ! దానిలో ఎలాంటి తిట్టుపదాలు వున్నాయో చూడండి.

దుష్టుడా ! మూర్ఖుడా ! పాపీ ! అత్యాచారీ ! . యిలాంటివి. ఈ మాటలను నిజానికి తిట్టు పదాలు అనడానికి వీలు వుందా ? ఎంతో సుతిమెత్తగా, బలహీనంగా, నిర్వీర్యంగా వుంటాయి హాయిగా మనసుకు తృప్తి యిచ్చేబలమైన పౌరుషవంతమయిన మాటలు లేకపోతే, యింక అదేం భాష !

ఇదీ లాలా కాన్షీరామ్ ఆలోచన ధోరణి ! హిందీ తనమాతృభాష అని చెప్పుకోవలసినప్పుడల్లా అతనికి యిదే ఆలోచన మనసుకు వస్తుంది 'మాదర్ ఛోత్' అనుకుంటాడు నింపాదిగా. విక్టరీ పెరేడ్‌లో అతని పక్కన వున్నవాళ్లు అతను ఈ మాటను జర్మనీలను ఉద్దేశించి కాకుండా ఇంగ్లీషు వాళ్ల పరంగానే ఉపయోగించాడనుకున్నారు. అంతే కాదు, దీనిని స్తుతివాక్యంగా ప్రయోగించాడని కూడా భావించారు. పెరేడ్‌లో తమ ఎదురుగా బ్రిటిష్ సూపర్ ఇంటెండెంట్ ఆఫ్ పోలీస్ హుందాగా వెడుతున్నప్పుడు ఆనందంగా కళ్లుఎత్తి తేరపార చూస్తూ, మొదటిమాటను కాస్త ఒత్తి పలుకుతూ అన్నాడు.

ఇదంతా అర్థస్వగతంగా చెప్పుకున్నమాట ! సైనిక కవాతు రోడ్డుమీదుగా నడుస్తోంది. టాంకులు, యుద్ధ పరికరాలు ప్రదర్శన యోగ్యంగా నడుస్తున్నాయి. ఇదంతా చూచి ఇంగ్లీషు వాళ్లు అంత తేలికగా తీసిపారవేయవలసిన మనుషులు కాదు - అనుకున్నాడు అతను చేతివేళ్లమీద లెక్కబెట్టగలిగినంత తక్కువ మంది. మనను రెండు వందల సంవత్సరాలపాటు - తను బూటుకాళ్ల కింద అణచి వుంచారు ఇప్పుడు వాళ్లచేతులలో ఆ హిట్లర్ కూడా యిటువంటి దుర్గతేపొందాడు. అందుచేత . ఈ ఇంగ్లీషు వాళ్లది యే మాత్రమూ లొంగదీయటానికి వీలుగాని అజేయమైన జాతి ! ఆహా ! బహన్ ఛోత్ !!

కింగ్ ఎడ్వర్డ్ - ఎనిమిది సింహాసనా రూఢుడయినప్పుడు జరిగిన సైనిక కవాతు గూడా అతని స్మృతి పథంలో చెక్కుచెదరకుండా వుంది ! ఎంత వైభవం ఆ రాజుది! అందునా మన నెహ్రూకు స్నేహితుడు. అతని పాలనలో భారతదేశానికి తప్పకుండా ఉపకారం జరుగుతుంది అయితే నేం, పాపం, ఆ రాజు అతి కొద్దికాలంలోనే రాజ్యభ్రష్టుడు కావలసి వచ్చింది, అయినా ఆ రోజు పెరేడ్ ఎంత వైభవోపేతంగా వున్నది ! నగరానికి ఆవల కంటోన్‌మెంట్ గ్రౌండ్స్

నుంచి ప్రారంభమైన అశ్విక దళం, పదాతి దళం... నగరమంతా తిరిగారు. మార్చ్‌చేస్తూ ఒక దళం సరీగా లాలా కాన్షీరామ్ దుకాణం ముందు కొంతసేపు నిలిచిపోయింది. పదిహేను నిమిషాల సేపు డ్రమ్ములు, బాకాలు, బూరలు ఉపయోగించారు. లాలా కాన్షీరామ్ తన దుకాణం అరుగుల మీద ఠీవిగా నిలుచుని చూచాడు నాలుగు రోడ్లకూడలిలో జనం కిక్కిరిసిపోగయ్యారు ఆడవాళ్లు, పిల్లలు బాల్కనీలలో నిలబడి ఉత్సాహంగా చూస్తున్నారు. ఈ కూడలిలో వున్నది ప్రధానంగా అతని దుకాణమే రీవిగా ముందు వరండాలో నిలుచుని చూస్తువున్నప్పుడు అతనికి అనిపించింది. . బ్రిటిష్ కవాతు అంతా, యింత దివ్యంగా మనోహరంగా .. కేవలం తన గౌరవం కోసం ప్రీతికోసం మటుకే జరుగుతూ వున్నదని ! కనీసం అతని ఊహ అది.

ప్రతి సంవత్సరము తప్పని సరిగా జరిగే 'నూతన సంవత్సర పెరేడ్' ఎప్పుడూ చూడకుండా వుండేవాడు కాదు లాలా కాన్షీరామ్. జనవరి మొదటితేదీని అది జరుగుతుంది. జనం దాన్ని 'హుర్రే పెరేడ్' అని హుషారుగా పిలుస్తూ వ్యవహరిస్తారు. నగరానికి అయిదుమైళ్ల దూరంలో ఉదయం సరీగ్గా ఎనిమిది గంటలకు... బహిరంగ ప్రదేశంలో జరుగుతుంది. లాలా కాన్షీరామ్ ఎప్పుడూ సరైన టైముకు అక్కడకు చేరుకునేవాడు. అరుణ్ ఆరేళ్ల కుర్రవాడు అయినప్పటి నుండి వాడిని కూడా తనతోపాటు తీసుకువెళ్లడం అలవాటు చేశాడు. కుర్రవాడు కూడా చిన్నతనం నుండే బ్రిటిష్ వాళ్ల వైభవం వైదగ్ధ్యం చూచి ఆనందించాలా వద్దా ? జమ్ము పైన కొండలమీద సూర్యుడు హుందాగా ఉదయిస్తూ వుంటాడు. పెరేడ్‌లోని నల్లదొరలు, పోలీసులు 'ఎటెన్షన్' అని గట్టిగా అంటూండేవాళ్లు. 'రైట్....' 'క్విక్ మార్చ్, ..'' యిలాంటి మాటలు అతి తరచుగా వినవచ్చేవి. ఎక్కడో అయిదువేల మైళ్ల దూరంలో వున్న హిజ్‌మెజస్టీ సార్వభౌముడు..... నెమలి సింహాసనం మీద కూర్చుని కోహినూర్ వజ్రకిరీటం ధరించినవాడు.... ఇక్కడి కవాతులో ప్రతిమాటను ఆమోదిస్తూ తల ఊపుతూ వుంటాడని కుర్రవాడు అరుణ్‌కు అర్థం అయ్యేట్లుగా చెబుతూ వుంటాడు లాలా కాన్షీరామ్.

సియాల్‌కాట్ నగరంలో హోల్‌సేల్ ధాన్యపు వర్తకుడు అతను. ఇంగ్లీషు దొర సూపర్నెంట్ ఆఫ్ పోలీస్ అతని దగ్గర ఒక కొనుగోలుదారు. లాలాకాన్షీరామ్ ప్రతి దీపావళికి, దసరాకు ఆ దొరకు బహుమతులు పంపటానికి ప్రయత్నించేవాడు. బుట్టల నిండా పళ్లు - స్కాచ్ విస్కీ సీసాలు ! ఆర్య సమాజ సభ్యుడుగా అతడు మధ్యపానీయాలకు వ్యతిరేకి. అయినా కానుకలు అయిష్టంగానే పంపేవాడు అయితే అతను పంపిస్తూ వుండే కానుకలు ముస్లిం సిటీ ఇన్‌స్పెక్టర్‌ను దాటి పైకిపోయేవి కాదు. ఆ ఇన్‌స్పెక్టరే వాటిని అందుకుని, మెచ్చుకుని, పైకి పంపిస్తానని చెబుతూ వుండేవాడు. నిజానికి తానే 'స్వాహా' చేసేవాడు ! ఒక రోజు సూపర్నెంట్ ఆఫ్ పోలీస్ గారే స్వయంగా తన దుకాణానికి విచ్చేశారు. బహు మంచి రకం గోధుమలు కావాలని. లాలా కాన్షీరామ్‌కు విద్యుద్ఘాతం ఎదురైనట్లు అయింది. అతడు మంచి రకం గోధుమలు యివ్వడమే కాకుండా దానికి తగి ధర 'బిల్' చేయటానికి సంశయించాడు. దొరగారు 'కాదు, చేయవలసిందే' అన్నప్పుడు వినయంగా చేతలు జోడించి, 'అయ్యా ! నేను బీదవర్తకుడిని. తమ పేరు మిదగానే ఈ వ్యాపారం చేస్తున్నాను' అని చెప్పాడు తప్ప బిల్లు మాత్రం చేయలేదు. పోలీసు దొరగానే తను ఉచితం అనుకున్న డబ్బును దుకాణం కౌంటర్ దగ్గర వదిలి వెళ్లవలసి వచ్చింది. దొరగారిని అనవరతము అంటిపట్టుకు వుండే ముస్లిం ఇన్‌స్పెక్టర్ సందు దొరకగానే దొరగారు వదిలిన డబ్బును తన జేబులో చేర్చుకున్నాడు. లాలాకాన్షీరామ్‌కు మటుకు యీ లంచం డబ్బు దొరగారు తీసుకున్నారా, ముస్లిం ఇన్‌స్పెక్టర్‌కు దొరికిందా అనేది అంశం కానే కాదు. చిన్నదొరగారికి సంతృప్తి అయినందుకు అతను సంతోషించాడు.

ఈ సంఘటన వల్ల లాలా కాన్షీరామ్‌కు పోలీసు ఉన్నతాధికారి సూపరింటెండెంట్‌తో పరిచయం యేర్పడింది. బహిరంగ సమావేశాలలో అతని ఉనికిని గుర్తించకుండా వుండడం పోలీసు అధికారికి అసాధ్యం అయిపోయింది. ఆయన హుందాగా లాఠీ తిప్పుతూ మీసం మెలివేసుకుంటూ తిరుగుతూ జన సందోహాన్ని దూరం నుంచి చూస్తూ వున్నప్పుడు మధ్యలో ఒక మనిషి తనకు నమస్కారం చేయటానికి ప్రయత్నిస్తూ కనిపించేవాడు.

యదాలాపంగా అటువైపు తలతిప్పినప్పుడు కూడా కాన్షీరామ్ 'ప్రణామం' చేయాలని చేసే ప్రయత్నం కళ్లపడుతూ వచ్చింది. ఈ దృశ్యం చూడడం నుంచి తప్పించుకుందామని ఆయన ప్రయత్నం చేశాడు గాని - ప్రతి సమావేశంలోనూ తలపాగా దట్టించి హాజరవుతున్న కాన్షీరామ్ దర్శనం మటుకు తప్పటం లేదు. చిట్ట చివరకు పోలీసు సూపరింటెండెంట్ లొంగిపోక తప్పలేదు. ఇప్పుడు లాలా కాన్షీరామ్ కనిపించినప్పుడల్లా అటువైపు వెళ్లి, ఆ మనిషి దాదాపు సాష్టాంగ దండ ప్రణామం చేసేంత వరకు ఆగి, తర్వాత ఒకటి రెండు కుశల ప్రశ్నల వంటివి వేసి మరీ వెనక్కు వచ్చేవాడు.

హుర్రే పెరేడ్లో డ్రమ్ములు వరుసగా 'మార్చ్' చేస్తాయి. డ్రమ్ములు వాయిస్తున్న లావాటి మనుషులు ముక్కుకు సూటిగా చూచుకుంటూ ముందుకు వెళ్లిపోతారు లాలా కాన్షీరామ్, కుర్రవాడు అరుణ్‌తో 'చూడు, వాళ్లంతా ఎలా దర్జాగా నడుస్తున్నారో !' అనేవాడు. అరుణ్ నిద్రమత్తులో వుండి జోగుతూ సరీగ్గా గమనించి చూచేవాడు కాడు. లాలా అతన్ని కుదిపి మెలుకువ వచ్చేట్లు చేస్తూ 'నీవు శ్రద్ధగా చూడకపోతే చెంపపగిలేట్లు కొడతాను సుమా ! నీకు ఈ దృశ్యాలు చూడగలడం ఎంత అదృష్టమో తెలిసిరావడం లేదు. దేశంలోని పల్లె ప్రాంతాల పిల్లలకు ఈ మహద్భాగ్యం అలవడుతుందా ? వాళ్లకు తెల్లముఖం కనిపించడమే కష్టాతికష్టం.... అరుణ్, నాయనా.... నీవు చాల అదృష్టవంతుడివి రా, నా తండ్రీ, నిన్ను నగరంలో పెంచాను. నీకు ఒనగూడుస్తున్న అవకాశాలను చక్కగా వినియోగించుకోరా, నా తండ్రీ...' అనేవాడు. కుర్రవాడి తల యింకా నిద్రలో కిందికి జోగుతూ వుండేది. లాలా చేత్తో అతన్ని అదిలిస్తూ వుండేవాడు. 'చెప్పేది వినరా ! వెధవాయి ! ఆ తెల్లదొరల వంక చూడు...'

హుర్రే పెరేడ్‌లో సైనికులతో పాటు కవాతు చేయవలసిన అవసరం పోలీసు సుపరింటెండెంట్‌కు లేదు. సీనియర్ ఆఫీసర్ అవడం వల్ల ఆయనకు యేం చేయాలనుకుంటే అదే చేయగల స్వాతంత్ర్యం వుంది. కవాతు దళాలు 'మార్చ్' చేసుకుంటూ పోతూవుండగా... ఒక కేంద్రస్థానంలో వున్న 'యూనియన్

జాక్ దగ్గర అటుయిటు పచార్లు చేస్తూవుండేవాడు. లాలా కాన్షీరామ్‌ను చూచినప్పుడు, లేక కాన్షీరామ్ తనను గమనించాడు అని తెలిసినప్పుడు, అతనికి దగ్గరగా వెళ్ళి 'లాలాజీ, కులాసాగా వున్నారా ?' అని ప్రశ్నించేవాడు.

లాలా కాన్షీరామ్‌కు ఆ సమావేశంలో వున్న వాళ్లందరు ఈ ప్రశ్నవింటే ఎంత బాగుండును - అనిపించేది. తనమటుకు తాను - బాగానే వున్నాడు. ఇంతకన్నా కావలసింది యేముంది ? మరేం లోపం లేదు. ఆరోగ్యంగా వుండడమే కాదు, నిన్న రాత్రే ప్రభారాణితో సరాగాలు కూడా సక్రమంగానే జరిగినాయి. ముఖం అంతా పెదవులు విస్తరించేట్లు చేసి అందరికీ వినిపించాలనే ఆదుర్దాతో సూపర్నెంట్‌కు జవాబు చెప్పేవాడు గట్టిగా అరుస్తూ ...

'బాగానే వున్నాను, సర్ చాల బాగా వున్నాను...' సూపర్నెంట్ ముందుకు వెళ్లిపోయేవాడే గాని, లాలా యింతలో అరుణ్‌ను ఆయన వైపు నెట్టేవాడు.

అంత యిష్టంలేకపోయినా 'మీ అబ్బాయా ?' అని అడిగేవాడు ఆయన.

'కాదండీ... కాదు... వీడు మీ కొడుకే!' అనేవాడు లాలా కాన్షీరామ్ ఎంతో వినయంగా, తన్మయత్వంలో ఒళ్లూపై తెలియకుండాపోతూ.

సూపర్‌యింటెండెంట్‌కు పంజాబీ మర్యాదలు, సంప్రదాయాలు తెలుసు. అందుచేత తనకు కొత్తగా ఆపాదితం అయిన 'పితృత్వం' ఆయన్ను యెలాంటి చిక్కుల్లోనూ పడవేసేది కాదు. ఆయన యధాప్రకారం నవ్వేస్తూ కుర్రవాడి వంక అదోరకంగా చూచేవాడు.

'సర్. కుర్రవాడికి చదువులో శ్రద్ధ ఎక్కువ. బాగా చదువుతున్నాడు'

'అలాగా మంచిది'

'అవునండీ. వాడికి అన్ని సంగతులూ తెలుసు. చరిత్ర అంశాలూ తెలుసు. ఎనిమిదవ హెన్రీ గారు పోప్‌తో ఎందుకు విరోధ పడిపోయారో వాడు ఎరుగును' అంటూ అరుణ్‌ను, యింకా ముందుకు నెట్టి 'చెప్పరా చెప్పు, దొరగారికి. ఇంగ్లండ్‌లో సంస్కరణల గురించి, నీకు తెలిసిందంతా చెప్పు.

నీకు నచ్చిన ఒంట్లన్నీ వప్పచెప్పు...' అనేవాడు. రహస్యంగా వాడి చెవిలో 'నిద్రపోకురా తండ్రీ - యిప్పుడు జవాబులు చెప్పలేకపోయావో నీతాట వొలిచేస్తాను జాగ్రత్త' అని బెదరించేవాడు.

సూపరింటెండెంట్ ముందుకు వెళ్లిపోయేవాడు. లాలాకు కొడుకు ప్రవర్తనలో యేమైనాని అసంతృప్తి యేర్పడితే ఆ తర్వాత వాడి చెవులు మెళిపెట్టి యేడిపించి తృప్తిపడేవాడు.

మార్చ్ చేయడం అయినాక, తమ ప్రదర్శనలన్న పూర్తి అవగానే కేంద్రస్థానంలో వున్న యూనియన్ జాక్ దగ్గరకు వచ్చి గౌరవపురస్కరంగా 'హిప్ హిప్ హుర్రే' అనే వాళ్లు మూడు మార్లు, దళాలలో సైనికులు. స్థానిక సైనికులకు యేం జరుగుతోందో వివరంగా తెలిసేది కాదు. అయినా వాళ్లూ కూడా 'హిప్ హిప్ హుర్రే' అని మూడుమార్లు నినదించేవాళ్లు. కొందరికి ఈ పదాలు కూడా సరిగా ఉచ్చరించడం చేతనయేది కాదు. హుప్ - హుప్ అనీ హురా హురా అనీ అనేవాళ్లు. ఏప్రిల్ మాసంలోనో వైశాఖ పూర్ణిమనాడో కొత్తసంవత్సరం ప్రారంభం కావలసిన జనానికి జనవరి మొదటి తేదీనే నూతనత్వం ప్రసరించేది. సైనిక దళాలు బరాక్స్‌లోనికి వెళ్లిపోతే సమావేశమయిన జన సమూహాలు ఎవరి యిళ్లకు వాళ్లు వెళ్లిపోయేవాళ్లు.

అలవాటుగా పెరేడ్ చూచేవాళ్లు యింకా ఆ స్థలాన్ని వదిలి వెళ్లేవారుకాదు. ఎందుకంటే తెల్లదొరలు వీధికుక్కలను కాల్చిచంపే సమయం యిదే పుండు చీము కారుతున్న శరీరాలతో, ఈగలు ముసురుతున్న చెవుల రొదను గూడా లక్ష్యపెట్టకుండా కొన్ని కుక్కలు పెరేడ్ చూడటానికి వచ్చేవి. వాటిని ఈ ప్రాంతానికి రానివ్వకుండా ముందుగానే తరిమి తరిమి కొట్టేవాళ్లు. కాని దుర్భేద్యమైన తావులలో చొరబడలేకపోతే అవి భారతదేశపు కుక్కలు ఎలా అనిపించుకుంటాయి ? కవాతు నడిపించే అధికారి 'ఎటెన్షన్..." అని గట్టిగా అరచినప్పుడు ఈ కుక్కల మంద బాగా ఉడ్చి శుభ్రపరచిన జాగాలో అటుయిటు పరుగులు తీయనారంభించేవి. కొందరు జవాన్లు వాటిని తరిమికొట్టటానికి పరుగెత్తే వాళ్లు కాని ఆ సన్నటి శలాకులాంటి కాళ్లున్న కుక్కలు వాళ్లకు

దొరకకుండా పరుగులు తీసేవి. కవాతు స్థలం నుంచి అవి యువతలకు వచ్చేశాయంటే - అక్కడ గుమిగూడి చూస్తున్న జనం వాటిని మళ్లీ అదిలించి లోపలకు పోయేట్లు చేసేవాళ్లు - పెరేడ్ చేస్తున్నసైనికులు ఎంత తమాషాయో, యీ కుక్కలు కూడా అంతే తమాషాగా వుండేది, చూచేవాళ్లకు. కుక్కలను రాళ్లు వేసి కొట్టి, తరిమి తిరిగి అవి గోదాలోకి పోయేట్లు చూసేవాళ్లు. జవాన్లు వాటికి ఎదురొచ్చి పట్టుకు బంధించగలిగేవాళ్లు. అక్కడితో అయిపోయిందను కుంటున్నారా ఈ కథ ? ఈ అల్ప ప్రాణులు ఎలాంటివో ఎవరికీ తెలియదు. ఎడ్జుటెంట్ తెల్లటి గుఱ్ఱం మీద స్వారీ చేస్తూవుండగా - ఆయన చేతిలో కత్తి నిటారుగా నిలిచి ఎండ వెలుగుకు తళతళమంటూ వుండేది ; ఆయన దుస్తుల ఇత్తడి బొత్తాములు ధగ ధగ మెరుస్తూ వుండేవి ; కుక్కకూడా దానితో పోటీపడుతున్నట్లుగా ఆ గ్రౌండ్‌లోనే తిరుగాడేది. దాని తోక నీరసంగా వెళ్లాడి పోతూ వుండేది. నోరు తెరుచుకుని, చొంగ కారుస్తూ గుఱ్ఱాన్ని స్వారిచేస్తున్న అధికారి ముఖం వంకనే చూస్తూ వుంటుంది కుక్క. ఈ మనిషి, ఈ గుఱ్ఱం యిక్కడ యేం చేస్తున్నారో దానికి అర్థం అయ్యేది కాదనుకుంటా ! అయితే మాత్రం యేం, ఏ భారతీయ శునకమూ ఈ పవిత్రమైన స్థలాన్ని అపవిత్రం చేసేది కాదు. చరిత్రలోనే లేదు ఎలాంటి కుళ్లు కుక్క అయినా, యీ జాగాలో 'అశుద్ధం' చేసినట్లు ! అంతగా అవసరం అనిపిస్తే అవి ఒక్కక్షణం ఆగి పొట్ట గీక్కుని మళ్లీ మామూలుగా పరుగుపందెంలో పాల్గొంటాయి. ఎక్కడా తొట్రుబాటు తొందరపాటు, అసంగతం అనిపించకుండా ప్రవర్తిస్తాయి.

పెరేడ్ అయిపోవడంతోనే ముగ్గురు, నలుగురు సార్జెంట్లు సైకిళ్ల మీద వస్తారు. వాళ్ల చేతుల్లో తుపాకులుంటాయి. ఇన్ని సంవత్సరాలుగా బ్రిటిష్ సార్వభౌముల ఉత్తరువును ఎవరూ జవదాటటానికి సాహసించలేదు. శతాబ్దాలుగా జరుగుతున్న విషయం యిది. చరిత్ర పుస్తకాలు చూడండి, ప్రపంచ పటాలు చిత్తగించండి. సూర్యుడు అస్తమించని సామ్రాజ్యం బ్రిటిష్ వారిది. అయితే యిప్పుడు పేరేడ్ జరుగుతున్న సమయంలో ఈ గజ్జికుక్కల వల్ల కొంత అపార్థం జరిగిపోయింది. జవాన్లకే వదిలేసినట్లయితే ఈ తప్పిదానికి శిక్షగా వాళ్లు మనషుల్నే కాల్చిపారేసేవాళ్లు. నిన్న మొన్నటి దాకా అలాగే చేశారు

గదూ ! 1919లో జలియన్-వాలా-బాగ్ ఎంతమందిని నిష్కారణంగా చంపిపారవేశారు కాదు ! అయితే యిప్పుడు ఆ రకంగా క్రూరంగా పగతీర్చుకునే రోజులు కాదు. కాలం మారిపోయింది. అందుచేత వాళ్లు యిప్పుడు కుక్కల వెంట పడుతున్నారు.

సార్జెంట్లు సైకిల్‌ను ఒక్కచేత్తోనే పట్టుకు నడిపిస్తూన్నారు. రెండో చేయి తుపాకి పట్టుకుందుకు కాళీగానే వుండింది. వాళ్లు పైకి చూడటానికి శాంతంగానే వున్నారు. ఏదో కవాతు పాట ట్యూన్ ఆలపిస్తున్నారు కూడా సన్నగా. కాని అక్కడ మిగిలి వున్న జనానికి తెలుసు వాళ్ల మనసులలో యెలాంటి ఊహలు దొర్లుతున్నాయో ! అందుచేత తమ తమస్థానాలు సర్దుబాటు చేసుకుంటూ ఆ గుఱ్ఱపు సార్జెంట్లకు వెసులుబాటు కల్పిస్తున్నారు. ఒక స్థితి నుంచి మరో స్థితికి మార్పాటు కావటంలో సహజంగా వుండే కళవెళపాటు, ఆతురత వాళ్లలో స్పష్టంగా కనిపిస్తున్నాయి. భారత మేధస్సు ఎప్పుడూ గొప్ప గొప్ప విషయాల మీద అతి సులభంగా పోరాడగలుగుతుంది. బ్రహ్మ పదార్థం, ఆత్మ, మరణానంతరం యేమవుతుంది, మనిషికి తుది సోపానం యేమిటి .... యిటువంటి విషయాల మీద అతి చురుకుగా లాఘవంగా పనిచేయగల మనసు కేవలం ప్రాపంచికం, లౌకికం అయిన విషయాలపైన అంత హుషారుగా పనిచేయదు. అయితే పరాయి ప్రభువుల మనసులలో కదలాడుతున్న భావాలను గమనించి ఆత్మపరమైన ఉదార స్వభావాన్ని పుణికి పుచ్చుకుని సృష్టి అంతటిలోనూ వున్న తాదాత్మ్యాన్ని గుర్తు తెచ్చుకుని - వాళ్లు సులభంగానే యిష్టంగానే సర్దుబాట్లు చేసుకోగలరు. వాళ్ల పూర్వీకుల గురించి చరిత్ర పుస్తకాలలో యేమేం వ్రాసివుందో గమనించ వద్దా? ఆ పూర్వీకులు పాములకు పాలుపోసి పోషించేవాళ్లు. పులుల గుహల్లోకి ఆహారం తీసుకుపోయి నివేదన చేసేవాళ్లు. సృష్టి అంతా ఒక్కటే ! మనిషి - జంతువు - పక్షి - పూలు - చెట్లు - యివన్నీ వేరు వేరుగా కనిపిస్తున్నా మూల పదార్థంలో ఒక్కటే మచ్చు. అలాగే ఈ ఆంగ్రేజు వాళ్లు ఆ ఏకత్వంలోనే మరో తరహా ! పరిపూర్ణ యేకత్వాన్ని పొందిన బ్రహ్మ పదార్థంలో వాళ్లు ఒక మచ్చు ఈ రోజున ఇంగ్లీషు వాళ్లు భారతీయులను పాలిస్తున్నారు. కొన్నాళ్లు పోయిన

తరువాత భారతీయులే ఇంగ్లీషు వాళ్లను పాలిస్తారేమో ! ఈక్షణంలో వాళ్లకు పరస్పర సహకారం అవసరం అవుతోంది వాళ్ల హుర్రే పెరేడ్, ఈ గజ్జి కుక్కల వల్ల తక్కువ జాతి జంతువుల వల్ల కొంత భంగపాటు పొందవలసి వచ్చింది. ఈ కుక్కలకు యజమానులంటూ ఎవరూ లేదు. అవి నగరం అంతటికీ గొప్ప జాడ్యంలా, ఆటంకంగా తయారవుతున్నాయి అందుచేత ఈ కుక్కలను ఒకచోట చేర్చి చంపివేసి నగరాన్ని కాపాడ వలసిన కర్తవ్యం వున్నది !

జన సమూహం ఎన్నో వలయాలుగా రూపొందింది. అంతే కాదు. ప్రతి వలయంలోనూ ఒక కుక్కను బంధించినట్లు చేసి ఆంగ్రేజి సార్జెంటు దాన్ని చంపడం కోసం ఎదురు చూస్తూ వున్నారు జనం. అయితే లాలా కాన్షీరామ్‌కు మటుకు తన కళ్ల ఎదురుగానే కుక్కలను చంపడం అనే అకార్యాన్ని చూడడం అసాధ్యం అయిపోతోంది. మీదు మిక్కిలి అతను శాకాహారి. అయితే అతని వ్యక్తిత్వంలో మరో పక్కవుంది ; భాగం వుంది. భారతీయులందరిలోనూ యీ భాగం వుంది. ఇది మతానికి, జాతి భేదాలకు అతీతమైన భాగం - ఎలాంటి పరిమితులకు లోనయినది కాదు. నిరాసక్తంగా వుండే దైనందిన జీవితంలో యేదో సాహసోపేతమైన కార్యంగా కనిపించే దృశ్యాలను చూడాలనే ఉత్సాహం ఈ భాగం. ఉదయం దుకాణానికి వెడతాడు, సాయంకాలం కావడంతోనే యింటికి తిరిగి వస్తాడు. ఏ మాత్రం పొల్లుపోకుండా యిదే రోజువారీ కార్యక్రమం అయిపోయింది. ముప్ఫయి అయిదు సంవత్సరాల వైవాహిక జీవితంలో అంతా యాంత్రికంగా యిలాగే జరిగిపోతోంది. సినిమాలకు వెళ్లడం లేదు; పుస్తకాలు చదవడం లేదు ; యింకే రకమైన వినోద కార్యక్రమాన్ని చూడడమూ లేదు..... అదంతా అతని పవిత్ర జీవన గమనానికి వ్యతిరేకం అయిపోతుంది. అయితే సమావేశాలకుమటుకు వెళ్లవచ్చు. ఎన్నయినా పాల్గొనవచ్చు. ఆధ్యాత్మ సమావేశాలు, సత్సంగాలు, రాజకీయ సభలు, ఆర్య సమాజం వాళ్ల కార్యకలాపాలు -- యిలా ఎన్నో వున్నాయి. అయినా యివి కూడా గిరిగీసినట్లుగా ఒక మూసకట్టులోనే జరుగుతాయి. ఎప్పుడో తప్ప యీ కట్టుసడలదు. ఎవరో లేచి అనర్గళంగా అరవయి నిమిషలసేపు ఉపన్యాసం యిస్తారు. లేదా ఎవరో ఒక భజనపదం

అందుకుంటారు ఆ పదం కొన్ని గంటలసేపు నిరవధికంగా నడుస్తుంది. స్వామి దయానంద సరస్వతి ఆర్య సమాజ సభలలో అయితే స్వామి దయానంద సరస్వతి బొమ్మ - చిత్రపటం - వయిపు చూస్తూ కొన్ని గంటలసేపు గడిపివేయడం అనే కార్యక్రమం ఒక సాయంత్రం పూట అంతా నడుస్తుంది - కనీసం కన్ను ఆర్పటానికి కూడా వీలు లేదు ! రాజకీయ సభలు తమాషాగా వుంటాయి. ఎవరో ఒక నాయకుడు అకస్మాత్తుగా ప్లాట్‌ఫారమ్ మీదకు ఎక్కుతాడు. బ్రిటిష్ వారిని, వారి పాలనను దుమ్మెత్తిపోస్తూ మాట్లాడుతాడు. ఆ దుమ్మెత్తి పొయడంలో గూడా ఎన్నో రకాల భాషలు, తరతమాలు వుంటాయి. కాని లాలా కాన్షీరామ్‌కు యిలాంటి సభలలో పోలీసులు జోక్యం కలుగజేసుకుంటారని ఆదుర్దా. అందుచేత వీటిలో హాయిగా విశ్రాంతిగా పాల్గొనలేకపోయేవాడు.

వీధికుక్కను ఒక సార్జెంట్ తుపాకితో కాల్చి చంపే సన్నివేశం వేరు ! అది చూడటానికి చాల తమాషాగా వుంటుంది అని తనకు తాను చెప్పుకుంటాడు. మళ్లీ ఎవరూ వినడం బాగుండదు గదా ! వలయం యేర్పడింది. కుక్కను బంధించడం అయింది ; సార్జెంట్ దొర వచ్చాడు. సైకిల్ మీద నుంచి దిగి - ఆ మూడు చారల సార్జెంట్ ముందుగా సైకిల్ స్టాండ్ వేస్తాడు. తీవ్రంగా చూస్తూ సునాయాసంగా కుక్కను ఒక దెబ్బతో కాల్చివేస్తాడు. కుక్కకు కూడా తన అంత్య సమయం సమీపించిందని ముందుగానే తెలసి పోతుంది తోకను కాళ్ల మధ్యకు తెచ్చుకుంటుంది తుపాకి పట్టుకున్న మనిసిని చూడగానే మూలగడం ప్రారంభిస్తుంది. కాని సార్జెంట్ ఈ కార్యకలాపం యేమీ గమనించడు. తాను చేయదలుచుకున్న పని చేసి వేస్తాడు. పెరేడ్‌ను దాని వైభవాన్ని పాడుచేసిన ఈ గజ్జికుక్క శిక్షింపబడవలసిందే; దానికి తిరుగులేదు - అన్నదే అతని యోచన. తుపాకి ఎత్తి గురిచూచి పేలుస్తాడు. గుండు వేగాన్ని బట్టి, కుక్క తక్షణమే చనిపోయి ఆరు అడుగులో, ఎనిమిది అడుగులో లేక పది అడుగులో ఎగిరిపడుతుంది. మెడతెగిపోయి నేలమీద పడిపోతుంది. దాని పని అంతటితో అఖరు అయిపోతుంది !

సార్జెంట్ ఎంత హుషారుగా హుందాగా ఈ పని చేస్తాడు - అన్న విషయమే లాలా కాన్షీరామ్‌కు ఆశ్చర్యం కలిగిస్తుంది. కుక్కకు అతి కొద్ది దూరంలోనే జనం-గుంపు కూడి నిలచివున్నారు. సార్జెంట్ యెంతో మెలుకువగా ప్రవర్తించకపోతే తుపాకి గుండు కుక్కకు తగలకుండా ఆ జనసమూహంలో యెవరినయినా పొట్టన పెట్టుకోవచ్చు. కాని అతను చాలా హుషారుగా చాకచక్యంగా మెలుగుతాడు. రైఫిల్ పైకి లేచింది. తూటా బయటకు వచ్చింది. ఒకే ఒక క్షణం ! కుక్క నేలకూలి పోయింది. సార్జెంట్ అమిత హుందాగా ముందుకు నడిచి - అతని కాళ్లు బూట్ల పాలిష్‌తో నిగనిగ మెరుస్తున్నాయి -- కుక్కతోక కత్తిరించి వెళ్లిపోయాడు. లాలా కాన్షీరామ్‌కు ఈనాటికి కూడా తెలియదు. వాళ్లు యెందుకాపని చేస్తారో ! బహుశ ఆ తోకను భద్రపరచి వుంచి గుర్తుగా అట్టిపెట్టుకుంటారో యేమో ! కుక్కను చంపినట్లు సాక్ష్యంగా తోకను కమాండర్‌కు చూపించాలని నియమం వున్నదేమో. లాలా కాన్షీరామ్‌ను చకితపరిచేది యేమంటే - ఓ బజారు కుక్కను చంపిపారవేయడంలో గూడా బ్రిటిష్ వాళ్లు ఎంత నిపుణత, పనితనం చూపిస్తారనే విషయం. వాళ్లు ప్రపంచాన్నంతటిని ఏకచ్ఛత్రాధిపత్యంలో పరిపాలన చేస్తున్నారంటే అందులో ఆశ్చర్యం యేముంది ? ఆంగ్రేజి రాజ్యాన్ని మించిన పరిపాలనా ప్రాథిమ ప్రపంచంలోనే మరెక్కడా లేదని అతను తరుచు గుర్తు తెచ్చుకుంటూ వుంటాడు.

ఆ ఉదయం భార్యతో మాట్లాడుతున్నప్పుడు గూడా ఆంగ్ల సామ్రాజ్యం పట్ల అతనికి వున్న గౌరవం అతని కంఠస్వరంలో ప్రస్ఫుటం అయింది. 'ఈరాత్రి ఆల్ ఇండియా రేడియో నుంచి లార్డ్ మౌంట్ బేటన్ గారు ప్రసంగిస్తారు' అన్నాడు. ఆయన చిత్రపటం మొదటి రోజున వార్తాపత్రికలలో చూచినప్పుడే లాలా వైశ్రాయి అంటే మక్కువ ఏర్పరుచుకున్నాడు. బ్రిటిష్ వాళ్లు భారతదేశాన్ని తమ అధికారం నుంచి పోగొట్టుకుంటున్నారంటే అందుకు కారణం గాంధీగారు కాదు, ప్రజలలో యేదో కొత్త చేతనం ప్రవేశించడమూ కాదు. క్లిష్ట సమయంలో ఇంగ్లీషు వాళ్లు తమ హుందాతనానికి యే మాత్రమూ సరిపడని ఒక వైశ్రాయిని నియమించడమేనని లాలా ఊహ. లార్డ్ వేవెల్

లావుపాటి మనిషి దాన్యపు బస్తాల వంటి లాగూలు తొడుక్కుంటాడు. చూడటానికి యే మాత్రమూ లక్షణంగా వుండడు. ప్రజలు బ్రిటిష్ పాలనకు వ్యతిరేకులు అయినారంటే అతని దృష్టిలో యిదొక్కటే కారణం. వేవెల్‌కు ఒక్కటే కన్ను. భారతీయులకు ఏకాక్షులంటే యేమాత్రం ఆదరం, మన్నన లేదని యిన్నాళ్లు పరిపాలన చేసిన బ్రిటిష్ వారికి తెలియకపోవడం దురదృష్టకరం. మూఢనమ్మకమే అయితే నేం. యిదే ముప్పు తీసుకువచ్చింది ఆర్య సమాజం వాళ్ళ ధర్మమా అని తన దురభిప్రాయాలు చాల వారకు ఛిన్నం అయినాయి ఏకాక్షి యెదురయినప్పుడు ఓం భుః భవః, సువః అని పదిమార్లు జపించి ముందుకు వెళ్లిపోతాడు. అదే యితరులయితే - ఈ రోజుకు తమ పనిసరి అని తిరిగి యిళ్లకు మళ్లిపోతారు. ఇంటికి వెళ్లి స్నానం చేసి, దుస్తులు మార్చుకుని ఆ రోజంతా యింటి దగ్గరే వుండిపోతారు. మహారాజా రంజిత్ సింగు కూడా నిజానికి ఒంటి కంటివాడే అయితేనేమి, ఆ అవలక్షణాన్ని చిత్తు చేయగల ఎన్నో గొప్ప లక్షణాలు ఆయనకు వున్నాయి. అందంగా తలపాగా చుట్టుకుంటాడు, చేతి మీద ఉత్తరీయం వేలాడుతూ వుంటుంది. హాయిగా గుఱ్ఱపు స్వారీ చేస్తాడు. చూడటానికి మహారాజు ఎంతో హుందాగా జబర్ దస్తీగా వుంటాడు. వేవెల్ అయితే గుడ్లగూబ ఆకారం. ఎందరో పాలకులు వుండగా ఇంగ్లీషు వాళ్లు ఈ వేవెల్‌నే యెందుకు పంపవలసి వచ్చిందో ! 1857లో వాళ్లు దాదాపు నాశనం అయిపోయే స్థితికి వచ్చారు ఆవు కొవ్వు పూసిన తూటాలు యిస్తారా సైనికులకు ! ఇప్పుడు అంతకంటె దారుణమైన పనిచేశారు గదూ ! ముస్లిములు కూడా ఈ ఒంటికంటి వైశ్రాయిని అపనమ్మకంగానే చూస్తున్నారు.

మార్చి మాసంలో లార్డ్ మౌంట్ బేటన్ రావడంతో తిరిగి ఇంగ్లీషు పాలనకు పూర్వ వైభవం వచ్చినట్లు అయింది. అతను ఎంత పొడుగరి ! ఎంత చలాకీ మనిషి !! వైశ్రాయి అంటే యిలాగే వుండాలి అన్నట్లుగా వుంటాడు ఆ హుందాతనంలో అతనికి అతనే సాటి తలమీద కిరీటం, దుస్తులు అన్నీ సరిగ్గా అమరినట్లుగా సరిపోతాయి అతని సరసన ఉన్న సుందరాంగి భార్య సరే సరి ! లాలా కాన్షీరామ్ మరో విషయం కూడా అతి గోప్యంగా ప్రభారాణికి

చెప్పాడు. 'ఈ కొత్త వైశ్రాయి సార్వభౌములవారికి ఇంగ్లీషు చక్రవర్తికి దగ్గరి బంధువు కూడా!' మహరాజు, చక్రవర్తి అనటానికి అతను ఉరుదూ బాషలోని 'బాద్‌షా స్లామత్' అనే ప్రయోగం వాడతాడు. ఈమాట అంటున్నప్పుడు అతని శరీరం పులకరిస్తుంది. ఇండియాలోని కోట్లాది జనం ఆయనకు ఎదురు తిరిగినా సరే, ఆయనే గనుక భారతదేశం సందర్శించేట్లయితే ఒకే ఒక్క వ్యక్తి ఆయనకు పాదాక్రాంతుడై మొక్కటానికి సిద్ధం. ఆయన బ్రిటిష్ సార్వభౌముడు. రాణిమాత విక్టోరియాకు ఏకైక వారసుడు. ఈ విక్టోరియా మహారాణి బొమ్మల చప్టాలమీద పెరిగినవాడు లాలా కాన్షీరామ్.

ఈ ఉదయం లాలా కాన్షీరామ్ ప్రభారాణికి రేడియో ప్రసంగాన్ని గురించి చెప్పాడు. ఆ సమయంలో ఈ ఆలోచనలన్నీ మనసులో మెదలాయి. అతనికి ఆనందంగా ఖుషీగా అనిపించడం లేదు, మనస్సు కొన్త పిరికిగా తయారవుతోంది. యథాప్రకారం పట్టెమంచం మీద దిండ్లు వొత్తుపెట్టుకుని కూర్చున్నాడు. ప్రభారాణి గుమ్మంలోనే నిలబడి వుండి ధ్యాసను సగం చదువు మీద సగం వంటయింట్లో పనిమీద నిలిపి వుంటుంది.

లాలా కాన్షీరామ్ 'ఇలా వచ్చి మంచం మీద కూర్చోరాదూ ?' అన్నాడు. ఆమెకు ఈ మాటలు ఆశ్చర్యం కలిగించాయి. సాధారణంగా వార్తాపత్రిక చదువుతూ వున్నప్పుడు ఎవరినీ పక్కకు చేరనివ్వరు. ఇప్పుడేదో ఆయనకు భయం పట్టుకున్నట్లుంది. ఇంట్లో విచారకరమైన సంఘటన యేమీ జరగలేదు. దుకాణంలో గూడా యేమీ విపరీతం జరిగి వుండదు. మరి ఈ ప్రవర్తనకు కారణం యేమిటి ?

ఆమె మెల్లగా మంచం దగ్గరకు నడిచి, ఆయన సరసన కూర్చుంది. లాలా కాన్షీరామ్ ఆమెవంక తేరపారచూచాడు. ఆమె చామనచాయ ముఖం - యిన్ని సంవత్సరాల యింటి పనుల చికాకులలో - బాగా అలసిపోయి వడిలి కనిపిస్తోంది. అయినా అందానికేమీ తరుగు రాలేదు. ఆలుచిప్పల లాంటి వెడల్పయిన సుందర నయనాలు ఆమెవి. ఆమె చేతుల వంక చూచాడు. గోళ్ల దగ్గర చర్మం చాలచోట్ల బీటలు వారిపోయింది. ఇంట్లో ఎంతో చాకిరీతో

సతమతం అవుతోందన్నమాట ! కాలంతోపాటు నడుము మడతలు ఎక్కువయిపోయినాయి. అదేమీ ఆమె తప్పుకాదు. పంజాబ్ దేశంలో అందరు ఆడవాళ్లకూ తటస్థించేదే ఈ స్థితి. పురుళ్లు అయిన మీదట యిలా జరగడం సాధారణం. ఏమయినా మోటు మనుషులకు యిలాంటి నడుము మడతలు, పొట్టకింద కొవ్వు చేరడం యేమీ నిందార్హమయిన విషయం కాదు ఈమె మంచిమనిషి, తనతో ఎంతో మంచిగా మర్యాదగా వుంటున్నది అన్న విషయంలో అతనికేమీ అనుమానం లేదు.

అతను యిల్లంతా చూపులతో కలయ చూచాడు. అంతటా నిశ్శబ్దం - ఎక్కడా చడీ చప్పుడు లేదు. అతను కూర్చున్నచోటు నుంచి యింటిలోని మూడు గదులూ పూర్తిగా కనిపిస్తాయి ఒక గదిలోనుంచి మరోదానికి ద్వారాలు వున్నాయి. చివరిగదికి ఒక పక్కన వంటగది వుంది. ఆ గది యిక్కడి నుంచి నేరుగా అగుపడదు. కనిపిస్తున్న మూడు గదులలోను వస్తువులన్నీ అమరికగా అందగా సర్దుబాటుగా వున్నాయి. అతను కూర్చున్న గది తరువాతది మరీ పెద్దది. తన గదికీ అరుణ్ గదికి మధ్య ఓ పెద్ద స్రవంతిలా వుంటుంది అది. ఆగదిలో రెండు పక్కల మంచాలు పరుపులు వున్నాయి. రెండు మంచాల మీద పక్కబట్టలు, పరుపులు, దుప్పట్లు విశ్రాంతిగా పరిచివున్నాయి ఆ గదిలోనే ఒక వారగా కొన్ని గోడకు నిలబెట్టి వున్నాయి. ఒక మంచం నాలుగుకాళ్ల మధ్య మరో మంచం, దానిలో యింకొకటి . . యిలా స్థలం ఎక్కువ ఆక్రమణ కాకుండా యేర్పాటయివున్నాయి. అలా నిలబెట్టి వున్న మంచాల మీద గూడ ప్రభారాణి ఓ చక్కటి దుప్పటి పరచి వుంచింది - చూసేవాళ్లకు అస్తవ్యస్తంగా కనబడకుండా వుండటానికి. ఆ దుప్పటి వెనగ్గా మంచాలు నిలబట్టి వున్నాయని దడాలున చూచేవాళ్లకు తెలియదు ఏదో అందంకోసం సౌకుమార్యం కోసం తెరపరచినట్లుగా వుంటుంది ఆ దృశ్యం.

బట్టలన్నీ ట్రంకు పెట్టలలో అమర్చి వుంటాయి. దుప్పట్లు, బొంతలు, చిన్న చిన్న దిండ్లు, దిండు గలేబులు - గండ్రటివి నలుచదరంవి ఓ పెద్ద భోషాణంలో వున్నాయి. ప్రతి యింట్లోను యిలాంటి పెద్ద పెద్ద భోషాణాలు

ఒకటో రెండో తప్పనిసరిగా వుంటాయి వాళ్ల యింట్లో యివి రెండు వున్నాయి. ప్రభారాణి వాటిని ఈ పెద్దగదిలోనే ఎడమవయిపు చేర్చి వుంచింది. ఈ భోషణాల మీద యితర ట్రంకు పెట్టెలు వున్నాయి. ఈ చిన్న పెట్టెలను యింట్లో వాళ్లు యే సమయంలోనయినా తెరచి ఉపయోగించుకొనటానికి వీలున్నది భోషాణాలు తెరవాలంటే మాత్రం ఆ పని తల్లో తండ్రో మాత్రమే చేయడం. పెద్దలకు మాత్రమే తెలిసిన వస్తువులు పాగుపెట్టి వుంటాయి వాటిలో యేమేం వస్తువులు పొధంగా భద్రంగా వున్నాయో యింటి యజమానికి, యజమానురాలికి మటుకే తెలసివుంటుంది. తతిమ్మా కుటుంబ సభ్యులకు అది మాయ, మర్మమూను. పిల్లలు యీ విషయం తరుచుగా చర్చించుకుని నివ్వెరపోతూ వుంటారు కూడా. వాటి మూతలు ఎత్తే హక్కు పిల్లవాళ్లకు సుతరామూ సంక్రమించదు. వాళ్లు పెరిగి పెద్దవాళ్లయినప్పటికీ, వాళ్లకు యిచ్చే అవకాశమల్లా పెద్దవాళ్లు వాటిని తెరిచినప్పుడు పక్కన నిలబడి చూడడం మటుకే. అలాంటి సందర్భాలలో బంగారు నగలు మిలమిల మెరుస్తూ కనిపించినా, కరెన్సీ నోట్ల కట్టలు కళ్లబడినా -- యేమీ చూడనట్లుగానే వుండిపోవాలి పిల్లలు

లాలా కాన్షీరామ్ ఈ పెద్ద గదిదాటి, అరుణ్‌గది వైపు దృష్టిసారించాడు. ఆ గది గోడలకు కిటికీలు వున్నాయి. అవి పెరటి వైపు తెరుచుకుంటాయి. అవి చూచినప్పుడల్లా యేదో బరువు, తీయటి బాధ అతన్ని ఆవరిస్తూ వుంటుంది. వివరంగా తెలియదు. ముప్ఫయి యేళ్లనుంచి అలా చూచి అనుభూతికి తెచ్చుకోవడంమటుకు అలవాటు అయిపోయింది. ఈరోజు యింట్లో చూస్తున్నవన్నీ తను, ప్రభారాణి ముప్ఫయి సంవత్సరాలు ఎంతో శ్రమపడి చేర్చిపెట్టినవే. వీటన్నిటివెనక ఎంత మంచితనం దాగివుంది ! రెండు భోషణాల మీద ఎనిమిది ట్రంకుపెట్టెలు వున్నాయి. ప్రతిదాని మీద విడివిడిగా గుడ్డ దుప్పట్లు పరిచివున్నాయి. ప్రభారాణి రకరకాల రంగుల దుప్పట్లు వాడుతుంది ఈ పనికి. ఆకుపచ్చ రంగువి కొన్నాళ్లు, పసుపు పచ్చ మరికొన్నాళ్లు, ఊదారంగు కొన్నాళ్లు. ఇప్పుడు ఆ తెరల దుప్పట్లన్నీ నిమ్మరంగు పసుపు పచ్చలో వున్నాయి. గదికి మరోవైపు గోడకు దణ్ణెం కట్టివుంది. ఈ

దణ్ణెం మీద దుప్పట్లు, తుండు గుడ్డలు, యితర గుడ్డలు వేలాడుతున్నాయి. ఈ గోడకే నేలబారుగా చెప్పుల జతలన్నీ వరుస వారిగా అమర్చివున్నాయి ఈ యింట్లో బీరువాలు యేమీ లేవు. అయినా యింటిని అందంగా అమర్చుకోవాలన్న పూనిక వున్న ప్రభారాణికి అదేమీ అడ్డంకి కాదు. గదిలొ ఒకమూల చిన్నసైజు దేవాలయం కూడా యేర్పరచింది ఆమె.

లాలా కాన్షీరామ్ గదిలో ఎన్నో ఫోటోలు వేలాడుతున్నాయి అన్నీ శుభ్రంగా దుమ్ముధూళి లేకుండా వున్నాయి. అరుణ్ గదిలో అతని టేబుల్ మీద పరిచిన గుడ్డ, పక్క మీది దుప్పటి రంగుతో సరితూగేట్లుగానే వున్నది. అంతేకాదు, ఆ గది కిటికీలకు తెరలు కూడా వున్నాయి ఆ మాత్రం విలాసం అన్ని యిళ్లల్లోనూ కనిపించదు ఈ తెరలు, గుడ్డలు యివేవీ అధిక ధర అయినవి కాదు కాని చక్కనివి, మన్నిక గలవీని ఎప్పటి కప్పుడు పరిశుభ్రంగా సువాసనగా వుంటాయి ఈ యింట్లో ప్రశాంతత, మంచితనము వెల్లివిరిసివున్నాయి. సువాసనల శోభలు కూడా వున్నాయి గుడ్డలు ఉతకటానికి సరంజామా, ఇస్త్రీ చేయటానికి మంచి బరువైన పెట్టె వున్నాయి.

లాలా కాన్షీరామ్ ఆమె రెండు చేతులను తన చేతుల్లోనికి తీసుకున్నాడు. అతనికి వెనకటి జ్ఞాపకాలన్నీ మనసులో మెదలుతున్నాయి ఈ యింటి మంచితనం అతన్ని ఎంతో ఆకట్టుకుంది ఈ యింటికి వచ్చిన తర్వాత అంతాకలసి వచ్చింది. ఎన్నో శుభసంఘటనలు సమకూడాయి. అతనికి యిప్పుడు యాభయి యేళ్లు ప్రభారాణికి నలభై ఎనిమిది సియల్ కోటకు రాకముందు వాళ్లు గడిపిన యేడు సంవత్సరాల వైవాహిక జీవితం తిరగలిరాళ్ల మధ్య నలిగినట్లుగా వుండింది. శాంబ్రెయిన్ చాలా చిన్న ఊరు. ఎంతో మంది సంతతితో శాఖోపశాఖలుగా విస్తరిస్తున్న సమిష్టి కుటుంబం తమది. అక్కడ అందరికీ జీవనోపాధికి తగినన్ని వృత్తులు వ్యాపకాలు దొరకడం కష్టమైపోయింది. అంతేగాక, ఆ ఊళ్లో వున్నన్నాళ్లు వాళ్లకు సంతతి కూడా కలుగలేదు. అంటే ప్రభారాణి గర్భవతి కాలేదనీ, ప్రసవించ లేదనీ కాదు. కాని ఒక్క కాన్పయినా సవ్యంగా నెరవేరి సంతు నిలవలేదు. కాన్షీరామ్ అన్నదమ్ముల భార్యలు -

అంటే తన తోటికోడళ్లు - ఈర్ష్యాపరులు కావడం, ప్రతిసారీ మాయలు మంత్రాలు వెనక పరుగులు తీయడమే యిందుకు కారణం అని ప్రభారాణికి బాగా తెలుసు. వాళ్లలో కొంతమంది స్మశానానికి కూడా వెళ్లి వామాచార ప్రక్రియలు జరిపించేవాళ్లు. ఇదుగో ఈ యింట్లోకి మారిన తరువాతనే కుటుంబ వ్యవస్థ అంతా చక్కబడింది. ఒక పిల్ల, ఒక పిల్లవాడు కలగడమే గాక ఆరోగ్యంగా పుష్టిగా పెరిగారు. ఈ యింటికి వచ్చిన తరువాతనే అతనికంటూ ఓ సాంఘిక స్థాయి యేర్పడింది. ధాన్యపు వర్తకం - హోల్‌సేల్ వ్యాపారం - యిప్పుడు భద్రంగా నిలదొక్కుకున్నది. ఈ ప్రాంతంలో అందరికీ అతను చదువుకున్న ఆర్యసమాజ సభ్యుడని తెలుసు.

ఆమె చేతులు పట్టుకు కూర్చున్నప్పుడు అతనికి వెనకటి ప్రేమ అంతా అనురాగం అంతా వెలికి వచ్చింది. ఆమెకు ప్రభారాణి అని యిలాంటి ఆధునిక నామధేయం యిచ్చింది ఎవరు ? పల్లెటూరి కుటుంబాలలో యిటువంటి పేరు కనీవినీ ఎరగం. ఆంగ్ల ప్రాపకం వున్న ఆధునికత సంతరించుకున్న యిళ్లలోనే యిలాంటి చక్కటి పేర్లు పెడతారు పిల్లలకు. బహుశ వాళ్ల యింట్లో యెవరో సుకుమారుడు, అత్యాధునికుడు వుండి వుండాలి. ఈ ఆలోచన రావడంతోనే అతనికి నవ్వు వచ్చింది. ప్రభారాణిది పల్లెటూరి వ్యవసాయ కుటుంబం. ఆ యింట్లో ఎవరూ చదువుకున్నవాళ్లు, నాగరికులు లేరు. వ్యవసాయ కూలీల కుటుంబం అది. ఇంత మంచిపేరును విడిచిపెట్టి యిప్పుడు అందరూ ఆమెను తనతో సహా - 'అరుణ్ తల్లీ' అని మాత్రమే పిలుస్తారు, అదేం ఆచారమో గాని !

ఇటీవల కొన్ని సంవత్సరాలు ఆ యిద్దరికీ సంసార తాపత్రయం లేదు. కాని ఆమెతో సంసార సుఖం ఎంతో ఆనంద దాయకంగా వుండేది అన్న విషయం స్ఫురణకు వచ్చింది - యిప్పుడు అతనికి.

అరుణ్ పుట్టుకలకు ఆమెకు చాలా సుస్తీ చేసింది. అది ఏడోదో ఎనిమిదోదో ప్రసవం. ఎంతసేపటికీ శిరోదయం కాలేదు. ప్రభారాణి ముక్కింది, మూలిగింది, శ్రీకృష్ణుడిని ప్రార్థించింది. గట్టిగా కేకలు వేసింది.

కనిపంచేంత పలుచటిది ఆచీర. ఆ చీర కింద మరో మడత - పెట్టికోట్ - సున్నితమైన మెత్తటి పాప్లిన్ గుడ్డ వుంటుంది ఆమె లాలిత్వం చక్కగా ఎరిగిన మనిషి. రత్నాన్ని ఎంతలా ఎలా కాపాడాలో ఆమెకు బాగా తెలుసు. దుప్పట్ల రంగులు, చీర రంగులు ఒకదానికొకటి అమరికగా వున్నాయి చీరమీది బొమ్మలు ఆకర్షకంగా వున్నాయి. పువ్వులు, పళ్లు . వాటి ఆకారాలను రసాన్ని చీరకంతటికీ పంచుతూన్నాయి. చీరమీద బొమ్మలు చిన్నవిగా చేతిపనిగా వున్నాయి. దుప్పట్లు మటుకు ఫ్యాక్టరీ సరుకు అయినా, చీరలు మాత్రం చేతి అద్దకం పనితో మిలమిలలాడుతూ వుంటే తప్ప ఆమె అంగీకరించదు. ఆమె దగ్గరకు చేరడం అంటే పూలఉద్యానవనంలో విహరిస్తున్నట్లే అనుకున్నాడు లాలా కాన్షీరామ్. దగ్గరకు చేరిన కొద్దీ పూలపళ్ల పరిమళాలు, శోభలు ఆహ్లాదకరంగా విచ్చుకుంటాయి.

ఆమెను మరింత దగ్గరగా తీసుకొని, 'అరుణ్ తల్లీ ! వైశ్రాయి గారు యివాళ యేం వర్తమానం చెబుతారోనని నాకు చాల ఆందోళనగా వుంది సుమా !' అన్నాడు.

ప్రభారాణి ఎంతో ఊరట పొందినట్లుగా నిట్టూర్చింది. ఏమయింది యివాళ ? ఆయనకు యివ్వవలసిన పాలు యిచ్చింది. దిండ్లు సరిచేసింది, న్యూస్‌పేపరు చేతికి అందించింది. అయినా యింకా ఆయన దగ్గరకు రమ్మని పిలుస్తున్నాడు. చేతులు తన మురికి చేతుల్లోకి తీసుకు కూర్చున్నాడు. తనవైపు యేదో ఆతురతగా చూస్తున్నాడు. ఆ చూపుల అర్థం యేమిటో ఆమెకు క్షుణంగా తెలుసు. ఇప్పుడు యింట్లో యెవరూ లేరు. అరుణ్ కాలేజికి వెళ్లాడు. ఈసమయంలో ఆయన అది కావాలంటే.... ఎంత అపహాస్యం! ఎన్ని సంవత్సరాలు దొర్లిపోయాయి అలాంటి కోరికలు లేకుండా! ఆ చూపులు, మాటలు సజావుగా రాకపోవడం, అభిప్రాయం మాటల్లో యిమడ్చలేకపోవడం.... యిదంతా చూచి ఆమె భయపడింది నిజమే. ఆయన్ను ఓదార్చడం ఎలా.... ఊరట పరచడం ఎలా అని యింత సేపూ ఆలోచన చేస్తూనే వుంది. ఆయనకు యేం కావాలి? ఆదర్శ భారత స్త్రీగా ఆయన

కోరుకున్నదేదయినా యివ్వటానికి సిద్ధమే ఏడవ గలదు, నవ్వగలదు, పిల్లిలా చప్పుళ్లూ చేయగలదు, మెల్లగా ఒదిగిపోగలదు, కళ్లలో ఆశ్చర్యం... భయం... బాధ.... యేం భావం కావాలంటే అదే చూపించగలదు. కోప ప్రదర్శన చేయగలదు హాయ్ రామ్ అచ్ఛా.... యిలాంటి మాటలు రకరకాలుగా ఉచ్ఛరించగలదు. అయితే ఈ రోజు ఆయనకు తన వద్ద కావలసింది యేమిటి ? ఏరకమైన ఊరట కావాలని కోరుకుంటున్నాడు ?

ఆయన కళ్లలో కామన చూచినప్పుడే ఆమె అనుకుంది నాకు చచ్చేచావు వచ్చిపడిందని. యాభయియేళ్లు పైబడ్డ ఈ మనిషి యింకా తన మీద స్వారీ చేయాలని చూస్తున్నాడు.. ఇన్నాళ్లూ తాను ఎన్నిమార్లు దగ్గరకు చేరినా చోటుపెట్టనివాడు, యిప్పుడు తాను నిగ్రహం అలవరుచుకున్న తరువాత యిలా వెంటబడుతున్నాడేమిటి ? అరుణ్‌ను కంటున్నప్పుడు ఆ బాధ కొద్దీ తాను ఎంతగానో అరచి కేకలు పెట్టి గోలచేసి వుండవచ్చు అదంతా సహజ ప్రక్రియ దానిలో తన తప్పేమీ లేదు. కాని ఆయన ఆ రోజునుంచి తనను దూరం పెట్టేశాడు. తాను ఎంతో ఉబలాటంగా ఉత్సాహంగా తారాస్థాయిలో వున్నప్పుడు గబుక్కున వెనక్కు జరిగిపోతారు; అలా చేయవద్దని చెప్పడం ఆమెకు చేతకావడం లేదు. ఇలాంటి విషయాలు నోటితో మాట్లాడాలంటే కష్టం. ఇప్పుడు అంతా అయిపోయిన తర్వాత.... ఎన్నోయేళ్లు గడిచాక భగవంతుడు ఆమె ప్రార్థనలు విని కనికరించి సంయమం ప్రసాదించాడు. ఇప్పుడీ ముసలాయన కథ తిరగబెడతానంటే ఎట్లా ?

ఏం చేయాలో యేమిటో తెలియక ఆమె అతనికి దగ్గరగా కూర్చుంది. ఆయన బలవంతం చేస్తే తప్పదు. కాని యిదా సమయం ? .... ఉదయం పూటనా ?

ఇలాంటి సందర్భంలో, ఆయన 'అరుణ్ తల్లీ ! వైస్రాయి గారు యేం ప్రసంగం చేస్తారో నాకు అర్థం కాకుండా వుంది అదీ నా దిగులు' అని అన్నప్పుడు ప్రభారాణి చాల నిరాశ పడిపోయింది. .

'మీకెందుకు దిగులు ?' అంది ఆమె మామూలుగానే ధ్వనిస్తూ.

'ఇంగ్లీషు వాళ్లు పాకిస్తాన్ ఏర్పాటు చేసి జిన్నాకు వప్పగించిశేనో !'

'అలా జరగదని మీకు తెలుసు. గాంధీగారు దేశ విభజనకు సుతరామూ అంగీకరించరు ఇన్నాళ్లూ మీరు నాకు చెబుతూ వచ్చింది యీ సంగతే కదా!'

'ఆ మాట నిజమేననుకో. కాని మార్గాంతరం లేకపోతే యేం చేస్తారు? సమగ్ర దేశాన్ని వప్పగింత చేయడం కంటే ముక్కలు చేసిపారెయ్యడం ఇంగ్లీషు వాళ్లకు ఎక్కువ యిష్టం.'

ఈ అభిప్రాయం ప్రభారాణి మనసుకు ఎక్కదు.

'ఈ అస్తంతా సంపాదించటానికి నాకు పాతిక సంవత్సరాలు పట్టింది' అంటూ అతను గదుల వైపు చేతులు సారించి చూపించాడు. 'పాకిస్తాన్ నిర్మాణం జరిగితే యిదంతా నాశనం అయిపోతుంది.'

ప్రభారాణి హృదయం కృంగిపోయినట్లయింది.

లాలా కాన్షీరామ్ పెదవులు మెలిపెట్టాడు. చప్పుడు చేస్తూ గాలి వదిలాడు. భార్యకు భయం యేర్పడిందనీ, దానిని సంబాళించవలసిన కర్తవ్యం తనదేననీ గ్రహించాడు. ఆయనకు ఈ భయం ఫిబ్రవరి మాసం నుంచి వుంది. అప్పుడే బ్రిటిష్ వాళ్లు స్వాతంత్ర్య ప్రకటనకు ఒక గడువు నిర్ణయించి మాట్లాడారు. జూన్ 1948లోగా స్వాతంత్ర్యం యిచ్చేస్తాం - అని వాగ్దానం చేసేశారు. భారతదేశం ఆ గడువులోపల స్వేచ్ఛ అయిపోతుంది. రాజకీయ పార్టీలు ఆ గడువు లోపల ఒక తీర్మానానికి రాకపోయినా, వాళ్లు తమ అధికారాన్ని అప్పుడు ఎవరి అధికారంలో వుంటే వాళ్లకు అప్పగింత చేసేసి తమ దారిన తాము పోతాం అన్నారు. అదే లాలా కాన్షీరామ్‌కు మనస్తాపానికి కారణం అయింది. భారతదేశానికి స్వాతంత్ర్యం రావడం మంచిదే. కాని వాళ్లకు అంత తొందరపాటు ఎందుకు ? స్వాతంత్ర్యానికి బహువచన రూపం ఎందుకు యివ్వాలి ? అంటే వాళ్లు పాకిస్తాన్ యేర్పాటు చేయాలని సంకల్పించారనే గదూ అర్థం. కాంగ్రెస్ నాయకులను చూద్దామంటే, వాళ్లలో భరోసాపెట్టి నెమ్మదిగా వుండటానికి వీలులేకుండా పోయింది. గాంధీ రాజాజీ

లే 1944లో పాకిస్తాన్ దేశం యేర్పాటు చేసి జిన్నాకు అప్పగింత చేస్తామని అననే అన్నారు గదా ! అసలు వాళ్లిద్దరే జిన్నాకు యీ పుత్రేపణ పెట్టింది. భారతదేశంలో తూర్పున ఒకముక్క, పడమరన ఒక ముక్క తీసుకో - అని వాళ్లు అననే అనేశారు. ఉభయరాజ్యాలకు ఉమ్మడి విదేశ విధానం, సంరక్షణ పద్ధతి ఉండాలన్నారు. అంతవరకూ జిన్నా పాకిస్తాన్ గురించి మాట్లాడుతూ వున్నా, దాన్ని గురించి స్పష్టంగా అతనికే తెలియదు గాంధీ 'పాకీస్తాన్' అనే పేరు పెట్టడమే గాకుండా జిన్నాకు ప్రతిపత్తి, పేరు సంపాదించి పెట్టాడు. 1944 సెప్టెంబర్‌కు ముందు జిన్నాకు ఊరు, పేరు ఉన్నాయాదేశంలో ? అతను గూడా కలగని వుండడు తనకు యింత ప్రాముఖ్యం యేర్పడుతుందని, అప్పటి నుంచే గదూ అతను పళ్లు నూరడం, తలనెప్పిగా తయారవడం ప్రారంభించింది ! కాంగ్రెస్ యీ మాత్రం యివ్వటానికి ఒప్పుకుంటే పూర్తి విభజన జరిగిపోతుంది. గాంధీ మాత్రం యిందుకు ఒప్పుకోనని మొండికెత్తి కూర్చున్నాడు. అలా జరిగితే మా మృతదేహాల మీదుగానే అన్నారు కాంగ్రెస్ నాయకులు. మా రక్తం ఆఖరు చుక్కవరకు ధారపోస్తాం తప్ప, దేశ విభజనమటుకు జరగనివ్వం అన్నారు. ఇంగ్లీషు వాళ్లు కూడా యిప్పుడు యిందుకు అంగీకరించక తప్పడం లేదు - అదీ లాలా కాన్షీరాం దుగ్ధ !

బహుశ తన ఆలోచన విపరీతస్థాయికి చెందింది కావచ్చును. మౌంట్‌బాటన్ దొరగారు కాబినెట్ మిషన్ ప్రణాళికకు కట్టుబడి వుంటానన్నాడు. ఇందులో దేశవిభజన ప్రసక్తి లేదు. పోయిన నెల వైశ్రాయి గారు నాయకులతో జరిపిన చర్చ సారాంశం యేమటి ? ఆ నాయకులు గూడా ఈ సాయంకాలం రేడియో ద్వారా మాట్లాడనున్నారు, కదూ ! వాళ్లలో వాళ్లు యెలాంటి తీర్మానాలకు తీర్పులకు వచ్చారో యేమో !

లాలా కాన్షీరామ్ వార్తాపత్రిక మళ్లీ చూడసాగాడు. అవును అందరూ వున్నారు , నెహ్రూ, జిన్నా, బల్‌దేవ్ సింగ్ - ఒకరి తర్వాత మరొకరు మాట్లాడుతారు వైశ్రాయి ప్రసంగం అవడంతోనే. నలభైకోట్ల జనం భవిష్యత్తును నిర్ధారించటానికి వాళ్లు ఎలాంటి నిర్ణయాలు తీసుకుంటారో ? పాకిస్తాన్

గురించి ఏమనుకున్నారో ! బెంగాల్, పంజాబ్ యేమయిపోతాయో ! అదే అతని దిగులుకు మూలకారణం , చింతకు హేతువు.

'పాకిస్తాన్ నిర్మాణం అయిందంటే మనం అంతా ఈ దేశం వదలి వెళ్లిపోవాలి, అదీ ముసల్మానులు మనకు యింకా బతకనిస్తే!'

'అంటే .. మారణ హోమాలు జరుగుతాయా ?'

'ముసల్మానుల్ని యెరుగుదువు కదా ! కొన్ని నెలలుగా యీ రక్తపాతం సాగుతూనే వుంది! వాళ్లు అధికారంలోకి వచ్చారంటే యింక వేరే చెప్పాలా ?'

ప్రభారాణి భర్తకంటే ఎక్కువ తాలిమి చూపుతూ అంది ; 'చూడండి. మీకు అంతా విధి నిర్ణయం ప్రకారమే జరుగుతుందని తెలుసు గదా ! ఏం జరగాలో అదే జరుగుతుంది. భగవంతుడి మీద భారం వేయండి. మనస్సుకు బెంగ యివ్వకండి.'

అతను యజమాని, తెలివైన వాడూను అయినా యిలాంటి కష్ట సమయంలో ఆమె పైచేయి అయి అతనికి ఊరట, ధైర్యం చెప్పవలసి వుంది అతను అమిత అవిశ్రాంతంగా వున్నాడు. ప్రతి దానికీ వెంట వెంటనే సమాధానాలు కావాలంటాడు. అతి త్వరగా విసిగిపోతాడు, అలసిపోతాడు. ఆమె దేశమాత బిడ్డ. ధైర్యం, సాహసంతో పాటు అంతా లయబద్ధంగా జరుగుతుందన్న విశ్వాసం వున్న మనిషి. ఆమె భయాలు ఆమెకు ఉండనే వున్నాయి. ఇప్పుడు ఇద్దరూ పెద్దవాళ్లు అయినారు. తీరికూర్చుని పిచ్చా పాటి మాట్లాడుకోవాలి. మధుబాలకు పెళ్లయిపోయింది. అరుణ్ ఉద్యోగానికి తయారవుతూన్నాడు. తమ స్థితి ఎంతో మెరుగ్గా వుంది. స్థలం కొనుక్కున్నారు, నేడో రేపో యిల్లు కట్టుకోవాలనుకుంటూన్నారు. ఈ భద్రతా కుహ్వారం నుంచి యిప్పుడు బయటకు తోసి - స్వాతంత్ర్యం పేరిట పెనుబాధలలో పడవేస్తామంటే యింకేం దారి ?' అయినా... తను ఆయన విషయం ప్రత్యేకంగా గమనించి వుండాలి.

'సరే, వార్తాపత్రిక చదివింది చాలు. ఇక దుకాణానికి వెళ్లండి' అంది ఆమె అతి మామూలుగా కొడుకుతో మాట్లాడుతున్నట్లు

పై మీది శాలువ సవరించింది చెప్పులు వేసుకోవటానికి సహాయపడింది. పెద్దగదిలోకి వెళ్లి ఆయన చేతికర్ర టోపీ తీసుకువచ్చి అందించింది ·ముందు ఆయన టోపీ తలకు సరీగ్గా అమర్చుకున్నాడు, గోడకున్న అద్దంలో చూచుకుంటూ, తరువాత చేతికర్ర అందుకున్నాడు.

తరువాత ఆమె అంది 'బయట చాలా ఎండగా వుంది చేతికర్ర కంటె గొడుగు తీసుకు వెళ్లడం మంచిదనుకుంటాను ' ఆయన చేతిని మృదువుగా తడుతూ చేతి కర్ర వెనక్కుతీసుకుని పెద్దగది లోనికి వెళ్లింది. నల్లటి పెద్ద గొడుగు తీసుకు వచ్చింది.

'ఎక్కువగా ఆలోచించకండి. ఇంటికి త్వరగా వచ్చేయండి' అంది అతను వెళ్లుతూ వున్నప్పుడు.

'రేడియో ప్రసంగం వినాలి కదూ ! తప్పని సరిగా పెందరాళే యింటికి వచ్చేస్తాను' - అన్నాడు లాలా కాన్షీరామ్.

# రెండవ అధ్యాయం

వంటపని దాదాపు పూర్తి అయింది ప్రభారాణికి. ఇంకా చాలా సమయం వుంది. అయినా బ్రాడ్‌కాస్ట్ వచ్చేది ఏడుగంటలకు. లాలా కాన్షీరామ్ యింటికి వచ్చేసరికి పనిపూర్త చేసుకుని వుండాలని ఆమె అభిలాష.

ఆ సాయంత్రం చాల వేడిగా ఉక్కగా వుంది. చెమటలు కారిపోతూ వంటగదిలోనే కూర్చుని వుండి తువాలుతో ముఖం తుడుచుకుంటుంది ఆమె. పెద్దగిన్నె మూత తీసి అన్నం ఉడికిందో లేదో చూస్తోంది. చిన్న గిన్నె తీసి గోరుచిక్కుడు కాయ ముక్కలు తగినంతగా మెత్తబడినాయోలేదో పరిశీలిస్తోంది. వంట, వస్తువులు సున్నితంగా తనకు తగినట్లుగా లేకపోతే లాలా కాన్షీరామ్ మందలిస్తాడు. ముక్కలు మరీ కొరుకుడు పడకపోతే అతని పళ్లు నెప్పులు పెడతాయి. ఒకమారు అతనికి చిరాకు కలిగిందటే మళ్లీ మామూలు స్థాయికి రావటానికి చాలా సమయం పడుతుంది.

గోరు చిక్కుడు కాయ ముక్కలు బాగా మెత్తబడినాయని నిర్ధారణ చేసుకున్నాక ఆమె ఆ గిన్నె తీసి పక్కకు పెట్టింది. ఇప్పుడింక చపాతీలు వొత్తడానికి ప్రారంభించింది.

పక్క వంట గదిలో ఈషర్ కేర్ పనిపాటలు చేసుకుంటూవున్న సవ్వడి వినవస్తోంది.

'ఏమమ్మా, ఈషర్ కేర్. ఏం ఏం వంటలు తయారు చేస్తున్నావు ?' అని అరిచింది ప్రభారాణి.

'పెద్దగా యేం లేదు, పిన్నీ. కూర ముక్కలు వేయిస్తున్నాను' అని సమాధారం చెప్పింది ఆమె.

ప్రభారాణికి ఆయింటి క్లుప్తతకు నిజంగా అసూయ అనిపిస్తుంది. వంకాయ కూర చేసినా తడుముకోకుండా సంతృప్తి పడతారు ఆ యింటివాళ్లు.

'నువ్వు చాల అదృష్టవంతురాలివి, ఈషర్ కూర్.. . మీ బాబాయి గారికి అన్నీ సుష్టుగా వుంటే గాని ముద్దదిగదు. అన్నం తప్పనిసరిగా వుండాలంటారు తీపి పదార్థం యేదో చేయక తప్పదు' నిజానికి ప్రభారాణి మనసులో సంతోషమే, ప్రతిపూటా యివన్నీ చేసి పెట్టటానికి

'అవునవును. బాబాయి గారు అంతే !' అంది ఈషర్ ఆమె నవ్వులు సరిహద్దుగోడ దాటి యివతలకు వచ్చాయి.

ప్రభారాణి కూడా నవ్వింది ఇంకా గదిలో గిన్నెలు చప్పుళ్లు చేస్తూనే వున్నాయి.

వాళ్లిద్దరికీ వయసులో ఓ పాతిక సంవత్సరాల తేడా వుంటుంది. ఈషర్ కేర్‌కు ప్రభారాణి కూతురుకు వుండాల్సిన వయస్సు, అంతే. అందుకనే ఆమె యెప్పుడూ ప్రభారాణిని 'పిన్నీ' అని లాలా కాన్షీరాంను 'బాబాయి గారు' అనీ సంబోధిస్తుంది. ఈ రెండు కుటుంబాలు చాల యేళ్లుగా యీ యింట నివసిస్తున్నాయి. ఆ పిల్ల పెరిగి పెద్దదయింది యిక్కడే. ఆ అమ్మాయి పెళ్లి జరిగింది యిక్కడే , అల్లుడు వచ్చి కాపురం చేస్తున్నదీ యిక్కడే. ఆమె చిన్న బిడ్డగా వున్నప్పుడే తల్లిని కోల్పోయింది. తాతగారు మాత్రం యింకా బతికేవున్నాడు. ఎనభై యేళ్లవాడయినా యింకా విల్లులా నిటారుగా నిలుస్తాడు ఆడవాళ్ల కబుర్లంటే కళ్లల్లో ఉత్సాహం నింపుకుని అలకిస్తాడు, చెబుతాడు. ఆమె తండ్రి సర్దార్ తేజ్ సింగ్. తండ్రిలాగానే అందగాడు. అయితే అంత పొడగరి, దార్ఢ్యవంతుడూ కాదు. ఈషర్ వివాహం అయినప్పుడు, అల్లుడు సర్దార్ నిరంజన్ సింగ్‌ను వచ్చి తమతోపాటే యిక్కడే వుండిపొమ్మని కోరారు. నిరంజన్ సింగ్ చిన్న చిన్న వ్యాపారంతో యిళ్లు తిరుగుతూ కాలక్షేపం చేస్తూవుంటాడు. అతనికో తోపుడు బండి వుంది దాంతోనే వస్తువులు మోసుకుపోతూ వుంటాడు అమ్మకానికి. భార్య యింటివాళ్లు ఎండించన పళ్ల వ్యాపారం చేస్తారు. నిరంజన్ ఈ ప్రతిపాదనకు ఎగరి గంతువేసి అంగీకరించాడు. ఆ ఇంట్లో కావలసింది ఆడ సహాయం.

ప్రభారాణి వంటగదిలో నుంచి యివతలకు వచ్చి పెరటివైపు వరండాలో నిలబడింది. ఈ వరండాకు ఒకవైపు లాలాకాన్షీరామ్, ఆయన భార్య, కొడుకు అరుణ్ వుండే మూడు గదులు వున్నాయి. మరో వైపు సర్దార్ల గదులు

వీళ్లయింటి కంటె సర్దార్ల యిల్లు ఒక గదిపెట్టు తక్కువ. అంతే కాదు, యింటిలో వస్తువులు కూడా తక్కువే. అయినా రెండు కుటుంబాలకు ఆత్మీయత యేర్పడడంలో యిదేమీ వ్యత్యాసం యేర్పరచలేదు. దాదాపు ప్రతిరోజూ లాలా కాన్షీరామ్, ఈషర్‌ను 'కులాసాగా వున్నావా, అమ్మా ? అంతా బాగా వుందా ?' అని విచారిస్తూ వుంటాడు. ప్రభారాణికి సంబంధించినంత వరకు, వయస్సులో చాలా తేడా వున్నప్పటికి, ఈషర్ ఆమెతో దాపరికం లేకుండా అన్ని సంగతులూ చెప్పకుంటూ వుంటుంది.

ప్రభారాణి వరండాలో నిలబడే, చిన్న విసనకర్రతో విసురుకుంటూ వుండింది. ఆ విసన కర్ర చాలా పాతబడిపోయి విచ్చిపోతూ వుంది. అయినా ప్రభారాణి పొదుపరితనంతో దానినే మరమ్మత్తు చేసి చుట్టూ గుడ్డపేలికలు కుట్టి పొధంగా వాడుకుంటూ వస్తోంది. ఆ మరమ్మత్తుల కోసం ఆమె ఎర్రటి అందమైన గుడ్డపేలిక వాడింది. దాని చివర రెండు పూల గుత్తలు కూడా అల్లంది. ఆ విసనకర్ర యిప్పుడు అందంగా హుందాగా కనిపిస్తూ వాడుకకు ఎంతో మన్నికగా తయారయింది ఆమె చేతులలో.

నిలుచున్న చోటునుంచి ఈషర్ కనిపించదు. కాని ఆమె కదలికలు మటుకు పొడగడతాయి. కింది వాటాలోంచి పొగ పైకి వస్తోంది అంటే ముకుంద తల్లి కూడా యిప్పుడు వంట పనిలోనే తీరుబాటు లేకుండా ఉన్నదన్నమాట. 'ముసలి వొగ్గు' అనుకుంది ప్రభారాణి మనసులోనే.

పైకి మాత్రం 'ఈషర్, మహమ్మదీయులకు స్వంత రాజ్యం పాకీస్తాన్ వచ్చేస్తుందంటావా ?' అంది.

'చెప్పడం కష్టం, పిన్నిగారూ ఆ దుర్మార్గులకు రాకూడదనే నా కోరిక-' అంది ఈషర్

'హత్యాకాండలు విపరీతంగా జరిగిపోతాయంటున్నారు మీ బాబాయిగారు -'

'మన తలరాత !'

ఈ సరికి ఈషర్ వంటపని ముగించుకుని, యివతలకు వచ్చింది. ఆమె చాలా అందమయిన మనిషి ఎరుపుచాయ, తెల్లటి శరీరం. ఇప్పుడే పొయ్యి దగ్గర్నుంచి వచ్చింది గనుక చెంపలు ఎర్రగా ఆపిల్ పండ్ల మాదిరి మెరుస్తూ వున్నాయి ప్రభారాణికి దగ్గరగా నిలుచుని చేతులకు అంటుకుని వున్న పిండి దులుపుకుంటూంది. ఎండాకాలపు సాయంకాలం గనుక యిద్దరూ తేలికపాటి దుస్తులే ధరించారు ప్రభారాణి చీర, జాకెట్ వేసుకుని వుంది. ఈషర్ మటుకు పొడగాటి షల్వార్, పైన ఓ పొట్టి చొక్కా వేసుకుంది. ఇక్కడెవరూ మగవాళ్ల లేరు గనుక వాళ్లు మేలి ముసుగు వేసుకోలేదు. ఈషర్ కేర్ దూపట్టా వేసుకోలేదు. ప్రభారాణి చీరకొంగు కిందకు వేలాడుతోంది పంజాబీ స్త్రీలకు సహజంగా వుండే ఆరోగ్య లావణ్యాలతో యిద్దరూ మెరిసిపోతూ వున్నారు. ప్రభారాణికి యాభైయేళ్లు దగ్గరపడుతూ వున్నా ఆమె చనుకట్టు మాత్రం ఈషర్‌కు మల్లేనే హుందాగా బిగిగా నిలిచివుంది. అయితే తేడా మటుకు వుండనే వుంది. ఈషర్ కోమలంగా సున్నితంగా వుంటుంది. ఆమె కళ్లు లాలిత్యంగా మిలమిలలాడుతూ వుంటాయి. ఆమె నడుము ప్రభారాణి నడుముతో పోలిస్తే సన్నగా చిన్నగా వుంటుంది. కానయితే శరీర దార్ఢ్యంలోను, మెడ - మోచేతులు - మణికట్టు - చేతివేళ్లు వీటి చురుకుదనంలో యిద్దరూ దాదాపు సమఉజ్జీలే. ప్రభారాణి మెడమీద ఒక ముడత గాని గీతగాని కనిపించదు. చేతి చర్మం నాజూగ్గా బలంగా వుంటుంది ; ఈషర్ మాదిరే వాళ్లు నవ్వినప్పుడు ప్రభారాణి కంఠధ్వని ఉంగరాలుగా ప్రసరిస్తుంది.

ప్రభారాణి ఈషర్ పొట్టవైపు చూచి, యిప్పటికి ఎన్నోనెలో మనసులోనే అంచనా వేసుకుంది. నాలుగో అయిదో అయివుంటుంది. ఇద్దరు ఆడవాళ్లు దాన్ని గురించి యెక్కువగా ప్రస్తావించుకోరు. అలా మాట్లాడుకుంటే ప్రసవ సమయంలో వేదన ఎక్కువవుతుంది. ప్రభారాణికి తేలిక పురుళ్లు రావటానికి

అదే కారణం. ఆమె కడుపుతో వున్న సంగతి భర్త నుంచి కూడా అతి జాగ్రత్తగా భద్రపరచి వుంచేది. అరుణ్ పుటుకలకు మాత్రం ఆ సంగతి యెలాగో బయటి పడిపోయింది, ఎవరో శాపం పెట్టనే పెట్టారు. కిందివాటాలో వున్న ముకుంద తల్లే కావచ్చు, యీ శాపం పెట్టింది. ప్రసవం చాల కష్టం అయిపోయింది గదూ అప్పుడు ! అలా ఈ పాఠం నేర్చుకుంది ప్రభారాణి ఆ నెప్పులకు చచ్చిన చావు అయింది , అరుణ్ గూడా అతలాకుతలం అయిపోయాడు

ప్రభారాణి అంచనా ప్రకారం ఈషర్ కులాసాగానే వుంది. పొట్ట యిప్పుడిప్పుడే కాస్త పైకి కనబడుతూ వుంది. చనుకట్టు కూడా కొద్దిగా పెరిగింది. ఇక మీదట ఆమె కాస్త భారీ చొక్కలే తొడుక్కోవలసి వుంటుంది. ప్రభారాణికి యేదో ముతక హాస్యం గుర్తువచ్చింది. ఈషర్‌తో చెబుదామను కుంది, కాని సంబాళించుకుంది. గర్భం వచ్చినప్పుడు పొట్ట పెరిగిపోతుంది. .. ఆకాశాన్ని అంటుతుందేమో అన్నంతగా. కాని శరీరంలో యింకో అవయవం మటుకు కుంచించుకు పోతుంది... నిరంజన్ సింగ్ యింకా ఆమెతో కామ కలాపం చేస్తూనే వున్నాడా ? లేక ఆమె భారీ శరీరాన్ని చూచి జంకుతున్నాడా? .... ఆమె మనసుకు యితర ఆలోచనలు వచ్చాయి. ప్రస్తావన మార్చింది.

'పనంతా అయినట్లేనా ?'

'ఆ'

'అయితే వంటగది, పడకగది శుభ్రం చేసుకో. రేడియో ప్రసారం వినాలిగదూ !'

'అలాగే, పిన్నగారూ !'

ఈషర్ కేర్ కూడా ఈ ప్రసంగ ప్రసారాన్ని గురించి తమ యింట్లో విన్నది. ఆ రోజు ప్రతి వీధిలోను, యింట్లోనూ యీ సమాచారమే ప్రముఖ వార్త అయిపోయింది. వాళ్లింకా అక్కడ నిలబడి వుండగానే అరుణ్ యింటికి వచ్చాడు. ప్రభారాణికి వాడు కింద సైకిల్ తాళం వేయడం చప్పుడు వినపడింది. వెంటనే మెట్లు ఎక్కి పైకి వచ్చేశాడు. రోజూ మాదిరి ఎక్కవ సేపు

టెన్నిస్ ఆడినట్లు లేదు, వళ్లు చెమట పట్టిలేదు. చేతిలో రాకెట్ ఊగించుకుంటునే ఆడవాళ్ల దగ్గరకు వచ్చాడు.

'అమ్మా! వాళ్లకు పాకిస్తాన్ వచ్చేట్లే వుంది!' అన్నాడు వాళ్లను చేరగానే, సాలోచనగా తల ఊగిస్తూ.

ఆడవాళ్లు యిద్దరి ముఖాలలోనూ భయవాతావరణం అలుముకుంది.

'ఎలా చెప్పగలుగుతున్నావు ?' అనడిగింది ప్రభారాణి.

'అందరూ అలా అనుకుంటున్నారు. ఇవాళ ఆటస్థలం దగ్గర యిదే ప్రస్తావన!'

అరుణ్ యిరవై యేళ్ల చిన్నారి కుర్రాడు ; (నిన్ననే పుట్టిన రోజు పండుగ చేసుకున్నాడు) సిగ్గరి. వెంట్రుకలు నుదుటి మీదికి పడుతూ వుంటాయి. చేత్తో జుట్టు వెనక్కు నెట్టుకున్నాడు. తల్లి కుర్రాడి ముఖంలోకి చూచింది. పాపం, కుర్రాడు చాలా కళవెళ పడిపోతున్నట్లున్నాడు.

'మునీర్‌ను కలుసుకున్నావా ?'

'ఆ-' అన్నాడు వాడు యింకా ఆలోచనలో కూరుకుపోయి వుండి.

'ఏమన్నాడు ?'

'ఈమారు కాంగ్రెస్ వొప్పుకుంటుందన్నాడు.'

ఆడవాళ్లు నిస్తబ్ధంగా వుండిపోయారు.

'ఇదంతా మోసం, అమ్మా , నమ్మకద్రోహం !'

నమ్మక ద్రోహం అంటే యేమిటో వాళ్లకు తెలియదు. అయినా వాడు చెబుతున్నది నిజమేనని తెలుసు.

'గదులు శుభ్రం చేస్తాను వెళ్లి -' అని పరుగు తీసింది ఈషర్. అరుణ్ రావడంతో వాతావరణం మారిపోయి, అప్పటి తక్షణావసరాలను గుర్తుకు తెచ్చింది. ప్రభారాణి కూడా వంటగది లోనికి నడిచింది.

ఆ సమయానికే లాలా కాన్షీరామ్ కూడా దుకాణం నుండి యింటికి వచ్చేశాడు. రోజంతా తనకు తానే యేదో భరోసా చెప్పుకుంటున్నాడు గనుక యిప్పుడు అంత చింతాక్రాంతుడయి లేడు. ఏమయినా అలా ఎందుకు జరుగుతుంది గనుక ? కాంగ్రెస్ ప్రజలకు వాగ్దానం చేసివున్నది, దానిని నిలబెట్టుకోవలసిన బాధ్యత వుంది ముప్ఫయి సంవత్సరాల నుంచి - గాంధీ రంగప్రవేశం చేసిన సమయం లగాయితు -- దేశం 'అవిభాజ్యం' అని నొక్కి చెప్తున్నారు కాంగ్రెస్ నాయకులు. గాంధీగారు కేవలం రాజకీయ నాయకుడు మటుకే కాదు, ఆయన ధర్మాత్ముడు, పుణ్యపురుషుడూను. ఆయనకో అంతర్వాణి వుంది - దానిని సంతృప్తి పరచడం సదా ధ్యేయం. దేశం విభజన అయిపోతూంటేనూ వేలాది జనం హతులయిపోతూంటేనూ ఈ అంతర్వాణి మిన్నకుండిపోతుందా ? పాకిస్తాన్ అంటూ యేర్పడడం తటస్థిస్తే యీ ఉపద్రవాలు తప్పవు. గాంధీ తెలియవయినవాడు. ఆయన ఇవన్నీ ఎరుగును. ఇలాంటి దారుణం జరగటానికి ఆయన అంగీకరించడు. మరేమీ ఉపాయం లేకపోతే, ఆయన యెప్పుడూ ప్రయోగించే 'అమరణ ఉపవాసం' ఉండనే వున్నది. లాలా కాన్షీరామ్ తోటి వ్యాపారస్థులందరూ గాంధీగారు యిలాంటిపనే చేస్తారని తీర్మానానికి వచ్చారు.

లాలా రాధేశ్యాం, కాన్షీరాం దుకాణానికి నాలుగు గడపల అవతల, దేవుళ్లు - దేవతల ఫోటోలు అమ్మే దుకాణం నడుపుతున్నాడు, సార్థక నామధేయుడిలా అతనన్నాడు 'లేదు, లేదు, మహాత్మాజీ అలాంటి పని ఎన్నటికీ జరగనివ్వరు.'

రాధేశ్యాంకు పళ్లన్నీ యెప్పుడో ఊడిపోయినాయి. బోసినోటితో అతని ముఖం గుంటపడిపోయినట్లు వుండడమే కాక మాట్లాడుతున్నప్పుడు తోలు తిత్తిలోంచి 'తుస్సు' శబ్దం విధిగా వినబడుతూ వుంటుంది. ముక్కు రంధ్రాల కింద లోపలకు పోయిన నోరు - చూచే వాళ్లకు తమాషాగా కనిపిస్తూ వుంటుంది. అతని ముక్కు నిటారుగా ఎత్తుగా వుంటుంది. నుదుటి మీద చందనం బొట్లు పెట్టుకుంటాడు, తన మతం యేదో స్పష్టంగా తెలుపుతూ, ఈ

బొట్టు చివరనుంచి ముక్కు ప్రారంభం అవుతుంది. కాని ముక్కుదూలంమటుకు మధ్యలోనే చితికిపోయింది. నాసికా రంధ్రాల దగ్గరకు వచ్చేటప్పటికి ముక్కుదూలం వున్నట్లే అనిపించదు. కంద బోసినోరు సరే సరి ! ఎవరో పగబట్టి ఇనుప సుత్తెతో కొట్టినట్లు అనిపిస్తుంది నోటిగుంట చూస్తే. రాధేశ్యాం ముఖంలో యీ ప్రత్యేకతే చెప్పుకోదగ్గది. హృదయాన్ని గురించి ఎవరూ యేమీ అనరు. ఇతరులతో తగాదా వచ్చినప్పుడు - అటువంటి సందర్భాలు అనేకం - ప్రతివాళ్లూ అతని నోటినే దుయ్యబడతారు, నిందిస్తారు 'నీ నోట దుమ్ముపడ...' అలా అని. మరోరకమైన నిందావాక్యం వాళ్ల నోటి వెంటరాదు తల్లినీ, అక్కలనీ ఎవరూ ప్రస్తావనకు తీసుకురారు. మరేదో జటిలమైన తిట్టు జోలికి పోరు. నోటిలో దుమ్ముపడ - నీ నోరు యింకేదో అయిపోను -- యిలాంటివే. వాళ్లకు బహుశ అతని నోటిని చూచినప్పుడు లైంగిక చిహ్నమే గుర్తుకు వస్తుంది కావును ! ఒక ఖాతాదారు అయితే ఒక మారు 'అది నోరా? లేకపోతే యింకేదన్నా....' అని స్త్రీ జననేంద్రియ ప్రసక్తి తీసుకువచ్చాడు.

సరే, ఏమయితే నేం - రాధేశ్యాం మటుకు మనిషిగా బహుమంచివాడు, దయార్ద్రుడు. పళ్లు చిన్న వయసులోనే ఊడిపోయినాయంటే ఆ తప్పు అతనిది కాదు, అతడిని పుట్టించిన బ్రహ్మ దేవుడిది. అతన్ని యితరులు దోషారోపణ చేసి నిందిస్తున్నారంటే, ఆ తప్పు కూడా బ్రహ్మదేవుడిదే గాని మరెవ్వరిదీ కాదు ఆ తోలుతిత్తి లోంచి మాటల తొస్సి త్వరత్వరగా బయటపడిపోతుంది మాటకంటే ముందు, నోటిలో నిండిన గాలి బయటకు దూకుతుంది.

అతను తల ఎగరేస్తూ నోరు యధాప్రకారం ఆడిస్తూ 'ఉహు మహాత్మజీ అలా ఎన్నటినీ జరగనివ్వడు,' అన్నాడు

లాలా బనార్సీదాస్ మటుకు 'అవును. ఇంగ్లీషు వాళ్లకు ఆయనంటే భయం కూడాను -' అన్నాడు. బనార్సీదాస్ ఆ వరసలోనే దుకాణదారు. ఆయనది ధాన్యపు వర్తకం.

లాలా షంషేర్ బహద్దర్ 'బాపూకు గొప్పశక్తి వుంది. అది అనంతమైన ఆత్మశక్తి అది యితరులకు సాధ్యం కానిది -' అన్నాడు. అతని పేరు

గంభీరమయినదే గాని, మూర్తిమాత్రం చిన్నది. తలపాగా చుడతాడు. మూల బజారులో పచారీ దుకాణం మటుకే వుంది

ఇంకా కొంతమంది యిటువంటి అభిప్రాయాలే వెలిబుచ్చారు. అయితే యిది కేవలం మాటల వల్ల తేలే వ్యవహారం కాదు. ఎవరికీ ఉత్తుత్తి కబుర్లతో కడుపు నిండడం లేదు. ఏదో విచిత్రం జరగాలి. చేతిలో కత్తి కదిలిస్తూ యేదో ఆశ్చర్యం, సాహసం అనిపించే మాటలు చెబితే ఎవరన్నా, జనం వాళ్ల మాటలు చక్కగా ఆలకిస్తారు.

ఈ సమావేశం లాలా కాన్షీరామ్ దుకాణంలో జరిగింది. 'మహాత్ముడే మనను కాఫాడుతాడు,' అన్నాడు అతను.

ఈ మాటతో అక్కడ చేరిన దుకాణదారులంతా తృప్తిపడి ఎవరి దుకాణాలకు వాళ్లు మరలారు. అందరికీ యిక ఆ రోజు సాయంకాలం వైశ్రాయిగారు యేదో కొత్త విషయం చెప్పబోతున్నారన్న ఆసక్తి లేకుండా పోయింది. బ్రిటిష్ వాళ్లు మొదటి నుంచీ 'అఖండ భారత్' అనే పాట పాడుతున్నారు. ఇప్పుడు వాళ్లు మాట మార్చవలసిన అవసరం లేదు. ప్రత్యేకంగా నిరాశపడవలసింది మరేం లేదు.

సమావేశం జరుగుతున్నంత సేపూ దుకాణదారులంతా ఉత్తేజంగా కులాసాగా వున్నారు. హాయిగా కరువు తీర మాట్లాడుకున్నారు. లాలా కాన్షీరామ్ దుకాణానికి ఎదురుగుండా - అదే రోడ్డు మీద - దుకాణం నడుపుతున్న ముసల్మాను మాత్రం వాళ్లవంక ఆక్షేపణగా అసహ్యంగా చూస్తూ వుండిపోయాడు. పాకిస్తాన్ వచ్చి తీరుతుందని అతనికి దృఢ విశ్వాసం. తాను తయారు చేస్తున్న హుక్కా గొట్టానికి బంగారు పోగులు చుడుతూ రికామీగా కూర్చున్నాడు. అతని పక్కన ఒక చిన్న పొయ్యి మండుతూవుంది. వెదురుగొట్టాలు హుక్కా పీకలుగా తయారవటానికి సిద్ధపడుతూ వున్నాయి. 109 లేక 110 వుంటుంది ఉష్ణోగ్రత. ఆ ముసల్మాను దుకాణాదారు తనకు ఈ గందరగోళం యేమీ పట్టదన్నట్లుగా తన వ్యాపారం పని చేసుకుంటూ ఆనందిస్తున్నాడు. మానసికంగా అతను ప్రాఫెట్ మహమ్మద్ నుంచి ఊడిపడ్డానని అనుకుంటాడు

కానయితే నిజానికి ముసల్మాన్ పాదచార సైనికులకు, హిందు కడజాతి స్త్రీలకు జరిగిన సంయోగంలో పుట్టుకు వచ్చిన వారే అతని పూర్వీకులందరూ.

వెదురు గొట్టం తగుమాత్రం వేడి అయినాక దానిని పొయ్యిమీద నుంచి చాకచక్యంగా తీసి 'V' ఆకారంగా మలుస్తాడు. రెండు కొనలు సమరేఖలో వుండేట్లు జాగ్రత్త పడతాడు. తతిమ్మా పని అంతా తేలికే. రకరకాల దారాల బంతులు, కొనలు అతని పక్కన వేలాడుతూ వున్నాయి అతను కూర్చున్న చాప పక్కన ఒక బీరువా లాంటిది యేర్పాటు చేసుకుని, దాన్లోంచి ఈ కొనలు వేలాడుతూ చేతికి అందుబాటులో ఉండేట్లు యేర్పరచుకున్నాడు. అరుణ్ చిన్నవాడుగా వున్నప్పుడు తండ్రిగారి దుకాణానికి వెళ్లి కూర్చుని, ఎదురు దుకాణంలో అబ్దుల్ ఘని ఎలా లాఘవంగా పనిచేస్తున్నాడో గమనిస్తూ వుండేవాడు. అతను చేతులతోనే కాదు, కాళ్లతోనూ పనిచేసేవాడు. ఒక్కోమారు మూడు చేతులతో మూడు కాళ్లతో పనిచేసే వాడు. ఏమంటే అతను పనిముట్లను అంత చాకచక్యంగా దగ్గరగా సులువుగా అమర్చుకునేవాడు. వెదురుగొట్టం 'వి' ఆకారంలో చక్కగా అమరినాక అతని డజన్ల కొద్దీ చేతులు, కాళ్లు చకచకపనిలో మునిగిపోయేవి. బంగారు రంగు నీలి రంగు, పచ్చరంగు దారాలు ఆ గొట్టం మీద అందంగా పరుచుకునేవి గొట్టం పూర్తిగా ఈ రంగు దారాలతో బిగింపు అయిన తర్వాత, ఓ పొడగాటి గొట్టాన్ని ఒక పక్క రంధ్రంలో అమర్చి దాన్ని 'సీలు' చేసినట్లుగా కూర్చేవాడు. తరువాత దాన్ని ఓ లోహపు గిన్నెలో పడవేసేవాడు. ఈ లోహపు గిన్నెలు అతను తయారు చేసినవి కాదు. ఊళ్లో యేదో హోల్‌సేల్ దుకాణంలో కొనుక్కువచ్చేవాడు. అయినా వాటి పనితనంలోని చాకచక్యం అంతా తనదే అయినట్లు తన దుకాణం ముందుగా అందరి చూపులు పడేట్లుగా ప్రదర్శించేవాడు.

అబ్దుల్ ఘని దుకాణం పక్కనే తాగేనీళ్ల కొలాయి వుంది. అది అందరు జనం ఉపయోగం కోసమే. ఉదయం పూటలు లారీ డ్రైవర్లు, స్థిరమైన నివాసాలు లేని వాళ్లు యీ కొళాయి దగ్గరకే వచ్చి స్నానాదికాలు తీర్చుకుంటారు. తరువాత, అప్పటి వరకు వీధులు ఊడ్చినవాళ్లు వచ్చి తమ వంతు స్నానాధులు

చేస్తారు ఆపైన రోడ్ల మీద నీళ్లు చిలకరించే వాళ్లు తమ తోలు తిత్తులు తీసుకువచ్చి కొళాయి కింద పెడతారు. ఈ తిత్తులు నిండేంతవరకు వాళ్లు సాయిలా పాయిలాగా కబుర్లు చెప్పుకుంటూ నించుంటారు నిండడంతోటే, ఆ తిత్తిని వీపుకు కట్టుకుని వీధుల్లో చల్లే పనికి వెళ్లిపోతారు. వాళ్లవంతూ అయిన పిదప, యిళ్లల్లో నీళ్ల కొళాయిలు లేని ఆడవాళ్లు బిందెలు, కడవలు తీసుకువస్తారు. వాళ్లపని పూర్తయే వరకు వంటిమీద వస్తువుల నిగనిగలు నీళ్ల వెలుగుల్లో ప్రదర్శిస్తూ రకరకాల కబుర్లు చెప్పుకుంటారు

దుకాణాలు, గిడ్డంగులు తలుపులు తెరవటానికి చాలా ముందుగానే ఈ సంరంభం అంతా అయిపోతుంది తతిమ్మా సమయం అంతా కుళాయి, దాని చుట్టు చెరువు, ఫౌంటెన్ నిర్మానుష్యం అయిపోతాయి దుకాణంలో పనిచేసే కుర్రాళ్లు మాత్రం అడప దడప వచ్చి నీళ్లు గ్లాసుల్లో నింపుకుపోతూ వుంటారు వెండి కూజాలతో నీళ్లు పట్టుకుపోయి - ఎండను కూడా భరిస్తూ- నిమ్మరసం, పంచదార, మంచుగడ్డలు జోడించి తమ యజమానులకు షర్బత్ తయారుచేసి యిస్తారు - పని కుర్రాళ్లు మధ్యాహ్నం చాలా సేపటి వరకు ఎవరూ కుళాయిజోలికి వెళ్లరు. సాయంత్రంమటుకు - ఉదయపు వరుసక్రమానికి తలక్రిందులుగా - వాళ్లందరూ వచ్చేస్తారు ; వీధులు శుభ్రం చేసేవాళ్లు, స్నానాలు చేయాల్సిన వాళ్లు, యిల్లాళ్లూ.. యిలా.

మధ్యాహ్నం పూట - ఎలాంటి సంరంభమూ లేనప్పుడు అరుణ్ మటుకు కొళాయి దగ్గరకు వచ్చి కొన్ని నిమిషాలు వుండి వెడతాడు. ఏదో ఒక మిష మీద తప్పని సరిగా వచ్చేది అతనొక్కడే. కొళాయి దగ్గరకు వెళ్లటానికి యేదో ఒక మిష వెదుకుతాడు. నాన్నా, నీళ్లు కావాలా ? నాన్నా, ఇన్‌స్పెక్టర్ గారికి నిమ్మషర్‌బత్ చేసి యివ్వవద్దూ (అప్పుడే ఇన్‌స్పెక్టర్ దుకాణంలోనికి వస్తూ వుంటాడు), నాన్నా మజ్జిగ దాహం తీసుకునే సమయం అయింది. (మధ్యాహ్నం మూడు గంటల వేళ). నాన్నా, నేను వెళ్లి చేతిరమాలు తడుపుకు వచ్చి ముఖం మీద వేసుకుంటాను, ఈ వేడి భరించలేకుండా వున్నాను. అతనికి ఈ విలాసం ఆదివారం నాడు, యితర స్కూలు సెలవు దినాలలో మటుకే లభ్యం అవుతుంది. అందుచేత అటువంటి సమయాలను

సువినియోగం చేసుకొంటాడు. బడి వున్న రోజులలో లాలా కాన్షీరామ్ అతడిని దుకాణం చాయలకు రానివ్వడు, సాయంత్రం పూట తనకు పాలు తెచ్చి యివ్వటానికి తప్ప. (ఉదయం మోస్తరుగానే సాయంత్రం కూడా బాదం పప్పులు, మీగడ నింపుకుని పాలుతాగుతాడు అతను). అప్పటికి వీధులలో నీళ్లు చిమ్మేవాళ్లు కొళాయి దగ్గర గుంపులుగా చేరుకుని వుంటారు. ఉత్తమమైన సమయం యేదంటే - మధ్యాహ్నామే అప్పటికి అందరూ ఎండకు నిస్త్రాణ అయిపోయి అలిసిసొలసి పడుకుని వుండిపోతారు. బయటకు రావటానికే భయపడతారు. సెలవు రోజులలో మధ్యాహ్నం పూటలు దుకాణం దగ్గరకు చేరి దానికి అతుక్కుపోవాలని చూస్తాడు. నీళ్లు తాగటానికీ, నిమ్మరసం తయారుచేయటానికీ కాదు , ఆ పనులూ శ్రద్ధగానే చేస్తాడు -అవసరం అయినప్పుడు. అతకంటె ముఖ్యంగా ఘని మామ చేస్తున్న పనిని గమనించడం అతని ఉద్దేశ్యం. బొత్తుగా మూడు నాలుగు సంవత్సరాలుగా యిదే వ్యసనం అయిపోయింది. ఘనిమామ కూడా అరుణ్‌ను సాదరంగా పలుకరిస్తూ వుంటాడు. ఈ మాటలు విన్నప్పుడు అరుణ్‌కు తాను ఆకస్మాత్తుగా పెద్దవాడు అయినట్లు అనిపిస్తుంది. ఘనికి డబ్బు కావలసి వచ్చినప్పుడు - అతనికి అవసరం లేనిది ఎప్పుడు గనుక ? - తన తండ్రి లాలా కాన్షీరామ్ దగ్గరకు తప్ప యింకెక్కడికి పోగలడు ? 'లాలా కాన్షీరామ్, ఈ రాత్రికి ఓ రెండు రూపాయిలు అప్పు యివ్వగలరా ?' 'ఓ అలాగే తప్పకుండా !' ఇద్దరూ చిరుమందహాసం చేస్తూ వుంటారు, మాట్లాడుకునేటప్పుడు.

అదృష్టవశాత్తు ఘని అడిగే డబ్బు ఎప్పుడూ అతి స్వల్పంగానే వుంటుంది అంతేకాదు, అతనా డబ్బును శీఘ్రంగానే తిరిగి యిచ్చివేస్తాడు మరునాడు ఉదయమో, వీలయితే యిదే సాయంకాలమో యిచ్చేవాడు. దానితో లాలా కాన్షీరామ్‌కు తన దానగుణం మీద మక్కువ ఎక్కువవుతూ వుండేది. అలా యిద్దరి మధ్య సమరస వాతావరణం యేర్పడుతూ యెదుగుతూ వుండేది ఘని మహమ్మదీయుడని, లాలా కాన్షీరామ్ ఉన్నత హిందూ కులస్థుడనీ భేద భావం యిద్దరి మనస్సులలోనూ అంకురించేది కాదు. ఇద్దరి బాష ఒకటి.

వేషం - దుస్తులు - కూడా దాదాపు ఒకటి గానే వుండేవి. ఎండకూ వానకూ వాళ్లిద్దరూ ఒకే మోస్తరుగా స్పందించేవాళ్లు ఇద్దరి భగవంతుళ్లూ వేరు వేరు అయితే అది కేవలం వ్యక్తిగతమయిన విషయం ఎవరి యింటికి వారికే పరిమితం అయిన సమాచారం మొహరం సమయంలో మటుకు ఘని తన మత ఆవేశాన్ని ప్రదర్శిస్తూ వుండేవాడు, వీధి ఊరేగింపులలో కలసిపోతూ వుండేవాడు హోలీ పండుగ సందర్భంలో లాలా కాన్షీరామ్‌కూడా యితర హిందువులతో కలసి ఉల్లాసంగా రహదారుల్లో తిరుగుతూ వుండేవాడు కాదూ! ఊహు, మహమ్మదీయులు - హిందువులు అనే వ్యత్యాసం లేదు యిద్దరి మధ్య. తామిద్దరూ 'పంజాబీలు' అనుకునేవాడు లాలా కాన్షీరామ్ -- ఆ రోజు వరకు యిదే మనఃస్థితి.

అరుణ్ దోసిళ్లతో నీళ్లు తాగుతూ కొళాయి దగ్గర వున్నాడు. తరువాత యేకంగా తల కొళాయి కిందకు చేర్చాడు, ఆ భంగిమలో అయితే ఘనిని పరిశీలించటానికి ఎక్కువ వీలుగా వుంటుంది గనుక. ఘనికి అతను అక్కడ వున్నాడని తెలుసు. 'రా అరుణ్ ఒక మారు హుక్కా పీలుద్దువుగాని రా' అని పిలుస్తాడు. అలా పిలుస్తూనే చిలుము పట్టిపోయి అసహ్యంగా వున్న తన హుక్కా గొట్టంలోనించి గుండె నిండుగా పొగపీలుస్తాడు, చప్పుడు చేస్తూ. అబ్దుల్ ఘనికి బాగా తెలుసును, అరుణ్ యింటిలో ఎవరూ హుక్కా పీల్చరని.

'ఘని మామా, నీచుట్టూ యిన్ని అందైమన హుక్కా గొట్టాలు వుండగా నువ్వు యీ పాతదీ మురికిదీ ఉపయోగిస్తావెందుకు ?' అనడగుతాడు అరుణ్.

అరుణ్ యిప్పుడు ఘని పక్కన చాప మీద కూర్చుని వుంటాడు. ఈ ప్రశ్నతో అబ్దుల్ ఘని అంచెలంచెలుగా నవ్వడం ఆరంభిస్తాడు. ఆ నవ్వు మధ్య మధ్యలో దగ్గుగా రూపాంతరం పొందుతుంది. కళ్లవెంట నీళ్లు కూడా వసాయి.

ఈ విడత నుంచి తప్పించుకుని తాపీగా మరోమారు హుక్కా పీల్చిన తరువాత, గొట్టంలోనుంచి పొగదట్టంగా వస్తూ వున్నప్పుడు ఘని అరిచి చెప్పేవాడు. 'విన్నావా, లాలాకాన్షీరామ్, మీ అబ్బాయి యేం అంటున్నాడో నీకు వినిపిస్తోందా లేదా ?'

లాలా కాన్షీరామ్ తన పనిలో కూరుకుపోయి వుండి జవాబు చెప్పే తీరుబడి లేకుండా వుండేవాడు

'ఈ అందమైన హుక్కా గొట్టాలు నేను ఉపయోగించడం అంటూ జరిగితే, యింక నాకు సంపాదన యేం వుంది ? జీవనోపాధి యేమవుతుంది?' అంటూ ఘని జవాబు చెప్పి అరుణ్ తలమీద ఒక మొట్టికాయ వేసేవాడు. అయినా అరుణ్‌కు ఆ సమాధానం తార్కికంగా అనిపించేది కాదు.

అతను తయారు చేస్తున్న హుక్కా గొట్టం దాదాపుగా పూర్తి అయిపోతూ వుండేది అప్పుడు. రెండు చివరలూ మలిచి లోహపు గొట్టంలో అమర్చేవాడు. మట్టితో చేసిన శుభ్రమైన చిలుము తగిలించేవాడు. కొయ్యబల్లమీద కొత్త హుక్కా గొట్టాన్ని ప్రదర్శనకు గాను అమర్చేవాడు. హుక్కా గొట్టం తయారీలో అరుణ్‌కు అమితంగా ఆకట్టుకునేది యేమిటంటే - ఒక భాగంలో మరో భాగం అమర్చే విధానం. నిజానికి మట్టి గొట్టంలోనుంచే పొగాకును పీల్చవచ్చు. హుక్కా గొట్టంలో వున్న హుందాతనమే వేరు ! గొట్టంలో వున్న మరో సౌకర్యం యేమంటే, పీలుస్తున్న పొగ లోపలి బాగాలలో శుభ్రపడి చల్లబడి నిదానంగా మనిషి గొంతుకు చేరుతుంది. అరుణ్ తండ్రి హుక్కా పీల్చేవాడు కాదు. కాని తమ పల్లెటూరులో అతని పినతండ్రులందరూ హుక్కా గొట్టం ఉపయోగించడం అరుణ్ ఎరుగును. నోటిలో పైపు గొట్టంతో దివానా దిండ్ల మీద ఒరిగిపోయి వాళ్లు ఆనందంగా వున్నట్లు ముఖం చూస్తే చాలు స్పష్టంగా తెలుస్తుంది. ఆ సమయంలో వాళ్ల ముఖాలు అంత వికసించి వుంటాయి. పల్లెటూళ్లో పిన తండ్రులయితేనేమి, యిక్కడ ఘని మామ అయితే నేమి - అటువంటి విలాసం, ప్రశాంతత రోజులో ఎన్నోమార్లు అనుభవిస్తూ వుండేవాళ్లు. అరుణ్ మనుసులో అంచనాలు వేసుకుంటూ వుండేవాడు, నేను పెద్దవాడిని అయిన తరువాత హుక్కా తాగడం నేర్చుకుని తీరుతాను - అని. మట్టి గొట్టంలో పొగాకు తుంపులు వేయడం, పొగాకు నిప్పు అంటించడం, ఆ 'తయ్యారీ'లోనే ఎంతో మజా వుంది. అంతా సజావుగా చేసుకోవడంలోనే మజావుంది. అబ్దుల్ ఘని మామ చేసే పద్ధతిని పట్టుకోవాలి. తన పని పూర్తి అయింతర్వాత, తాపీగా

కూర్చుని గొట్టం నింపుకుని ఆ సరంజామా అంతా సమకూర్చుకుంటూ ఎంతో ఆనందిస్తాడు.

ఇంతకూ ఆ రోజులన్నీ గడిచిపోయాయి. ఇప్పుడు ఘని హిందువులతో యేమాత్రం సఖ్యంగా లేడు వాళ్లతో పోల్చిచూచుకుంటే అతనిది బహు చిన్న వ్యాపారం. అసలు వ్యాపారం అనడానికే వీలులేదు ఏదో జీవనోపాధి కోసం చేసుకునే పని - పాట ! రోజూ అంతా శ్రమపడితే కొన్ని హుక్కా గొట్టాలు తయారవుతాయి. సాయంత్రానికి వాటిని అమ్మేసుకునేవాడు. తన సరంజామా అంతా ఒక సంచిలో భద్రపరుచుకుని గోడకు ఉన్న బీరువాలో కూర్చేవాడు. ఈ బీరువాలో వున్న వస్తువులే అతని ఆస్తి. అయినా అతన్ని యిరుగు పొరుగు వారు తమతో సమఉజ్జీ అయిన మనిషిగా వ్యవహరించేవాళ్లు. అందరూ శాంతియుతంగా మసులుకొనే వాళ్లు. ముస్లిం లీగ్ పార్టీ వల్ల, ఈ హిందూ సామ్రాజ్యంలో తన అస్థిత్వానికి ఎలాంటి ఆపద వస్తుందో అతనికి బాగా తెలిసి వచ్చింది. ఇది అతని వ్యక్తిగత అభిప్రాయం కాదు, పార్టీ నూరిపోసిన బోధ. ముస్లిం లీగ్ వారికి తెలుసు - జిన్నాకు బాగా తెలుసును ! వాళ్లు చెప్పిన మాటల సారాంశం : నీ హిందూ పొరుగు వారిని సంశయంతో అపనమ్మకంతో మటుకే. చూడు - అని. ఘని ఆపనే చేస్తున్నాడు. 'పాకిస్తాన్' రాజ్యం యేర్పడాలని వాళ్లు అభిలాషించారు. అతనూ దాని కోసమే అర్రులు చాచి అరుస్తున్నాడు.

లాలా కాన్షీరామ్ దుకాణంలోవ్యాపారస్థులయిన మిత్రులు గుమిగూడి చర్చించుకుంటూ వున్నప్పుడు, ఘని వాళ్ల వంక అసహ్యంగా చూస్తూ వుండేవాడు. ఇప్పుడు పాకిస్తాన్ అవతరణను ఎవరూ - ఎంత శక్తివంతులయినా సరే - ఆపలేరు. వాళ్లు ఆ దుకాణంలో చేస్తున్న సందడి అంతా సద్దుమణగవలసిందే. ఈ సాయంకాలం రేడియో ప్రసంగం వినడంతో ఆ విషయం అందరికీ నమ్మకంగా అధికారికంగా తెలిసిపోతుంది

హుక్కా పీల్చడం అయిన తరువాత, దుకాణం తలుపులు మూసివేసి, కసితీరా నేలమీద తుబుక్కున ఉమ్మివేసి యింటికి బయలుదేరాడు. ఓ బూతుమాట కూడా అతని నోటివెంట వచ్చింది , వాళ్లకు వినబడేంత పెద్దగా

మనసులోనే గుణించుకున్నాడు కొద్ది సమయమే వుంది - యింటికి వెళ్లి గబగబ తయారయి కరీమ్ బక్ష్ దుకాణానికి వెళ్లి రేడియో ప్రగంగం వినాలీ - అని

లాలా కాన్షీరామ్ అబ్దుల్ ఘని దురుసు ప్రవర్తనను గమనించినా యేమీ ఆవేశపడలేదు. నిదానంగా యింటికి వెళ్లాడు. టోపీ, గొడుగు ప్రభారాణికి అందించాడు. ముఖం కడుక్కున్నాడు. సాయంకాలపు ప్రార్థనలలో పాల్గొన వలసినదిగా అరుణ్‌ను కూడా పిలిచాడు ఆర్యసమాజ సభ్యుడుగా అతనికి విగ్రహారాధన చేయడానికి, భగవంతుని ముందు మోకరిల్లి ప్రార్థనలు చేయడానికి వీలులేదు. ఇంటి దగ్గరమటుకు శ్రీకృష్ణ విగ్రహం - చిలిపి దేవుడు - ముందు తన స్వంత ప్రార్థనలు చెప్పుకుంటాడు. గోడలో అమర్చిన దేవతా విగ్రహాల పై తెర తొలగించాడు. జాగ్రత్తగా, నిదానంగా సాంబ్రాణీ వెలిగించాడు ముందు ఖడ్డీకి అగ్గిపుల్ల అంటించి కొంతసేపు మండనిచ్చాడు. ఆపైన మంటను చేతి విసురుతో ఆర్పివేశాడు పొగ గది అంతా కమ్మి చక్కటి సువాసన తీసుకువచ్చింది. దేవుని పాదాలను స్పర్శించాడు. ఆ చేతులు తలమీదకు చేర్చుకున్నాడు. తరువాత నేలమీద ప్రభారాణీ, పరిచిన జనపనార చాప మీద కూర్చుని స్తోత్ర పాఠాల శ్లోకాలు చదవసాగాడు అంతసేపూ ప్రభారాణీ అరుణ్ మనసులు కళవెళ పడుతూనే అతనితో పాటు అక్కడ కూర్చుండిపోయారు.

రేడియో ప్రసంగం విన్న తరువాతనే భోజనాలు చేయాలని తీర్మానం చేసుకున్నారు. ఇంక యిప్పుడు చేయవలసింది యేమీ లేదు. ఇంటికిపైకి వెళ్లడం, తమ కప్పుమీద నుంచి పొరుగింటి కప్పుమీదకి దూకడం. ఆ యిల్లు బీబీ అమరావతి గారిది. ఆమెకు భర్త, కొడుకు వున్నారు గాని యింటి పెత్తనం అంతా ఆడమనిషిదే. ఇంటి వ్యవహారాలన్నీ ఆమే స్వయంగా చూస్తూంది, అజమాయిషీ చేస్తుంది. పక్కవీధిలో ట్రంక్ రోడ్ మీద పక్కపక్కనే రెండు బిల్డింగులు వున్నాయి ఆమెకు. వాటి అద్దె ఆమెకే స్వయంగా చెల్లుబడి అవుతుంది. మీకు రశీదు కావాలంటే, మీరే కాగితం మీద వ్రాసిపట్టుకువెడితే ఆమె దానిమీద నిశానీ ముద్రవేసి యిస్తుంది. ఆమె కొడుకు, భర్త అక్కడే

తారట్లాడుతూ వుంటారుగాని వాళ్లకేమీ అజపజ వుండదు. లాలా కాన్షీరామ్ యింట్లో యే రకంగా ఆయనే యింటి యజమానో, అమరావతి యింట్లో మటుకు ఆమే యాజమాన్యం నడుపుతుంది.

లాలా కాన్షీరామ్, ప్రభారాణి, అరుణ్ - ముగ్గురూ అలవాటు ప్రకారం పక్కయింటి కప్పుమీదికి అడుగులు వేసి చేరుకున్నారు. సాధారణంగా యిక్కడ ఒక యింటి నుంచి మరో యింటికి వెళ్లాలంటే యిదే పద్ధతి. ఆ కప్పు మీదనుంచి మెట్లుదిగి యింటి హాలులాంటి గదిలో ప్రవేశించారు. ఆ హాలు గోడలకన్నిటికీ అద్దాలు బిగించి వుంటాయి ఆ గదిలోనే రేడియో అమరి వుంది. సాయంకాలం పూటలు బీబీ అమరావతి తన యింటి హాలులోనికి, రేడియో వార్తలు వినడానికి - సంగీతం ఆలకించటానికీ చుట్టుపక్కల వారినందరినీ రానిస్తుంది. లాలా కాన్షీరామ్ ఆమెకు గౌరవ పాత్రమైన వాటాదారు, కనుక రోజులో యే సమయంలోనైనా వచ్చి తలుపులు తెరిపించగల స్వాతంత్ర్యం వుంది. బీబీ అమరావతికి అతనంటే యెంతో ఆప్యాయత. ఇద్దరూ సోదరీ సోదరులలాగ మెలుగుతారు, ఆర్యసమాజం అలవరచిన సంప్రదాయం ప్రకారం వాళ్లిద్దరికీ చాలా సంవత్సరాల నుంచి పరిచయం. రేడియో మాటేమిటి - అది ఆమె వస్తువు అయినా అతనికీ స్వంతమే. ఈ అవకాశాన్ని లాలా కాన్షీరామ్ బాగా ఉపయోగించుకున్నాడు నిజానికి అతను సంపాదించిన ప్రపంచ జ్ఞానం దాదాపు అంతా ఈ హాలులాంటి గదిలో రేడియో శ్రోతగా పోగుచేసుకున్నదే.

వాళ్లు ముగ్గురూ ఆ గదిలోనికి వెళ్లేసరికే, అక్కడికి అందరూ వచ్చి చేరివున్నారు. ఈషర్ కేర్, ఆమె భర్త అప్పుడే వచ్చేశారు. నిరంజన్ సింగ్, అతని తండ్రి తేజ సింగ్ రానే వచ్చారు. ముకుందుని ముసలి తల్లితో సహా రెండు యిళ్ల వాటాదార్లూ వచ్చేసి తాపీగా కూర్చుని వున్నారు. గదంతా ఆతుర వాతావరణంతో నిండివుంది. అందరూ నేలమీద చాపలపై కూర్చున్నారు. లాలా కాన్షీరామ్ కోసం ఒక కుర్చీ తీసుకువచ్చి వేశారు.

రేడియో దగ్గరే కూర్చునివున్నారు, ఎందుకూ పనికిమాలిన ఆమె దత్తపుత్రుడు సూరజ్ ప్రకాశ్, సిగరెట్ పొగలతో పసుపుపచ్చ రంగుకు మారిపోయిన

వేలికొసలతో రేడియో మీటను అటుయిటు తిప్పుతూ అతడికి యిరవై ఆరో, యేడో వయసు. అయినా కలలు కంటున్న వాడిలా చూస్తూవుంటాడు అందరి వేపూ , అంత వయస్సు వున్నట్లుగా అగుపడడు. బీబీ అమరావతి వాడిని ఎక్కడ సంపాదించిందో ఎవరూ ఎరగరు. ఆ మాటలకు వస్తే ఎందుకూ కొరగాని భర్తను కూడా ఆమె ఎక్కడ నుంచి సేకరించగలిగిందో కూడా ఎవరికీ తెలియదు. అతని పేరు గలగుమల్లు. రోజంతా హుక్కా పీలుస్తూ రోడ్డువార పిట్టగోడ మీద కూర్చుని వుంటాడు ఆమె అతన్ని విధాయకంగా వివాహం చేసుకున్నదీ లేనిదీ జనానికి ఖచ్చితంగా తెలియదు. అందరికీ తెలిసిందల్లా ఒక్కటే. ఆమె తల్లి దండ్రులకు ఒక్కతే కూతురు, ఈ రెండు భవంతులూ వారినుంచే ఆమెకు సంక్రమించాయి. ఈ కుటుంబ పోషణ పాలన అంతా ఆ యిళ్లు సమకూర్చే అద్దెల మీదే నడుస్తోంది. తతిమ్మా సంగతులన్నీ గోప్యమే. బీబీ అమరావతి యింటిపై అంతస్తు గదిలో హుందాగా కూర్చుని హుక్కా పీలుస్తూ వుంటుంది రోజంతా. భర్త కింద వీధి చివర పిట్టగోడ మీద కూలబడి వుంటాడు. అప్పుడప్పుడు ఆమె దగ్గరకు వెళ్లివస్తాడు. అప్పుడు వాటాదార్లు అందరికీ పెద్దపెద్ద అరుపులు, వస్తువులు విసిరివేసిన చప్పుళ్లు వినవస్తాయి. ఇద్దరి గొంతులు వినిపించేవి. ఎవరో ఎవరినో కొట్టిన చప్పుళ్లు కూడా వినవస్తాయి. కాని కొడుతున్నది యెవరో, దెబ్బలు తింటున్నది యెవరో మటుకు యితరులకు స్పష్టంగా తెలియదు బీబీ అమరావతిదే పైచేయి అని జనవాక్యం. సాయంకాలానికిల్లా ఇద్దరూ రాజీపడిపోతారు. చక్కగా స్నానలు చేసి, తెల్లటి ఉడుపులు ధరించి ఎదురుబొదురుగా ఒకరినొకరు ఆప్యాయంగా చూచుకుంటూ కూర్చుండిపోతారు. ఆమెచేతలో హుక్కా గొట్టం, అతని చేత పైపు వుంటాయి.

వాళ్లకు స్వంత సంతానం అంటూ లేదు. సూరజ్ ప్రకాష్ విషయం గూడా మరీ అంతామార్మికమే అతని జనక తల్లిదండ్రులు ఎవరో ఎవరికీ తెలియదు. లాలా కాన్షీరామ్, ప్రభారాణి - ఆరెండు యిళ్ల వాటాదార్లలో ఎక్కువ సంవత్సరాలుగా వుంటున్నవాళ్లు. వాళ్లకు కూడా సూరజ్ ఆమెకు ఎక్క డ చిక్కాడో తెలియదు. వాళ్లకు యిప్పటికీ బాగా గుర్తే, ఆమె ఒకనాడు

తమనిద్దరినీ పిలిచి పసిపిల్లవాడిని చూపి, వీడిని పెంచుకుంటున్నాను - అని ప్రకటించడం. కాన్షీరామ్ తన సహజ ఉత్సుకతతో ఈ పసికుర్రాడు ఎక్కడ నుంచి వచ్చాడు అని అడగక పోలేదు ఆమె మాత్రం 'భగవత్ ప్రసాదం' అని బదులు చెప్పింది. ఆమె కళ్లలో కొంత అనాహ్లాదం అగుపడింది. అయినా లాలా ప్రభారాణి మరేమీ ప్రశ్నలు వేయలేదు.

బీబీ అమరావతి దగ్గర బోలెడు డబ్బు వుంది. పిల్లవాడు చాల సుకుమారంగా ఐశ్వర్యంలో పెరిగాడు. ఆమే అతనికి 'సూరజ్ ప్రకాష్' అని పేరు పెట్టింది, అమిత ప్రేమతో. ఆ మాటకు సూర్యుని వెలుతురు అని సామాన్య అర్థం అయితే, జ్ఞాన మూర్తి అని పండితార్థం. అయితే సూరజ్ ప్రకాష్ మటుకు సార్థక నామధేయుడుగా తయారు కాలేదు. ఎంతో ప్రయత్నం, ప్రోత్సాహం మీద మటుకే వాడు మిడిల్ స్కూలు పరీక్షలో కృతార్థుడు కాగలిగాడు. హైస్కూలు చదువు మటుకు వాడి గొంతు పట్టేసుకుంది. ఆ గండం వాడు ఎన్నటికీ గట్టెక్కలేకపోయాడు. ప్రశ్నలకు అన్నిటికీ తప్పు సమాధానాలు వ్రాసేవాడు 'సున్న' మార్కులు వచ్చిన పేపర్లతో యింటికి తిరిగి వచ్చేవాడు. ఇంకో మార్గం లేక బీబీ అమరావతి వాడిని స్కూలు నుంచి తప్పించి వేసింది. ఆ రోజు సూరజ్ ప్రకాష్ తనకు పర్వదినం అయినట్లు గడిపాడు. స్నేహితులకు తీపి పంచిపెట్టాడు సంబరంగా.

ఏమయినా అందరికీ ఈ కుర్రవాడంటే యిష్టమే. బీబీ అమరావతి వాడికి ఎప్పుడూ సిల్కుచొక్కాలు, పాప్లిన్ ప్యాంట్లు కుట్టించేది. స్కూలుతో పొసగదని తెలిసిపోయిన తరువాత, వాటాదారులనుంచి అద్దెలు వసూలు చేసేపనిని కుర్రవాడికి అప్పచెప్పింది. పరీక్షలు ప్యాసు కాకపోతే యేం మునిగిపోయింది గనుక ? తినా, కూడవా బోలెడంత వుంది. వాడికేమీ జరగకపోతుందనే బెంగ లేదు ఆమెకు.

ఈ రెండు భవంతులలో అద్దెలకు వున్న వాటాదార్లు మటుకే కాక, కింద దుకాణాలు వున్నాయి. అవి కూడా అద్దెకు యిచ్చేసింది. వాటిమీద బాగానే వరుమానం వస్తుంది. ఇంతకంటే సూరజ్ ప్రకాష్‌కు జీవితంలో కావలసింది

యేమున్నది గనుక ! చదువంతా గొప్పగా పూర్తిచేసింతరువాత నయినా, లాలా కాన్షీరామ్ కుమారుడు అరుణ్ యింత వైభవంగా జీవితం గడపగలుగుతాడా? ఎక్కడో యేదో గుమస్తా ఉద్యోగం మటుకు దొరుకుతుంది వాడికి - ఆ ముఖానికి అంతవరకే ప్రాప్తం. తన సూరజ్ వాడికంటె వేయిరెట్లు మెరుగయిన జీవితం గడపగలుగుతాడు. ఈ ఆలోచన వచ్చినప్పుడల్లా ఆమె కళ్లు చికిలించి రెండు వేల సంవత్సరాల వయసున్న ముఖం నిండా ఆనందం పులుము కుంటుంది. ఆమె కుర్రవాడికి మాంచి అందమైన అమ్మాయిని గూడా చూచివుంచింది. లాలా కాన్షీరామ్‌ను యిలాంటి సుందరాకారిని వెదికి పట్టుకోమను అరుణ్‌కు. అసాధ్యం ఆ చట్టిముక్కు అరుణ్‌ను యే పాకీవాని కూతురో చేసుకోవలసిందే. అతే గతి వాళ్లకు.

సూరజ్ ప్రకాష్‌కు తల్లి - అంటే పెంపుడు తల్లి - అహంకారం, అతిశయం యేమాత్రం లేవు. వాడు స్వతహాగా మొద్దావతారం. మంచి మర్యాద తెలిసిన మొద్దావతారం. తలలో మెదడు అంటూ లేకపోతే అదివాడి లోపం ఎలా అవుతుంది ? వాడి తప్పు కానే కాదు. తన తెలివి తక్కువ తనానికి తనకే నవ్వు వస్తూ వుంటుంది వాడికి. కానీ చూద్దాం యేమవుతుందో - అనుకుంటూ వుంటాడు యిటువంటి సందర్భాలలో. సిగరెట్ పొగజోరుగా నోటినిండా గుండెల నిండా పీల్చి, చాలసేపు బిగబట్టి వుంచి ఆపైన జోరుగా వదులుతాడు. ఆ పొగ గాలిలో కలిసిపోవటానికి చాల సమయం పడుతుంది.

'నువ్వు మొద్దావతారం మటుకే కాదు. ఎందుకూ పనికిరాని వాడివి కూడా !' అంటుంది బీబీ అమరావతి. ఆమెకు అతనంటే అంత మక్కువ, కేవలం తమాషాకు - కవ్వింపుకు మటుకే అలా అంటుంది. ఈ ప్రాంతంలో, వాళ్ల జనాభాలో అటువంటి రేడియో సెట్ యింట్లో పెట్టుకు కూర్చోవడంలో సూరజ్ ప్రకాష్ మొట్టమొదటివాడు. కరుకు రూపాయిలు ఆరువందలు ఖర్చుచేయవలసి వచ్చింది దీనికోసం. ఇంకా ఆ రోజులకు ట్రాన్సిస్టర్లు అవతరించలేదు. అంత డబ్బు ఒక్కమారుగా కక్కటానికి ఎవరికి సాధ్యం ?

సూరజ్ ప్రకాష్ రేడియో సెట్‌ను ఆటవస్తువులాగ ఉపయోగిస్తాడు. తతిమ్మావాటి నన్నిటినీ ఎంతో జాగ్రత్తగా వాడుకుంటాడు. అతడు వివాహం చేసుకునే ముందు కాశ్మీర్ స్టేట్‌లోనికి రెండు వందల మైళ్ల దూరం బస్సుల మీద ప్రయాణం చేయవలసి వచ్చింది ఎన్ని బస్సులు మారాడో చేతివేళ్లు మడిచి మరీ లెక్కబెట్టుకున్నాడు. లెక్కతేల్చుకోవటానికి బదులుగా గందరగోళంలో పడిపోయి ఆ ప్రయత్నం ఆపుచేశాడు. లాలా కాన్షీరామ్‌కు మటుకు సూరజ్ ప్రకాష్ పట్ల ఒకటే కోపం వాడు రేడియో మీటలు తిప్పుతూ కూర్చుని కాలక్షేపం చేస్తూవుంటాడని. నిజానికి రేడియో స్పష్టంగా, స్ఫుటంగా పలుకుతూనే వుంటుంది. మీట స్టేషన్ ముల్లు దగ్గరే ఆగుతుంది. సంగీతమో మాటలో తీరుగా వినిపిస్తూ వుంటాయి. అయినా సూరజ్ చేతులు ఊరికే వుండవు గిరగిర మీటలన్నీ తిప్పుతూ ఆ వస్తువు కాస్తా పాడుచేసి పారవేస్తాడా అన్నట్లుగా ప్రవర్తిస్తాడు. ఇప్పుడు పలుకుతున్నదాని కంటె మరింత అధ్వానం చేస్తాడు. గందరగోళమైన ధ్వనులు, తుపాను రణగొణలు యివన్నీ పనికిస్తాడు దాని మీద ఉత్తిపుణ్యానికి.

లాలాకాన్షీరామ్ అమితంగా చిరాకు పడిపోతూ 'మాట్లాడుతున్నదాన్ని అలా వుంచివేయరాదూ - ఎందుకు ఊరికే కెలికి పెడతావు ?' అన్నాడు. అతనికీ, అతని భార్య ప్రభారాణికి మటుకె అలామాట్లాడటానికి తగినంత చనువు వుంది. తతిమ్మావాళ్లు అతడిని 'బావ సురజ్ ప్రకాష్ జీ' అనో 'బావాజీ' అనో అంటారు అతడు బీబీ అమరావతి కొడుకు కదా ! ఆమె యింటి కామందు. గౌరవంగా మర్యాదగా వ్యవహరించడం అవసరం.

లాలా కాన్షీరామ్ గాని, అతని భార్యగానీ అతన్ని అలా ముద్దుగా మురిపెంగా పలుకరించ వలసిన అవసరం లేదు. బావా సూరజ్ ప్రకాష్ కావచ్చును. కాని వాడికి సూటిగా పది అంకెలు లెక్క పెట్టటం కూడా చేతకాదు. బావాజీ !! వాడిని చిన్నతనం నుండి ఎరుగుదురు వాళ్లిద్దరూ. సూరజ్ అనే పిలవడం అలవాటు చిన్నప్పటి నుంచి. సూరజ్ మాత్రం మంచిపిల్లవాడి మాదిరిగా ఎప్పుడూ అతన్ని 'అలాగే, చాచాజీ అలాగే చాచాజీ' అంటూ వుంటాడు.

'ఆరేడియోను దాని మానానికి దాన్ని వదిలెయ్యి'

ప్రసంగం ప్రారంభం అవబోతోంది.

సూరజ్ సమాధానం చెప్పలేదు.

'నా మీదికి అలా పొగవదలకు. సిగరెట్ అవతల పారవేయి ముందు'

'బాబాజీ మీరు నా మీద ఈ రోజు అకారణంగా కోపంగా వున్నారు -' అంటూ సూరజ్ సిగరెట్ తీసి బల్లమీద ఏష్ట్రేలో కుక్కాడు. నిద్రపోతూ కలలు కంటున్న కళ్లతో కాన్షీరామ్ వంక క్షమాపణ కోరుతున్నట్లుగా చూచాడు.

'కొంతసేపు కదలకుండా కూర్చో. ఏమీ గందరగోళం చేయకు అక్కడే కూర్చుని వుండు'.

సూరజ్ తలవూపాడు. నవ్వుకున్నాడు, కూర్చున్న కుర్చీలోనే అటుయిటు కదిలాడు, ఉన్నట్లుండి ఒక్కమారుగా పైకి లేచి రేడియో మీటను తిప్పటం ప్రారంభించాడు. గందర గోళంగా శబ్దాలు రాసాగినాయి అందులో నుంచి. లాలా కాన్షీరామ్ చెప్పన మాటలు అకస్మాత్తుగా గుర్తుకు వచ్చాయి సూరజ్‌కు. ఆయన వంక క్షమాపూర్వకంగా చూస్తూ భయంతోను పశ్చాత్తాపంతోను నిండిపోయి కుర్చీలో కుదురుగా కూర్చుండిపోయాడు. ఈ మాటు వాడి ముఖంలో నవ్వులేదు. అసహాయత మటుకు కొట్టవచ్చినట్లుగా కనిపిస్తోంది.

'వాహ్' అన్నాడు లాలా కాన్షీరామ్, పెదాలు మెలిపెడుతూ బీబీ అమరావతి ఓ మూలగా మంచం మీద కూర్చుని వుండి హుక్కా పీలుస్తూ వుంది. 'వాడిని ఆ కుర్చీలో నుంచి లాగిపారెయ్యి - మనం ఈ ప్రసంగం ప్రశాంతంగా వినాలనుకుంటే' అంది లాలా కాన్షీరామ్‌తో.

చాలా మంది వాటాదార్లు నవ్వారు, వాళ్లకు యిదో వేళాకోళపు మాటగా బాగా తెలుసు బావాజీ చేతులు ఎప్పుడూ ఊరికే వుండవు. పీరం కదల్చకుండా కూర్చోవడం వాడివల్లకాదు

'దణ్ణం పెడతున్నాను. ఇక రేడియో మీద చేయివెయ్యను-' అన్నాడు వాడు వందనం చేస్తూ.

అందరూ నవ్వారు. లాలా కాన్షీరామ్ మటుకు గంభీరంగా కూర్చుండిపోయాడు. అతనికి చాలా ఉద్రిక్తంగా వుంది మనసు. అసలు గదిలో వాతావరణం అంతా ఎంతో ఉద్రిక్తంగా తయారయింది.

చివరకు ఎలాగయితేనేం ఏడు గంటలయింది. ఎనౌన్సర్ ముందుగా ప్రకటనలు చేసిన తరువాత వైస్రాయి గారు మాట్లాడడం ఆరంభించారు. ఆ ప్రసంగం ఇంగ్లీషులో వుంది. గది అంతా నిశ్శబ్దం అలుముకు పోయింది. ఫుల్‌చంద్ చిన్న బిడ్డ యేడుపు ప్రారంభించింది. అప్పుడు కాన్షీరామ్ అతని భార్యతో 'కాస్సేపు బయటకు తీసుకుపో' అని అసహనంగా అరిచాడు. వైస్రాయిగారి గొంతు అది యే భాష అయితేనేం - వినగలగడం కాన్షీరామ్‌కు ఒక క్షణం పాటు ఎంతో విస్మయం కలిగించింది. కాని అతని మనస్సు ఆయన యేం చెబుతున్నాడో తెలుసుకోవాలని ఉత్సాహంగా ఉంది. ఏదయినా ఆధారం దొరుకుతుందా అని అరుణ్ ముఖం వైపు చూస్తున్నాడు. వైస్రాయి చాలా క్లుప్తంగా సూటిగా మాట్లాడాడు. ఆయన మాటల వైఖరిలో యెంతో ఉద్రేకం గూడుగట్టుకుని వుండింది. ఆ ప్రసంగం అయిపోవడంతోటే అక్కడ వున్నవాళ్లందరూ సూరజ్ ప్రకాష్ వంక చూచారు ముందు. అతడే కుర్రవాళ్ల యిద్దరిలోకి పెద్దవాడు. అతనికి కొద్దిగా ఇంగ్లీషు వచ్చిన మాట నిజమే. అయినా యింత ప్రసంగం అర్థం చేసుకోవం నావల్ల అవుతుందా, అసాధ్యం అన్నట్లుగా చేతులు ఊపుతూ 'వైస్రాయిగారి ఇంగ్లీషు ప్రసంగం... నాకేం తెలుస్తుంది' అన్నాడు. కళ్లన్నీ అప్పుడే అరుణ్‌వైపు మరలాయి. ఆ ప్రాంతంలో కాలేజికి వెళ్లినవాడు వాడొక్కడే అరుణ్‌కు ప్రసంగం అంతా క్షుణ్ణంగా అర్థం అయింది. గద్గద స్వరంతో 'విభజన' అన్నాడు చేతులతో ఒక వస్తువును రెండు ముక్కలు చేసేస్తున్నట్లుగా కత్తిరించి వేస్తున్నట్లుగా అభినయించి చూపాడు.

'విభజన !' -అన్నాయి అన్ని గొంతులు, బిగ్గరగా. అందరి నోళ్లూ - తెరుచుకునే వుండిపోయాయి.

'అవును. విభజనే !' అన్నాడు అరుణ్.

వెంటనే పండిట్ నెహ్రూ గొంతు వినిపించనారంభం అయింది. అందరూ నిశ్శబ్దంలోనికి కరిగిపోయారు. ఆయన ప్రసంగం యింగ్లీషు భాగం ఎప్పుడు అయిపోతుందా, దాని తర్వాత హిందీ ప్రసంగం ఎప్పుడు ఆరంభం అవుతుందా అని అందరికీ అమిత ఆతురతగా వుంది. రెండు భాషల ప్రసంగాలలోను నెహ్రూ ఎంతో ఉద్రిక్తంగా మాట్లాడాడు. గెలిచిన వాడికంటె ఓడిపోయిన వాడి కంఠ స్వరంగా వినిపిస్తోంది ఆయన గొంతు. సెప్టెంబర్ 1946 నుంచి ఆయన తాత్కాలిక ప్రభుత్వంలో ప్రధాన మంత్రిగా వ్యవహరిస్తున్నాడు. గడచిన తొమ్మిది నెలలుగా ఎన్నోమార్లు ఆయన గొంతు రేడియోలో ఝూమని మోగింది ఇప్పుడు మాత్రం అదేగొంతు అమిత నీరసంగా, అనాసక్తంగా వుంది అలసట, విసుగుదల ప్రస్ఫుటం అవుతున్నాయి ఆతని ధోరణిలో. ఆయన చాల తెలివైన నాయకుడు. జనం నాడి ఎరిగినవాడు అనేక భాషలు మాట్లాడే కోట్ల కొద్ది జనాన్ని ఒక్కతాటి మీద నడిపించగలవాడు. జనం అలవాట్లు, ఆచార వ్యవహారాలు వేరు వేరు. ఆయన అందరినీ కలిసికట్టుగా తీసుకురాగల నాయకుడు అటువంటివాడు కాస్తో కూస్తో చిరాకుపడడంలో వింత యేమీలేదు ఆయన కోపం ప్రదర్శించినా నిర్లక్ష్యంగా వున్నాడనిపించినా జనం అపార్థం చేసుకోరు. గంటల తరబడి ఆయన రాక కోసం మైదానాలలో ఎదురుచూస్తూ వుండిపోతారు, ఉపన్యాసాల సమయంలో చివరకు ఆయన తెల్లని ఖద్దరు దుస్తులలో, తలమీద టోపీతో, చేతి కర్రవూపుకుంటూ వస్తాడు ఆ కర్రతో కొంతమందిని కొడతాడు కూడ ఆ దెబ్బలతో వారికి క్రమశిక్షణ అంటే యేమిటో తెలిసి వస్తుంది. స్వాతంత్ర్యం అంటే ఏమిటో అర్థం చెబుతాడు బారులు తీర్చి ఓపికగా నించోవడం, నాయకులు నడిచివెళ్లటానికి వీలుగా దారియివ్వడం -- యిలాంటి పనులు వాళ్లు చేయడం ఎలాగో చెబుతాడు ఎవరేనా ఆయన కాళ్లమీద పడి నమస్కారం చేయాలని చూస్తే, యిది కాదు స్వాతంత్ర్యం అంటే అనినచ్చచెబుతాడు కాళ్లు వెనక్కు తీసుకుంటూ దూకుతాడు. హుందాగా మర్యాదగా వుండాలి. వర్తనంలో ఎలాంటి వక్రత లేకుండా సూటిగా వుండాలి ఎలాంటి ఆపదలనయినా ఎదుర్కొగల ధైర్యసాహసాలు వుండాలి భయం వుండకూడదు నినాదాల అరుపులు

సాహసాలు వుండాలి. భయం వుండకూడదు. నినాదాల అరుపులు పనికిరావు. జాగరూకత అవసరం. అందరూ తను చెప్పినట్లుగా వుంటూ అంటిపెట్టుకువుండాలి. అప్పుడు స్వాతంత్ర్య ద్వారాలవైపు అందరినీ నడిపించుకు వెళ్లగలనంటాడు. ఈరోజు వున్నట్లుగా బాధ్యతా రాహిత్యంతో, అల్లరి చిల్లరిగా, రణగొణ ధ్వనులు చేస్తూవుంటే పని జరగదని చెబుతాడు. ఇలాంటి మాటలు ఆయన చెప్పినప్పుడు యెవరకీ కోపం రాదు. తనకు అవసరం అయిన నీతిపాఠాలు చెబుతున్నాడు నాయకుడు అని సరిపెట్టుకుంటారు. తనులోతాము నవ్వుకుంటారు, మురిసిపోతారు.

ఈ రోజు ఆయన అలాంటి మాటలేం ఆడలేదు. ఎంతో బలహీనంగా, ఉదారంగా, పుట్టెడు విచారంలో వున్నట్లు అనిపిస్తున్నాడు. అయినప్పటికీ, బీబీ అమరావతి హాలులాంటి గదిలో చేరిన ఈ చిన్న గుంపులోని వ్యక్తుల సానుభూతిని కూడా సంపాదించలేకపోయాడు. ఏమిటి ఆయన మాట్లాడుతున్న తెలివి తక్కువ మాటలు ? ఆయన నిజంగా నెహ్రూ యేనా ? ఆ వైఖరి అలాగే వుంది, మాటల వూపు అదే. కాని ఆయన మనస్సు మేమయిపోయింది ? ఇంకేమీ మార్గాంతరం లేకపోతే అలాగే విభజన జరగనీ. మేమందరం త్యాగాలు చేయడానికి సంసిద్ధంగా వున్నాం. కాని యేమిటీ అర్థం పర్థం లేని మాటలు ? ఏమి గందరగోళం వద్దు, దౌర్జన్యం వద్దు, ప్రభుత్వం నించి పూర్తి రక్షణ దొరుకుతుంది, శాంతి అనేదే ముఖ్య విషయం ! ఆయనకేమైన పిచ్చి ఎక్కలేదు గద. ఆయనకు తన ప్రజల నాడి తెలియకుండా పోయిందా ? ముస్లిముల పద్ధతి తెలియదు గనుకనా ? అసలు... మొదట్లోనే ఈ విభజన సంగతి ప్రస్తావన ఎందుకుకోసం ? మీరు మాకు యిన్నాళ్లూ చేసిన వాగ్దానాలన్నీ యేమయి పోయినాయి, పండిట్‌జీ ?

ఆయన ప్రసంగం పూర్తి అవడంతోటే, జనం ఆవేశం కట్టలు తెగిపోయింది. వాళ్లకు యింక జిన్నా యేం చెబుతాడు, బలదేవ్ సింగ్ యేం చెబుతాడు, అన్న ఆసక్తి లేకుండా పోయింది. వాళ్లు మాత్రం యింతకంటె భిన్నంగా యేం చెబుతారు ? లాలా కాన్షీరామ్ ఆజ్ఞాపన మీద రేడియో కట్టివేశాడు సూరజ్.

వాళ్లు ఒకళ్ల ముఖాలు ఒకళ్లు చూచుకున్నారు. పశ్చాత్తాపం కాదు, భయం కాదు, వాళ్ల ముఖాలలో అపనమ్మకం కొట్టవచ్చినట్లుగా కనిపిస్తోంది.

బీబీ అమరావతి ముందుగా నోరు విప్పింది.

'భాయీ కాన్షీరామ్, ఏమిటి యిదంతా ? దీని అర్థం యేమిటి అసలు ?'

ఆమె హుక్కా గొట్టం చప్పుడు చేయడం ఆగిపోయి చాలాకాలం అయింది. గొట్టం కాండం మటుకు ఆమె పెదాల మధ్య యిరుక్కుపోయివుంది

'బెహన్, నేను విన్నదంతా నీవు విన్నావు గదా !'

'అంటే పాకీస్తాన్ వచ్చేస్తోందంటావా ?'

అనేక గొంతులు బదులు చెప్పాయి. 'ఆ ! వస్తోంది !'

వాళ్లంతా ఒకళ్లతో మరొకళ్లు మాట్లాడుకుంటున్నారు. గదంతా చిందరవందర శబ్దాలతో నిండిపోయింది. ఏకుటుంబానికి ఆ కుటుంబం వారంతా ఒకచోట చేరి గుంపులు కట్టారు, భద్రతా దృష్టితో - ప్రమాదం విరుచుకు పడుతోంది అన్నట్లుగా. ఎవరి అవగాహనలో వాళ్లు, నెహ్రూ మాటలను పునశ్చరణ చేసుకున్నారు. బీబీ అమరావతి లాలా కాన్షీరామ్ పక్కకు చేరింది. ఈ ప్రసంగానికి యేదైనా వేరే అర్థం సాధ్యపడుతుందా అని కాన్షీరామ్ మెదడంతా వెదుకులాట ప్రారంభం చేశాడు ప్రయోజనం లేక పోయింది.

సూరజ్ ప్రకాష్ రేడియో మళ్లీ ఆన్‌చేశాడు అకస్మాత్తుగా శబ్దం వెలువడేటప్పటికి మళ్లీ అందరూ నిశ్శబ్దంలో కూరుకుపోయారు జిన్నా అప్పుడే తన ప్రసంగాన్ని ముగింపుచేస్తున్నాడు. అతని మాటలు స్పష్టంగా సూటిగా వినిపిస్తున్నాయి. 'పాకిస్తాన్ ! జిందాబాద్. పాకిస్తాన్ అనేక యుగాలు వర్థిల్లాలి.' సూరజ్ వెంటనే రేడియో ఆపుచేశాడు. కాని అందరూ జిన్నా అరుపులు విన్నారు. వాటిలో యేమాత్రం దయ లేదు. గర్వం, అతిశయం మటుకు వున్నాయి.

అందరి భయాలను తనలో మూర్తీభవింపచేసుకుని, సర్దార్ తేజసింగ్ అడిగాడు 'మనకిప్పుడు యేం కానున్నది, లాలాజీ ?'

అందరూ లాలా కాన్షీరామ్ జవాబు కోసం ఆతురతగా యెదురుచూస్తూ వుండిపోయారు.

'మనం యిక్కడే వుండిపోవచ్చునను కుంటాను. పాకిస్తాన్ యేర్పడితే మటుకు ఆదేశంలో హిందువులు, సిక్కులు వుండటానికి వీలులేదా యేమిటి? వాళ్లు మనకు అపకారం యెందుకు తలపెడతారు !' అన్నాడు కాన్షీరామ్. ఆయన మాటలు ఆయనకే అంత నమ్మకంగా అనిపించినట్లు లేదు.

'యధార్థాన్ని పరికించు, నాన్నా' అంటున్నాడు అరుణ్ మధ్యతరగతి వ్యాపారస్థుడు అయిన లాలా కాన్షీరామ్ తన ఆశలకు కోరికలకు అంటిపట్టుకు వుండిపోవాలని మటుకే అనుకుంటున్నాడు.

అవును. మనం పాకిస్తాన్‌లో ఎందుకు వుండలేం ? వాళ్లు మనను వుండనిస్తారు, వ్యాపారం చేసుకోనిస్తారు. వాళ్ల ఆర్థిక స్థాయి అంతా తల్లకిందులు, తారుమారు అయిపోతుంది మనను తరిమి వేస్తే'

'మనను వుండనీయకుండా - మనడబ్బంతా అపహరించవచ్చునుగా వాళ్లు !'

'అయినా కాంగ్రెస్ ఈ దేశ విభజనకు ఎందుకు అంగీకరించినట్లు ? సిక్కు నాయకులు అకాలీలు ఎలా ఒప్పుకున్నారు ?' అని అడిగాడు సర్దార్ నిరంజన్ సింగ్. అతడు యువకుడు, చురుకైనవాడు. ఈషర్ కేర్ భర్త. అతడు మాట్లాడుతూ వున్నప్పుడు చేయిమాత్రం పొడుగాటి కత్తిపిడి మీదనే వుండింది. అతను యువకుడు, బలశాలి. అతను అప్పుడు అనుకుంటున్నది యేమంటే - ఈ కత్తిని ఒరలోనుంచి తీసి నెహ్రూను చీలికలు చీలికలు చేసి వేయాలని:

'వాళ్లందరూ యిందుకు ఒప్పుకున్నారు. మన సిక్కు నాయకులు కూడా !' అన్నాడు తేజసింగ్ అల్లుడివైపు సూటిగా చూస్తూ.

'ఇది దగా ! నమ్మకద్రోహం' అన్నాడు అరుణ్ బిగ్గరగా.

గదిలోని మరోమూల నుండి ముకుందుడి ముసలి తల్లి అడిగింది 'గాంధీగారు యిందుకు ఒప్పుకున్నారా ?' అసలే ముసలి తనంతో ఆమెగొంతు గద్గదం అయిపోయింది. ఇప్పుడామెకు యింకా బలహీనత తోడయింది, వణుకు ఎక్కువయింది.

'ఒప్పుకునే వుంటాడు' అన్నాయి గదిలోని అనేక గొంతుకలు, అసహ్యంతో - కసితో.

'అయితే నా ముకుందుడు యేమయిపోతాడు ?' - అని అడిగింది ఆ వృద్ధురాలు. ఆమెజుట్టు అటుయిటు చెల్లాచెదురుగా రేగుతోంది. తన పిల్లికళ్లతో ఆకేశపాశం వంక చూచుకుంటుంది. ఆమె ముఖం పాతబడిపోయిన సాలెగూడులా కనిపిస్తోంది.

ఇతర సందర్భాలలో అయితే వాళ్లు ఆమె ప్రశ్నకు ఎగతాళిగా నవ్వి వుండేవాళ్లు... ఆమె కొడుకు ముకుందుడు - మధ్య వయస్సు వాడు - పోలీసుల జాబితాలో వున్న మొదటి పదిమందిలో ఒకడు. జైలుకు వెళ్లడం బయటకు రావడం.... యిదీ వాడి నిత్య వ్యవహారం. ప్రస్తుతం వాడు జైలులోనే ఉన్నాడు. ఆమె మాత్రం వాడు అమాయకుడనీ, పోలీసులే వాడంటే గిట్టక వాడని అడపదడప జైలుకు పంపుతూ వుంటారనీ చెబుతుంది. ముకుందుడు యిలా జైలుదాటి బయటకు వస్తాడో లేదో మళ్లీ పోలీసులు వాడు ఎక్కడ నుంచి వచ్చాడో అక్కడకు పంపివేసే యేర్పాటు చేసేస్తారు. వీధిలో వాళ్లందరూ ఈ రకంగానే ప్రశాంతంగా వుండగలగుతారు. ముకుందుడి రక్షణకు పనికి వచ్చే మాటలు ముసలి తల్లి చెప్పుతూ వున్నప్పుడు విన్నవాళ్లందరూ వినోదంగా నవ్వుతూ వుంటారు.

కాని ఈ మారు ఎవరూ నవ్వలేదు, ఆమె ప్రశ్నకు సమాధానం కూడా చెప్పలేదు.

సమావేశం అంతం అయింది. ఎవరి యిళ్లకు వాళ్లు వెళ్లిపోయారు. లాలా కాన్షీరామ్ సలహా యేమంటే 'రేపటి వుదయం వరకు వేచివుందాం.' పొద్దున్నే వార్తాపత్రికలు వస్తాయి గదా చూద్దాం - అని ఆ పత్రికలలో మరిన్ని వివరాలు, మార్గాంతరాలు వుండవచ్చును.

చల్లని గాలి వీచింది. ప్రభారాణి భోజన సరంజామా మిద్దెమీదికి తీసుకువచ్చింది ఈషర్ కేర్ కూడా అలానే చేసింది. రెండు కుటుంబాలు అక్కడే సాయంత్రం భోజనం ముగించారు , ఎవరి వాటాలో వాళ్లు కూర్చుని. ఏమీ మాటలు జరగలేదు. ఆ సాయం వెలుగులో ముగ్గురు సిక్కుల శరీరాలు నిటారుగా పొడుగ్గా అగుపిస్తున్నాయి. సర్దార్ బోధసింగ్, తాత, రేడియో ప్రసంగం వార్తలు విన్నాడు ఎనభైయేళ్ల అతని శరీరం వీపు వంగినట్లు అయిపోయింది. అయినా హుందాగా తలపైకెత్తి నడుస్తున్నాడు. తలమీద పాగా ఆకాశంలోని నక్షత్రంలా మెరుస్తోంది. అరుణ్ నాసికా రంధ్రాలను తినుబండారాల సువాసనలు ఆకట్టుకుంటున్నాయి. అతని ముందు పళ్లెం అన్ని రకాల పదార్థాలతో నిండివుంది. చిక్కడు కాయముక్కలు, కాలీఫ్లవర్ తిన్నాడు. ఈ కూర ముక్కలతో బాసుమతి బియ్యపు అన్నం చక్కగా సుకుమారంగా నోరు తృప్తిపరిచి గొంతు దిగుతోంది. మధ్య మధ్యలో చపాతీ ముక్కలు నములుతున్నాడు. భోజన పదార్థాలు వుంచిన గిన్నెల చప్పుళ్లు గలగల వినిపిస్తున్నాయి అరుణ్ అలా భోజనం చేస్తూనే నూర్ గురించి సాలోచనగా వుండిపోయాడు.

# మూడవ అధ్యాయం

వాళ్లు యింకా భోజనాలు చేస్తూ వుండగానే, బయట నుంచి టపాకాయల ధ్వనులు వినరాసాగాయి.

నగరంలోని ముస్లిములు పండుగ చేసుకుంటున్నారు. నగరంలో నలుమూలల నుంచి రకరకాల టపాకాయలు పేలుడు పదార్థాలు ఆకాశంలోనికి దూసుకుపోతూ ఎర్రని, పచ్చని కాంతి రేఖలను తీసుకువస్తున్నాయి. ముస్లిములు నివసిస్తున్న ప్రాంతాలు యిక్కడికి బహుదూరంలో వున్నాయి. అయినా అక్కడ జరుగుతున్న సంరంభం సవ్వడి యిక్కడికి స్పష్టంగా వినవస్తూనే వుంది. మొదటి టపాకాయ పేలుడు వినడంతోనే ప్రభారాణికి ముద్ద గొంతుదిగడం కష్టం అయిపోయింది. నల్లని ఆకాశంలో రకరకాల రంగులు వెలుగులు ప్రసరిస్తూ వుండడం అందరూ నోరు వెళ్లపెట్టుకు చూస్తూ వుండిపోయారు.

తరువాత రకరకాల ప్రకాశమానమైన వెలుగులు విరజిమ్ముకున్నాయి. దూరంగా, యిళ్ల కప్పుల మీద ఆవరణలలోను ప్రమిద దీపాలు వెలుగుతూ వుండడం అగుపిస్తోంది. సమయం గడుస్తున్న కొద్దీ నేలంతా వెలుతురు రవ్వలతో తిరగదోడినట్లు అయిపోయింది. ఎక్కడ చూచినా దేదీప్యమానమైన వెలుగులు.

చాలా రాత్రి గడిచిన తరువాత ఊరేగింపు సాగింది. ఊళ్లోని దుకాణాలన్నీ ముందుగానే కట్టివేసారు. రోడ్ల మీద జనసంచారం లేదు ట్రంక్‌బజార్‌లోని కిళ్లీ దుకాణంమటుకు యింకా తెరిచే వున్నది. కొంతమంది అక్కడ గుమిగూడి వున్నారు. వాళ్ల సంభాషణలు వినబడుతూ వున్నాయి. అరుణ్ వాటిని ఆలకిస్తూ భోజనం చేశాడు.

దూరంగా యేదో సవ్వడి, ఊరేగింపు. క్రమంగా దగ్గర అవుతోంది. డ్రమ్ములు విపరీతంగా మోగుతున్నాయి. ఇళ్లపైన కూర్చున్న వాళ్లు అదేమిటో గమనించటానికి తలలు ఎత్తి చూస్తున్నారు. అది దాపు అయిన కొద్దీ జన కోలాహలం, నినాదాల అరుపులు వినిపించి, ఊరేగింపు విషయం స్పష్టమయింది.

సూరజ్ ప్రకాష్ తన యింటి కప్పుమీద నిలబడి వున్నాడు. 'అరుణ్. గేటు... గేటు....' అని అరుస్తున్నాడు.

నిరంజన్ సింగ్‌కు కూడా యిదే ధ్యాస యేర్పడింది. 'గేటు, గేటు..' అని అరుస్తున్నాడు.

ముగ్గురూ కిందకు దిగారు. వీధిలోనికి రెండు మెట్ల వరుసలు దిగుతాయి. మధ్యలోనే వాళ్లకు ముకుంద తల్లి ఎదురయింది. ఆమె మెల్లగా పైకి ఎక్కివస్తోంది.

'అరుణ్, నీ కోసమే పైకి వస్తున్నాను. నా ముకుందుడికి యేమవుతుందో !' అంది ఆమె.

'తరువాత చెబుతానమ్మా -' అంటూ అరుణ్ ఆమెను పక్కకు నెట్టుకుంటూ కిందకు దిగాడు. వాళ్లు ముగ్గురూ వీధిలోనికి వచ్చి ట్రంక్ బజారు ఎయిపు పరుగెత్తారు. (ఈ రెండు యిళ్లూ వీధికి తూర్పు చివరగా వున్నాయి, ఒకటి వీధి వైపుకు తెరుచుకుంది.) మొహింద్రీలాల్, కిళ్లీ కొట్టు ఆసామీ, దుకాణం తలుపులు కిందికి లాగాడు. వీధిలోని జనం గగ్గోలుగా అటుయిటు తిరుగాడుతున్నారు. కొందరు గేటు తలుపులు - కొయ్యవి - దగ్గరకు లాగి బిగించి వుంచారు. గొళ్లాలు తగిలించి, యినుప కడ్డీలు అడ్డుగా అమర్చారు.

'అటు పక్క కూడా యిలాగే భద్రపరచాలి....' అనుకుంటూ వాళ్లు వీధి అవతలి వైపుకు పరుగుతీశారు. అది పొడగాటి వీధి, మెలికలు తిరుగుతూ వుంటుంది. వాళ్లకు మార్గమధ్యంలోనే ఆ మొహల్లాలోని మరికొందరు యువకులు తారసపడ్డారు. రెండు ముఠాల వాళ్లు, యీ మొహల్లాకు వున్న రెండు వీధి ద్వారాలూ బిగించి భద్రపరుచుకోవాలని చెప్పుకున్నారు. ఒక్కో ముఠాలో పన్నెండు పదిహేను మంది యువకులు వున్నారు. వాళ్లు చకచక యుద్ధ సన్నాహ సమావేశం వంటిది జరిపారు.

'ఇప్పుడేం చేద్దామంటారు ?'

'మనం యిక్కడే వుందాం. ఎవరూ ఈ వీధిలోనికి రాకుండా అటకా యిద్దాం. ఎవరయినా దొమ్మికి దిగినా గానీ ఒకరిద్దరిని చంపిగాని మనం ప్రాణాలు పోగొట్టుకోగూడదు -' అన్నాడు నిరంజన్ సింగ్.

'వాళ్లు చాలామంది వున్నారు. వాళ్ల సంఖ్యాబలం చాలా ఎక్కువ' అన్నాడు హరే కృష్ణ. అతను యువకుడు. గుమస్తాగా పని చేస్తున్నాడు. వీధికి పడమర వైపు వుంటాడు. ఒక రకంగా మురా నాయకుడు.

'అదే సరైన మాట. ఈ పళంగా వాళ్లతో తలపడడం ఆత్మహత్యా సదృశ్యం. మనం యిళ్లకు తిరిగివెళ్లి యేం జరుగుతుందో కనిపెట్టి చూస్తూ వుండిపోదాం. వాళ్లు యే యింటి మీదకైనా దొమ్మిగా వచ్చారంటే మాత్రం మనమంతా యివతలకు వచ్చి ఎదిరిద్దాం -' అన్నాడు అరుణ్.

ముస్లిముల దాడులు ఎదుర్కోవటానికి, వాళ్లు కిందటి యేడే ఓ యువ బృందాన్ని తయారు చేశారు. గేట్లు తయారు చేసి నిలిపి మూడు నాలుగు నెలలు మాత్రమే అయింది. సియాల్ కోట ముస్లిములు ఎక్కువగా వున్న పట్టణం. అక్కడి కొద్దిపాటి హిందువులు స్వరక్షణ కోసం యిటీవలే 'గేట్లు' తయారు చేసుకున్నారు. ఫోర్ట్ స్ట్రీట్‌లోని చాలా మంది కాంగ్రెస్ పార్టీ సభ్యులు. వాళ్లకు తమ నాయకుల హామీల మీద అచంచల విశ్వాసం వుంది. హరేకృష్ణకు మటుకు ఈ నాయకుల ధోరణి సందేహాస్పదమే. అతని ఆలోచన మీదనే యువ బృందం స్థాపించు కోవడం, గేట్లు భద్రంగా అమర్చుకోవడం జరిగినాయి. కాంగ్రెస్ వాళ్లు తమను నిర్లక్ష్యం చేస్తే యేమిటి గతి ? ముస్లిములు మూక ఉమ్మడిగా దొమ్మికి వస్తే యేమిటి మార్గం ? నగరంలోని కొన్ని హిందు సంస్థలు ఆత్మ రక్షణకు అనువయిన శిక్షణలు యిస్తున్నాయి. అతని సలహా మేరకు ఈ వీధిలోని హిందూ యువకులంతా యీ శిక్షణ కేంద్రాలలో చేరి తగిన తరిఫీదు పొందారు. వాళ్లకు లాటీలు ఉపయోగించడం యితర గెరిల్లా కార్యకలాపాలు వచ్చేశాయి. ప్రతి యింట్లోను ఆసిడ్ నింపిన సీసాలు, యిటుకలు, మోటు కర్రలు వున్నాయి. శ్రీకాంత్ బహద్దూర్ దగ్గర తప్ప యింకెవరి వద్ద తుపాకి లేదు. ఆయన శ్రీమంతుడైన లాయరు.

మొహల్లాలో పెద్ద యిల్లు ఆయనదే. అయితే సాయంత్రం అయిందంటే ఆయన నిండా తాగి వుంటాడు. తుపాకి చేతపట్టా డంటే ముస్లిములకు బదులు హిందూ యువకులనే కాల్చి పారేసేంత మైకంలో వుంటాడు. ఆయనను నమ్మటానికి వీల్లేదు. అందుచేత ఆయన మీద ఆధారపడకుండా ఈ యువకులు తమ స్వశక్తినే సానబడతారు. కాకపోతే పోలీసు బలగం కూడా వున్నది గదా ! సిటీ పోలీస్ ఠాణా ఫోర్ట్ దగ్గరే వుంది. బజారు నుంచి నిండా నాలుగు వందల గజాల దూరం కూడా వుండదు. తూర్పు దిక్కుగా ఎదురుగానే వుంది. (వీళ్ల యింటిపై కప్పుల నుంచి పోలీస్ స్టేషన్ ఆఫీసులు స్పష్టంగా కనిపిస్తూనే వుంటాయి). మరి భయపడవలసిన అవసరం యేముంది ? వాళ్ల పద్ధతిలో వాళ్లు చక్కగా సాయుధులయి వున్నట్లే లెక్క. రక్షణ లోపం లేదు.

'మన క్షేమానికి, రక్షణకు ఎక్కువగా కావలసింది యుక్తి. వీథుల్లోకి రాకుండా వుండడమే మంచిది !' - అన్నాడు సూరజ్ ప్రకాష్. మనుగడకే భంగం వాటిల్లుతున్నదన్న తరుణంలో అతడు మరింత ధైర్య సాహసాలు, పెద్దరికం పొందినట్లున్నాడు.

అందరూ యేకాభిప్రాయానికి వచ్చి తమ తమ యిళ్లకు మరలి వెళ్లారు.

అరుణ్, నిరంజన్ సింగ్ తమ యింటి మెట్లు ఎక్కారు, వెనకాల వీధి గుమ్మం తలుపులు గట్టిగా బిగించి వేసి. సూరజ్ ప్రకాష్ అవతలి గుమ్మంలోంచి వెళ్లాడు, అక్కడా యిలాంటి జాగ్రత్తలే తీసుకుని. ఎవరో రాక్షసులు, క్రూరులు మీదపడి అంతా అల్లకల్లోలంచేస్తారన్నప్పుడు తీసుకునే జాగ్రత్తలన్నీ అవలంబించి అందరూ తమ యింటి తలుపులు గట్టిగా బిగించుకున్నారు.

ఊరేగింపు ట్రక్ బజార్ నుంచి బయలుదేరి వచ్చింది. ఈ వీధి తూర్పు దిశ మొగలో నిలచింది. చాలా భయంకరమైన దృశ్యం. ఉద్విగ్నత అంతటా ఆవరించి వుంది. రోడ్డు మీద తలలు సముద్రతలంలా రూపొంది వున్నాయి. అందరూ చిన్న చిన్న ముఠాలుగా విభజన అయివున్నారు. ఒక్కో ముఠా ముందు డ్రమ్ములవాళ్లు యిద్దరు ముగ్గురు వున్నారు. ఊరేగింపు మధ్యలో

అయిదారు చోట్ల యిత్తడి డ్రమ్ముల సంరంభం కూడా వుంది. అందరికీ యేవో ఆయుధాలు ; వెదురు కర్రలు - తోలు పటకాలు. కొందరయితే లాఠీలు పట్టుకువున్నారు. సాధారణంగా పంజాబ్ గ్రామస్తులందరూ ఆత్మ రక్షణ కోసం లాఠీలు ఎప్పుడూ చేతుల్లో వుంచుకుంటారు ఊరేంగింపులో జనం చాలా మంది భంగ్రా నృత్య భంగిమలు చేస్తున్నారు పంజాబ్‌లో ఈ నృత్యం విజయ సూచకం. డ్రమ్ములు వాయిస్తున్నవాళ్లు కర్రలతో బాదుతూ చప్పుళ్లు చేస్తున్నారు. నృత్యం చేస్తున్నవాళ్లు వొళ్లంతా వెనక్కు ముందుకు ఊపుతూ పరవశులై వున్నారు. అప్పుడప్పుడు డ్రమ్మువాద్యం, నృత్య విహారం నిలిచిపోతున్నాయి. అప్పుడు వాళ్లు అలసట తీర్చుకుంటూ 'పాకిస్తాన్ జిందాబాద్! పాకిస్తాన్ కలకాలం వర్థిల్లాలి !' అని నినాదాలు చేస్తున్నారు.

వీధి మొగలో ఊరేగింపు ఆగింది. ముందుగా నడుస్తున్న నాయకులు కొద్దిసేపు తమలో తాము సమాలోచనలు చేసుకున్నారు. వాళ్లు ఎర్రటి టోపీలు, నల్లని కుచ్చులు ధరించారు. మెడలలో మల్లె మాలలున్నాయి. ఉక్కగా వుంది. వాళ్లు అంగరఖాలు, తెల్లటి పైజమాలు తొడుక్కున్నారు. వాళ్ల వాలకం, పద్ధతి చూస్తూ వుంటే వాళ్లంతా సుశిక్షుతులైన కుస్తీదార్లు, మాంస విక్రయులు, జంతువుల్ని నరికేవాళ్లు అయివుండాలనిపిస్తోంది.

ఈ ఊరేగింపు నాయకులకు, హిందూ గృహస్థులు తమ యిళ్ల పై కప్పుల నుంచి తమను గమనిస్తు వున్నారనే విషయం తెలుసు. ట్రంక్ బజార్ పక్క యిళ్లూ, ఆ యిళ్లకు చేసిన బందోబస్తు వాళ్లను ఉసిగొల్పుతూ వున్నాయి. ఇంతవరకూ యితర మొహల్లాలు అనేకం దాటి వచ్చారు. ఎదురుగా కోట కనిపిస్తూ వుండడం, పోలీస్ ఆఫీసులు తమ చర్యలను గమనిస్తూ వుండడం వాళ్లకు తెలుస్తూనే వుంది. హిందువులకు యేదేనా అపకారం చేద్దామనే వుద్దేశ్యం వాళ్లకు లేదు. బ్రిటిష్ వారు పాకిస్థాన్ యేర్పాటుకు అంగీకరించారన్న విషయం తెలిసింది గనుక తమ ఉత్సాహాన్ని ప్రదర్శించడమే వాళ్ల ఉద్దేశ్యం. తమ ఉత్సాహాన్ని ఆరాటాన్ని యిక్కడి హిందూ వ్యాపారస్థులు గట్టిగా గమనించేట్లు చేయడం అవసరం అనిపించింది వాళ్లకు. ఈ వ్యాపారస్థులు

అనేక సంవత్సరాలుగా నగరంలోని వాణిజ్యం అంతటినీ తమ ఆధీనంలోనే వుంచుకున్నారు గదా !

ఊరేగింపు నాయకుడు ట్రంక్ రోడ్డు వెంట వెళ్లకుండా, ఫోర్ట్ స్ట్రీట్‌లోని మొదటి యింటి వైపు నడిచాడు. ఊరేగింపు జనం ఆ మొహల్లా లోపలకు వెళ్లితీరాలని పట్టుపట్టారు.

వీధికి తూర్పు దిశలో శ్రీకాంత్ బహద్దర్ యిల్లు వున్నది గదా ! ఆ యింటి కప్పు మీద ఆయన పిల్లలు, బంట్రోతులు పిట్టగోడ దగ్గర అతుక్కుపోయి నిలబడి వుండి బజార్లో జరుగుతున్న సంరంభాన్ని గమనిస్తున్నారు. శ్రీకాంత్ బహద్దూర్ వాళ్లలో లేడు. ఆయన భార్య కూడా లేదు. ఆ మహాభవనంలో ఏదో ఓ మూల గదిలో తప్పతాగి పడివున్నాడు ఆయన. ఆయన భార్య మరో గదిలో యేడుస్తూపడి వుంది.

లాలా కాన్షీరామ్ పంటి బిగువుతోనే 'పోలీసులు యీ ఊరేగింపును ముందుకు సాగిపొమ్మని హెచ్చరించ రేం ?' అన్నాడు.

ఊరేగింపును అనుసరిస్తూనే అనేక మంది పోలీసు జవాన్లూ వున్నారు. బిగించి వున్న గేట్ల వైపు ఊరేగింపు జనం చొరబడి రావటాన్ని గమనిస్తూనే పోలీసులు చూచీ చూడనట్లుగా ఉండిపోయారు.

'వినండి - ఓ - లాలా లారా ! మీకేం అపకారం చేయం యిప్పుడు. ఈ వీథిలోంచి ఊరేంగింపు సాగించడమే మా ఉద్దేశ్యం. అందుచేత కిందకు వచ్చి గేటు తలుపులు తెరవండి !'

ఇళ్లకప్పుల మీద నిలబడి వున్నవాళ్లందరకూ యీ మాటలు వినబడ్డాయి. కాని ఎవరూ కదల లేదు. వాళ్లలో వాళ్లు మాట్లాడుకోలేదు కూడ. ఆ అరుపుల తీవ్రత ఎంతలా వున్నదంటే - ఆ మాటలకు వాళ్లందరూ శిలలుగా మారిపోయి ఉన్నచోటనే గడ్డగట్టుకు పోయారు. ఈషర్ కేర్ మూర్ఛ వచ్చినట్లు తూలుతోంది. ఆమె పొట్టకు చేతులు అన్చి అక్కడే నిలబడిపోయింది. కిందికి వెళ్లి ఓ

మంచం మీద చేరుకోవాలని ఆమెకు తెలుసు. కాని పిట్టగోడ వెనక్కు రావటానికి ఆమెకు యిష్టం లేదు.

బజార్లోని ఊరేగింపు మనుషులు షుమారు మరింత బిగ్గరగా అరిచారు.

'చెబుతున్నాం వినండి. గేట్లు తెరవండి -'

అల్లాహో అక్బర్ అనే నినాదం ఊరేగింపుపెద్ద నోటి నుంచి వెలువడింది. ఆ నినాదం అందరినీ ఆవేశించింది. అందరూ క్రమంగా ఈ నినాదం చేయసాగారు. ఆకాశమంతా అల్లాహో అక్బర్ - అల్లాహో అక్బర్ - నినాదాలతో నిండిపోయింది.

పద్మిని లాలా కాన్షీరామ్ దగ్గరకు వచ్చి ... "లాలాజీ, వాళ్లు మమ్మల్ని అగౌరవ పరుస్తారేమో !' అంది.

పద్మిని ఓ అనాథ. బీబీ అమరావతి యింటి బేస్‌మెంట్‌లో వుంటుంది. ఆమెతో పాటు ఆమె కుమార్తె చాందినీ కూడా వుంటుంది. కొన్ని సంవత్సరాల క్రితమే వాళ్లు యిక్కడకు వచ్చి అప్పటికి కాళీగా వున్న అమరావతి యింటిలోని కాళీ గదిని తీసుకున్నారు. పద్మిని భర్త చనిపోయి చాలాకాలం అయింది. ఆ యింట, యీ యింట పని చేసుకుంటూ కాలం గడుపుతోంది ఆమె. తల్లీ కూతురూ వీధిలోని యిళ్లకు రోజూ రెండు సార్లు వెళ్లి వంట గదుల దగ్గర పేరుకుపోయి వున్న పనులన్నీ, అంట్లు తోమడం - గిన్నెల కడగడం లాంటివి చేస్తూ వుంటారు. వాళ్లు ముఖ్యంగా పనిచేసేది బీబీ అమరావతి యింట్లోనూ, లాలా కాన్షీరామ్ యింట్లోనే అయినా, యింకా నాలుగయిదు యిళ్లలో వాళ్లకు వాడుకలు వున్నాయి. కూతురు వయసులో చిన్నది, పద్దెనిమిదేళ్లు వుంటాయి. బీదరకంలో వున్నా గుండుగా ఆరోగ్యంగా కనిపిస్తుంది. తల్లికి నలభై సంత్సరాలు దగ్గర పడుతూ వుంటాయి. సుకుమారమైన మనిషి; మందగిస్తున సౌందర్యం. చిరిగిన దుస్తులు. అక్కడక్కడ తల వెంట్రుకలు నెరసిపోతున్నాయి. అయినా జుట్టుకు రంగు వేసుకోదు. కాని ఆమె ముఖంలో యేదో కళ, కొట్టవచ్చినట్లు కనిపంచే సుందర లాలస వున్నాయి. స్తనాలు జారిపోయినట్లు

అనిపించినా దూరానికి నీలమణులలా భాసిస్తాయి. నేను బీదరాలనయిన విధవనే కావచ్చును, అయినా నేను రాణిని ! మహా రాణిని.... అన్నట్లు వుంటుంది ఆమె వాలకం.

లాలా కాన్షీరామ్ ఆమె కంఠస్వరం వినడంతోటే తల పైకెత్తి చూచాడు. ఆకాశంలో మేఘాలు అలుముకుని వున్న రాత్రి సమయం గనుక వాళ్లు సమావేశం అయినచోట అంతా చీకటిగా వుంది. లాలా కన్షీరామ్‌కు ఆమెకు యేమని సమాధానం చెప్పాలో వెంటనే తోచలేదు. భయం ఆయనను ఆవహించినట్లయింది. గుండె పిండివేసినట్లయింది.

అరుణ్, సూరజ్ ప్రకాష్, నిరంజన్ సింగ్, లాలా బహారీలాల్ కొడుకు ఫూల్ చంద్ ... అందరూ ఆయన చుట్టూమూగి వున్నారు. వీళ్లంతా యువకులు. కార్యవాదులు. మనం యేదో చేసి వేయాలనే పట్టుదల వాళ్లకు వుంటుంది. వీధిలో గేటు మూసి వుంచటానికి గవర్నమెంటు వారి అనుమతి వుంది. (రాత్రి తొమ్మది గంటలు దాటిన తర్వాత మొహల్లా ద్వారం తాళం బిగించి వుంచుకోవచ్చునని శాసనం). ఎవరూగానీ ఆ తాళాన్ని బద్దలు కొట్టవలసిన - అసలు తాకవలసిన అవసరమే లేదు. అల్లరితనం, గందరగోళం - యిలాంటి వాటిని అపు చేయవలసిన బాధ్యతకల పోలీసులు కూడా యిక్కడే వున్నారు. వాళ్లూ యేం చేస్తున్నట్లు ?

చేతులు కట్టుకుని కూర్చోవడం - నిలబడడం - చేత కాదు, అన్నట్లుగా నిరంజన్ సింగ్, 'నాకు అనుమతి యివ్వండి, వాళ్ల మీద. ద్రావకం సీసాలు గుమ్మరిస్తాను' అన్నాడు.

'తరువాత ఎంత రద్దీ అవుతుందో నీవు ఊహించగలవు గదా !'

తతిమ్మా యువకులందరూ ఈ మాటతో అంగీకరించినట్లే అగుపించారు. కాని నిరంజన్ సింగ్ మటుకు అక్కడ నుంచి విసుక్కుంటూ గొణుక్కుంటూ-నడిచాడు. ఈ హిందూజాతి బలహీనమైనది ; ఎప్పుడూ పర్యవసానం యేమవుతుంది అని అంచనా వేసుకుంటూ వుంటుంది. గురుమహరాజ్

యిలాంటి సందర్భాలలో తగినంత ధైర్యసాహసం, శరీర దార్ఢ్యం ప్రసాదించాడు తనకు. అయితే హిందువులు మాత్రం వీటిని ఉపయోగించనివ్వరు. అతను గడ్డం సవరించుకున్నాడు. అనేక మార్లు దువ్వెనతో గడ్డం వెంట్రుకలను సరిచేసుకుని చిన్నగా ముడివేసుకున్నాడు. తరువాత తలపాగ సరిదిద్దుకున్నాడు; బుజాలు ఎగురవేశాడు. తన యింటి పైకప్పు వైపు నడకసాగించాడు.

'జోహై ! నిరంజన్ సింగ్, నిరంజన్ సింగ్ ; ఓహోయ్ ! అరుణ్'

పిలుస్తున్నది ఎవరో అతనికి తెలియ లేదు. గాలిమటుకే ఆ స్వరాన్ని, అక్కడి జనం మానసిక అవస్థకు రూపకల్పన చేసి, తీసుకు వచ్చింది.

'ఇప్పుడు యేం చేయమంటారు ? మీకేం కావాలి ?'

గాలిలోంచి బదులు స్వరం పలికింది ? అక్కడ ఆ పైన యేం చేస్తున్నావు ?'

మరో హిందూ పిరికితనం. ఆ వీధిలో మరికొందరు సిక్కులు కూడా నివసిస్తున్నారు. అయినా ఈ గొంతు హిందూ స్వరమేనని అతనికి తెలుసు. సిక్కులు తమ కత్తులు నూరుకుంటూ తయారు చేసుకుంటూ వుంటారు బహుశ !

'మీరే వచ్చి చూడండి -' అన్నాడు అతను పై నుంచే. అతని గొంతులో మితి మీరిన అసహ్యం ధ్వనిస్తుంది. 'వాళ్ళు తాళం బద్దలు గొట్టి వీధిలోకి జొరబడాలని చూస్తున్నారు. ఏం జరుగనున్నదో చూడాలనే ఆకాంక్షతో వీధిలోని యిళ్ళ కప్పులు అన్నిటి మీదే జనం గుమిగూడివున్నారు.

బజారులో గుంపు అవిశ్రాంతం అయింది. వాళ్ళు గేటును కాళ్లతో తన్నుతున్నారు. 'మేం వీధిగుండా వెళ్లకుండా వెనక్కుపోము !' అని దృఢచిత్తంతో అరుస్తున్నారు.

'అల్లాహో అక్బర్' అనే అరుపులు మిన్నుముట్టుతున్నాయి. వాళ్ల చేతులలో ఎన్ని ఈటెలు, బల్లేలు వున్నాయో లెక్కలేదు.

'ఆ అరుపులు వినండి ; గమనించండి' అని వీళ్లు జాగరూకం అవుతున్నారు.

డ్రమ్ములు వాయిస్తున్న వాళ్లను దగ్గరకు పిలిచి గేటుకు బయట పోగుచేశారు. శరీరంలో వున్న శక్తి అంతా ఉపయోగించి డ్రమ్ములు వీలయినంత బిగ్గరగా కొట్టమనీ, ఎక్కువ శబ్దం చేయమనీ అడిగారు.

తరువాత వాతావరణంలో అలుముకుపోయిన చప్పాళ్లకు చెవులు గడులు పడుతున్నాయి. ఓ ముప్పై, ముప్పై అయిదు మంది వుంటారు డ్రమ్ములు వాయిస్తున్న వాళ్లు. వాళ్ల రకరకాల రంగుల లుంగీలు ధరించి వున్నారు. ఆ చప్పాడులకు, అల్లరి ఆగ్రహాలకు మనస్సు ఉన్మత్తం అయిపోవలసిందే తప్ప మరో మార్గం లేదు. కాళ్ల మీద దృఢంగా నిలిచి, నడుములు వంచి డ్రమ్ములు వాయిస్తున్నారు. ఈ స్థితిలో డ్రమ్ములు వాళ్ల కడుపుల మీద పెరుగుతూ వస్తున్న కాన్సర్ రోగస్థుల వాపులలా అనిపిస్తున్నాయి. డ్రమ్ములు వాళ్ల శరీరాలలో విడదీయరాని భాగంగా కనిపిస్తున్నాయి. వాళ్ల చేతులలోని వాద్యం పుల్లలు - ఒకటి దృఢమైనది కాకి కాళ్ల లాగ చివరలు చీలి వుంది, రెండోది నిటారుగా పలుచగా వుంది. ఈ రెంటితో వాళ్లు మెరుపులు కురిపిస్తున్నట్లుగా డ్రమ్ము మీద ధ్వనులు చేస్తున్నారు. శతాబ్దాల తరుబడి వాళ్ల అంతరంగాలలో గూడుకట్టుకు పోయిన ఉద్వేగం యీ సంరంభంలో ద్యోతకం అవుతోంది. వాద్యం ఒకలయ ప్రకారమే నడుస్తోంది. డగా - డగ్ - డమ్ ; డగా - డగ్ - డమ్ ; డగా - డగ్ - డమ్ ... యిలా. చివరి 'డమ్' అనే శబ్దం కుడి చేతిలోని దృఢమైన పుల్లతో చేస్తున్నారు. మొదటి 'డగా' రెండవ 'డగ్' ఎడమ - కుడి చేతులతో ఒకమారు ఒకటిగా వాయిస్తున్నారు. ఇవి రెండూ కాస్త మంద్ర స్వరం. చివరిది మాత్రం దృఢస్వరం. ఇదంతా లయ ప్రకారం జరుగుతూ వస్తోంది. చివరి 'డమ్' శబ్దంతో ఒక వరుస పూర్తి అవుతుంది. గుండె కొట్టుకోవడంలో ఒక పద్ధతి, పూర్తి ఒక వరుస పూర్తయిందంటే, ఆ ధ్వనులకు అనువర్తనంగా రాక్షస శక్తులు పోగవుతాయి. జన సమూహంలో కలిసిపోయి అందరినీ మరింత ఉద్విగ్నం, ఉద్రిక్తం చేస్తాయి.

డ్రమ్ములు వాయించేవాళ్లు ఉన్నత స్థితిలో కొట్టుకుపోతున్నారు. ఏమాత్రం కల్తీలేని, నీరసంలేని పిచ్చి ధోరణి ! అవును. వాళ్లలా ఎందుకు తయారవరూ ? ఈ రోజువాళ్లు కోరుకుంటున్న 'పాకీస్థాన్' మంజూరు అయింది. వాళ్లకు అవసరం అయిన పవిత్ర క్షేత్రం తయారయింది. నడుములు విరుచుకుని బానలవంటి పొట్టలు ముందుకు సారిస్తూ, డగా - డగ్ - డమ్ అని వాయించుకుంటూ పిశాచాల మాదిరి తిరుగుతారు.

జన సందోహంలో నుంచి మరో రకమైన అరుపులు వినవచ్చాయి. ఈ అరుపులు డ్రమ్ములు శబ్దాన్ని మించిపోయాయి, దిగమింగి వేస్తున్నాయి. అంత గందరగోళంలోనూ, విచలిత స్థితిలోను స్పష్టంగా వినవస్తున్నాయి. 'ముందుకు పదండి !' గేటు బద్దలు కొట్టండి. ముందుకు దూసుకు పోండి. .. పాకిస్తాన్ జిందాబాద్ !!" - యివీ ఆ అరుపులు.

ఈషర్.కేర్‌కు యిదంతా భరించడం కష్టం అయిపోయింది. ఏడవడం మొదలు పెట్టంది. ఈ అరుపులు ఎంతో భయంకరంగా, అల్లరి చిల్లరిగా, అవినీతి వ్యాపకంగా తయారవుతున్నాయి.

ప్రభారాణి ఆ యేడుపు, ఉద్విగ్నత గమనించి మెల్లగా అంది ఆమెతో, 'ఇషరో! వెళ్లు.... నీ గదిలోకి వెళ్లిపడుకో నిదానంగా ఇక్కడ వుంటే నీకు మంచిది గాదు. నీ కడుపులో పిల్లవాడికి హానికరం.... వెళ్లు"

అందరికీ యిప్పుడామె గర్భిణి అన్న విషయం తెలసి పోయిందన్న మాట. బీబీ జీ యీ సంగతి అంత బిగ్గరగా అనవలసిన అవసరం యేమిటి? ఇప్పుడు ఈషర్ కేర్ మరింత పెద్దగా యేడవనారంభించింది. దుపట్టాతో ముఖం మూసుకుంది. వెక్కిళ్లు, ఊర్పులా అవిరామంగా వస్తున్నాయి.

లాలా కాన్షీరామ్ అన్నాడు. 'నీకు వచ్చిన ప్రమాదం యేమీ లేదు, అమ్మాయీ! మరేం భయపడకు. మేం అందరం ఉన్నాం. నీకేం ఆపద రాకుండా కాపాడుతాం.'

ఆమె తండ్రి సర్దార్ తేజ్ సింగ్ మటుకు 'అమ్మాయిని లోపలకు తీసుకుపోయి విశ్రాంతిగా నిద్రపోనివ్వడమే మంచిది అనుకుంటాను' అన్నాడు.

సరీగా ఆ సమయంలో వాళ్ల కంటికో దృశ్యం కనబడింది. కోట నుంచి చాల మంది పోలీసులు పరుగెత్తుకుంటూ యిటే వస్తున్నారు. కోట దీపాలతో వెలిగిపోతూ వుంది. ఇంటి కప్పుల మీద నిలబడి వున్న మనుషులందరూ స్పష్టంగా కనిపిస్తూనే వున్నారు. వాళ్లు యింత సేపూ చూడడం కోసం ఎదురు చూసినది యిదే ! పోలీస్ స్టేషన్ ముందు యింత హంగామా, గందరగోళం జరగడం యేమి సబబు ?

లాలా కాన్షీరామ్ 'నిదానంగా వుండండి, అబ్బాయిలూ మనమేం తలలు బద్దలు కొట్టుకోవలసిన అవసరం లేదు. పోలీసులు యీ పరిస్థితిని సునాయాసంగా పరిష్కరిస్తారు ; మనం చూస్తూవుందాం.' అన్నాడు.

'పోలీసులు దగ్గరగా వచ్చేశారు '

'ఇందాక నుంచి వున్నవాళ్లు చాలరు. ఇప్పుడు ఆ పై నుంచి గుంపులు గుంపులుగా వస్తున్నారు. అదుగో, అటు చూడండి' అన్నాడు లాలా కాన్షీరామ్ కోట మీద నుంచి కిందికి చీమల బారులలాగ వస్తున్న పోలీసు దళాలను చూపిస్తూ.

కొద్దిసేపటిలోనే సిటీ ఇన్స్పెక్టర్ ఇనాయత్ ఉల్లాఖాన్ తన బలగంతో అక్కడ ప్రత్యక్షమయ్యాడు. రైఫిల్ ధరించిన పోలీసులు చాల మంది అతనితో వచ్చారు. గడిచిన ముప్పయి సంవత్సరాలుగా అతను పోలీసు బలగంలో వున్నాడు. నగరంలో మనుషులందరినీ ఎరుగును. వేలాది పేర్లు తెలుసు అతనికి. బ్రిటిష్ ప్రభుత్వం వారి అలవాటు యేమంటే క్రింది తరగతి పోలీసు ఆఫీసర్లను ఒక నగరం నుంచి మరో నగరానికి బదిలీ చేయరు, వాళ్ల మీద ఎన్నో ఫిర్యాదులు వుంటే తప్ప. సీనియర్ పోలీసు ఆఫీసర్లు - ఇన్స్పెక్టర్ పై హోదాల వాళ్లు రాష్ట్ర అంతటా బదీలలకు గురి అవుతారు గాని, ఇన్స్పెక్టర్లు మాత్రం సాధారణంగా ఒకే చోట వుండిపోతారు. ఈ పద్ధతి చాలా సరైనది, ఉచితమైనది అంటాడు ఇలాయత్ కాన్. నగరం - దాని వాతావరణం అంతా క్షుణ్ణంగా తెలిసిన వాడు అయితే తప్ప యే ఇన్స్పెక్టర్ గానీ నేరాలను కనిపెట్టటం, పరిహారాలు చేయడం ఎలా కుదురుతుంది గనుక ? .... ఈ

పద్ధతి ఫలితంగా ఇలాయత్ ఖాన్ తన సర్వీసంతా యిక్కడే గడిపాడు ; ఈ నగరంలోని నేరాల మీదనే శ్రీమంతుడు అయ్యాడు. అతనంటే ఆ నగరవాసులకు బహు భయం. నేరస్థుల కంటె యిన్‌స్పెక్టర్ అంటేనే వాళ్లకు యెక్కువ భీతి.

అతడు రంగ ప్రవేశం చేయగానే, అక్కడ గుమిగూడిన వాళ్లందరూ వెనక్కు తగ్గారు.

అతడు చేయిపైకెత్తి, ఆ గుంపు నాయకులను ఉద్దేశించి 'మీరందరూ యిక్కడ యేం చేస్తున్నారు ?' అని సాధికారంగా అరిచాడు.

వాళ్లలో ఒకడు బహునిదానంగా అణుకువగా 'అయ్యా, ఇన్‌స్పెక్టర్ గారూ ! మేం యిక్కడ మేమీ అకృత్యం చేయడం లేదు ; న్యాయ విరుద్ధమైన పనిచేయడం లేదు' అన్నాడు. వాళ్లకు ఇనాయత్ ఖాన్ సంగతి క్షుణ్ణంగా తెలుసు.

అతడు వివరణ కోసం వేచి వుండిపోయాడు.

'అయ్యా, ఇన్‌స్పెక్టర్ గారూ ! పాకిస్తాన్‌ను కొత్తగా యేర్పాటు చేయడానికి అంగీకరించిన విషయం తెలుసుకుని వుంటారు. ఈ రాజ్యం కోసం దేశంలోని మహమ్మదీయులంతా సంవత్సరాల తరుబడి - మీరు, నేను మనలాంటి వాళ్లందరూ - వేచి వుండిన విషయం కూడా మీరు యెరుగుదురు -' ఇంతవరకూ చెప్పి, అతడు యుక్తిగా ఆగిపోయాడు. రెండు చేతులూ లౌడ్‌స్పీకర్ మాదిరిగా నోటికి మూతచేసుకుని బాకా ఊదుతున్నట్లుగా ఊరేగింపు వయిపు తిరిగి 'పాకిస్తాన్' ... అంటూ అరిచాడు. జనం ప్రతిస్పందించడం కోసం ఆగాడు. వాళ్లూ వందలాది గొంతులు కలిపి 'జిందాబాద్' అని ఎలుగెత్తి అరిచారు.

'పాకిస్తాన్' - అన్నాడు అతడు మళ్లీ

'జిందాబాద్ - ' అని అనుస్పందన వచ్చింది.

'పాకిస్తాన్...' 'జిందాబాద్...'

ఇన్‌స్పెక్టర్ వయిపు తిరిగి అతడు యిలా అన్నాడు ;

'మేం యీ శుభ సన్నివేశాన్ని ఉత్సాహంగా జరుపుకుంటున్నాం. ఆనందోత్సహంలో భాగంగా యీ ఊరేగింపు చేసుకుంటున్నాం. ఇక్కడి హిందువులు మమ్మల్ని యీ రోడ్డు మీదుగా పోనివ్వకుండా అటకాయిస్తున్నారు. ఇది అందరికీ చెందిన రహదారి రోడ్డు కదా !'

ఇనాయత్ ఖాన్‌కు తెలుసు - యీ మునిసిపాలిటీలో పక్కరోడ్లు, సందులు, గొందులు - రాత్రి పూటలు రహదారికి మూతబడి వుంటాయనీ, అక్కడి జనం గేట్లు తాళాలు వేసుకుని జనం విచ్చల విడిగా తిరుగాడటానికి అటకాయింపు చేయడం సమ్మతమే ననీ ! అయితే అతను గూడా రేడియో ప్రకటన విన్నాడు. కొన్ని గంటల నుంచి అతనికి కూడా యిది న్యాయ సమ్మతం - యిది న్యాయ సమ్మతం కాదు - అదే విచక్షణ అంతరించిపోయింది. అంతః స్ఫూర్తి ఎలా నడిపితే అలా నడవడమే యీ సందర్భంలో జరిగేపని. బ్రిటిష్ గవర్నమెంటు వారి ఉత్తరువుల మీద అతనూ అనేక మార్లు ముస్లిం ఊరేగింపులను లాఠీ చార్జీలతో చెల్లా చెదురు చేసివున్నాడు. అతనికి అలా చేయడం సుతరామూ యిష్టం లేనిమాట నిజమే. అయినా ఉత్తరువులు అన్న తరువాత ఉత్తరువులే. వాటిని ఉల్లంఘించటానికి వీలు లేదు. కాంగ్రెస్ ముస్లిములపైన లాఠీచార్జి చేయవలసి వచ్చినప్పుడు మాత్రం అతనికి కొంత ఊరడింపుగా వుండేది. దానిని ఎంతో దౌర్జన్యపూరితంగా అమలు జరిపేవాడు. అదే పని ముస్లిం లీగ్ ముస్లిముల మీద జరపాలంటే.... అల్లా.... అల్లా.... యింకేమయిన వుందా ?

అతని అంతరంగం, హృదయం యిటువంటిదారుణ కృత్యాలు జరపవలసి వచ్చినప్పుడు యెంతో కుమిలిపోయేది. దీనికి పరిహారం యేమిటో తెలియదు. అల్లా ఎన్నటికీ తనను యిలాంటి దుష్కృత్యాలకు క్షమించడు. సరే ! ఈ రోజు తన దుష్కృత్యాలకు పరిహారం చేసుకోగల సదవకాశం వచ్చింది. చేయి కిందకు దించి, నాయకులతో యిలా అన్నాడు. 'మీరు చెబుతున్నదానిలో కొంత నిజం వుంది !'

జనం గెలుపొందినట్లుగా సంతోష ప్రకటనలు చేయసాగారు. డ్రమ్ము వాద్యగాళ్లు మరింత హుషరుగా, ఉద్వేగంతో చప్పుళ్లు చేయనారంభించారు. నాయకులలో ఒకడు ముందుకు నడిచి ఇన్‌స్పెక్టర్ మెడలో మల్లెమాల వేశాడు.

ఇనాయత్ ఖాన్ ఇంటి కప్పుల మీద నిలబడి వున్న వాళ్లు యెవరెవరో గుర్తు పట్టలేకపోయాడు. అయినా ఆ ప్రాంతంలో నివసించేది యెవరో అతనికి క్షుణ్ణంగా తెలుసు.

అతను బిగ్గరగా 'లాలా కాన్షీరామ్ ! ఈగేటు తెరిపిస్తారా ?' అని అరిచాడు.

ఊరేగింపు జనం విజయోత్సాహంతో మరింత బిగ్గరగా అరుస్తున్నారు.

'అయ్యా ! ఈ ఊరేగింపు జనాన్ని చూస్తూంటే మాకు భయంగా వుంది. వీళ్లు మా ఆస్తులు పాడుచేస్తారు, ఇళ్లు తగుల బెడతారు'

- వాళ్లు అలా చేస్తే తనకూ సంతోషమే, అనుకున్నాడు ఇనాయత్ మనసులో. పైకి మాత్రం 'అలా జరగదు. ఈ వీధిగుండా ఊరేగింపు నడిపించుకుపోవటమే వాళ్ల ఉద్దేశ్యం -' అన్నాడు.

ఇళ్ల పైకప్పులలో నిశ్శబ్దం ఆవరించుకుంది.

'మరేం చేయకండి -' అని సన్నగా ఒక ధ్వని వినిపించింది. వకీలు గారి యింటి మీదనుంచి వచ్చింది అది. ఆయన చాలా శ్రీమంతుడైన వకీలు. పైకి చూస్తే, శ్రీకాంత్ బహదూర్ గారి భార్య నించోని వుండడం అగుపిస్తోంది, లీలగా.

'నేను డిప్యూటి కమీషనర్‌ను, సూపర్నెంట్ ఆఫ్ పోలీస్‌ను పిలిచాను - ఫోన్‌లో. -వాళ్లు యే క్షణంలోనైనా యిక్కడకు వస్తారు.'

- ఈ మాటలు అని ఆమె అంతర్ధానం అయింది ఆమె నీడలాగ అక్కడకు వచ్చింది, నీడ మాదిరే అంతర్ధానం అయిపోయింది. శ్రీకాంత్

బహదూర్ గారి యింట్లో మటుకే టెలిఫోన్ వుంది, యీ ప్రాంతం అంతటికీ. ఆ తాగుబోతు బుర్రలో వుండే దురాలోచనలు అందరూ యెరుగుదురు. అందుకనే ఎవరూ ఆయన సహాయం కోరలేదు. ఆయనకు నగరంలోని పెద్దలందరూ పరిచయమే. ఆయనకూ ఆయన కుటుంబానికి యెలాంటి విపత్తు సంభవించదు. అదీ గాక ఆయన వద్ద తుపాకి కూడా వుంది. మరేం. కావాలి ? అయితే ఆయన భార్యమాత్రం వేరే రకమైన మనిషి.

'ఆమె దేవత !' అన్నాడు లాలా కాన్షీరామ్, 'అయితే ఓ మృగాన్ని వివాహం చేసుకుంది. ఆమె మటుకు ఆమె దేవత !'

ఇన్‌స్పెక్టర్ ఇనాయత్ ఖాన్ ఉత్తరువుకు యెలాంటి బదులు రాలేదు. గేటు యింకా మూసుకుపోయే వుండింది. ఇది అతన్ని ఉడికిపోయేట్లు చేస్తోంది.

'విను.... ఓ కాన్షీరామ్ ! అయిదు నిమిషాలలో ఈ గేటు తెరిపించకపోతే, నా మనుషులకు ఉత్తరువు యిస్తాను.... దీన్ని విరగగొట్టేయమనీ, ముందుకు దూసుకుపొమ్మని !'

'అంత పని చేయగలడా ?' అన్నాడు అరుణ్ తండ్రితో బహు నింపాదిగా.

లాలా కాన్షీరామ్ మెడముందుకు సారించి చూచాడు. డిప్యూటీ కమీషనర్ వస్తున్నాడేమోనని. అతడు వస్తాడని అతనికి గొప్ప నమ్మకం యేమీ లేదు. గడిచిన కొన్ని సంవత్సరాలలో సీనియర్ ఉద్యోగాలు ఇంగ్లీషు దొరల నుంచి భారతీయులకు విరివిగానే సంక్రమించాయి. ఇప్పుడు సియల్ కోట డిప్యూటి కమీషనర్ హిందువే. సూపర్నెంట్ ఆఫ్ పోలీస్ మాత్రం ముస్లిం. వాళ్లు ఇండియన్ సివిల్ సర్వీసెస్‌కు చెందినవాళ్లు. బ్రిటిష్ రాజ్యాంగంలో యీ సర్వీసులకు మన్నన ఎక్కువ. వాళ్లు భారతీయ బలగమే అయినా లాలా కాన్షీరామ్‌కు వాళ్లపట్ల అంత విశ్వాసం లేదు. (ఇంగ్లీషు సూపరింటెండెంట్ ఆఫ్ పోలీస్ యిక్కడి నుంచి బదిలీ అయిపోయినప్పుడు లాలా కాన్షీరామ్ కంట తడిపెట్టాడు. తనకు ఆహ్వానం లేకపోయినా, ఆయన రైలు ఎక్కివెళ్లిపోతున్నప్పుడు స్టేషన్‌కు వెళ్లి పూలమాలలు వేసి వీడ్కోలు చెప్పివచ్చాడు).

వాళ్లు అలాంటివాళ్లు. అయినా ఎవరూ రంగ ప్రవేశం చేయలేదు.

'సరే - మీకు కావలసింది అదే అయితే, అలాగే కానివ్వండి -' అని ఇన్‌స్పెక్టర్ ఇనాయత్ ఉల్లాఖాన్, తన కాన్‌స్టేబుల్స్ వయిపు తిరిగి 'గేటు తలుపులు బద్దలు కొట్టండి' అని ఉత్తరువు యిచ్చాడు.

జనసందోహం 'యా ఆలీ ! యా హైదర్' అని బిగ్గరగా అరవసాగారు.

గందరగోళం మితిమీరిపోతోంది, మిన్నుముట్టుతోంది. పోలీసు బలగంలో అనేక మతాలకు చెందిన కాన్‌స్టబుల్స్ వున్నారు. హిందువులు, ముస్లిములను మొదటి చూపులోనే గుర్తించగలగడం - వేరు వేరుగా గమనించగలగడం - సాధ్యం కాకపోవచ్చు గాని, సిక్కుల విషయంలో అలా కాదు. వాళ్ల తలపాగలు, గడ్డాలు యిట్టే పట్టియిస్తాయి. ఇనాయత్ ఉల్లాఖాన్ తీసుకువచ్చిన పోలీసు బలగంలో చాలా మంది సిక్కులు వున్నారు.

గేటు బద్దలు కొట్టి ముందుకు దూసుకుపొమ్మని ఉత్తరువు యిచ్చినా సిక్కు కాన్‌స్టేబుల్స్ అడుగు ముందుకు వేయలేదు. వాళ్లు అలా ప్రవర్తించటానికి ప్రేరణ యేమిటో తెలియదు గాని, వాళ్లు అడుగు కదపటానికి సిద్ధంగా లేరు.

ఇనాయత్ ఉల్లాఖాన్ కోపంతో ఊగిపోతున్నాడు. అతడు సరిగా యిటువంటి అవకాశం కోసమే యెదురు చూస్తున్నాడు. తన రివాల్వర్ చేతుల్లోనికి తీసుకుని వాళ్లమీదికి దుమికాడు.

'క్రమశిక్షణ లేకపోతే మీకు యెలాంటి శిక్షలు' పడతాయో యెరుగుదురు కదూ ! ఊ.... కదలండి గేటు పడదోయండి. లేకపోతే మిమ్మల్ని ఉన్నచోటనే కాల్చిపార వేస్తాను'.

ఇతర కాన్‌స్టబుల్స్ ఇనపకడ్డీలు తీసుకు వచ్చారు. అవి ఎక్కడ నుంచి వచ్చిందీ ఎవరి ఊహకు అందదు. (బహుశ ముస్లిములే దాన్ని తమతో తెచ్చివుంటారని లాలా కాన్షీరామ్ విశ్వసిస్తున్నాడు.) ఆ ఇనుప కడ్డీని గేటుకు మోటి వాళ్లా ధ్వంసం చేయటానికి సిద్ధంగా వున్నారు.

సిక్కు సిపాయిలు అడుగులు కదపలేదు. జనం 'పాకీస్తాన్ జిందాబాద్' అని అరుపులు మిన్నుముట్టేట్లు సాగిస్తున్నారు. కొందరు 'వాళ్లను కాల్చిపారవేయండి' అని ఎదురు సవాళ్లు యిస్తున్నారు.

ఇనాయత్ ఉల్లాఖాన్‌కు వాళ్లను కాల్చడం యిష్టం లేదు. వాళ్లను తక్కువ చేయడం, బలహీన పరచడమే అతని వాంఛ. అతను మరో ప్రణాలిక తయారు చేసుకున్నాడు. వాళ్లను విడదీయడం అవసరం. ఒక్కొక్కరినీ సంబోధించడం మెదలెట్టాడు.

'బాంటా సింగియన్' అని ఎలుగెత్తి పిలిచాడు.

ఒక సిక్కు యువక సిపాయి పంక్తిలో నుంచి నాలుగు అడుగులు ముందుకు వచ్చి గౌరవ పురస్కారంగా సాల్యూట్ చేసి నిలబడ్డాడు.

'నిన్ను కాల్చేయమంటావా ?'

'వద్దండీ'

'అయితే ఇనుప దూలం వెనక్కు వెళ్లి నించో. గేటు పనిచూడు'

సిక్కు సిపాయి ఒక్కక్షణం తటపటాయించాడు.

ఇనాయత్ ఉల్లాఖాన్ 'ఊ - ముందుకు వెళ్లు' అని మళ్లీ గర్జించడంతోటే వెళ్లి ఇనుప దూలం వెనక నిలబడ్డాడు.

'దల్‌జిత్ సింగ్' అని మళ్లీ గర్జించాడు ఇన్‌స్పెక్టర్.

ఒక సిక్కు పంక్తినుంచి ముందుకు నడిచి సెల్యూట్ చేశాడు.

'సర్'

'నేను యిచ్చిన ఉత్తరువు వినిపించిందా ?'

'సర్'

'వెళ్లి దూలం వెనక నుంచో'

'మనల్దార్ నాతూ సింగ్' - ఈ మారు యింకొక గుంపులోంచి మనిషిని పిలిచాడు. డ్రిల్ సార్జెంట్ల గుంపు.

'సర్'

'వెళ్లు దూలానికి నీబల్ఠం యివ్వు...'

ఇన్స్పెక్టర్ యిప్పుడు ఒక యువక సిక్ ఆఫీసర్ వంక తిరిగాడు. ఆ సముదాయంలో అతడు ఒక్కడే సిక్ ఆఫీసర్. తతిమ్మా వాళ్లంతా హిందువులు, ముస్లిములూను.

'సబ్ ఇన్స్పెక్టర్ హర్దిత్ సింగ్ !' ఈ మారు యిదివరకటి అంత కటువుగా కాకుండా నిదానంగా పిలిచాడు.

'సర్'

'వీళ్లకు ఆ ఇనుప దూలాన్ని బలంగా ముందుకు నెట్టమని చెప్పు'

ఈ పని యిందాకనే చేసివుండాల్సిందని యిప్పుడు తోచింది ఇన్స్పెక్టరుకు. సిక్కు సిపాయిలకు వాళ్ల సబ్ - ఇన్స్టెక్టర్ చేతనే ఆజ్ఞలు యిప్పిస్తే యింకేమీ బాదరబందీ వుండేది కాదు. అయినా యీ వ్యవహారమంతా అతనే స్వయంగా నిర్వహించాలనే ఉద్దేశ్యంలో వున్నాడు అతను.

సిక్ ఆఫీసర్ కొన్ని క్షణాలపాటు ప్రశాంతంగా వుండిపోయాడు. తర్వాత గద్గద స్వరంలో యిలా ఉత్తరువు యిచ్చాడు :

'సరే ! అందరూ ఇనుప దూలం వెనకాలకు వెళ్లండి -'

అందరూ ఈ ఆజ్ఞను శిరసావహించారు. అధికారి యే మాత్రం దర్పం లేకుండా నిదానంగా మాట్లాడుతున్నాడు కద !

సరీగా ఆ సమంయలోనే డిప్యూటీ కమీషనర్, పోలీస్ సూపర్నెంట్ అక్కడకు చేరుకున్నారు. జరగవలసిన కార్యక్రమం అంతా ఒక్కమారుగా స్తబ్ధతకు వచ్చేసింది. గంటకు యాభయి మైళ్ల వేగంలో వీస్తున్న గాలి

అకస్మాత్తుగా ఆగిపోయినట్లు అయింది. ఇన్‌స్పెక్టర్ యిలా పరిణమిస్తుందని ఊహించలేదు. ఊరేగింపు లోని జనం కూడా యిది సాధ్యమని అనుకోలేదు.

డిప్యూటి కమీషనర్ సియల్ కోటకు వచ్చి కొద్దిమాసాలు మాత్రమే అయింది. అలాగే పోలీసు సూపర్నెంట్ కూడా. వాళ్లిద్దరూ ఒకే జీపులో వచ్చారు. అంటే యిక్కడ యేం జరుపవలెనన్న విషయంలో వాళ్లకు యేకాభిప్రాయమే వున్నదన్న మాట ! డిప్యూటి కమీషనర్ చేయవలసిన పని ముందుగా సూచించి, పోలీస్ సూపర్నెంట్‌ను మార్గ మధ్యంలో జీపు ఎక్కించుకుని వచ్చాడు. వాళ్ల వెనకాల నగరానికి బహు దూరంలో వుండే సిపాయి బారాక్స్‌కు చెందిన ఆరు దళాలు రిజర్వ్ పోలీసులతో నిండిన ఆరు లారీలు నిలిచివున్నాయి. ఈదళాలు ఇన్‌స్పెక్టర్ ఆధిపత్యం క్రింద వుండవు.

డిప్యూటి కమీషనర్ పొట్టి మనిషి. గుండ్రని ముఖం. బరువైన శరీరం. ముస్లిముల చేత శతాబ్దాల తరుబడి లొంగదీయబడి కుమిలిపోతున్న హిందూ జాతికి చెందినవాడు. ఏమయినా ముందు వెనుక ఆలోచన చేస్తూ కూర్చోకుండా, జీప్ దిగి ధైర్యంగా గుంపు మధ్యకు జొరపడి వెళ్లాడు. జనానికి అతను ఎవరో తెలుసును గనుక కిమ్మనకుండా దారి యిచ్చారు. ఇన్‌స్పెక్టర్ ఇనాయత్. ఖాన్, యితర పోలీసు ఆఫీసర్లు అయనకు సెల్యూట్ చేసి వినయంగా బారు తీర్చి నిలుచున్నారు.

ఊరేగింపు సంరంభం అంతా నిశ్శబ్దం అయిపోయింది. ఇప్పటికి ట్రంక్‌బజార్ దగ్గరకు ఊరేగింపు చేరుకుని ఒక గంటకు పైనే అయింది. ఏదో గందరగోళం జరగపోబోతోందన్న స్థితిలో జిల్లా అధికారి - డిప్యూటి కమీషనర్ - ముందుకు వచ్చి ప్రత్యక్షంగా నిలబడ్డాడు. ఆయన హిందువు అన్న సంగతి అందరికీ తెలుసు అయినా ప్రభుత్వం తరుపున వచ్చినవాడు. అందుచేత నినాదాలు చేయడం నిలిపివేసి యేం జరుగుతోందో చూద్దామని అందరూ ఉత్సుకతతో ఆగిపోయారు.

'ఏం జరుగుతోంది యిక్కడ ?' అనడిగాడు డిప్యూటి కమీషనర్ సాధికారంగా.

ఇన్స్పెక్టర్ నంగినంగిగా 'యేమీ లేదు సార్, యేమీ లేదు సార్' అన్నాడు.

వాళ్లముందు కొంతమంది కానిస్టేబుల్స్ కొయ్యదూలం ముందు వేలాడుతూ నిలుచున్నారు.

'ఏమిటి దీనిఅర్థం ?' అన్నాడు దూలాన్ని చూపుతూ, డిప్యూటి కమీషనర్.

'చిన్న విషయం సర్. ఈ ఊరేగింపు మనుషులు యీ బజారు గుండా వెడదామనుకుంటున్నారు. కాని యిక్కడి యిళ్లవాళ్లు గేటుకు తాళాలు వేసేశారు'.

గొంతు యింకా తగ్గించి, డిప్యూటి కమీషనర్ తనకేదో ఆత్మీయుడయి నట్లు అయనకు రహస్య వర్తమానం అందిస్తున్నట్లు ప్రవర్తిస్తూ ఇన్స్పెక్టర్ దగ్గరగా జరిగాడు. 'చూడండి సర్ మనం యిప్పుడు కాదంటే ఈ ఊరేగింపు వాళ్లు యేదో అఘాయిత్యం చేసి యిక్కడ మరింత హాని జరిగేట్లు చూస్తారు.'

ఇన్స్పెక్టర్ కంఠస్వరమూ, యింతవరకు అతను ప్రవర్తిస్తున్న తీరు ఇంగ్లీషు దొరల దగ్గర తరిఫీదు పొందిన డిప్యూటి కమీషనర్‌కు రుచించకపోగా వెగటు అనిపించింది.

ముందుగా అయన ఇన్స్పెక్టర్‌నుంచి దూరంగా జరిగాడు, తనకూ అతనికీ యేమీ సంబంధం లేదన్నంత దూరం. అతను యిచ్చిన సంజాయిషీని విననట్లుగా - సరకు చేయనట్లుగా - 'అయితే మీ మనుషులు అగేటును తెరవటానికి ప్రయత్నిస్తున్నారంటావా ?' అనడిగాడు.

'సర్ నాకు యింత కంటె యింకో మార్గం లేదు' అన్నాడు ఇన్స్పెక్టర్ చేతులు ఊపుతూ. 'లేకపోతే యీ గుంపు యిక్కడ నానా అగామూ చేసి హింసకు, దౌర్జన్యానికి పాల్పడతారు. ఆస్తి అంతా నాశనం చేసేస్తారు.' ఇన్స్పెక్టర్ యీ మాటలు అని సూపర్నెంట్ వంక చూచాడు. సాటి ముస్లిం గనుక తనకు మద్దతు ప్రకటిస్తాడని అతని ఆశ. అయితే సూపర్నెంట్ అతని వంక చూడనే లేదు.

'సరే నీ మెడలో ఆ పూలమాల యేమిటి ? తక్షణమే దాన్ని తీసి అవతల పారవేయి' అన్నాడు డిప్యూటి కమీషనర్ యిందాకటి నిక్కచ్చితనంతోనే.

'అలానే సర్ అలాగే సరే ! ఈ పూలదండ నా మెడలోకి ఎలా వచ్చిందో నేను గమనించనే లేదు సర్.'

డిప్యూటి కమీషనర్ యీ పరిస్థితిని తగిన రీతిగా ఉన్నది ఉన్నట్లుగా గమనించగలిగాడు. పోలీస్ సూపర్నెంట్ భుజం మీద చేయివేసి పక్కకు తీసుకువెళ్లి ఆయనతో రహస్యంగా 'ఆస్ఫర్, పరిస్థితి అదుపు మీరినట్లుంది ఊరేగింపు ముందుకు పోనివ్వడమే తప్ప యింకేం మార్గం లేదనుకుంటాను' అన్నాడు.

'మీరు చెప్పండి సర్'

వాళ్లు ట్రంక్ బజార్‌కు జీప్‌లో వస్తున్నప్పుడే ఈ విషయాన్ని గురించి పరస్పరం చర్చించుకున్నారు. ఇద్దరూ రేడియోలో వచ్చిన ప్రకటన విన్నవాళ్లే. దానికి నిర్ఘాంతపోయిన వాళ్లే. దేశాన్ని రెండుగా యెలా చీలుస్తాము ? అందులోనూ రెండు మతాలవాళ్లూ యింతగా కలిసిపోయి కలిసి మెలిసి మెలుగుతూ వున్నప్పుడు ! భారతదేశంలో ప్రతిమూలలోనూ ఒక హిందువు వున్నట్లే, ఒక మహ్మదీయుడు కూడా వున్నాడు. ఇంత తక్కువ వ్యవధిలో వాళ్ల నిద్దరినీ విడదీయలంటే సాధ్యమా ? రెండు కొత్త దేశాలలోనూ విధిగా కొందరు మైనారిటీలు మిగిలిపోతారు కద. వాళ్ల గతియేమవుతుందో ఆ ప్రకటనలో చెప్పనే లేదు. పాకిస్తాన్ యేర్పాటు చేయడం వెనుక వున్న తార్కికతను అంగీకరించినట్లయితే యిక యెక్కడా మైనారిటీల ప్రసక్తే వుండదు. పాకిస్తాన్ మైనారిటీల సమస్యను పరిష్కరించబోవడం లేదు. కాగా సరికొత్త మైనారిటీలను సృష్టిస్తూ వుంది. ఈ మైనారిటీలను పగ, క్రోధం వున్నవాళ్లు యెప్పుడయినా యెలాగయినా అంతం చేయవచ్చును. మరి తాము వున్న సివిల్ సర్వీసెస్ అన్నీ యేమయిపోతాయి ? సైన్యం పరిస్థితి యేమిటి ? ప్రభుత్వ యంత్రాగాన్నంతటినీ ఎట్లా విభజించబోతున్నారు ? ఈ యంత్రాంగంలో ప్రతిచోట హిందువులూ వున్నారు, మహ్మదీయులు ఉన్నారు కదా !

డిప్యూటి కమీషనర్, పోలీస్ సూపర్ఇంటెండెంట్ యిద్దరూ ఇంగ్లండులో శిక్షణ పొందిన వాళ్లు. ఇద్దరికీ దేశ రాజకీయాలతో నిమిత్తం లేదు వాటికి అతీతలు నిన్న మొన్నటి దాకా యీ రాజకీయాలంటే వాళ్లకు యెంతో అసహ్యం భారతీయులలో బహు తక్కువ మందికి మాత్రమే ప్రవేశం వున్న యీ అధికార పదవులలో నియామకం అయిన వాళ్లు యిద్దరూను ఇప్పుడు దేశానికి స్వాతంత్ర్యం వస్తోందనుకున్న తరుణంలో కొద్ది కొద్దిగా జాతీయత వాళ్లలో మొలకలు యెత్తుతోంది ప్రవర్తన అనేది వాళ్లకు జీవిత హుందాతనంతోను, సాత్త్వికత తోను ముడిపడివున్న విషయం గాని రాజకీయాలను ఆశ్రయించుకున్న విషయం కాదు. జాతిభేదం కంటె వాళ్లను ఆధునీకరణ పట్ల ఆసక్తి మరింత సన్నిహితులను చేస్తోంది.

'మీరిప్పుడు పాకిస్తాన్ ప్రభుత్వంలో చేరటానికే అంగీకరం తెలుపు తారనుకుంటాను' అన్నాడు ప్రాణనాథ్ చద్దా, డిప్యూటి కమిషనర్

'నాకు మరో మార్గం వుందంటారా ?' అని బదులు చెప్పాడు పోలీసు సూపర్నెంట్ ఆస్ఫర్ అహ్మద్ సిద్దికి

ఆ మాటా నిజమే అనుకున్నాడు ప్రాణనాథ్ ఛద్దా. ప్రకటనలో చెప్పిన ప్రకారం ఉద్యోగులను విభజన చేస్తారు. కాని యే ప్రాతిపదిక మీద ? ఏమో, ఎవరికీ తెలియదు. అందరినీ ఒక ఒక గుంపుగా చేర్చి నెత్తిమీద వాళ్లకు యిష్టం అయిన రంగుపులుముతారేమో ! గొడ్లను, పశువులను విభజించే పద్ధతి ! ఒక ముఠాను యిటువైపు, రెండో ముఠాను అటువైపు వెళ్లమంటారు గావును ! ఆఖరు ఉద్యోగి - జవాను వరకూ అందరినీ యిలా నిలువుగా రెండుగా విభజిస్తారు. తమవంటి సీనియర్ అధికారులకు సైతం ముందుగా యేదో సూచన, హెచ్చరిక వంటిది లేకుండానే పోయింది.

'ఈ విషయం అంతా పరిష్కారం అయేంతవరకూ, నాకు మీ సహకారం వుంటుందను కుంటున్నాను. నా ఉద్దేశ్యం, ఈ జిల్లా గందరగోళంలో పడిపోయి, పరుశురామ ప్రీతి అవడం మీకు యిష్టం కాదు గదూ ! ఈ విషయంలో మనమిద్దరం ఒకటేగా!'

'ఇక్కడ దొమ్మీలు జరగటానికి వీల్లేదు. ప్రాణ్. ఆ మాత్రం నేను మీకు మాట యివ్వగలను. పోలీసులు మీకు మద్దతు యిస్తారు. అవసరం అయితే మిలటరి సైన్యాన్ని కూడా పిలిపిస్తాం.

ఇదీ జీప్‌లో జరిగిన సంభాషణ

ఇప్పుడు ప్రత్యక్షంగా రంగంలోనికి దిగి పరిస్థితిని సమాలోచన చేస్తున్నారు. ఊరేగింపును ముందుకు సాగనిచ్చి వాళ్లకు యేమీ అడ్డంకులు యేర్పడనివ్వకుండా చూచి, పరిస్థితి అదుపులో వుండేట్లు చేయడం తక్షణ కర్తవ్యం. డిప్యూటి కమీషనర్ నాలుగు అడుగులు ముందుకు వేసి యిక్కడి స్థానికులు యెవరెవరని వాకబు చేశాడు. ఎంతో ధైర్యసాహసాలతో అడుగులు వేస్తున్నాడు. తన ప్రాణాన్ని క్షేమాన్ని యేమాత్రం లక్ష్యం చేస్తున్నట్లే కనిపించడం లేదు.

ఇన్‌స్పెక్టర్ తనచెవిలో రహస్యంగా వర్తమానాన్ని ఊదిన తరువాత డిప్యూటి కమీషనర్ యిలా అన్నాడు.

'లాలాజీ. దయచేసి కిందకు రండి. గేటు తెరవండి. పోలీస్ సూపర్నెంట్ గారు, నేను దగ్గరే వుండి యీ వీధిలో, యీ ప్రాంతంలో జనానికి గానీ ఆస్థులకు గానీ యెలాంటి విపత్తూ జరగకుండా చూస్తాం.'

అస్ఫర్ అహ్మద్ సిద్దికి ఆయనకు మద్దతు యిస్తున్నట్లుగా వెంటనే యిలా చెప్పాడు. 'అవును. లాలాజీ రండి' గేటు దగ్గర దూలంతో నిలుచున్న కాన్‌స్టేబుల్స్‌ను దూరంగా తొలగిపొమ్మని సైగచేశాడు.

'పక్కకు తొలగండి. వెనక్కు వచ్చి నిలబడండి' అని ఇన్‌స్పెక్టర్ ఇనాయత్ ఉల్లాఖాన్ కూడా వంతపాడాడు. చచ్చిన వాడి పెళ్లికి వచ్చిందే కట్నం - అన్నట్లుగా వుంది అతని వాలకం యిప్పుడు.

గేటు తెరుచుకుంది. లాలా కాన్షీరామ్ ఆ వీధిలోని మనుషులు కొందరితోపాటు ఎదురుగా నిలబడ్డాడు. వాళ్లకు డిప్యూటి కమిషనర్ యీ సంఘటనను అదుపులోకి తీసుకున్న పద్ధతి ఎంతో నచ్చింది.

'గేటు విశాలంగా తెరవండి. మరేం భయం లేదు', అన్నాడు డిప్యూటి కమీషనర్.

గేటు రెండు తలుపులూ పూర్తిగా వెనక్కు తెరుచుకున్నాయి. తలుపుల వెనకాల వీధులు, యిళ్ల వరసులు తీర్చిదిద్దినట్లుగా అగుపిస్తున్నాయి.

సంగీతవాద్య బృందాన్ని నియామకం చేస్తున్నట్లుగా నిలబడిపోయాడు డిప్యూటి కమీషనర్. గేటు తెరుచుకోగానే అతను ముందుకు అడుగు వేయలేదు. ఊరేగింపులోని జనంలో యెంతో ఉత్సాహం పెల్లుబికింది. డిప్యూటి కమీషనర్ తలతిప్పి ఊరేగింపు వరసల వంక చూచాడు. అతడి చూపులు, మళ్లీ ఆ ఉత్సాహపు ఉరకలు, కేకల మీద నీళ్లు చల్లాయి. స్థబ్దత అవరించిది - అంతటా. చాల నిమిషాల వరకు ఆయన యేమీ మాట్లాడలేదు. ఊరేగింపు దాని అంతట అదే ముందుకు నడిచిపోతుందా అని గమనించ దలుచుకున్నట్లుగా నిలుచుండిపోయాడు. అతనికి అంత ధైర్యం, స్థైర్యం. అయితే ఎవరూ ధైర్యంగా అడుగు ముందుకు వేయలేదు.

డిప్యూటీ కమీషనర్ సాలోచనగా అయి యిటు పచార్లు చేశాడు కొంతసేపు, పరిస్థితిని సమాలోచన చేసుకుంటూ ఇదంతా ఓ పెద్ద నాటకం! ఇన్నివేలమంది... తలుచుకుంటే, ఎవరినీ లక్ష్యపెట్టకుండా ముందుకు దూరి వెళ్లిపోగలరు. వాళ్లు అలా చేస్తే తాను చేయగలిగింది యేమీ వుండదు. నగరంలో శాంతి భద్రతలు నిలపవలసిన ఆవశ్యకతను గుర్తించినట్లయితే, యిప్పుడే తన బలప్రదర్శన చేయవలసి వుంటుంది. ఈ జిల్లా కంతటికీ అత్యున్నతమైన అధికారి తానే. తన మాటను అందరూ శిరసావహించవలసిందే. ఓరకంటితో యేం జరుగుతున్నదో గమనిస్తూనే వున్నాడు. పోలీస్ సూపర్నెంట్ యిన్స్పెక్టర్‌ను పక్కకు పంపేసి, పోలీసు బలగం ఎక్కడ నిలబడాలో యేం చేయాలో ఆదేశాలు యిస్తున్నాడు. స్పెషల్ పోలీసులకు వీధిలో యే ప్రాంతంలో యెవరెవరు నిలబడాలో వివరించి చెబుతూన్నడు.

మరికొన్ని నిమిషాలు నిశ్శబ్దంగా గడిచిపోయిన తర్వాత డిప్యూటి కమీషనర్, ఊరేగింపు నాయకులతో యిలా అన్నాడు 'మీ ఊరేగింపు యీ

వీధులగుండా వెళ్లటానికి అనుమతి యిస్తున్నాను అయితే మీరు యేమీ అల్లరి ఆగం చేయకుండా తిన్నగా ముందుకు వెళ్లాలి. ఈ వీధి చివరకు చేరుకోగానే మీరందరూ మీమీ వీధులవైపు వెళ్లిపోవాలి. ఎలాంటి ఆర్భాటం, అల్లరి వుండగూడదు'

'అలాగే నడుచుకుంటాం, సార్' అన్నారు నాయకులు.

అస్ఫర్ అహ్మద్ సిద్దికి అన్నాడు. 'మీరెవరన్నా దౌర్జన్యానికి దిగితే నా మనుషులు మిమ్మల్ని కాల్చివేస్తారు జాగ్రత్త.'

లాలా కాన్షిరామ్, యితర నివాసులు వాళ్ల వాళ్ల యిళ్లకు పంపబడ్డారు. ఊరేగింపు వీధిలో ముందుకు సాగుతోంది. డ్రమ్ములు, బ్యాండ్లు చప్పుళ్లు చేసుకుంటూ నడుస్తున్నాయి. ఈ శబ్దాలు క్రమంగా పెద్దవయి కొందరు గుండెలు పట్టుకునించున్నారు. అంతా సవ్యంగా సక్రమంగా జరిగిపోయింది. ప్రతిముఠాతోను నాయకులు వున్నారు. వాళ్లు అన్నీ జాగ్రత్తగా గమనిస్తు ఉరేగింపును ముందుకు నడిపిస్తున్నారు. విశాలమైన నది కుదించుకుపోయి సన్నకాలువలో ప్రవేశిస్తున్నట్లుగా ఊరేగింపు జనం అంతా ఈ వీధిలో యిరుక్కుపోయి నడుస్తున్నారు. గ్యాస్ లైట్స్ మనుషుల బుజాలమీద, నెత్తుల మీద స్థావరించుకు వుండి యిదేదో వివాహ మహోత్సవంలాగ తయారయింది. మధ్య మధ్యలో యీ గుంపులు కాస్సేపు ఆగి తమాషాగా పోట్లాటలు పెట్టుకుంటున్నారు. లాఠీలు ఊపుకుంటూ గుంపులు మధ్య ఒక్కొక్క ఆసామి వున్నారు. ఒక ఆసామి గాలిలో లాఠీ ఊపుతూ, ఉహల్లో శత్రువును కల్పించుకుంటూ అతనితో యుద్ధం చేస్తున్నట్లు నటిస్తున్నాడు. కొంతమంది బంగ్రా నర్తకులు నాట్యం చేస్తూ వినోదం కూరుస్తున్నారు. డ్రమ్ము వాద్యానికి అనుగుణంగా అడుగులు వేస్తున్నారు. కాళ్లకు గజ్జెలు, తలలకు రంగు రంగుల రుమాళ్లు, నిజంగా పండుగ వేడుకల సందర్భంలో అయితే ఈ పంజాబీ బంగ్రా నృత్యం రంగురంగుల దుస్తుల అలంకారాలతో వేషాలతో చూడముచ్చటగా వుంటుంది. కాని యిప్పుడు అంతా హడావిడిగా సరంజామా అమర్చుకోవలసి వచ్చింది. వాళ్లకు దుస్తులు మార్చుకుందుకు కూడా

అవకాశం లేకపోయింది. అందరూ మామూలు వేషాలలోనే వున్నారు. రోజంతా పనిచేసి శ్రమపడి అలసిసొలసి వున్నారు. రేడియో ప్రకటన వినగానే అందరూ ఒకచోట పోగయిపోయారు. వైశాఖి నర్తకుల ఉత్సాహాన్ని పోలివున్నారు. ఒక గుంపులో - బొత్తగా పనివాళ్లు శ్రామికులు వున్నదానిలో - అబ్దుల్ ఘని ఆనందంగా చిందులు వేస్తూ నడుస్తున్నాడు. అతని ముఖం ఎంతో ప్రకాశమానంగా వెలిగిపోతోంది. లాలా కాన్షీరామ్ యింటి ముందుకు రావడంతోటే అతను తలపైకెత్తి చూచి 'పాకిస్తాన్ జిందాబాద్' అని ఎలుగెత్తి అరిచాడు. అతని స్నేహితులందరూ అనుకరించారు 'పాకిస్తాన్ జిందాబాద్.'

లాలా కాన్షీరామ్ యింటి కప్పుమీద నిలబడి వుండి ప్రార్థన చేస్తున్నాడు, తమ మనుషులు ఎవరూ పొరపాటునయినా యే యిటుకరాయినో వీధిలోనికి గిరవాటు వేయకుండా వుండాలని. ప్రతి యింటి మీద డజన్లు కొద్ది మగ, ఆడ, పిల్ల జెల్ల కూర్చుని వున్నారు. వీళ్లలో యే పిచ్చివాడో యేదయినా అకృత్యం చేశాడంటే యింకేమైనా వుందా ? రక్తం యేరులై పారుతుంది. ఊరేగింపులోని చివరి ముఠా మాత్రం కాస్త విచ్చలవిడిగా దౌర్జన్యపూరితంగా వుంది. వాళ్లు రాళ్లూ రప్పలు రువ్వసాగారు. కొన్ని యిళ్ల కిటికీ అద్దాలు పగిలిపోయినాయి కూడా. అయినా వీధిలోని యిళ్లవాళ్లెవరూ ప్రతిచర్య చేయకుండా మిన్నకుండిపోయారు.

రాళ్లు రువ్వడం ప్రారంభం అయినప్పుడు సిద్ధికి ప్రాణ్ ఛద్ద వంక చూచాడు. డిప్యూటి కమీషనర్ తల ఊపాడు.

'ఇంతటితో సమిసిపోతే మనమేం చేయవద్దు'

ఊరేగింపు జనంలో కూడా యింతకంటె విజృంభించి ప్రవర్తించటానికి ఓపిక, ఉత్సాహం మిగిలిలేవు. మరేం గందర గోళం లేకుండానే ఊరేగింపు వీధి అవతలి కొసను చేరుకుంది.

గేటు తలుపులు మళ్లీ మూతులు పడ్డాయి. ఆ వీధిలోని వాళ్లందరూ తలుపులు వేసుకుని నిద్రకు ఉపక్రమించారు. హాయిగా ఊపిరి పీల్చి. అప్పుడు అర్థరాత్రి దాటి రెండు గంటలయింది.

నిరంజన్ సింగ్ ఆలోచిస్తూ మెలుకువగానే పడుకుని వుండిపోయాడు ఈ సాయంత్రం అంతా అతనికి పంజరంలోని పులి పిల్లలా అనిపించింది తనంత తాను యేమీ చేయటానికి వీలులేదు ఈ ప్రాంతంలో వున్న ముస్లింలు అందరూ కలిసి తన బలం ముందు, భుజ శక్తి ముందు ఎందుకూ చాలరు, అతని అభిప్రాయంలో అంతెందుకు, భంగ్రానృత్యం వాళ్లకంటే తను యింకా యెక్కువ బాగా చేయగలడు ఆ ఆలోచన రావడంతోటే అతనికి నవ్వు అనిపించింది. అప్పుడు నిద్రకు పడ్డాడు

# నాలుగవ అధ్యాయం

అరుణ్ నూర్‌ను కాలేజి దగ్గర కలిసికొన్ని రోజులు అయింది. వాళ్ల ప్రణయాన్ని గురించి కాలేజీ స్నేహితులు అందరికీ తెలుసు. అయితే పాకిస్తాన్ ప్రకటన జరిగిన తర్వాత అందరూ అనుమానాస్పదంగా చూడసాగారు. అతడిప్పుడు అకస్మాత్తుగా 'మహమ్మదీయ' యువతితో ప్రణయం నెరుపుతున్న 'హిందు' యువకుడు, అయిపోయాడు. కాలేజిలోని మహమ్మదీయ యువకులు వాళ్లను చికాకు పరచసాగారు.

అరుణ్‌కు సంబంధించినంతవరకు ఎటువంటి మార్పు లేదు. సియల్‌కోట అతని నగరం, దాని పట్ల అతని మక్కువ వీసమెత్తు అయినా తగ్గలేదు. ఆ నగర రంగు, రుచి, వాసన; దేవాలయాలు - మశీదులు యివన్నీ అతనికి తగని యిష్టం. రేడియో ప్రకటన జరిగిన మరుసటి రోజే వైశ్రాయి ఒక ప్రెస్ కాన్ఫరెన్స్ జరిపి అందులో స్వాతంత్ర్య దినం మటుకు జరిపినట్లుగా చెప్పారు. అతను ముందు అనుకున్న జనవరి 1948కి కాకుండా ఆగష్టు 1947 నాటికే స్వాతంత్ర్యం యిచ్చేస్తామని చెప్పారు. పాకిస్తాన్, ఇండియాల మధ్య సరిహద్దు గీతలు నిర్ణయించటానికి ఒక 'బౌండరీ కమీషన్'ను నియమిస్తా మన్నారు. లాలా కాన్షీరామ్ అభిప్రాయం ప్రకారం సియల్‌కోట నగరం పాకిస్తాన్‌కు కేటాయింపు అవడానికి ఎటువంటి ఆస్కారమూ లేదు. చెనాబ్ నదీగర్భం దగ్గర సరిహద్దు గీత వుండాలని సిక్కులు పట్టుపట్టుతున్నారు. ఆ పట్టు నెగ్గినట్లయితే, లాహోర్ గుజ్రన్‌వాలా నగరాలతో సహా గుజరాత్ వరకూ ఇండియాకు కేటాయింపు అవుతుంది. ఇక సియల్ కోట గురించి అనుమానించవలసిన అవసరమే వుండదు.

ఈ ఆశలన్నీ ఎంత క్షుల్లకమయినవో అరుణ్‌కు తెలుసు. పంజాబీల పట్టుకు కారణం యేమిటంటే - యీ ప్రాంతాలలో తమకు సంబంధించిన అనేక దేవాలయాలు వున్నాయని. అయితే దేశవిభజన జరుగుతున్నది యీ ప్రాతిపదికమీద కాదు. అరుణ్‌కు తెలుసు 'రావి' నదీ గర్భం దగ్గర విభజన గీత వస్తుందనీ, చెనీబ్ నదీ గర్భం యిందుకు ఆసరాకానే కాదని.

ఈ వివరాలు ఎన్ని వ్యతిరేకంగావున్నా, సియల్‌కోట తన జన్మస్థలం. అందుచేత యీ నగరం అంటే తనకు మక్కువ. ఇది పాకీస్తాన్‌లో అంతర్భాగం అయిపోతేమటుకేం, తన అనురాగం వీసమెత్తు అయినా తగ్గదు, నేను యిక్కడే వుండినా వుండకపోయినా యిది నా నగరం కాకుండా పోదు - అనుకున్నాడు.'

ఉదయం నుంచి సాయంకాలం వరకు అన్ని వీధులూ చుట్టుతూ వున్నాడు. వైస్రాయి రేడియో ప్రకటన తరువాత, నగర రూపమే - స్వరూపమే మారిపోయినట్లు అనిపిస్తోంది. అంతకు ముందు అంతరంగాలలో గూడు కట్టుకు వున్న విరోధాలు, విరసాలు యిప్పుడు పైకి తేలి వస్తున్నాయి. ఏదో ఒక గందర గోళం జరగకుండా రోజు గడవడం లేదు యిప్పుడు. ఒక ఊరేగింపు ఓ ముఠా తగాయిదాను, ఒక సమావేశమో. .. యేదో ఒకటి జనాన్ని రెచ్చగొడు తోంది. అతని తల్లికి అతన్ని గురించి భయం పట్టుకుంది. అయితే అతను మాత్రం ధైర్యం చెబుతున్నాడు - యివన్నీ దోపిడీలు దురాగతాలు కావనీ కేవలం ప్రాంతీయమైన విరుద్ధాలనీ, ఇలాంటివి జరగడం పంజాబ్ చరిత్రలో పరిపాటి అయిన విషయమే. ఈ మాత్రం తగాదా ముస్లిముకు ముస్లిముకు మధ్య జరిగినా విడ్డూరం కాదు

సైకిలు మీద ఊరంతా బలాదూరు తిరిగివస్తాడు అరుణ్ దూరంగా యేదేనా ఊరేగింపు కనిపిస్తోంది అంటే సైకిల్ వేగం తగ్గించేవాడు. అంత ధైర్యస్థుడికీ మనసులో యేదో బెరుకు, భయం వున్నాయి వాళ్లందరూ గుండాలు కావచ్చును. జనం పోగయివున్న చోటు దగ్గరయినప్పుడు ధైర్యం కూడగట్టుకుని సైకిలు వేగం పెంచేవాడు. బయట మేమయినా జరగనీ, నా వర్తనంలో యెటువంటి మార్పు రాకూడదు - అనుకునేవాడు. ఉదయపు షికార్లు చేస్తూనే వున్నాడు. కాలేజికి వెళ్లి వస్తున్నాడు. సాయంకాలం టెన్నిస్ ఆడడానికి వెడుతున్నాడు. ఇంగ్లీషు సినిమాలు చూడడం కోసం కంటోన్మెంట్ వరకు వెళ్లివస్తున్నాడు

ఒకరోజు కాలేజిలో నూర్‌ను కలుసుకున్నాడు. అప్పుడు చుట్టుపక్కల ఎక్కువ మంది విద్యార్థులు లేరు. కాలేజి హాల్ పక్కన మామిడి చెట్ల నీడలో

ఆమెకోసం వేచివున్నాడు నిజానికి. ఆడపిల్లల విశ్రాంతి మందిరం నుంచి అమె యివతలకు రావడంతోటే అతను ఎదురువెళ్లి కలుసుకున్నాడు.

'నూర్. కొద్దిసేపు మాట్లాడుకుందామా ?'

నూర్ ఆడపిల్లల విశ్రాంతి మందిరం వయిపు చూస్తూ తల ఊపింది.

'ఎక్కడ ?'

'కాంటీన్ వెనుక. ఫుట్‌బాల్ గ్రౌండ్ దగ్గర. రెండు గంటలకు'

ఆమె అందమైన ముఖం మీద యేదో అనుమానపు తెరజారినట్లు అయింది. ఆమె కంటిరెప్పలు టపటప కొట్టుకున్నాయి. కొద్దిసేపు ఆలోచించింది. తరువాత 'సరే.... అలాగే వస్తాను' అంది

రెండు గంటలకు గుండె వేగంగా కొట్టుకుంటూ వుండగా, అనిశ్చిత మనస్థితిలోనే అరుణ్ ఆమెకోసం కాంటీన్ వెనక వేచివున్నాడు. అతనికి మద్రే కాలేజిలో యిది అయిదవ సంవత్సరం. నూరూల్‌నిసార్‌తో ప్రేమప్రస్తావన తీసుకువచ్చి రెండు సంవత్సరాలు అయింది. అయితే ఆమెను ఎప్పుడు ఎక్కడ కలుసుకున్నా అదే ప్రథమంగా అనిపిస్తూ వస్తోంది. గుండె గబగబ కొట్టుకుంటూంది. ఆమె వస్తుందా, రాదా ? వాళ్ల సమావేశాన్ని గమనిస్తూ ఎవరైనా శత్రువులు వెన్నుకాచి వస్తారా ? ఆమె రావడానికి వీలు అవుతుందో, కాదో !

ఆమె రావడం అల్లంత దూరం నుంచే అగుపిస్తోంది ఆ క్షణంలో అతని గుండె ఆగిపోతుందేమోనని పించింది. తనకు అదృశ్యరూపం వుండి ఎప్పుడూ ఆమె సన్నిధానంలో అమెను గమనిస్తూ వుండగలిగిదే ఎంత బాగుండును ! నూర్ పొడుగాటి మనిషి. చక్కని శరీర నిర్మాణం, రూపురేఖలూను. ఆమె భుజాలు, నడుము తీర్చిదిద్దినట్లుగా వుంటాయి. ఆమె యీ ప్రపంచంతో నాకేం లెక్క అన్నంత ధీమాగా నడుస్తూ వుంటుంది. తాము కలుసుకోవడం ఎవరయినా చూస్తారేమో, యేమవుతుందో.... యిలాంటి భయాలన్నీ తనకే వున్నట్లు అనిపిస్తుంది గాని ఆమెకు యిసుమంతయినా లక్ష్యం వున్నట్లు

కనిపించదు. ఆమె యింకా అతన్ని గమనించలేదు, అయినా యీ చుట్టుపక్కలనే ఎక్కడో వుండి వుంటాడని ధీమా. తనకోసం ఎవరో వేచివున్నారనీ, తనను కలుసుకోవడం కోసం ఆత్రంగా ఎదురు చూస్తూన్నారనీ అనుకోవడంలో ఆమెకు ఎక్కువ చిత్తస్థైర్యం కన్పిస్తోంది. ఆమె ధరించిన షిఫాన్ దూపట్టా గాలికి ఎగురుతోంది దానిని ఆమె తలకు మెడకు జాగ్రత్తగా చుట్టుకుంది. ఆమె కాంటీన్ దగ్గరకు వచ్చింది. ఆ గుమ్మంముందు ఎవరూ లేకపోవడం గమనించి గబగబ వెనక్కు నడిచింది

కొన్ని క్షణాలలోనే ఆమె అరుణ్ కౌగలిలో చేరుకుంది.

'మనం యిక్కడ నుంచి వెళ్లిపోదాం త్వరగా' అన్నాడు అరుణ్.

నాలుగు అడుగులు వేసిన మీదట వాళ్లు కాలేజి ఆవరణదాటినట్లు అయింది. ఎదురుగా రామలీల మైదానం వుంది ప్రతి సంవత్సరం అక్కడ దసరా ఉత్సవాలు జోరుగా జరుగుతాయి. రావణాసురునివీ, అతని అనుయాయులవీ బొమ్మలు, విగ్రహాలు తయారుచేసి అక్కడ తగులబెడతారు. అది నిజానికి హిందువుల పండుగ కాని తగులబెట్టటానికి తయారుచేసే సరంజమా అంతా మహమ్మదీయుల చేతుల మీదుగానే సిద్ధం అవుతుంది. కాల్చే మందుగుండు సామాను, మతాబులు --- అన్నీ మహమ్మదీయులే తయారు చేస్తారు. ఈ మైదానానికి ఒక పక్కగా రైలు పట్టాలు పరుచుకు వున్నాయి. వాటిలో ఒక మార్గం జమ్ము - కాశ్మీర్ వైపు పోతుంది. మరొకటి అమృత్‌సర్ వయిపు పోతుంది. వాళ్లు నించున్న రోడ్డు కాలేజిని క్రిష్టియన్ల స్మశానాన్ని వేరు చేస్తోంది. కుడివైపుగా పోతే, నగరం మధ్యకు చేరుకుంటారు. ఎడమవైపు రైలు పట్టాలు దాని కంటోన్మెంట్ ప్రాంతం వైపు తీసుకువెడుతుంది.

అరుణ్‌కు, నూర్‌కు యీ ప్రాంతం అంతా బాగా తెలుసు. ఊళ్లోకి వెళ్లడంమటుకు చేయరు అరుణ్ ఆమెను సైకిల్ బార్ మీద కూర్చోబెట్టుకుని కంటోన్మెంట్ వైపు తీసుకువెడుతూ వుండేవాడు, ఇద్దరూ సమయ విరామం వున్నదనుకున్నప్పుడు. లేకపోతే రామలీల మైదానందాటి చెట్టాపట్టాలు వేసుకుని రైలు పట్టాల పక్కగా నడిచేవాళ్లు. అదీకాకపోతే స్మశాన వాటికలోనికి ప్రవేశించి ఓవేప చెట్టు నీడలో కూర్చునేవాళ్లు.

అరుణ్ ఆమెను యిప్పుడు స్మశాన వాటికవైపు నడిపించాడు సందుమలుపు తిరగగానే చెట్ల వరసల వెనక్కువచ్చారు. అరుణ్ ఆమెను దగ్గరకు తీసుకుని ఒకే మోస్తరుగా ముద్దుల వర్షం కురిపిస్తున్నాడు. ఆమె కూడ నిర్లజ్జగా అతనికి సహకరించి ముద్దులు యిస్తోంది. వాళ్ళు రహదారి మధ్యలో నిలబడివున్నారు. వాళ్ల చుట్టూ సమాధులు స్తావరించుకువున్నాయి అరుణ్ ఆమె చేతులు తన చేతుల్లోనికి తీసుకుని ఒకటే నలిపేస్తున్నాడు ఆమెను కౌగలించుకుని స్తనభారాన్ని అనుభవిస్తున్నాడు. ఆమె కంఠాన్ని కూడ చుంబిస్తున్నాడు. కొద్దిసేపు అయిన తర్వాత ఆమె అతన్నించి దూరంగా జరిగింది.

మనం యేం చేద్దాం ? --

అరుణ్ అడిగాడు.

నూర్ యేమీ మాట్లాడలేదు. తలను అతని ఎదురు రొమ్ముమీద చేర్చి యేడవనారంభించింది. వాళ్ళ ప్రణయం దుఃఖభాజనం అయిపోతూంది. ఇదివరకు ఒకళ్లనొకళ్లు వేళాకోళం చేసుకోవటంగానే వుండేది. ఆమె అతని దేవత విగ్రహాలను అక్షేపిస్తే అతను ఆమె నమాజులను వెక్కిరించే వాడు. ఆమె అతన్ని 'నీవు పంజాబీ ప్రేమికుడిలా లేవు- శృంగార రసాధిపతివికావు ' అంటే అతను ఆమెను "నీవు మాత్రం? దేవతలా అనిపించటం లేదూ" అనేవాడు. రోజులు తరుబడి అతనిని చూడకుండా దూరంగా వుండేది అమె. అలాంటి వియోగం అతనికి ఖేదకారణం అవుతుందని ఆమె ఎరుగును. ఆమెను పట్టుకుని కౌగలించుకుందామని అతను ప్రయత్నిస్తూవుంటే చేతులకు అందకుండా పారిపోతూవుండేది నూర్. 'నూర్, నీవంటే నాకు పరమప్రేమ. మనం వివాహం చేసుకుందాం-' అని అతను అంటే ఆమె కొంటిగా నవ్వుతూ 'హా...హా...' అని వెక్కిరించేది.

నూర్కాలేజికి వచ్చినప్పుడు పెదవులకు ఎర్రరంగు వేసుకునేది. కళ్ళకు కాటుక పెట్టుకునేది. ఆమెలో తుళ్ళి తుణికే యవ్వనం ప్రతి అణువునా ద్యోతకం అవుతుంది. పెదవుల మీద ఎన్నటికీ విడవని చిరుమందహాసం. ఇదంతా ఎవరికోసమట,. అరుణ్ కోసం కాకపోతే! ప్రేమ అనేది వాళ్ళకు

ప్రశాంత చిత్తత యివ్వడం లేదు, ఎక్కువ ఆదుర్దాను మటుకే యిస్తోంది ఇద్దరి మతాలు వేరు. అందుచేత యిద్దరికీ వివాహం జరగడం అసంభవం అంతేకాక యితర రంగాలలో కూడ యిద్దరికీ ఎన్నో విభిన్నతలు వున్నాయి.

ఈ రోజు వాళ్ళు వున్న ఉద్వేగంలో యీ విభిన్నతలు అన్నీ సరిపోయినట్లు అయినాయి. ఇద్దరూ వయసులో వున్నవాళ్ళు. అనుభవ శూన్యులు. ఒకళ్ళనొకళ్ళు అప్యాయంగా చూచూకుంటూ నిలబడివున్నారు.

'ఇదంతా మననేమి చేయలేదు. పాకిస్తాన్ మనమధ్య ఎందుకు అడ్డుగోడ అవుతుంది? ఇప్పుడు ఎలాంటి ముసుగులు లేవు'. నూర్ మనస్ఫూర్తిగా మాట్లాడుతుంది.

'మేం యిక్కడ నుండి వెళ్ళి పోవాల్సివస్తుంది'

'ఎక్కడికి?'

"ఇండియాకు మనం పాకిస్తాన్ వదలి పోవాల్సి వుంటుంది.'

'ఎందువల్ల?'

నూర్‌కుఅంతా నిదానంగా అర్థం అవుతుంది. అయినా నవయవ్వన ఉద్రేకం అతార్కికత ఆమెను లోగొంటున్నాయి. 'మనం యిక్కడే యెందుకు ఉండిపోలేం?'

'వాళ్ళు మనను ఉండనివ్వరు-'

'ఎవరు? మీరు వెళ్ళిపోతే మా నాన్న గుండె ఆగిపోతుంది'

'కాని కొందర మూఢులు వున్నారు గద!'

'వాళ్లదేమీ లేదు-' అంది ఆమె, తల ఎగురువేస్తూ,

ఆమె ముఖంలో మటుకు బాధ అలుముకుపోయింది. ఉన్నట్లుండి అతడిని గట్టిగా పట్టుకుని "మీరు.... మీరు యిక్కడనుండి యెందుకు వెళ్ళిపోవాలి? అవసరంఅయితే మీ కుటుంబం వెడుతుంది. నీవు వెళ్ళ నవసరం లేదు. నీవు...... నీవు.... వుండిపోవచ్చు-' అంది.

ఆమె ఈ మాటలు అస్పష్టంగా అన్నది. ఆమెలోని ప్రేయసి యీ మాటలు అన్నది అతని సహవాసం కోరుకునే స్త్రీ. అరుణ్‌కు ఆమె భావం అర్థం అయింది. వెంటనే ఆమెకు భరోసా యిస్తూ మాట్లాడాలనుకున్నాడు.

నూర్ అతని తడబాటు గమనించింది. అతన్నుండి కొద్దిదూరం జరిగింది.

నీవు యిక్కడనుండి వెళ్ళిపోతున్నానని మాత్రం అనకు. నా కోసం - అవసరం అయితే ముస్లిం మతం తీసుకోవడం కూడా చేస్తానని యిదివరకు చాలసార్లు అన్నావు '

నూర్ కోసం ముస్లిం మతం స్వీకరించిటానికి అతని కెమీ అభ్యంతరం లేదు - అమాటకువస్తే ఆమె కోసం మృత్యువునైనా సునాయసంగా స్వీకరించగలడు. అయినా ఇస్లాం అంటే యేమిటి? అన్ని మతాల మాదిరీ అదీ ఒకటి. ఒక విశ్వాసంగా అది అన్నిటి మోస్తరుదే. బోలెడన్ని మూఢ నమ్మకాలు, మానసిక అసమగ్రతలు. ఏవో కొన్ని తంతులకు ఒకరోజు అంగీకరిస్తే, ప్రతి రాత్రీ నూర్‌తో సుఖసంసారం చేయవచ్చును. అంటే - ఆ జంజాటం నడపటానికి అతని కేమి అభ్యంతరం లేదు. సుఖజీవన ఫలితానికి అది అతి స్వల్పమయిన ధరే.

అయితే యీ విషయమంతా అంత తేలికగా రూపొందేటట్లు లేదు. కొత్త దేశం కోసం అంగలార్పులు, పాకిస్తాన్ కోసం వినవస్తున్న అరుపులు - పెడబొబ్బలు, అతని ముందు తూటాలలాగ, నిందలలాగ భావించడమే కాక అతన్ని రెండుగా చీలుస్తున్నాయి. ఈ వ్యవహారం వెనక వున్న రాజకీయ నాయకుల ఎత్తులు అతనికి బాగా తెలుసు. జిన్నా, లియాకత్ ఆలీ ఒక ముఠాగా తయారవు తున్నారు. నెహ్రూ మరొకపక్క, దేశాన్ని ఐక్యతను సమూలంగా నాశనం చేసే స్వాతంత్ర్యం వైపు యిలా ఎందుకు మొగ్గుచూపాలి? పాకిస్తాన్ యేర్పాటు చేసినందువల్ల ఒరిగేది మేమి వుండదు. ముస్లింలను హిందువులను విడదీయాలంటే ఎవరో ఒకళ్లు ప్రతిగ్రామానికి వెళ్ళి లెక్కలు తేల్చవలసి వుంటుంది. అరుణ్‌కు యిదంతా తెలుసు. కేవలం ఆట. అయితే దీనివల్ల తాను, నూర్, తమలాంటి లక్షలాదిజనం బలిఅయిపోతారు. రాజకీయ

నాయకులు అభిప్రాయాలకు కాళ్ళు చేతులు తగిలిస్తారు. అవి తప్పుడు అభిప్రాయాలు అయినా సరే. అరుణ్ కూడ యీక్షణంలో అతార్కికమైన అలోచనలకే పరిమితమై పోతున్నాడు.

తనవైపు చూస్తున్న నూర్ వంక చూచాడు. ఆమె అందం మానసిక ఉద్విగ్నతతో ద్విగుణీకృతం అయింది.

అతను యిలా అన్నాడు ·

"నేను ముస్లింను ఎందుకు అవాలి?'

అతని గొంతు కర్కశంగా ఉండింది. దేశ విభజనకు కారణం నూర్ అన్నట్లుగా వుంది అతని వాలకం.

'ఎందుకు మారగూడదు ? నిజంగా నన్ను ప్రేమిస్తున్నట్లయితే!'

ఆమె కోపంగా అన్నట్లు అనిపించింది నిజానికి కోపం యేమీ లేదు. అభ్యర్థన మాత్రమే.

అరుణ్ ఆమె పట్ల క్రోధంగా 'నీవే హిందువు అవగూడదూ!' అన్నాడు.

ఒక్కక్షణం నూర్ స్తబ్ధురాలయింది. అతని వంక కోపంగా చూచింది. ఆమె కళ్లు అభ్యర్థనతో జ్యోతుల్లా వెలుగుతున్నాయి. కన్నీటితో, గద్గదం అయిన గొంతుతో యిలా అంది :

'ఎందుకంటే - నేను ఆడపిల్లను, రక్షణ లేనిదానిని, నా యిష్ట యిష్టాలను కుటుంబంలో బలవంతంగా నేరవేర్చుకోలేని దానిని - కనుక ! నీవయితే మగవాడివి, నాకంటె స్వతంత్రుడవు. నన్ను రక్షిస్తావని చూస్తున్నాను. నా కోసం ఎలాంటి త్యాగాలకైనా వెనుదీయవని నా ఆశ ! అందుకని ..'

నూర్ యేడుస్తోంది. అరుణ్ ఆమె పట్ల తన దృక్పధాన్ని మార్చుకోలేదు.

నూర్ అతనివైపు వీపు పెట్టి నిలుచుంది. ఆమెకు ఎదురుగా యిప్పుడు సమాధులు వున్నాయి చచ్చి మట్టిలోకలిసిపోయిన దేహాలు యిప్పుడు ప్రశాంతంగా పడివున్నాయి వాటి లోపల. అంతర్ ఉద్వేగాన్ని తట్టుకోలేక ఆమె

ముఖాన్ని చేతులలో దాచుకుంది, యేడుస్తూ వుండిపోయింది. ఏడుపు ఎక్కిళ్ళలతో ఆమె వీపు ఎగిరెగిరి పడుతూ వుండడం అరుణ్ గమనించాడు అతను ముందుకు నడిచి ఆమె బుజాలు తనచేతుల్లోనికి తీసుకుని, సున్నితంగా యిలా అన్నాడు :

'నేను నిన్ను ప్రేమిస్తున్నాను, నీ కోసం యేమయినా చేస్తాను - అని నువ్వు ఎరుగుదువు. అయితే యిదంతా మనవ్యక్తిగత ప్రేమకు సంబంధం లేని విషయంగా మారిపోతోంది. నా తల్లిదండ్రులు వయోధికులు అయిపోయారు. ఇప్పుడు యిక్కడి నుంచి వెళ్లిపోవాలంటే చాలా దెబ్బతిన్నట్లు ఫీలవుతారు. నేను వాళ్లతో వెళ్లిపోవలసి వస్తుంది. వెడతాను. కొత్తచోట వాళ్లకు అన్ని సౌకర్యాలు అమర్చి ఆ తరువాత తిరిగివస్తాను. అప్పుడు మనం నీవు కోరిన విధంగానే వివాహం చేసుకోవచ్చును.'

నూర్ తట్టుకోలేకపోయింది.

'వెళ్లు. నీ యిష్టం వచ్చిన చోటుకు పో. నువ్వు హిందువువు. ఎంతయినా హిందూ రక్తం నీది. నువ్వుత్త పిరికివాడివి...'

'అదంతా కాదు. నీకు తెలుసుగదా...'

'ఉహు నాకు తెలియదు'

- ఇలా అని ఆమె స్మశాన వాటిక నుంచి బయటకు అడుగులు వేయనారంభించింది. అరుణ్ ఆమె వెనక వడివడిగా అడుగులు వేస్తున్నాడు.

'అప్పుడే వెళ్లిపోకు.'

'నాతో మాట్లాడకు'

'మాట్లాడాలి'

'నువ్వ పిరికి హిందూవు. వెళ్లి మీ అమ్మగారి ఒడిలో తలపెట్టుకుని యేడువు.'

ఆమె గబగబ ఆడుగులు వేస్తూంది. కొద్ది సేపట్లోనే స్మశాన వాటిక దాటి కాలేజి ఆవరణకు చేరుకుంది. ఒక్కక్షణమైనా అరుణ్ కోసం

ఎదురుచూడకుండా, ఆగివుండకుండా వేగంగా నడుస్తోంది. కాలేజి ఆవరణలోనికి వచ్చేశాక, గబగబ నడవడం ఆమెను అనుసరించడం అరుణ్‌కు అసాధ్యం అయిపోయింది.

'నూర్, దయచేసి విను. నేను నిన్ను ప్రేమిస్తున్నాను'

ఉహు లాభం లేదు. ఇద్దరి మధ్య వివాదం యేర్పడ్డది. ఈ వివాదానికి తోడు కర్కశత్వం. వెనకటి మాదిరిగా వేళాకోళపు పోట్లాటలు, వెక్కిరింతులు లేవు.

కాంటీన్ నుంచి కొందరు కుర్రాళ్లు బయటకు వస్తూ వుండడం గమనించాడు అరుణ్. అడుగులు తాపీగా నిదానంగా వేయసాగాడు నూర్‌కు బాగా వెనకబడిపోయాడు. అతనికి చెమటలు పోస్తున్నాయి. ఎండ ఎక్కువయిపోయింది. చొక్కా వీపుకు అంటుకుపోయిందని అతనికి తెలుస్తూనే వుంది. ఇకలాభం లేదని ఒక చెట్టుకింద నిలబడిపోయాడు, వెళ్లిపోతున్న నూర్‌ను గమనిస్తూ. మామిడి చెట్ల కిందుగా నడిచి ఆమె ఆడపిల్లల విశ్రాంతి గదిలోనికి వెళ్లడం వరకూ చూచాడు.

అరుణ్ దుర్బలుడు, నిస్సహాయుడు అయిపోయాడు. ముఖం తుడుచు కుంటూ కాంటీన్ వైపు నడిచి లోనికి చేరుకున్నాడు.

లోపల మూనీర్ ఒక్కడే ఒక బల్లదగ్గర కూర్చున్నాడు అరుణ్ వెళ్లి అతని సరసన కూర్చున్నాడు

'ఇక్కడ బహిరంగంగా నూర్‌ను కలుసుకోవడం వల్ల యేమీ ప్రయోజనం వుండదు. అదంత క్షేమకరమైన పనికాదు'

'ఎంతసేపటి నుంచి కూర్చున్నావు యిక్కడ ?'

'మీరు స్మశానం వయిపు వెళ్లినప్పటి నుంచి'

'మా మీద గూఢచారి పనిచేస్తావని అనుకోలేదు'

'నేనూ గూఢచారి పని చేయలేదు ఊరికే గమనించాను. మీ యిద్దరి క్షేమమే నాకు కావలసింది. కాలేజిలో ఎటువంటి ఉద్రిక్త వాతావరణం

అలుముకు వున్నదో నీవు ఎరుగుదువు. నువ్వు ఆమెతో కలిసి తిరగడం గమనించారంటే ముస్లిం కుర్రాళ్లు నీ తాట వలిచేస్తారు

'ఓ, మునీర్! నేనామెను ప్రేమిస్తున్నాను '

ఈ విషయం వాళ్లిద్దరి మధ్య ప్రస్తావనకు రావడం యిది మొదటిమారు కాదు. నూరూల్ నిసార్, మునీర్‌కు సోదరి ఆమె అతని కంటె రెండేళ్లు చిన్నది. మునీర్, అరుణ్ బాల్యం నుంచి ఒకళ్ల నొకళ్లు యెరుగుదురు. వాళ్ల తండ్రి ఛౌదరి బర్కత్ ఆలి, లాలా కాన్షీరామ్‌కు ఆత్మీయుడు ఇద్దరిదీ ఒకే గ్రామం - సంభ్రియాల్. అతను ఎప్పుడు సియల్ కోటకు మకాం మార్చాడో యితమిత్థంగా అయితే మటుకు అరుణ్ ఎరగడు, కాని బర్కత్ ఆలికి గ్రామం సంభ్రియాల్‌లో యింకా భూములు వున్నాయి వాటని ఎవరో కౌలుకు చేసుకుంటున్నారు. నగరంలో ఛౌద్రి బర్కత్ ఆలీకి స్పోర్ట్స్ సామాన్లు తయారుచేసే ఫ్యాక్టరీ వుంది దానిలో హాకీ కర్రలు, కాలి బంతులు, టెన్నిస్ రాకెట్లు తయారు అవుతాయి అతడు మైనాపుర మొహల్లాలో వుంటాడు. అక్కడ కేవలం ముస్లిములే వుండరు. హిందువులు ముస్లిములు కలగా పులగంగా వుంటారు. ఛౌదురి బర్కత్ ఆలిని గురించిన పాత జ్ఞాపకాలు అనేకం అరుణ్ స్మృతిలో వున్నాయి అతను సరాసరి తమ వంటగదిలోకి వచ్చేసేవాడు. ఇండియన్ పద్ధతిలో బాసీ పీఠం వేసుకు కుర్చుని అరుణ్ తల్లితో సంభాషణకు దిగేవాడు "ఏమండీ, వదిన గారూ... ఎలా వున్నారు ? ... ముందు నాకు తాగడానికి యేమయినా యివ్వండి..' అంటూ తండ్రితో యిలా ప్రస్తావించడం అరుణ్‌కు బాగా గుర్తు : 'కాన్షీరామ్, అన్ని వస్తువుల ధరలూ ఎదిగిపోతున్నాయి ఇల్లుగడపడంలో నీవు ఎన్ని యిబ్బందులు పడుతున్నావో, పాపం !'

అరుణ్‌కు మునీర్‌ను గురించిన జ్ఞాపకాలు కూడా చాలా చిన్నతనానివి. వాళ్ల స్కూళ్ల పక్కన పాకే మురికి కాలవల వెనక - ఆ చుట్టు పక్కల మునీర్, అరుణ్ ఒకళ్ల నొకళ్లు పట్టుకోవాలని పరుగులు తీస్తూ వుండేవాళ్లు అరుణ్ ఆర్యసమాజ స్కూలుకు వెళ్లేవాడు. మునీర్ మటుకు ఇస్లామియా స్కూల్‌కు వెళ్లేవాడు. ఈపేర్లు కుర్రవాళ్లలో యెలాంటి వ్యత్యాసాలు, విభేదాలు తీసుకువచ్చేవి కాదు. నగరంలో ఒక ఖల్సా స్కూలు, మరో మిషన్ స్కూలు

కూడా వుండేవి. బహుశ ఇంగ్లీషు వాళ్లే యిలాంటి విభేదాలు తీసుకువచ్చేవాళ్లు, లేక ఆ ప్రాంతీయులు, మతస్థులు యిలాంటి పేర్లు కావాలని అనుకున్నారో తెలియదు. పిల్లలలో జాతిపరమైన వ్యత్యాసాలు పట్టింపులు యేమాత్రం వుండేవి కాదు. వేరు వేరు భావనల ప్రాతిపదికపై ఒక చిన్న తగాయిదా అయినా జరిగినట్లు అరుణ్‌కు గుర్తు లేదు. ఈ పాఠశాలలకు మధ్యపోటీలు యితర రంగాలలో వుండేవి. ఆటపాటలలోను, వక్తృత్వపు పోటీలలోను, స్కూలు పరీక్షా ఫలితాలలోను.... యింకా యిటువంటి చదువులకు సంబంధించిన వ్యవహారాలలో స్పర్థలు వుండేవి. ఒక స్కూలు మరోస్కూలు కంటె మిన్నగా వున్నదంటే, ఆయా పాఠశాలల పిల్లలు తమ ఉక్రోషాన్ని, క్రోధాన్ని వీధుల్లో కొట్లాటలుగా తయారుచేసేవాళ్లు. తలలు బద్దలయేవి; వీటికే మతకలహాల రూపం యిచ్చేవాళ్లు. అయితే ఏతగాదాలు కూడా మతం ప్రాతిపదిక మీద ప్రారంభం అయేవి కాదు.

అయితే, అతను - మునీర్ ఎప్పుడూ దెబ్బలాడుకునేవాళ్లు కాదు. సియల్‌కోట నగర మధ్యంలోంచి మున్సిపల్ మురుగునీటి కాలువ ప్రవహిస్తూ వుండేది. అరుణ్ మనస్సులో యిదో ప్రత్యేకతగా ముద్రపడిపోయింది. మరే నగరంలోనూ యిలా మురుగుకాలువ అనాచ్ఛాదితంగా కనిపించదు. కాలువ నిజానికి చాలా చిన్నదే, సన్ననిదే - అయినా దీనికో ప్రత్యేకత వుంది. ఎవరో సౌందర్య ఆకాంక్ష వున్నమనిషి దీనికి రూపకల్ప చేసి వుండాలి. ఎందుకంటే యిది పూర్తిగా అనాచ్ఛాదితం అనటానికి వీల్లేదు. ఒక పక్కనుంచి యిటుకల వరుస పేర్చి కప్పుగా తయారుచేశారు. కాలువవున్నట్లుగా పైకి కనిపించదు.

కాలువ ఉపరితలం ఆరు అడుగల వెడల్పు వుంటుంది. రెండు పక్కల పిట్టగోడ లోపలి వెడల్పు రెండు అడుగులు మాత్రమే వచ్చేట్లుగా యీ గోడ తయారయింది. ఆరడుగుల లోతు. గోడలు లోపలకు తాపడం చేయడం వల్ల పక్కలు ఎనిమిది అడుగులు వుండవచ్చు. ఏమయినా రెండు అడుగుల వెడల్పులో మురుగునీరు ప్రవహిస్తూ వుంటుంది.

మురుగు నీటి కాలువ గదా అని అది మురికిగా అసహ్యంగా కనిపిస్తూ వుండదు. ఇతర కాలువల మోస్తరుగా ఎక్కువ దుర్వాసన కొట్టదు. రెండు

గంటలకొకమారు శుభ్రమైన నీరు వెల్లువగా కాలువలో ప్రవహించేటట్లు చేస్తారు - శుభ్రం చేసేవాళ్లు. ఒక్కొక్కసారి అయితే యిది మురుగునీటి కాలువ మాదిరికాకుండా శుబ్రమైన పంటకాలువలాగ అగుపిస్తుంది.

పాఠశాలలన్నీ యీ కాలువ మీదనే వున్నాయి. మొదటిగా గవర్నమెంట్ స్కూల్ కనిపిస్తుంది. తరువాత ఆర్య సమాజ్ వాళ్ల స్కూలు, ఆపైన ఇస్లామియా, ఆ చివరిగా ఖల్సా. స్కూళ్ల ప్రవేశద్వారాలు వివిధ వీధులలో వున్నా అన్నింటి పెరళ్లు యీ కాలువ మీదనే వున్నాయి. నగరమధ్యంలో ప్రవహించే నదిలా వుంటుంది యీ కాలువ. స్కూలు యింకా తెరవకముందో, విశ్రాంతి సమయంలోనో లేక మూసేసిన తరువాతనో ఒక బడి విద్యార్థులు మరో బడి ప్రాంగణంలో తిరుగాడుతూ వుండడం బహు సామాన్యమైన విషయం. కాలువ మీదుగా నడిచే యెక్కడి కయినా వెళ్లాలి.

ఊళ్లో పిల్లలు ఆడుకోవటానికి కాలువ, ఉపరితలం అవకాశం యిస్తుంది. గోడల మీదకు ఎక్కడము, దిగడము ఒకరకమైన ఆట. ఎక్కువ విశాలం కాని గట్లు చేసుకుంటూ పిల్లలు అటు యిటు తిరుగాడుతూ వుంటారు. ఎవరెంత వేగంగా యీ పనిచేయగలరు - అనేది పందెం.

మురుగుకాలువ ఆసరాగా తీసుకుని ఎన్నయినా ఆటలు ఆడవచ్చు. ఎన్ని ఆటలయినా వాటన్నిటికీ మూలం బోన్ చువై అనేది. ఇందులో నలుగురూ కలిసికట్టుగా ఆడవలసిందేమీ వుండదు, వ్యక్తిగత సామర్థ్య ప్రదర్శనే సూత్రం. శరీరాయాసంతో కూడుకున్న ఆట. పిల్లలందరిలోనూ ఒకడిని ఎన్నుకుంటారు ముందు. పరుగు తీయడం, యితర పిల్లలను పట్టుకోవడం యితనిపని. ఇతనికి దొరకకుండా తతిమ్మా వాళ్లు కాలువ చుట్టూ ఉడాయిస్తూ వుంటారు. ఊపిరిబిగబట్టి, శరీర ఆయాసానికి తట్టుకోని - గుంపులో అందరినీ తాకి ముట్టుకోవడంతో ఒక ఆట ముగుస్తుంది. తరువాత గుంపులోంచి మరో కుర్రవాడిని యీ పని చేయడానికి ఎన్నిక• చేస్తారు. ఇలా గుంపులో పిల్లలందరి వంతూ వచ్చేంత వరకు ఆట నిర్విరామంగా సాగుతుంది.

అరుణ్ అత్యంత వేగంగా పరుగులు తీయగల కుర్రవాడు అతని వంతు వచ్చినప్పుడు, యితర ఆటగాళ్లను తాకడం, పట్టుకోవడం చిటుకలో చేసి ఆట పూర్తి చేసేవాడు మునీర్ యిందుకు విరుద్ధంగా - అతి మందకొడిగా నడిచేవాడు. అందువల్లనే బహుశ యిద్దరూ చేరువ అయ్యారు. 'మీ నాన్న మానాన్న మంచి స్నేహితులు కనుక నీవు యిప్పుడు నాకు సహాయం చేయి.' అరుణ్ తను పరుగులు తీసేటప్పుడు మునీర్‌కు సహాయంగా వుండేవాడు. అలాగే అతను పరుగులు తీయవలసి వచ్చినప్పుడు ప్రోత్సాహకరంగా సూచనలు యిస్తూ వుండేవాడు ఆటలో యిలా ఒకళ్ల నొకళ్లు ఉత్తేజ పరుచుకోవటానికి అవకాశం వుంది. ఇతరులను మరింత బాధపెడుతూ తప్పుడు సలహాలు యివ్వడం కూడా జరుగుతూ వుంటుంది, వేళాకోళం కోసం.

అలా కాలువపైన ఆడుకేనే రోజులు అరుణ్‌కు బాగా గుర్తువున్నాయి మునీర్‌తో ప్రథమ పరిచయం అప్పుడే. కాలేజీలో చేరే స్థితి వచ్చేవరకు యీ స్నేహాన్ని నిలుపుకున్నారు చక్కగా. కాకపోతే యిప్పుడు ఆటపాటల్లో కలిసేది కాలువ మీద కాదు, కాలేజి ఆటస్థలంలోనూ, జిమ్‌లోను, టెన్నిస్ కోర్ట్‌లోను. ఇద్దరూ 'ఆర్ట్స్ సబ్జెక్ట్సు' తీసుకున్నారు. ఉపాధ్యాయులుగా తయారు కావాలని వాళ్ల ప్రణాళిక. సాయంత్రం పూటలు యిద్దరూ కలిసే తిరుగుతూ వుంటారు.

నరూల్ - నిసార్ కాలేజిలో ప్రవేశించేటప్పటికి, అరుణ్ మునీర్ మూడో సంవత్సరంలో వున్నారు. కుటుంబంలో తతిమ్మా వాళ్ల మోస్తరుగానే అరుణ్ ఆమెను పసితం నుంచి ఎరుగును. ఛౌద్రి బర్కత్ ఆలి గారి యింటిలో ఘోషా - పరదా - పద్ధతి లేదు. కాకపోతే ఆడవాళ్ల గదులు, వాతావరణం వేరుగా వుండేది. బీగం అక్తర్ ఆలీ ఎప్పుడూ గుడ్డతో తలకప్పుకునే కనిపిస్తు వుండేది. ఇంట్లో ఎక్కువగా నవ్వులాటలు, గందర గోళంగా మాట్లాడుకోవడం వుండేది కాదు. నూర్ మాత్రం సినిమా పాటలు పాడుకుంటూ తిరుగాడుతూ వుండేది.

'ఈ సినిమా పాటలు ఆలపిస్తూ తిరుగాడడం చూస్తే మా అమ్మాయి మంచి ముస్లిం కాదనిపిస్తుంది -' అని వేళాకోళం చేస్తూవుండేవాడు ఛౌద్రి బర్కత్ ఆలి. 'అవును, నాన్నా, నీవు చెప్పేదే నిజం-' అని వత్తాసు యిచ్చేది అమ్మాయి !

ఛౌద్రి యేదో వేళాకోళం కోసం అలా అనేవాడు తప్ప ఆయన అంతరంగం అదికాదు. తను కుటుంబం 'ఆదర్శ ముస్లిం కుటుంబం' అని ఆయన అభిప్రాయం. ఆయన, ఆయన భార్య విధిగా నమాజ్ చేస్తూ వుండేవాళ్లు, రోజుకు అయిదుసార్లు ప్రార్థనలు జరిపే వారు : సక్రమంగా కాకపోయినా వీలయినన్ని సార్లు మునీర్, నూర్ కూడా వాళ్లతో కలిసి ప్రార్దనలు జరిపేవారు. దగ్గరలోవున్న మసీదుకు అందరూ కలిసి వెళ్లేవాళ్లు. బీదలకు ధానధర్మాలు చేసేవాళ్లు. రంజాన్ మాసం అంతా ఉపవాసాలు వుండేవాళ్లు. అన్నిటికంటె మిన్నగా - అన్ని మతములు ఒకటిగా మెలగాలనే అభిప్రాయాన్ని అవలంబిస్తారు గనుక తాము మంచి ముస్లిములమని విశ్వాసం. కొరాన్‌లో యెక్కడా కూడా యితర మతాలను ద్వేషించమని లేదు. కించపరచమని లేదు. భగవంతుడు గొప్పవాడు, మహామహిమాన్వితుడు. ముహమ్మద్ ఆయన యొక్క ప్రాఫెట్ ఆ భగవంతుడే హిందువులకు కూడా దేవుడు. వాళ్లు ఆయన్ను యింకొక రూపంలో పూజించేట్లయితే అది వాళ్ల వాళ్ల యిష్టం. ప్రపంచంలో అందరి దగ్గరకూ వెళ్లి తప్పొప్పులను సవరించడం బర్కత్ ఆలీ పనికాదు తనపని అల్లా భగవదాదేశం ప్రకారం స్నేహము, ప్రేమ ఆలంబనలో జీవనం గడవడమే. పక్కయింటిలో వుంటున్న హిందువు తనకు సోదరుడే. ఎక్కడో దూరంలో వున్న, పరిచయం లేని ముస్లిం సోదరుని కంటె, యింటి పక్కన వున్న హిందూ సోదరుడు మిన్న అయినవాడు.

గాంధీగారి పేరు విన్నదగ్గర్నుంచి జాతీయతా భావంతో శరీరమంతా పులకించిపోయి హృదయావేశ పరుడుగా తయారయ్యాడు. అది 1930 నాటిమాట. అంటే పదిహేడు సంవత్సరాల క్రితం. లాహోర్‌లో కాంగ్రెస్ సెషన్స్ జరిగిన తరువాత గాంధీగారు పంజాబ్ అంతటా పర్యటనలు చేశారు. ఆ పర్యటనలలో భాగంగా సియల్ కోట వచ్చారు. రాంతలాయ్ దగ్గర బహిరంగ సమావేశం జరిగింది. ఆ ప్రదేశం ఒకప్పుడు నగర మధ్యంలోని జలాశయం. ఇప్పుడు నీరంతా ఎండిపోయి పెద్ద పెద్ద సభలు, సమావేశాలు జరుపుకునేందుకు ఉపయోగిస్తోంది ఆ స్థలం. ఆరోజు అక్కడ, చుట్టపక్కల వున్న యిళ్లలోను జనం కిటకిటలాడిపోతున్నారు. ఛౌద్రి బర్కత్ ఆలి, లాలా కాన్షీరామ్ సమావేశస్తలిలో మధ్యగా కూర్చున్నారు. గాంధీగారు నిలబడి

మాట్లాడటానికి యేర్పాటు చేసిన జాగా నుంచి వాళ్లు యిరవై అయిదు - ముప్పై అడుగుల దూరంలో మటుకే వున్నారు లాలా కాన్షీరామ్ కాస్త భయస్థుడు. పోలీసులు వచ్చి ఎక్కడ సభను చెల్లాచెదురు చేస్తారో అని ఆయన భయం. ఛౌద్రి బర్కత్ ఆలీమటుకు చాల ఉత్సుకతతో ఉద్వేగంతో నిండిపోయివున్నాడు. గాంధీగారు అంటే సామాన్యమా ? 1917లో చంపారణ్ ఉద్యమం అయిన తరువాత దేశంలోని వాతావరణాన్నే మార్చిపారేశాడు ఆయన. గాంధీపేరు తెలియని, ఉచ్చరించని నగరం లేదు. దేశంలో యుద్ధం జరగవలసిన సందర్భంలో శాంతిని గురించి, హింస - దౌర్జన్యం నెలకొనవలసిన వాతావరణంలో దౌర్జన్యరాహిత్యాన్ని గురించి మాట్లాడతాడు ఆయన. అలాగే తన షరతుల మీద బ్రిటిస్ వారితో పోరాటాన్ని గురించి ప్రస్తావిస్తాడు. ఛౌద్రి తిరుగుబాటు స్వభావం కలవాడు. 1857 - ప్రధమ స్వాతంత్ర్య పోరాటంలో - ఆయన పూర్వీకులు ఎవరో ఢిల్లీలో పోరాటంలో పాల్గొన్నారని చెప్పుకుంటారు. ఆయన్ని బ్రిటిష్‌వారు ఉరితీశారట కూడా. స్వాతంత్ర్యం సంపాదించటానికి తన దగ్గర ఓ కొత్త ఉపాయం ఉన్నదని చెబుతున్నాడు గాంధీ గారు. అందుచేత ఈయన్ని చూడడం కోసం తపించిపోతున్నాడు బర్కత్ ఆలీ.

గాంధీ ప్రయాణం చేస్తున్న రైలు నాలుగు గంటలు ఆలస్యంగా నడుస్తోంది మధ్యాహ్నం మూడు గంటలకు మటుకే ఆయన రామ్ తలాయ్‌ను చేరుకోగలిగారు. రైల్వేస్టేషన్ దగ్గర నుంచి సభాస్థలి వరకు జనం బారులు తీరి దట్టంగా, గుంపులు గుంపులుగా పోగయి వున్నారు. సాయల్‌కోట యింతవరకు యెవరయినా పేరున్న పెద్దలకు యిచ్చిన ఘనస్వాగతాలలో యిదే విలక్షణమైనది.

(లాలా కాన్షీరామ్ యీ అభిప్రాయంతో అంగీకరించడు. ఆయన ఉద్దేశ్యంలో 1921లో ప్రిన్స్ ఆఫ్ వేల్స్‌కు యిచ్చిన స్వాగతం ఎంతో పెద్దది, భారీ ఎత్తున జరిగింది, చాలా కలకల లాడుతూ వుండింది)

గాంధీగారి అల్పశరీరం రామ్‌తలై వేదిక మీదికి చేరుకోగానే - యిద్దరు ముగ్గురు కాంగ్రెస్ వాలంటీర్లు ఆయనకు అండగా వుండి నడిపించవలసి వచ్చింది. జనంలో సగం మంది అత్యుత్సాహంతో లేచి నిలబడి 'మహాత్మాగాంధికి

జై', 'మహాత్మాగాంధీ జిందాబాద్' ''మహాత్మా గాంధీ జిందాబాద్..' అని నినాదాలు చేశారు. దూరాన కూర్చున్న లాలా కాన్షీరామ్, బర్కత్ ఆలీలకు ఒక కళ్లజోడు, అనాచ్ఛాదితమైన పొట్ట - నడుము. గోచీగుడ్డ, నిడివైన కర్రమాత్రం కనిపించాయి. ఆయనే గాంధీ ! మహాజనానికి నాయకుడు. లాలా కాన్షీరామ్‌కు కూడా యీయనను చూడడంతోనే ఉద్వేగం, ఆనందం కలిగాయి. 'మహాత్మా గాంధీకి జై' అని అందరితో పాటు అతడూ అరిచాడు.

గాంధీ వేగంగా అడుగులు వేస్తూ తనకోసం నిర్మాణం అయిన వేదికను చేరుకున్నాడు. వయోధికుడు, బక్కప్రాణి అయినా యుద్ధ సిపాయిలా నిటారుగా నిలబడి మరీ నడుస్తున్నాడు. వేదిక మీదకు చేరడంతోటే చుట్టూ చేరిన మహాజనాన్ని ఒక్కమారు వీక్షించి, అందరికీ నమస్కారం చేశాడు. ఆయన పెదవులు విజయం సాధిస్తానన్న చిరునవ్వును చిందుతున్నాయి. ఈ మనిషి నిజాయితీ అయినవాడు - అనుకున్నాడు చౌద్రి బర్కత్ ఆలీ. ఈయన చెప్పవలసింది యేదో వుంది.

గాంధీ నోరు విప్పి మాట్లాడకముందే, ఆయనను యింకా సరీగా పరిచయం కూడా చేయకముందే అక్కడ పోగయిన జనంలో సగం మంది వెళ్లిపోయేందుకు లేచినిలబడ్డారు. అలా వెళ్లిపోతున్న వాళ్లందరూ స్త్రీలు. వాళ్లు ఉదయం ఆరుగంటల ప్రాంతం నుంచి యిక్కడకు వచ్చి కూర్చున్నారు. ఇంటి దగ్గర పిల్లల్ని చూచుకోవటానికీ దానికీ ప్రత్యేకమైన యేర్పాట్లు యేవో చేసుకు వచ్చారు. గాంధీగారు పదకొండు గంటలకు వస్తారని ముందు అనుకున్నారు. క్రమంగా గుంపు పోగవడం జరిగింది. ఇంటిపట్టున వుండే ఆడవాళ్లకు యిలా వచ్చి కూర్చోవడం చాలా కష్టంగా యాతనామయంగా వుంది. గాంధీగారు కనిపించడంతోనే, తాము ఆయన్ను చూడడంతోటే - యింక యిక్కడ తమకేమీ పనిలేదని, ఉండవలసిన అవసరం లేదనీ భావించారు. వాళ్లకు రాజకీయాలతో ప్రమేయం లేదు, గాంధీ గారి ఉపన్యాసాలలో అభిరుచి లేదు. వారికి గాంధీ అంటే 'మహాత్ముడు', ఓ మత పురుషుడు. ఆయనకు గౌరవ పురస్సరంగా దాసోహం చేయటానికే వాళ్లు యిక్కడ పోగయినారు.

వాలంటీర్లు వాళ్లను కూర్చోబెట్టటానికి, సభాకార్యక్రమం నిరాటంకంగా జరిగేందుకు దోహదం చేయటానికి ప్రయత్నం చేశారు. కాని ఆ పంజాబు స్త్రీలు మాత్రం ఎవరు చెప్పినా, యేం జరిగినా వినే ఘటాలు కాదు షల్వార్‌లు, చీరలు సవరించుకుంటూ, ఊతం కోసం చేతులు మోకాళ్లమీద ఉంచుకుంటూ లేచినిలబడ్డారు. వేదికవైపు రెండు చేతులూ ఎత్తి నమస్కారం చేసి మరీ కదిలిపోయారు.

మరేమీ ప్రయోజనం లేదని గ్రహించిన గాంధీ నవ్వుతూ కూర్చుండిపోయాడు - వెళ్లిపోదలుచుకున్న వాళ్లందరూ వెళ్లేంత వరకు. తరువాత స్థానిక నాయకుడు కొంతసేపు మాట్లాడాడు. ఆపైన గాంధీ నిదానంగా లేచి లౌడ్ స్పీకర్ల ముందుకు వచ్చాడు.

జనం నిశ్శబ్దంగా విన్నారు. ఆయన గొంతు అతి మృదువైనది. హిందీ ఉచ్చారణ పలుకుబడులు ఎక్కువగా వున్నాయి. ఉదాహరణకు 'స' అనే అక్షరాన్ని ఆయన 'ష' అని ఉచ్చరిస్తున్నాడు. ఆయన బోసినవ్వులతోనే - మాట్లాడటానికి ముందే - జనాన్నంతటినీ సమ్మోహనం చేయగలిగాడు. ఆయన వినయం అందరినీ ఆకట్టుకుంది. అందరు నాయకులు వంటివాడు కాదు, యీయన - అని బర్కత్ ఆలీ లాలా కాన్షీరామ్ ఎడమచెవిలో ఊదాడు. ఆమాట అక్షరాలా నిజం - అని కాన్షీరామ్ పంజాబీ వాక్యంలో ఉత్తరవు యిచ్చాడు. తనకు తెలిసిన ఇంగ్లీషు దొరలతో పోల్చి చూస్తే యీయనకు వంటినిండా గుడ్డలుకూడా లేవు. డెబ్భయివేలమంది ఆయనను దర్శించుకోవడానికి వచ్చారు. ఆయన అర్ధనగ్నంగా మటుకే అవతరిస్తున్నాడు!

వేదిక మీద స్థానిక నాయకులు చేరివున్నారు. గాంధీ వారందరిలోనూ మిన్నగా కనిపించాలని యెలాంటి ప్రయత్నమూ చేయడం లేదు. అతి నిదానంగా, యేమీ తొందరపాటు చూపకుండా వేచివున్నాడు వెనకగా.... తన వంతు వచ్చేవరకూ.

ఇప్పుడు అనేక సంవత్సరాలు అయినమీదట - ఛౌద్రి బర్కత్ ఆలికి ఆ ఉపన్యాస పూర్తిపాఠం అంతగా గుర్తులేదు గాని, అతని జీవిత గమనాన్ని

మార్చివేసిన సన్నివేశంమట్టుకు అదే. లాహోర్‌లో జరిగిన ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ వారి తీర్మానం పూర్తిపాఠాన్ని వివరించి చెప్పాడు ముందుగా గాంధీ 'పూర్ణస్వరాజ్', పూర్తి స్వాతంత్ర్యం అంటే యేమిటో సవివరంగా తెలియజేశాడు అలాంటి ఆశయాలను నెరవేర్చుకోవటానికి బానిసదేశానికి వున్న అవకాశాలు యేమిటో వల్లించాడు ఒకదాని తరువాత ఒకదానిని పరిహరించాడు అహింసా పద్ధతిని గురించి వక్కాణించాడు దౌర్జన్య పూరితమైన ప్రయత్నం కంటె దీనికి ఎక్కువ సంసిద్ధత అవసరం అన్నాడు ఎంతో సంయమనం వుండాలన్నాడు భారతదేశానికి ఆత్మస్థైర్యం, సంయమనం, త్యాగనిరతి ప్రదర్శించిన చారిత్రక నేపథ్యం వున్నదన్నాడు. దేశవిభజన దీనినంతనూ బలహీన పరుస్తుందన్నాడు బ్రిటిష్ వారు ఒక మతం వారిని మరొక మతం వారివైపు కవ్విస్తున్నారు, తమ స్వప్రయోజనం కోసం అన్నాడు. వాళ్లను నేను నిందించడం లేదు, వాళ్లపైన నాకేం కక్ష లేదు' అన్నాడు రెండు శతాబ్దాలపాటు బానిస దేశంగా తయారు చేసిన యీ దేశాన్ని యిప్పుడు వాళ్లు వదిలిపోవలసిందే నన్నాడు వాళ్లకు ద్వంద్వ ప్రవృత్తి యెలా నప్పుతుంది ? స్వదేశంలోనే స్వాతంత్ర్యం, విదేశాలలో బానిసత్వం ఎలా కుదురుతుంది ? అందుచేత వాళ్లు వెళ్లిపోవలసిందే. తమ పరిపాలనలో తప్పులను గ్రహించి వాళ్లు ప్రశాంతంగా - యేమీ గందరగోళం చేయకుండా యీ దేశాన్ని వదలివెళ్లిపోవడం ఒక్కటే మార్గం అందుకు భారతీయులకు మాత్రం ఒక్కటే దారి స్వయం సంయమనం, త్యాగశీలత మరో మార్గం లేదు

సంయమనానికి ప్రాతిపదికగా హిందూ - ముస్లిం ఐక్యత గురించి చెప్పాడు ఆయన. ఆత్మత్యాగానికి ప్రాతిపదికగా అహింసను చూపాడు. గాంధీగారు నవ్వుతూనే చెప్పాడు. కాంగ్రెస్ దేశానికంతటికీ ఒక కార్యసాధన ప్రణాలిక తయారుచేస్తున్నదని, ఆ ప్రణాలిక తయారయి ప్రపంచంలోనికి వచ్చేంత వరకు తానో మార్గంచూపిస్తానన్నాడు అది తక్షణమే అనుసరణీయం అన్నాడు. ఈ రోజు నుంచి ప్రతి మహమ్మదీయుడు ఒక హిందువును తన 'సోదరుడు'గా స్వీకరించాలి ఈ రోజునుంచీ యింట తయారయిన వస్తువులనే - స్వదేశీ సరంజామానే - ఉపయోగించాలి ఇంగ్లండ్ నుంచి దిగుమతి అయిన సరుకును ఉపయోగించగూడదు

హిందు - ముస్లిం సోదరత్వాన్ని గురించి ఆయన చాలాసేపు మాట్లాడాడు ఇండియా - భౌగోళికంగా అనేక ప్రాంతాలుగా విభజన చేయడం జరిగింది గాని మత ప్రాతిపదికగా విభాగం అసందర్భం. ఇండియా అంతా ఒక్కటే దేశం; ఒక్కటే జాతి. ఇస్లాం భారతదేశానికి బయటనుంచే వచ్చింది. అయితే ముస్లింలు - ఇంగ్లండు దేశస్థుల మాదిరి కాకుండా - యీ దేశంలో స్థిరపడిపోయారు. ఇండియాలో వున్న ముస్లిం భారతీయుడే తప్ప మరింకేమీ కాదు. హిందువు విషయం కూడా యిదే నిజం. హిందువుల దేవుళ్లు, దేవతలు మాతృదేశంకంటె తక్కువస్థాయి వాళ్లు.

ముస్లింలీగ్ యింకా అప్పటికి వేరే పాకిస్థాన్ కావాలని ప్రకటన చేయలేదు అందువల్ల గాంధీగారు మాట్లాడిన హిందు - ముస్లిం ఐక్యత ఆ ప్రాతిపదిక మీద చేరినది కాదు. ఏకైక శత్రువు అయిన బ్రిటిష్ వారిని ఎదుర్కోవడంలోను, ఎదిరించడంలోను యీ ఐక్యతకు యెంతో ప్రాధాన్యం వున్నదని ఆయన చెప్పారు.

ఇక స్వదేశీ వస్తువులను గురించి మాట్లాడుతూ - విదేశాలలో తయారయిన వస్తువులు కొంటున్నారంటే దాని అర్థం మీ దేశంలోని పనివాళ్ల జీవన భృతిని తిరస్కరిస్తున్నారన్నమాట - అన్నాడు. విదేశీ వస్తువుల మీద ఆధారపడినంత కాలం, బ్రిటిష్ పరిపాలన కొనసాగుతూనే వుంటుందన్నాడు. ఇంటింట తయారవుతున్న ఖద్దరు దుస్తులు ధరించండి, ప్రతియింట రాటాలు నడపండి - అన్నాడు.

ఈ ఉపన్యాసం అవడంతోనే, 'మహాత్మాగాంధీకి జై' అనే నినాదాల ధ్వని ప్రతిధ్వనులు సమసిపోకముందే ఛౌద్రి బర్కత్ అలి, లాలా కాన్షీరామ్ వంకతిరిగి అతి గంభీరంగా 'ఈరోజు నుంచి నీవు నా సోదరుడివి' అన్నాడు.

లాలా కాన్షీరామ్ చిరుమందహాసం చేశాడు. అతడు ఛౌద్రి బర్కత్ ఆలిని సోదరుడుగానే పరిగణిస్తున్నాడు, ఎప్పటినుంచో. ఈ విషయం ప్రబోధించటానికి ఓ గాంధీ అంటూ ముందుకు రావలసిన అవసరం లేదు. అయినా అప్పటి వాతావరణానికి ప్రతిస్పందిస్తూ, ఛౌద్రి బర్కత్ ఆలి చేతిని తన చేతిలోనికి తీసుకుని చురుకుగా కరచాలనం చేశాడు. 'మనం ఖద్దరు ధరిద్దాం

ఇంట నేసిన నూలునే కడదాం' అన్నాడు బర్కత్ అలీ. 'అలాగే !' అన్నాడు బదులుగా కాన్షీరామ్.

ఆ రోజునుంచి స్నేహితులు యిద్దరూ మొద్దు ఖద్దరు చొక్కాలు, పైజమాలు ధరించ నారంభించారు. లాలా కాన్షీరామ్‌కు ఈశ్వర ప్రసాదిత వరం వంటిది. ఏమంటే ఖద్దరు అతిచౌక. దేశభక్తి ప్రదర్శిస్తూనే పొదుపుగా జీవించటానికి వీలుంది. ఛౌద్రి బర్కత్ ఆలి యీ విషయాన్ని - ఖద్దరు ధారణను - చాలా ప్రధానమైన విషయంగా తీసుకున్నాడు. ఒక అడుగు ముందుకు వేసి కాంగ్రెస్‌లో సభ్యత్వం తీసుకున్నాడు. ఆ పార్టీ స్థానిక నాయకులలో ఓ చిన్న నాయకుడు అయిపోయాడు. ఖాదీ విషయంలో తన నిర్ణయాలను కుటుంబ సభ్యులమీద భార్య, పిల్లల పైన రుద్దలేకపోయారు. అయినా అరుణ్ మునీర్ కాంగ్రెస్‌కు వ్యతిరేకంగా మాట్లాడిన వాళ్లతో యుద్ధాలు చేశారు. నూర్ కూడా తన స్కూలు పిల్లలతో వాదనలు చేస్తూ వుండేది.

అవును, నూర్ మంచి ముస్లిం అమ్మాయి ; పవిత్ర హృదయ. ఛౌద్రి బర్కత్ ఆలికి ఆమె గర్వకారణం. అమ్మాయి సినిమా పాటలు పాడితే మటుకేం ? దానికి మతానికీ యేమీ సంబంధం లేదు. అదంతా యవ్వనపు పొంగు. ఎదుగుతున్న ఆమె శరీరాన్ని చూస్తున్నప్పుడల్లా ఆయనకు ఎంతో ఆనందంగా వుండేది. త్వరలోనే ఆమెకో వరుడిని వెదకాలి గదా అని ఆలోచన కూడా వస్తూ వుండేది.

హైస్కూల్ చదువుదాటి కాలేజిలో చేరినప్పుడు అరుణ్ నూర్‌ను గమనించడం ఆరంభించాడు. అప్పటికి ఆమెకు పదహారేళ్లు. అలా అని ఆమే చెప్పింది. ఆమె శరీరమంతా పదహారు సంవత్సరాల నిండుతనాన్ని ప్రదర్శిస్తోంది.

ఒకరోజు అరుణ్ క్లాసునుంచి యింటికి వెడుతున్నాడు. రైలుపట్టాల పక్కన విశాలంగా పరుచుకున్న రోడ్డు మీద విశ్రాంతిగా సైకిలు తొక్కుకుంటూ వెడుతున్నాడు. కొద్దిదూరంలో బర్మాషెల్ పెట్రోల్ స్టేషన్ దగ్గర, నూర్ ముందుగా వెడుతూ కనిపించింది. సాధారణంగా ఆమె యితర పిల్లలతో కలిసి

టాంగాలో వస్తుంది కాలేజికి  ఇంటికి తిరిగి వెళ్లడం కూడా అలాగే  అందుచేత అరుణ్‌కు ఆమె పుస్తకాలు చేత పుచ్చుకుని చకచక యింటికి నడుస్తూ వుండడం కాస్త విడ్డూరం అనిపించింది.

'టాంగా యేమయింది, నూర్ ?' అనడిగాడు.

అరుణ్ ప్రశ్నకు నివ్వెరపోయింది. అరుణ్ వచ్చి పక్కన చేరి చెవిలో యిలా అడగడం ఆమె ఊహించలేదు

'అబ్బ - భయపడిపోయాను - 'అంది ఎదుర్రొమ్ము మీద చేయివేసుకుని ధైర్యం చెప్పుకుంటూ.

అరుణ్ సైకిల్ దిగాడు  తుంటరిగా నవ్వుతూనే 'యింతకూ టాంగా యేమయింది, చెప్పవేం' అన్నాడు.

'నాపాఠాలు పూర్తి అయినాయి  ఇంకో గంటసేపు టాంగా కోసం ఎదురు చూడడం కాలం వృధా అనుకున్నాను.'

'రా, నేను యింటికి తీసుకుపోతాను '

అతని గొంతు మామూలుగానే వుంది. తుంటరితనంతోపాటు అతనికే తెలియని యేదో మెలుకవ.

'ఎలా తీసుకువెడతావు ?' అంది నూర్ నవ్వుతూనే.

'సైకిల్ మీద'

'నీకు పిచ్చెక్కిందా ? మానాన్న చూస్తే చంపేస్తాడు'

'ఉహు, యేం చేయడు. ఆయన చూస్తే తప్పంతా నాది!'

అరుణ్ ఆమెను ఎలాగయినా సైకిల్ మీద యింటికి తీసుకువెళ్లాలని ఉత్సాహపడతున్నాడు. ఆమె అంగీకరిస్తే బాగుండును. అతని కోరికకు అతనికే ఆశ్చర్యంగా వుంది.

'రా పక్కదారులలోంచి సందు గొందులలోంచి నిన్ను తీసుకు వెడతాను, ఎవరూ చూడరు' అన్నాడు

ఈ మాటలు అంటున్నప్పుడే యిద్దరికీ తమలో సరికొత్త వాతావరణం వెలిసిందని పించింది మాటలు లేవు, చేతలు లేవు. ఏదో ఆత్మీయత భూగర్భంలోంచి అకస్మాత్తుగా పైకి వచ్చి వాళ్లిద్దరినీ అలుముకుని గట్టిగా 'ఒక్కటి' చేస్తున్నట్లు అనిపించింది.

నూర్‌కు అతని ప్రతిపాదనకు కాదని చెప్పడం చేతకాకుండా పోతోంది. అరుణ్ సైకిల్‌కు 'కారియర్' లేదు, అందుచేత ఆమె అతని ముందున్న 'క్రాస్ బార్' మీదనే కూర్చోవలసి వచ్చింది ఏదో ధైర్యం, సాహసం చేస్తున్నట్లు, యేదో సవాలును ఎదుర్కొంటున్నట్లు ఆమె తలూపి సైకిలు మీద - క్రాస్‌బార్ మీద - కూర్చుంది.

'ఎవరయినా నన్ను యిలా చూస్తే, చీల్చి కుక్కలకు నక్కలకు వేసేస్తారు' అంది ఆమె కాస్త సిగ్గుపడుతూ.

అరుణ్ జవాబు చెప్పలేదు. ఆమె భయాలన్నీ నిర్హేతుకమయినవని సూచిస్తూ నవ్వాడు, అంతే. అతని నవ్వు ముడిపడిపోయి వుంది.

సైకిల్ బరువు, నూర్ బరువు సమర్థించుకుంటూ అరుణ్ 'పెడలింగ్' ప్రారంభించాడు. నూర్ అతి ప్రశాంతంగా, సమ్మోహనం అయిన స్థితిలో తాపీగా కూర్చుంది. ఆమెనుండి వస్తున్న సుగంధం అరుణ్‌కు తృప్తిగా ఆహ్లాదదాయకంగా వుంది. తాను వెతుకున్న మనిషి యిప్పుడు ఎంతో దగ్గరగా, సరసనే వుంది. ఈ భావన అతనికి అతి అకస్మాత్తుగా తట్టింది. ఎన్నో నిద్రరాని రాత్రులు, అర్థం కాని పాఠాలు, ప్రార్థనలు --- యివన్నీ అతన్ని శాంతపరచలేక పోయినాయి. తాను వెదుకుతున్నది ఈమె కోసరమే. ఇన్నాళ్లూ తనకు యీ విషయం యెందుకు స్ఫురించలేదు !

వాళ్లిద్దరూ ఉక్కిరి బిక్కిరి అయిపోయిన ఆనందంలో మాటలు కూడా మరచిపోయారు. రైలుస్టేషన్ పక్కనుంచి సందులు గొందులు తిరిగి అప్పుడే మైనాపూర్ వచ్చేశారు.

'ఇక నన్ను దిగనివ్వు, యిక్కడ' అంది నింపాదిగా నూర్.

'ఊహు' అన్నాడు అతను, నిదానంగా, సిగ్గుతో కందిపోతూ.

'ఇప్పుడే యిక్కడే కలిశావని చెప్పటానికి వీలవుతుంది ?'

'ఊహూ'

వాళ్లిద్దరి పరస్పర అవగాహన, ఎఱుక ఆ రకంగా ప్రారంభం అయింది. నిదానంగా నును సిగ్గుగా అది క్రమంగా అపుకోలేనంత ఉద్వేగంగా, ఆత్మీయతగా రూపుదిద్దుకుంది. దానిని వారిద్దరూ రహస్యంగా దాచుకోవాలని ప్రయత్నించలేదు

తన తల్లితండ్రులతో యీ విషయం అదే పనిగా ప్రస్తావించకపోయినా, తమ యిద్దరి మధ్య ఆప్యాయత - ఆత్మీయత నెలకొనివున్నాయని వారు యెరుగుదురని అరుణ్ అనుకుంటున్నాడు. మునీర్‌తో మరో పద్ధతి. నూర్‌తో తన భవితవ్యాన్ని గురించి అరుణ్ అదేపనిగా మాట్లాడుతూ వుండేవాడు.

కాలేజీ జిమ్‌లో ఒకరోజు అరుణ్ మునీర్‌తో అన్నాడు. 'నా చదువుపూర్తయి ఉద్యోగం దొరకగానే నేను నూర్‌ను వివాహం చేసుకుంటాను.'

వాళ్లిద్దరూ 'పేరలెల్ బార్' దగ్గర ఎక్సర్‌సైజ్ చేస్తున్నారు. వ్యాయామ పరిశ్రమతో మునీర్ ముఖం ఎర్రగా కందిపోయి వుంది. అతడు వెంటనే యేమీ బదులు చెప్పలేదు. పేరలెల్ బార్ దగ్గర తను అనుకున్న అంకె - యాభయి పర్యాయాలు - అయిపోయేంత వరకు పరిశ్రమించి, అప్పుడు ఆగి కొన్ని క్షణాలు గాఢంగా ఉచ్ఛ్వాస నిశ్వాసాలు వదలి, అప్పుడు 'అలాగే ! ఎందుకు కూడదు ?' అన్నాడు.

'మీనాన్న పట్టుబట్టేట్లయితే నేను ముస్లింను అయిపోతాను కూడా !'

'అంత అవసరం లేదను కుంటాను. ఎవరి మతం వారు ఉంచుకోవచ్చును'

అది అరుణ్‌కు అంతవరకు ఊహకు అందని విషయం.

'అలా అయితే వివాహం చేసుకోవటానికి దారి ?'

'సివిల్ కోర్టులో చేసుకోవచ్చును'

'కోర్టులు దీనికి పర్మిషన్ యిస్తాయని నీకు బాగా తెలుసునా ?'

'కనుక్కోవాలి. అభ్యంతరం వుండదనుకుంటాను.'

-- ఈరోజు మునీర్ కాంటీన్‌లో ప్రశాంతంగా కూర్చున్నాడు, తాను, నూర్ కలిసికొంత సేపు ఏకాంతంగా గడిపినారని చూచి - మందలించిన పిదప

అరుణ్ అన్నాడు 'మునీర్ ! నేను ఆమెనెంతగానో ప్రేమిస్తున్నాను'

మునీర్ పొడగరి యువకుడు. ఎప్పుడూ అతని ముఖం సాలోచనగా వుంటుంది. కోటేరు వంటి ముక్కు. చిన్న కళ్లు ఎప్పుడూ మనసులో యేదో ఆలోచన వుంచుకుని అదేధ్యేసగా యోచిస్తు వుంటాడు. అతని ఆరోగ్యం యిప్పటికీ అంతంత మాత్రం అయినదే. అయినా చిన్నతనంలోని బలహీనం, రోగిష్టితనం లేవు. అతడు నడుస్తూ వుండడం కూడా తన పొడగరితనాన్ని గమనంలో వుంచుకునే అన్నట్లుగా వుంటుంది... ఈ పొడుగుకు తగ్గ బరువు తనకు లేదని అతనికి ఎప్పుడూ చింత... ! కొద్దిగా నడుం బుజాలు వంచి ఆ బరువును ఆపాదించుకుంటూ వుంటాడు.

'ఇది యిలా కొనసాగటానికి వీల్లేదు'

'అలా మాట్లాడకు'

'అరుణ్, వాస్తవాలను పరికించి చూడవలసి వుంటుంది నువ్వు. నూర్‌ను కలుసుకోవడం పూర్తిగా మానివేయి..'

'ఆపని నావల్ల కాదు... నా వల్ల కాదు...'

'అయితే నూర్‌నే కట్టడి చేయవలసి వుంటుంది నేను.' అరుణ్ యీ మాటలతో బాధపడిపోతున్నట్లు గమనించి, 'యిది నీ రక్షణకు సంబంధించిన విషయం కూడా నసేమాట మరచిపోతున్నావా, అరుణ్. అంత అమాయకుడివవుతున్నావా ? సరే... యేమయితే అది అయింది... నాకో వాగ్దానం చేయి, ఆమెను నా సమక్షంలోనే చూస్తాననీ, కలుసుకుంటాననీ !

అందులోనూ, మా యింటి వద్దనే - ఆమెను యికముందు బయట ఎక్కడా నీవు కలుసుకోగూడదు '

'అలా అని వాగ్దానం చేయవలసిన పనిలేదు. నూర్ యిక ముందునన్ను చూడగోరుతుందనిపించడం లేదు నాకు' అన్నాడు అరుణ్ తమ సంభాషణ గుర్తుకు తెచ్చుకుంటూ

'పోనీ - యీ విషయం తరువాత మాట్లాడుకుందాం. అది అలా వుంచు ఇప్పుడు మనం బిల్‌డేవిడ్ సన్‌ను కలుసుకుందాం దేశ విభజనను గురించి అతని అభిప్రాయం యేమిటో తెలుసుకుందాం!'

మునీర్ యిలా డేవిడ్ సన్ ప్రసక్తి తీసుకురావడంతో, తాము వ్యక్తిగత విషయాలను మట్టుకే చర్చించడం లేదు అనే స్పృహ కలిగింది అతనికి. మనసులో రకరకాల ఉద్వేగాలు, రాగభావాలు తన మాదిరే మునీర్‌ను కూడా వ్యధ పరుస్తున్నాయని అతనికి అనిపించి, విషాదం కలిగింది.

అప్పుడు - చెమటలు పోస్తున్న వాతావరణంలో, సాయంకాలం పూట యిద్దరూ కంటోన్మెంట్ ప్రాంతానికి సైకిళ్ల మీద వెళ్లారు. సార్జెంట్ డేవిడ్‌సన్ వుండేది అక్కడే. అరుణ్‌కు కంటోన్మెంట్ ప్రాంతం అంటే ఎక్కువ యిష్టం. అక్కడ రోడ్లన్నీ శుభ్రంగా వుంటాయి. ఓ రకమైన చల్లదనం యిస్తాయి. జన సంచారం కూడా ఎక్కువగా వుండదు. కంటోన్మెంట్ ప్రాంతానికి ఒకటే ముఖ్యమైన రహదారి, బజారు. దాన్నిసదర్ బజార్ అంటారు. తతిమ్మాదంతా బరాక్స్ పెద్దపెద్ద బంగళాలు, ఆటస్థలాలు, పేరేడ్ మైదానాలు. ప్రతిచోట సైనికులు యేదో వ్యాయామం చేస్తూనో, ఆటలు ఆడుతూనో కనిపిస్తూ వుంటారు ఇండియా జాతీయ 'గేమ్' అయిన హాకీ ఎక్కువగా ఆడతారు. అరుణ్‌కు వాళ్ల ఆటలు డ్రెస్సులు అంటే ఎక్కువ యిష్టం. సాయంకాలం పూట, రోజూ పరిశ్రమ అంతా అయిన తరువాత - నగర గందరగోళంతో నిమిత్తం లేకుండా... యిక్కడ ప్రశాంతత చిక్కుతుంది.

సార్జెంట్ డేవిడ్‌సన్ హుంరా పెరేడ్ గ్రౌండ్స్ దగ్గర 'బరాక్స్'లో వుంటాడు. అరుణ్ మునీర్ అతడిని కలుసుకోవడం స్నేహితులు అవడం యాదృచ్ఛికంగా

జరిగింది. యూనిఫారంలో వున్న ప్రతి తెల్లవాడినీ అనుమానంతో చూడడం అలవాటయింది. వాళ్లను అవమాన పరచటానికి, కించ పరచటానికి ప్రయత్నం చేసేవాళ్లు. గడచిన రెండేళ్ల నుంచి తెల్ల సిపాయిల ధోరణిలో చాల మార్పు వచ్చేసింది వాళ్లు యిప్పుడు దేశీయులతో స్నేహపురస్సరంగా వుండటానికి ప్రయత్నిస్తున్నారు. కంటోన్‌మెంట్‌లో ఇంగ్లీషు సినిమాలు చూపించే థియేటర్ వుంది. దానిపేరు 'కాపిటల్ పిక్చర్ హౌస్'. సినిమా పూర్తి అయి, నాయకులు - నాయకురాలు సుఖాంతంగా కౌగిల్లో ఒరిగిపోయిన తర్వాత 'యూనియన్ జాక్' వెండితెరమీద వెలిగేది ఇంగ్లీషు జాతీయగీతం వినవచ్చేది. ప్రేక్షకులందరూ అప్పుడు నిశ్శబ్దంగా శ్రద్ధా భక్తులతో లేచి నిలబడి వుండాలి ఈమధ్య భారతీయులు యిలా లేచి నిలబడడం లేదు. బ్రిటిష్ వారు యీ స్థితిని గమనించారు. అయినా చూచీ చూడనట్లు ఊరుకుంటున్నారు ప్రేక్షకులలో చాలా భాగం బ్రిటిష్ సిపాయిలు, వాళ్ల కుటుంబాలు హాల్లో కొందరు భారతీయులు - ముర్రే కాలేజి విద్యార్థులు ఎక్కువభాగం - వుండేవాళ్లు. సిపాయిలు వీళ్ల ప్రవర్తనను చూడనట్లుగా ప్రవర్తించేవాళ్లు.

ఒకరోజు - మ్యాటినీ అయిపోయినాక, అరుణ్ మునీర్ జాతీయ గీతం యింకా ప్రసారం అవుతూ వుండగానే బయటకు వెళ్లిపోవటానికి ప్రయత్నించారు. మూసివున్న తలుపుదగ్గర ఒక ఆసామి నిలబడివున్నాడు. అతడు సరదాగానే 'జాతీయగీతం పూర్తయే వరకూ యీ తలుపు తెరవటానికి వీల్లేదనుకుంటాను' అన్నాడు. ముందు అతడు సినిమా హాలు తాలూకు 'అటెండర్' అనుకున్నారు. తీరాచూస్తే అతను ఆర్మీయూనిఫారం ధరించిన యువకుడు

ఇంతలో జాతీయగీతం ప్రసారం పూర్తిఅయింది తలుపులు విశాలంగా తెరుచుకున్నాయి. హాలులో లైట్లు వెలిగాయి. వాళ్లదారికి ఓ లావాటి వ్యక్తి అడ్డుగా నిలబడ్డాడు. అతని ముఖంలో నవ్వు కనిపిస్తోంది. ఎంతో దృఢత్వంతోపాటు. దీపాలు వెలగడంతోటే, వాళ్లకు బయటకు వెళ్లటానికి దారి వదిలాడు. చిరునవ్వుతోనే, 'ప్రతిఘటనలు యింత దూరం తీసుకురావడం ఎందుకు ?' అన్నాడు అతని చిరునవ్వు సర్వవ్యాపకం అవుతోంది.

సార్జెంట్ కూడా వాళ్లతో పాటు హాలువదలి అవతలకు వచ్చి, సైకిల్ షెడ్ వయిపు నడిచాడు.

బయటకు వచ్చిన తర్వాత అరుణ్ బిరుసుగా 'మేం మీ జాతీయ పతాకానికి గౌరవ పురస్కారాలు చేయం-' అన్నాడు.

'అలా అయితే మీరు లేచినిలబడనవసరం లేదు. అయినా హాలువదలి, గీతం పాడుతున్నవాళ్లకు అంతరాయం కలిగించడం ఎందుకు ?'

వాళ్లకు ఈ ప్రశ్న సమంజసమైనదిగానే తోచింది. ఏం జవాబు చెప్పాలో తెలియలేదు. వాళ్ల తడబాటు గమనించి అతడు చిరునవ్వుతో 'మీ అంతరంగ భావాలు యేమిటో నాకు తెలుసు' అన్నాడు.

'నీకు తెలియవు' అన్నాడు మునీర్.

'తెలియవా ?'

'ఉహు. తెలియవు'

'సరే అయితే' అన్నాడు అతను, స్నేహపూర్వకంగా నవ్వుతూనే. అతని వాలకంలో యేదో విచిత్రం వుంది. వైవిధ్యం వుంది. ఓ గౌరవం, మన్నన. వాళ్లకంటె వయసులోనూ శరీరదార్ఢ్యంలోనూ మిన్ననయిన వాడయినా వాళ్ల పట్ల సముచిత ఆదరం చూపడం.... యిదంతా రెండు మొక్కల మధ్య ఒక మహావృక్షం అణుకువ చూపుతున్నట్లు వుంది.

'సరే... కానివ్వండి. నాపేరు బిల్ డేవిడ్ సన్. బిల్ అని పిలవండి చాలు' అన్నాడు అతను ప్రీతిపాత్రంగా.

'నేను మునీర్ అహ్మద్‌ను'

''నేను అరుణ్ కుమార్‌ను'

'మంచిది. మిమ్మల్ని మునీర్, అరుణ్ అనిపివవచ్చునా నేను ?'

వాళ్లిద్దరూ అమిత ఉత్సాహంతో ఆసక్తిగా 'ఓ అలాగే!' అన్నారు.

'చూడండి.... నేను యిక్కడికి దగ్గర్లోనే వున్నాను. నాతోపాటు రండి. నగరానికి తిరిగిపోయేముందు ఓ కప్పు టీ తాగండి - నాతో కలిసి'

ఇది కూడా అసాధారణమైన ప్రవర్తనే ఉదారము, ప్రీతిపాత్రమైన కంఠస్వరం, ఆదరం.... వాళ్లను ముప్పిరిగొని అంగీకరించేట్లు చేశాయి.

ముగ్గురు 'బరాక్స్'కు సైకిళ్లమీద వెళ్లారు. హుర్రా పెరేడ్ గ్రౌండ్స్ దాటుతూ వున్నప్పుడు అరుణ్ 'కొత్త సంవత్సరం రోజున మీరు మా కుక్కల్ని కాల్చిపారవేసేది యిక్కడే' అన్నాడు.

'నేను కాదు !' అన్నాడు బిల్ డేవిడ్‌సన్.

బ్రిటిష్ బరాక్స్‌లో ప్రవేశించడం వాళ్లకెంతో కొత్తగా, ఉత్సాహపూరితమైన అనుభవంగా పరిణమించింది. సార్జెంట్ డేవిడ్ సన్ తమకు విరోధి అన్న విషయం కూడా వాళ్లు యిద్దరూ మరిచిపోయారు. ఈ బరాక్స్‌ను వాళ్లు చాల దూరం నుంచి అనేక రోజులుగా చూస్తూవున్నారు. ప్రతిసారీ కోపము, ద్వేషము, అసహ్యము అనిపిస్తూ వుండేది. బ్రిటిష్ రాజ్యాంగ బలానికి యివి కోటలు. ఇక్కడే వాళ్ల బలగం వుండేది ! భారతీయులను యిక్కడకు చేరనివ్వరు. పొరపాటున యెవరయినా దగ్గరకు వచ్చినా తరిమికొడతారు. బ్రిటిష్ ఆఫీసర్ల మెస్ దగ్గర - బయట గుమ్మంలో గార్డులు, పతాక ప్రదర్శన యిటువంటివి వుండవు. తుపాకులు నిషేధం. సార్జెంట్ల క్వార్టర్స్ ముందు కూడా, రెజిమెంటల్ జండా ఎగురుతోంది. రెండు చిన్న తుపాకులు వున్నాయి గుమ్మానికి రెండు పక్కలా.

వాళ్లు సైకిళ్ల మీద వస్తున్నప్పుడు డేవిడ్‌సన్ బయటిగార్డుతో 'వీళ్లు నాతో వస్తున్నారు' అన్నాడు, నింపాదిగా.

అప్పుడే సాయంకాలం అవుతోంది. బారాక్స్‌కు ఒక పక్కగా మెస్ వున్నచోటు నుంచి గాలిలోకి పొగ ఎగబాకుతోంది. ఇక తతిమ్మా వాతావరణం అంతా ప్రశాంతంగా వుంది. లోపలి రోడ్లు రాళ్లు పరచిలేవు. అయినా చక్కగా యేర్పాటయి కంకర్ర పోదిగివున్నాయి. ప్రతిసార్జెంట్‌కు రెండేసి గదులు బరాక్స్ అన్నీ యిలా రెండేసి గదుల వాటాలుగా విభజింపబడి వుంది. బయటి ఆవరణలో దండేనికి కాకీ బుష్‌షర్టు వేలాడుతూ వున్నాయి. డేవిడ్‌సన్ వాళ్లకు లోపలకు తీసుకుపోయాడు.

'కూర్చోండి' అన్నాడు రెండు కుర్చీలు చూపుతూ. అతని గదిలో ఎక్కువ ఫర్నిచర్ లేదు.

మునీర్ 'ఫిలాసఫీ' చదువుతాడు. అరుణ్ మటుకు 'ఇంగ్లీషు లిటరేచర్' చదువుతాడు. అతడు ఎన్నో నవలలు చదివివున్నాడు. డేవిడ్‌సన్ గది, ఆ నవలల్లో వర్ణించిన గదుల మోస్తరుగానే వుంది. ముఖ్యంగా స్కాట్ నవలల్తో అది ఒక సిపాయి గది. ఎక్కువ ఆడంబరం లేదు. శుభ్రంగా అందంగా అమర్చివుంది. గోడమీద ఆరవ జార్జి చక్రవర్తి బొమ్మ వేలాడుతోంది. అదే ఉండవలసిన తీరు. తరువాత ఎన్నో కుటుంబ చిత్రాలు - ఫోటోలు వేలాడుతున్నాయి. వృద్ధులు - ఆడవాళ్ల బొమ్మలు. డేవిడ్‌సన్ స్పోర్ట్ దుస్తుల్లో వున్న అనేక ఫోటోలు.

'మీరు కెరియర్ సోల్జరా ?' అని అడిగాడు అరుణ్, ఆ మాటను తాను చదివిన తాజా ఇంగ్లీషు నవల నుంచి ఎరువు తీసుకుంటూ.

'నిజానికి కాదు. యుద్ధం ప్రారంభం అయినప్పుడు నేను బూట్స్ కెమికల్ ఫర్మ్‌లో నాటింగ్ హామ్‌లో ఉద్యోగం చేసుకుంటూ వుండేవాడిని. యుద్ధం ప్రారంభం అయినాక, సైన్యంలో చేరాను. అప్పుడే ఎనిమిది సంవత్సరాలు అయింది. త్వరలోనే నన్ను సైన్యం నుంచి యింటికి పంపివేస్తారని కూడా ఎదురు చూస్తూవున్నాను యిప్పుడు' అన్నాడు డేవిడ్‌సన్.

'మీకు వివాహం అయిందా ?'

'ఉహు'

'మీకు అన్నదమ్ములు, సోదరీమణులు ఎందరు ?'

కనిపించిన ప్రతి మనిషిని గురించీ కుటుంబ వివరాలన్నీ తెలుసుకోవాలనుకునే తాపత్రయం వున్న భారతీయుడి మనస్సు ! అనుకున్నాడు డేవిడ్‌సన్ మనసులో ఒక మూల. కానయితే అరుణ్ అమాయక ముఖంవైపు చూచి, స్నేహపూర్వకంగానే యీ ప్రశ్నలన్నీ వేస్తున్నాడని నిర్ధారించుకున్నాడు డేవిడ్‌సన్.

'నేను ఒక్కడినే కొడుకును' అంటూ గోడకు తగిలించిన ఒక ఫోటోను చూపుతూ 'మా అమ్మా, నాన్న ఫోటోలో వున్నారు' అన్నాడు

ఆ మనుషులు యిద్దరూ యీ గదిలోనే వున్నట్లుగా అనుభూతి పొంది, యువకులు యిద్దరూ చేతులు ఎత్తి నమస్కారం చేశారు.

సరే, వాళ్లలో వున్న బెరుకు చాలమటుకు తొలగిపోయి తాపీగా కుర్చీలలో ఆసీనులయ్యారు

'ఒక్కనిమిషంలో మనకు టీ తయారుచేస్తాను' అంటూ బాల్ డేవిడ్‌సన్ పక్కగదిలోనికి వెళ్లిపోయాడు. స్టౌ వెలిగించిన శబ్దం వినిపించ సాగింది. అరుణ్, మునీర్ అంతగా మాట్లాడుకోవడం లేదు. ఇంగ్లీషు జాతీయుడితో యేం మాట్లాడాలా అన్న సంగతే యిద్దరి మనసులలోను గుంజాటనలు చేస్తోంది ఇంగ్లీషు మనుషులతో యిదే ప్రథమ పరచయం అనటానిక వీల్లేదు వాళ్ల ముర్రే కాలేజిలో ఇంగ్లీషు ప్రొఫెసర్లు వున్నారు ప్రిన్సిపల్ ఇంగ్లీషు వాడే. ఇంగ్లీషు హెడ్ ఆఫ్‌ది డిపార్ట్‌మెంట్ డాక్టర్ విన్‌వెల్ కూడా దొరగారే. వాళ్ల భార్యలు కూడా కాలేజిలో పాఠాలు చెబుతారు. వాళ్లు వయసు ముదిరిన వాళ్లయినా, అందంగా శుభ్రంగా తయారయి వస్తారు భారత స్త్రీల మాదరి ముచ్చట ముడులు వేసుకుంటారు కొందరు స్త్రీలు. గౌన్లు, నైలాన్ స్టాకింగ్స్ వేసుకుని వుంటారు. అరుణ్, మునీర్ అప్పుడప్పుడు వాళ్లతో కరచాలనం చేయడం కూడా అలవాటు వుంది తెల్లదొరలతో అసలు పరిచయం లేదనీ, ఎప్పుడూ వాళ్లను తాకలేదనీ కాదు. కాని - యిప్పుడు యీ డేవిడ్‌సన్‌తో వ్యవహరించడం కొత్తగా వుంది. చూడటానికి యితను మాంచి దార్ఢ్యంగానే వున్నాడు. తాము ఎరిగిన మిషనరీలకంటె ఉదారంగా, అవగాహనపరుడుగా కనిపిస్తున్నాడు తమ భవిష్యత్తు గురించి అతనికి ఎక్కువ ఆలోచనవున్నట్లుంది. అతడితో తాము మాట్లాడిన పద్ధతి యేమిటి, వైఖరి యేమిటి ?

బిల్ డేవిడ్‌సన్ త్వరగానే మళ్లీ ముందు గదిలోనికి వచ్చాడు యువకులలో వున్న కళవెళపాటు గమనించాడు. అతనికి నాటింగ్ హాంలో తమ చదువుకునే రోజులు, అప్పుడు ఎంత-బిడియంగా వుండిందీ గుర్తుకు వచ్చింది. ఈ పిల్లలు అంతకంటె దుర్భరమైన పరిస్థితులలో మెలుగుతున్నారు, యెదుగుతున్నారు - అన్నాకున్నాడు.

అతను యిప్పటికి మూడేళ్లుగా భారతదేశంలో వున్నాడు. ఏ భారతీయుడినయినా ఎలా పలుకరించాలి, మంచి చేసుకోవాలి అనేది అతనికి బాగా తెలుసు

'నాటింగ్ హాం ఎక్కడుందో తెలుసా మీకు ?' అంటూ ప్రారంభించాడు.

'తెలుసు' అని యిద్దరూ ఒకేమారు అరిచారు.

'రాబిన్ హుడ్ వుండిన దేశం -' అన్నాడు అరుణ్ గర్వంగా.

తరువాత పదిహేను నిమిషాలు టీ చప్పరిస్తూ, బిస్కట్లు కొరుకుతూ వాళ్లు ఇంగ్లండ్ గురించి తప్ప యింకే ప్రస్తావనలూ తీసుకురాలేదు. యువకులకు ఇంగ్లండు దేశం మీద ఆ పాలన యంత్రాంగం మీద వుండిన వైరుధ్యం - క్రోధం - తాత్కాలికంగా మరుగుకుపోయింది. తమ పాలకుల దేశాన్ని గురించి మరిన్ని వివరాలు తెలుసుకోవాలనే ఉత్సుకత బయట పడింది. రైలు మార్గంలో వెళ్లటానికి ఎంత సమయం పడుతుంది ? నాటింగ్ హాంకు లండన్‌కు మధ్య దూరం ఎంత ? బకింగ్ హాం పాలెస్ లోనికి ఎవరయినా ప్రవేశించవచ్చునా ? అక్కడ రాజరిక కుటుంబీకుల గదులలో ప్రవేశించి పరికించవచ్చునంటారు, నిజమేనా ? లండన్ అండర్ గ్రౌండ్ రైల్వే యేర్పాటును 'ట్యూబ్' అంటారు యెందుకని ? అది నిజంగా నగర భూగర్భంలో వుందా ? మరి అంత లోతులో ఆక్సిజన్ ఎలా దొరుకుతుంది ?

బిల్ డేవిడ్‌సన్ కూడా భారతదేశంలో తాను గడిపిన మూడు సంవత్సరాలను గురించి మాట్లాడాడు. ఈ దేశం అంటే తనకు ఎంత ఆప్యాయత యేర్పడిందీ చెప్పాడు. 'బ్రిటిష్ పాలన యింకా యిక్కడ కొనసాగడం అన్యాయం' అన్నాడు. అది త్వరలోనే తొలగిపోతుందని ఆశిస్తున్నా నన్నాడు. ఇంగ్లండ్‌లో వున్నప్పుడు - తాను స్కూల్ లేబర్ క్లబ్బులో తన సహచరులతో పాటు - యీ పరదేశ పాలనకు, వలసనీతి విధానానికి వ్యతిరేకినేనన్నాడు. భారతదేశానికి రావటానికి ముందు మలయా, ఆఫ్రికా దేశాలలో తమ పాలన ఎలా వుండిందీ గమనించానన్నాడు. స్థానిక సంస్కృతి సంప్రదాయం వున్న భారతదేశంలోనే యిలాంటి పని అవలీలగా జరుగుతోందన్నాడు.

గదంతా నవ్వులతో, వాళ్ల అభిప్రాయాలు కలిసిపోయినప్పుడు కరచాలనాలతో నిండిపోయి వాళ్లు ముగ్గురూ తీరుబాటుగా విశ్రాంతిగా

గడిపారు. బిల్‌డేవిడ్సన్‌కు యిరవైతొమ్మిది యేళ్లు. అందుచేత యీ యిద్దరి కంటే చాల పెద్దవాడు. కాని వాళ్లతో సమరసంగా వ్యవహరించ గలుగుతున్నాడు. ఇప్పుడు వాళ్లు తాము మాట్లాడుతుంటే ఇంగ్లీషు వాక్యాలు సరీగా వుంటాయో లేదో భాషా దోషాలు వస్తాయేమో అన్న బెరుకు నుంచి బయటపడిపోయారు.

డేవిడ్ సన్ తాపీగా మాట్లాడుతూనే ఉన్నట్లుండి యిలా అన్నాడు 'కాని యీ వ్యవహారం అంతా విపరీతమైన వేగం పుంజుకుంటూంది. ఆ "బ్లడీ" గాంధీ ఇంగ్లీషు వాళ్లను తక్షణమే వెళ్లిపొమ్మంటాడు'

గదిలో గంభీరమైన నిశ్శబ్దం ఆవరించుకుంది. అతి భయంకరమైన నిశ్శబ్దం.

డేవిడ్‌సన్ యేదో తప్పు జరిగిందని గమనించాడు. మునీర్ వంక చూచాడు, అతడు తలపక్కకు తిప్పుకున్నాడు. తరువాత అరుణ్ వంక చూచాడు, అతనూ తన కళ్లలోనికి నేరుగా చూడటానికి యిష్టపడడం లేదు.

'ఏమిటి సంగతి ?' అనడిగాడు డేవిడ్‌సన్.

మునీర్, అరుణ్ అతని వంక నిరసనగా చూచారు. మాట్లాడలేదు. వాళ్లిద్దరూ పరస్పరం చూచుకున్నారు.

'ఏమిటి సంగతి - చెప్పండి' అన్నాడు డేవిడ్సన్

'నీవు గాంధీ గారిని నిందించావు -' అన్నాడు మునీర్, తన కోపాన్ని అదుముకోవాలని ప్రయత్నిస్తూ, ముఖం అంతా ఎర్రచేసుకుని.

'నేను... యేం చేశాను ?'

'గాంధీగారిని నిందించావు. ఆయన్నో మాట అన్నావు

'ఎప్పుడన్నాను ?'

'ఇప్పుడే'

'వేళాకోళం ఆడకండి'

తన అభిప్రాయానికి సమర్ధన కోరుతూ బిల్ డేవిడ్‌సన్ అరుణ్ వంక చూచాడు. అరుణ్ కూడా 'నీవు ఆయన్ను తప్పుమాట అన్నావు' అన్నాడు.

'మీరిద్దరూ యేదో తమాష చేస్తున్నట్లున్నారు నాకేం అర్థం కావడం లేదు. నేను ఎప్పుడు నిందించాను ఆయన్ను ? నిజానికి ఆయనంటే నాకెంతో గౌరవం, మన్నన.'

'ఇప్పుడే కదా నువ్వు "బ్లడీ" గాంధీ - అన్నావు !'

'ఓ, అదా విషయం !' ఉదారంగు కళ్లతో వాళ్లవైపు చూస్తూ 'నన్ను అనవసరంగా ఖంగారు పెట్టారు ' అన్నాడు.

'కాని ఆ మాట నిందాపూర్వకమైనది' అన్నాడు మునీర్.

'ఊ... ఎవరు చెప్పారు అలాగని ?'

'మాకు ఇంగ్లీషు వచ్చు-' అన్నాడు అరుణ్ గర్వం ఉట్టిపడుతూ వుండగా.

డేవిడ్‌సన్ యీ విషయంలో తగదా పడదలుచుకోలేదు. ప్రతి భారతీయుడు యిలాంటి సందర్భంలో చాలా సుకుమారంగా, ముట్టుకుంటే కందిపోయేలాగానే వుంటాడు.

'స్నేహితులారా ! తెలుసుకోండి "బ్లడీ" అనేది యింగ్లీషులో వాడుక మాట. ఆత్మీయుల దగ్గర మాట్లాడేటప్పుడు దానిని తరుచు ఉపయోగిస్తూవుంటారు.'

'ఉహు. కాదు'

'సరే. వినండి. బహుశ మీకు నాకంటె ఎక్కువగా ఇంగ్లీషు భాష తెలసివుండవచ్చును. కాని - విషయం యేమంటే వాడుక పద్ధతిలో బ్లడీ అనేది తప్పుమాట, బూతుమాట కాదు !'

'అయినప్పటికీ... మేం ఆ మాట నీవు ఉపసంహరిచుకోవాలంటున్నాం' అన్నాడు అరుణ్. మునీర్ కూడా తలూపాడు.

'అలాగే చేస్తాను. మీకు అది సంతోషదాయకం అయితే అందుకు నాకేం అభ్యంతరం లేదు'

బిల్‌డేవిడ్‌సన్ వాళ్ల స్నేహం సంపాదించాలని చాల ఆతురతగా వున్నాడు వాళ్ల అభిప్రాయం చిలిపిగానే వుండవచ్చును. కాని తాను తన స్వేచ్ఛతోను, సోషలిజమ్‌తోను రాజీపడవలసి వస్తుంది యీ వ్యవహారంలో. నాటింగ్ హాంలో వాగ్వివాదాలలో అతడు తెలుసుకున్నదేమంటే 'సారీ' చెప్పడం ఎవరికీ మర్యాద భంగం కాదు మరుక్షణమే ఆ మనిషిని మళ్లీ గజ్జల్లో తన్నవచ్చును. సారీ చెప్పడం వల్ల ఓ చిక్కు పరిస్థితి నుంచి బయటపడగలిగితే అంతకన్న కావలసింది యేముంది ?

'మీ మనస్సులు కష్టపెట్టి వుంటే అందుకు నేను చాల విచారిస్తున్నాను. నేను చెప్పదలుచుకున్నది యేమంటే - భారత నాయకులు స్థితి గతులను అమితంగా త్వరిత పరుస్తున్నారని. భారతదేశం ముందుగా స్వాతంత్ర్యం సంపాదించుకోవటానికి సంసిద్ధం కావాలి...'

అరుణ్, మునీర్ యిందుకు వ్యతిరికమైన వాదాలు తీసుకువచ్చారు. తనకు తెలియకుండానే, బారత బానిసత్వం గురించి ఇంపీరియల్ భావాలను పునరుక్తి చేస్తున్నానని డేవిడ్‌సన్ గుర్తించాడు. బ్రిటిష్ వారి ఆలోచనల ప్రకారం భారతదేశం క్రమంగా స్వాతంత్ర్య సముపార్జనకు తయారుకావాలి. స్వాతంత్ర్యం అంతస్థుల వారీగా వారికి ప్రాప్తం కావాలి. వాళ్లకు ముందుగా 'విద్యాభ్యాసం' జరగవలసి వుంది.... అ రకమైన వాదనలో దుర్వృత్తి వున్నదని డేవిడ్‌సన్ ఎరుగును. స్వాతంత్ర్యం యివ్వకుండా వుండటానికి యివన్నీ దొంగఎత్తులు. అంటే స్వతంత్రంగా వుండటానికి, తమ సమస్యలను తామే పరిష్కరించు కోవటానికి, ఊపిరి పీల్చటానికి, భయంలో కాక ఆనందంలో రోజులు గడపటానికి... దీనికి ఎవరేనా 'క్రమంగా' తయారు కావాలా ? తన పెత్తనం యిక్కడ యెక్కువ కాలం - వీలయినంత యెక్కువ కాలం - గడపటానికి బ్రిటిష్ వాళ్లు తీసుకువచ్చే వాదాలు యివన్నీ. ఇవన్నీ భారతదేశ ప్రయోజనం కోసం కాదు, బ్రిటిష్ స్వప్రయోజనం కోసం వల్లించే సూత్రాలు.

మునీర్, అరుణ్ లోపల అట్టుడికి పోతున్నారు. బిల్ డేవిడ్‌సన్ యిలా అన్నాడు : 'నన్ను అపార్థం చేసుకోకండి. నేను బ్రిటిష్ పాలన యింకా కొనసాగాలని చెప్పడం లేదు. నేను చెప్పేది యేమంటే, అమితమైన తొందరపాటు దేశాన్ని చీల్చి వేస్తుందనే. సంయుక్త భారతం సాధించాలంటే అందుకు ఒక నెలో, ఒక సంవత్సరమో ఆలస్యం జరిగితేమటుకు యేం మునిగిపోయింది ? దేశం అందువల్ల బలపడుతుంది. భారత నాయకులు ఎక్కువ తొందర పాటు, దుడుకుతనం చూపకుండా వుంటే ...' తన ఆలోచనలు ఎక్కడకు తీసుకువెడుతున్నాయో యితమిత్థంగా తెలియడం లేదని డేవిడ్‌సన్ గమనించాడు. అప్పుడు చిరునవ్వుతో 'పోనీండి, యింకేదయినా విషయం మాట్లాడుకుందాం. కాని ఒక విషయం గుర్తువుంచుకోండి. దేశ స్వాతంత్ర్య విషయంలో నేను మీకు స్నేహితుడినే. విరోధిని కాను-'

డేవిడ్‌సన్ తన వ్యక్తిగత జీవితాన్ని గురించి కొంతసేపు చెప్పాడు. అతను ఒక 'మైనర్' కొడుకట. నాటింగ్ హాంకు సుదూరంలో ఉన్న ఒక గనిలో పనిచేస్తాడట అతని తండ్రి. వాళ్ల కుటుంబం బీస్టన్‌లో వుంటుందట. నాటింగ్ హాం మైనింగ్ సీకి యిది సబర్బ్.

'నేను పుట్టిపెరిగిన యిల్లు మీరు చూచి వుండాల్సింది. ఇంగ్లండ్‌లో బీదరికం లేదనిభ్రమ పడకండి' అతని తండ్రికి డేవిడ్‌సన్ గని పనివాడు అవడం యిష్టం వుండింది కాదు. అందుకని అతన్ని చదువులో పెట్టాడు. బీస్టన్ హైస్కూల్‌లో చదువుతున్నప్పుడు డేవిడ్ సన్ 'సైన్స్'లో తగినంత ప్రజ్ఞ చూపించాడు. దరిమిలా బూట్స్ కెమికల్ డిపార్ట్‌మెంట్‌లో చేరాడు. 'నేను యూనివర్శిటీలో చేరుదామనుకున్నాను. నేను పనిచేస్తున్న కంపెనీకి ఎదురుగానే వుండేది యూనివర్సిటీ. కాని... నాకు కుదిరింది కాదు.' లేబర్ పార్టీలో సభ్యత్వం వుంది అతనికి. లెనిన్‌ను మార్క్స్‌ను క్షుణ్ణంగా చదివాడు. 'అయినా నేను కమ్యూనిస్టును కాను' అంటూ నవ్వుతూ చెప్పాడు. 'గాడ్ సేవ్‌ది కింగ్' అనే పాట యిప్పటికీ పాడతాను. (ఈ మాటలకు అందరూ నవ్వారు) భారతదేశంలో వున్న మూడేళ్లలోనూ వివిధ ప్రాంతాలలో పనిచేశాను. సియల్‌కోట వచ్చి కొద్ది నెలలు మాత్రమే అయింది. 'ఇది అద్భుతమైన దేశం, యిందులో

యేం సందేహం లేదు' తమకేం కావాలో చెప్పడంలో యేకాభిప్రాయం లేకపోవడం యిక్కడి దౌర్భాగ్యం. ఏమయితేనేం, స్వరాజ్యం వాళ్ల జన్మహక్కు. త్వరలోనే స్వరాజ్యం పొందగలుగుతారు.

'మీ ఆర్మీ స్నేహితులకు మీకు యిలాంటి అభిప్రాయాలు వున్నాయని తెలుసునా ?' అనడిగాడు అరుణ్.

'బ్రిటిస్ ఆర్మీ యిదివరకటి అంత కఠోరంగా లేదు. ఇప్పుడు మాకు కొంతవరకు వాక్ స్వాతంత్ర్యం వుంది. ఏమయితేనేం.... నేను మాత్రం - చాలమంది లాగ - ఉద్యోగం రీత్యా, వృత్తిరీత్యా సైనికుడిని కాను. ఏక్షణంలో కావాలనుకున్నా యిందులోంచి యివతల పడగలను.'

కొద్ది విరామం తర్వాత 'నేనేం తిరుగుబాటుదారు మనస్తత్వం వున్నవాడిని కాను. ఆర్మీలో వున్నంత కాలం వాళ్లు యేం చెబితే అది చేస్తాను' అన్నాడు.

ఇంగ్లీషు భాషలో తన పాండిత్యం అంతా రంగరించి దాదాపు వేళాకోళంగా 'పరమ దయతో ప్రాణాలు తీస్తావు కదూ ?' అన్నాడు అరుణ్. అయితే యిది అనుకున్నంత పరిణామం తీసుకురాలేదు.

బిల్ డేవిడ్ సన్ వాళ్లను సానుభూతితో చూచాడు. ఇద్దరూ మంచి కుర్రవాళ్లు. ఇద్దరిలోనూ పొడుగాటి వాడు - మునీర్ - యిద్దరిలోకి కాస్త శాంత చిత్తుడు, నిదానం అయిన వాడు. రెండోవాడు ఎక్కువ బిడియం ప్రదర్శిస్తాడు, మరీ సున్నితంగా వ్యవహరిస్తాడు. ఏమయినా యిద్దరూ నమ్మదగ్గ వ్యక్తులు. డేవిడ్‌సన్‌కు యిష్టులయిపోయారు.

'మీరిద్దరూ సన్నిహిత స్నేహితులా ?'

మునీర్, అరుణ్ వెంటనే యేమీ జవాబు యివ్వలేదు ; ఒకరి వంక ఒకరు చూచుకుని హాయిగా నవ్వుకుంటూ కరచాలనం చేసుకున్నారు.

'ఎలా సాధ్యం అయింది ? హిందూ ఒకరు, ముస్లిం మరొకరు

'అదేమంత విచిత్రంగా అనిపిస్తోందా ?' అనడిగాడు అరుణ్.

'సామాన్యమైన విషయం మటుకు కాదు, యేం ?'

'మీ ప్రభుత్వం మీకు నేర్పించిన పాఠాలు అటువంటివి. కాని యే గ్రామానికయినా వెళ్లి మీ అంతట మీరే పరికించండి. మీరు చూచినవన్నీ పట్టణాలు. ప్రతిగ్రామంలోనూ మాలాంటి వాళ్లు వందలకొద్దీ వుంటారు'

బిల్ డేవిడ్‌సన్ లేచాడు. భోజనానికి ఆలస్యం అవుతున్నట్లు గుర్తించాడు ఆరోజునుంచి ముగ్గరూ స్నేహితులు అయ్యారు తరుచుగా కలుసుకుంటూ వుంటారు. ముర్రే కాలేజిలో జరిగే సమావేశాలకు అతన్ని ఆహ్వానించేవాళ్లు. అలాగే అతనూ తరుచుగా తన గదిలోనో, మెస్‌లోనో వాళ్లకు పార్టీలు యిస్తూండేవాడు. మెస్‌లోని యితర ఇంగ్లీషు వాళ్లు, వీళ్లను గమనించే వాళ్లు కాదు. కాకపోతే వీళ్లపట్ల దురుసుగా ప్రవర్తించేవాళ్లు కాదు. స్థానికులతో పరిచయం చేసుకుందుకు, స్నేహంగా వుండేందుకూ ప్రయత్నం చేస్తాడు గనుక డేవిడ్‌సన్ వాళ్లలో తప్పబుట్టినవాడు ఇతరులు తమతో మాట్లాడక పోయినా వీళ్లిద్దరికీ యేమీ ఎబ్బెట్టు అనిపించేది కాదు. నిజానికి వాళ్లకు యీ స్థితే అనుకూలం. అందరూ ఇంగ్లీషులో మాట్లాడడం మొదలయితే తమ పని ఉక్కిరిబిక్కిరి అయిపోయేది.

అరుణ్, మునీర్ మొదటి మారుగా డేవిడ్‌సన్‌ను కలుసుకున్నది 1945లో. గాంధీగారు జైలు నుంచి 1944లో యివతలకు వచ్చారు. నెహ్రూ యింకా జైలులోనే వున్నారు. 1942 నాటి 'క్విట్ ఇండియా మూవ్‌మెంట్' యింకా ఇంగ్లీషు వాళ్ల మనస్సులలో పచ్చగానే వుంది. తరువాతి రెండు సంవత్సరాలు, వేవెల్ వైశ్రాయిగా రావడం, నెహ్రూ యితర రాజకీయ నాయకులు జైలు నుంచి విడుదల అవడం, 1945 నాటి సిమ్లా కాన్ఫరెన్స్. బ్రిటిష్ పార్లమెంటరీ మిషన్ - బ్రిటిష్ కాబినెట్ మిషన్ (1946)... యిలా యిద్దరు భారతీయులు, వాళ్ల ఇంగ్లీషు శ్రేయోభిలాషి అన్ని స్థితిగతులను సమీక్షచేసుకున్నారు. బల్ డేవిడ్ సన్ మాత్రం తన అభిప్రాయాన్ని సడలించుకోలేదు, పునరుద్ఘాటన చేశాడు - భారత నాయకులు యీ పరిస్థితిని అమితంగా త్వరిత పరుస్తున్నారని, 'వీళ్లు ప్రవర్తిస్తున్న తీరులో యేదో భయోత్పాతం వుంది. దీనికి ఫలితంమటుకు దుఃఖాంత స్థితి !' అంటాడు అతను.

అరుణ్, మునీర్ ఆరోజు సాయంకాలం - జూన్ నెల చివరిరోజులు - డేవిడ్సన్ బారక్స్‌లో కలుసుకున్నప్పుడు, అతడు యూనిఫారం తీసివేసి విరామంగా వున్నాడు చిన్న నిక్కరు మాత్రం వేసుకుని అతని ఆవరణలో ఊగుటుయ్యాలలో విశ్రాంతి తీసుకుంటున్నాడు

'లోపలకు రండి' అని పిలిచాడు యిద్దరినీ.

వైస్రాయ్ ప్రకటన దరిమిలా వాళ్లు కలుసుకోలేదు. రావాలనుకున్నారు కాని యితర కార్యకలాపాల మధ్య విరామం తటస్థపడలేదు ఇద్దరికీ సమయం దొరకాలి. డేవిడ్‌సన్‌కు వాళ్ల ముఖాలలో ఆదుర్దా, కళవెళపాటు కనిపించింది.

'ఏం, మీరు సుఖంగా వున్నట్లు కనబడరేం ? భారతదేశం స్వతంత్ర సామ్రాజ్యం కాబోతోంది. త్వరలోనే మేం వెళ్లిపోతాం..' అని పలుకరించాడు

'దేశ విభజన మాట యేమిటి ?'

'అవును. ఒక రాజ్యానికి బదులు రెండు రాజ్యాలు యేర్పాటు అవుతాయి. ఇది అభివృద్ధి సూచకమే గదూ. ప్రపంచంలోని స్వతంత్ర రాజ్యాల కుటుంబంలో మరో రెండు సంఖ్య పెరుగుతుంది'.

'వదలిపోవడం అంత ముఖ్యవిషయం కాదు' అన్నాడు అరుణ్.

బిల్‌డేవిడ్సన్ తూగుటుయ్యాల నుంచి దిగలేదు. వాళ్లిద్దరూ రెండు కుర్చీలు లాక్కుని అతనికి దగ్గరగా కూర్చున్నారు. గాలి చల్లగా వీస్తోంది.... అయినా రోజు యింకా వేడిగా వున్నట్లే లెక్క. ఆకాశంలో మబ్బుల జాడలేదు అరుణ్ మనసులో అంచనా వేసుకున్నాడు - యీ సంవత్సరం ఋతుపవనం ఆలస్యంగా వస్తుందని.

యువకులు నిదానంగా కూర్చున్నారు. వాళ్ల ఆదుర్దా అంతరించింది గాని మాటలు మాత్రం హాయిగా బయటకు రావడం లేదు. వాళ్ల హృదయాలలో నిండిన భావాలకు అక్షరరూపం యివ్వడం ఎలాగో వాళ్లకు తెలియడం లేదు.

'డేవిడ్‌సన్, యీ ప్రణాళిక గురించి మీ అభిప్రాయం యేమిటి ?'

బిల్ డేవిడ్‌సన్ మునీర్ కళ్లలో నీళ్లు నిలిచి వుండడం గమనించాడు. ఇది వేళాకోళానికి సమయం కాదు, వీళ్లతో 'సీరియస్' గానే మాట్లాడాలి. ఇంక ఆలోచనలకు అవకాశం యివ్వకుండా, గడచిన రెండు వారాలు తాను యిదే విషయం సమాలోచన చేస్తున్నట్లు - యిలా చెప్పాడు. 'నన్నడిగితే - యిది యీ దేశ స్వాతంత్ర్య పోరాటంలో బొత్తిగా అవివేకమైన, దారుణమైన, వ్యతిరేక ప్రతిస్పందనలు తీసుకు వచ్చే ఎత్తుగడ అంటాను. ఈ మారు తొందరపాటుగా ప్రవర్తిస్తున్నది మేము. పోయిన సంవత్సరం ప్రస్తావించిన కాబినేట్ మిషన్ ప్రతిపాదన మంచిది. భారతదేశ భవిష్యత్తుకు అది ఎంతయినా ప్రయోజనకరం. భారత దేశనాయకులు దానిని సరిగా అర్థం చేసుకోక నిరాకరించారు. కాని మేం బ్రిటిష్ వాళ్లం - యీ విషయం కనసాగించ వలసి వుండింది. మరో ఆరునెలల పాటు సంప్రదింపులు జరిపి రాజకీయ పార్టీలను అంగీకరింప చేసినట్లయితే బాగుండేది...'

'ఆ ప్రణాళిక అన్నిటినీ ప్రస్తావించింది. దేశమంతా మూడు ప్రాంతాలుగా, దేనికది కొంత వరకు స్వతంత్రంగా వుండేట్లు, విభజన అవుతుంది. ఎప్పటికయినా కలిసికట్టు తనం నుంచి బయటపడటానికి వీలువుంది.... ' అన్నాడు మునీర్.

'మేం కలిసికట్టుగానే వుండేవాళ్లం' అన్నాడు అరుణ్

'వేవెల్ అన్నిటినీ అతలాకుతలం చేసేశాడు. కనీసం సక్రమంగా వ్యవహరించలేదను కుంటాను-' అన్నాడు డేవిడ్‌సన్ ఉద్విగ్నంగా.

అరుణ్ తమ యింటిలో తరచుగా అతని తండ్రి అనేమాటలు వప్పచెప్పాలని అనుకున్నాడు. 'అతడు ఒంటికంటివాడు' అని. కాని డేవిడ్‌సన్ దృష్టిలో తాను మూఢనమ్మకాలకు ఆలవాలమయిన మనిషిగా కనిపించగూడదని మిన్నకుండి పోయాడు.

'మీరు మౌంట్‌బేటన్ ను ప్రస్తుతిస్తూ కీర్తనలు పాడవచ్చు. ఈసరికే మీరు ఆ పని చేస్తున్నారు. అయితేనేం ? అతను దేశాన్ని రెండుగా చీల్చడం

అనే సూత్రానికి కట్టుబడి వున్నాడు. దానినే మీకు అంటగడుతున్నాడు. గాంధీ, నెహ్రూలు కూడా అతని ముందు తమ తూకం కోల్పోయారు. జిన్నా విషయం నేను మొదటి నుంచీ అంతగా పరిగణించడమే లేదు. వాళ్లందరూ ఒక ఆటబొమ్మకు ఆకర్షితులయి పోతున్నారు. ముందు ముందు దేశ ప్రజలకు ఒనగూడే దౌర్భాగ్యస్థితిని చూడలేక పోతూన్నారు'

తన అంతరంగం బాగా దెబ్బతిన్నట్లు, తన కలలన్నిటినీ ఎవరో ఛిన్నాభిన్నం చేసినట్లు మాట్లాడుతున్నాడు డేవిడ్సన్.

'మేం యేం చేయాలంటావ్, బిల్. మేం పాకిస్థాన్‌లో వుండగలమా సవ్యంగా ? మా నాన్న ఉద్దేశ్య ప్రకారం అలాగే వుండగలమా ?' అని అడిగాడు అరుణ్.

' ఆప్రశ్నకు యిప్పుడప్పుడే సమాధానం చెప్పలేం. సమాధానం పాకిస్తాన్ ప్రభుత్వం హిందువులను ఎలా చూస్తుందీ అన్న విషయం మీద ఆధారపడివుంది'

'అలాగే కొత్త ఇండియా తమ దేశంలోని ముస్లింలను యెలా చూస్తుందో గ్వూడా .గమనించాలి' అన్నాడు మునీర్. ఇస్లాం పరిరక్షణకు యేమాత్రం వెనుకంజ పనికిరాదని అతని అంతఃస్ఫూర్తి.

'నిజం ముమ్మాటికీ నిజం. మీకేదయినా సహాయం కావాలంటే నన్ను అడగడానికి జంకకండి. ఇప్పుడు మీకు గడ్డురోజులు. ఈ స్థితి కొన్ని నెలలపాటు నడుస్తుంది. నాకు చేతనయిన సహాయం నేను చేస్తాను.'

వాళ్ల సమావేశం ముగిసింది. ఎవరికీ అంత తృప్తిగా అనిపించలేదు. అంతా బాగా జరుగుతుంది - అనే పూర్వపు భరోసా యిప్పుడు లేదు. ఈ సంఘటన వాళ్లు ఊహించని ధోరణిలో వాళ్లను కుదిపివేసింది. నిరాశ, నిస్పృహ సాధారణ విషయాలే అయినా, స్థానికంగా యేర్పడ్డ గాయాలు - మనసులో సుడులు తిరిగే తరంగాలు ఒక్కొక్క సందర్భంలో ఒక్కొక్కరీతిగా వుంటాయి. మునీర్, అరుణ్ యిప్పుడు ఒకళ్లను చూచి మరొకళ్లు ఆదుర్దాపడ్డం, ఆందోళన అధికం చేసుకోవడం జరుగుతోంది. డేవిడ్సన్ నుంచి బయలుదేరిన

తర్వాత యిద్దరూ మౌనంగా సైకిళ్లు ఎక్కి నగరానికి తిరిగి వచ్చారు. అది కర్కశత్వం అనడానికి వీల్లేదు. జరిగిన పరిణామాలను మనస్సు అర్థం చేసుకోవటానికి ప్రయత్నం చేస్తోంది. అనుకోని పరిణామాలు అవగాహన అవడానికి ఎక్కువ సమయం పడుతుంది. రైల్వే చెక్ దగ్గర యిద్దరూ విడిపోయారు. మునీర్ మైనాపుర్‌వయిపు వెళ్లాడు తన యింటికి. అరుణ్ ట్రంక్ బజార్ వయిపు సైకిల్ నడిపిస్తున్నాడు. వాళ్లు పరస్పరం 'గుడ్ బై' చెప్పుకోవడం కూడా దాదాపు వినబడకుండానే జరిగిపోయింది.

# అయిదవ అధ్యాయం

సియల్ కోటలో మొదటి దొమ్మి జూన్ ఇరవయి నాలుగవ తేదీన జరిగింది. పంజాబ్‌లో అనేక నగరాలు నెలల తరుబడి మండుతూనే వున్నాయి. లాహోర్, గుజరాత్, గుజ్రన్ వాలా, అమృత్‌సర్, అంబాలా, జలందర్, రావల్‌పిండి, మాల్లాన్, లుధియానా, సర్గోధ పట్టణాలలో పెద్ద ఎత్తున దోపిడులు, హత్యలుజరిగాయి. సియల్ కాట్ మటుకు యిన్నాళ్ళు ప్రశాంతంగానే వుంది, డిప్యూటి కమిషనర్ పర్యవేక్షణ చాలవరకు యిందుకు కారణం. పులిలాగ భయంలేకుండ అతడు నగరం అంతా తిరుగాడుతువచ్చాడు. ఆయన జీప్ చట్ట నిర్వహణకు సాంకేతికంగా రూపొందింది. హిందువులకు ఆయన ఆనందానికి ఉత్సాహనికి స్ఫూర్తిదాయకుడు ముస్లిములకు ఆయనంటే యిష్టంలేదు. అయితే శాంతి సంరక్షకుడుగా అతడు కృతనిశ్చయుడని వాళ్లు యెరుగుదురు. తనకింది ఆఫీసర్లతో ఆయనకు సదవగాహన వుండింది, వాళ్లు హిందువులయినా, ముస్లిములయినా కూడా. వాళ్లంతా ఒకే కట్టుగా వున్నారని సమాచారం అందరికీ తెలిసిపోయింది

జూన్ యిరవయి మూడవ తేదీన పంజాబ్ లెజిస్లేటివ్ ఎసెంబ్లీ లాహోర్‌లో సమావేశం అయి రాష్ట్ర విభజనకు లాంఛనంగా అంగీకారం తెలిపింది. మూడవ జూన్ ప్రకటన తరువాత - ఒకరాష్ట్రం పూర్తిగానో భాగాలుగానో ఇష్టం అయితే యూనియన్ ఆఫ్ ఇండియా నుండి విడివడవచ్చును - అనిచెప్పిన మీదట - పంజాబ్ లేజిస్లేటివ్ ఎస్సెంబ్లీలో ముస్లిములు అధిక సంఖ్యలో వున్నారు గనుక, పంజాబ్ భవితవ్యం యేమవుతుందో అందరికీ యెఱుకే. మామూలు ప్రజలకు యిది మనోభావానికి సంబంధించిన విషయమే అయినా, అక్కడి ముస్లిములకు యిది పాకిస్తాన్ వైపు వేసే ముందడుగుగా అనిపించింది. అందుచేత సియల్ కోటలోని ముస్లిములు ఆ మరునాడు తమ యిష్టం వచ్చినట్లు ప్రవర్తిస్తూ ఎందరో హిందువులనువిగత జీవులను చేశారు.

ఆ తరువాత యిది రోజువారీ కార్యక్రమం అయిపోయింది నాలుగయిదు కత్తిపోటు ఉదంతాలు, నాలుగయిదు అగ్ని ప్రమాద సంఘటనలు

ప్రతిరోజూ జరుగుతూ వచ్చాయి. అయితే యింతవరకు మూకుమ్మడి హత్యలు, ప్రణాలికా బద్ధంగా మారణ కార్యక్రమాలు రూపొందలేదు. సగటు దోపిడి మనిషికి న్యాయం - చట్టంతో ఎంతవరకు పెనుగులాడవచ్చునో తెలియదు. అల్లరి జరగకుండా అదుపు చేయడంలో ప్రభుత్వం ఎంతవరకు దీక్ష పూనివుందో తెలియదు. కొన్ని చెదురుమదురు సంఘటనలు కూడా వినవచ్చాయి. నగరపు శివారులలో ఒక హిందువును పట్టుకుని కడుపులో కత్తితో పొడిచి చావమని రోడ్డుమీద వదలి వెళ్లారు. యధాప్రకారం పోలీసులు త్వరలోనే అక్కడికి చేరుకున్నారు; డిప్యూటి కమీషనర్ వాళ్లతో విధిగా వుంటాడు , అయినా ఎవరూ దోషులు ఎవరో చెప్పలేరు. కొద్దిసేపు అయిన మీద నగరంలో మరో శివారులో యిటువంటిదే మరో సంఘటన జరిగినట్లు వార్త వస్తుంది. పోలీసులు వస్తారు ; చచ్చిన మనిసిని మోసుకు వెడతారు. చంపింది ఎవరో చెప్పరు గనుక నేరస్థులను పట్టుకోవడం శిక్షించడం జరగదు.

ఇలా చెదురు మదురు సంఘటనల వల్ల, యిలాంటి సంఘటనల వెనుక ఏ ముఠా, గుంపూ వుండడం లేదు గనుక, హిందువులందరినీ హతమార్చాలని ఎవరో దౌర్జన్యపూరిత కార్యక్రమం చేపట్టలేదు గనుక - వీటిన్నటికీ ఒకటే మూలం అగుపిస్తోంది. అదేమిటంటే · కిరాతక, ఘాతుక చర్య. ఏ సంఘటనలోనూ హతుడు జీవంతో మిగలలేదు, ఎవరు తనను చంపారో చెప్పటానికి, ఎవరు యీ దుష్కృత్యాలు చేస్తున్నారో ఆరా యివ్వటానికి. ప్రతి సందర్భంలోను - మనుషులను నిర్ధాక్షిణ్యంగా చంపి వేస్తున్నారు. అంతే! కత్తితోనే యీ హింస జరుగుతోంది. చాలామార్లు కత్తి శరీరంలో దిగబడిపోయి అక్కడే వదలి వేయబడుతోంది. మొదటి దెబ్బకు మనిషి యింకా ప్రాణాలతో మిగిలితే అతడు చచ్చేంత వరకు పొట్టలోను, రొమ్ములోను పదేపదే కత్తి గుచ్చుతున్నారు. ముఖాలను విరూపం చేయడం లేదు, కాని హత్యకారకులకు పొట్టలు చీల్చడం, పేగులు బయట పడవేయడం వేడుకలా అనిపిస్తోంది. ప్రతి సందర్భంలోనూ మనిషి పేగులు పూర్తిగా యివతలకు వచ్చి శవానికి పక్కగా పడివుంటున్నాయి, రక్తపు మడుగు మధ్య.

అగ్ని ప్రమాదాలు రాత్రిపూటలు జరుగుతున్నాయి. నగరంలో వున్న నాలుగు 'ఫైర్ ఇంజన్లు' ఒక మూల నుంచి మరో మూలకు పరుగులు

తీయడంతోనే సరిపోతూంది  హత్యలకంటె ఈ అగ్నిప్రమాదాలు ఎక్కువ భీతావహంగా తయారయినాయి  హత్యలయితే ఎవరో చెప్పినప్పుడే తెలుస్తాయి అగ్ని ప్రమాదం యిలాంటిది కాదు.  కళ్లముందే అగ్నిజ్వాలలు ఆకాశాన్ని అంటుతూ ఎత్తుకు ఎగసిపోతూ కనిపిస్తాయి.  అది వేసవి కాలం అవడం వల్ల, చాలమంది వీధుల్లోనే పడుకునేవాళ్లు.  ఉన్నట్లుండి నగరంలో ఒక భాగంలో ఊరు తగులబడిపోవడం కనిపించేది  అది దగ్గరగా జరుగుతుంటే, ఆ శబ్దాలు జనం చేసే కలకలం... కలవరం అంతా వినవచ్చేది.  అగ్ని వస్తువులను దహించివేయడం శబ్దరూపంగా వినిపిస్తుంది.  చాలా సందర్భాలలో వినిపించేదానికన్న కనిపించేదే ఎక్కువ.  ఎర్రని అగ్నిజ్వాల.  మృత్యుశిఖరాలు. పొగలు, భయంతో వొళ్ళు మొద్దుబారిపోతుంది.  దగ్గర్లోనో దూరంలోనో యేదో తగులబడిపోతోంది - అన్న ధ్యాస.  ఫైరింజన్లు చప్పుడు చేసుకుంటూ పరుగులు తీయడం - డింగ్, డింగ్, డింగ్... అనే శబ్దాలు.  అగ్ని వీలయినంత త్వరగా చల్లార్చబడుతుంది.  ఆకాశానికి ఎగురుతున్న జ్వాలలు చప్పబడిపోతాయి. అంతా దీపం స్విచ్ వేసి, తీసివేసినంత వేగంగా జరిగిపోతుంది. పొగమాత్రం గంటల తరుబడి వుంటుంది.  ఇంతలో నగరంలో మరోమూల అగ్ని జ్వాలలు పైకి లేస్తాయి.  మళ్లీ అంతా తతంగం. ఫైర్ ఇంజన్ల పరుగులు. డింగ్... డింగ్... డింగ్.... మొదటి మంటలు ఆగ్నేయ మూలలోవున్న మెహల్లా ధరోవార్ నుంచి వస్తే, రెండవమారు మంటలు వాయువ్యంలోని మైనాపురా నుంచి వస్తాయి.  ఈ క్షణం కనక మండిలో తగలబడిపోతే, మరుక్షణంలో ట్రంక్ బజారులో మంటలు !  ఈ మంటలు ప్రజ్వరిల్లే క్రమం చూస్తే దీనివెనక యేదో మర్మం, కుట్ర వున్నట్లు గోచరిస్తుంది.  ఉత్తరం నుంచి దక్షిణానికి, తూర్పునుంచి పడమరకు ఫైర్ ఇంజన్లను పరుగులు తీయించాలని ఎవరో ప్రణాళికలు సిద్ధం చేసుకున్నట్లు తోస్తుంది.  ఈ కుట్రకూడా యిప్పుడు విచ్చలవిడిగా జరుగుతోంది.  చెదురు మదురు అన్నట్లుగానే కనిపిస్తోంది.

ఒక రోజు, సాయంకాలం గడిచిపోతూవుండగా, ట్రంక్ బజార్ వయిపు పెద్దగా హాహాకారాలు, అరుపులు, పెడబొబ్బలు వ్యాపించాయి.  ఈ బజారు నగరానికి దాదాపు కేంద్రస్థానం, నగరంలోని అనేక మెహల్లాలను - ఉత్తరపు

దిక్కుగా వున్న రైల్వేస్టేషన్‌కు కలుపుతుంది యిది. అమృత్‌సర్ ట్రెయిన్ ఆరుగంటలకు వచ్చింది. కొన్ని టాంగాలు యీ బజారు గుండా లోపలి వీధులలోనికి వెళ్లి రైలు వచ్చిందని అందరికీ చెప్పక చెబుతాయి.

అప్పుడే కలకలం బయలుదేరింది. కొన్ని టాంగాల లోంచి అరుపులు, ఆక్రందనలు వినవచ్చాయి. 'హా ! మమ్మల్ని చంపేస్తున్నారు-', 'హా అల్లా నీ కరవాలం యీ సిక్కుల మీదికి పంపు. వీళ్లు మమ్మల్ని సర్వనాశనం చేస్తున్నారు', 'హే హై...', 'అల్లా... అల్లా...' యిలా... ఇంకా రకరకాల ఆక్రందనలు. 'ఓ నవాబ్ దీన్ ! ఎక్కడకు వెళ్లావు ? ఓ .. నా కొడుకా ! నవాబ్ దాస్ ..'

ఏడుపు వినవస్తుంది గాని మనిషి కనిపించదు ఏడుపులు, పెడబొబ్బలు, ఎక్కిళ్లు. 'నాచేయి ! నా భుజం ! రా క్షసుల నా భుజం తెగనరికేశారు', 'ఓ భగవంతుడా ! నా తల ఎగిరిపోతోంది. '

ట్రంక్ బజార్ గుండా తొమ్మిది టాంగాలు వెడుతున్నాయి. అవి ఒక వరుసగా వెళ్లడం లేదు. దేని దారిన అదే వస్తూంది స్టేషన్ నుంచి. కొద్దిసేపట్లోనే ట్రంక్ బజార్లో అందరికీ ఒక వార్త తెలిసింది. పంజాబ్ తూర్పు భాగం నుంచి వస్తున్న ముస్లింలుట వీళ్లందరూ. కొందరు అమృత్‌సర్ నుంచి మరి కొందరు యితం పట్టణాల నుంచి వస్తున్నారట. ఈ వార్తలో మరో ముఖ్యమైన భాగం యేమంటే - ఈ వస్తున్నవాళ్ల నందరినీ హిందువులు, సిక్కులు వాళ్ల వాళ్ల యిళ్లలోంచి వెళ్లగొట్టారట, దొమ్మీ దోపిడీ చేశాక.

'ఇదంతా మనకు మంచికి రాలేదు' అన్నాడు లాలా కాన్షీరామ్ ఘభారాణితో. 'బహుశ ఈ ప్రాంతం నుంచి హిందువులందర్నీ తరిమివేయడం ద్వారా ముస్లిములే ప్రారంభించారేమో యీ కాండ!' అంది ఆమె. 'ఎవరు ప్రారంభించారు అన్నది ముఖ్యం కాదు నాకు' అంటూ లాలా కాన్షీరామ్ పుట్టెడు విచారంలో మునిగిపోయాడు.

ఆ రాత్రి జరిగింది సియల్‌కాట్‌లో మొట్టమొదటి దొమ్మీ. సియల్‌కాట్, మొహల్లా ధరోవాల్‌లలో దోపిడి, దహనకాండ జరిగినాయి. రాత్రి పదకొండు గంటల సమయంలో ఆ ప్రాంతం నుంచి సవ్వడులు బయలుదేరి వాతావరణాన్ని

అంతటినీ నింపివేశాయి ఆకాశం ఎన్నో అగ్ని జ్వాలలతో ధగధగ మిలమిల మెరుస్తోంది. అన్నీ ఒక మొహల్లా నుంచి ఎగిసిపడుతున్నాయి. ధారోవాల్ మొహల్లా నుంచి జనం పరుగులు తీస్తూ బయటకు వచ్చి ట్రంక్‌బజారు చేరుకుంటున్నారు. టంగాలు కొన్ని కనిపిస్తూవున్నా, అధికంగా జనం కాలినడకనే వస్తున్నారు. గుంపులు గుంపులుగా నడుస్తున్నారు. ఒక్కో కుటుంబమూ ఒక్కో గుంపు గుంపులలో చాలమంది విపరీతంగా నిరవధికంగా యేడుస్తువున్నారు. ఎలాంటి ఓదార్పులూ వాళ్లను నిమ్మది పరచడం లేదు కొందరయితే చేతులకు, తలలకు 'బేండేజిలు' కట్టుకున్నారు. ఇంత రాత్రిపుట వాళ్లకు 'ప్రథమ చికిత్స' ఎవరు చేశారా అని లాలా కాన్షీరామ్ నివ్వెరపోయాడు. ప్రతిమనిషీ తన మీదనో, బుజాలమీదనో ఒక మూట మోస్తున్నాడు. చేతనయినంత ఆస్తిని కూడా తీసుకువెడుతున్నారు. పిల్లలను ఎత్తుకుని వున్నారు కొందరు. పోలీసులు కూడా ప్రత్యక్షం అవుతున్నారు. వాళ్లూ యీ గుంపులను మోహల్లా నుంచి బయటపడేందుకు త్వరిత పరుస్తున్నారు స్పష్టంగా కనిపిస్తున్న విషయం యేమంటే - పరిస్థితి అదుపులో లేదు. 'పదండి ముందుకు నడవండి త్వరగా ..' యిలా పోలీసుల అరుపులు, మందలింపులు వినవస్తున్నాయి. జనానికి యిలాంటి హెచ్చరిక లేమీ అవసరం లేదు నిజానికి బీబీ అమరావతి యింటికప్పు మీదనుంచి యీ సందోహం అంతా చూస్తూవున్న లాలా కాన్షీరామ్‌కు యీ జనం అంతా యెక్కడకు వెడుతున్నారో తెలసిరాలేదు. అతని ప్రశ్నలన్నింటికీ ఆ గుంపుల నుంచి ఒకే మోస్తరు సమాధానం వస్తోంది. 'హా... హా.... మేం సర్వనాశనం అయిపోయినాం' అని. బహుశ వాళ్లు నగరం విడిచి వెళ్లిపోతున్నారేమో ననుకున్నాడు అతను. 'రైల్వేస్టేషన్‌కు వెడుతున్నారా ?' అని అరిచాడు. 'లేదు శిబిరానికి' అని కొందరు సమాధానం చెప్పారు 'కాందిశీకుల శిబిరానికి'.

ఈ రెండు మాటలు - కాందిశీకుల శిబిరం అనేవి - కొన్ని నెలల్లో భారతదేశంలో యింటింటా ప్రచారానికి వచ్చిన పలుకులు అయిపోయినాయి. లాలా కాన్షీరామ్‌కు యింకా అవి పరిచితం కాలేదు. సియల్ కోటలో ఎటువంటి శిబిరమూ లేదు. పెద్దపెట్టున అల్లరులు, ఆగడాలు జరిగేట్లయితే

యేం చేయాలా ఎలా నిర్వహించాలా అని ప్రభుత్వం యింతవరకు పన్నాగాలు సిద్ధం చేసుకోలేదు. ప్రతిరాత్రీ పోలీస్ జీప్ నగర వీధులలో తిరిగి ఆంప్లిఫయర్‌లో ప్రకటనలు చేస్తోంది. నగరంలో కర్ఫ్యూ వుంది, ఎవరూ బయట తిరగాడ కూడదని ! బయట కనిపిస్తే కాల్చిపారవేస్తామని ! ప్రజలు యీ హెచ్చరికలను నిర్లక్ష్యం చేసి తిరుగుతూనే వున్నారు. డిప్యూటి కమీషనర్ వ్యక్తిత్వం ఒక్కటే అన్నీ సమతూకం చేసి పరిస్థితిని కొంతలో కొంత అదుపులో వుంచగలుగుతోంది. అయితే ప్రభుత్వ యంత్రాంగం మటుకు పెద్దపెట్టున అల్లరులు జరిగేట్లయితే యేం చేయాలో స్థిరం కాకుండానే వుంది.

లాలా కాన్షీరామ్ పక్కనే వున్న అరుణ్‌ను 'కాందీశీకుల శిబిరం అంటే యేమిటి ?' అనడిగాడు.

'రక్షణ కోరుతున్న జనాన్ని కాపాడటానికి యేర్పాటు అయిన స్థలం' అన్నాడు అరుణ్ దాదాపు సందిగ్ధంగానే.

'మనకు యిక్కడ యిలాంటి శిబిరం వున్నదనే నాకుతెలియదు సుమా!'

'రాత్రికి రాత్రి ఒకటి యేర్పాటు చేసి వుంటారు '

థారోవాల్ మొహల్లా నుంచి జనం బయటకు రావడం ఆ రాత్రంతా జరుగుతూనే వుంది. తెల్లవారు జామున మిలటరీ ఆ ప్రాంతానికి వచ్చింది. శిబిరానికి వెడతామన్న వారినందరినీ లారీలలోనికి చేర్చింది. ఉదయ మధ్యానికి మిలటరీ వ్యాన్లు ఒక ప్రకటన చేశాయి : 'నగరంలో ప్రశాంత వాతావరణం నెలకొన్నది, ఇంక ఎవరూ బెంగపడవలసిన అవసరం లేదు. అంతా అదుపులో వుంది. ఆర్మీ నగరంలో సంచారం చేస్తోంది. జనం కావలసిన రీతిగా సంచారం చేయవచ్చును' అని.

ఆ రాత్రంతా లాలా కాన్షీరామ్ నిద్రపోలేకపోయినాడు. మైనారిటీ కమ్యూనిటీల పరిస్థితి ఏంత బలహీనంగా వున్నదో అర్థం అయింది. ఇవేళ కాకపోతే రేపయినా తాను యీ నగరాన్ని వదలి వెళ్లిపోవలసి వస్తుంది. ఈ ఆలోచనే అతడిని ఎంతో బాధపెడుతోంది. గదిలో అవిశ్రాంతంగా అటు యిటు పచార్లు చేయసాగాడు. ఆ మాట అర్థం అయినాక అదే పదిమార్లు

అనుకోసాగాడు : 'కాందిశీకుడు ! కాందిశీకుడు ! ఓహో ! నేను యీ ప్రాంతంలోనే పుట్టాను, యిక్కడే పెరిగాను. యిదే నా యిల్లు. నా యింట్లోనే నేను కాందిశీకుడిని అయిపోతాను ? ఎట్లా ?'

'నాన్నా, మనం వెళ్లిపోవలసి వస్తుంది' అన్నాడు అరుణ్

అతను వాక్యం పూర్తిచేయకుండానే అందుకున్నాడు కాన్షీరామ్, 'ఎందుకు వెళ్లవలసి వస్తుంది ? ఎందుకు వెళ్లిపోవాలి ?'

'ప్రభుత్వం మన ప్రాణాలను కాపాడలేకపోతోంది గనుక ; మనను మనం రక్షించుకోవడం కోసమయినా మనం వెళ్లిపోక తప్పదు'.

'ప్రభుత్వం మనను ఎందుకు రక్షించలేదు ? ఈ దేశంలో మతకలహాలు కొత్త విషయమేం కాదు లోగడ ఎన్నో చూచివున్నాను నేను. ఇంగ్లీషు వాళ్లు వాటినన్నిటినీ అణచివేశారు గదా !'

'ఒకవేళ - ప్రభుత్వం యిప్పుడా పనిచేయలేకపోతుందనుకో, ప్రభుత్వానికి ప్రజల రక్షణ అలవికాని సంగతి అయిపోతే.... అప్పుడు కూడా మనం వాళ్లవైపే అంగలారుస్తూ కనిపెట్టుకు కూర్చుని నాశనం అయిపోతామా ?'

ప్రభారాణి - హృదయం భయోత్పాతంగా నిండిపోగా - 'కుర్రాడు చెప్పింది సరయిన ధోరణిలోనే వుంది' అంది.

'చేతకాకపోవటమా, యిష్టం లేకపోవడమా... యేది సరయిన మాట ?' లాలా కాన్షీరామ్ భార్యమాటలు విననట్లుగా కొడుకుతో అన్నాడు. 'ఇష్టం లేకపోయిందీ అంటే ప్రభుత్వం కూడా యీ దారుణ హత్యలకు ఒక పక్షం వహించినట్లు అవుతుంది. చేతకాకపోయిందంటే.. భారతీయులమైన మనకు యిక స్వాతంత్ర్యాన్ని కోరుకునే హక్కు లేకుండా పోతుంది !'

ఇంగ్లీషు సూపర్నెంట్ ఆఫ్ పోలీస్ వుంటే - అతను చేయి ఝుడిపించి అల్లరిమూకల మీద లాఠీచార్జ్ ఆజ్ఞాపించేవాడు. అప్పుడు ఎంత పెద్ద అల్లకల్లోలం అయినా, క్షణాలమీద మంచులా విడిపోతుంది ఇలాంటి విపత్కర పరిస్థితులను ఎదుర్కోవడం యింగ్లీషు వాళ్ళకు తెలిసినట్లుగా

మనకు తెలియదు. ఆ తరువాత - అదే యింగ్లీషు సూపర్నెంట్‌కు అతని ధైర్యసాహసాలకు మెచ్చుకోలుగా 'పతకం' ప్రదానం చేస్తారు గొప్ప ఉత్సవం జరిపి. సియల్‌కోటలో ఇంగ్లీషు సూపర్నెంట్‌ను బదిలీ చేసి ఆస్తానంలో భారతీయుడిని నియామకం చేసి చాలా రోజులు అయినా యింకా ఆ గతకాలపు వర్తనం, వైభవం గురించి మననం చేసుకోవడం కాన్షీరామ్ చేస్తున్న పని పతకం అందుకున్నాక, ఆ సూపర్నెంట్ తనవైపు తీవిగా చూచి 'లాలాజీ! ఠీక్ హై ?' అంటాడు. ఆ మాటలోనే ఎంతో రక్షణోత్సాహం వుంది, వ్యక్తిగత గర్వాతిశయాలతో పాటు. అయితే యిప్పుడు ఇంగ్లీషు ఆర్మీయూనిట్లను పనిచేయనివ్వడం లేదు. 'బారాక్స్'లో మాత్రమే వుంచిపోషిస్తున్నారు. లాలా కాన్షీరామ్ కళ్లు అశ్రువులతో నిండిపోయాయి, యీ సంగతులు మననం చేసుకోవడంతోటే తమకు రక్షణ లేదు, ఏమాత్రం ఆశావహమైన వాతావరణం లేదు.

'మనకు రక్షణ కోసం అడిగే హక్కుకూడా లేదు' అనుకున్నాడు.

మనమూ మూటముల్లె సద్దుకుని యిక్కడ నించి వెళ్లిపోదాం - అని కుటుంబ సభ్యులు సూచన యిచ్చినా దానిని అంగీకరించి అనుసరించటానికి సిద్ధంగా లేడు లాలా కాన్షీరామ్. ఎలా వదిలిపోగలుగుతాడు ? ఇక్కడే చనిపోయినా మంచిదే. ఇప్పుడు జులై నెల మధ్యలో వున్నాం. కొన్నాళ్లు ఆగివుంటే మంచిది. ఇప్పుడు జనాభా తరలింపు ప్రారంభం చేస్తే రెండు దేశాలు చితికిపోతాయి. నాయకులు మాత్రం అంటున్నారు : 'ఎవరూ దేశం విడిచివెళ్లకండి. ఉన్నచోటనే ఉండిపోండి' అని. అయితే యీ మాటలు హృదయపూర్వకంగా పూర్తిగా అన్నవి కాదు. పైగా అబద్ధాలు కూడా. జనాన్ని రక్షించలేనప్పుడు యిలా అనడం అబద్ధం కాక యింకేం అవుతుంది ? ఊహు! దౌర్జన్యాన్ని, హింసను ప్రోత్సహిస్తున్నది ఈ నాయకులే. ఒక గట్టి ప్రకటన చేస్తే - యీ అతలాకుతలమైన పరిస్థితి అంతా వేరే దిక్కుగా మారిపోతుంది. ఈ సంగతి అతనికి క్షుణ్ణంగా తెలుసును. మామూలు జనం ప్రభుత్వం మాటకాదనటానికి ఉత్తరువులు ఉల్లంఘించటానికి జంకుతారు. ప్రభుత్వం బలహీనంగా, ఉదాసీనంగా ఉన్నదన్నప్పుడే ప్రజలు అల్లరిచేస్తారు. పరోక్షంగా తమను ప్రభుత్వం ప్రోత్సహిస్తోందన్నప్పుడే 'ఆగం', దొమ్మీలు జరుపుతారు.

సియల్ కోట విడచి వెళ్లి పోవలసివస్తే? లాలా కాన్షీరామ్ తనగది గోడమీద చేతితో పామి ఓ ఆలోచన చేశాడు . ఉహు, ఈ పోరాటాన్ని యిక్కడ యింతటితో వదిలి వేయటానికి లేదు ఈ గోడల వెనక ఎంతో శ్రమ, ఆకాంక్ష వున్నాయి. తనకు యాభై మధ్య వయస్సు ఉండవచ్చును, అయినా యింకా యువకుడి కిందేలెక్క మరో ప్రాంతానికి వెళ్లిపోయి సరిహద్దు దాటి ఆవలి తీరానికి వెళ్లి - మరో వ్యాపారం ప్రారంభం చేయవచ్చును. కాని అది తన వల్ల అవుతుందా? ఆ పని చేయగలుగుతాడా? భార్య వంక, అరుణ్ వంక చూచాడు. తన చేతులు, బుజాలు ఎంత అలసి వున్నాయో గమనించాడు. కొత్త భారాన్ని మోయటానికి మళ్లీ అంతా మొదలుపెట్టి నిర్మాణం చేసుకుంటూ రావటానికి తగినంత ఓపిక, శక్తి లేవు. తన లాంటి మధ్య వయస్కుడు యిలా చేయాలనుకోవడం అవివేకమయిన పనికదూ? అనవుర్థతను గుర్తించలేకపోవడం కదూ?... ఆలోచన కయినా అర్థం వుండాలి. ఎక్కడ... ఏ నగరంలో ప్రారంభిస్తాడు తన నూతన వ్యాపారం? తన దగ్గర యే మాత్రం పెట్టుబడి వుంది? ఎంత త్వరలో - తక్కువ కాలంలో - దానిని బ్యాంక్నుండి తీసుకోవచ్చును? దుకాణం యేమయిపోతుంది? ఇక్కడ కొని నిలువచేసిన ధాన్యం యేమయిపోతుంది? దీన్నంతా విక్రయం చేయడం ఎలా? ఇటువంటి పరిస్థితిలో దానికి ఎవరైనా సరైన ధర యిచ్చి పోషిస్తారా?

'ఉహు నావల్ల కాదు. నేను వయోధికుడిని అయిపోయాను. అంతా మళ్లీ ప్రారంభంచేసి పైకి రావడం నావల్ల కాదు' అన్నాడు.

ఆయన గొంతు గద్గదంగా నీరసంగావుంది. అయినా హుందాగానే వుంది.

'మీకు బాసటగా నేను వున్నాను, నాన్నా' అన్నాడు అరుణ్. అవును. అరుణ్ సహాయంగా వుండే మాట నిజమే. అయినా యే మాత్రం మూలధనంతో ప్రారంభం చేస్తారు వ్యాపారం? అరుణ్కు తగినంత ఆస్థిపాస్థులు వదలాలని అనుకున్నాడు తను. తానుపడ్డ కష్టాలు వాడికీ రాకూడదనీ, వాడి జీవితం హాయిగా గడిచి పోవటానికి చాలినంత ఐశ్వర్యం సమకూర్చాలనీ అనుకున్నాడు. ఇప్పుడు... వాడూ వెనకటి మాదిరిగా తాను కష్ట పడినట్లుగానే - జీవితం ప్రారంభం చేయవలసి వస్తుందా?

సరే. ఇదంతా ఉపద్రవంలో ఒక భాగం మటుకే. ఇంతటితో సరిపోవడం లేదు కష్టాలు. అసలు కథలో యిదో చిన్న ఉదంతం అంతే, ఇక్కడ నేలను, యీ భూమిని, యీ గాలిని వొదలి వెళ్ళవలసి వస్తుంది. ఆ ఆలోచనే మనస్సును కుదిపి వేస్తోంది. సతాయిస్తోంది. గట్టిగా ఊపిరి పీల్చి ఊపిరితిత్తులనిండా గాలి నింపుకున్నాడు. ఈ నగరపు గాలి. కళ్ళల్లో నీళ్లు నిండాయి. ఈ నేలను, యీభూమిని విడిచి వెళ్ళడం ఎలా? మళ్లీ చేతులతో గోడను పామనారంభించాడు. ఇక్కడ నించుని ఆలోచిస్తూవుంటే చిన్న నాటి తన జీవితశకలాలు, యిక్కడి వాతావరణంతో తన జీవితం పెనవేసుకు పోయి వుండడం... అంతా గుర్తు వస్తున్నాయి. చిన్నప్పుడు తను యీ మట్టిని నోట్లో వేసుకుని చప్పరించేవాడు తల్లి అలాచేయవద్దని మందలించి, కొడుతూ వుండేది కూడా. ఆ అలవాటు ఎలా మరచిపోయి నాడో గుర్తు లేదు గాని తల్లి గారి కోపం మాత్రం బాగా గుర్తే. ఇప్పుడు యీ భూమిని వీలయినంత ఎక్కువ నమిలి మింగాలని అనిపిస్తోంది. 'మనం యిప్పుడప్పుడే వెళ్లిపోవడం లేదు--' అన్నాడు, బిగ్గరగా. అంతగా అవసరం వస్తే యిక్కడ వుండిపోవడం కోసం ముస్లిం అయిపోతాడు. పైకిమాత్రం - 'మనం యిప్పుడప్పుడే వెళ్లిపోము!' అన్నాడు.

మధ్యాహ్నం ముగుస్తోందనగా అలా కాన్షీరామ్ తనదుకాణం వద్దకు వెళ్లాడు. స్కూళ్ళు కాలేజీలు వేసవి సెలవులకు మూసివేశారు. అరుణ్ కూడా ఆయనతోనే వెళ్లాడు. ట్రంక్ బజార్‌లో, హిందువులు తమ దుకాణాలు తెరుచుకు అస్తవ్యస్తంగా కూర్చున్నారు. కొందరు మిలటరీ భటులు కాకీ యూనిఫాంలలో, చేతుల్లో రైఫిల్స్‌తో చౌక్ దగ్గర నిలబడి వున్నారు. లాలా కాన్షీరామ్‌కు వాళ్లలో నమ్మకం లేదు. సరిగా - నిటారుగా నిలబడడం కూడా చేతకాదు వాళ్లకు. ఇటువంటి పరిస్థితిని తట్టుకోవటానికి ఇంగ్లీషు సైన్యమే తగినది, ఉండవలసినదీని

తండ్రి, కొడుకు ఘూస్ మండి మలుపు తిరిగి తను దుకాణం షట్టర్లు పైకి లేపారు. లాలా కాన్షీరామ్ దుకాణం సరీగా కోటకు దిగువభాగానే వుంది. ఇదే అతనికి కొండంత ధైర్యం యిచ్చే సంగతి; ఎప్పుడు కావాలనుకున్నా పోలీసులకు ఫోన్ చేయవచ్చు ; యీ సంగతి తలుచుకుంటే ఎంతో ఊరట, విశ్రాంతి.

'ఇంత ఆలస్యంగా దుకాణం తెరుస్తున్నావేం, లాలా కాన్షీరామ్?' అని అరిచాడు ఎదురు దుకాణం నుంచి అబ్దుల్ ఘని అతనిప్పుడు హుక్కా గొట్టాలు తయారు చేయడం లేదు , హుందాగా తీరికగా కూర్చుని హుక్కా పీలుస్తున్నాడు గోడకు జారగిలబడి కాలుమీద కాలువేసుకు కూర్చున్నాడు.

లాలా కాన్షీరామ్ అతనికి యేమి బదులు చెప్పలేదు. అరుణ్ మటుకు 'యింటి దగ్గర పని వుండింది. అందుకని అట్టే వుండిపోయాం' అన్నాడు. వాళ్ల అసౌకర్యాన్ని మనస్ఫూర్తిగా ఆనందిస్తూ 'ఓహో ! అలాగా !' అన్నాడు అబ్దుల్ ఘని.

'ధరోనార్ మొహల్లాలో హిందువులందరూ రాత్రికి రాత్రే యిళ్లు వదలి వెళ్లిపోయారట కదా ?' అన్నాడు అతను ప్రశ్న అడుగుతున్నట్లు కాకుండా జవాబు చెప్పితీరాలన్న కంఠం బిగువుతో

'నేనూ అలాగే విన్నాను' అన్నాడు నింపాదిగా క్లుప్తంగా లాలా కాన్షీరామ్.

అబ్దుల్ ఘని నోరంతా తెరచి అందవికారమైన గొగ్గిపళ్లు బయటకు కనిపించేట్లుగా నవ్వుతూ వుండిపోయాడు ఈ బడుద్ధాయి - దౌర్భాగ్యుడు - యిప్పుడెందుకు యిలా నవ్వుతున్నాడు ? లాలా కాన్షీరామ్ దుకాణం శుభ్రం చేస్తున్నవాడల్లా ఒక క్షణం పనిని నిలిపి రోడ్డుదాటి అతని వైపు దృష్టి మరల్చాడు. లాలా కాన్షీరామ్ ముఖం - ఆ ముఖంలోని ప్రశ్నలు - చూచి, అబ్దుల్ ఘని యింకా విపరీతంగా పెద్దఎత్తున నవ్వసాగాడు.

తన చోటునుంచి యివతలకు దూకి, ఘని రోడ్డుదాటి లాలా కాన్షీరామ్ దుకాణానికి వచ్చేశాడు. ఘని దుకాణం కొయ్యపలకల మీద చేతులువేసి నిలబడి 'నీవు ఎప్పుడు వెళ్లిపోతున్నావు కాన్షీరామా ?' అనడిగాడు.

తక్షణమే అరుణ్ అతడి మీదికి దూకి కొట్టాలని ఉద్వేగపడ్డాడు. తను చూచినంత వరకు, వినినంత వరకు ఎవరూ తండ్రిని యిలా అగౌరవంగా చిన్నచూపుతో అమర్యాదగా ప్రస్తావించలేదు 'కాన్సీరామా...' అని! లాలా కాన్షీరామ్ కొడుకును ఆపి నిలిపాడు.

'నేను వెళ్లిపోవాలని ఎందుకు కోరుకుంటున్నావు, అబ్దుల్ ఘని ? మనం యిద్దరం మంచి స్నేహితులం కదా. ఎన్ని సంవత్సరాల నుంచి యిలా కలిసివున్నాం కాదు ?' అన్నాడు లాలా కాన్షీరామ్

ఈ మాటలకు అబ్దుల్ ఘని నిరుత్తరుడయిపోయాడు. అతడు యింకాఎన్నో అసహ్యము, దుస్సహం అయిన మాటలు పోగుచేసుకు వచ్చాడు లాలాను అనడానికి, అతనికి వినిపించడానికీ. లాలా ప్రవర్తన అన్ని డీలా పడిపోయేట్లు చేసింది. నోటమాట పెగలడం లేదు. కొయ్యపలక మీద కూర్చుని నేలచూపులు చూడసాగాడు

ఎంతయినా తాను ఒక 'కాఫిర్'తోనే మాట్లాడుతున్నానని గుర్తు తెచ్చుకుని ధైర్యం పుంజుకున్నాడు

'నువ్వు హిందువువు. కనుకనే నేను నీవు యిక్కడ నుంచి వెళ్లిపోవాలని కోరుకుంటున్నాను. నీవు అల్లాను నమ్మవుగదూ !'

'ఆమాటా నిజం కాదని నీవు ఎరుగుదువు. నాకు భగవంతునిలో నీకున్నంత విశ్వాసమూ వుంది.'

మళ్లీ ఘని పిరికిగా నేలచూపులు చూడసాగాడు

అయితే నిమిషాలలోనే అతనిలోని నీచ ప్రకృతి, రాజకీయ అవకాశ వాతావరణంతో మిళితమై, పుంజుకుని నిలబడింది. లాలా కాన్షీరామ్ కళ్లలోనికి చూడకుండా 'చూడు ఒక మాట చెబుతాను విను. నీ వ్యాపారంలో నన్ను.భాగస్వామిగా చేర్చుకో. అప్పుడు నిన్ను బలవంతంగా యిక్కడి నుంచి పంపివేసినా... వ్యాపారంలో నీ వాటా నీకు జాగ్రత్తగా పంపుతూ వుంటాను.'

ఇప్పుడు నవ్వడం లాలా కాన్షీరామ్ వంతు అయింది. ఘని పొగరుబోతు తనం, నిర్లక్ష్య వైఖరి మితిమీరుతున్నాయి. ఎంతో అసౌకర్యంగా మూలకు నెట్టబడినా అతనికి యిప్పుడు నవ్వు రావడం తప్ప యింకే దారి కనబడలేదు. విపరీతంగా నవ్వసాగాడు. చుట్టపక్కల వున్న హిందు దుకాణదారులు యిక్కడ జరుగుతున్న కలాపాన్ని గమనిస్తూనే వున్నారు. వాళ్లలో ఎవరయినా

తనకు అండగా వచ్చి నిలుస్తారా ? ఆ రోజు 'అందరూ ఒకటే - కలిసికట్టుగా వుందాం' అని తెగపలికారు బీరాలు. ఇప్పుడు తమాష చూస్తూ వుండిపోయారు. తాను వంటరివాడే అయినా, నిస్సహాయస్థితిలోనే వున్నా . ఘని ముఖం ముందే హాయిగా బిగ్గరగా నవ్వుతూ కసితీర్చుకుంటున్నాడు

'సరే. ఆ విషయం ఆలోచిస్తాను' అని చెప్పి తనపని తాను చూసుకోసాగాడు. అతనితో మాట్లాడి యేమీ ప్రయోజనం లేదని తెలుసు అతడిలోని హుందాతనం అంతా నశించిపోయింది. అందమైన హుక్కా గొట్టాలు తయారు చేయడం, వాటిమీద వచ్చే న్యాయమైన సంపాదనతో క్రమబద్ధంగా జీవితం గడపడం అన్న అంశం అతనినుంచి యిప్పుడు వైదొలగిపోయింది కదా ! వాదనలు, తర్కాలు చేసి అతన్ని పూర్వస్థితికి తీసుకురాలేం. అందుకు వేరే మార్గాలు అవసరం.

అబ్దుల్ ఘని తను దుకాణానికి తిరిగి వెళ్లిపోయాడు, తల ఊపుకుంటూ, తనలోతనే అనుకుంటున్నట్లుగా అంటూ . 'ఓ అవకాశం యిచ్చాను. దాన్ని అతను ఉపయోగించదలుచుకో లేదు. నేనేం చేయను ?'

తరువాత వారంలో - ప్రతిరాత్రీ, క్రమం తప్పకుండా సియల్ కోటలోని హిందువుల వీథుల్లో ఒకటి తగులుబడుతూ వచ్చింది. ప్రతిరాత్రీ సరిగా పదకొండు గంటలకు అరుపులు ఆకాశాన్ని అంటుతున్నాయి. 'నారా - యే - తక్‌బీర్ ; అల్లాహో అక్బర్..' ఆ తరువాత గందరగోళం శబ్దాలు, ఆకాశాన్ని అంటుతున్న అగ్నిజ్వాలలు. పొగతో నిండిపోయిన వాతావరణం. జనం యేడుపులు పెడబొబ్బలు పెట్టుకుంటూ కాందిశీక శిబిరాలకు పరుగులు తీయడం.... యిదీ వరుస ! పంజాబ్‌లోను బెంగాల్‌లోను జరుగుతున్న సంఘటనలను గురించి వార్తా పత్రికలు వివరంగా వార్తలు వ్రాస్తున్నాయి, మానభంగాలు ! దీనిని ధృవపరుస్తూ ప్రతిరోజూ సియల్‌కోటకు తూర్పు పంజాబ్ నుంచి, జాతీయదేశంలోని యితర ప్రాంతాల నుంచి పుంఖాను పుంఖంగా - రైళ్ల లోను, బస్సులలోను కాందీశీక ముస్లింలు వచ్చిపడుతున్నారు. అలాగే ప్రతిరోజు వందలాది హిందువులు, సిక్కులు సియల్ కోటను విడిచివెడుతున్నారు. వెళ్లిపోవటానికి త్వరత్వరగా యేర్పాట్లు చేసుకోలేని వాళ్లే

కాందిశీక శిబిరాలవైపు నడుస్తున్నారు. వాళ్ల సంకల్పంఅల్లా సాధ్యమైనంత త్వరగా 'ఇండియా'కు చేరుకోవడం.

లాలా కాన్షీరామ్ యింట్లోగాని, అమరావతి యింటకాని అప్పట్లో నైతిక బలం, సమర్థన అతి తక్కువ స్థాయిలో వుండింది. అందరికీ యిక్కడి నుంచి వెళ్లిపోవాలని వుంది. లాలా కాన్షీరామ్ మటుకు ససేమిరా వీలుకాదంటున్నాడు. ఇదంతా యేదో వెర్రితనం - అకరణంగా జరుగుతున్న కలాపం - ఇది ఎప్పటికో ఒకప్పటికి చల్లారవలసిందే. హింస అంతమవక తప్పదు. తరువాత, జులై 2 నాటికి హిందు, ముస్లిం నాయకులు అందరూ కలిసి ఒక సంయుక్త ప్రకటనతో బయటకు వచ్చారు. మైనారటీల రక్షణకు అందరూ కృషి చేయవలసిందేనని. ఎవరి యిళ్లకు వాళ్లు కొన్ని రోజుల వ్యవధిలో వెళ్లవలసి వుండగా - యిప్పుడు కాందిశీకుల శిబిరాలకు వెళ్లడం ఎందుకు ? లాలా కాన్షీరామ్ ఈ మాటలు పదే పదే అంటున్నాడు. అందరూ అతనితో అంగీకరిస్తున్నారు కూడా తమ అభిప్రాయాలు అలోచనలు సరైనవిగానే రూపొందాలని మనసుల్లో ఎవళ్లకి వాళ్లు ఆకాంక్షిస్తున్నారు.

ఒకరోజు మధ్యాహ్నం పూట లాలా కాన్షీరామ్ యింటికి వచ్చాడు. అతని ముఖం బూడిదలా పాలిపోయివుంది. ప్రభారాణి, ఈషర్ కేర్ వరండాలో కూర్చుని తాము ఎలా వంటరివారు అయిపోతున్నదీ మాట్లాడుకుంటున్నారు. శ్రీకాంత్ బహద్దూర్ - అంత శ్రీమంతుడైన లాయరు కూడా - నిన్న సాయంకాలం బారులు తీరిన కారుల్లో అమృతసర్‌కు పయనమై వెళ్లిపోయాడు. మొహల్లాలో రాత్రిపూట కాపలాలు జరుగుతూనే వున్నాయి. రోడ్డుకు యిరుపక్కలా రెండు గేట్లు తాళాలు వేసి వుంచుతున్నారు. యువకులు మూడు మూడు గంటలకు ఒక జట్టుగా గస్తీ తిరుగుతున్నారు. వీధిలోని కుటుంబాలు సగానికి సగం అయిపోయినాయి - సంఖ్యాబలంలో.

అరుణ్ కూడా తండ్రితో పాటు దుకాణానికి వెళ్లాడు. అతను అంతకు ముందే యింటికి వచ్చేశాడు, తండ్రితోపాటు యిద్దరు నమ్మకస్తులయిన నౌకర్లను వుంచి.

లాలా కాన్షీరామ్ అడుగులు భారీగానే వేస్తాడు. అతని పాదాలచప్పుడు మూలంగానే వేలమందిలో వున్నా యిట్టే గుర్తుపట్టగలను అంటుంది ప్రభారాణి.

ఈ రోజుమాత్రం ఆయన దొంగలాగ యింటికి తిరిగి వచ్చాడు. నీడలా నడిచివచ్చి ఆడవాళ్ల ముందు అకస్మాత్తుగా ప్రత్యక్షమై వాళ్లను అక్కజ పరచాడు. ప్రభారాణి ఆయన వాలకం చూచి యేమీ మాట్లాడలేనట్లుగా మూగబోయింది ఈశ్వర్‌కేర్ భయంతో విచలితమై కడుపు పట్టుకు కూర్చుంద.

నోట్లోంచి మాటలు వస్తున్నాయా లేదా అన్నట్లుగా లాలా కాన్షీరామ్ 'మనదుకాణం లూటీ అయింది' అన్నాడు.

'అయ్యో' అన్నారు యిద్దరు ఆడవాళ్లూ.

అరుణ్ తండ్రిమాటలు విని తనగదిలోంచి దూకుడుగా బయటకు వచ్చి 'ఏమయింది ?' అన్నాడు ఆదుర్దాగా.

'చెప్పానుగా, దుకాణం దోచుకున్నారు'

'ఎప్పుడు ? ఎలా ? ఎవరు వాళ్లు'

'నిదానంగా వుండు...' అంది ప్రభారాణి కొడుకుతో.

లాలా కాన్షీరామ్ నేలకు అతుక్కుపోయినట్లుగా నిలబడ్డాడు. ఆయనలో వింత భావాలు పరుగులు తీస్తున్నాయి. ఆయన అలవాటు యేమంటే యింటికి రాగానే ముందు షూస్ విడిచేస్తాడు. చెప్పులు వేసుకుని కొళాయి దగ్గరకు వెడతాడు కాళ్లూ చేతులు కడుక్కుంటాడు. తరువాత కృష్ణ విగ్రహం దగ్గరకు వెళ్లి నమస్కారం చేస్తాడు. ఆపైన తన గదిలోకి నడిచి 'ఈజీఛైర్'లో కూలబడతాడు. అప్పుడు గాని అనాటి వార్తలను ప్రభారాణికి చెప్పేందుకు నోరు విప్పడు. ఇప్పుడాయన అచేతనంగా మిగిలిపోయాడు. ఏం చేయాలో తెలియకుండా వుంది. తనది కాని యింటికి, పరాయి చోటుకు - వచ్చానా లేక నేను నేను కాదా యేమిటి.... అన్నట్లుగా వుంది అతని వాలకం.

ప్రభారాణి ఆయన చేయిపట్టుకుని 'రండి మీ కుర్చీలో కూర్చుందురు గాని!' అంది నడిపిస్తూ. ఆమె గుండెలు భయంతో రెపరెపలాడుతున్నాయి.

అరుణ్ పరుగెత్తుకు వెళ్లి తండ్రిగారి చెప్పులు తీసుకువచ్చాడు. షూష్ తనే విప్పి చెప్పులు తొడిగాడు. ప్రభారాణి ఆయన్ను గదిలోనికి నడిపించుకు

వెళ్లింది ఈశ్వర్ కేర్ వారిని అనుసరించింది - యింకా కడుపు భద్రంగా పట్టుకునే వుంది.

అందరూ-ఆయన చుట్టూ చేరారు.

'నిజంగానేనా ?' అంది భార్య.

'అవును'

'ఏం జరిగింది చెప్పండి'

'మొహల్లా ధరోవాల్ పక్కనుంచి వాళ్లు రావడం గమనిస్తూనే వున్నాను నేను. తెరిచివున్న ప్రతి హిందూ దుకాణాన్ని దోచుకుంటూ వస్తున్నారు'

'మిలటరీ యేం చేస్తోంది ?'

'ఎక్కడా కనబడలేదు వాళ్లు. చౌక్‌లో ఒక్క సిపాయి కూడా లేడు'

'పోలీసులు యేమయ్యారు ? మీర ఫోన్ చేయలేదా ?' అని అడిగాడు అరుణ్.

'చేశాను. వాళ్లు మనుషుల్ని పంపిస్తున్నామన్నారు. కాని ఎవరూ రానే లేదు'

'దౌర్జన్యం జరిగిందా ?'

'నాకు తెలీదు. వాళ్లు కొద్ది దూరంలో వున్నప్పుడే నేను షటర్లు కిందకు లాగి దుకాణం వదలి బయటకు పరుగెత్తాను'

'అలా అయితే, దుకాణం దోపిడీ కాలేదన్న మాట' అంది ఈషర్‌కేర్ కళ్లు గుండ్రంగా తిప్పుతూ. గర్భవతి అయినప్పటి నుంచీ ఆమెకళ్లు మరింత నల్లగా అందంగా తయారవుతున్నాయి.

'అయింది, అమ్మాయీ ! వాళ్లు దగ్గరకు వచ్చేశారు. నేను షటర్లకు తాళాలు వేయలేకపోయాను యింతలో. కిందకులాగి పరుగుతీశాను. అంతే!'

వాళ్లు ఆగారు.... యింకా యేం జరిగిందో వినడానికి

'ఘన్ మంది దగ్గరకు వెళ్లాక యేమయిందో చూద్దామని తలవెనక్కు తిప్పాను అప్పటికి వాళ్లు దుకాణంలోకి చేరారు. దాన్యపుబస్తాలు ఒక్కొక్కటి బయటకు తెస్తున్నారు.'

'అయ్యో - అయ్యో. ' అంటూ ప్రభారాణి నిట్టూరుస్తూ యేడుపు ప్రారంభించింది ఆమె కళ్ల వెంట అశ్రువులు ధారాపాతంగా స్రవిస్తున్నాయి. అంత దృఢమైన మనిషి, యింటికి యిల్లాలయి నిర్వహిస్తున్న మనిషి.. యేడుపు ప్రారంభించడం తోటే లాలా కాన్షీరామ్ తన దుఃఖాన్ని మరిచిపోయాడు.

'అయ్యో - అలా యేడవకు. ఏమిటది ?' అన్నాడు.

'అబ్దుల్ ఘని కూడా వాళ్లతో వున్నాడా, నాన్నా ?'

'ఏమో నేను గమనించలేదు. అతని దుకాణం మూసివుంది'

వాళ్లు మాట్లాడుకుంటూ వుండా ఛౌద్రి బర్కత్ ఆలి మెట్లెక్కి ఆ గదిలోనికి వచ్చేశాడు. ఈ మధ్య అతను తరచుగానే వస్తున్నాడు. ఇప్పుడు మరీ గంభీరంగా వున్నాడు. మంచం మీద కూర్చుండిపోయాడు ముందు.

కాన్షీరామ్ కూర్చున్న కుర్చీవెనక నక్కి నిలబడి ప్రభారాణి యేడుస్తూ వుంది. అతను ఆమెను గమనించి 'యేమయింది ?' అని అడిగాడు.

'చాచాజీ దుకాణం దోపిడి అయిపోయింది' అని చెప్పింది ఈషర్ కేర్.

'అలాగా !' అన్నాడు చౌద్రి ఉలిక్కిపడి లేచి కూర్చుని. ఆయినా అతను అంత విపరీతమైన ఆశ్చర్యంగానీ, సంభ్రమంగానీ కనబడరచలేదు. వివరాలకోసం ప్రశ్నలు వేయలేదు. ఇలాంటిదేదో జరుగుతుందని తనకు తెలుసునన్నట్లుగానే మిన్నకుండిపోయాడు.

'కాన్షీరామ్ సోదరా ! ఈ పని జరుగుతుందని హెచ్చరించటానికే వచ్చాను యిప్పుడు. ఈ వీధి అంతా దొమ్మి దోపిడి జరుగుతుంది. యీ రాత్రి పరశురామ ప్రీతి అవుతుంది. మీరందరూ తక్షణమే వెళ్లిపోవాలి !'

అందరూ ఛౌద్రి వంక సంభ్రమంతో భయభ్రాంతులై చూచారు. ప్రభారాణి తన చెంపల మీదుగా కారుతున్న కన్నీళ్లను తుడుచుకోవడం మరచిపోయింది.

ఆమె నిర్ఘాంతపోయి చూస్తున్నప్పుడు ఆమె కనురెప్పల మీద నీటిబిందువులు గాజురాళ్ల మాదిరి కాంతులీనుతున్నాయి.

'నేను యిలా చెప్పవలసి వస్తున్నందుకు చాలా విచారిస్తున్నాను. నాయిల్లే లూటీ అయిపోయినా బాగుండునని భగవంతుడిని ప్రార్థిస్తున్నాను. మా సోదర ముస్లిములతో నేను చేసిన వాదోపవాదాలన్నీ వ్యర్థం అయిపోయి నాయి. వాళ్లు యిప్పుడు ముస్లిములు కాదు ; సైతానులు. మీ వీధి వంతు యీ రాత్రి వస్తుంది. నాకు అత్యంత విశ్వాస పాత్రమైన మనుషుల ద్వారా ఈ సమాచారం తెలసింది మీరు ఎంత త్వరగా సర్దుకుని బయటపడగలిగితే అంత మంచిదని నాఉద్దేశ్యం..'

'డిప్యూటి కమిషనర్ను హత్య చేశారు రాత్రి అన్న విషయం మీకు తెలిసిందా ?' అనడిగాడు.

'లేదు' అని లాలా కాన్షీరామ్ కుర్చీలోంచి దిగాలున లేచి గదిలో పచార్లు చేయనారంభించాడు. మత శక్తులు డిప్యూటి కమిషనర్‌ను, పోలీస్ సూపర్నెంట్‌ను విడదీశాయి. సూపర్నెంట్ కొన్ని వారాల క్రితం మరో ప్రాంతానికి బదిలీ అయిపోయాడు. డిప్యూటి కమిషనర్‌ను చంపేంత దూరం యీ కక్షలు పోతాయని కాన్షీరామ్ ఊహించలేదు.

'మీకు గుర్తుందా ? డిప్యూటి కమిషనర్ ఒక ముస్లిం బాడీగార్డ్‌తో నగరమంతా గస్తీ తిరుగుతూ వుండేవాడు. మత భేదాలు తనను కలవరపరచ కుండా వుండేందుకే ఆయన అలా చేసేవాడు. ఉభయ పార్టీలకు తనలో విశ్వాసం కలుగుతుందని నమ్మాడు. ఆయనతో అంగరక్షకుడుగా వున్న కాన్‌స్టేబులే తన సర్వీస్ రైఫిల్‌తో యజమానిని కాల్చిపారేశాడు రాత్రికి రాత్రి...'

'కాన్‌స్టేబుల్ ఏమయ్యాడు ?'

'రాత్రికి రాత్రి పారిపోయాడు. అదీ కథ ! వస్తాడులే కొన్ని రోజుల్లో. అప్పుడు పాకిస్తాన్ ప్రభుత్వం అతనికి "పతకం" యిచ్చి సత్కరిస్తుంది.'

లాలా కాన్షీరామ్ వెనకటి రాత్రి గుర్తుతెచ్చుకున్నాడు. డిప్యూటీ కమిసనర్ ఆ రోజు ముస్లిం గుంపులను అతి ధైర్యంగా చాకచక్యంగా

ఎదుర్కొన్నాడు ఇప్పుడు . తన అంగరక్షకుడే అతన్ని బలితీసుకున్నాడు లాలా కాన్షీరామ్‌కు యిప్పుడు పట్టుకున్న చింతయేమంటే - తన జీవితం యికముందు యేమికానున్నదో ! ఎదురుగా వున్నది చౌద్రి బర్కత్ ఆలి. తన నమ్మిన స్నేహితుడు. తనను సోదరుడుగానే పరిగణిస్తానని ప్రమాణం చేసిన వాడు ! ఇప్పుడు ఎంతో శ్రద్ధా భక్తులతో చెబుతున్నాడు - యిల్లు, వాకిలి, ఆస్తి, అంతస్తు. . అంతా వదిలేసి వెంటనే పారిపొమ్మని దీని అంతర్యం యేమిటో యితనికి తెలుసా ? దీని విలవ యేమిటో ఎరుగునా ? మతి వుండే మాట్లాడుతున్నాడా యితను ?

చౌద్రి బర్కత్ ఆలి నుంచి మాటలు బయటకు వచ్చిన తక్షణమే ఈషర్ కేర్ వాటిని పదిమందికీ తెలియచెప్పటానికి బయటకు వెళ్లిపోయింది అందరూ బయట పోగయ్యారు. బీబీ అమరావతి వచ్చింది. సూరజ్ ప్రకాశ్ వచ్చాడు బావా సూరజ్ ప్రకాష్, లాలా బిమారీలాల్ వచ్చాడు. పద్మిని, చాంద్‌నీ వచ్చారు. మంగత్ రామ్ అతని భార్య రామ్ కాళితో సహావచ్చాడు మంగత్ రామ్ రెవెన్యూ శాఖలో చిన్న ఉద్యోగి. ఈ అంతస్తులోనే ఒక చిన్నవాటాలో వుంటున్నాడు. ముగ్గురు సిక్కులలో యిద్దరు వచ్చారు ముకుందుని తల్లి కూడా వచ్చింది. ఈ రెండు భవనాలలోను యేడు కుటుంబాలు నివశిస్తున్నాయి అందరూ అక్కడ చేరినట్లే లెక్క. మంగత్ రామ్ ఆఫీసునుంచి సెలవులో వున్నాడు. తతిమ్మావాళ్లు ఆ రోజు బయటకు వెళ్లటానికి జంకి యింటిలోనే వుండిపోయారు.

'అయితే నగరంలోని కాంగ్రెస్ ముస్లిములు అంత బలహీనులయి పోయారా ? నగరంలో యింత హింసాకాండ జరుగుతూ వుంటే ఆపడం వాళ్లకు చేతకాకుండా పోయిందా ?' అనడిగాడు లాలా కాన్షీరామ్.

చౌద్రి బర్కత్ ఆలీ కొన్ని సెకన్లు ఆలోచించాడు.

'ఉన్న విషయం చెబుతాను విను. కాంగ్రెస్ ముస్లింలు మొదటి నుంచీ, ద్వంద్వ ప్రవృత్తి కలవాళ్లు అయివుండాలి... లేక యిప్పుడు పక్షాలు మార్చివుండాలి. ఏమయితేనేం... జరుగుతున్న హింసను దౌర్జన్యాన్ని ఖండించటానికి యే ముస్లిమూ తయారుగా లేడు...'

శ్రోతలు విని అర్థం చేసుకుంటూ వుండగా, ఆయన యింకా యిలా అన్నాడు · 'మేం వ్యక్తిగతంగా ఎంతో పోరాడాం. రాత్రి జరిగిన మీటింగ్‌లో ప్రొఫెసర్ గులామ్ హుసేన్ ఎంతో సేపు - సుదీర్ఘంగా - ఉపన్యసించాడు. ఆ మీటింగ్ ఎర్రమసీదులో జరిగింది. అలాగే చౌద్రి ఇమామ్ బక్ష్, డాక్టర్ వజీర్ ఖాన్ కూడా శక్తివంచన లేకుండా వాదించి మాట్లాడారు. నేను వాదిస్తున్న వాడిని వాదిస్తూనే వుండిపోయాను. అంతా వృదా శ్రమ అయిపోయింది. విషం తలకు ఎక్కిపోయింది దీనికి తోడు భారతదేశం నుంచి రోజు వందలాది కాందీశీకులు తమ దౌర్భాగ్య స్థితిని చిలువలు పలువలు అల్లి చెప్పుకుంటూ వచ్చి పడుతున్నారు నగరంలోనికి. సియాల్‌కోటలో - యిక్కడ - జరుగుతున్న సంఘటనల వంటివే అవతలి ప్రాంతంలో కూడా తటస్థిస్తున్నాయి. అందులో యేం సందేహం లేదు. పాకిస్తాన్‌లో కాంగ్రెస్ హిందువులు కూడా మారిపోతున్నారు. కాందిశీకులు తమ కష్టనష్ట గాధలు చెప్పుకుంటూ వస్తున్నప్పుడు రాజకీయ నాయకులు ఆదుర్ఘటనలను తమకు అనుకూలంగా మలుచుకుందుకు ప్రయత్నిస్తున్నారు.'

లాలా కాన్షీరామ్ సాలోచనగా 'యిది మనిషికి పరాజయం మనిషి తప్పిదం.. అంతే! ' అన్నాడు.

బీబీ అమరావతి 'ఈ దుర్ఘటనలు ప్రారంభం చేసిన వాళ్లు ముస్లిములు' అంది ఛౌద్రి బర్కత్ ఆలి వంక కోపంగా చూస్తూ.

ఛౌద్రి బర్కత్ ఆలి ప్రశాంతంగా 'సోదరీ ! ఆ విషయం నిర్ధారణగా ఎలా చెప్పగలవు ?' అన్నాడు.

'అయితే ఇంగ్లీషు వాళ్లు మనల్ని నిలువునా ముంచేశారన్నమాట' అన్నాడు లాలా కాన్షీరామ్ కొన్ని క్షణాల తరువాత. 'వాళ్ల బాధ్యత, వాళ్ల కర్తవ్యం. .. దేశ స్వాతంత్ర్యం యేమీ గందరగోళం గాబరా లేకుండా వచ్చేట్లు చూడడం.. ! ఈ రోజు రోడ్డు మీద మనిషి నిస్సహాయుడయిపోతే, ప్రభుత్వం అతని ఆస్తిని ప్రాణాన్ని కాపాడలేకపోతే.... ఆ నేరానికి బాధ్యులు ఇంగ్లీషు ప్రభుత్వం వారు ..'

చాలాసేపటి తర్వాత లాలా కాన్షీరామ్ ఇంగ్లీషు వాళ్ల పట్ల ద్వేషం, అసహ్యం ప్రకటించాడు. 'ఇన్క్విలాబ్' పుస్తకంలో రైజాదా చెప్పిన మాటలన్నీ అతని మనసులో మెదిలాయి. అవును, వాళ్లే నిజమైన ఘాతకులు వాళ్లే దేశాన్ని అరాచకంగా వదలి వేస్తున్నారు తనను ముంచేస్తున్నారు. వాళ్లను అంతగా నమ్ముకున్న తనను...

ఛౌద్రి బర్కత్ అలీ 'యిప్పుడు మనముందున్న సమస్య.. అంతా కూడగట్టుకుని బయట పడగలగడం పదకొండు గంటలకల్లా దొమ్మి, కలహం మొదలవుతుంది ఇంకా ఆరు గంటల విరామం మటుకే వుంది మనకు' అన్నాడు.

'ఎక్కడికి వెడతాము ?'

ఛౌద్రి బర్కత్ అలీ మిన్నకుండిపోయాడు. లాలా కాన్షీరామ్‌ను అతని కుటుంబాన్ని తన యింటికి తీసుకుపోవాలని అనుకున్నాడు ముందు. కాని అది జరిగే పనిగా కనిపించలేదు. వాళ్లకు అక్కడ కూడా క్షేమం కాదు. ముస్లిం పొంగు తనను కూడా చంపినా ఆశ్చర్యం లేదు.

ఎన్నో ఆలోచనలు ముందుకు వచ్చాయి.

రైలెక్కి జమ్ము వెళ్లిపోదాం. సరిహద్దు నుంచి పదిమైళ్ల దూరమే. కొన్ని గంటల్లో సురక్షిత ప్రాంతానికి చేరుకోగలుగుతాం...'

'జమ్ముకు రైళ్లు వెళ్లడం లేదు.'

వ్యక్తుల లాగానే రైళ్లు కూడా దోపిడీకి ఆగానికి గురి అవుతున్నాయి. వాటిని మార్గమధ్యంలోనే ఆపేసి, హిందువులను తెగనరుకుతున్నారు. సియల్‌కోటనుంచి రైలు మార్గంగా మూడు పట్టణాలు దగ్గరలో వున్నాయి. జమ్ము, అమృత్‌సర్, వజీరాబాద్ వజీరాబాద్ వయిపు - అస్సలు క్షేమకరమైన మార్గం కాదు. అది పశ్చిమ పాకిస్తాన్ వైపు తీసుకువెడుతుంది. వజీరాబాద్ దగ్గర దక్షిణం వయిపు తిరిగి లాహోర్ వెళ్లి అక్కడ నుండి అమృత్‌సర్ వెళ్లాలి. జమ్ము వెళ్లే రైలు కొన్ని రోజుల క్రితం పట్టాలు తప్పి యింకా మార్గమధ్యంలోనే

పడివుంది చనిపోయిన మనుషుల శవాలనే యేరటానికే, రక్తపు మడుగులు కడిగించటానికి ఎవరూ పూనుకోలేదు అమృత్‌సర్ వైపు రైళ్లయితే వెడుతూన్నాయి మధ్యాహ్నం రెండుగంటలకే ఈనాటి చివరి రైలు వెళ్లిపోయింది. అమృత్‌సర్‌కు వెళ్లే రైలు క్షేమంగా గమ్యానికి వెడుతుందా లేదా అన్న సంగతి ఎవరి ఊహకూ అందదు.

'మనకింకో మార్గం లేదు. కాందిశీకుల శిబిరానికి వెళ్లవలసిందే. మీలో అమృత్‌సర్ వెళ్లాలనుకున్న వాళ్లు రేపు ఆ రైలు పట్టుకోవచ్చును' అన్నాడు లాలా కాన్షీరామ్.

లాలా కాన్షీరామ్‌కు మనసులో ఆనందంగానే వుంది, తాము కాందిశీకుల శిబిరం వరకే వెళ్లబోతున్నారు గనుక. అమృతసర్ లాంటి దూరప్రాంతాలకు వెళ్లడం అంటే అతడికి శరీరంలోని తడి ఆర్చుకుపోతున్నట్లు అనిపించసాగింది. సియల్‌కోట ప్రపంచంలో కెల్లా సుందరమైన నగరం. ఇంకేదీ దీనికి సాటిరాదు. కాందిశీకుల శిబిరంలో వుంటే యేదో ఒకనాటికి యింటికి తిరిగివస్తామనే ఆశవుంటుంది. అమృత్‌సర్ నుంచి తిరిగి రావడం అంటే మాటలతో పనా ? ఈ రోజున తేదీ ఆగష్టు రెండు. త్వరలోనే స్వతంత్రం వస్తోంది. రెండు ప్రభుత్వాలు యేర్పడడం తోటే యిలాంటి వెర్రి ముర్రి కలహాలకు అంతం రాకతప్పదు. ఇద్దరూ యేదో వప్పందానికి వస్తారు. అవును, కాందిశీకుల శిబిరము తమకు యిప్పుడున్న స్థితిలో గత్యంతరం, మేలయిన యేర్పాటు కూడా. సియల్ కోటలో యిటువంటి శిబిరం అంటూ వుండడం తమ అదృష్టం అనే చెప్పాలి. అతడు కూర్చున్న దిక్కు నుంచి కృష్ణుని ఫోటో కనిపించకపోయినా, కాన్షీరామ్ అటువైపు తిరిగి వినయంగా తలవంచాడు.

'అయితే యేమంటారు ? మనం శిబిరానికి తరలుదామా ?' అని అరిచాడు కాన్షీరామ్.

'అలాగే ! అలాగే !' అన్నాయి అనేక గొంతుకలు. నిరంజన్ సింగ్ మాత్రం నీరసంగా చూచాడు, ఏమీ మాట్లాడకుండా.

ముకుందుడి తల్లి లేచి గది మధ్యకు నడిచింది.

'వెళ్లిపోవాలా ?' అంది లాలా కాన్షీరామ్ వంక చూస్తూ ఆమెను చూచి ఎవరయినా భయపడతారు తెల్లటి వెంట్రుకలు భారంగా భుజాలమీద పడుతూ వుండగా ఆమె అలా వంగి నిలబడిపోయింది. గూని మూలంగా ఆమె నిటారుగా నిలుచోలేదు ముసలి తాబేలు లాగ ఆమె ప్రశ్నిస్తూ నిలబడింది. 'ఏమిటి మీరు అంటున్నది ? ముకుందుడు యింకా ఆ జెయిలులోనే మగ్గుతున్నాడు' అంటూ ఆమె కోటవైపు చేతులు జాపి చూపింది 'జెయిలు అక్కడే వుంది. నా పిల్లవాడు అక్కడ వున్నంతవరకు నేను మరెక్కడికీ కదిలేది లేదు' అంది

లాలా కాన్షీరామ్ ఆమె బుజం మీద చేయివేసి ఉరడిస్తూ 'మనం అక్కడ కొద్ది రోజులపాటే వుంటాం మళ్లీ యిక్కడికి తిరిగి వచ్చేస్తాం. అందరం తిరిగి యిక్కడికే వస్తాం' అన్నాడు

ఆమె అతడిని పక్కకు నెట్టింది.

'ముకుందుడు నాతో వచ్చేంత వరకు నేను కదలను'

లాలా గొంతు పెద్దది చేసి 'నీవు యిక్కడే వుండేట్లయితే వాళ్లు నిన్ను చంపేస్తారు' అన్నాడు.

'అయినా యేం ఫరవాలేదు. నేనేం మీ మాదిరి భయస్థురాలిని కాదు,. పిరికి దాన్ని అంతకంటే కాదు' బీబీ అమరావతి వంక తిరిగి 'సంవత్సరాల తరుబడి నీవు బీదవాళ్ల రక్తం ఓడ్చుకు తాగావు. నా కొడుకు ముకుందుని వంటివాళ్లను హరింపచేశావు. అందుకే నీకు భయం' అంది.

'నోరుమూసుకో, ముసలి ముండా !' అంది అమరావతి.

'ఆమె మాటలు పట్టించుకోకమ్మా' అన్నాడు కాన్షీరామ్.

'నీవు మాతోపాటే రావాలి. వేరే దారి లేదు' అని ఖచితంగా ముసలామెతో అన్నాడు.

'వస్తానేమో చూస్తువుండు' అంటూ ఆమె గదిలోంచి విసవిస బయటకు నడిచింది.

మునీర్ ఆ క్షణంలో అక్కడకు వచ్చాడు.

'నేను డేవిడ్‌సన్ సాహెబ్ దగ్గరకు వెళ్లివచ్చాను సాయంత్రం ఏడుగంటలకు రెండు ఆర్మీ ట్రక్కులు పంపుతానన్నాడు మనకోసం.' ఒక్క క్షణం ఆగి యింకా యిలా అన్నాడు. 'అతను మనకు నేరుగా సహాయంచేయడానికి వీల్లేదు బ్రిటిస్ ట్రక్కులు నగరంలోనికి రావడం కుదరదు. అయినా యెలాగో స్థానిక మిత్రుల సహాయంతో యీ యేర్పాటు మాత్రం చేయగలనన్నాడు'

మునీర్ అరుణ్ ముఖం వంక చూడాలని ప్రయత్నిస్తున్నాడు, అయినా అరుణ్ అతని వంక చూడకుండా ముఖం పక్కకు తిప్పుకున్నాడు.

'సరే. మంచిదే. అందరూ ఎవరి గదులకు వాళ్లు వెళ్లండి. సామాను సర్దుకుని సిద్ధంగా వుండండి. అత్యవసరమైన సరంజామా మటుకే తోడుగా తెచ్చుకోండి. ఏడుగంటలకల్లా అందరూ సర్వసిద్ధంగా వుండండి. అందరినీ అప్పుడు పిలుస్తాను' అన్నాడు కాన్షీరామ్

అందరూ విడిపోయి ఎవరిగదుల వైపు వాళ్లు వెళ్లారు. ఏమిటి అత్యవసరం అయిన సరంజామా ? ఎంత తీసుకుపోవాలి, ఎంత యిక్కడే మిగిల్చివుండాలి ? రెండు వారాల క్రితం లాలా కాన్షీరామ్ బాంక్ నుండి మూడువేల రూపాయిలు తెచ్చి యింట వుంచాడు. ఇప్పుడు ఇంట్లో వున్నది ఆ మొత్తమే. ప్రభారాణి బ్యాంకులో వున్న డబ్బంతా తెచ్చివేయమంది. అరుణ్ కూడా అదే మాట. లాలా కాన్షీరామ్ మటుకు కలలో కూడా అలాంటి పనిచేయనన్నాడు. ఈ రోజునేను నిజంగా పేదవాడిని - అని గొణుక్కున్నాడు.

మూడు వేల రూపాయలంటే తక్కువ మొత్తం యేం కాదు. ఆరు నెలల పాటు చక్కగా సరిపోతుంది. కాస్త జాగ్రత్తగా గడుపుకుంటే సంవత్సరంపాటు యీ డబ్బుతో దేకటానికీ వీలున్నది. జాగ్రత్తగా - పొదుపుగా వుంటే సరి. పోతే ప్రభారాణి నగలు నట్ర వున్నాయి. ఏమీ బెంగపడవలసింది లేదు. తనకు సామర్థ్యం వుంది, చాకచాక్యం వుంది. నాశనం అయిపోడు.

అరుణ్, ప్రభారాణి సామాన్లు సర్దుతున్నారు. లాలా గుండె బిగబట్టుకొని వాళ్లను చూస్తూ వుండిపోయాడు వాళ్లు గోడలన్నీ కాళీ చేస్తున్నారు. తన శరీరం మీదనుంచి చర్మం, మాంసంపోతున్నట్లు వలిచేస్తున్నట్లు బాధపడుతున్నాడు లాలా అతను ఎటుతిరిగి చూచినా ఎముకలు మటుకే అగుపిస్తున్నాయి

ఏం తీసుకు వెళ్లాలి, ఏం వదలి వేయాలి అనే విషయంలో అతనేమీ సలహా యివ్వడం లేదు ప్రభారాణి కూడా అతన్నేమీ అడగడం లేదు ఆమె ఓ చిన్న ట్రంకు పెట్టె కాళీ చేసి తీసుకువెళ్లవలసివన్నీ దానిలో పేరుస్తోంది. పెద్ద ఇనుపబీరువాలలోంచి విలువయిన సామాన్లు తీసి జాగ్రత్త చేస్తున్న పద్ధతి చూచి లాలా అక్కజ పడుతున్నాడు. బంగారు ఆభరణాలు అతను యెరుగును అయితే ప్రభయిన్ని కాశ్మీర్ శాలువలు, చేతితో ఎంబ్రాయిడరీ చేసిన పట్టురెవికలు, జడలకు పెట్టుకునే బంగారు తీగల కుచ్చులు.... యివన్నీ ఎప్పుడు కొన్నది ? ఎన్నో సిల్కు జేబురుమాళ్లు, గాజుల జతలు, వెండి అంచులున్న అద్దల ఫ్రేములు - చిన్నవీ, గుండ్రవీ ? రకరకాల అత్తరు సీసాలు, సెంటు సీసాలు... రంగు రంగులవి.... సువాసనలదీ... యివన్నీ...

భర్త తనవయిపు యేమిటివన్నీ అనిచూస్తున్నట్లు అనిపించి ఆమె కాస్త సిగ్గుపడుతూ 'నా సువాసన నూనెలు' అంది.

'అత్యవసరం అయినవి మటుకె తీసుకో' అన్నాడు అతను. ఈమాట యిదివరకు అందరిముందూ అన్నాడు కాని యీమారు చాల శృతిమెత్తగా మందలింపుగా మటుకే అన్నాడు, భార్యను నొప్పించటం యిష్టం లేక.

'ఇవన్నీ చాలా అత్యవసరం -' అంది ఆమె యింకా సిగ్గుపడుతూ. ఏమంటే అరుణ్ కూడా యిప్పుడు ఆమె వంక చూస్తున్నాడు 'ఇవన్నీ నిజమైన పూలతో చెట్ల బెరడులతో చేసినవి. ఇలాంటివి యీ రోజుల్లో ఎక్కడా దొరకవు. బహు అపురూపం !' కాస్సేపాగి 'ఈ రోజు వచ్చే అత్తరు సాహెబులందరూ మోసగాళ్లు' అంది.

లాలా కాన్షీరామ్ బాధతో ముఖం పక్కకు తిప్పుకున్నాడు. ఇప్పుడు యింట్లో వస్తువులన్నీ వదిలి వేయవలసి వస్తోంది భార్య అంటే తనకు ఎంత

ప్రేమ. ఎంత ఆప్యాయత. ఎవరేనా 'నీవు యేమిా తీసుకు వెళ్లటానికి వీల్లేదు; ఒక్క వస్తువు మాత్రమే ఎన్నుకో' అంటే అతను నిస్సందేహంగా ప్రభారాణిని మటుకే తీసుకుని, యింటి నుంచి బయటకు నడుస్తాడు. అరుణ్‌ను కూడా తీసుకుపోవాలనే ధ్యాసేరాదు !

కొద్ది సేపట్లోనే వాళ్లు తయారయిపోయారు. ఒక స్టీల్ ట్రంక్, ఒక బెడ్‌రోల్. ఇందులో పడకసామాను వుంది. తతిమ్మావన్నీ - పుస్తకాలు, దుస్తులు, దుప్పట్లు ... అన్నీ అలాగే వదిలేశారు. ఇంట్లో బోలెడంత ఫర్నిచర్ వుంది. బరువైన మాంచాలు. బల్లలు-కుర్చీలు బలమైన కర్రతో చేసినవి. ఇప్పుడు యివన్నీ వదలి వెళ్లాలంటే చాలా కష్టంగా వుంది. లాలా కాన్షీరామ్ ఎక్కువ సేపు వాటివంక చూడలేకపోయాడు ఆయన తనగదిలో మంచం పక్కగా నిలబడి ఛౌద్రి బర్కత్ ఆలీ, మునీర్ లారీలు ఎప్పుడు తీసుకు వస్తారా అని ఎదురుచూస్తూ వున్నాడు. ఇప్పుడు యిక్కడ నుంచి ఎంత త్వరగా వెళ్లిపోతే అంత మంచిది అనిపిస్తోంది. వెళ్లక తప్పనప్పుడు, త్వరగా వెళ్లడమే మంచిది కదూ. ఎంత త్వరగా యీ శని వదిలించుకుని మళ్లీ మామూలు స్థానాలకు వచ్చి చేరుకుంటామో ! తిరిగి వచ్చిన తరువాత .... అప్పుడు చూచుకోవచ్చు అన్ని గదులలోనికీ వెళ్ళి నిదానంగా.

ట్రంకుపెట్టెలకు, సూట్‌కేసులకు తాళాలు వేసి, తాము తీసుకువెడుతున్న పెట్టెకు కూడా ఒక తాళం బిగించింది ప్రభారాణి. అరుణ్ తోలుపటకాలతో పకడ్‌బందీగా కట్టిన బెడ్‌రోల్ మీాద విశ్రాంతిగా కూర్చుంది. ఆమె చాలా అలసిపోయివుంది ; చింతాక్రాంత అయివుంది. ఆమె గదులన్నీ తిరిగి చూచుకోలేదు. ఉన్నట్లుండి ఆమె యేడవసాగింది.

'అమ్మా !' అన్నాడు అరుణ్.

ఆమె త్వరగా అడుగులు వేస్తూ ఒక ఇనుపబీరువా తెరిచి రెండు తలదిండ్లు బయటకు తీసింది. ఉన్నవాటిలో ఉత్తమమైనవి అవి. తలగడలు తీసుకుపోవడం లేదని యిప్పుడే ఆమెకు తట్టింది. లాలా కాన్షీరామ్ రెండు తలదిండ్లయినా వేసుకోకుండా ఎప్పుడూ నిద్రపోలేడు. 'అరుణ్, వీటిని నీ చేతుల్లో పట్టుకు రా అంది ప్రభారాణి.

తలుపుచప్పుడయింది. ౽ విచూచేసరికి ఓపొడగాటి మనిషి ఆర్మీ బూట్లు ధరించి నిలబడి వున్నాడు. అయితే మామూలు - సివిల్ - దుస్తులే ధరించి వున్నాడు. వెతనీ లం బుష్ షర్ట్, బూడిదరంగు ట్రౌజర్స్, అతని జుట్టు చిందరవందరగా వుంది. ముఖం మీద నల్లటి గ్రీజ్ మరకలు వున్నాయి. తెల్లటి తెలుపు మనిషి.

'బిల్‌డేవిడ్ సన్ !' అన్నాడు ఆశ్చర్యంతో అరుణ్.

అతను లాలా కాన్షీరామ్‌కు, ప్రభారాణికి భారత సంప్రదాయానుసారం రెండు చేతులు జోడించి నమస్కారం చేశాడు.

అరుణ్ వంక కన్నుగీటి 'భారతీయుడిలాగ కనిపించటానికి నానా అవస్థ పడ్డాను. ఇలా కాకపోతే ట్రక్కులు తీసుకురావడం అసాధ్యం' అన్నాడు.

'నాన్నగారూ ! ఇతను బిల్‌డేవిడ్ సన్. మాకు స్నేహితుడు' అని పరిచయం చేశాడు అరుణ్.

లాలా కాన్షీరామ్‌కు అతను ఇంగ్లీషువాడని యిట్టే తెలిసిపోయింది. తెల్లదొర ! మామూలుగా అయితే అతనికి స్వాగతం చెప్పటానికి ఎగిరి గంతు వేసివుండేవాడు. తమ యింట్లో ఒక తెల్లదొర ! కలలో గూడా యిలాంటి సన్నివేశం తటస్థిస్తుందని అనుకోలేదు అయితే తక్షణ కర్తవ్యం గుర్తువచ్చి ఉత్సుకతను అణచివేసుకున్నాడు.

'మేం అదృష్టవంతులం' అన్నాడు చేతులు జోడించి ఆ గొంతులో యిదివరకటి హుందాతనం, రాజసం కొరవడినాయి.

'కూర్చోండి సర్' అన్నాడు కాళీ కుర్చీని మళ్లీ తన చేతులతోనే శుభ్రపరుస్తూ - దానిమీద యేమీ దుమ్ము ధూళీ లేకపోయినా

'మనం బయలు దేరాలనుకుంటాను. ట్రక్కులు రోడ్డుమీద వున్నాయి' అన్నాడు డేవిడ్‌సన్ అరుణ్‌తో, లాలా కాన్షీరామ్ ఆహ్వానాన్ని చేతులతోను, యిది సమయం కాదని నవ్వుతూనూ చూపుతూ.

ప్రభారాణి చీరకొంగు తలమీద నుంచి తీసుకుంది ఆ కుటుంబంలో ఆమె యే సందర్భంలోనూ ఎక్కువ సంభ్రమం ప్రదర్శించని మనిషి. ఓ ఇంగ్లీషు మనిషి తన యింట్లో నిలుచుని వున్నాడనే విషయం ఆమెకేమీ వింత అనిపించడం లేదు.

ఎవరూ కదల లేదు.

'మునీర్‌ను వాళ్ల నాన్న గారిని యిక్కడకు రావద్దని చెప్పాను. వీధిలో అందరికీ తెలియడం ఎందుకు ?' అన్నాడు బిల్ డేవిడ్ సన్ అరుణ్‌తో.

ఈ మారు ఎవరూ మాటాడలేదు, కదలలేదు.

'బిల్ డేవిడ్‌సన్ నాతోను, మునీర్‌తోను సుదీర్ఘ చర్చలు చేస్తూవుంటాడు. అతనికీ దేశవిభజన అంటే ఎంత మాత్రం యిష్టం లేదు' అన్నాడు అరుణ్ తండ్రితో, యీ సన్నివేశం బిగువును కొంతలో కొంత సడలించాలనే ఉద్దేశ్యంతో.

లాలా కాన్షీరామ్ ఒక వంక మోసపోయిన వాని బిత్తర చూపులు చూచాడు. 'మమ్మల్ని మీ మనుషులు పూర్తిగా ముంచివేశారు' అన్నాడు బహునిదానంగా, నిందాధ్వనితో - వేలు బిల్ వంక చూపుతూ.

లాలా కాన్షీరామ్ ఉరుదూలో మాట్లాడాడు. బిల్‌కు తగుపాటి ఉరుదూ పచ్చును. అయినా లాలా అంటున్న మాటలు అర్థం కావటానికి భాషతో నిమిత్తం లేదు. ఆయన మూర్తీభవించిన శోకదేవతలా వున్నాడు. ఆయన కళ్లలో నిరాశ నిస్పృహలు కొట్టవచ్చినట్లుగా కనిపిస్తున్నాయి.

లాలా కాన్షీరామ్ యింకా యిలా అన్నాడు. 'నాకున్నదంతా... ముప్ఫయి సంవత్సరాల పాటు చెమటఓడ్చి సంపాదినంచినదంతా... యిప్పుడు మునిగిపోతోంది, మీరు మమ్మల్ని రక్షించలేక పోవడం వల్ల.'

'నాన్నా, నాన్నా...'

బిల్ డేవిడ్‌సన్ చేయివూపి అరుణ్ వారించాడు.

'మీరు, మీరు మా పాలకులు. మా యజమానులు. నేను.... కోట్లాది జనం, యీ దేశస్థులం, మీకు మా విశ్వాసాన్ని నిరాటంకంగా సమర్పణ

చేసుకున్నాం ఆ దేశ నాయకులతో సంప్రదింపులు చేసుకుని, ఒప్పందానికి వచ్చేటప్పుడే మేమేం అయిపోతున్నాం, మా గతి యేమిటి అని ఒక్కమారయినా ఆలోచించారా మీరు ? స్వాతంత్ర్యం మాకు కావాలి మేందానికి స్వాగతం చెబుతాం అయితే యీ హింసాకాండలు ఎందుకు ? రెండు వందల సంవత్సరాలుగా బ్రిటిష్ వారు యీ దేశంలో వున్నవానికి యిది విరుద్ధమైన ప్రదర్శన ఈ హింసాకాండలో, దోపిడి, అల్లరి ఆగడములలో బ్రిటిష్ వారికే భాగం వున్నట్లు అనిపిస్తోంది .

'ఎలా ? ఎలా ?' అని అడిగాడు బిల్ దేవిడ్ సన్, ఇంగ్లీషులో ఉరుదూలోను మార్చి మార్చి.

'ఎలాగంటే , వీటిని ఆపడానికి నిలిపివేయడానికి మీ దగ్గర అధికారం వుంది. కాని ఆ అధికారాన్ని మీరు ఉపయోగించడం లేదు' లాలా గొంతు పెద్దదవుతోంది

లాలా కాన్షిరామ్ కాస్తదూరంలో నిలబడి తన వంక తాను చూచుకోగలిగినట్లయితే ఎంతో ఆశ్చర్యం అనిపించేది అతనికే ! ఓ వినయ విధేయతలు కలపౌరుడు, ఇంగ్లీషు వారి తొత్తు -- ఎదురుగా ఒక దొరను నిలచోబెట్టుకుని వాదనలు చేయడమా ? ఊహు, కాదు. ఇంగ్లీషు వారు యింక దొరలు కాదు, ప్రభుత్వం కాదు. వాళ్లు అతని విశ్వాసాన్ని కోలుపోయారు. దగాచేశారు. సర్వనాశనం చేశారు. యిక వాళ్లకు విధేయత విశ్వాసమూ చూపవలసిన పనిలేదు.

'బహుశ మీరు యిక్కడికి తిరిగి వస్తారు' అన్నాడు బిల్ దేవిడ్సన్ నింపాదిగా ఉర్దు మాటలు పేర్చుకుంటూ.

ఈ మాటలతో లాలా కాన్షిరామ్ చల్లబడిపోయాడు. 'ఓ ! అవునవును. తిరిగి ఇక్కడకు రాగలిగితే !' తిరిగి సురక్షితంగా యిక్కడకు చేరుకోగలిగితే ఇంగ్లీషు వాళ్లు ముస్లిములను కూడా అవలీలగా క్షమించి వేయగలడు అతను. ఇక్కడికి తిరిగివచ్చి యిక్కడే ప్రాణాలు వదిలి. ఐక్ నదీ తీరంలోనే సమాధి అయిపోగలిగితే చాలు. ఈ ఆలోచన రావడంతోనే వళ్లంతా పులకరించింది.

తన మృతదేహాన్ని నలుగురు బుజాల మీద మోసుకువెళ్లి, సియల్ కోట వీధుల మీదుగా నడిచి - ఊరేగింపుగా దహనకాండకు తీసుకువెళ్లడం. బాజా భజంత్రీలు, బంధుబలగం, కొడుకులు, మనుమళ్లు, ఆరు గుఱ్ఱాలు... ఇదంతా అతని ఊహలో మెదిలింది ప్రభారాణి కూడా తన శవవాహనం వెనుక నడుస్తోంది. ఆమె యేడవడం లేదు, యీ వయసులో అలాంటి పని చేయగూడదు కనుక. అయినా గుండెల్లో బోలెడు దుఃఖం, విచారం గూడుకట్టుకువుంది. ఊరేగింపు సన్నివేశాన్ని చాల పదిలంగా సుందరంగా ఊహించుకుంటున్నాడు లాలా కాన్షీరామ్. ఇదేమీ పెళ్లి వేడుక కాదని బాజాలు, గంటల చప్పుళ్లు చెప్పక చెబుతున్నాయి. ఓ వృద్ధుని మరణం. అంతిమ ప్రయాణం, వయసునిండి వృద్ధాప్యం బాగా గడిపిన మనిషి. కుటుంబానికి దేశానికీ తన కర్తవ్యం చక్కగా నిర్వహించిన మనిషి. వంశ ప్రతిష్ట నిలిపిన వాడు. అందుచేత యిది దుఃఖ సన్నివేశం కాదు. గౌరవంగా గర్వంగా సాగవలసిన ప్రయాణం. ఎవరు చనిపోయిన మనిషి ?.... అని ఎవరేనా అడిగితే జనం లోంచి జవాబులు వస్తాయి. 'లాలా కాన్షీరామ్.... ఓ ! మహానుభావుడయ్యా ఆయన ! లాలా కాన్షీరామ్ ప్రభువు !.. వేదాలలో చెప్పారు. మెదడుకు అగ్ని తాకేంత వరకు కాస్త స్మృతి వుంటుందని. అగ్ని చర్య అవడంతోటే అంతా అయిపోతుంది. అప్పుడు అతని ఆత్మ పై నుంచి ఐక్ నదిని, సియల్ కోట నగరాన్ని వీక్షిస్తుంది. కిందికి వచ్చి యీ నేలతో యీ దుమ్ముతో ధూళితో మిళితం అయిపోవాలని చూస్తుంది. ఆహా - ఎంతటి సుందర సన్నివేశం.'

'సర్!' అతను చాల వినయంగా చేతులు కట్టుకుని వున్నాడు.

ఆయన అలా తన్మయావస్థలో నిలబడి ఊహాలోకంలో విహరిస్తూ వున్నప్పుడు యెవరూ ఆ స్థితిని భంగపరచలేదు. ప్రభారాణికి మటుకు తెలుసు తన భర్త యీలోకపు పొలిమేరల్లో తిరుగాడడం లేదని. కొద్దిసేపు పిచ్చి ఊహల్లో తిరుగాడి, కొన్ని నిమిషాల తరువాత మామూలు లోకంలోకి వస్తాడని ఆమె ఎరుగును. కాని అరుణ్‌కు మాత్రం తండ్రి ముఖ కవళికలు చూస్తుంటే యెంతో భయం వేస్తోంది. బిల్ డేవిడ్‌సన్ యుద్ధం రంగంలో మృత్యువును

ముఖాముఖి అనేక పర్యాయాలు చూచివున్నాడు వంగిన లాలాకాన్షీరామ్ రూపం; ఎత్తిన శిరస్సు, కళ్లలో నీళ్లు, ఎటో చూస్తున్న అగమ్యమైన చూపులు.... యివన్నీ గమనిస్తానే ఆయన్ను కదిలించడం యిష్టం లేక అలాగే నిలబడిపోయాడు.

'సర్..' లాలా కాన్షీరామ్ అతివినయంగా అన్నాడు 'మేం నిజంగా యిక్కడకు తిరగి రాగలం అంటారా ?'

'సాధ్యమే' అన్నాడు డేవిడ్‌సన్ క్లుప్తంగా, ఓదార్పుగా

'అయ్యా, ఒక్క క్షణం కూర్చోండి. నా పరుష వాక్యాలకు నన్ను మన్నించండి. ఏదో వయసు మళ్లిపోతున్నవాడిని...'

అతను బిల్‌ను కుర్చీలో కూలవేయాలని ప్రయత్నించాడు. కాని బిల్ మాత్రం 'అయ్యా, మనం యింక కదలవలసి వుంటుంది' అని తప్పించుకున్నాడు.

'నాన్నగారూ మనం బయలుదేరాలి.'

'సరే - అలాగే వెడదాం' అంటూ లాలా కాన్షీరామ్ భార్యను పిలిచి పదమన్నాడు. 'నడవండి మళ్లీ వెనక్కు చూడవద్దు. కన్నీళ్లు కూడా అక్కర్లేదు. అరుణ్ మన వస్తువులు కిందకు తెస్తాడు.'

తతిమ్మా యిళ్లవాళ్లు అప్పుడే వీధిలో పోగయ్యారు. ట్రక్కుల సరసన నిలుచున్నారు. డ్రైవర్లు యిద్దరూ సామాను లోపల చేరవేయడంలో సహాయం చేస్తున్నారు. సామాన్లులోపలకు విసిరి వాళ్లూ ఎక్కేందుకు తోడ్పాటు చేస్తున్నారు. ఎవరూ యేడవడం లేదు, ఆగడం చేయడం లేదు, బీబీ అమరావతి తన రెండు బిల్డింగ్‌ల వంక ఆప్యాయంగా చూస్తూ దిగులుపడి నిలబడి వుంది. ఆమె అసలే అనాకారి. ఈ దుఃఖం, దిగులు ఆమెను మరింత అనాకారిని చేశాయి. ఆమె షర్ట్, పంజాబ్ పైజమాలు ధరించింది. పైజమపట్టీ దారం బయటకు వేలాడుతూ కనిపిస్తోంది. నల్లటి మనిషి గనుక, ఆమె కళ్లు మరింత తెల్లగా మిలమిల లాడుతున్నాయి. పెదవులు వణుకుతున్నాయి. నోరు బిగుసుకుపోయివుంది.

ఆమె భర్త - ఎందుకూ కొరగాని గంగుమల్ ఆమెను సముదాయించి దుఃఖాన్ని తక్కువ చేసే ప్రయత్నంలో వున్నాడు 'చెబుతున్నాను, విను. ముందు ట్రక్‌లోనికి పద. ఇప్పుడు యేమీ దిగులు, విచారము పనికిరాదు ఇలాంటి దివ్యభవనాలు నీ కోసం మరోచోట యింకా గొప్పగా కట్టిస్తాం' అంటున్నాడు. అందరూ లారీలలో ఎక్కటానికి సిద్ధంగా నిలబడ్డారు. రోడ్డుమీద యీ జనం మధ్య యీ దంపతులు తగాయిదాలో కూరుకుపోతున్నారు.

'నా ముందు నుంచి తొలగిపో. నీ పాడు మాటలూ, నంగి వేషాలు నా ముందు వద్దు. ఇళ్లు కట్టించడం, డబ్బు సంపాదించడం నీకు యేం చేతనవును ? పో .. దూరంగా పో నన్ను వంటరిగా వదులు'.

గంగుమల్ ఆమె చేయి బిగువుగా పట్టుకుని ముందుకు లాగే ప్రయత్నంలో వున్నాడు. 'నువ్వూ....' అని ఏదో అనబోయే లోపలే కాన్షీరామ్ వాళ్లిద్దరి మధ్యకూ వచ్చి, విడదీయగలిగాడు.

దాదాపు రహస్యం చెబుతున్నట్లుగా అమరావతితో 'సోదరీ ! ఇప్పుడు కాదు. ఇది సమయం కాదు-' అన్నాడు.

'లారీ లోపలకు పో' అన్నాడు గంగుమల్‌తో బిరుసుగా గంగు లోపలకు దూకాడు. పళ్లు బిగబట్టి, పెదాలు మూసుకుంటూ అమరావతి వంక ఆమెను హత్యచేయాలన్నంత ఉద్విగ్నంగా చూస్తున్నాడు.

ఈ సంరంభంలో అందరికంటె దారుణం అయిన సన్నివేశం - అమరావతి కోడలు సునందబాలకు సంబంధించినది సునంద కాశ్మీరు దేశం నుంచి వచ్చింది. ఆమె యీ యింటికి కోడలుగా వచ్చినప్పుడు వీధి వీధంతా పండుగ లాగ సంబరం జరిపారు. ఆమెను చూడటానికి వచ్చిన వాళ్లందరూ ఆమె సౌందర్యాన్ని చూచి నిర్ఘాంతపోయారు. చిన్న ఆకారం. లేత రూపు, అంతా సుకుమారమయిన దేహం. చేతులు, వేళ్లు, పెదవులు... అన్నీ తీర్చిదిద్దినట్లుగా వున్నాయి. ఆమె వేలిగోళ్లు గులాబీరంగులో వున్నాయి. మునీర్ అరుణ్‌తో 'బహుశ రంగువేసుకుని వుంటుంది' అన్నాడు ఆ సాయంత్రం అరుణ్ ప్రత్యేకంగా గమనించి నురీ చూచాడు. అది వేసుకున్న రంగు కానేకాదు. ఆమె

వంటి రంగులన్నీ సహజమైనవే. చెంపలనిగారింపుతో సహా సాయంకాలపు నీరెండులో ఆమె శరీర భాగాలన్నీ రంగుకాంతు లీనుతూ మనోహరంగా వున్నాయి ఆమె మానవ మాత్రురాలు అనుకోవటానికి వీలులేదు దేవతా స్వరూపిణి !

ఏడు సంవత్సరాలుగా ఆమె ఈ యింట కోడలుగా మెలుగుతోంది ఆమె ఎక్కువగా ఎవరికీ కనిపించేది కాదు తానేదో ప్రత్యేక జాతికి చెందిన మనిషిని అన్నట్లుగా ఆమె సాధారణంగా ఎవరితోనూ పరిచయాలు పలుకరింపులు చేసేది కాదు ఇంటి ఆడవాళ్ల ముందుకూడా ఎప్పుడో కాని కనిపించేది కాదు. కులీనమైన బ్రాహ్మణ కుటుంబంలోని మనిషి. ఆమె తల్లిదండ్రులు సూరజ్ ప్రకాశ్‌ను ఎరుగుదురు, అతనంత గొప్పవాడు కాదనీ యోగ్యుడైన మనిషి కాదనీ ఎరుగుదురు అయినా అమరావతి ఆస్తిపాస్తులకన్నిటికీ అతనే ఉత్తరాధికారి అనే విషయం కూడా తెలుసుకనుకనూ, గొప్ప శ్రీమంత స్థితి కంటె కోరుకోవలసింది, యింకేమీ లేదుకనుకనూ సునంద బాలను ఆ యింటికి కోడలుగా యిచ్చారు. ఆమె అందరికీ దూరంగా వుంటూ, యీ ఆస్థికి వారసురాలు తానే నన్నట్లుగా నటిస్తూ కాలంగడపాలి ఆమె హైస్కూలు చదువు చదివింది. పద్యాలు చదవగలదు. సితార్ వాయించగలదు అందుచేత యితరులతో కలివిడిగా వుండకుండా దేవతా మూర్తిగా దూరంగా వుండే అర్హతలు సంపాదించుకున్నది కాని అలా దూరంగా వుండేందుకు అసలయిన కారణం వేరే ఒకటి ఉంది. తాను చాల అందకత్తెనన్న విషయం ఆమె యెరుగును. ఇతరులతో సంపర్కం, సాన్నిహిత్యం వుంటే ఈ అందం తరిగిపోతుందేమోనని ఆమె అనుమానం అది గర్వం, అతిశయం అనడానికి వీల్లేదు. శుచీ శుభ్రతల పట్ల వున్న మూర్ఖత్వం అనుకోవటానికి కుదరదు. ఓ రకమైన సునిశితత్వం. ఈ రెండు భవనాలలోని పంజాబీ స్త్రీలు - ముఖ్యంగా ఈషర్‌కేర్, చాందినీలు - అందమయిన వాళ్లే, తీరుతెన్ను తెలిసిన మనుషులే. కాని వాళ్లు శారీరకంగా దృఢమైన మనుషులు అవడంతో వాళ్ల అందంలో సున్నితత్వం లాలిత్యం కొరవడింది. పైగా ఆంగికమైన చచ్చు, తేలిక సంభాషణల్లో జొరబడి విచ్చలవిడితనం ప్రదర్శిస్తారు.

సునందబాల అందరికీ దూరంగా, అందకుండా, అందలంలో వున్నట్లు వుండిపోయి తన భోగభాగ్యాలు అన్నీ తన కోసమూ, తన భర్త కోసము మటుకే అన్నట్లు ప్రవర్తిస్తుంది.

ఈ యేడేళ్లలోనూ సునందకు రెండు కాన్పులు వచ్చాయి. ఒక పిల్లవాడు, ఒకపిల్ల. అమ్మాయి పెద్దది. ఇప్పుడు ఆరేళ్ల వయసు. తల్లిలాగానే రూపు కట్టుకుంటూ పెరుగుతోంది. లలితంగా, సుకుమారంగా, గుంభనగా, దూరదూరంగా మెలుగుతుంది. చిన్నపిల్లే అయినా సునంద ఆ కూతురుతోనే ఎక్కువ సన్నిహితంగా వుంటుంది, యితర స్త్రీలతో కంటే. ఎప్పుడైనా ఎండ వేళ ఎవరైనా బీబీ అమరావతి యింటికి వెడితే ఆ తల్లీ కూతురు మంచం మీద కూర్చుని సూర్యరశ్మిని ఆస్వాదిస్తూ కనిపిస్తారు. తల్లియేదో కథల పుస్తకం చదివి వినిపిస్తూ వుంటుంది. అమ్మాయి అత్యంత శ్రద్ధతో వింటూ వుంటుంది. ఇద్దరూ తాము చేసేపనిలో అంత ఒబ్బిడిగా యిమిడిపోతారు.

సూరజ్ ప్రకాశ్‌కు వివాహం అయినప్పుడు అరుణ్‌కు పదమూడేళ్లు. ఆ రోజు యింకా అతనికి బాగా గుర్తే. సియల్‌కోట నుండి గుల్‌మార్గ్‌కు వెళ్లిన పెళ్లివారి గుంపులో అతను కూడా వున్నాడు. కాశ్మీర్ లోయలో నిద్రాణితమై వుండే పర్వత పంక్తుల మధ్య నిద్రపోతున్నట్లు వుంటుంది ఆ పట్టణం. అప్పుడే అతనికి నూనూగు మీసాలు వస్తున్నాయి. ఈ కొత్త యువతిని గురించి అందరూ విడ్డూరంగా చెప్పుకోవడం వింటున్నాడు. ఆమె సూరజ్ ప్రకాష్‌తో కలిసి 'యేమెమో' చేస్తుందని వినడం ఆసక్తి దాయకంగా వుండింది. అందుచేత అతడు ఆమెపట్ల కాస్త ఉత్సాహాన్ని పెంచుకోసాగాడు.

గుల్‌మార్గ్‌లో ఆమెకు దగ్గరగా మసలడానికి అవకాశం దొరకలేదు. ఎన్నో వేడుకలు, క్రతువులు, ఎందరో జనం. సియల్ కోటకు తిరిగివస్తున్న ప్రయాణంలో మటుకు, వరుడు - వధువు ప్రయాణం చేస్తున్న బస్‌లోనే తనూ సీట్ సంపాదించ గలిగాడు. అయితేమటుకు యేమయింది, అతని కంటె పెద్దకుర్రవాళ్లు పోటీపడి అతడిని ఆ బస్‌లో జొరబడకుండా చేశారు. సియల్‌కోట వచ్చిన తరువాత యిక అతని యిష్టమే యిష్టం. ఆ వీధిలోని ఆడవాళ్లందరూ నూతన వధువును చూడటానికి వచ్చినప్పుడు, మగవాళ్లు పెద్దకుర్ర వాళ్లు ఆ

గదిలోంచి అవతలకు పంపబడ్డారు అరుణ్‌ను మాత్రం ఆ గదిలోనే నిలబడనిచ్చారు మరీ చిన్న కుర్రవాడుగా అతన్ని ఎవరూ పట్టించుకోలేదు. అందరికంటె ముందు వరసలో కూర్చుని, ఆకాశ్మీర్ యువతి ముఖం మీది తెర తొలగించి తన అద్భుత రూపాన్ని పదిమందికీ కనుపింప చేసినప్పుడు అతని అద్భుత మానసిక స్థితి పువ్వులు పూచింది, రెమ్మలు వేసింది. సిగ్గుతో తలవంచుకుకూర్చున్నాడు కొంతసేపు స్త్రీలు ఆమె అందాన్ని పొగుడుతూ కూచున్నారు అరుణ్ యీ మాటలు అంతగా పట్టించుకోలేదు. ఎక్కువ 'ఆబ' గా చూస్తే యితరులు వెకిలి కుర్రాడు అనుకుంటారేమోనని అప్పుడప్పుడూ చూపులు నేలబారు చేస్తున్నాడు అతని హృదయం కొత్త ఉత్సాహంతో ఉబికి ఉబికి పడుతోంది రెండు క్షణాలకొకమారు తలెత్తి దొంగచూపులు చూస్తున్నాడు వధువు ఓ మెత్తటి పెర్షియన్ తివాశీ మీద కూర్చుంది. బిగువైన పైజమాలు, పొడగాటి షర్ట్ తొడుక్కుంది. రెండూ ఎర్రని సిల్క్‌వి. అయితే అరుణ్ చూస్తూ వున్నది వాటిని కాదు. అతడు ఆమె చేతులను, ఆచ్ఛాదనలేని పాదాలను, సంపంగిపువ్వు లాంటి సుకుమారమైన ముక్కును, పళ్ల వరుసను, ఆమె గదిలో అటుయిటు చూస్తున్నప్పుడు కళ్లలో ప్రసారమౌతున్న వింత కాంతులను చూస్తూ కూర్చున్నాడు. కాళ్లకు చేతులకు గోరింటాకు రంగుతో అల్లికలు, మాలికలు. ఆమె శరీరం ముత్యాల మాలలా తెల్లగా మెరిసిపోతోంది. ఆమె పాదల మడమలు చూచి సిగ్గుపడిపోయాడు అరుణ్. ఆ సున్నితమూ, సుకుమారమైన గీతలు, వంకలు... అన్నీ ఆతన్ని అక్కజ పరుస్తున్నాయి చూడవచ్చిన స్త్రీలు వధువుకు కానుకలు సమర్పిస్తున్నారు. కరెన్సీ నోట్ల వర్షం కురుస్తోంది. ఈ వర్షధారల మధ్య వధువును చూస్తూ వుండటానికి అరుణ్ చాల శ్రమ పడవలసి వచ్చింది. బెరకు బెరకుగా సిగ్గు సిగ్గుగా ఆమె ఘనస్తనాలను, పిర్రలను గమనిస్తూ వున్నాడు. ఆమె వయసుకు అవి చాల పెద్ద ఆకృతి. సూరజ్ ప్రకాష్ యీ రాత్రియేం చేయబోతాడో తలుచుకుని అతనికి సిగ్గు, భయం.... యేదో చెప్పరానితనం కలిగాయి. ఆ అమ్మాయి కూడా అతన్ని కొంత సేపు గమనించింది. అతని ముఖంలోని కళవెళపాటు, ఉత్సుకత, సిగ్గు - లజ్జ యివన్నీ చూచింది. ఇద్దరికీ వయసులో అయిదారేళ్లు తేడా వుంటుందేమో, అయినా అతను కుర్రవాడు - బొత్తిగా చిన్నవాడు -

అనికూడా అనుకుంది. అరుణ్ ఆమె తన వంక చూస్తూ వుండడం గమనించాడు. మానసిక ఆనందాన్ని ఆపుకోలేక 'బాభీ ! వదినా !' అన్నాడు. ఆమె కూడా కిందకు వంగి అతని గడ్డాన్ని చేతితో తడిమి లాలించింది.

అనేక సంవత్సరాల పాటు - అంటే హైస్కూలు చదువు పూర్తయి కాలేజిలో ప్రవేశించి, నూర్‌తో స్నేహం ఏర్పడేంత వరకు సునంద అంటే ప్రేమ వాహినిలో ఓలలాడుతూ వున్నాడు అరుణ్. ఆమె అంటే వున్న 'వెరితనం' కొద్దీ యేదేనా చిన్న మిషదొరికితేచాలు బీబీ అమరావతి యింటికి పరుగులు తీసేవాడు. ఆమెకు చిన్న చిన్న పనులు చేసి పెట్టటంలో అతనికి ఎంతో ఆనందం అనిపించేది. 'బజారుకు వెళ్లినాకు పాన్ తెచ్చి పెట్టు- అరుణ్' - అంటూ ఆమె అతనికి అనేక చిల్లర మల్లర పనులు చెబుతూవుండేది. అన్నింటికీ అతడు అలాగే వదినా- అంటూ పరుగులు తీసేవాడు. మెట్లుదిగి వస్తూన్నప్పుడల్లా అతని మనసులో ఒకటే ఆలోచన. ఆమెతనను చూచినప్పుడు చిరునవ్వు చిందిస్తుందా లేదా? ఆమె ఒక తమాషామనిషి. ఒక క్షణం వున్నట్లు మరుక్షణం వుండదు. దూరంగా - దేవతలా అపురూపంగా వుండిపోతుంది. మెట్లు ఎక్కేటప్పుడు దిగేటప్పుడు హడావడిగా దూకుతూ పరుగులుతీసేవాడు. రెండు మూడు మెట్లు ఒకేమారు ఎక్కేవాడు, దిగేవాడు. ఒక్కోమారు ఆమె అడిగిన వస్తువులు తెచ్చి యిచ్చినప్పుడు అందుకునేదే గాని 'తలఊపు' కూడా యిచ్చేది కాదు. పుస్తకం చదువుతూ కూర్చుని అతని రాకను గమనించనట్లే వుండిపోయేది. ఒక్కమాటయినా అనేది కాదు. కొద్దిసేపు వేచివుండి బరువైన హృదయంతో అతడు బయటకు వెళ్లిపోవలసి వచ్చేది. మరికొన్ని సార్లయితే ఆమె అతన్ని బుగ్గలమీద ముద్దుపెట్టుకునేది. అతని చేతులు తన చేతుల్లోకి తీసుకుని లాలనగా 'నువ్వెంత మంచి కుర్రవాడివి' అనేది. కొన్నిసార్లయితే అతన్ని బిగి కౌగిలిలోనికి తీసుకునేది. అప్పుడు అరుణ్‌కు ఆమె ఘనస్తన స్పర్శ తన ఎదురు రొమ్ముకు భారంగా తోచేది. ఆమె చిరునవ్వు చిందిస్తే చాలు అతనికి తృప్తిఅయేది. ప్రతిమారు ఆమె నవ్వుతుందో, నవ్వదో అనేది మనసులో గొప్ప ప్రశ్న.

సునంద పిల్లలిద్దరినీ చెరోచేత పుచ్చుకుని యింట్లోనుంచి యివతలకు రావడంతోనే అందరూ నిశ్శబ్దంలో కూరుకుపోయారు. అంత భయోత్పాత

స్థితిలోను, దుఃఖభీభత్స సమయంలోను ఆమె హుందాగా నడిచి వచ్చింది మలయమారుతంలా వీధిలో ప్రవేశించింది ముఖం గంభీరంగా వుంది కాళ్లు కిందకు దించుకువుంది మెత్తని బుజాలు ఊగుతున్నాయి చేతివేళ్లు పిల్లలను బిగించి పట్టుకున్నాయి. ఇన్ని సంవత్సరాలలోను ఆమె అపరిచితుల ముందుకు రావడం యిదే మొదటిమారు అయినా యిదంతా తనకేమీ పట్టనట్లు నడుస్తోంది, యీ ప్రపంచానికంతా తానే మహారాణిని అన్నట్లుగా చక్కగా పనితనంతో తయారయిన చీర కట్టుకుంది దానిమీద నెమలి కంఠం రంగు రవిక ధరించింది. పిల్లలిద్దరూ మాట్లాడుకుంటూ నడుస్తున్నారు. 'మనం ఎక్కడకు వెడుతున్నాం, మమ్మీ' అన్నాడు నవకాంత్, ఆమె కొడుకు 'ఎందుకు ఊరికే ప్రశ్నలు వేస్తావు' అంటూంది అమ్మాయి. 'మనం సెలవులలో ప్రయాణం చేస్తున్నాం. కదూ మమ్మీ' సునంద ఒక్కక్షణం ఆగి అమ్మాయివయిపు అవును అన్నట్లుగా తలూపి చూడడం అందరూ గమనించారు. ఆ తల ఊపులో రాజ వంశీకమైన రీవి వుంది తప్ప విచారం ఎంత మాత్రం లేదు హుందాగా ఆమె పిల్లలను లార్రీలచెంతకు నడిపించుకు వెళ్లింది.

ఆమె వాలకంలో అంత హుందాతనం, ఆత్మ విశ్వాసం వున్నాయి. మగవాళ్లు చేతులు కట్టుకుని ఆమెకు నమస్కారం చేయటానికి వరుసల్లో నిలబడతారు. బిల్‌డేవిడ్ సన్ కూడా ఆమెను చూడడం తోటే తలమీద టోపీ తీసి వినయం ప్రదర్శించాడు.

అరుణ్ నాలుగు అడుగులు ముందుకువేసి నవకాంత్‌ను తన చేతుల్లోనికి తీసుకున్నాడు. వాళ్లను ఒక ట్రక్ దగ్గరకు తీసుకువెళ్లాడు దానిలో మనుషులు వీళ్లకు మర్యాదగా చోటు యిచ్చారు.

అప్పటికి సాయంకాలం ఏడుగంటలయింది. సూర్యుడు యింకా ఆకాశంలో అగుపిస్తూనే వున్నాడు. చుట్టుపక్కల పలుచగానే వున్నారు జనం. కాని ట్రక్కులు రావడం, నిలచివుండడం యేదో విడ్డూరం. వీధి చివర కొందరు పిల్లలు గుమిగూడి చోద్యం చూస్తున్నారు.

అందరూ ట్రక్కులలో సర్దుకు కూర్చున్న తరువాత లాలా కాన్షీరామ్ అందరినీ పేరు పేరునా పిలిచి ఉన్నారా లేదా అని ఋజువు చేసుకున్నాడు. ఆ ప్రక్రియలోనే బయటపడింది; ముకుందుడి తల్లి వీళ్లతో చేరలేదని.

బీబీ అమరావతి 'ఆమె వస్తోందో లేదో నీవు విచారించి వస్తే మంచిది కదూ ?' అంది

లాలా కాన్షీరామ్ అయిష్టంగానే తాను కూర్చున్న డ్రైవర్ సీటుకు పక్కసీటు నుంచి కిందకు దిగాడు. ఆ సీటు గౌరవప్రదమైనది. రెండోలారీలోయీ సీటును డేవిడ్‌సన్ కోసం అట్టేవుంచారు. లాలా కాన్షీరామ్ అది తన హక్కుగా ప్రకటించి మరీ ఆ సీట్‌లో కూర్చున్నాడు కూర్చుని కాస్త విశ్రాంతిగా ఉన్నాడు. ప్రపంచంలో ఎక్కడ చూచినా దుఃఖమే. కాని యిప్పుడు యీ లారీ సీట్‌లో హాయిగా, కులాసాగా అనిపించసాగింది లారీ వెనక కూర్చున బీబీ అమరావతి తలపైకెత్తి మరీ అతనికి అరచి చెప్పింది. ఆమె చెప్పిన తరువాత ఆ పని చేయడం తప్ప యింకొక మార్గం లేదు 'అలాగే - అలాగే..' అంటూ సణుగుకుంటూనే ముకుందుడి తల్లిని తిట్టుకుంటూ కిందకు దిగాడు.

కింది అంతస్తులో ఆమె నివసించే గది, ఆ భవనం అంతటికీ చీకటి కోణం. నిజానికి అది గదికాదు. వరండాలో మొదటి అంతస్తు ప్రారంభం అవుతున్న జాగా. అమరావతి ఆ జాగాకు గోడలు అమర్చి గదిలాగ తయారుచేసింది. లోపలంతా దుమ్ము -, పాగ. కరెంట్ దీపం లేదు. ఎప్పుడో సాయంకాలం పూట ముసలామె కిరసిన్ దీపం వెలిగిస్తుంది. అంతవరకూ పై నుంచి వచ్చేవెలుతురే దిక్కు.

లాలా కాన్షీరామ్ ఓ శత్రు గుడారంలో చేరుతున్నట్లు లోపలకు వెళ్లాడు ఒకే భవనంలో వుంటున్నా, ఈ ముసలామెకు తమకు పడదు. ఒకళ్లు ఉత్తరధృవం అయితే మరొకళ్లు దక్షిణ ధృవం. ఇప్పుడు యీ అవసరం పడింది గనుక ఈమెను వెదుక్కుంటూ వచ్చాడు గాని యింతవరకూ యీ చీకటి కోణంలో అడుగుపెట్టింది లేదు. ఆమె ఎప్పుడైనా పైకి వస్తే - అదీ పిలిచినప్పుడు మటుకే - ఓ గదిలో మూలగా కూర్చుంటుంది.

'అమ్మమ్మా' అని పిలిచాడు.

ఆమెను అందరూ అలాగే పిలుస్తారు.

ఆమె జుట్టు ఎన్నో సంవత్సరాల క్రితం దువ్విన స్పర్శవున్నట్లుగా జడలు కట్టిపోయి వుంటుంది. కొప్పులాగ పైకి లేచి అటు యిటు చెల్లాచెదరుగా

వుంటాయి వెంట్రుకలు. ఆమె మీ వైపు చూచే పద్ధతే తమాషగా వుంటుంది. ఆమె తల నేలవాలుగా జారుతుంది. కనుబొమ్మలు, ముక్కు, గడ్డం - నేలమీద యేదో చూస్తున్నట్లు వుండిపోతాయి. కళ్లు మాత్రం పైకి లేచి మీ ముఖం వంక చూస్తాయి. ఎండి వరుగయిపోయి ఆమెకు వయస్సుతో నిమిత్తం లేనట్లుగా వుంటుంది. నగరంలో వాళ్లందరూ ఆమెను 'అమ్మమ్మా' అనే పిలుస్తారు 'ఓ ముసలమ్మా' అనే అర్థం ఆ మాటకు పంజాబీలో

'అమ్మమ్మా -' అని అరిచాడు మళ్లీ లాలా కాన్షీరామ్, యీమారు మరింత బిగ్గరగా.

జవాబు లేదు. ఆమె ఆ గదిలోనే యేమూలో నక్కివున్నట్లు అనిపించింది అతనికి. గదిలో పనికి రాని చెత్త, పాతగుడ్డలు, సీసాలు, డబ్బాలు, పత్రికలు.... యిలాంటివన్నీ చిందర వందరగా వున్నాయి. ఈ గది వినాశనానికి ప్రతీక. ఏదో మూల ఆమె యిక్కడే దాక్కుని వుంటుంది అని అతను ఎరుగును.

ఓ మూల నుంచి సవ్వడి అయింది.

'అమ్మమ్మా, నువ్విక్కడవున్నావని నాకు తెలుసు. బయటకు రా'

'ఏం కావాలి నీకు ?'

'నీవూ మాతో పాటు రావాలి'

'నా కొడుకు లేకుండా నేను రాను. నీకు తెలుసుగదూ'

'ముకుందుడు జైలులో కులాసాగా వున్నాడు. నువ్వు యిక్కడే వుండిపోతే ఈ రాత్రి నిన్ను చంపేస్తారు వాళ్లు'

'నేను రాను. ఎన్ని మార్లు చెప్పాలి నీకు ?'

లాలా కాన్షీరామ్ విసుగుతో కోపంగా 'కాస్త ఆలోచించు, నీవు లేకుండా మేం వెళ్లం' అన్నాడు.

అరుణ్, సూరజ్ ప్రకాష్ గుమ్మం దగ్గరకు వచ్చారు.

'నాకు చావంటే భయం లేదు'

'అయితే నిన్ను బలవంతంగా తీసుకుపోవలసి వస్తుంది' అని లాలా కాన్షీరామ్ - 'రండి అబ్బాయిలూ మీ అమ్మమ్మ వస్తువులు కొన్ని చేరవేయండి' అన్నాడు.

ఆమెకేమీ వస్తువులు లేవు తీసుకుపోవలసినవి. ఇక్కడ వున్నదంతా చెత్తకుప్పలు. సూరజ్ ప్రకాష్, అరుణ్ యేం చేయాలో తెలియక నిలబడిపోయారు. అంతా పోగుచేసుకు తీసుకు పోవాలి ; లేదా అంతా వదలి వేయాలి. అడుగు ముందుకు వేయకుండా యేమీ చేయకుండా అక్కడే నిలుచుండి పోయారు.

లాలా కాన్షీరామ్ ఈ స్థితిని పరికించాడు.

'రామ్మా - అమ్మమ్మా. నీకు చివరి అవకాశం యిస్తున్నాను. నీవు యేం తెచ్చుకుందా మనుకుంటున్నావో చెప్పు. పిల్లలు వాటిని సర్దుతారు. నిన్ను యిక్కడ వదలి వెడితే నీ చావుకు కారణం నేను అవుతాను. ఆ పాపాన్ని భరిస్తూ జీవితం గడపడం నా వల్ల కాదు. నిన్ను మాత్రం యిక్కడ వదిలేది లేదు' -

'చెబుతున్నాను మళ్లీ. నేను మీతో రావడం లేదు...'

కాలం పరుగెత్తుకుపోతోంది. లాలా కాన్షీరామ్‌కు చికాకు ఎక్కువవుతోంది. అడుగు వెనక్కు వేసి సూరజ్‌కు, అరుణ్‌కు రహస్యంగా యేదో చెప్పాడు. యువకులు యిద్దరూ ముందుకు దూకి ముసల్మను చేతుల్లో ఎత్తుకు రావాలని ప్రయత్నించారు. కాని ఆమె యీ పరిస్థితి గమనిస్తున్నట్లే వుంది. వాళ్లపైకి ఓ యినుప కడ్డీ విసిరింది. ఈ కడ్డీ గురితప్పి ఎదురుగోడకు కొట్టుకుని నేలమీద పెద్ద చప్పుడుతో పడిపోయింది.

'మాయదారి ముసలిదానా !' అన్నాడు లాలా కాన్షీరామ్.

'నన్ను వదిలెయ్యండి. నా జోలికి రాకండి... ఎన్నిమార్లు చెప్పాలి...' అంటూ ఆమె తిట్లు ప్రారంభం చేసింది. అంత పాడుమాటలు వినడం లాలా కాన్షీరామ్‌కు బాధగానే వుంది.

చేతులు గట్టిగా బిగించి పట్టుకుని ఆమెను యివతలకు గుంజగలిగారు అరుణ్, సూరజ్. లాలా కాన్షీరామ్ వాళ్లవెనకనే అడుగులు వేయసాగాడు జాగ్రత్తగా అంతా గమనిస్తూ.

ముకుందుడి తల్లి గొంతు ఎంత పెద్దది చేయటానికి వీలుందో అంత పెద్దచేసి అరుస్తోంది. వాళ్లు ఆమెను ఒక లారీలో చేర్చారు అరుణ్, సూరజ్‌లే కాక ఆ లారీలో వున్నవాళ్ళు కూడా ఆమెను అదిమి పట్టి వుంచటానికి సహకరిస్తున్నారు. కాని ఆమెలోని రాక్షసి విజృంభిస్తోంది. ఆమెను గురించి యిరుగు పొరుగు యింత వరకు విన్న సమాచార కథలను నిజమని ఋజువు చేస్తోంది. కొందరి చేతులు కరుస్తోంది. కొందరి కుత్తుకలు నొక్కటానికి ప్రయత్నిస్తూంది. దీనివల్ల యేమి ప్రయోజనం కలగక ఆమె గుండెలు బాదుకుంటూ యేడుపుకు లంకించుకుంది.

'అయ్యో - అయ్యో -- నాకు ఈ చోటు విడిచి వెళ్ళడం యిష్టంలేదు. నా ముకుందుడి నుంచి నన్ను దూరం చేస్తున్నారు. నేను యిక్కడ నుంచి వెళ్లను.... అయ్యో.... అయ్యో....'

'ఎవరూ నిన్ను ఎత్తుకుపోవడం లేదు. మనమందరం త్వరలోనే తిరిగి వచ్చేస్తాం' - అన్నాడు. లాలా కాన్సీరామ్ ఆమె చేస్తున్న గొడవకు చికాకు పడిపోతూ.

నీ మాటలు నమ్మను. నీవు చెప్పే ఒక్కమాటా నిజం కాదు.

బీబీ అమరావతి ముందుకు వచ్చి అమె చెంప మీద లాగి ఒక దెబ్బవేసింది.

'నోరు మూసుకో. ముసలిదానా. కాస్తంతయిన సిగ్గుశరములేవా నీకు? రోడ్డు మీద వాళ్లంతా నిన్నే చూస్తున్నారు.'

బిల్ డేవిడ్‌సన్ లారీలో ముందు సీట్లో కూర్చున్నాడు. గడియారం వంక అదుర్దాగా చూస్తూ వుండిపోయాడు.

బీబీ అమరావతి దగ్గరకు రావడం తోటే, ముసలమ్మ ఆమె జుట్టు దొరకబుచ్చుకొని గుంజసాగింది. ఈ జుట్టు పట్టును విడవకుండ ఆమెను బాదుతోంది.

బీబీ అమరావతి బాధతో పెద్ద పెట్టున అరుస్తోంది. లాలా కాన్షీరామ్ ముకుందుడి తల్లిని విడదీయ టానికి ప్రయత్నిస్తున్నాడు. కాని ఆమెది రాక్షసి పట్టు. బీబీ అమరావతిని అటు యిటు ఊపివేస్తోంది. దులుపుతోంది. ఆమె ప్రాణాలు గాలిలో కలిసి పొతాయేమోనని అనుమానం. బయలుదేరింది.

చాచాజీ. ఆమెను యిక్కడే వుండనిస్తే యేం? - అని అరిచాడు సూరజ్ ప్రకాశ్.

'బీబీ అమరావతిని విడువు. బీబీని విడిచిపెట్టు' - అని అరిచాడు లాలా కాన్షీరామ్.

ముసలమ్మ యేడవడం ఆపుచేసింది. ఇప్పుడు ఆమె శక్తి అంతా బీబీ అమరావతిని పీల్చిపిప్పి చేయడంలోనే కేంద్రీకరించి వున్నాయి. బీబీ తనను తాను విడిపించుకుందుకు ప్రయత్నం చేస్తోంది. చేతులు ఊపుతూ గట్టిగా మూలుగుతోంది. కాని యేంచేసినా యేం అరిచినా ముసలమ్మ పట్టునుండి యివతల పడడం అసాధ్యం అయిపోతోంది. ఆమె ముఖంలో ఎంతో తృప్తి, ఆనందం కనిపిస్తున్నాయి. ఎన్నో సంవత్సరాలుగా తనను నిర్లక్ష్యం చేసినందుకు యిప్పుడు పగతీర్చుకుంటున్నట్లు వుంది, ఆ ముసలమ్మ, ముకుందుడి తల్లి.

ఈ అల్ల కల్లోలంలో - బీబీ అమరావతిని రక్షించటానికి అందరూ ప్రయత్నం చేస్తూ, తనమీద పట్టు సడలించడంతోటే, ముసలమ్మ ఉన్నట్లుండి అమరావతి మీద పట్టు. విడిచి పెట్టి లారీలోంచి కిందకు దూకి యింట్లోకి పారిపోయింది.

అంతా తృటిలో జరిగిపోయింది. ఆ క్షణానికి ముందు ఆమె బీబీ అమరావతిని కుదిపేస్తూ జుట్టు పీకుతోంది. ఈ క్షణంలో లారీలోంచి ముందుకు దూకి పరుగుతీసింది.

ఆమెను అనుసరించి పట్టుకోవటానికి ఎవరూ ప్రయత్నం చేయలేదు. ఏక కంఠంతో అందరూ అన్నారు 'ఆమెను వెళ్లిపోనివ్వండి' అందరూ బీబీ అమరావతి వైపు దృష్టి మరల్చారు. ఇప్పుడామె నీరసంగా లారీలో కూలబడిపోయింది అశక్తురాలైపోయి.

ఆడవాళ్లు ఆమెను సేదతీరుస్తున్నారు. మగవాళ్లు లాలా కాన్షీరామ్‌తో 'మనం వెళ్లిపోదాం యింక' అన్నారు. అవును తాము చేయవలసింది యిదే. ఆయన నింపాదిగా 'అలాగే పదండి' అన్నాడు.

కాని ఆయన మటుకు కదిలివచ్చి లారీలో తన సీట్‌లో కూర్చోలేదు.

అందరినీ ఓ గొప్ప నిశ్శబ్దం అవరించింది లాలా కాన్షీరామ్‌తో పాటు వాళ్లందరూ ఈ రెండు దివ్య భవనాలనూ చూస్తూ వుండిపోయారు. యుగాల తరుబడి యీ యిళ్లలో యెవరూ నివసిస్తూ వుండనట్లు ఆ భవనాలు అప్పుడే పాతబడిపోయినవిగా కనిపిస్తున్నాయి. వాళ్లంతా దిగాలుపడిపోయి చూస్తున్నారు. అన్ని తలుపులు, ద్వారాలు, కిటికీలు.... మూసుకు పోయి వున్నాయి. ముకుందుడి తల్లి వరండాలోని ఒకే ఒక ద్వారాన్ని మూసివేసింది. కొన్ని గంటలక్రితం యీ భవనాలు ఎంతో జీవంతో ఎగురుతూ గంతులు వేస్తూ వుండినాయి. పిల్లల అరుపులు, కేకలు పెద్దల రాగభావాల స్పందనలు. ఇప్పుడు ఆ భవనాలలో గడిపిన జీవితం - ప్రాణం - వృధా అయిపోయినట్లయింది. దూరం నుంచి చూస్తే అవేమంత కొట్టవచ్చినట్లు కనిపించే కట్టడాలు కాదు. రెండతస్తుల మేడలు అంతే వాటి గోడల రంగులు పెచ్చులు ఊడిపోతున్నాయి. రెండో యింటి ముందు బాల్కనీ పడిపోవటానికి సిద్ధంగా వుంది. అది తతిమ్మా యింటితో సమతలంలో లేదు. ద్వారాలు మాత్రం బలమైన చెక్కలతో చేశారు. సాదాసీదా తలుపులు. బరువుగా, అందవికారంగా వున్నాయి భవన కట్టడ సౌందర్యం ఉట్టిపడే యిళ్లు కావు అని. అయినా లారీలలో వున్నవాళ్లు మళ్లీ ఆ యిళ్లలో చేరాలనీ తమ జీవితాలు యధాపూర్వంగా గడుపుకోవాలనీ అభిలషిస్తున్నారు

లాలా కాన్షీరామ్ యిక అరుణ్‌తో 'పదండి, వెడదాం' అని చెప్పబోతూ వుండగా ఆ యింటి పై కప్పు నుంచి ముకుందుని తల్లి పెద్దపెట్టున చేసిన

హాహాకారపు నవ్వులు వినవచ్చాయి. అందరూ యింటిపైకి చూచారు. కాని ఆమె అక్కడ అగుపించలేదు. కాని ఆ హాహాకారం మటుకు - అలౌకికం, భయానకం అయినది - నవ్వులకంటె విపరీతమైన వాతావరణం మటుకు ఆ ప్రాంతామంతా అలుముకుపోయింది. ఆ నవ్వులు కేరింతాలు కొడుతూ వచ్చి వాళ్ల తలల మీద స్థావరించుకున్నట్లు అనిపించింది. కొంతసేపటికి యీ శబ్ద తరంగాలు ఆగిపోయాయి. కాని కొన్ని క్షణాలలోనే మళ్లీ వినిపించసాగాయి. ఈ మారు రెండో భవనం మీద నుంచి. బీబీ అమరావతి యింటిపైకప్పు నుంచి ... కాని త్వరలోనే ఆ నవ్వులు మొదటి అంతస్తు కిటికీలో నుంచి రాసాగాయి. తరువాత రెండో కట్టడం పైకప్పు నుంచి. తరువాత కొంతసేపటికి లాలా కాన్షీరామ్ నివశించిన భాగం నుంచి.

అందరూ నిస్తబ్ధులై పోయారు. ఎప్పుడో అర్ధరాత్రి ఏవో దుష్టశక్తులు వచ్చి యీ యిళ్లను ఆక్రమించుకుంటాయని అనుకోనక్కర్లేదు. మరేదో కర్కోటకమైన శక్తి యిప్పుడే వీటిని లోగొన్నది. బేస్‌మెంట్‌లో చిన్న చీకటి కోణం నుంచి - ఎన్నో సంవత్సరాలుగా పాతసీసాలు, డబ్బాలు, యింకా పనికిరాని సరంజామాతో కలిసిపోయి జీవించి - ఆ దుష్టశక్తి ఒక్కమారుగా సహస్రబహువులతో విజృంభిస్తున్నట్లుంది. పొగలాగ అది రెండు భవనాలను ఆక్రమించుకుంది. భూతంలాగ తయారయింది. అన్ని గదులను మూలమూలలను తిరుగుతూ వుంది. దాని మొదటి మాట భూత పిశాచాల ఆక్రందన, హాహాకారం.

ప్రభారాణి లాలా కాన్షీరామ్ భుజం నొక్కింది.

'పదండి. ఇంకవెళ్లిపోదాం...'

'అలాగే ! వెళ్లిపోదాం...' అన్నాడతను నీరసంగా

అరుణ్‌వైపు తిరిగి - అతను డేవిడ్‌సన్ సరసన మొదటి లారీలోనే కూర్చున్నాడు - లాలా కాన్షీరామ్ అతనికి చేయి ఊపి సైగచేశాడు. రెండో లారీలో తన సీటు వైపు నడిచాడు.

ఆ రెండు లారీలు ఫోర్ట్ స్ట్రీట్ నుంచి బయలుదేరి, ట్రంక్ బజార్ మీదుగా కంటోన్‌మెంట్‌లో వున్న కాందిశీకుల శిబిరం వైపు నడిచాయి

సాయంకాలపు మసకలలో - ముకుందుడి తల్లి వికటాట్టహాసం వాళ్లను చాలాసేపు వెంటాడింది అది అందరినీ నిర్వీర్యుల్ని చేస్తున్నట్లుంది ఇప్పుడు వెళ్లిపోతున్న వాళ్లనూ, ఈ రాత్రికి యిక్కడకు రాబోతున్నవాళ్లనూ !

# మొదటి అధ్యాయం

రోజంతా వాన భారీగా కురుస్తూ వుంది కాందిశీకుల శిబిరంలో మట్టి వీధులు చిన్న చిన్న బురద సెలయేరులుగా తయారయినాయి వీధులకు యిరుపక్కల వేసినడేరాల లోనికి నీళ్లు జొరబడుతున్నాయి

మధ్యాహ్నానికి మేఘాలు మటుమాయం అయినాయి సూర్యుడు ఎట్టకేలకు ప్రత్యక్షం అయ్యాడు పారలు తట్టలు తీసుకుని పనివాళ్లు సందులు శుభ్రంచేయబూనుకున్నారు పిల్లలు ఆడవాళ్లు తడిసిపోయిన వస్తువులను పైకి తీసి డేరాలలోనే కట్టిన దణ్ణేలమీద ఆరవేస్తున్నారు చాల మంది ఆడవాళ్లు చీరలు తీసివేసి, కేవలం పెట్టికోట్‌లతోనే తిరుగుతూ పని చేసుకుంటున్నారు చేతుల్లో చీపురులు ఆడిస్తూ డేరాలలోనుంచి నీళ్లను బయటికి గెంటుతున్నారు బయట సెలయేళ్లు లోనికి రాకుండా అడ్డకట్టలు వేస్తున్నారు.

ఈ సంవత్సరం ఋతుపవనాలు ఆలస్యం అయినాయి. ఇప్పటికి కొన్ని వారాలుగా అడపదడప వర్షాలు వస్తూనే వున్నాయి స్వాతంత్ర్యదినం ఆగస్టు 15 తేదీన కూడా వర్షం కురిసింది. ఆమహోత్సవ వార్తలు ఢిల్లీనుంచి యిక్కడకు అందనేలేదు. పాకిస్తాన్ ప్రెస్‌లో యీవార్తలు ప్రచురించలేదు. భారతదేశపు పత్రికలను యిక్కడకు రానివ్వడంలేదు శిబిరంలోని అనేక కుటుంబాలవారు ఆరోజున ఒకచోట గుమిగూడి కూర్చున్నారు. ఒకపక్కతమ వ్యక్తిగత దురవస్థకు చింతిస్తూవున్నా,గర్వాతిశయాలతో మరోపక్క ఆనందపడుతున్నారు.

ఫోర్ట్ బజారు నుంచి వచ్చిన కుటుంబాలకు నాలుగు డేరాలు యిచ్చారు అవి బహు చిన్న ఆర్మీ డేరాలు రెండు గుంజల మీదుగా అటు యిటు పరుచుకున్న కాన్వాస్ డేరాలు. ఒక్కోడేరా ఓ చిన్న కుటుంబానికి మటుకే సరిపడే స్థలాన్ని యివ్వగలదు. బీబీ అమరావతి కుటుంబానికి ఒక డేరా యిచ్చారు. సర్దార్లకు ఈషర్ కేర్ ప్రత్యేకస్థితిని గమనించి - ఒక డేరా యిచ్చారు. లాలా కాన్షీరామ్ తమతో పాటు పద్మిని, చాందినీలను బొగ్గుల

కొట్టు ఆమె, ఆమె కూతురు - ఒక డేరాలో వుండనిచ్చాడు తతిమ్మా కుటుంబాలన్నీ నాలుగో డేరా ఆక్రమించుకున్నాయి.

వాన కురిసి వెలసిన తరువాత ఇండియాలో ఓ కొత్త తాజాతనం ప్రసరిస్తుంది. ఈ మధ్యాహ్నం అదీ వాతావరణం లాలా కాన్షీరామ్ అరుణ్‌ను వెంట తీసుకుని షికారుకు వెళ్లాడు మబ్బుతునకలు లేని స్వచ్ఛమైన నీలాకాశంలో దూరపు జమ్మూప్రాంతం కొండలు అగుపిస్తున్నాయి. గాలి మట్టివాసనతో పరిమిళ భరితంగా వుంది. కంటోన్మెంట్‌లోని ఎర్రని ఆర్మీ బరాక్స్ వానకు తడిసి, శుభ్రంగా కడిగినట్లు అయి మరింత ఎర్రగా వెలుగుతూ కనిపిస్తున్నాయి వానవల్ల తటస్థించిన యిబ్బందులను సరిచేయటానికి ఆర్మీ మనుషులు యింకొంచెం సేపటిలో వస్తారని కాన్షీరామ్ ఎరుగును. అప్పుడు జనసంచారం యేమీ లేదు. రోడ్డు వార చెట్లు గాలికి తలలు ఊపుతున్నాయి

షికారునుంచి తిరిగివచ్చే సరికి డాక్టర్ చంద్రభాను, ఆయన భార్య తమ డేరాలో కూర్చుని వున్నారు. ట్రంక్‌బజార్లో ఓ చికిత్సాలయం నడుపుతూ వుంటాడు ఆయన. అప్పుడప్పుడు యింటికి వచ్చి పరామర్శించి వెడుతూ వుండడం పరిపాటి. స్వాతంత్ర్యానికి ముందు ఆయన కూడా శిబిరాలకు మారాడు లాలా కాన్షీరామ్ లోగడ ఆయన్ను చూచాడుగాని తీరుబడిగా మాట్లాడడం కుదరలేదు.

లాలా కాన్షీరామ్ వాళ్లను చూడడంతోటే, స్నేహపూర్వకంగా అడుగులు వేసి, చిరునవ్వుతో పలుకరిస్తూ 'చిట్ట చివరకు యెలాగయితేనేం మనకు కొన్ని నిమిషాలు విడిగా కూర్చుని మాట్లాడుకోగల అవకాశం చిక్కింది' అన్నాడు.

నేలమీద పరిచివున్న పక్కమీదనే ఒక పక్కగా కూర్చున్నారు డాక్టర్ చంద్రభాను, ఆయన భార్య. డాక్టర్ లేచి లాలాతో కరచాలనం చేశాడు.

'ఇది మా మహదవకాశం' అన్నాడు.

'డేరాలలో జీవనం ఎలా వుంది ?' అనడిగాడు లాలా కాన్షీరామ్ డాక్టర్ గారి భార్యను.

ఆమె అంటీముట్టనట్లుగా నవ్వింది లాలా కాన్షీరామ్ ఆమె యిక్కడకు వచ్చేందుకు ప్రత్యేకంగా ముస్తాబు అయిందని గమనించాడు ఆమె ముఖం అదోరకంగా వుంటుంది. గడ్డం తప్ప మరే భాగమూ స్పష్టంగా అగుపించవు జుట్టు దువ్వుమని వెనక్కు వేసుకుంటుంది చెవులకు లోలకులు తెల్లని సిల్క్‌బ్లౌజ్, తెల్లని మస్లిన్ చీర ధరించింది పంజాబీ చెప్పులు వేసుకుంది వాటి విపరీతమైన బంగారు జరీపని ఆకర్షవంతంగా వుంది డాక్టర్ చంద్రభాను కూడా చలువచేసిన తెల్లని దుస్తులు వేసుకుని వున్నాడు తలకు నల్లని టోపి

లాలా కాన్షీరామ్‌కు అర్థం కాలేదు. ఇలాంటి వర్షపు రోజులలో యీ ముస్తాబులన్నీ యేమిటి ?

ప్రభారాణి డేరాకు ఓ పక్కవేసుకున్న తెరమడుగు నుంచి చీర సవరించుకుంటూ యివతలకు వచ్చింది. ఇక్కడ సందర్శకులు - చూచిపోవటానికి వచ్చేవాళ్లు - లేనే లేరు అయినా ప్రభారాణి ముస్తాబు కోసం ఎలాంటి పట్టింపు యిచ్చేదీ లాలా కాన్షీరామ్ ఎరుగును ఆమె హడావిడిగా తయారు కావలసివచ్చింది యీ రోజున. ముఖంలో కొత్త సిగ్గును తురుముకుంటూ ఆమె వచ్చి డాక్టర్ భార్యపక్కన ఆశీనురాలయింది.

'ఈరోజు శుభదినం !' అంది ఆమె డాక్టర్ భార్యతో. డాక్టర్‌కు కూడా నమస్కారం చేసింది.

సందర్శకులకు సంతోషంగా చెప్పేమాట అది. మామూలుగా వచ్చినవాళ్లు కూడా 'మాకు శుభదినం యివేళ' అంటారు. కాని మిసెస్ భాను మాట్లాడకుండా వుండిపోయింది. ముందుకు జరిగి ప్రభారాణిని కౌగలించుకుంది అంతే

తరువాత, డేరాలో నిశ్శబ్దం ఆవరించుకుంది. డాక్టర్‌గాని ఆయన భార్యగాని యేమీ మాట్లాడలేదు. వాళ్లు అసౌకర్యంగా వున్నట్లు కూడా అనిపించడం లేదు. ప్రభారాణిని, లాలా కాన్షీరామ్‌ను చూస్తూ కూర్చుండిపోయారు.

ఈ నిశ్శబ్దం నుంచి యేదో ప్రమాద సూచిక వెలువడనున్నదని గమనించి లాలా కాన్షీరామ్ 'ప్రత్యేకంగా యేమన్నా సమాచారం వుందా ?' అనడిగాడు.

'ఉహు, ఏమీ లేదు' అంది డాక్టర్ భార్య, తల ఊపుతూ, లోలకులు ఆడిస్తూ. ఆమె అలా తల ఆడిస్తూనే వుంది. లోలకులు చప్పుళ్లు చేస్తున్నాయి. ఎందుకు చేయవు ? నికార్సయిన యిరవై రెండు కేరట్ల బంగారంతో తయారయినవి అవి !

తరువాత మళ్లీ నిశ్శబ్దం. లాలా కాన్షీరామ్ తన చొక్కా చేతులు పైకి కిందికి సవరించుకున్నాడు. ప్రభారాణి మిస్సెస్ భాను వంక చూస్తూ వుండింది. అరుణ్ తండ్రి పక్కన కూర్చున్నాడు. అతనికి డాక్టర్ అన్నా ఆయన భార్య అన్నా అంత మంచి అభిప్రాయం లేదు.

'మీకో దుర్వార్త చెప్పవలసి వస్తోంది, క్షమించండి. తప్పనిసరయి - యీ బాధ్యత మా మీద పడినందుకు ఎంతో విచారిస్తున్నాం' అన్నాడు చివరకు డాక్టర్ చంద్రభాను, లాలా కాన్షీరామ్‌తో. ఆయన గొంతు బరువుతో రుద్ధం అయిపోయింది. అయినా యిదంతా తెచ్చిపెట్టుకున్నదే.

'చెప్పండి'

'మీ అమ్మాయి మధుబాలను చంపేశారట...!' అన్నాడు చంద్రభాను యేదో ఉపన్యాసం యిస్తున్నట్లుగా.

అరుణ్ పెదవులు కొరుక్కున్నాడు. లాలా కాన్షీరామ్, ప్రభారాణి తమ స్నేహితులవైపు నిర్ఘాంతపోయి చూచారు.

'ఎవరు చెప్పారు ?' అనడిగాడు కాన్షీరామ్, తనకు తాను నిగ్రహించుకుంటూ సంయమనంతో.

'గుజ్రాత్‌కు చెందిన లాలా దీనానాధ్ !'

'అతనికి ఎలా తెలుసును ?'

'ఆ దుర్ఘటన జరిగిన రైలు పెట్టెలో వాళ్లు కూడా వున్నారట !'

'యే రైలు ?'

'వజీరాబాద్ నుంచి వస్తున్న రైలు. ఆమె సియల్‌కోటకు - మీ దగ్గరకు వస్తోందట ; తన భర్తతో పాటు !'

'అతను యేమయ్యాడు ?'

'అతన్నీ చంపేశారట !'

అరుణ్ తల్లిని గమనిస్తున్నాడు ఆమె యేడవడం లేదు. విస్మయంతో చంద్రభానును, ఆయన భార్యను చూస్తూకూర్చుంది కాని కన్నీళ్లు మాత్రం లేవు

అరుణ్ వైపు తిరిగి 'యిప్పుడు నీకు సోదరి లేదు' అంది

'అమ్మా, యివన్నీ చెప్పుడు మాటలు నిర్ధారణ అయ్యేంత వరకు నమ్మలేం' అన్నాడు అరుణ్.

డాక్టర్ భాను వయిపు తిరిగి 'లాలా దీనానాధ్‌ను మీరే కలుసుకున్నారా? ఎక్కడ ఉన్నారు ఆయన ? నేను కలుసుకుని వివరాలు తెలుసుకుందామను కుంటున్నాను' అన్నాడు.

'నిన్న రాత్రి ఆయన యిక్కడ వున్నారు వెంటనే కారులో జమ్మూకు వెళ్లిపోయారు'.

'అంత హడావడిగా వెళ్లిపోయారా ?'

'అవును. చాల త్వరగా వెళ్లాలన్నారు.'

ప్రభారాణి యిప్పుడు మళ్లీ తెరవెనక్కు వెళ్లింది. అరుణ్ ఆమె వెనకనే వెళ్లాడు. తల్లితో యేదో అనునయంగా చెబుతూ వుండడం వాళ్లకు వినిపిస్తోంది.

లాలా కాన్షీరామ్ 'ఈ సమాచారం నాకు ఒంటరిగా చెప్పివుండ వలసింది' అన్నాడు.

డాక్టర్ భాను, ఆయన భార్య నిరాశపడ్డట్టు అయ్యారు వాళ్లకు చావులు, పరామర్శ సమావేశాలు అంటే యిష్టం తాము హాయిగా తీరుగా కూర్చుని యిలాంటి యేర్పాట్లు చేస్తూవుండడం వాళ్లకు సరదా. మిసెస్ భాను. ప్రభారాణి యేడుస్తూ వుంటే ఓదార్చటానికి సిద్ధపడేది. గుండెలు బాదుకుంటూ వుంటే నిదానం చెప్పటానికి తయారయివచ్చింది. డాక్టర్ భాను గీతలో శ్లోక

పాదాలు గుర్తు చేసుకు మరీ వచ్చాడు. లాలా కాన్షీరామ్. ఆయన కుటుంబం - వాళ్లు ఎంత మాత్రమూ ఊహించని విధంగా ప్రవర్తిస్తున్నారు. విచారం ప్రకటించటానికి బదులు వాళ్లు తమ మీద కోపం ప్రదర్శిస్తున్నారు. లాలా కాన్షీరామ్ యిప్పుడు డాక్టర్ దంపతుల ముస్తాబు దుస్తుల వంక కర్కశంగా చూస్తున్నాడు. వాళ్లు యిది గమనించి కొంతలో కొంత పరితాపపడ్డారు.

లాలా కాన్షీరామ్ పక్కమీద నుంచి లేచాడు, యిక సందర్శకులు వెళ్లిపోవచ్చును అనిసూచిస్తూ. అరుణ్ యివతలకు వచ్చి మౌనంగా తండ్రి సరసన నిలుచూన్నాడు. డాక్టర్ దంపతులు కూడా గబగబ లేచి బయటకు నడిచారు, ఈ వార్త నిజం కాకుండా వుంటే బాగుండును... అన్నట్లు గొణుగుతూ. దేవుడికి మా విన్నపం, యీ మాట నిజం కాకూడదు.

వాళ్లు వెళ్లిపోగానే లాలా కాన్షీరామ్ డేరాలో మూలకు వెళ్లి తెరతొలగించి ప్రభారాణి కూర్చున్నచోటుకు చేరాడు.

ఆమె కటిక నేలమీద కూర్చుంది ఇంటినుంచి తెచ్చుకున్న కృష్ణ విగ్రహం వంక తేరిపార చూస్తూ వుంది. ఆమె యిప్పుడు కూడా యేడవడం లేదు. ఆమె ముఖంలో రక్తం అంతా ఓడ్చుకు పోయినట్లు అయింది. బుట్టబొమ్మలా కూర్చుని వుంది ఆమె. కనురెప్పలు కూడా ఆడించడం లేదు. అలా కొంతసేపు అయినాక, ఆమె రెప్పలు మూసుకుని కొంతసేపు వుండిపోయింది. తరువాత తేరపారచూస్తోంది.

'అమ్మా చెబుతున్నాను విను. ఇది నీలివార్త కావచ్చును. వాళ్లు కపటులు, దుర్మార్గులు. లేకపోతే యీ వార్త పనిగట్టుకు వచ్చి మనకు చెప్పరు. మధు సజీవంగానే వుండి వుంటుంది. చూస్తూ వుండు, ఆమె నుంచి మనకు కబురు వస్తుంది త్వరలోనే !' - అన్నాడు అరుణ్.

వాళ్లవంక చూడకుండానే ప్రభారాణి తల ఊపింది. లాలా కాన్షీరామ్ 'ఈ వార్త నిజానిజాలు కనుక్కునే ప్రయత్నం చేస్తాను. నువ్వు యిప్పుడేం దిగులు పెట్టుకోకు-' అన్నాడు.

నిద్రలో మాట్లాడుతున్న మనిషిలాగ ప్రభారాణి 'యీ వార్త నిజమే !' అంది.

గుండెల మీద అరచేయితో అదుముకుంటూ 'కొన్ని వారాల క్రితమే నాకు అనిపించింది, యేదో అశుభం జరగబోతోందని, అదేమిటో మాత్ర నాకు వివరంగా తెలిసిరాలేదు - అంతే !' అంది

ఆమె మాట్లాడుతూ వుండడం గమనించి లాలా కాన్షీరామ్ కొంత ఊరట పొందాడు.

'ఇది నీలివార్త మాత్రమే కాచ్చును' అన్నాడు మళ్లీ లాలా కాన్షీరామ్

'తల్లి హృదయానికి అన్నీ తెలుసు నాకు వేరే ఋజువులు, సాక్ష్యాలు అక్కర్లేదు' అంది ఆమె

ఆమె బరువుగా నిట్టూర్చింది

'దాని మరణం నన్ను దహించివేస్తూ వుండింది కాని అదేమిటో తెలుసుకోలేక పోయినాను తిరుగుతున్నాను, వండుతిన్నాను పనులు చేసుకుంటున్నాను. కాని లోపల యేదో ఆవేదన నాకడుపులో యెవరో ఓ రంధ్రం చేసినట్లు, నా శరీరాంగాలన్నీ దాన్లోంచి బయటకు పడిపోయినట్లు అనిపించింది నాకు. విచారం నన్ను పదే పదే కమ్ముకుంటూ వచ్చింది. అకారణంగా కళ్లు నీళ్లతో నిండిపోతున్నాయి. అవును - ఆ హత్య ఎప్పుడు జరిగిందన్నారు ?'

'నిన్న'

'అవును మన అమ్మాయి నిన్ననే చనిపోయింది. ఈ రోజు బుధవారం ఆమె మంగళవారం నాడు చంపబడింది. తదియతిథి నాడు. అప్పుడు నాకు దుఃఖం కట్టలు తెంచుకుపోయి, యే భావిలోనో నదిలోనో పడిపోయి ప్రాణాలు పోగొట్టుకోవాలని పించింది'.

'ఈ విషయం నాతో ఏమీ అననే లేదే నువ్వు ?' అని అడిగాడు లాలా కాన్షీరామ్.

'ఏమని చెప్పను ? ఎలా చెప్పను ? నాకు ఆలోచనలన్నీ యింటిని గురించి దుకాణాన్ని గురించే వుండి పోయినాయి. ఇప్పుడు కదా నాకు తెలిసింది యిదీ దుష్పరిణామమని !'

ఇప్పుడు ఆమె కళ్లు మూసుకుని, కెవ్వుమని ఒక కేక వేసింది. మూలుగు కాదు, ముక్కడం కాదు. చాలా వేదనతో కూడిన అరుపు. ఆర్తనాదం. దాని తర్వాత ఆమె నోరు కొద్దిసేపు తెరుచుకునే వుండిపోయింది. కళ్లు మూసుకుంది. ముఖ కవళికలు మారిపోతున్నాయి.

'మధు - మధు - మధు - మధు ---' అంటూ కంచుకంఠంతో పిలిచింది. కడుపు చించుకుని మరీ పిలిచింది

అరుణ్ ముందుకు జరిగి ఆమెను చేయిపట్టుకు కుదిపాడు. 'అమ్మా - నిజానిజాలు కనుక్కుందాం - నువ్వు ఊరటగా వుండు' అన్నాడు

'మీరు యేమయినా చేయండి నాకు మాత్రం నిజం తెలుసు'.

మళ్లీ ఆమె మధు - మధు - అంటూ ఎలుగెత్తి అరుస్తూ పిలిచింది

డేరా ముందు జనం గుంపుగా తయారయ్యారు. లాలా కాన్షీరామ్ బయటకు వెళ్లి వాళ్లను నిర్దాక్ష్యణ్యంగా చెదరగొట్టవలసి వచ్చింది. బీబీ అమరావతిని మటుకు లోనికి రానిచ్చాడు పద్మినిని చాందినిని గుమ్మం దగ్గర కూర్చోబెట్టి యెవరూ లోపలకు రాకుండా చూస్తూవుండమన్నాడు.

'రా, అరుణ్. ఈ విషయం నిజానిజాలు కనుకుందాం'

తండ్రి, కొడుకు డాక్టర్ చంద్రభాను వుంటున్న వీధికి వెళ్లారు. విచారించారు. వార్త నిజమయినదేనని తేలింది. వజీరాబాద్ దాటిన తరువాత కొద్దిమైళ్ల దూరంలోనే మధుబాల, ఆమె భర్త రాజీవ్ చంపివేయబడ్డారు. వజీరాబాద్ నుంచి సియాల్ కోట వచ్చే రైలు ఎక్కారట వాళ్లు. నిజామాబాద్ రెండో సిగ్నల్ దగ్గర యీ బండి ఆపివేయబడింది. రైలులో వున్న జనంలో హిందువులు, సిక్కులను వేరువేరు చేయడం జరిగింది. వాళ్లను నిర్దాక్షిణ్యంగా నరికి వేశారు. లాలా దీనానాథ్ అదే కంపార్ట్‌మెంట్‌లో వున్నాడు.

'ఆయన తప్పించుకోవడం ఎలా జరిగింది ?' అనడిగాడు అరుణ్.

'తాను ముస్లింనని చెప్పుకున్నాడు. తన పక్కన కూర్చున్న ముస్లింకు లంచం యిచ్చి సాక్ష్యం కూడా చెప్పించుకున్నాడు.'

లాలా కాన్షీరామ్ డేరాకు వచ్చినప్పుడు యే దుస్తులు వేసుకుని వున్నాడో యింకా అవే ఉడుపులలో వున్నాడు డాక్టర్ చంద్రభాను అయితే ఆ దర్పం, పరామర్శించే ధోరణి మటుకు యిప్పుడు లేవు. ఇప్పుడు ఆ కుటుంబం పట్ల నిజమైన జాలి, సానుభూతి వున్నాయి ఈ దుర్ఘటన తనకే జరగగల అవకాశం వున్నది - అన్నస్ఫురణ యేర్పడింది. ఈ రోజుల్లో యేదుర్ఘటన అయినా యెవరికయినా జరగడానికి వీలుంది ప్రస్తుతం తన బిడ్డలు అయిదుగురూ క్షేమంగా తన చుట్టూ కూర్చుని వున్నారు పాపం, లాలా కాన్షీరామ్‌కు యిద్దరు సంతానం అయితే, యిప్పుడు ఒక్కడు మాత్రమే మిగిలివున్నాడు

రైలును గురించిన వార్త శిబిరం అంతటా వ్యాపించింది. కొందరు జీవం నిలుపుకున్నవాళ్లు అక్కడకు చేరుకున్నారు కూడా. లాలా కాన్షీరామ్, అరుణ్ వాళ్లలో ప్రతి ఒక్కరినీ వరుసగా కలుసుకున్నారు. వాళ్లలో ఎవరూ మధును రాజీవ్‌ను ఎరుగరు. కాని రైలుపెట్టెలో జరిగిన ఘాతుక హత్యలను గురించి వర్ణించి మరీ చెప్పారు శిబిరం మొగదల ద్వారంలో వున్న సిపాయిలు కూడా యీ నిష్కారణ హత్యాకాండల గురించే మాట్లాడుకుంటూవున్నారు.

ఇక్కడికి కొన్నిమైళ్ల దూరంలోనే మధు శరీరం, కత్తివేట్లకు గురయి కుళ్లిపోతూ వున్నదని ఉహించడం లాలా కాన్షీరామ్‌కు దుస్సహం అయిపోతోంది. రైలు వచ్చింది నిన్న రాత్రియే కదా ! శవాల గుట్టలలో ఆమె శరీరం కూడా పడివుంటుంది

'అరుణ్, నీవు ఛౌద్రి బర్కత్ ఆలీని తీసుకుని స్టేషన్‌కు వెళ్లిరావాలి'

'అలాగే నాన్నగారూ ?'

అరుణ్ హృదయం యీ ప్రయాణానికి ఎగిరి గంతువేయసాగింది. అతనికి నగరానికి తిరిగి వెళ్లాలని, యేం జరుగుతోందో యేమిటో ప్రత్యక్షంగా చూచిరావాలని మనసు పీకుతూనే వుంది. కాని తల్లిదండ్రులు యీ మాటే తలపెట్టనివ్వడం లేదు, చెవిని పెట్టటం లేదు. స్వాతంత్ర్యం వచ్చి రెండు వారాలు అయిపోయింది. సియల్‌కోట యిపుడు పాకిస్తాన్ లో భాగం. అదే

యిదివరకటి నగరం అనుకోవటానికి వీల్లేదు  ఇప్పటికి కొన్ని వారాలుగా కాందిశీకులు నగరంలో తండోప తండలుగా ప్రవేశిస్తున్నారు. హృదయాలు బద్దలయిపోయిన మగవాళ్లు, ఆడవాళ్లు... కళ్లు తెరిచి చూస్తూ వుండడం తప్ప పూర్తిగా అర్థం చేసుకునే చాకచక్యం లేని పిల్లలు --- ఎందరో ! ఆగస్టు 15 తేదీ తరువాత యింకా అక్కడ ఎవరయినా మిగిలి వున్నారంటే వాళ్లను చంపివేసి వుండాలి, లేదా ముస్లిములుగా మార్చి వేసి వుండాలి - అనుకుంది ప్రభారాణి అది హిందువులు నివసించగల నగరం కాకుండా పోయింది.  అరుణ్ మటుకు తల్లిగారి మనోభావాలతో ఒకంతట అంగీకరం కుదుర్చుకోలేక పోతున్నాడు. అతని ఉద్దేశ్యం ప్రకారం పెద్దఎత్తున జరుగుతున్న హింసాకాండలన్నీ యీ సరికి సమిసిపోయి వుండాలి. నగరం దాదాపు మామూలు పరిస్థితకి చేరుకుని వుంటుంది  అయితే ముస్లిముల పాకిస్తాన్‌లో సుఖ జీవనం చేయటానికి అవకాశం వుందని తలపోస్తూ వచ్చిన తండ్రి గూడా యిప్పుడు నిరాశ నిస్పృహలలో మునిగిపోయి వుండడం, తనను సియల్‌కోట నగరంలోనికి వెళ్లనివ్వక పోవడం - జరుగుతోంది. అరుణ్ తల్లిదండ్రుల ఆజ్ఞకు కట్టుబడి వుండిపోవలసి వచ్చింది.

ఇప్పుడు ఆ తండ్రిగారే తనను నగరానికి వెళ్లమని ఆదేశిస్తున్నారు. అదీ సాయంకాల సమయంలో, యింకొంచెం సేపటికి చీకటి ముసురుకు వస్తుందనగా  అరుణ్‌కు అకస్మాత్తుగా తాను చాల పెద్దవాడు అయిపోయినట్లు అనిపించింది. జీవితంలో యిన్నాళ్లూ తాను కలలు కంటూ వచ్చిన సన్నివేశాలను ఎదుర్కొనేందుకు, ముఖా ముఖి సందర్శించేందుకు యిప్పుడు తనకు అవకాశం వస్తోంది  ఇన్నాళ్లూ తన ఊహలన్నీ బందీ అయిపోయివున్నాయి  తండ్రిగారు 'కాదు' అన్న చూపు ఒకటి విసరగానే అతని ఆశలన్నీ అడియాసలయిపోవలసిందే తప్ప యింకో మార్గం లేదు.

'ఏమిటి నీవు అంటున్నది ?' అని ఒక్కవాక్యం తండ్రిగారి నోటవెంట వచ్చిందంటే చాలు అరుణ్ నిలువెల్లా గజగజ వణికిపోయేవాడు. తల్లే కొంత వరకు నయం, ఆమె అతని అలోచనలను సమూలంగా పెరికి వేసేది కాదు తన అయిష్టాన్ని వెనువెంటనే బయటపెట్టేది కాదు. కాని ఆమె చిరునవ్వుతో అతని వంక చూచిందంటే చాలు . యిక తను ఆ పనిచేయడానికే వీలులేనట్లు

లెక్క ! తాను యింకా కుర్రవాడు, అనుభవ శూన్యుడు. బలం పుంజుకోనివాడు, అపరిపూర్ణుడు !

అరుణ్ తండ్రిగారి వంక చిరునవ్వుతో చూచాడు లాలా కాన్షీరామ్‌కు మటుకు అతను ఎందుకు నవ్వుతున్నాడో అర్థం కాలేదు మనసులోనే ఆలోచనలు చేసుకుంటున్నాడు అరుణ్. చనిపోయిన తన సోదరిని చూడవచ్చును, నూర్‌ను చూడవచ్చును.

కొన్ని అభ్యంతరాలు వెలువడ్డాయి .. అదేమిటి, నీ కొడుకును మృత్యు గుహ్వారంలోనికి పంపుతున్నావు ?.... కూతురు ఎలాగూ చనిపోయింది, ఇప్పుడు కొడుకు వెడితే మటుకు, ఆమె పునరుజ్జీవనం పొందుతుందా ?

ఈ అభ్యంతరాలు యేవీ లాలా కాన్షీరామ్‌ను తాకలేదు. అరుణ్ విషయం ఆయనకు భయం భయంగానే వుంది అతడికి యేదయినా ప్రమాదం తటస్థిస్తే తాను తట్టుకోవడం కష్టం. కాని.... కాని.... మధుబాలను నిర్దాక్షిణ్యంగా చంపివేశారు. కనీసం ఆమె శరీరాన్నయినా తీసుకువచ్చి అంత్యక్రియలు జరిపించడం తన విధి కదూ ? నిజానికి తాను స్వయంగా వెళ్లవలసిన సందర్భం యిది. కాకపోతే ప్రభారాణిని యీ సమయంలో ఒంటరిగా ఎదలి వెళ్లడం భావ్యం కాదనిపిస్తోంది. అరుణ్ తన తరువాత తనంతటి వాడు. ఎవరో ఒకరు వెళ్లక తప్పదు. ఈ ప్రయత్నంలో తాను కొడుకును కూడా కోలుపోయేట్లయితే. . సరి.... సరి.... లాలా కాన్షీరామ్‌కు ఈ ఆలోచన పూర్తిచేయడం, దానికొసను పట్టుకోవడం చేతకావడం లేదు.

రాజీ మార్గంగా ఒక ప్రణాళిక తయారుచేశారు. సూరజ్ ప్రకాశ్ కూడా అరుణ్‌తో వెడతాడు. సునంద యిందుకేమీ అభ్యంతరం చెప్పలేదు, బీబీ అమరావతి యింకా డేరాలో ప్రభారాణి దగ్గరే కూర్చుని వుంది. సూరజ్ ప్రకాష్‌కు తన వ్యక్తిగత క్షేమాన్ని గురించి యే మాత్రం బేఫరవాలేదు ; మూర్ఖత్వపు అంచుల వరకు పోగలడు. అతనికి కావలసినదంతా హడావుడి; అటుయిటు పరుగులు తీయడం, మానసిక ఆనందం : నాలుగు వారాలుగా యీ శిబిరంలో కట్టిపడేసినట్లుగా వుంది అతడి పరిస్థితి. నగరంలో తాను

చేయవలసిన పనులు అనేకం వున్నాయి చిల్లరమల్లరవి. అద్దెలు వసూలు చేయాలి ; పన్నులు కట్టాలి , కరెంటుకు నీళ్లకు అయిన డబ్బు చెల్లించాలి ఇళ్లకు వెల్లవేయించాలి. వాటాదారుల్లో తలఎత్తే చిలిపి తగాయిదాలను పరిష్కరించాలి... యిలా ! ఇక్కడ యీ శిబిరంలో అతనికి చేతినిండా కాదు గదా అసలు చేయటానికే ఎలాంటి పనీ లేకుండా పోయింది

ఇప్పుడు యీ అవకాశం వచ్చింది గనుక ఎగిరిగంతువేశాడు. అరుణ్‌తో ఆనందంగా కరచాలనం చేశాడు. రెండు సైకిళ్లు సంపాదించారు. వెళ్లటానికి సిద్ధం అయ్యారు. పై చూపులకు ముస్లిముల మాదిరికనిపిస్తే యింక తమక్షేమానికి యేమీ ధోకా లేదు. ఇది రహస్యం కొన్ని కొన్ని విషయాలు చిన్నవే. అరుణ్ ప్రకాష్‌కు ముస్లిముల 'కల్మా'ను గురించి చెప్పాడు టూకీగా ఇద్దరూ ముస్లిం పేర్లు పెట్టుకున్నారు. అడిగినప్పుడు యిదే పేరు 'టకీ' మని చెప్పాలి. సూరజ్ ప్రకాశ్ ఎడమ చేతి వెనకాల 'ఓం' అని పెద్దగా పచ్చబొట్టు పొడిపించుకున్నాడు. ఇప్పుడు అది కనబడకుండా చేతిరుమాలు చుట్టుకున్నాడు అక్కడ. మెడలకు రుమాళ్లు చుట్టుకున్నారు పనిలో వున్న ముస్లిం యువకులు యిలాగే రుమాళ్లు మెడలకు చుట్టుకుంటారు. అయితే యేదయినా ఉపద్రవం తటస్థిస్తే యిలాంటి చిన్న విషయాలు వాళ్లను రక్షించవు. బాగా పరీక్షకు వచ్చినప్పుడు నువ్వు 'సుంతీ' చేసుకున్నావా లేదా అన్న విషయం మీదనే నీవు ముస్లిమువు అవునా కాదా అన్నది తేలిపోతుంది ఎవరైనా పక్కన మరో ముస్లిం వుండి సాక్ష్యం చెబితే తప్ప, నీ బట్టలు విప్పేస్తారు. మర్మాంగాన్ని జనం అందరూ గుంపుగా పరీక్షిస్తారు. 'వీడు కాఫిర్, చంపివేయండి' అన్న అరుపులు వినవచ్చేంతలోనే కడుపులో కత్తి దిగబడిపోతుంది.

సూరజ్ ప్రకాష్ అరుణ్‌తో యేదో రహస్యం చెప్పాడు. ఇద్దరూ నవ్వుకున్నారు డేరాల వెనక మరుగుకు వెళ్లి యిద్దరూ పైతోలు వెనక్కులాగి పెట్టుకున్నారు

'ఇది యిలా వుండిపోతుందా ?' అనడిగాడు అరుణ్

'చూద్దాం'

ఆతురతగా అటుయిటు చూచి సూరజ్ ప్రకాష్ తన పైజమ కిందకు జారవిడిచాడు. అది సుంతీ అయినట్లుగానే కనిపిస్తుంది. దాని సైజు చూచి మాత్రం అరుణ్ దిగ్భ్రాంతి చెంది, తల పక్కకు తిప్పేసుకున్నాడు, నిరాశగా.

'నీది ఎలా వుంది ?' అన్నాడు సూరజ్.

'సరిగానే వుంది' అన్నాడు అరుణ్, చెంపలు ఎర్రబడుతూ.

'తోలు పొరపాటున కిందకు వచ్చిందంటే - చేతితో పైకి నెట్టివేయి. వాళ్లేం అంత పరీక్షగా చూడరు. పై పైన చూస్తారు, అంతే' అన్నాడు ప్రకాష్.

'సరే అలాగే లే !' అన్నాడు అరుణ్ విషయం మార్చాలనే ధోరణిలో

వాళ్లు శిబిరం వదలి వెళ్లేసరికి సాయంకాలం దాటి పోయింది. శిబిరం గేట్ల దగ్గర వాళ్లు ఎవరు వస్తున్నారు, ఎవరు పోతున్నారు అన్న విషయం అంతగా పట్టించుకోరు. శిబిరం కంటోన్మెంట్ ప్రాంతంలో వున్నది గనుక యిక్కడికి ముస్లిం గుంపులు వచ్చి దొమ్మీ చేస్తాయనే భయం యెంత మాత్రం లేదు. అయినా కొందరు ఆర్మీ భటులు ద్వారాల దగ్గర వున్నారు. శిబిరంలో వున్నవాళ్లు చాలామంది షికారుగా వెడుతూ పొలిమేరలు దాటిపోతారు. కొందరయితే నగరంలో ప్రవేశిస్తారు కూడా. కొత్తగా యేర్పడ్డ రెండు ప్రభుత్వాలు యింకా తమ విధానాలు యేమిటో నికరంగా తేల్చుకోలేదు. వాళ్లు యింకా కాందిశీకులు స్వగృహాలకు తిరిగి వెళ్లడాన్ని గురించి ప్రస్తావిస్తూనే వున్నారు. వాళ్లను ఒక ప్రాంతం నుంచి మరో ప్రాంతానికి తరలించటానికి యింకా రవాణా సౌకర్యాలు ప్రారంభంకాలేదు. ప్రారంభ స్థాయిలో నగరంలోనికి వెడుతున్న వాళ్లు తమ ఆస్థిపాస్తులు ఎలా వున్నాయో చూడటానికి మటుకే పోతున్నారు. ఇప్పుడు వాళ్లు యితర హిందువుల యిళ్లను దోచుకుని అక్కడి వస్తు సామాగ్రి కూడా తమదే అన్నట్లుగా శిబిరానికి తెచ్చుకుంటున్నారు.

లాలా కాన్షీరామ్ అరుణ్‌కు, సూరజ్ ప్రకాష్‌కు యిచ్చిన ఆదేశాలు అతి స్పష్టంగా వున్నాయి. వాళ్లు సరాసరి ఛౌద్రి బర్కత్ ఆలీ యింటికి వెళ్లాలి. ముందు రోడ్డుమీద నిలబడి గమనించాలి. ఆ యింటి ముందు జనం పోగయివుంటే.... అప్పుడు లోనికి వెళ్లగూడదు. జనం తొలగిపోయేంత వరకు

వేచివుండి ఆ తరువాతనే వెళ్లాలి తరువాత బర్కత్ ఆలీతో తాము విన్నదంతా చెప్పి అతనితోపాటు రైల్వేస్టేషన్‌కు వెళ్లి మధుబాల - రాజీవ్‌ల శవాలను వేరుచేసి వెంటనే శిబిరానికి తీసుకురావాలి ఏం చేయవచ్చును, యేమిచేయగూడదు - అన్న విషయంలో పూర్తిగా ఛౌద్రి బర్కత్ ఆలీ నిర్ణయం మీదనే ఆధారపడాలి ఎంత ఆలస్యం అయినా సరే - ఆ రాత్రికి రాత్రే శిబిరానికి తిరిగి వచ్చివేయాలి అలా రావడం యే కారణం వల్లనయినా కుదరకపోతే బర్కత్ ఆలీ యింటిలోనే వుండిపోవాలి

లాలా కాన్షీరామ్ అరుణ్‌ను కౌగలించుకున్నాడు. చెంప మీద ముద్దుపెట్టుకున్నాడు తనకు యిష్టం లేకపోయినా, సూరజ్‌ను కూడా ముద్దుపెట్టుకోవలసి వచ్చింది. లాలా కాన్షీరామ్ లాంటి పెద్దమనిషి యింత ఆత్మీయత చూపుతూ వుంటే సూరజ్ అక్కజ పడ్డాడు. అతను ఆనందోద్రేకంతో 'మీరేం బెంగపడకండి, చాచాజీ, యేం అంతా సాధించుకు వస్తాం. సురక్షితంగా పనిచేసుకువస్తాం' అన్నాడు.

వాళ్లు శిబిరం వదిలేటప్పటికి చీకటి ఛాయలు ఆ ప్రాంతాన్ని ఆక్రమించుకుంటున్నాయి. కంటోన్మెంట్‌ను, నగరాన్ని వేరుచేసే వంతెన మీదుగా వెళ్లారు. మైనాపురం వయపు సైకిళ్లు నడిపించారు

'ఒక్క నిమిషం ఆగు, అరుణ్' అన్నాడు సూరజ్ ప్రకాశ్.

వాళ్లు సైకిళ్లు దిగారు జేబులోంచి సిగరెట్ పెట్టి పైకి తీసి సూరజ్ ఒకసిగరెట్ ముట్టించాడు అగ్గిపెట్టికోసం చాలసేపు తడుముకో వలసి వచ్చింది. మొదటి పొగను నోట్లోంచి బయటకు పంపేసి యెంతో విశ్రాంతి పొందినట్లు హాయిగా నిట్టూర్చాడు.

'అబ్బ. ఈ దౌర్భగ్యపు శిబిరంలో నేను హాయిగా సిగరెట్ పీల్చుకోవటానికి కూడా వీలులేదు. జనం ఎప్పుడూ యేదో ఒక ఫిర్యాదు చేస్తూనే వుంటారు. ప్రశాంతంగా వుండనివ్వరు.'

అరుణ్ ముఖం వంక చూస్తూ - అతని ఆదుర్దా గమనిస్తూ, 'ఊ. నువ్వు కూడా ఒక సిగరెట్ పీల్చు అరుణ్. కొంత అలసట తీరుతుంది' అన్నాడు.

'ఉహు !' అన్నాడు అరుణ్. 'పోదాం పద'

వాళ్లు వేగంగా సైకిళ్లు తొక్కుతూ వెళ్లి మొదటి వరసయిళ్ల చెంతకు చేరుకున్నారు. అది నగరంలో అతి కొత్తదీ శ్రీమంతమయినదీ అయిన కాలోని. ఎక్కువగా పారిశ్రామిక వేత్తలు వుండే ప్రాంతం. వాళ్లు నగరంలోనే వృత్తి వ్యాపారాలు చేస్తారు. అయితే గృహస్థ జీవనం మటుకు యిలాంటి 'సబర్బన్' - నగరానికి తగుదూరంలో వున్న చోటే - బాగుంటుందని భావిస్తారు. ఈ కాలనిలో యిళ్లు పెద్దపెద్దవి బంగళాల మాదిరి వుంటాయి ఇంటిముందు ఆవరణలు, లాన్‌లు విస్తారంగా వుంటాయి.

ఇక్కడే మీ దారుణాలు జరిగినట్లు లేదు కాకపోతే అంతా ప్రశాంతంగా వుంది. జన సంచారం లేదు. చాల మంది జనం యిక్కడ నుంచి పారిపోయారు. బయటిగేట్లకు పెద్ద పెద్ద తాళాలు వేలాడుతున్నాయి ఇద్దరు కాపలాదార్లు - పోలీసులు - పచార్లు చేస్తున్నారు. ఈ ఆస్తులు యిప్పుడు పారిపోయిన వాళ్లు వదిలేసి వెళ్లినవి, ప్రభుత్వ ఆధీనంలో వున్నాయి.

రోడ్డుమీద ఎక్కువ మంది యెదురవలేదు. అడప దడప ఒకటి అరటంగాలు వస్తున్నాయి. వాటిలో సామాన్లో, మనుషులో; అప్పుడప్పుడు సైకిళ్ల మీద వెడుతున్నవాళ్లు అగుపిస్తున్నారు. అంతేగాని జనం గుంపులు యేమీ యెదురవలేదు ; ఎవరూ వాళ్లను అటకాయించలేదు.

లెవెల్ క్రాసింగ్ దగ్గర రైల్వే పట్టాలను దాటి వాళ్లు నగరంలో ప్రవేశించారు. అప్పుడు గాని వాళ్లకు నగరం ఎంత వినాశం అయిపోయిందో కళ్లకు కట్టినట్లు కనిపించలేదు. పెద్ద చౌక్ నుంచి మైనాపురం వయిపు మలుపు తిరిగే లోపలే వాళ్లు రెండు వందల గజాల దూరం సైకిలు తొక్కవలసి వచ్చింది. ఆ రోడ్డు పొడుగునా హిందూ కుటుంబాలు నివసిస్తూ వుండేవి యిది వరకు. ఇప్పుడు ప్రతి యిల్లు దహనం అయిపోయి కనిపిస్తోంది. మైనాపురంలో రెండు మతాలవాళ్లూ వున్నారు. హిందువులు, ముస్లింలు యిక్కడ వుంటారు. జనం హిందువుల యిళ్లు గుర్తుపెట్టుకుని వాటిని మటుకే దహించేశారు. మైనాపురం యిప్పుడు బోసిపళ్ల నోరు తెరుచుకు వున్నట్లుగా కనిపిస్తోంది. అడుగడుగునా కాలిపోయిన యిళ్లు, ఊడిపోయిన కళ్లలాగ. ఈ యిళ్లు పూర్తిగా కాల్చివేయలేదు.

పై కప్పులు మాత్రం కాలిపోయి యిల్లంతా నల్లరంగు పులుముకుపోయింది. కొన్ని సందర్భాలలో కొంత యిల్లు కాలిపోయిన మీదట, తతిమ్మా దంతా దానంతట అదే నేల మట్టం అయిపోయింది కాలిన భస్మం రోడ్డుమీద విస్తారంగా పరుచుకుంది ఆ యిళ్లన్నీ పునాదుల వరకు కాలిపోయి, లేక కూలిపోయి వికృతంగా కనిపిస్తున్నాయి

అయితేనేం, బజార్లలో నిత్యకృత్య వ్యవహారాలు జరిగిపోతూనే వున్నాయి హిందువుల దుకాణాలు తప్పించి, తతిమ్మావన్నీ తెరుచుకుంటున్నాయి. ఇప్పుడే దీపాలు వెలిగించారు , వ్యాపారం వేగం పుంజుకుంటూంది బురఖాలు వేసుకున్న ముస్లిం స్త్రీలు, సంప్రదాయ సిద్ధంగా నల్లరంగు ముసుగులు, యితర రంగుల దుపట్టాలు -- యివన్నీ శోభయమానంగా వెలుగుతూ తిరగడం కనిపిస్తోంది ఒక్కోసారి దుకాణం చెంతకు వెళ్లాలంటే కాలిన రాశులను దాటి అడుగులు వేయవలసివస్తోంది జనం అలాగే తలలువంచుకుని నడుస్తున్నారు. తమ తప్పిదం యిప్పుడిప్పుడే తెలసి వస్తున్నట్లుంది వీధుల్లో బాటల వెంట సరుకులు అమ్మేవాళ్లు చిన్న చిన్న నూనెదీపాలు, గ్యాస్ లాంతర్లు వెలిగించుకున్నారు. 'చమన్ నుంచీ వచ్చిన ద్రాక్ష పళ్లు . ద్రాక్షగుత్తులు . చమన్' అనే అరుపులు, కేకలు వినవస్తున్నాయి. 'అరటి పళ్లు అరటి పళ్లు ఇళ్లకు తీసుకు వెళ్లండి ..' 'చేపలు... వేయించిన చేపలు .' ఈ చేపల వాసన చాల దూరం వరకు అరుణ్‌ను వెన్నంటింది. బహుశ యిలాంటి వాతావరణం ఇండియాలో కూడా వుంటుంది. కాని యిలా జనం తమకంతో అరుస్తారా ? నోళ్లలో యేదో సన్నటి గొట్టం పెట్టుకున్నట్లు, అరచిన చాలసేపటి వరకు ప్రతిధ్వనులు వాతావరణంలో చుట్టు ముడుతున్నాయి.

అరుణ్‌కు మైనాపురం బాగా తెలుసు. ఈ ప్రాంతంలో కొత్త వ్యాపారస్థులు ప్రవేశించడం కూడా గమనించాడు ఆ దుకాణాల ముందు గొగ్గులు గొగ్గులుగా వ్రాసిన ఉరదూ 'నేమ్ బోర్డులు' వేలాడుతున్నాయి. వీళ్లు ఇండియా నుంచి వచ్చిన ముస్లిం కాందిశీకులు అయివుంటారనుకున్నాడు. చిన్న చిన్న దుకాణాలు, ఎక్కువ అమ్ముడు వస్తువులు కూడా లేవు లోపల. గొడుగులు, పాద రక్షలు, అల్లిక సామాన్లు, వంట సామాన్లు... యిలా. ఆ

దుకాణదారులు కూడా అంత లక్షణంగా కనిపించడం లేదు. నల్లని చర్మం, సన్నగా పొట్టిగా ఆకారాలు, ఎర్రబారిన గొగ్గిపళ్లు. తమలపాకులు నములుతూ ఎక్కడపడితే అక్కడ ఉమ్మివేస్తున్నారు. వాళ్లంతా యిక్కడ యేం చేస్తున్నట్లు? వాళ్లకు యిక్కడి మనుషులతో, వాతావరణంతో యెలాంటి సారూప్యం లేదు. విధి తెచ్చి యిక్కడ పడవేసింది వాళ్లను, అంతే ! ఉర్దు అక్షరాలు తప్పులు లేకుండా రాయడం ఎట్లానో గూడా వాళ్లకు బాగా తెలియదన్నమాట ! ఆ దుకాణంలో బోర్డులే యిందుకు సాక్ష్యం. అసలు ఉరుదూ భాషలో వున్న గొప్పదనమే అక్షరాల సుందర రూపం. ఈ ముస్లింలు సెంట్రల్ ప్రావిన్సెస్ నుంచో బీహార్ నుంచో వచ్చినట్లున్నారు. వీళ్లకు యీ భాషలో వున్న లాలిత్యం, చక్కదనం యేమాత్రం తెలియదు.

అరుణ్ మళ్లీ ఒకమారు దుకాణాల వంక చూచాడు. ఇదివరకు హిందూ దుకాణం వున్నచోట యిప్పుడు యిలాంటి చిన్నకొట్లు స్థావరించుకున్నాయి. వాటి చుట్టూ వినాశం, విషాదం గూడుకట్టుకుని వుంది. అరుణ్ మళ్లీ ఆ మనుషుల వంక చూచాడు. వాళ్లు చూడడానికే అతి దుర్భరంగా వున్నారు. అల్లా పేరిట అడుగుతున్నాడు అరుణ్ -- వీళ్లు యింత దుఃఖపూరితులై మూర్తీభవించిన శోకంలా ఎందుకు వున్నారు ? వాళ్లు కోరుకున్న పాకీస్తాన్ వచ్చేసింది గదూ ! ఇంకెందుకు యీ యేడుపు గొట్టుతనం?

దారిలో యేమీ దుర్ఘటనలు లేకుండానే ఛౌద్రి బర్కత్ ఆలి యింటికి చేరుకున్నారు. కింది వరండాలో సైకిళ్లు నిలుపుకుని మెట్లెక్కి పైకి వెళ్లారు. తలుపు తట్టారు.

మునీర్ తలుపు తెరిచాడు. మునీర్, ఛౌద్రి కాంది శీకుల శిబిరానికి వెళ్లి తరచుగా లాలా కాన్షీరామ్ కుటుంబాన్ని చూచి వస్తూనే వున్నారు. పోయినసారి వెళ్లి వచ్చి యింకా రెండు రోజులు కూడా కాలేదు మునీర్ అరుణ్ యిలా వస్తాడని ఊహించలేదు. అందుచేత అతన్ని చూడడంతోటే దిగ్భ్రాంతుడై నిలబడిపోయాడు.

అతన్ని ఆప్యాయంగా కౌగలించుకుని 'అరుణ్' అన్నాడు ఆత్మీయంగా

తరువాత సూరజ్ ప్రకాశ్‌తో కరచాలనం చేశాడు. ఇద్దరినీ లోపలి గదిలోనికి తీసుకుపోయాడు మగవాళ్ల గదుల్లో యిదే ప్రధానమైనది పెద్దగా దీర్ఘచతురస్రాకారంలో వుంది.

గదిలో ఎక్కువ సరంజామా లేదు ఒక మూలగా ఎత్తుయిన మంచం దాని మీద పువ్వుల దుప్పటి అందంగా పరచివుంది. పరుపు మీద రకరకాల గుండ్రని దిండ్లు అమర్చివున్నాయి. గదిలో ఒక పక్క అరడజను బలమైన ఫ్రేము కుర్చీలు వున్నాయి పక్కకు సరసనే పెద్ద హుక్కా స్టాండ్ వుంది. దాని మట్టిగొట్టం నుంచి సన్నగా పొగవస్తోంది. ఎవరో యింతవరకూ ఆ మంచమీద కూర్చుని వుండి హుక్కా పీలుస్తూ వుండి ఉండాలి, బహుశ ఛౌద్రి బర్కత్ అయివుంటాడు గదిలో నాలుగు మూలల ఉమ్మివేసుకునే పాత్రలు వున్నాయి. గోడవారగా చదువుకునే బల్ల, దానిమీద ఎనామిల్ వేజ్. దానిలో ఒకే ఒక గులాబి పువ్వు.

అరుణ్ యీ గదిలోనికి రావడం తోటే, యిది తమ పూర్వపు యింటి గదితో యేమాత్రం భేదించలేదనుకున్నాడు. నాన్నగారు కూర్చునే పడుకునే గదిగూడా యిలాగే వుండేది. తేడా అల్లా ఒక్కటే తమ యింట్లో గోడలకు దేవుళ్ల బొమ్మలు, పూర్వీకుల ఫోటోలు వేలాడుతూ వుండేవి ఇక్కడ మాత్రం అల్లా పేరు వ్రాసిన బొమ్మ చత్రాలు వేలాడుతున్నాయి. అరబిక్ భాషలో వ్రాసిన యీ చత్రాలు వూగుతూన్నాయి. ఒకదాని పక్క మరొకటి. అల్లాపేరు చాల సుందరంగా సున్నితంగా వ్రాశారు. రంగు బ్యాక్ గ్రౌండ్ మీద, తతిమ్మా భాగం అంతా మొసాయిక్ అలంకారాలతో నిండి వుంది. ముస్లిం భవనాల యింటి కప్పుల పై యిలాటి సుందర చిత్రాలే వుంటాయి.

రెండు యిళ్లలోని పెద్ద గదులూ దాదాపు ఒకటే మోస్తరుగా వున్నాయి. రెంటినీ చూచినప్పుడు పొదుపరితనం, పవిత్ర కార్యశీలత స్ఫురిస్తాయి ఆ రెండు కుటుంబాలను, యిళ్లను చూచిన యే కొత్త వాడికయినా బహు తేలికగానే తెలిసి వస్తుంది యీ రెంటికీ ఒకే భూమిక, ఒకే ఆదర్శం వున్నాయని

'అబ్బా, చూడు ఎవరు వచ్చారో! అరుణ్ వచ్చాడు,' అన్నాడు మునీర్.

మగవాళ్ల గదులకు, ఆడవాళ్ల గదులకు మధ్య విశాలమైన ఆవరణ వుంది. ఈ ఆవరణలోనే వంట గది, స్నానాల గది, మరుగుదొడ్లు వున్నాయి. ఆవరణ నిజానికి స్త్రీల వాటాలలో అంతర్భాగంగానే వుంటుంది. ఎందుకంటే ఎక్కువగా ఆడవాళ్లే అక్కడ తిరుగాడుతూ వుంటారు. మగ వాళ్లు రావాలంటే చెప్పి మరీ వస్తారు గాని జొరబడుతూ రారు.

అరుణ్ వచ్చాడని మునీర్ చెప్పగానే ఆవరణలో ఒక పాత్ర చేతులు జారి కింద పడింది. దొర్లుకుంటూ చప్పుడు చేస్తూ నేల మీద ప్రయాణం చేసింది.

అరుణ్‌కు, మునీర్ తల్లిగారు నెమ్మదిగా అనడం వినిపించింది: 'జాగ్రత్త, నూర్ - పాలన్నీ వలికిపోయాయి.'

బర్కత్ ఆలీ తెర తొలగించుకుని ఆవరణలోనుండి బయటకు వచ్చాడు.

'ఆహా! స్వాగతం... అబ్బాయీ. స్వాగతం.... రా... రా....' అరుణ్, సూరజ్ మహమ్మదీయ పద్ధతిలో ఆయనకు శుభాభివందనలు తెలిపారు, కొద్దిగా వంగి - కుడిచేతిని నుదుటిదాకా తీసుకు వెళ్లి - అన్నాడు. 'అల్లా మిమ్ము యిద్దరికీ ఆశీర్వదిస్తాడు.'

తరువాత అరుణ్‌ను ఆదుర్దాగా అడిగాడు 'అంతా సరీగా వుందా? యేమీ విపర్యయం లేదు గదా - అరుణ్' అని.

'బాబాజాన్, మధును ఆమె భర్త రాజీవ్‌ను చంపేశారట!'.

ఛౌద్రి యింకా నోరు మెదపలేదు. వెనక ఆవరణలోంచి ఓ స్త్రీగొంతు 'అయ్యో అల్లా..' అని వినిపించింది.

అది బీగం బర్కత్ ఆలీ గొంతు. ఆమె తెర తొలగించుకుని ఆవరణ దాటి గదిలోనికి రానే వచ్చింది. అరుణ్‌తోపాటు యింకెవరో మనిషి వున్నాడని యెరుగను. కాని ఆమె ఒక్కక్షణం కూడా బయటకు రావటానికి తటపటాయించలేదు. ముఖం మీద కళ్ల వరకు దుపట్టా వేసుకుంది. గది మధ్య వరకూ నడిచి అరుణ్ చేయి పుచ్చుకుని 'అరుణ్ యేమిటి చెబుతున్నావు నువ్వు' అని అడిగింది.

'బాబీజాన్ అదీమేం విన్నమాట' అన్నాడు అరుణ్ కన్నీళ్లు ధారపాతంగా ప్రవహిస్తూవుండగా.

తన బుజం మీద ఆమె చేయి ఊరటగా వున్నప్పుడు అరుణ్‌కు అనిపించింది తనను ఆవరించి వున్న దుఃఖం ఎంత దారుణమైనదో, సోదరి హత్య తనను ఎంత వ్యధపాలు చేస్తోందో! తండ్రిగారు యీ మాట విన్నప్పుడు తమ నిదానాన్ని కోలుపోలేదు. తల్లి అయితే కోమాలోనికి వెళ్లిపోయింది. ఈ సాయంత్రం అంతా అరుణ్ ఒక చోటు నుంచి మరో చోటుకు కదులుతూ తిరుగుతూనే వున్నాడు ఆమె మృతి పట్ల విచారం, దుఃఖం తననూ మింగివేస్తున్నా యింత వరకూ హుందా తనాన్ని కోల్పోకుండా జాగ్రత్త పడ్డాడు. తీరుబడిగా యేడవటానికి కూడా అవకాశం దొరకలేదు ఇప్పుడు తనను మాతృ సమానురాలయిన ఆమె బుజం మీద చేయివేసి ఓదారుస్తూ వుంటే యేమేమిటో అనిపించింది. ఆమెకు తనతల్లికి శరీర నిర్మాణంలోను, వయస్సులోను సరయిన పోలికలే వున్నాయి. కాని యీమెలో మధు లాగ చలాకీ తనం, లాలిత్యం ఎక్కువగా వుంటాయి మధులాగానే ఈమె కళ్లలోనూ వినయ విధేయతలు కాక స్వాభిమానం అతిశయం ఉబుకుతూ కనిపిస్తాయి. ఒక పిల్ల తల్లి అయినా - అంత అందమైన నూర్‌ను యిచ్చినా - యింకా యీమె శరీరం తన తల్లిలాగా కాక మృదు కోమలంగా సుకుమారంగానే వుంటుంది. ఆమె హృదయంవిప్పి మాట్లాడుతూ వుంటే అరుణ్‌కు అదే పనిగా యేడవాలని అనిపించింది.

తనను తాను సంబాళించుకుంటూ అరుణ్ యింతవరకు తెలియ వచ్చిన వివరాలు వాళ్లకు చెప్పాడు. అక్కడక్కడ మధ్యలో సూరజ్ ప్రకాశ్ ఒకటి రెండు వాక్యాలు జోడించ వలసి వచ్చింది.

'మనం స్టేషన్‌కు వెళ్లాలి--' అన్నాడు చౌద్రిబర్కత్ ఆలి. 'ముందు వీళ్లకు తాగటానికి మేమయినా యివ్వనివ్వండి--'అంది ఆయన భార్య. అరుణ్‌ను చేయి పుచ్చుకునడిపిస్తూ 'అల్లా..... అల్లా.......' అంటూ నిట్టూర్పులు విడుస్తూ అతన్ని లోనికి తీసుకుపోయింది.

నూర్ తల నడుము వంచుకుని కూర్చుంది వంటి గదిలో. ఆమె అంతా విన్నది. తల్లి దగ్గరకు రావడంతో ఆమెను వాటేసుకుని యేడుస్తూ 'అమ్మా...

అమ్మా అంతా యిలా ఎందుకు జరిగింది? మధు అక్కను ఎందుకు చంపేశారు.... ఎంత దారుణం..?' అంటూ పిచ్చెక్కిన దానిలా తయారయి పోయింది.

'నిదానం. అమ్మాయీ నిదానం. అంతా అల్లాకే తెలియాలి మనకేం ఎఱుక? అంటూ నూర్ తల ఊరటగా, తడిమి 'అరుణ్‌కు అతని స్నేహితుడికీ ముందు టీ సిద్ధం చెయ్యి--' అంది.

రొమ్ము యింకా ఎగసి పడుతూ వుండగానే నూర్ పొయ్యి మీద గిన్నె వుంచింది అరుణ్ చేతులు తన చేతుల్లోకి తీసుకుని, తన తలమీద పెట్టుకొని వాటిలో మునిగిపోయి యేడుస్తూ వుంది. బీగం బర్కత్ ఆలీ చూస్తూ వుండింది. వాళ్ళ నిద్దరినీ వేరు చేసే ప్రయత్నం యేమీ చేయలేదు. మునీర్ కూడా యీ సరికి యిక్కడకు వచ్చి మౌనంగా వాళ్లిద్దరి పక్క నిలబడ్డాడు.

ఒక గ్లాసు టీ సూరజ్ ప్రకాష్‌కు పంపి తతిమ్మావాళ్లందరూ యీ ఆవరణలోనే టీ తీసుకున్నారు. ఆవరణలో మంచాలు వున్నాయి నూర్ తల్లిని కరుచుకుని కూర్చుని వుంది. ఆమె కళ్లు యేడుపుతో ఎర్రబారినాయి అరుణ్ సాధ్యమయినంత తక్కువ చప్పుడు చేస్తూ టీ తాగుతున్నాడు. అంతా ప్రశాంతంగా వుంది పరిస్థితి. ఎవరూ తమ వంక చూడడం లేదని నిర్ధారణ అయినప్పుడు అరుణ్, నూర్ ఒకళ్ల నొకళ్లు చూచుకుంటున్నారు. నూర్ అప్పుడప్పుడూ కళ్లు కిందకు దించుకుని పాదాలవంక చూచుకుంటూంది.

వాళ్లు వెళ్లిపోవటానికి లేచారు. బీగం బర్కత్ ఆలీ భర్త అడిగిన డబ్బు తెచ్చి యివ్వటానికి లోపలకు వెళ్లింది. మునీర్, నూర్, అరుణ్ యిప్పుడు ఆవరణలోనే మిగిలి వున్నారు. మునీర్ ఉనికిని గమనించనట్లుగా అరుణ్ నూర్ చేతిని తన చేతిలోనికి తీసుకుని వేళ్ల చివరలను ముద్దాడాడు ఆమె చేయి వెనక్కు తీసుకుంటూ పెద్దగా గాఢంగా ఓ నిట్టూర్పు విడిచింది.

మునీర్ దూరపు బంధువు - కలీల్ అహ్మద్ అతని పేరు ; వాళ్ల యింటనే వుంటాడు - వాళ్ల నౌకరు వృద్ధుడు నీయజ్ హుస్సేన్ వీళ్లతోపాటు స్టేషన్‌కు అనుసరించాడు మునీర్, ఖలీల్ వీళ్లు శిబిరం నుంచి తీసుకువచ్చిన

సైకిళ్లు తొక్కుతున్నారు. తతిమా వాళ్లంతా ఓటాంగాలో బయలుదేరారు. నీయజ్ హుస్సేన్ యీ కుటుంబంతో చాలాకాలంగా వుంటున్నాడు. అతను బాగా వయసు మీరిన వాడు. అరుణ్ ఎరిగినప్పటి నుంచి అతను అలాగే వున్నాడు. ఏమీ మార్పులేదు. వయసు యెదుగుదల శరీరం మీద ప్రభావం చూపించలేదు. తెల్లని గడ్డం. ముస్లిం ఆచారం ప్రకారం గడ్డం చుట్టూ చక్కగా కత్తిరించుకుంటాడు. చేతిలో ఒక జపమాల పట్టుకుని మగవాళ్ల గదుల దగ్గర కూర్చుని వుంటాడు. అతను ముఖ్యంగా బయటిపనులు చూస్తూవుంటాడు. ఛౌద్రి బర్కత్ అలీ కర్మాగారంలో పనిచేసేవాళ్లు యజమానితో మాట్లాడటానికి వచ్చినప్పుడు అతనే ముందుగా పలుకరించి వాళ్ల వ్యవహారాలు చూస్తాడు. అతను 'ఫకీర్' (సాధువు) లాగా ఉంటాడు చూచేందుకు. అతన్ని ఆ యింటివారంధరూ సేవకునిలాగ కాకుండా పూజనీయమైన వ్యక్తిగా చూస్తారు. టాంగాలో కూర్చునప్పుడు అతను అరుణ్ చేతిని తన చేతుల్లోనికి తీసుకున్నాడు. నోటిమాటలతో పని లేకుండా అతనికి ఊరట కలిగించటానికి ప్రయత్నిస్తున్నాడు. అప్పుడప్పుడు కొరాన్‌లోని పవిత్ర సూక్తులు ఉచ్చరిస్తున్నాడు.

స్టేషన్ నిర్మానుష్యంగా వుంది. మామూలుగా అది చాలా కార్యకలాపాలు వున్న స్టేషన్. రైలు బండ్లు రావడం, పోవడం లేనప్పుడు కూడా అనేక పనులతో జనం అటు యిటు మసులుతూ వుంటారు. రైలు పెట్టెలను పక్కలైన్ల మీదకు పంపడం, సామాను ఎత్తడం దింపుకోవడం, చాలమంది కూలీలు ప్లాట్‌ఫారాలమీద కూర్చుని ఉబుసుపోక కబుర్లు చెప్పుకుంటూ వుండడం జరుగుతూ వుంటుంది. ప్లాట్‌ఫారం మీద ప్రయాణీకులు పరుచుకుని వుంటారు. అనేక కుటుంబాలు అక్కడ మసలుతాయి. వంటలు చేసుకోవడం, తినడం, కబుర్లాడుకోవడం అక్కడే. ఈ రోజు మాత్రం అక్కడ యెవరూ కూలీలు లేరు, ప్రయాణీకులూ లేరు. రైలు వస్తున్నచప్పుళ్లు, పెట్టెలు అటుయిటు కదలాడుతున్న సవ్వడులు వినరావడం లేదు.

చాలా మంది పోలీసులు వివిధ తావుల్లో నిలచివున్నారు. ఊడ్చేవాళ్లు తమ నీలి యూనిఫారాలలో హడావడిగా తిరుగాడుతున్నారు. ప్రవేశ ద్వారం వద్ద పోలీసులు నిలబడి రాకపోకలు సమర్థిస్తున్నారు.

ఛౌద్రి బర్కత్ ఆలీ యేం యేం చేయాలా యెలా చేయాలా అని తటపటా యిస్తున్నాడు. ఇంతలో ఒక పోలీస్ ఆఫీసర్ అయన చెంతకు నడిచి వచ్చాడు.

'అస్సాలం - ఓ - అలైకుమ్ ; ఛౌద్రి సాహెబ్' అంటూ బర్కత్ ఆలీకి సలాం చేశాడు. 'ఇంత చీకటి పడిపోయి, యిక్కడ యేం చేస్తున్నారు మీరు?' అని అడిగాడు.

'ఇతను నాకు పరిచితుడే' అన్నాడు బర్కత్ ఆలీ, అరుణ్‌తో

బర్కత్ ఆలీ అతనితో సంప్రదించాడు కొంతసేపు 'నిన్నరాత్రి వజీరాబాద్ నుంచి ఒకరైలు వచ్చిన మాట వాస్తవమే. దానిలో ఎన్నో మృతదేహాలు వున్నాయి. చనిపోయిన వాళ్లను గుర్తుపట్టే ప్రసక్తే లేదు.- ఈ రోజు ఉదయం నుంచీ దహనం చేస్తున్నారు, ఆ శవాలను ఆ పని దాదాపు పూర్తయి పోయినట్లే చివరి గుంపును యిప్పుడే ఖననం చేయబోతున్నారు.'

'ఎక్కడ ?'

'మూడో ప్లాట్‌ఫాం దగ్గరున్న బయలు స్థలంలో'

ఛౌద్రి బర్కత్ ఆలీ ఆ ఆఫీసర్‌ను పక్కకు తీసుకువెళ్లి రహస్యంగా యేదో మాట్లాడాడు, కొన్ని నిమిషాల పాటు. ఆఫీసర్ అరుణ్ వంక ఉత్సుకతతో చూస్తున్నాడు.

ఆఫీసర్ తిరిగి వచ్చి వేచివున్నవాళ్లతో 'ఇక నాతో రండి-' అన్నాడు.

మొదటి ప్లాట్‌పాం నుంచి మూడో ప్లాట్‌ఫాంకు దారితీసే బ్రిడ్జ్ మీదకు ఎక్కారు బరువయిన ఇనుప వంతెన అది రైల్‌వే వాళ్ల ఎర్రని రంగుతో పెయింట్ అయివుంది. అరుణ్ ఆ వంతెన మీదుగా నడుస్తూ వుండగా గొంతులో యేదో అడ్డం పడినట్లు అయింది. వంతెన మీదనుంచే కనిపిస్తోంది మూడో ఫ్లాట్‌ఫాం. ఆవల ఎగిసిపడుతున్న అగ్నిజ్వాలలు గుడ్స్ యార్డ్‌కు ఆవల నాలుగు అగ్నిగుండాలు శిఖలు ఆకాశంలోకి ఎర్రగా దూసుకు పోతున్నాయి.

వాళ్లు ప్లాట్‌ఫాం నుంచి కిందకు దూకి, ఎన్నో రైలుపట్టాల దొంతరలు దాటివలసి వచ్చింది ఆ ప్రదేశానికి చేరుకునేందుకు. ఆ తాపం భరించడం కష్టంగా వుంది. నాలుగు గుంపులూ బాగా ఎత్తుగా వున్నాయి. అగ్నిజ్వాలలు ఘర్జిస్తూ ఆకాశంలోకి అనేక అడుగుల ఎత్తుగా మండుతున్నాయి. కొండలు తగులబడిపోతున్నట్లు వుంది ఆదృశ్యం. వాళ్లకు కనిపిస్తున్నవల్లా అసంఖ్యాకమైన కాళ్లు, చేతులు, బుజాలు, తొడలు, పాదాలు. అగ్ని తతిమ్మా దేహభాగాలను అప్పటికే ఆహుతి చేసేసింది ఇంకా సొంతం కాలి మసిబొగ్గు అవని భాగాలుమటుకే యిప్పుడు విడివిడిగా - హృదయ విదారకంగా - అగుపిస్తున్నాయి.

కొన్ని పుర్రెలు కూడా వున్నాయి - డజన్లు కొద్దీని. కొన్ని ఆకాశంవైపు ముఖం తిప్పివుంటే, మరికొన్ని భూమిలోనికి గుచ్చుకుపోతూ వున్నాయి. ఇంకా కొన్ని పక్కలకు పడివున్నాయి. కనుగుడ్లు, దంతాలు మొండి చేతులు.... యింకా అనేకం. పుర్రె పేలినప్పుడల్లా పెద్ద శబ్దం అవుతోంది. ప్రశాంతమైన రాత్రి అవడంవల్ల యీ కాల్పులు చప్పుళ్లు తుపాకి తూటాలలా పేలి వినబడుతున్నాయి. ఆ శబ్దాలు వింటూంటే గుండెలు అవిసిపోతాయి.

శవాలను రైలు పెట్టెలలోంచి యివతలకు లాగి యిక్కడ గుట్టలు గుట్టలుగా పడవేస్తున్నారు. అయ్యో అనే విచారంగానీ మరోరకమైన వికారంగానీ లేదు రెండు శవాలు పరస్పరం కౌగలించుకు వుండటం కనీసం కాళ్లయినా పెనవేసుకుపోయి వుండడం యిక్కడ సాధారణ దృశ్యం అయింది. అగ్నికి ఆహుతి అవుతున్నప్పుడు ఆశవాలు అటుయిటు కదలాడుతున్నాయి. పక్కకు వాలడమో మరింతగా పెనవేసుకోవడమో జరుగుతోంది. ఒక పుర్రె కళ్లగుంటలు మరో పుర్రె కళ్ల గుంటల లోనికి చూచి యేదో నిశ్శబ్ద సందేశం పంపుతున్నట్లు వుంది అర్థం అయింది - అన్నట్లుగా రెండో పుర్రె తల ఊపుతోంది.

అరుణ్ ఎవరో చౌద్రి బర్కత్ ఆలీతో అనడం విన్నాడు : 'నేను యింకా సమాచారం కనుగొన్నాను, అన్ని శవాలను దహించేయడం అయిపోయిందట. ఇంకేమీ మిగిలిలేవు'.

ఆ మాటలు అన్నది తమను యిక్కడకు తీసుకువచ్చిన పోలీస్ ఆఫీసర్.

అరుణ్ మొద్దుబారిన గొంతుతో 'అంతా అయిపోయిందంటారా ? నిజమేనా ?' అన్నాడు.

'ఆహా ! ఈ సమాచారంలో యేమీ అబద్ధం లేదు' అని, ఆయన ఒక్కక్షణం ఆగి 'మీదుస్థితికి నాకు చాలా విచారంగా వుంది, నాయనా !' అన్నాడు.

మరోమాట మాట్లాడటానికి ముందే ఎవరో అరుణ్‌కు దగ్గరగా వచ్చాడు. అతను పొడగాటి వెదురు కర్రచేత పట్టుకుని శవాలను పోగుచేయడంలోను సరీగా కాల్చడం లోను సహాయపడుతున్న మనిషి. అరుణ్ వంక నిదానంగా చూచి 'ఆహా ! ఆశ్చర్యం ! సాక్షాత్తు అరుణ్ కుమారుడే !' అన్నాడు.

అరుణ్ ఆ మనిషిని గుర్తించటానికి ముందుగానే ఆ కంఠస్వరాన్ని ఆనమాలు పట్టగలిగాడు.

అబ్దుల్ ఘని చురుకుగా పోలీస్ ఆఫీసర్‌కు సలాం చేసి 'నేను యిక్కడ సహాయం చేస్తున్న వాలంటీరు నండీ. కాఫిర్ల శవాలను తగులబెట్టించి నగరం పరిశుభ్రపరచడంలో తోడ్పడుతున్నాను' అన్నాడు వికటంగా నవ్వుతూ. ఆ నిప్పు వెలుగులలో అతడి పళ్లు మరింత తెల్లగా ప్రకాశిస్తున్నాయి. అరుణ్‌తో 'నీ సోదరి హతురాలయిందని ఎవరుచెప్పారు, నాయనా, నీకు !... ఏమయినా బెంగపెట్టుకోకులే. నా స్వంత చేతులతోనే నేను వాళ్లను యిద్దరినీ - నీ సోదరినీ ఆమె భర్తను కూడా - అగ్నిగుండంలో పడవేశానులే. ఈసరికి వాళ్లు మీ నరకం వయిపు ప్రయాణం సాగిస్తూ వుంటారు. అక్కడే కలకాలం - శాశ్వతంగా - వుండిపోతారు !' అతను తన లోపలి విషాన్ని ద్వేషాన్ని దాచుకునే ప్రయత్నం యేమీ చేయలేదు.

ఛౌద్రి బర్కత్ ఆలి పొడవైన భారీ మనిషి. దృఢకాయుడు కూడా ఆరడుగుల రెండు అంగుళాల పొడుగు, విశాలమైన బుజాలు, బలిష్టమైన కండలు తీరిన చేతులు ఆయన గొంతు స్ఫుటంగా సూటిగా వుండి యిప్పటికీ

లోపలి బలాన్ని ప్రదర్శిస్తూ వుంటుంది. కాని మహాత్మ గాంధీగారి అహింస సిద్ధాంతం అతడిని పిల్లిని మేకపిల్లను చేసింది. తల వినయంతో వంగింది. ఇంట వడికిన ఖద్దరుతోనే చొక్కాలు, లూజు పైజమాలు కుట్టించుకుంటాడు

అబ్దుల్ ఘని మాటలు వినేటప్పటికి ఆయన యింతవరకు లోలోపలే అణుచుకున్న వీరావేశం ఒక్కమారుగా యివతల పడింది. ఘని మాట్లాడడం పూర్తి అవడం తోనే అతని మెడను రెండు చేతులతోను నొక్కిపట్టాడు. ఘని ఆయన బుజాలవరకే వస్తాడు. ఛౌద్రి బర్కత్ ఆలి అతన్ని ఓ గడ్డిపరకను ఆడించినట్లుగా అటు యిటు కుదిపివేశాడు. ఆయన తల, ముఖం ఘని తలకాయ మీదుగా వంగింది. ఆయన కళ్లలోంచి నిప్పుల వర్షం కురుస్తోంది

'నువ్వు సైతానువు, నువ్వు సైతానువు. నీవల్ల పవిత్రమైన ఇస్లాం మతానికి కళంకం - మాయని మచ్చ వస్తున్నాయి.'

కొన్నిక్షణాలపాటు అంతా గందరగోళం పరుచుకుంది.

మునీర్ 'అబ్బా.... అబ్బా....' అని తండ్రిని శాంతపరచటానికి ప్రయత్నిస్తున్నాడు. నియాజ్‌హుస్సేన్ 'అయ్యా జాగ్రత్త, మీరతడిని చంపటానికి ప్రయత్నించకండి' అన్నాడు. పోలీస్ ఆఫీసర్ చాలామార్లు 'ఛౌద్రి సాహెబ్, ఛౌద్రి సాహెబ్' అని హెచ్చరిస్తున్నాడు.

ఛౌద్రి బర్కత్ ఆలి యీ హెచ్చరికలను యే మాత్రం మన్నించడం లేదు. అబ్దుల్ ఘనిని యింకా గాలిలో ఊపుతూ, శరీరం కుదిపేస్తూ, 'ఓ సైతాన్... నువ్వు సైతాన్‌వే ! నీ నాలుక చీల్చి పారేయాలి...' అంటున్నాడు.

ఈ గందరగోళం, అల్లరి విని వాలంటీర్లలో కొందరు యిక్కడకు పరుగు పరుగున చేరారు. వాళ్ల చేతుల్లో పొడుపైన వెదురు కర్రలు భయం గొల్పేట్లుగా అగుపిస్తున్నాయి. మునీర్, ఖలీల్, నియాజ్ హుస్సేన్‌లు కూడా తమ హాకీ స్టిక్స్ తిరగవేసి పట్టుకున్నారు. వాళ్లు యీ ఆటవస్తువులను ఎందుకయినా మంచిదని తమతోపాటు తెచ్చుకున్నారు. పోలీస్ ఆఫీసర్ గట్టిగా అరిచి అక్కడి కాన్‌స్టేబుల్స్‌ను పోగుచేశాడు.

ఎట్టకేలకు పోలీస్ ఆఫీసరు వాళ్లనిద్దరినీ విడదీయగలిగాడు అప్పుడు ఛౌద్రి తన చేతులవంక చూచుకున్నాడు అసహ్యంగా.

పోలీస్ ఆఫీసర్ అబ్దుల్ ఘనిని ఒక్కనెట్టునెట్టి 'ఫో, యిక్కడ నుంచి, పిచ్చి కుక్కా. పోయి నీ పనిచూచుకో.' అన్నాడు తతిమా పోలీసులను కూడా ఎవరిపనిమీద వాళ్లను వెళ్లిపొమ్మన్నాడు. పోలీసులు ఆ మందను వెనక్కునెడుతూ ఆఫీసర్ మాటలనే తిరిగి తిరిగి అంటూన్నారు - 'పోండి. పోండి మీ పనులు పూర్తి చేసుకోండి'.

ఛౌద్రి బర్కత్ ఆలి పోలీస్ ఆఫీసర్‌తో 'నేను తొందరపడ్డాను. అయాం వెరీసారీ. అబ్బాయి యిప్పటికే పుట్టెడు దుఃఖంలో వున్నాడు. అతడితో మాట్లాడే పద్ధతి యిదేనా ? నేను తట్టుకోలేకపోయాను. వెరీసారీ' అన్నాడు.

ఆఫీసర్ యేమీ బదులు చెప్పలేదు.

ఛౌద్రి బర్కత్ ఆలి 'రండి, అబ్బాయిలూ, యింక యింటికి వెళ్లిపోదాం అన్నాడు.

తిరిగి వెళ్లడానికి ముందు అరుణ్ వెనక్కు తిరిగి మండుతున్న అగ్ని గుండాలకు అభిముఖంగా నిలబడ్డాడు. కొన్ని క్షణాలు మౌనంగా అక్కడే నిలబడిపోయాడు. అతడి కళ్లు మధు కోసం గాలిస్తున్నట్లున్నాయి. ఎన్నో జతల కళ్లు, పుర్రెలు అతన్ని తేరపార చూస్తున్నాయి. అరుణ్ ఎక్కువ సేపు నిలబడే ధైర్యం లేక ముందుకు నడిచి తతిమ్మా వాళ్లను చేరుకున్నాడు.

ఛౌద్రి బర్కత్ ఆలి అరుణ్‌తో 'అరుణ్. అబ్బాయి... నేను యీ రాత్రి మీ తల్లితండ్రుల ముఖాలు చూడలేను. మునీర్, ఖలీల్ మిమ్మల్ని క్షేమంగా శిబిరం దగ్గర దిగవిడుస్తారు. నేను మాత్రం రేపు ఉదయం వస్తాను' అన్నాడు

అరుణ్‌ను తన కౌగిలిలోనికి తీసుకుని గాఢంగా హత్తుకున్నాడు.

ఛౌద్రి బర్కత్ ఆలి, నియాజ్ హుసేన్‌లు టాంగాలో యింటికి వెళ్లారు. నలుగురు కుర్రాళ్లు సైకిళ్ల మీద 'డబుల్స్' వెడుతున్నారు. వాళ్లు బయటకు వచ్చాక ఎవరిదారిని వారు అనుసరించారు.

సూరజ్ ప్రకాష్ ఈ సాయంత్రం అంతా సిగరెట్లు తెగకాలుస్తున్నాడు మరో సిగరెట్ ముట్టించి వాళ్ల వీధి మొగదలలో అరుణ్‌ను ఆపివేశాడు.

'అరుణ్. ఇంతవరకు నేను యేమీ మాట్లాడనే లేదు నామాట నమ్ము మధు మరణానికి నాకు చాలా విచారంగా వుంది. మీ దుఃఖం నాది కూడా' అన్నాడు.

ఈ మాటలు అంటున్నప్పుడు కూడా సూరజ్ ప్రకాష్ నవ్వుతూనే వున్నాడు. అందుకు కారణం యేమిటంటే - యిలాంటి సన్నివేశాలలో ఎలా ప్రవర్తించాలో, సానుభూతి చూపడం ఎలా చేయాలో అతనికి సుతరామూ తెలియకపోవడమే. అతడు జీవితమంతా కులాసాగా విలాసంగా గడపటానికే అలవాటు పడిపోయాడు. అయినా అతని గొంతుమటుకు విచారంతో వణికిపోతోంది.

'ఇదుగో తీసుకో' అని అరుణ్‌కు సిగరెట్ అందించబోయాడు

అరుణ్ వద్దన్నాడు. సూరజ్ చేయిపట్టుకుని గట్టిగా అదిమాడు.

అతని తల్లి యింకా నిర్ఘాంతపోయిన స్థితిలోనే వుంది. అరుణ్ స్టేషన్‌కు వెళ్లాడని చెప్పగా విన్నప్పుడు కూడా ఆమె ముఖస్థితిలో వాలకంలో యేమీ వ్యత్యాసం రాలేదు. కిరసన్ లాంతరు బలహీనంగా వెలుగుతోంది. డేరా నిండా పరామర్శించటానికి వచ్చినవాళ్లు కూర్చుని వున్నారు. అతని తల్లి వాళ్లతోపాటు ఒక మూల కూర్చుని వుంది. మరో మూల మగవాళ్ల మధ్య లాలా కాన్షీరామ్ కూర్చున్నాడు. ఏడుపులు, పెడబొబ్బలు లేవన్న మాటేగాని ఉబుసుపోక కబుర్లు సాగుతూనే వున్నాయి. ఉన్నట్లుండి మాటలు ఆగిపోతాయి. తరువాత మళ్లీ ప్రారంభం అవుతాయి. అరుణ్ యిలా ఎంతసేపటి నుంచి సాగుతోందో ఎరుగడు. వచ్చేవాళ్లు వస్తున్నారు, పోయేవాళ్లు పోతూన్నారు. ఎవరో అన్నారు: 'అరుణ్, కాస్త పక్క డేరాలోకి రా నాయనా కాస్త ఏమన్నా తిందువుగాని' ఆ కంఠం ఎవరో స్త్రీది. కాని ఎవరిదో అతను ఆనమాలు పట్టలేకపోయాడు. వద్దని మాత్రం చెప్పాడు. ఇంకొక స్త్రీ కంఠం వినిపించది, 'కాసేపు పడుకో నాయనా. కొద్దిగా నిద్రపో' అరుణ్ ఒకమూల యిరుక్కుని పడుకున్నాడు. అతను

పడుకున్నాడన్నమాటేగాని, డేరాలో జరుగుతున్న సంభాషణలు అప్పుడప్పుడు స్పష్టంగాను, యితర సమయాలలో లీలగాను అతని చెవులలో పడుతూనే వున్నాయి ఉన్నట్లుండి అతను పూర్తిగా మెలుకువగా ఉండిపోయాడు. మనస్సు చురుకుగానే వుంది. కళ్లూ తెరుచుకునే వున్నాయి డేరా పైకప్పు వంక విశ్రాంతిగా గమనిస్తూ వున్నాడు.

అతను లేచికూర్చున్నాడు. చుట్టూచూచాడు తల్లి, తండ్రి పద్మిని, చాందిని పడుకుని నిద్రపోతున్నారు. తతిమ్మా వాళ్లంతా వెళ్లిపోయినట్లున్నారు అరుణ్ తన చేతిగడియారం వంక చూచుకున్నాడు. మూడుగంటలు అయింది పద్మిని, చాందిని ఊపిరి పీలవడం - విడవడం అతనికి వినిపిస్తూనే వుంది. వాళ్లు నిద్రపోతూవున్నారని అతను ఎరుగును. తల్లి దండ్రులు మాత్రం మెలుకువగానే వున్నారనీ ఎరుగును. ఈ మూల ప్రశాంతత ఆవరించుకు వుంది, అసాధారణంగా

అతను కాళ్ళు బారచాపుకున్నాడు. కళ్ళు మూసుకున్నాడు. మనస్సు ఉన్నట్లుండి ఖాళీ అయిపోయింది. మళ్లీ అతను లేచి కుర్చున్నాడు గడియారం నాలుగు గంటలయిందని చెబుతోంది. ఇప్పుడు అందరూ నిద్రపోతున్నారు. నలుగురి ఎదురు రొమ్ములు ఉచ్ఛ్వాస నిశ్వాసాలతో ఎగిరి పడుతూన్నాయి. డేరా ప్రశాంతంగా వున్నట్లు భ్రమకలిగిస్తోంది. వేసవి ఉదయపు గాలులు వీచనారంభించాయి. డేరా రెక్కలు గాలికి అటు యిటు కొట్టుకుంటున్నాయి.

ఇంతలో యేదో జరిగింది. ఏదో జరిగింది కదూ? అరుణ్ తన మనస్సు పొరలు వెదుక్కున్నాడు. బాధగా ఉత్పాతంగా ఆ విషయం మనస్సులోంచి చీల్చుకు యివతలకు వచ్చింది. మధు! మధు అతని సోదరి తన మొదటి స్నేహితురాలు, సహవాసిని. యవ్వనం గుమ్మం ముందుకు తనను చేర్చిన వ్యక్తి.

కాస్సేపు షికారు చేసి వద్దామనుకున్నాడు. చెప్పులకొసం డేరా అంతా వెదికాడు. ఆ అన్వేషణలో ఛాందిన స్తనయుగ్మం అనాచ్ఛదితంగా వుండడం అగుపించింది. అ పిల్ల వెల్లకితల పడుకుని వుంది, నోరు తెరుచుకుని

సముద్రతీరాన్ని తాకే ఆటుపోటుల వలె ఆమె ఉచ్ఛ్వాస నిశ్వాసాలకు శరీరం ఎగిసిపడుతూవుంది తన చెప్పుల వెదకులాట మరిచిపోయి అరుణ్ ఆమెను చూస్తూ చాల సేపు కూర్చుండిపోయాడు. ఆమె యవ్వనం, సౌకుమార్యం అతన్ని అలాగే నిలపి వుంచాయి. చీర మాటున ఆమె ఆనవాళ్ళ అంచనా వేస్తున్నాడు షికారు విషయం మరచిపోయి మళ్లీ పక్కమీదకు చేరాడు, ఆమెను గమనిస్తూ, అలా స్తబ్ధుగా వుండి పోవడంలో అతనికో విషయం నిర్ధారణ అయింది. మధుబాల నిజంగానే చనిపోయింది చరిత్రలో ఆ ప్రకరణం అయిపోయింది. ఆమె సన్నని నునుపైన పాదలను మెత్తని వక్షోజాలను తాను మరెన్నడు చూడలేదు.

బాల్యంలో మధుబాలకు మశూచికం సోకింది. దాని వల్ల ముఖం మీద గంట్లు మిగిలిపోయినాయి అమ్మాయి రూపురేఖలు మారిపోయినాయని తల్లి దండ్రులు చింతిస్తూ వుండేవాళ్లు. మధుకు యిదో పెద్ద అటంకంగా కనిపించేది కాదు జీవితంలో క్షుల్లకమైన విషయాలను గురించి పరితాప పడకుండ వుండడం ఆమె తల్లి దగ్గరనుంచి నేర్చుకుంది. ఆమెను ఒకంతట నిరాశ పరిచే సందర్భాలు అతి తక్కువ. స్కూల్లో పిల్లలు ఎవరయినా ఎగతాళిగా మాట్లాడినా, తన అందాన్ని గురించి సూటిపోటు మాటలు అన్నా - ఆమె అద్దం ముందు చేరి తనను తాను పరీక్ష చేసుకుంటూ వుండేది. స్ఫోటకం మచ్చలు ముఖం మీద తీవ్రంగానే కనిపిస్తూ వుంటాయి. చెంపలమీద మరీని. జుట్టుచేతితో వెనక్కు నెట్టి ముఖాన్ని అటుయిటు తిప్పుకుంటూ అద్దంలో పరిశీలనగా చూచుకునేది. ముఖాన్ని అద్దానికి అతి దగ్గరగా తీసుకువెళ్లి చర్మాన్ని చేతులతో తడుముకునేది. తరువాత గడ్డంపైకెత్తి ముక్కుదూలాన్ని పరిశీలిస్తూ వుండేది.

తాను 'అందవికారి' అని ఎవరయినా అంటే ఆమాటలతో మధుబాల రాజీపడేది కాదు. అద్దంలో పరిశీలించినకొద్ది ఆమె అందం ఆమెకు బాహాటం అవుతూ వుండేది.

'అరుణ్ ! నేను అసహ్యంగా వుంటానా చూడటానికి ?' అని అడిగేది.

ఆ పెద్దగదిలో డ్రెస్సింగ్ టేబుల్ ముందు ఆమె సరసన వచ్చి నిలుచునేవాడు అరుణ్.

'ఊహు  నీవు చాల అందంగా వున్నావు !' అనేవాడు.

అరుణ్ కేవలం ఆమెను సంతోష పరచడం కోసం ఈ మాటలు అనలేదు. స్ఫోటకం మచ్చలు వున్నమాట నిజమే. అయితే అవి ఆమె సుందర రూపాన్ని యేమాత్రం తక్కువ చేయడం లేదు  ఆమె శరీరం రంగు అందరికంటె మిన్న అయినది  కళ్లు పెద్దవి, లోతు అయినవి కూడా. ముక్కు సూటిగా కోటేరు వేసినట్లుగా వుంటుంది  అన్నిటికీ మించి ఆమె తెలివి తేటలు చాల సునిశితమైనవి. రేసు గుఱ్ఱంలా బహు వేగంగా ఆలోచించగలదు ఆమె మనస్సు. ఎంతో చలాకీగా హుషారుగా వుంటుంది. ఆషామాషీ గా ప్రవర్తిస్తుంది. ఎప్పుడు యేదో కొత్తపని, వింత పని చేస్తూ వుండేది. ఆమె మాట్లాడుతుంటే - ఒక్కనోరు మటుకే మాట్లాడుతున్నట్లు వుండేది కాదు. శరీరమంతా సంభాషిస్తున్నట్లే అనిపించేది  చేతులు అటుయిటు ఊగుతూ వుండేవి. వినేవాళ్లను ఆకట్టుకునేట్లు మాట్లాడడం ఆ అమ్మాయికి బాగా తెలుసు. ఉహు. ముఖం మీద మచ్చలువున్నా దానివల్ల తన సౌందర్యం తగ్గిపోతోందని ఆమె ఒక్కనాటికీ అంగీకరించేది కాదు.

'నీవు చాలా అందంగా వున్నావు' అనేవాడు అరుణ్.

'నా ముక్కు వంక చూడు' అనేది ఆమె ఆటకాయతనంతో.

'నిజం'

'మరి నా కళ్లు ?'

- అరుణ్‌కు అనిపించేది ఈమె తనను ఆటపట్టించడం లేదు గద ! అని మరింత పరిశీలనగా ఆమె వంక చూచి 'అవును నిజం' అనేవాడు.

'అంతే కాదు. నీ శరీరం మీద ఎక్కడా మచ్చలు లేవు' అనేవాడు మరింత గంభీరంగా.

అతని మాట్లాడే ధోరణి ఆమెకు ఉత్సాహం కలిగించేది  ఆమెను ఎందుకు చిన్నబుచ్చాలి ? కాస్త ధైర్యం చెప్పి స్వావలంబన కలిగించడం మంచిది కదూ ! అతని మాటలకు, గాంభీర్యానికి ఆమెకు బోలెడెంత ధైర్యం కలిగేది.

'ఎక్కడా లేవా ? ' అనడిగేది ఆమె.

ఆమె వెళ్లి మంచం మీద పడుకునేది చొక్కాఎత్తి పెట్టుకుని కడుపుమీద పరీక్షగా చూచుకునేది. చొక్కాను మరింత పైకెత్తి లేచి కూర్చునేది అతని వైపు వీపు పెట్టి 'చూడు, యీ వెనకల యేమయినా వున్నాయేమో ?' అని అడిగేది.

చొక్కా మెడవరకు పైకి లేచి వుండేది గనుక అరుణ్‌కు ఆమె లేత చనుమొనలు ముందుకు పొడుచుకు వచ్చి కనిపించేవి. అతను కాస్త సిగ్గుపడి, సమాధానంమటుకు 'ఊహు. ఏమీ లేవు' అని చెప్పేవాడు. ఆమె తలముందుకు తిప్పి నవ్వేది. 'ఎక్కడా ? ఒక్కటి కూడా లేదా ?' అని అడిగేది. 'లేవు. లేవు' అని ధైర్యం చెప్పేవాడు అతను.

మధుకు తన శరీరం మీద యెక్కడా మచ్చలేదని తెలుసు. ప్రతి అంగుళాన్నీ ఆమె పరిశీలనగా చూచుకుంది. ఆ వ్యాధి వల్ల విరూపం పొందినది ఒక్క ముఖం మాత్రమే. సుడిగాలి, తుఫాను మార్గమధ్యలో దారిమార్చినట్లు అయింది.

'నా వీపంతా నీ చేతితో నిమురు' అనేది.

బెరుకుగానే అరుణ్ ఆమె వీపు నిమిరేవాడు. మెడమీద నుంచి కింద వరకు... 'ఊ, అలాగే... కిందికి.... నింపాదిగా...' అనేది ఆమె. ముఖం ఎత్తిపెట్టుకు వుండేది. కళ్లు విశాలంగా తెరుచుకు వుండేవి. ఆమె నవ్వుతూ వుండిపోయేది.

'చెప్పాను గదూ ! ఒక్క మచ్చయినా లేదు' అనేవాడు అరుణ్.

ఈ తమాషా కొంతసేపు గడిచిన తరువాత ఆమె చొక్కా కిందికి లాక్కుని, ముందుకు తిరిగి అరుణ్‌ను కౌగిలిలోనికి తీసుకునేది. అతని మూతిమీద ముద్దుపెట్టేది. 'నీవంటే ఎంతో యిష్టం అరుణ్' అనేది, నవ్వూతూ 'ఎందుకు నవ్వుతున్నావు ?' అని అడిగేవాడు అరుణ్ గాభరాపడిపోయి.

ఓ రోజు ఉదయం అరుణ్ గమనించాడు. ఆమె తొడల మధ్య యేదో బేండేజి (కట్టు) లాంటిది వేసుకున్నదని. స్నానం చేస్తున్నప్పుడు కూడా యీ

కట్టును తీసివేయలేదు. ఆమెకు యేమయినా సుస్తీ చేసిందా ? ఈ కట్టు యేమిటి ?

సాయంకాలం ఆమెను పట్టుకొని 'ఏమయింది మధూ నీకు ? సరీగా ఆరోగ్యంగా వున్నావా ?' అనడిగాడు.

'బాగానే వున్నాను. ఏం అలా అడిగావు ?'

'మరి తొడలలో ఆ బేండేజి యేమిటి ?'

'ఊ... నీకు ఎలా తెలిసింది ?'

'నీవు గదిలో దుస్తులు మార్చుకుంటున్నప్పుడు తొంగిచూచాను. బేండేజి కనిపించింది. బహుశ నాది పొరపాటేమో అనుకున్నాను'.

'అవును. అది బేండేజి అయిన మాట వాస్తవమే !' - అంటూ ఆమె విపరీతంగా నవ్వసాగింది. ఆమె మళ్లీ మామూలు మనిషి కావటానికి చాలా సమయం పట్టింది

'ఆడవాళ్లందరూ ప్రతి నెలా ఒక మారు అలాంటి బేండేజి కట్టుకుంటారు'.

'ఎందుకని ?' అనడిగాడు అరుణ్ అర్థం కాక.

ఆమె యింకా నవ్వుతూనే, 'నువ్వు వుత్త అమాయకుడివి కదూ ?' అంది.

అరుణ్ ఎంతో బాధగా 'బాగా నెప్పిగా బాధగా వుంటుందా ?' అనడిగాడు.

'లేదు. చూడు' అంటూ ఆమె అతని చేయి అందిపుచ్చుకుని తన తొడల మీద నొక్కేట్లు చేసింది. అతనికి వేళ్లకు మెత్తని గుడ్డల తాకిడి అనిపించింది. 'నాకేం నొప్పిలేదు' అంది ఆమె.

'మరి ఎందుకు ఆ కట్టు ?'

'నీకు తరువాత తెలుస్తుందిలే' అంటూ ఆమె చిలిపిగా నవ్వుకుంటూ యేదో పాటపాడుతూ అక్కడి నుంచి పారిపోయేది

ఒక సాయంత్రం పూట - ఆమె ఆకాశంలో నక్షత్రాల వంక చూస్తూ నిలుచుంది. ఆ రోజు పౌర్ణమి. చంద్రకాంతితో యింటి డాబా మిలమిల మెరుస్తోంది. ఆమె ఎక్కడ వుందో ఎవరికీ తెలియదు. ప్రభారాణి మరీ ముద్దుచేసి ఆమెను చెడగొడుతోంది ఇంటి పనుల్లో తనకు తోడుగా వుంటే సరే సరి. లేకపోతే - ఆమె వంటింటి ఛాయలకే రాకపోతే - తల్లి పిలిచి మరీ పనులు చెప్పేది కాదు. అంతా అమ్మాయి యిష్టాయిష్టాలకే వదిలేది. మధుబాల స్థానిక ఆర్యసమాజ బాలికల పాఠశాల నుంచి మెట్రిక్యులేషన్ పాసయింది. లాలా కాన్షీరామ్ ఆమెను కాలేజి చదువులకు పంపాలని అనుకోలేదు ఆమే తనకు పై చదువులు కావాలని అడగలేదు. చివరి పరీక్ష ముగిసిపోయిన తరువాత ఎంతో తేలికగా ఫీలవసాగింది. ఆమెకు విచ్చలవిడిగా అదుపు - ఆజ్ఞలు లేకుండా హాయిగా తిరుగాడడం అంటేనే యిష్టం. డ్యాన్సు పాఠాలు నేర్చుకోలేదన్నమాటే గాని ఆమె శరీరం సంగీత తరంగాలకు లయబద్ధంగా ఊగిసలాడుతూ వుండేది. ఒక చిన్న గీతం చదివినా దాన్ని అర్ధవంతంగా లయకు అనుగుణంగా విరిచి అందుకు తగినట్లుగా విన్యాసాలు చేసేది.

సాయంత్రం చీకట్లు ముసురుకుంటున్నాయి గనుక, ప్రభారాణి అరుణ్‌ను పిలిచి మధు పక్కయింటికి గాని వెళ్లిందేమో చూచి రమ్మన్నది. ఉహు, ఆమె పక్క యింటికి వెళ్లలేదు. డాబా మీద ఆకాశంలోని నక్షత్రాలు లెక్కపెడుతూ నించున్నదని అరుణ్ కనిపెట్టాడు.

'అరుణ్, ఈ నక్షత్రాలు యేమిటంటావు ?' అనడిగింది ఆమె.

'మండుతున్న వాయువులు' అన్నాడు అరుణ్. అతను హైస్కూలులో చివరి సంవత్సరం చదువుల్లో వున్నాడు. బడిలో ఫిజికల్ సైన్సెస్ చెబుతారు.

'హు. నీకు తెలిసింది అంతే ! నక్షత్రాలు ప్రేమికులు. నీకు తెలియదు'

'ప్రేమికులా ? ఎవరకి ?'

'చంద్రుడికి ! ఆ మాత్రం తెలియదా ?' అంటూ ఆమె శరీరాన్ని నిటారుగా నిలపి చేతులు వెనక్కు కట్టుకుంది.

'ఇందరు ప్రేయసులా ?' అన్నాడు అరుణ్

'చంద్రుని సమ్మోహనాకారం, మహత్మ్యం నువ్వు ఎరుగవు. అతనికి ఎందరయినా ప్రేమికులు వుంటారు' అంటూ ఆమె అరుణ్‌ను గబగబ గుంజుకుంటూ ఓ మంచం దగ్గరకు తీసుకుపోయింది.

'అరుణ్, నీకు ప్రేమగీతాలు యేమయినా వచ్చునా ?'

అరుణ్ యిలా విషయం మార్పు చెందడంతో తబ్బిబ్బు పడ్డాడు.

'ఏమయినా సినిమా పాటలు' అనడిగింది ఆమె మళ్లీ.

'నీకు తెలుసుగదూ ! నేనేంపాడను'

'పాడవులే - కాని యేమయినా మంచి పాటలు వచ్చివుండవచ్చు గదా - ఒక్కటి పాడు చూద్దాం'

'నాకు పాటలు రావు.'

'అదే మాట షదే పదే అనకు. ఏదో ఒకటి పాడు'

అరుణ్ పాడడం కోసం గొంతు సరిచేసుకున్నాడు. తరువాత నవ్వాడు మిన్నకుండిపోయాడు.

'ఊహు, పాడలేను మధు...

'అబ్బా, అలా అనవద్దు. ఆ సినిమాలో సైగల్ పాడతాడు చూడు :

"నా ప్రియతముడు హృదయాన్ని తస్కరించాడు .

వసంతం వచ్చింది.

నా ప్రియుడింకా రాలేదు...."

ఈ పాట నీకు వచ్చునా ? ఏదీ, పాడు...'

అరుణ్ యేదయినా జవాబు చెప్పగలగడానికి ముందే ఆమె మళ్లీ యిలా అంది 'పోనీ మనమిద్దరం కలసి పాడదాం..'

అతని చేయిపట్టుకుని, ఆ పాట సంగీత వరుస ఒకమారు ఆలపించి పాడడం మొదలెట్టింది. 'ఊ .. మొదలెట్టు...' అంది. అరుణ్ కూడా పాడసాగాడు.

'నా గుండెల్లో విపరీతమైన నెప్పి-కోయిల కూతలు వింటున్నప్పుడు-' అనే చరణం పాడుతూ వున్నప్పుడు ఆమె అరుణ్‌ను దగ్గరకు తీసుకుంది. అతని చెంపకు తన చెంప ఆనించి పాడుతోంది వీళ్లు ఆ పాట లయకు ఊగిపోతున్నారు. అరుణ్ బెరుకుగా ఆమెనుంచి దూరం జరగటానికి ప్రయత్నించాడు. ఆమె వొళ్లు చాలా వేడిగా వుండడం, ఆమె ఊపిరి వెచ్చని ఆవిరిలా వస్తూ వుండడం గమనించాడు అతను.

అతడు పాడడం ఆపివేసిన సంగతి ఆమె గమనించనే లేదు. ఏదో పూనకం వచ్చిన మనిషిలాగ పాడుకుంటూ పోతోంది. మెల్లగా అడుగులు వేస్తూ నృత్య భంగిమలు కూడా చేస్తోంది. ఆ నాట్యంలో భాగంగానే అరుణ్ నిలబడి వున్న చోటుకు వచ్చింది. ఉండి ఉండి చంద్రుని వంక చూస్తోంది. ఎక్కువగా వేగిపోతూ వుంది. కళ్లు వాలుతూవుండగా, పెదవులు వణకుతూ, కంఠస్వరం గద్గదం అవుతూ - ఆమె యిలా అంది :

"నీ ముఖం ఎంత సుకుమారం !

నీ యవ్వనం మనోహరం !

నీ కనుదోయిలో

ఓ కొత్త విశ్వం అవతరిస్తోంది !"

ఆమె భావోద్వేగానికి అరుణ్ గాభరాపడిపోయేవాడు. ప్రేమగీతాలను యింత నిస్సిగ్గుగా పాడడం అతనికి యిష్టంకాని విషయం. విధి విధేయతలు ప్రాముఖ్యం వున్న కుటుంబంలో పుట్టాడు గాని ఉద్వేగాల విస్తారాలలో కాదు. ఇప్పుడీ అమ్మాయి వంటగదిలో తల్లికి చపాతీలు చేయడంలో సహాయం చేస్తూ

వుండాలి. అంతేగాని యిలా వివశతలో వుండిపోయి కలలుకంటూ కూర్చోకూడదు

'ఆపాట ఒక ప్రేమికుడు తన ప్రియుని గురించి పాడినది' అన్నాడు బిరుసుగా. ఆమెకు తన అయిష్టం ఎంత స్పష్టంగా తెలపటానికి వీలుందో అంతా చూపాలనుకున్నాడు

మధుపాట ముగించింది. కాని యింకా దాని ప్రభావంలోనే వుంది. అరుణ్ మాటలు వింటూ యీ ప్రపంచంలోనికి పునః ప్రవేశం చేసినట్లుగా కళ్లు తెరిచింది.

'అయితే యేమిటిట ? ఆ పాట అంటే నాకు యిష్టం.'

'కిందికి వెళ్లి అమ్మకు సాయం చెయ్యి'

'వెళ్లను. నువ్వెవరు నన్ను శాసించటానికి ? ఇక్కడనుంచి వెళ్లిపో, తక్షణం.'

ప్రభారాణి కింద నుంచే వాళ్ల వాదనలను వింటూ 'అరుణ్. ఆమెను అక్కడే వుండనీ. ఎక్కడివెళ్లిందో చూచి రమ్మన్నాను, అంతే. నీవు కిందకు రా-' అని అరిచింది.

మధు తన స్నేహితురాళ్లను యింటిలో సమావేశపరిచేది. వాళ్లలో చాలామంది ట్రంక్‌బజార్లో వుండేవాళ్లే. అయితే అప్పుడప్పుడు ధరోవల్ మొహల్లా నుంచి ఒక అమ్మాయి వస్తూ వుండేది. లేదా కనుక మండినుంచో! వాళ్లు యింట్లో పెద్ద గదిలోనో డాబామీదనో కూర్చుని నవ్వుకుంటూ కబుర్లు చెప్పు కుంటూ వుండేవాళ్లు. అరుణ్ తన గదిలోనే కూర్చుని చెవులు నిక్కబొడుచుకుని వాళ్ల మాటలు వినడానికి ప్రయత్నం చేస్తూ వుండేవాడు. అయితే అతనికి నవ్వులు తప్ప మాటలు అంతగా వినవచ్చేవి కాదు. తన గదినుంచి తండ్రి గదికి యేదో మిష మీద అనేకమార్లు తిరుగుతూ వుండేవాడు. అయినా వాళ్లు అతన్ని అంతగా గమనించే వాళ్లు కాదు. కొందరు చూచీ చూడనట్లుగా వుండేవాళ్లు. కొందరు తమ మధ్య ఒక యువకుడు

తారట్లాడుతున్నట్లుగా కొద్దిపాటి సిగ్గు ప్రదర్శించేవాళ్లు. అయితే తమ సంభాషణలు మాత్రం నిలిపి వేసేవాళ్లు కాదు. అతన్ని చూచినప్పుడు వాళ్లు అంత నింపాదిగా గుసగుసలుగా మటుకే మాట్లాడు కోవడం అరుణ్‌కు చిరాకు కలిగించేది. వాళ్లు కూర్చున్న గదిలోంచి నడుస్తున్నప్పుడు కూడా ఒక్కమాటయినా స్పష్టంగా వినవచ్చేది కాదు. కాని వున్నట్లుండి వాళ్లు నవ్వులు - విరగబడి - నవ్వుతూ వుండేవాళ్లు. ఈ నవ్వులమధ్య.... 'అవునవును', 'అలా అనకు', 'నామాట...' యిలాంటి పదాలు మాత్రం వినవచ్చేవి. మళ్లీ నవ్వుల తెర తప్ప యింకేమీ వినవచ్చేది కాదు.

ఆడపిల్లలంతా గుంపుగా కూర్చునేవాళ్లు. మధు తప్పని సరిగా వాళ్లందరి నడుమ కూర్చునేది. కొందరు పిల్లలు ఆమె మెడచుట్టూ చేతులు వేసుకుని కుర్చునేవాళ్లు కొందరు ఆమె మీదికి ఒరిగిపోతూ వుండేవాళ్లు. ఒకళ్ల చెవుల్లో ఒకళ్లు - మూడో మనిషికి వినబడనంత నింపాదిగా - మాట్లాడుకుంటూ వుండేవాళ్లు డాబా మీదకు వెళ్లదలుచుకున్నప్పుడు అందరూ ఒకే గుంపుగా గబగబ వెళ్లిపోయేవాళ్లు. అలాగే కాళ్లు గబగబ చప్పుళ్లు చేసుకుంటూ కిందకు దిగేవాళ్లు ఇకయికలు పకపకల మధ్య మళ్లీ అందరూ ఒక అర్ధ వలయాకారంలో కూర్చుని కబుర్లలో పడిపోయేవాళ్లు.

మధు ఎక్కువసేపు ఒకేచోట కూర్చొని వుండలేదు. తిరుగుతూ, చలాకీగా వుండే స్వభావం ఆమెది. వాళ్లు యీ రోజు వస్తారనగా ఆ ఉదయమంతా ఎంతో హుషారుగా యిల్లు చుట్టుతూ వుండేది. తల్లికి చెబుతూ వుండేది - తమకు తినడానికి యేమేమి చేయాలో. పెద్ద జాబితా చెప్పేది పకోడాలు... స్వీట్లు... తాజా పళ్లు... జీడిపప్పులు... మామిడికాయ పచ్చడి... యిలా. 'అవన్నీ నువ్వే తయారుచేసుకో రాదూ?' అని అరిచేవాడు అరుణ్ తన గదిలోనుంచి. 'నీ పని నువ్వు చూచుకో. నీ సలహా ఎవరూ అడగలేదు-' అని సమాధానం చెప్పేది ఆమె. అమ్మదగ్గరకు వెళ్లి కౌగిలిలో చుట్టుకుని 'నాకోసం యివన్నీ తయారు చేస్తావు గదమ్మా...' అని అడిగేది. ప్రభారాణి కూడా ముచ్చటగా నవ్వుతూ అలాగేనని తలూపేది.

స్నేహితురాళ్లు వచ్చినప్పుడు ప్రతిమారు ఆనందాతిశయంతో అరిచేది. 'మాలతీ!', 'ఎందుకింత ఆలస్యం చేశావు, కామినీ!' 'నీలం .. రేఖ   కమల . ఓ! అందరూ వచ్చేశారా..' అంటూ అమిత ఉత్సాహంతో అందరినీ లోనికి ఆహ్వానించి తోడుకుపోయేది. ఏవేవో ప్రశ్నలు వేసేది. ఆమె గొంతు యిల్లంతా ధ్వనిస్తూ ప్రతిధ్వనిస్తూ వుండేది. అందరూ ఆప్యాయంగా తినేవాళ్లు. ఎవరికీ వివబడని వైఖరిలో సంభాషణల్లో మునిగిపోయేవాళ్లు. ఆమె ఎంతో చురుకుగా, హుషారుగా అటుయిటు తిరుగుతూ వుండేది. వీధిలో యేమయినా చప్పుళ్లు అవుతూ వుంటే అదేమిటో గమనించటానికి వెళ్లేది. బాల్కనీలో నిలబడి యేమన్నా అల్లరి, ఆగం జరుగుతోందా... అని పరికించేది. మధ్య మధ్య వంట గదిలోనికి వెళ్లి 'నేను నా స్నేహితురాళ్లతో మాట్లాడుతూ వున్నప్పుడు నన్ను పిలవకమ్మా!' అని చెప్పేది' లేకపోతే అరుణ్ గదిముందుకు వచ్చి తెరపక్కకు తొలిగించి తొంగిచూచేది. 'ఏం కావాలి ?' అని అడిగేవాడు చికాకుగా అరుణ్. 'ఏమీ అక్కర్లేదు. నీవేం చేస్తున్నావో చూద్దామని వచ్చాను' అనేది మధురంగా నవ్వుతూ. మరుక్షణమే స్నేహితురాళ్ల మధ్యకు చేరిపోయేది. వాళ్ల మీద పడిపోతూ ఆ నవ్వులు, కేరింతల్లో ఉధృతంగా పాల్గొనేది.

'నీ స్నేహితురాళ్లలో కొందరికయినా నన్ను పరిచయం చేయరాదూ ?' అని అడిగేవాడు అరుణ్.

'నిన్నా ?'

'అవును, నన్నే.'

ఆమె తెరలు తెరలుగా నవ్వేది. అరచేత్తో నోరుమూసుకుంటూ మరీ నవ్వేది.

'ఎందుకలా నవ్వుతావు ? నీకేం అయింది ?.... యిందులో కానిదేం వుంది' అనేవాడు అరుణ్ - దెబ్బతిన్నట్లయిపోయి.

'నువ్వింకా కుర్రవాడివి. నిన్ను పరిచయం చేయవలసిన అవసరం లేదు. వాళ్లు వచ్చినపపడు నీవు రావచ్చు. వాళ్లతో నేరుగా మాటల్లో దిగిపోవచ్చు ప్రత్యేకంగా పరిచయం అవసరం లేదు' అనేది ఆమె.

'అయినా నీవునన్ను లాంఛన పూర్వకంగా పరిచయం చేస్తేనే మంచిది. నేనెవరో వాళ్లకు చెప్పాలి నువ్వు.'

మధు అరుణ్ వంక చూచేది. అతని ముఖం చెమటతో తడిసిపోయి వుండేది. అతడు సిగ్గుపడుతూ వుండేవాడు. ఆమె అతన్ని ఆప్యాయంగా దగ్గరకు తీసుకుని, బుజాలచుట్టూ చేతులు వేసి బుగ్గమీద ముద్దుపెట్టుకునేది

'అలాగే ! సిగ్గుపడకు. ఈమారు నిన్ను వాళ్లకు పరిచయం చేస్తాలే. ఈ కుటుంబంలో సుకుమార రాకుమరుడవని. మరేం బెంగపడకు' అనేది ఆమె.

'సిగ్గుపడుతున్నది ఎవరు ?'

- అరుణ్‌ను ఆమె మొదటిమారుగా ఆడపిల్లలకు తగిన వరుడుగా గమనించినప్పుడు, సిగ్గుతో చెంపలకు కెంపు రంగులు పులుముకుంది. ఆత్మీయంగా చూచినప్పుడు ఆమెకు అతనికేం కావాలో అర్థం అయింది అతన్ని యిదివరకులా చూసీ చూడనట్లు పరిగణించటానికి వీల్లేదు. ఇప్పుడు యితను చిన్నపిల్లవాడు కాదు. యువకుడుగా యెదుగుతున్నాడు. మీసాలు వస్తున్నాయి. గడ్డం కూడా మొలకలు యెత్తుతోంది ముఖంలో. పెద్ద ఆరింద లాగా ప్రవర్తిస్తూ 'అయితే ఎవరిని పరిచయం చేయమంటావు ముందు ?' అనడిగింది ఆమె. అతడు ఒకటి తరువాత మరొకటిగా చాలా మంది పేర్లు చెప్పినప్పుడు ఆహాహా... అని నవ్వింది. అతను యెంతో ప్రయత్నపూర్వకంగా ఆలోచించి నిర్ణయించుకోవలసి వస్తోంది యిప్పుడు. ఎవరితోనైనా నికరమైన స్నేహం కావాలి. వాళ్లలో యెవరో ఒక్క అమ్మాయిని జీవితాంతం తాను ప్రేమిస్తూ వుండాలి. కాస్సేపు పొడగాటి జడలున్న అమ్మాయి... కాస్సేపు మొటిమలు అంకురిస్తున్న అమ్మాయి.... కాస్సేపు లావాటి అమ్మాయి.. కాస్సేపు ఆ నల్లకళ్ల అమ్మాయి... యిలా అతని ఎంపిక. కొన్నివారాలకంటె అధికంగా పెరగడం లేదు. మధు నవ్వేది, ఆమె నాలుక పాము నాలుకలాగ ఎర్రగా అప్పుడప్పుడు బయటకు వస్తూ వుండగా. 'అలాగే ! ఎందుకు కాదు ?' అనేది

ఆ రోజుల్లో అతనికి యింకా నూర్ అంటే ఆకర్షణ యేర్పడలేదు. ఆమె వాళ్ల యింటికి తరచుగా వస్తూ పోతూ వుంది. అయితే ఆమె అతనికంటె మరీ

చిన్నది మధు ఆమెను చిన్నపిల్లగానే పరిగణించేది పెద్ద వాళ్లే - తనకంటె వయసులో పెద్ద అయిన ఆడపిల్లలే - అతన్ని ఆ రోజుల్లో ఆకర్షిస్తూ వుండేవాళ్లు. అయితే స్థిరంగా ఒక అమ్మాయిపట్లనే ఆకర్షణ నిలచి వుండకపోవడం అతనికి చిరాకు అనిపించేది. తను అంత చెడ్డవాడా ?

'కాదు.. నీవింకా పసివాడివి' అన్నది మధు, తన భయాలు ఆమెకు చెప్పినప్పుడు

ఆమె అతన్ని అంత 'సీరియస్'గా తీసుకోవడం లేదు, యిప్పటికి కూడా. ఇంకా నవ్వులాటగానే పరిగణిస్తోంది.

'ఏమిటి నీఉద్దేశ్యం ?' అన్నాడు అరుణ్, కళ్లు ఆదుర్దాతో కూరుకుపోతూ వుండగా.

'ఎప్పుడూ మనసుపాడు చేసుకోకు. నీకు యిష్టం అయిన వాళ్లతో కలిసి తిరుగు. ఆమెతో మాట్లాడుతున్నప్పుడు యేవయినా మంచి మంచి కబుర్లు చెప్పు' అంది మధు.

'నేను చెబుతూనే వుంటాను'

'అది గాదు నేననేది. ఎంతసేపూ నీ చదువు, సంగతులు, మీా టీచర్ల సంగతి కాదు. ఇంకేదయినా విషయాలు'

మరోమారు ఆమె అతని వంక కన్ను గీటుతూ, హుషారుగా మాట్లాడింది. చేయిఎత్తి, బొటనవేలు - చూపుడు వేలు పూర్ణచంద్రాకారంగా కలిపి, తతిమ్మా మూడు వేళ్లు నిలువుగా నిలిపి 'నేను నీతోనే వున్నాను' అన్నట్లు అతనికి ధైర్యం చెబుతూ వుండింది.

ఉహు. అరుణ్ కూడా తండ్రిమాదిరే ఆమెను సరీగా అర్థం చేసుకోగలిగేవాడు కాదు. ఆమె అతి దృఢ నిశ్చయురాలు, పట్టినపట్టు వదలని మనిషి. చిలిపితనం పరధ్యాస కూడా వున్నాయి ఆమెలో. ఏ విషయం మీాదయినా యెక్కువ సేపు మనసు నిలిపి వుంచడం ఆమెకు సాధ్యం కాదనిపిస్తుంది. మీావంక చూస్తూ మీాతో మాట్లాడుతూ వుంటుంది. కాని కళ్లు

యేమిటో తిరుగాడుతూ వుంటాయి, మనసు మరేటో మొగ్గుతూ వుంటుంది. పిల్లిలా అడుగులు వేస్తూ నడుస్తుంది , ఆమె మీ ముందుకు వచ్చి నిలుచునేంత వరకు ఆమె వస్తున్నట్లే మీకు సూచన వుండదు. ఆమె నించుని వుంటుందన్నమాటే గాని శరీర భాగాలు మాత్రం రకరకాలుగా విన్యాసాలు చేస్తూ వుంటాయి. ఎప్పుడూ ఎవరినో పిలుస్తూనో, యెవరిచేతనో పిలువబడుతూనో వుంటుంది. అటు యిటు చూడడం కోసం కళ్లు పలుదిక్కులుగా ఆడిస్తుంది. ఆ కళ్లలో ఎన్నో ఆశలు, ఆకాంక్షలు వున్నాయి. తండ్రి ఆమెను 'ఇది ఉత్తి ఆటకాయతనం మనిషి' అంటాడు. తల్లి 'అయితేనేం ? ఎంత తెలివి కలది !' అంటుంది.

ఒక రాత్రి మధు వెళ్లి అరుణ్ పక్కలో చేరింది. ఇది వరకు కూడా యిలా వచ్చిచేరేది కాని ఎక్కువ సేపు ఉండేది కాదు. వద్దని పోట్లాడిన తరువాత రావడం నిలిపివేసింది. అరుణ్‌ను యింకా పసివాడుగానే పరిగణించడం ఆమె పద్ధతి. అతని దగ్గరకు వచ్చి చేతులు రెండూ అతని బుజాలమీద వేసి యేవేమిటో చెబుతూ వుండేది. అతని వంతు వింటూ వుండడమే. ఏమీ మాట్లాడటానికి వీలులేదు మధ్యలో యేదన్నామాట వచ్చినా ఆమె చికాకు పడేది. పడుకుని వున్నప్పుడు యేమాత్రం కదిలినా కూడా అతన్ని నొక్కిపట్టివుంచేది బలంగా. 'కదలకుండా పడుకోలేవా ?' అని కోపం చేసేది. 'నేనోమాట కూడా మాట్లడకూడదా ?' అని అతను అన్నప్పుడు 'ఉహు, కూడదు' అనేది.

'ఎందుకని ?'

'నీవు యింకా చిన్నపిల్లవాడివి. నీకేమీ తెలియదు జీవితాన్ని గురించి'

'అలా అయితే నిన్ను నా పక్కదగ్గరకు రానివ్వను'

'ఆహా !' అని నవ్వుతూ ఆమె దుప్పటి విసిరేసి ఛివాలున లేచి కూర్చునేది. 'నీ దగ్గరకు వచ్చి-నీతో మాట్లాడడం చేస్తున్నందుకు - ఎంతో కృతజ్ఞుడవై వుండాలి నిజానికి. నీ మందబుద్ధిని మేల్కొల్పటానికి ఎన్నోరకాల ప్రయత్నిస్తున్నాను...'

'నీ తెలివి నీ మేలుకొలుపులు నీ దగ్గరే వుంచుకో'- అని బదులుగా అరిచేవాడు అరుణ్  ఆమె కోపంగా గదిలోనుంచి విసివిస బయటకు వెళ్లిపోయేది.

- ఆమె యిలా వచ్చి పక్కలో చేరి చాల రోజులయింది. రాజీ సంప్రదింపులు చేయటానికి ఉభయ పక్షాల వాళ్లూ ప్రయత్నం చేయలేదు చాలా చిన్నతనం నుంచి - అంటే అరుణ్ రాత్రిళ్లు నిద్రపట్టక అవస్థ పడుతున్న సమయం నుంచి ఆరంభం అయింది యీ సందర్భం. అతను తల్లిని తన దగ్గర కూర్చున రమ్మని పిలచేవాడు  ఆమె కొద్దిసేపుమటుకే అతని దగ్గర కూర్చుని జోకొట్టేది. ఒక రోజు కన్నీళ్లు పెట్టుకుని మరీ అడిగాడు సోదరిని - నాతో వచ్చి పడుకోమని  ఆమె అతనికి నిద్రవచ్చేంత వరకు తోడుగా వుండటానికి అంగీకరించింది. ఇది ఎన్నో సంవత్సరాల క్రిందటి విషయం. ఇప్పుడు అరుణ్‌కు 'తోడు' ఎవరూ వుండవలసిన అవసరం లేదు. కాని .. ఆమె యిప్పుడు అతన్ని మెలుకువగా వుంచటానికి, మాట్లాడుతూ కూర్చోటానికి వస్తోంది. ఆమె ఉత్సాహంలో అనవసరమైన విషయాలన్నీ మాట్లాడుతూ వుంటుంది. జనం ఎందుకు ముసలి వాళ్లయిపోతారు ? చావు అంటే ఏమిటి? ప్రేమలో వుండే సుఖం అందరికీ తెలుసు. కానయితే దానిలో వుండే దుఃఖం, విచారం అతనికి తెలుసునా ?.... యిలా. ఎప్పుడేనా అతను జవాబు చెప్పబోతే నోరునొక్కేసేది. అతను ఎప్పుడూ శ్రోతగానే వుండాలి గాని నోరుతెరవగూడదు. అతనికి జీవితాన్ని గురించి యేం తెలుసును గనుక !

డిసెంబర్ మాసం చలిరోజులు. ఆ రోజు అమావాస్య. కన్ను కానరాని చీకటి. అరుణ్ తన గదిలోకి వెళ్లటానికి ముందే ఆమె వచ్చి ఉన్నది. 'సరే. నీవు కూడా మాట్లాడవచ్చు. కాస్త జరుగు - పడుకుంటాను'.అంది. నిజానికి యీ బతిమిలాట అనవసరం. వాళ్ల తగాయిదా గడిచిపోయి రెండు సంవత్సరాలు అయింది. అప్పుడు అరుణ్‌కు పధ్నాలుగేళ్లు. ఇప్పుడు పదహారు, మరో ఆరంగుళాలు ఎదిగాడు. అతని కంఠధ్వని కూడా మారిపోయింది.'కాస్త వళ్లు చేశాడు. మధుయే తన స్నేహితురాళ్లు కొందరిని అతనికి పరిచయం చేసింది. అతనిప్పుడు మగవాడు , అతను చెప్పేమాటలు వినడం అవసరం.

'చలిగా వుంది. దగ్గరకు రా' అంటూ ఆమె శాలువను తనవైపుకు గుంజుకుంది.

మధు వెల్లకితలా పడుకుంది. అరుణ్ పక్కకు పడుకున్నాడు, ఆమెకు ముఖాముఖిగా. సంవత్సరాల కిందటి అలవాటు ప్రకారం ఆమె పొట్టమీద చేయివేసి పడుకున్నాడు. వాళ్లిద్దరి మధ్య నాలుగు సంవత్సరాల అంతరం వుంది. అతనికి రాత్రి అంటే భయం యేర్పడి, మధుబాలను తనతో వచ్చిపడుకోమని అడిగినప్పుడు అతనికి నాలుగేళ్లు. మధుకు అప్పుడు ఎనిమిది. ఎన్నాళ్లయినా అక్కతో సమంగా ఎదగలేకపోతున్నానే అని అతనికి బెంగగా వుండేది. ఎంతో ప్రయత్నం చేశాడు. అయినా అతనికి ఎనిమిదేళ్లు వచ్చేసరికి, ఆమెకు పన్నెండేళ్లు వచ్చేశాయి. అతనికి పదేళ్లు అయితే ఆమెకు పధ్నాలుగు. అతనికి పధ్నాలుగు అందుకనే సరికి ఆమె పద్దెనిమిదేళ్ల మనిషి అయిపోయింది.

ఈ రోజు కూడా అతను ఆమెకంటే నాలుగేళ్లు చిన్నవాడే. కాని ఆకారానికి బలానికి ఆమెకంటె పెద్ద. ఇదివరకు యిద్దరూ కుస్తీపట్లు పట్టేవాళ్లు. ఒకసారయితే ఆమె అతన్ని విసురుగా కిందకు తోసింది. తలకు దెబ్బతగిలి నెత్తురు కారింది కూడా. ఆమె అతని చెవులు మెలిపెడుతూ వుండేది. అలాగే - యీ రోజున కూడా కుస్తీ చేయవలసి వస్తే ఎవరు గెలుస్తారు అన్న విషయంలో యేమీ అనుమానం లేదు అతను పొడుగరి, బలశాలి. అతని ముందు ఆమె సన్నని లత.

ఇద్దరూ మంచం మీద సర్దుకుని అనుకూలంగా పడుకోవాలనుకున్న తరువాత 'నీకు యీ సరికయినా తెలిసిందా - ఆడవాళ్లు నెలకు మూడురోజులు తొడల మధ్య ఎందుకు కట్టుకుట్టు కుంటూరో ?' అనడిగింది.

అరుణ్ జవాబు చెప్పలేదు.

'నీకు యీ సరికి జవాబు దొరికెవుండాలి'

'ఊహు దొరకలేదు' అన్నాడు అరుణ్ సిగ్గుపడుతూ, తలకాయను దుప్పట్లో దూర్చుకుంటూ

'తెలియలేదా ?'

'ఉహు'

'అయితే నువ్వ తప్పనిసరిగా మొద్దబ్బాయివే !'

అరుణ్ యేమీ చిరాకు పడకుండా నవ్వాడు.

'ఆడవాళ్లు మూడురోజులు చాలా మురికిగా వుంటారు' అంటూ ఆమె అతను పన్నెండేళ్ల కుర్రాడుగా వున్నప్పటి అలవాటు ప్రకారం అతని చెవులు మెలిపెట్టింది.

'ఎందుకని ?'

'నాకూ తెలీదు ఆ రోజుల్లో ఎక్కువగా రక్తం పోతుంది.'

'ఎక్కడి నుంచి ?'

'మర్మావయవాల నుంచి, ఆ మాత్రం తెలిదా ? యింకేం వెధవ ప్రశ్నలు వేసి వేధించకు నన్ను'

అరుణ్ తన అంతరంగం వెచ్చనవడం గమనించాడు

'ఆ రోజుల్లో ఆడవాళ్ల దగ్గరకు వెళ్లగూడదు'.

అరుణ్ ఆ విషయం ఆలోచించనే లేదు.

'నాకయితేనే నెప్పి వుండదనుకో. కొందరు ఆడవాళ్లు మాత్రం విపరీతంగా బాధపడతారు ఆ రోజుల్లో.'

'ఎందుకని ?'

'నోరుమూసుకో... ఎప్పుడూ ఎందుకని ? ఎందుకని? అని ఒకటే ప్రశ్నలు'

తన పూర్వ స్వభావానికే తాను మరలిపోతున్నానని గమనించి ఆమె - అరుణ్‌ను నుదుటి మీద ముద్దుపెట్టుకుంది. 'మరేం నొచ్చుకోకు, నా మాటలకు' అంది.

అరుణ్ నుంచి పక్కకు జరిగింది. కిటికీలోంచి చూస్తూ 'బాగా చీకటిగా వుంది. నక్షత్రాలు చూడు ఎంత ప్రకాశమానంగా వున్నాయో !' అంది.

'వారి ప్రియుడు చంద్రుడు ఎక్కడ ?' అనడిగాడు అరుణ్ ధైర్యంగా - తమ పూర్వపు సంభాషణలు గుర్తుతెచ్చుకుంటూ

మధు గాఢంగా నిట్టూర్చింది, ఎక్కడున్నాడో తనకు తెలియదు అన్నట్లుగా. ఉన్నట్లుండి బిగ్గరగా నవ్వి 'తన సోదరుడితో పారిపోయింది' అంది.

అరుణ్ కూడా ఆమెతో పాటు నవ్వాడు. ఆ సంభాషణ అంతటితో ముగిసిపోయింది మళ్లీ ఆమె అతని వైపు తిరిగింది ఇప్పుడు యిద్దరూ ముఖాముఖిగా వున్నారు. ఆమె స్తనాలు అతని రొమ్ముకు ఒత్తుకుంటున్నాయి. ఆమె కాళ్లు అతని కాళ్లను నొక్కిపట్టివున్నాయి. అరుణ్ శరీరం లోపలంతా ఉడికి పోతోంది. మధుకు యిదేమీ పట్టినట్లు లేదు.

'అరుణ్ ! పెళ్లి అయిన తర్వాత భార్య, భర్త యేం చేస్తారో నీవు ఎరుగుదువా ?' అన్నది మధు కాస్సేపాగి

'కొంత వరకు'

'కొంత వరకా ? అంటే ఎంత వరకు ?'

ఆమె యింతకంటె ముందుకు పోలేదు. ఆమె అటు యిటు కదిలిపోతోంది అవిశ్రాంతంగా. మళ్లీ పక్కకు తిరిగింది తరువాత - అతనికి ముఖా ముఖిగా జరిగింది, యిదివరకటి లాగే.

'అరుణ్ మనం ముక్కులు రాసుకుందాం..' అంది.

'ముక్కులా ?'

అరుణ్‌కు యేమీ అర్థం కావడం. అతనికి మధుఅంటే ఎప్పుడూ అంత విశ్వాసం లేదు ; అయితే యీ రోజు ఆమె ప్రవర్తన అలవికాకుండా వుంది.

'ఊ . అవును నీ ముఖంలో వున్న ఈ మొద్దు పాటి ముక్కు. దాన్ని నా ముక్కుతో రద్దు...' అంది.

ఆమె ఆపని చేయడం అప్పుడే ఆరంభం చేసింది.

అరుణ్ ముఖం వెచ్చనయింది. ఒళ్లంతా ఉద్రేకం పొందుతోంది. నిద్రమత్తు వస్తోంది. చుట్టూ పరిసరాలన్నీ అంతర్ధానం అయిపోతున్నట్లనిపిస్తోంది.

మధు తప్ప యింకేం లేదు యీ ప్రపంచంలో  ఆమె వంటి వేడి, ఉచ్ఛ్వాస నిశ్వాసాల మెత్తదనం, చర్మ సౌకుమార్యం అతన్ని లోగొంటున్నాయి. అతని వీపుమీద ఆమె చెయ్యి గట్టిగా నొక్కుతూ వుండింది.

'ఇప్పుడు నాలుకలు కలుపుకుందాం' అంది.

ఈ సరికి అరుణ్ ఉద్రేకంతో ఊగిపోతున్నాడు  మాటలు రానంత నీరసం అతన్ని ఆకట్టుకున్నది. అతనికే  తెలియకుండానే అతని నాలుక ఆమెనోట్లో చేరింది.

మరుక్షణం మధుమంచం మీద లేచి కూర్చుంది. 'అరే - బాబా - నేను యింక వెళ్లిపోవాలి  ఆలస్యం అయిపోయింది' అంది. ఆ కంఠ స్వరం కూడా వేరుగా వుండింది. ఈ మాటలు అనేసి ఆమె గదిలోంచి పరుగున బయటకు వెళ్లిపోయింది.

అరుణ్ మరునాడు ఆమెవంక నేరుగా చూడలేకపోయాడు. రాత్రి యేమిటి ఆమె చూపిన ఆతురుత ? తొందరపాటు ! ఏమయినా ఆమె తనకు సోదరి. స్వతహాగా అక్క ! ఆమె యింకా తనను చిన్నపిల్లవాడుగానే పరిగణిస్తూ ఆటలు పట్టిస్తోందా ?

మధు రాత్రి జరిగిందంతా ఎప్పుడో మరిచిపోయింది. రాత్రి తాను అతన్ని కలుసుకోనట్లు, కలుసుకున్నా యేమీ జరగనట్లు ప్రవర్తిస్తోంది. ఆమె హుషారుగా చలాకీగా వుంది. ఆమె నిద్రలేచి చాలసేపు అయినట్లుంది. లేవడం, ముఖం కడుక్కోవడం, కాలకృత్యాలు తీర్చుకోవడం అయినట్లుంది. ఇప్పుడు ఆడుకోవటానికి 'స్కిప్పింగ్' తాడు కోసం వెదుకుతోంది. అరుణ్ ఆమె పక్కనుంచీ వెడుతూ కూడా పలుకరించకపోవడం, ముఖం వంకనయినా చూడక పోవడం గమనించి, 'యేం అరుణ్, వంట్లో సరీగా లేదా ?' అనడిగింది ఆమె. బాగానే వున్నాను అన్నాడతను. 'అదోలా వున్నావులే. అందుకని అడిగాను. నా స్కిప్పింగ్ తాడు ఎక్కడయినా చూచావా ?' అనడిగింది ఆమె.... అంతా అలా జరిగిపోతుంది. ఆమె అప్పుడప్పుడు తల్లితోను, ఈషర్‌తోను, అరుణ్‌తోను అతికటువుగా మాట్లాడుతుంది. తరువాత వాళ్లను

కలుసుకున్నప్పుడు అలాంటి సందర్భం యేమీ జరగనట్లే ప్రవర్తిస్తుంది. ఎంతో హుషారుగా నవ్వుతూ తుళ్లుతూ బుజాలమీద చేతులు వేస్తుంది. ద్వేషం, కార్పణ్యం అనేవి ఆమెలో యేమాత్రం అగుపించవు. అంతేకాదు, ఆటకాయతనం, చురుకుతనం, తక్షణ కర్తవ్యపాలన ఆమెలో నిరాటంకంగా వున్నాయి. 'ఓ ! నా స్కిప్పింగ్ తాడు ఎక్కడ ?' అని అరిచింది అవతలిగదిలో తల్లిదండ్రులకు కూడా వినిపించేట్లు. 'ఏమిటా అరుపులు. ఎక్కడో అడవుల్లో పుట్టాల్సిన మనిషి యిక్కడ అవతరించింది' అనేవాడు తండ్రి, ప్రభారాణితో విసుగ్గా ఇంతలో మధు మళ్లీ అరిచేది. 'నా స్కిప్పింగ్ తాడు దొరికింది. దారికి అడ్డులే - కాస్సేపు ఆడుకుంటాను' అరుణ్‌ను పక్కకు నెట్టేసి ఆటప్రారంభించేది. ఒకటి - రెండు - మూడు అంటూ ఎన్నిసార్లు గెంతుతున్నదీ లెక్క పెట్టుకుంటూ వలయాకారంగా ఎగురుతూ తిరుగాడేది.

ఆ సంవత్సరం మార్చినెలలో ఆమె వివాహం అయింది. ఆమె భర్త వజీరాబాద్ కోర్టులో రీడర్‌గా వుద్యోగం చేస్తున్నాడు. పెళ్లికి ముందు కొన్ని రోజుల పాటు మధు ఈ విషయాన్ని గురించి తప్ప యింకేం మాట్లాడలేదు. తల్లిదండ్రులను అడిగింది - రీడర్ అంటే యేమిటని ? అతని కింద ఎంతమంది పనిచేస్తూ వుంటారని ! అతనికి ప్రభుత్వ నివాస భవనం కేటాయిస్తారా - అని. ఎంతపెద్దదీ ఆ యిల్లు అని... క్రమ క్రమంగా యీ వివరాలన్నీ రాబట్టి తన స్నేహితురాళ్ల ముందు చెబుతూ వుండేది మురిసిపోతూ.

మధు వెళ్లిపోయిన తర్వాత అరుణ్‌కు యిల్లంతా బోసిపోయినట్లు అనిపించసాగింది. చాల రోజులపాటు, మధువధువు అలంకరణలో వున్న విగ్రహమే అతని మనస్సులో మెదలుతూ వుండేది. ముఖం మీద స్ఫోటకం మచ్చలు వున్నాయని ఆమె అందాన్ని ఎప్పుడూ తక్కువగా పరిగణించలేదు అరుణ్ పెళ్లినాడు, వంటి నిండా బంగారు వెండి నగలు ధరించి వివిధ అలంకారాల మధ్య ఆమె మెరిసిపోతూ అగుపించింది ముఖంలోని మచ్చలు అలంకారంలో కలిసిపోయాయి. ఒకటి రెండు కనిపిస్తూవున్నా ఆ అమ్మాయి 'పెద్దమనిషి తరహా'కు దోహదంగా నిలిచాయే తప్ప మరోలా కాదు. జీవితంలో మొట్టమొదటి మారుగా - ఒక మారు అన్నట్లుగా ఆమె సిగ్గుపడుతూ

తలకిందకు వాల్చుకుని నడుస్తూంది కొత్త జీవితం కోసం ఆమెపడుతున్న ఉబలాటం, అది అనుభవంలోకి వస్తోందన్న ఉత్సాహం ఆ ముఖంలో ఉట్టిపడుతున్నాయి. వధువులు కొత్తగా అత్తవారింటికి వెళ్లుతూ వున్నప్పుడు యేడవడం అరుణ్ అనేకమార్లు గమనించాడు. మధుకూడా యిప్పుడు యేడుస్తోంది దాదాపు బిగ్గరగానే కూడా. కాని వెంటనే కళ్లతడితుడిచేసుకుని తల్లిదండ్రులను పాదాభివందనం చేసి ప్రయాణపు బగ్గీలో కూర్చొని తెరలు మూసేసింది.

అరుణ్ ఆ తరువాత తన సోదరి సుఖంగా వున్నట్లు చూడనే లేదు. ఆమె శరీరం లావయింది, బరువు పెరిగింది, ముఖంలో ముదురుతనం వచ్చింది పెళ్లికాని పిల్ల సుకుమారం పోయి - సంసార సుఖం యెరిగిన చూపులు వచ్చాయి నవ్వడం మానివేసింది గొంతు కూడా అదోలా అయింది. సియల్ కోటకు అతి అరుదుగా మటుకే వచ్చేది వచ్చినప్పుడు కూడా తన స్నేహితురాళ్లను కలుసుకునేది కాదు. రోజంతా పక్కమీదనే కూర్చుని దిగులుగా ఆలోచిస్తూ వుండేది.

అరుణ్‌కు ఆ సంవత్సరాల గుర్తు లీలగా వుంది. అప్పుడతను కాలేజిలో చేరబోతున్నాడు. ఆమెను చూచిన ప్రతిమారూ ఆమెలో విసుగుదల, అలసట ఎక్కువయి పోతున్నట్లు అనిపించింది అతనికి. ఆమె భర్త అంత కలివిడి అయిన మనిషికాడు. అరుణ్‌కు అతనితో పరిచయం పెంచుకోవడం సాధ్యం కాలేదు పలచని మనిషి. టూత్‌బ్రష్ మొనల్లా తేలివుంటాయి అతని మీసాలు కళ్లకు లావయిన అద్దాలు వేసుకుంటాడు. లాలా కాన్షీరామ్‌గాని ప్రభారాణి గాని అతనితో చనువు యేర్పరచుకోలేకపోయారు. తల్లి ఎప్పుడూ మధును ఓదారుస్తూ వుండేది. కూతురు అంటే అంత చనువులేని తండ్రికూడా తరుచుగా మధు దగ్గరే కూర్చుని యేదో ఆలోచిస్తూ వుండేవాడు.. అని అరుణ్‌కు గుర్తు.

ఆమె వివాహం అయిపోయిన రెండు సంవత్సరాలకు గాబోలు అరుణ్ అడిగాడు, 'మధు, నువ్వు యిలా నవ్వడమే మరిచిపోతావని నేను ఊహించలేదు.'

'నేను మరిచిపోలేదు' అంటూ ఆమె నవ్వింది, నీరసంగా. మాట కూడా బహు మందంగా వుండిది.

'ఏమయింది మధూ ?'

అరుణ్‌కు ఆమెను ఎటువంటి ప్రశ్నలు వేస్తే తేలికగా జవాబులు వస్తాయో బాగా తెలుసు.

'ముఖంమీద మచ్చలకు మీ ఆయన నిన్ను దెప్పుతున్నాడా ?'

'ఉహూ - లేదు. ఇంట్లో ఆడవాళ్లు మాత్రం అప్పుడప్పుడు సాధిస్తూ వుంటారు. ఆయనకు యివి తమాషగానే కనిపిస్తున్నాయి' అని నవ్వుతూ చెప్పింది మధుబాల

'మరయితే యేమిటి నీకు దిగులు ?'

'నాకు పిల్లలు కలగడం లేదు...' అంది దుఃఖంగా

'డాక్టర్లను చూచారా ?'

'ఆ... అయింది'

'కలగకబోతే అదో గొప్ప విషయమా ?'

'నాకు కాదు. కాని ఆయన, ఆయన కుటుంబం. .. పిల్లలు కావాలని ఉబలాట పడుతున్నారు.'

అరుణ్ పిడికిలి బిగించి అభినయిస్తూ 'వాళ్లతో పోరాటం చెయ్యి - వివాదం వేసుకో'

'ప్రయత్నించాను. కాని మా ఆయనకు, అత్తగారి కుటుంబానికీ నాకు పిల్లలు పుట్టటం అతి ముఖ్యమైన అవసరం. నేను గొడ్రాలినయి పోయానని ఒకటే వేధింపు, సాధింపు'

ఆమె వేళ్లతో జుట్టు సవరించుకుంది. ఆ వేళ్లలో వెనుకటి తేజంలేదు.

ఇటీవల - అదీ ఫిబ్రవరి నెల నుంచి మాత్రమే, ఆమెలో మళ్లీ జీవకళ కొద్ది కొద్దిగా అగుపిస్తోంది వాళ్లు ఓ బిడ్డను దత్తత తీసుకోవాలనుకుంటున్నారట

ఈ నిర్ణయంతో వాతావరణం అంతటా కొత్త వెలుగులు ప్రసరించసాగాయి ఇంత తేలికగా యీ సమస్యకు పరిష్కారం దొరికిపోయేట్లయితే యిన్నాళ్లూ యిదివాళ్లకెందుకు స్ఫురించలేదో అరుణ్ అర్థం చేసుకోలేక పోయాడు ప్రభారాణి తానే యీ సలహా వాళ్లకు యిచ్చానంటుంది. కాని అరుణ్‌కు అనిపిస్తుంది - యిది మధు స్వంత ఆలోచన అని ఆమె భర్త సోదరులలో ఒకామె నవంబర్ మాసం ప్రాంతాల్లో కనబోతోంది వాళ్లకు యిప్పటికే చాలమంది పిల్లలు వున్నారు ఈమారు కనబోయే బిడ్డను మధుకు - రాజీవ్‌కు యిచ్చివేస్తామని వాగ్దానం చేశారు. దానితో ఆమె అత్తగారి యింట శాంతి మళ్లీ నెలకొన్నట్లయింది. మధుజీవితంలో చెప్పటానికి వీల్లేనంత మంచి మలుపు తటస్తించింది.

ఆమె యిప్పుడు మూఢచార పరాయణురాలు అయిపోయింది - యిదివరకటి వేళాకోళం, వెక్కిరింత యేమయిపోయినాయో ! ఆమె యిప్పుడు ప్రతిరోజూ దేవాలయానికి వెడుతుంది. ఏవేవో నోములు వ్రతాలు చేస్తోంది. అరుణ్ ఆమెను యీ విషయంగా వేళాకోళం చేయబోతే ఆమె - యీమారు ఏప్రిల్‌లో సియల్‌కోట వచ్చినప్పుడు తనను తాను సమర్థించుకునే ప్రయత్నం చేసింది. సూర్యుడు యే ఆధారమూ లేకుండా ఆకాశంలో కిందకు పడిపోకుండా ఎలా నిలచివున్నాడు ? భూమీ, చంద్రుడు, నక్షత్రాలు .. వీటిలోపల యెలాంటి సరంజామా వుంది? గూటిలో వున్నపక్షికి మురుగులో కూరుకుపోయిన పురుగుకు ఆహారం ఎవరు సమకూరుస్తున్నారు ? ఈ మహానాటకాని కంతటికీ ఓ కర్త వుండివుండాలి. ఈ సృష్టికర్త ప్రభావానికి అతీతం అయింది యింకేం వుండి వుండదు. తాను చిన్నప్పటి నుంచి కాస్తంత భక్తి భావం, ఆరాధన తెలుసుకు వున్నట్లయితే తనకూ పిల్లలు కలిగేవారేమో ! ఏది యేమయినా అరుణ్‌కు పుస్తక పాండిత్యం తప్ప జీవితం ఏం తెలుసును ?

సరిగా యిలాంటి పరిస్థితుల్లో - రానున్న సెప్టెంబర్ మాసంలో మధు, ఆమె భర్త రాజీవ్ కాశ్మీర్‌లోని 'శ్రీవైష్ణవి టెంపుల్'కు వెళ్లనుకున్నారు. ఆ దేవాలయం చాలా ప్రసిద్ధమైనది. అక్కడకు యెందరెందరో దూరప్రాంతాలనుంచి వస్తారు. వైష్ణవీదేవి యెంతో మహిమకలది. ఆమెను సందర్శించిన వాళ్ల

కందరకూ పుత్రభిక్ష కటాక్షించింది. దత్తత చేసుకున్న దంపతులకు కూడా దరిమిలా స్వంత సంతానాలు కలిగాయి - ఎన్నో సందర్భాలలో. ఆ విషయం అలా వుంచి - యిప్పుడు దత్తత చేసుకోవాలనుకుంటున్నారు గనుక ఆ మహాతల్లి అనుగ్రహం సంపాదించడం అవసరం. ఈ వాదన సవ్యంగా కనిపించి రాజీవ్ యీ తీర్థయాత్ర చేయడానికి అంగీకరించాడు.

మత కలహాలు ప్రారంభం అయి తీవ్రరూపం ధరిస్తూ వున్నప్పుడు లాలా కాన్షీరామ్ వాళ్లకు ఉత్తరం రాశాడు. ఎలాగూ సెప్టెంబర్‌లో యాత్రకు వెడదాం అనుకుంటున్నారు గదా. ఒక నూరు సియల్ కోటకు వచ్చి, యి యాత్ర ముగిసేంత వరకూ యిక్కడ వుండండి అని. వజీరాబాద్ చాలా చిన్న గ్రామం. అక్కడ వాళ్లకు తగినంత రక్షణ వుండదు. తరువాత - లాలా కాన్షీరామ్‌కు అనిపించింది ఈ నగరంలోనూ తనకు ఎన్నో పరిచయాలు ముస్లిం స్నేహితులు యితర పోలీసు లావాదేవీలు వున్నా గూడా యేమాత్రం రక్షణ యేడ్చింది గనుక! అందుచేత ఒకమారు ఉత్తరం అయితే రాశాడు గాని, యీ అభిప్రాయాన్ని నొక్కి చెబుతూ మళ్లీ మళ్లీ రాయలేకపోయాడు. ఆగస్ట్ మొదటివారం వరకూ వాళ్ల దగ్గర్నుంచి యెలాంటి జవాబు రాలేదు. చౌద్రి బర్కత్ ఆలీ బంధువుల మూలంగా అక్కడి సమాచారం వాకబు చేస్తూ వుండేవాళ్లు. వజీరాబాద్‌నుంచి యెవరయినా వస్తే వాళ్లను అడుగుతూ వుండేవాళ్లు. కాని ఎలాంటి వర్తమానమూ లేదు. కాని.... కాని.... యిప్పుడు ఈ దారుణ వార్త !

అరుణ్ ప్రశాంతంగా నిద్రపోతున్న చాందిని వయిపు నిదానంగా చూచాడు ఆమె స్తనాలు ఊపిరికి లేస్తూ పడుతూ వున్నాయి, ఊపిరిపీల్చు కోవడంతో పైకి, వదలడంతో కిందికి - అంతా లయబద్ధంగా. బలవత్తరమైన ఆకర్షణను తట్టుకోలేక అరుణ్ మెల్లగా లేచివెళ్లి ఆమె సరసన పడుకున్నాడు. డేరా రెండు భాగాలుగా విభాగం అయివుంది ఒక వయుపు, లాలా కాన్షీరామ్, ప్రభారాణి, అరుణ్ పడుకుంటారు. మధ్యలో రెండు గుంజలు వున్నాయి. మరో వయిపు పద్మిని - ఛాందిని పడుకుంటారు: ఆ పక్కనే పంటకు యేర్పాటు వుంది.

అరుణ్‌కు తాను చేస్తున్నది ఎటువంటి అసంబద్ధమైన విషయమో తెలుసును ఇంట్లో ఒక పక్క మరణవార్త దుఃఖ వాతావరణాన్ని తీసుకు

వచ్చింది. డేరాలో యింకా యితరులు వున్నారు. కాని ఆ క్షణంలో అవన్నీ యితన్ని - కామాతురుడు గనుక వెనకడుగు వేసేట్లు, సిగ్గు, భయం వుండి ప్రవర్తించేట్లు చేయలేదు అతన్ని ఆకట్టుకుంటున్నదల్లా ఎదురుగా సన్నగా కడ్డీలాగా ఛాందిని పడుకుని వున్న దృశ్యమే. ఆమెలో యెలాంటి కదలికలు లేవు. నిద్రపోయిన తర్వాత యెవరో ఆమెను తీసుకువచ్చి పడుకోబెట్టినట్లు పుస్తకం లాగా పడుకుని నిద్రపోతోంది. స్థనాలు మాత్రం ఎగిసి లేస్తున్నాయి, కిందకు పడుతున్నాయి. ఆమె ముక్కుపుటాలనుంచి ఉచ్ఛ్వాస నిశ్వాసాలు కూడా అంత మృదువుగా జరుగుతున్నాయి. మెడ కాలర్ ఎముకలు మెరుస్తూ కనిపిస్తున్నాయి బయట .... యిప్పుడిప్పుడే వెలుగులు ప్రసరిస్తున్నాయి. ఇంకా వీధుల్లో జనసంచారం లేదు. ఆకాశం కూడా గాలిపీలుస్తున్నట్లు వుంది. మధుపోయింది. అయితే నేం ? జీవ ప్రసారం యధావిధిగా సాగుతూనే వుంది నింగి నేల మామూలు సాధ్యాలతో మెలుగుతున్నాయి. ఈ క్షణంలో .. మృత్యువు వాళ్ల మీద దెబ్బతీసింది. కాని చుట్టూ యేమాత్రం జంకుగొంకు లేని జీవప్రసారం సాగిపోతూనే వుంది. నిరవధికంగా నడిచిపోతూంది. జీవధార అంటే యిదే. వస్తువులు, జీవులు యింకా నిలచివుండాలని చేసుకునే సంకల్పం. అరుణ్‌లో కూడా యింతటి జీవేచ్ఛ, సంకల్పం యిది వరకు ఎన్నడూ స్థావరించుకోలేదు. ఒక పక్క చావుదెబ్బ తగిలినప్పుడే యిది యెక్కువయిపోతోంది. శక్తివంతంగా పుంజుకుంటూంది. ఈ ప్రసారం లేకపోతే బతికి వుండడం కష్టం అయిపోయేట్లు అనిపిస్తోంది. అతనికి ఆకలి అయింది. విపరీతంగా కడుపులోని పేగులు ఆకలి ఆక్రందనలు చేస్తున్నాయి. ఆలోచించిన కొద్దీ యీ పేగుల అలజడి ఎక్కువవుతోంది. శరీరంలోని కణాలన్నీ మృత్యువుకు వ్యతిరేకంగా ఒక్కుమ్మడిగా తిరుగుబాటు చేసి మరేదో ఆకలిని సృష్టిస్తున్నాయి. తప్పుచేస్తున్నా నన్న భావన , యేదో ఆహుతి అయిపోవాలన్న ఆరాటం.... అతన్ని లోగొన్నాయి. ఇంద్రియ లోలత్వంలో పడిపోగూడదని నేర్చుకున్నాడు. ఇలా పడిపోకుండా వుండడంలోనే జీవితానికి అవసరం అయిన సుఖం, ఆనందం వున్నాయని విన్నాడు. కాని యీ క్షణంలో యేదీ పోగొట్టుకోవాలని పించడం లేదు, దేనికీ దూరమైపోవాలను కోవడం లేదు. శరీరము, మనస్సు - అంతరంగం .. యేదో పరిణామం పరిపక్వత

పొందాలని ఆరాటపడుతున్నాయి  ఆ ఆరాటాన్ని తీర్చుకోవడం లోనే ఆనందం వుంది  మధు పోయినా సరే ! మధు పోయింది గనుకనే యేమో గూడా !

చాందిని పక్కన పడుకున్నాడు  ఆమెను చేతులలోనికి తీసుకోవాలని వుంది  ఇప్పుడు కృత నిశ్చయుడైనాడు  మధుకు - యీ పరితాపానికి - తగిన మందు యీ జీవధారతో ఎగిసిపడుతున్న శరీరంలో వెదుక్కోవాలి. మరచిపోవడం కాదు తనకు కావలసింది, కొనసాగింపు. అవును అదే  శాశ్వత జీవధార ప్రసారానికి ఎదురుగా కనిపిస్తున్న యీ శరీరాన్ని ఆశ్రయించడం - అక్రమించడం తప్ప మరో మార్గంలేదు. దీనిలోతాను ప్రవేశించాలి. బహుశ నూర్‌లో కూడా యిలాంటి రహస్యం వుండి వుంటుంది. కాని నూర్ యిప్పుడు తనకు చాలా దూరంలో - బహు దూరంలో - వుండిపోయింది  ఇప్పుడే యిక్కడే - కొన్ని అంగుళాల దూరంలో ఛాందిని ప్రత్యక్షంగా వుంది. దేవతే అయినా నూర్ పరోక్షంగానే వుంది !

మోచేతుల మీద లేచి చాందిని స్తనం మీద ఒక చేయివేశాడు గట్టిగా. ఆమె పెదవుల మీద ఒక ముద్దు ముద్రించాడు.

చాందిని ఉలిక్కిపడి లేచింది. కూర్చుంది  కొన్ని క్షణాలు పట్టింది ఆమెకు పరిస్థితిని అర్థం చేసుకోవటానికి  అయినా ఆమెకు తనను ఎవరో ముద్దుపెట్టుకున్నారని, స్థనాలు నొక్కారనీ తెలిసిరాలేదు. ఆమెకు తెలిసిందల్లా - తాను నిద్రపోతోంది; అతి ప్రశాంత వాతావరణం అలుముకువుంది. తన అంతరాత్మ శరీరంతో యేదో సంభాషణ చేస్తోంది. ఏదో దారుణమైన దౌర్జన్యం జరిగింది. అందుకనే మెలుకువ వచ్చింది. ఇంతకూ ఆ జరిగిన దౌర్జన్యం యేమిటి ?

భయంతో ఆమె కళ్లు డేరా అంతటా వెదికాయి. ఆమె పక్కనే అరుణ్ పడుకుని వుండడం గమనించింది - వెంటనే భయంతో చివాలున లేచి అతన్నించి దూరంగా జరిగింది. ఆమె పెదవులు కదిలాయి. నీరసంగా అంది 'నువ్వా ?' కాని ఆశబ్దం బయటకు రానేలేదు.

అరుణ్ తన చేతివేళ్లతో ఆమె పెదవులను మూసివేశాడు. అదే సమయంలో ఆమె చేతిని దగ్గరకు లాక్కున్నాడు.

అకస్మాత్తుగా యిలాంటి చర్యలన్నీ జరుగతూ వుండగా, డేరాలో యింకెవరేనా తమను గమనిస్తున్నారా అని చూడడం చేసింది ఛాందిని. తన చేతిని వెనక్కు తీసుకోవాలని చూచింది

అరుణ్ ఆమెను బిగించి కౌగలించుకున్నాడు. అతని గుండె గబగబ కొట్టుకోవడం, యేదో ఉద్రేకం అతన్ని లోబరుచుకోవడం జరుగుతోంది. అదే మధురమైన క్షణం దీన్ని వృథాగా పోనివ్వాలా ? సంవత్సరాల తరుబడి దీనికోసం తనను తాను శ్రమలకు లోను చేసుకున్నాడు. ఇప్పుడు.... ఇప్పుడు... యీ రహస్యాన్ని ఛేదించటానిక అతి దగ్గరగా వున్నాడు. అతని కళ్లు ఆమె స్తనాలమీదనే గుచ్చుకుపోయి వున్నాయి. ఈ క్షణంలో అవి మరింత ఉద్రేకంతో ఊగిసలాడు తూన్నాయి. అవును.... యిదే.... యిక్కడే ప్రవేశం. ఎక్కడో లోపల... ప్రవేశం దొరక్కపోవచ్చును, అయినా ప్రయత్నం చేయాలిగదా తను ! సమయం, స్థలం, ప్రియురాలు... యీ మూడు అనుకూలంగా మూర్తీభవించి ముందుకు వస్తాయో రావో మళ్లీ !

ఆమెను భయపెట్టకుండా ఆమె ముఖంలోనికి - కళ్ల లోనికి - సూటిగా చూస్తూ నీరసంగా అన్నాడు :

'నిన్ను ప్రేమిస్తున్నాను, చాందినీ !'

'నీకు పిచ్చెక్కిందనుకుంటాను' అంది ఆమె. ఆమె కళ్లు ఆశ్చర్యంతో విశాలంగా విప్పారాయి.

# రెండవ అధ్యాయం

మధు మరణంతో లాలాకాన్షీరామ్ చాలకుంగిపోయాడు. ఇప్పుడు వీలయినంత త్వరగా తాము ఇండియాకు వెళ్లిపోవాలని నిశ్చయించుకున్నాడు. ఈ సంకట సమయంలో తండ్రికి దగ్గరగా వుండి ఆయన మానసిక స్థితి గతులలో వస్తున్న వ్యత్యాసాలను గమనించడం అరుణ్‌కు ప్రాప్తించింది. ఇప్పుడతనికి తండ్రిగారి పరిస్థితి మరీ భయానకంగా తయారయింది. ఆయన యెంతో ధైర్యసాహసాలు వున్న వ్యక్తి అనీ, ఎలాంటి పరిస్థితినయినా సునాయాసంగా యెదుర్కోగలడని ఒకప్పుడు అనుకుంటూ వుండేవాడు. అయితే ఈ మూడునెలలో ఒకదాని మీద మరొకటి ఉపద్రవాలు వచ్చి పడుతూ వుంటే ఆయన గుండె ధైర్యం కాస్త నీరుకారిపోయింది; ఆవిరయిపోయింది.  అయినా లాలాకాన్షీరామ్ తన పరాజయాన్ని పైకి ప్రకటించడంలేదు. ఒక్క క్షణం కుంగిపోయి, నీరసపడి ఎంతో బలహీనత ప్రదర్శిస్తున్నా మరుక్షణంలో కొంతలో కొంత నిలదొక్కుకునే ప్రయత్నం చేస్తున్నాడు. ఎలాగయినా సియల్‌కోటలోనే వుండిపోవాలని ఆయన సంకల్పం. అందుకు అనువయిన అనుపానులన్నీ వెదుకు తున్నాడు. స్థానిక పాలనాయంత్రాంగం మీద ఎంతో ధైర్యం, నమ్మకం. పోలీసులలో విశ్వాసం. సైన్యం రక్షించుతుందని నమ్మకం. నాయకులు గట్టుఎక్కిస్తారని ఊహ. ఎందుకంటే వాళ్లు ఎంతసేపూ మీమీ యిళ్లు వదలి వెళ్లిపోకండి అని హెచ్చరిస్తూ వున్నారు.

కాందిశీకుల శిబిరాలకు వచ్చి చేరిన యీ నెల రోజుల నుంచి జనరల్ రీస్ తమను రక్షిస్తాడని నమ్ముతున్నాడు. పంజాబ్ బౌండరీ ఫోర్స్‌కు ఆయన కమాండర్ - ఇన్ - ఛీఫ్. పంజాబ్‌లోని మైనారటీలను కాపాడేందుకు ఈ దళం సెప్టెంబర్‌లో యేర్పాటు అయింది. భారతసైన్యంలోని అన్ని మతాల హిందూ, ముస్లిం, సిక్కు - సిపాయిలతో, ఆఫీసర్లతో యీ దళం కూర్పు జరిగింది. దాని కమాండర్ ఇంగ్లీషు దొర కావడం కాన్షీరామ్‌కు నమ్మకం కలిగేట్లు చేస్తోంది. ఇది ఆగస్టులో యేర్పాటయింది. కమాండర్ ఇంగ్లీషు

వాడుకావడం, ఆర్మీకి యేక్షణంలో యేం చేయాలో తెలిసివుండడం.... యీ సందర్భాలను బట్టి కాన్షీరామ్ తన ఆశలన్నీ యీ దళంలో నిలిపివుంచాడు. భారతీయుడు అయితే చెప్పేది ఒకటి చేసేది మరొకటిగా వుంటుంది. కమాండర్ జనరల్ రీస్ అతి స్పష్టంగా ప్రకటించాడు. మైనారిటీలకు ఎలాంటి కష్ట నష్టాలు, యిబ్బందులు జరగకుండా చూస్తామని ప్రపంచం తల్లక్రిందులయి పోవచ్చునేమోగాని ఇంగ్లీషు వాడు మాట తప్పడు అతన్ని శిరసావహించవచ్చు.

ఎంతగా యీ రకమైన ధైర్యం చెప్పుకుంటూ వున్నా లాలా కాన్షీరామ్ నమ్మకాలన్నీ సడలిపోతూవచ్చాయి. ప్రియమైన తన దేశ ప్రాంతంలో సుఖ శాంతులతో మనగలుగుతాం అనే భరోసా రోజు రోజుకు సడలిపోతోంది. భారతదేశ నాయకులు పంజాబ్ ప్రజలకు యిస్తున్న భరోసాలన్నీ కేవలం నోటి మాటలు, నీటి మూటలు. వాళ్లకు మైనారిటీలను తమ తమ యిళ్లలో సుఖప్రదంగా నిలిపి వుంచటానికి తగిన శక్తి యుక్తులు, ఉద్దేశ్యం కూడా వున్నట్లు కనిపించదు. ప్రజల ప్రాణాలను రక్షించడం వాళ్ల వల్లకాదు. విభజనకు అంగీకరించటానికి ముందే యిటువంటి యేర్పాట్లన్నీ యెలా జరగాలో నిర్ణయాలు తీసుకుంటే బాగుండేది. ఇప్పుడయినా నోరు మూసుకు వుండి, ప్రజలను తప్పు దారి పట్టించే మాటలు మాట్లాడకుండా వుండడం చేస్తే బాగుండును యీ నాయకులు. జిన్నా, నెహ్రూ యిద్దరూ దోషులే ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ అధ్యక్షుడు - లాలా కాన్షీరామ్ కళ్ల జోడు సరిచేసుకుని పత్రికలో ఆయనపేరు యేమిటో సరిచూచుకున్నాడు - కృపాలనీ అనే ఆయన కూడా వాళ్లతో సమంగా నేరస్థుడే అందరికంటే ఎక్కువగా, మైనారిటీలు వున్న చోటునే వుండిపోండి - అని పదే పదే అరచి చెబుతున్నాడు అతను !

చిట్ట చివరకు లాలా కాన్షీరామ్‌కు నిస్పృహ వచ్చింది ఎక్కడంటే - జనరల్ రీస్ నాయకత్వంలో సరిహద్దుదళాలు రాష్ట్రంలో శాంతి భద్రతలు కాపాడలేక పోవడం ప్రత్యక్షంగా కనిపించడం. ఇంగ్లీషు దొర శాంతి భద్రతలు కాపాడలేకపోవడం !! లాలా కాన్షీరామ్ యీ దుర్ఘటన గురించి చాలా సేపు చింతించాడు. దీని అర్థం - సూర్యుడు పడమటి దిక్కున ఉదయిస్తున్నాడన్న మాట రీస్ సాహెబ్ గారు దుర్బలుడవుతున్నాడు. ఆయన సైన్యం అంతా

భారతీయులే వాళ్లలో వివిధ మతాలకు చెందిన వాళ్లు వున్నారు వాళ్లకు వేరు కట్టుబాట్లు, విశ్వాసాలు వున్నాయి ఎవరి విశ్వాసాలను వాళ్లు నిస్సిగ్గుగా ప్రదర్శిస్తున్నారు. తూర్పు పంజాబ్‌లోను, పశ్చిమ పంజాబ్‌లోను జన సామాన్యం- మైనారటీ వర్గాలకు చెందిన వాళ్లు - చంపబడుతూ వుంటే యీ సరిహద్దు దళాలు చూస్తూ వుండిపోతున్నాయి తప్ప ఆ దహనకాండలను జరగకుండా నిరోధించే ప్రయత్నాలు యేమీ చేయడం లేదు ఇలాంటి విష వాతావరణంలో, ఒకళ్లు యిద్దరు ఇంగ్లీషు ఆఫీసర్లు వుండి మాత్రం యేం చేయగలరు?

లాలా కాన్షీరామ్ ఆశలు అడుగంటి పోయాయి చుట్టూ చూడడం, తలగోక్కోవడం తప్ప చేయవలసిన పని యింకేమీ కనిపించడం లేదు. రెండు కొత్త ప్రభుత్వాలు భ్రాతృ ద్రోహం చేసే యుద్ధంలోనే కూరుకుపోయినాయి. నిరాయుధులయిన స్త్రీ పురుషులు తమను తాము యెలా రక్షించుకోగలరు? అసలే విచలతమైవున్న ఆయన మానసిక స్థితికి మధు మరణం గొడ్డలి పెట్టు. ఇంక యిక్కడ వుండాలను కోవడంలో అర్థంలేదు; పైగా అది అనర్థ దాయకం.

తన పరాజయాన్ని ఆయన ఎంత ఉదారంగా తీసుకుంటున్నాడు - అని అరుణ్ నివ్వెరపోసాగాడు. ప్రభారాణి మధు చనిపోయిన చాలా రోజులవరకు ఎవరితోనూ మాట్లాడకుండా మూగ మనిషి అయిపోయింది. లాలా కాన్షీరామ్ తన విచారానికి బాహ్య ప్రదర్శనలు యివ్వడం లేదు, అంతే! ఈ శిబిరంలో ఎన్నో రకాలుగా దెబ్బలు తిన్న కుటుంబాలు వున్నాయి. కొత్త రకమైన వర్ణ వ్యవస్థ యేర్పడుతోంది యిక్కడ. అందరికీ ఆస్థులు పోయినాయి. దాన్ని గురించి యెవరూ పట్టించుకోవడం లేదు! శరీరంలో యేదో ఒక అంగం పోయినా, కుటుంబంలో యెవరయినా హతులయినా, ఎత్తుకు పోబడినా, రేప్ చేయడం జరిగినా - యిందుకు ప్రత్యామ్నాయంగా యేదో పతకం దొరుకుతున్నట్లు అనిపిస్తోంది. శిబిరంలో తతిమ్మా వాళ్లు యిప్పుడు మరింత గౌరవంగా మాట్లాడుతారు, కాంప్ కమాండర్ మీకు దర్శనం యిచ్చి రేషన్లలోను యితర సదుపాయాలలోను యేమన్నా తభావతులు వుంటే సరిదిద్దుతాడు. మనకు జరిగిన అన్యాయాలకు యితరులు పరిహారం చెల్లించాలని లేదు. అందరూ దెబ్బలు తిన్నవాళ్లే యిక్కడ. అందులో ఎక్కువ దెబ్బ తిన్నవాళ్ల పట్ల

సానుభూతి, ఎక్కువ శ్రద్ధ! అంతే. రోడ్డు మీద మనుషుల్ని ఆపి మాట్లాడించవచ్చు. ఎవరేనా భోజనం చేయబోతూంటే వెళ్లి వాళ్ల పంక్తిలో కూర్చోవచ్చు ఆఫీసర్ల క్వార్టర్లకు యేడుస్తూ వెళ్లవచ్చు. అడిగితేచాలు ఎలాగయినా కొంత ఎక్కువ సదుపాయం సమకూరుతుంది.

లాలా కాన్షీరామ్ యిలా ఎక్కువగా బాధితులయిన వాళ్ల గుంపుల్లో చేరి అదనపు సౌకర్యాలు పొందటానికి నిరాకరించాడు. అతను అంతగా అంతర్ముఖుడు కాదు. జనంతో కలిసి మాట్లాడటం, అభిప్రాయాలు పంచుకోవడం అతనికి యిష్టమే. మధు మరణం తర్వాత ఆయన ఎక్కువగా ముడుచుకుపోతున్నాడు. తన దగ్గరివాళ్లతో కూడా ఒకటి రెండు మాటలు తప్ప యింకేం లేదు. దైనందిన ప్రార్థనలను మాత్రం మరచి పోలేదు. అదే విశేషం. ఉదయం సాయంత్రం కృష్ణ విగ్రహం ముందు కూర్చునేవాడు. తనతో పాటు ప్రభారాణి, అరుణ్ కూడా కూర్చునేట్లు చూచేవాడు. అంతేకాదు - పద్మిని, ఛాందిని కూడా కూర్చోవాలి. భగవంతుని కీర్తనలు పాడేటప్పుడు ఒక్క చరణమైనా, ఒక్క పంక్తి అయినా మినహాయింపు లేకుండా అన్నీ అప్పజెప్పేవాడు. ప్రార్థన అయినతర్వాత మౌనంగా కూర్చుని చేసే 'ధ్యానం'లో యెక్కువ సమయం గడుపుతూ వుండడం అరుణ్ పరికించాడు. ప్రార్థన గీతాలు అయిన తర్వాత చేతులు అర్థిస్తున్నట్లుగా చాలా మౌనంగా కొంతసేపు ప్రార్థన చేయాలి. అరుణ్ ప్రార్థన గీతాలు పాడుతున్నప్పుడు ఆవలింతలకు గురి అయ్యేవాడు. మౌన ప్రార్థన అతనికి మరీ కష్టం. చేతులు పైకెత్తి, కళ్లు మూసుకుని, తండ్రిగారు చాల సేపు కూర్చుని వుండిపోయేవాడు. ఆయన ముఖంలో రకరకాల రాగభావాలు ఒంటెల సవార్ల మాదిరిగా నడచి పోతూ వుండడం చూచేవాడు అరుణ్. అవును. అందులో యేం సందేహంలేదు. అయితే తన కుమార్తె చనిపోయింది గనుక - మత దోపిడిలలో మట్టుపెట్టబడింది గనుక - తనకేదో ప్రత్యేక సౌకర్యం కావాలని ఎవరినీ అడగలేదు, యాచించలేదు. ఇతరులు కొంత ఉదారంగా వుండేందుకు ప్రయత్నించినా ఆయన నిర్లక్ష్యంగానే వున్నాడు. ఉదారంగా వున్నట్లు అనుమానం కలిగినా అక్కడ నుంచి లేచి పోయేవాడు.

ఆయనకు యెవరితోనయినా మాట్లాడాలనిపించినప్పుడు, అరుణ్‌ను తోడు రమ్మని షికారుకు తీసుకుపోయేవాడు. ఈ సమయంలో కూడా మధును

గురించి మాట్లాడేవాడు కాదు అరుణ్ ఒకవేళ ఆ ప్రస్తావన తెచ్చినా ఆయన దానిని మళ్లించటానికి ప్రయత్నించేవాడు. 'అదంతా వ్యక్తిగత కర్మలకు సంబంధించిన విషయం' అని ఊరుకునేవాడు. నిమిషాల తరువాత మరేదో విషయాన్ని గురించి, యిందుకు యే మాత్రం సందర్భంకాని దాన్ని గురించి మాట్లాడుకునే వాళ్లు. నడుస్తూ నడుస్తూ ఆగిపోయి ముఖం పక్కకు తిప్పుకునే వాడు. దొంగలాగ తన కన్నీళ్లు తుడుచుకునేవాడు అరుణ్ ముందు ఎలాంటి బలహీనతలను ప్రదర్శించేవాడు కాదు.

అయినా ఆయనలో యేదో జీవశక్తి కొరవడినట్లయింది. ఇండియాకు తిరిగి వెళ్లిపోవాలి - వీలయినంత త్వరగా అని నిర్ణయించుకున్నాడు. అప్పటికి ఆగష్టు నెల గడచిపోతోంది. మైనారిటీలను కదిలించడమే శ్రేయోమార్గం అని అధికారులు కూడా నిర్ణయించుకున్నారు. ఆగస్టు 17 తేదీని సరిహద్దు కమీషన్ తన రిపోర్ట్‌ను యిచ్చింది. ప్రతి వాడూ తాను పాకిస్తాలో వుంటాడా ఇండియాలో వుంటాడా అన్న విషయం నిర్ధారణ చేసుకున్నాడు. పంజాబ్‌లో హింసాకాండలు యిదివరకు యెరగనంత ప్రమాణాలకు ఎదిగాయి. ఇరుపక్షాల వారు తమకు అన్యాయం జరిగిపోయిందనే అనుకున్నారు. మౌంట్‌గోమెరీ ప్రాంతంలో తమ సారవంతమైన భూములను వదులుకోవలసి నందుకు సిక్కులకు చాల బాధగా వుంది. సట్లెజ్ నదీ తీరాన అతి కొద్ది ప్రాంతం మటుకే వాళ్లకు మిగిలింది. గురుదాస్పూర్ జిల్లాలో కొన్ని భాగాలు ఇండియాకు యిచ్చి వేయడం ముస్లిములకు ఖేదకారణం అయింది. బౌండరీ కమీషనుకు అధ్యక్షుడుగా వుండిన సర్ సిరిల్ రాడ్ క్లిఫ్ కమీషను రిపోర్టు ప్రకటించటానికి రెండు రోజులు ముందుగానే అంటే ఆగస్టు 15 నాటికే ఇండియా నుంచి వెళ్లిపోయాడు హడావడిగా. అతనికి అదో దుస్సహమైన కార్యకలాపంగా తయారయింది. అందునా కమీషన్‌లో భాగస్వాములయిన యితరసభ్యులు, మతప్రాతిపదిక మీద ప్రతి నిమిషమూ కొట్లాడుకుంటున్నప్పుడు. అయిదు వారాల సమయ విరామంలోనే దేశాన్ని రెండుగా చీల్చి వేయవలసి వచ్చింది. అక్కడికీ ఛెయిర్‌మన్ యిరుపక్షాల చిలిపితగాయిదాలను పక్కకు నెట్టి నిష్పక్షపాతంగా దేశాన్నిరెండు ఖండాలుగా విడదీశాడు. ఇతర చిల్లర తగాదాలను

యితరుల నెత్తిన పద్ది తన పాటుకుతాను దేశాన్ని వదలి సురక్షిత ప్రాంతానికి వెళ్లిపోయాడు

రెండు ప్రభుత్వాలూ మైనారిటీ జనాలను తమ తమ ప్రాంతాలకు తరలించే కార్యక్రమం ప్రారంభం చేశారు పెషావర్, యితర మూలల ప్రాంతాలలో చిక్కుకుపోయిన జనాన్ని విమానాలలో తూర్పు పంజాబ్‌కు తరలించారు. తతిమ్మావాళ్లు రైల్లో ప్రయాణాలు చేయవలసి వచ్చింది. మిగికొందరు కాలినడకనే ప్రయాణాలు చేశారు.

పరిస్థితులు ఎంత గందరగోళంగా పరిణమించాయంటే రెండు ప్రభుత్వాలకూ యితర ప్రభుత్వ ప్రాంతాలలో తమకు యే పాటి హక్కులు అధికారాలు మిగిలి వున్నాయో అర్థం కానే లేదు కాందిశీకుల శిబిరాలలో అధికారులు పిండి మొదలైన తినుబండారాలు ధరలప్రసక్తి లేకుండానే వితరణ చేస్తున్నారు. ఆగస్టు పదిహేను తరువాత యీ ధరల ప్రసక్తి ముందుకు వచ్చి రెండు ప్రభుత్వాల మధ్య వివాదాంశంగా మిగిలింది. ఆగస్టు నెలలో కాందిశీక శిబిరాల రక్షణ బౌండరీ ఫోర్స్ వారు నిర్వహించారు. ఇప్పుడు అది ఆయా ప్రభుత్వాల బాధ్యత అయింది. ఆర్మీయూనిట్లు ఒక పక్క నుంచి మరో పక్కకు తమ జనాభా రక్షణ కోసం పంపబడుతూ వచ్చాయి. ఏ కారణం చేతనయినా ఒక పక్కనుంచి రైలు బయలుదేరే సమయానికి ఆ రక్షణ సిబ్బంది చేరుకుందుకు ఆలస్యం అయితే, యిక్కడ వున్నవారు అయిష్టంగానే ఆ పని నిర్వహించారు తప్ప పూర్తి మద్దతు యివ్వలేదు ఒక వేళ ఆవలి పక్షం సిబ్బంది వచ్చినా యిక్కడి వారు వారికి తగినన్ని యిబ్బందులు కలుగ జేసి పని కుంటు బడేట్లు గానే చేస్తున్నారు.

సియల్ కోట నుంచి బయటపడాలంటే, దగ్గరమార్గం కాశ్మీర్ మీదుగానే. కాశ్మీర్ సరిహద్దు యిక్కడికి పదిమైళ్లదూరంలోనే వుంది. అయితే కాందిశీకులు ఆ మార్గాన్ని బందు చేశారు ఇండియా, పాకీస్తాన్ - కాశ్మీర్ విషయంలో వివాదాలు పడుతున్నారు. పాకిస్తాన్ సరిహద్దు వరకు తన సేనలను పంపింది. సరిహద్దుకు చేరే పదిమైళ్ల పొడుగునా ఆర్మీసేనలు మోహరించి వున్నాయి. ఆ ప్రాంతం ఆర్మీ రక్షణ లోనే వుంది. సివిలియన్లకు అక్కడ ప్రవేశం లేదు.

కాందిశీకుల రైళ్లు తరుచుగా సియల్ కోటనుంచి వజీరాబాద్‌కు నడుస్తున్నాయి అక్కడ నుంచి లాహోర్ మీదుగా అమృత్‌సర్‌కు చేరుతున్నాయి మధు చనిపోయింది గనుక. తాను వజీరాబాద్ మీదుగా ప్రయాణం చేయలేనని విలపించింది ప్రభారాణి. అంటే వాళ్లు సియల్ కోట నుంచి నేరుగా అమృత్ సర్‌కు వెళ్లవలసి వుంది. ఆమార్గాన అమృత్‌సర్ 82 మైళ్లు దూరం నలభయినాలుగు మైళ్లు దాటాక డేరాబాబానానక్ పట్టణం దగ్గర ఇండియా - పాకిస్తాన్ సరిహద్దు రేఖ తగుల్తుంది

పాకిస్తాన్ అధికారులు సియల్ కోట నుంచి డేరాబాబానానక్‌కు నేరుగా ఎందుకు కాందిశీకుల రైళ్లు పంపడంలేదో లాలాకాన్షీరామ్ అర్థం చేసుకోలేకపోయాడు. కొందరు పాద ప్రయాణికుల గుంపులు కూడా తయారవుతున్నాయని అతను విన్నాడు. ప్రతిరోజు దానిని గురించి వాకబు చేస్తున్నాడు. తను కూడా కుటుంబంతో సహా యీ గుంపులతో చేరి వెడదామని ఆయన ఉద్దేశ్యం.

ఒకరోజు సాయంకాలం లాలా కాన్షీరామ్, అరుణ్ షికారునుంచి తిరిగి వస్తూంటే శిబిరంగేటు వద్ద పర్యవేక్షణ చేస్తున్న మిలిటరీ అధికారి ఒకతను పూర్వ పరిచితుని మాదిరి అనిపించాడు అరుణ్‌కు.

పొడగాటి బక్కపల్చని మనిషి. గద్దముక్కు గుబురైన మీసాలు. ఆర్మీయూనిఫాం అయిన ఆలివ్ గ్రీన్ దుస్తులు ధరించి వున్నాడు. బెల్ట్‌కు రివాల్వర్ వేలాడుతోంది. మనిషి పలచగానే వున్నా చేతులు దృఢంగా కండలుబట్టివున్నాయి.

అతను బారులు తీరి నిలబడ్డ సైనికులను పర్యవేక్షిస్తున్నాడు. అరుణ్ పరిశీలించి చూడగా అతను ఎవరయిందీ స్ఫురించింది. 'రహ్మత్ ఉల్లా-యితను' అనుకున్నాడు అరుణ్. ముర్రేకాలేజీలో తనకు సహాధ్యాయి. 1944లోనే రెండో ప్రపంచయుద్ధసమయంలో యుద్ధంలో 'టెంపరరీ కమీషన్' సంపాదించాడు. కాంగ్రెస్ వారు కాలేజి విద్యార్థులందరినీ చదువులు మానివేయమని ఆదేశించినప్పుడు, యుద్ధంలో 'కమీషన్స్' పొందటం ప్రత్యేక ఆకర్షణ అయిపోయింది చాలమందికి. మూడు సర్వీసెస్‌లోను - ఎయిర్

ఫోర్స్, నేవీ, పదాతి దళం - టెంపరరీ కమీషన్ల కోసం ప్రకటనలు భారీగా వెలువడినాయి. రహ్మతుల్లా అలా పదాతిదళంలో కమీషన్ సంపాదించిన మనిషి. దేశీయ భావాలతో ఉడికిపోతున్న మునీర్, అరుణ్ వంటి వాళ్లు అతన్ని తక్కువ చేయలేకపోయారు మొదటి సంవత్సరం సెలవుల్లో అతను యింటికి వచ్చేటప్పటికే మంచి దుస్తుల్లో షోకుగా తయారయి కాలేజీ ఆడపిల్లల కళ్లకు పసందుగా కనిపించసాగాడు.

రహ్మతుల్లా కూడా అరుణ్‌ను యిప్పుడు గుర్తించాడు. సైనికులను పక్కకు పొమ్మని చేయిసైగ చేసి 'అరుణ్ - హలో - అరుణ్' అంటూ అతని వైపు నడిచాడు.

అరుణ్ అతనితో కరచాలనం చేసి ఆప్యాయంగా కౌగలించుకున్నాడు.

'నువ్విప్పుడు చాలా పెద్ద ఆఫీసర్ అయినట్లున్నావే, రహ్మతుల్లా!'

రహ్మతుల్లా కూడా పరిచయస్థుడిని కలుసుకున్నందుకు ఆనందిస్తూ 'అవునవును. నేను ఇప్పుడు కెప్టెన్‌ను. ఈ శిబిరానికి కాంప్‌కమాండెంట్‌గా యిటీవలే పోస్ట్ అయ్యాను' అన్నాడు.

'పాకిస్తాన్ సైన్యంలో చేరుతున్నావా? భారతసైన్యంలోనా?'

కెప్టెన్ రహ్మతుల్లా ఈ ప్రశ్నకు చిరునవ్వు నవ్వాడు. అది అనవసరమైన ప్రశ్న అతనికి సంబంధించినంత వరకూ. కాస్త ధీమాగా 'పాకిస్తాన్‌కే!' అని బదులు చెప్పాడు. 'ఈ శిబిరంలో ఎన్నాళ్లయి వున్నారు మీరు?'

'దాదాపు ఆగస్టు మొదటినించీని'

అరుణ్ అతనికి తండ్రిగారిని పరిచయం చేశాడు. కెప్టెన్ ఆయనకు నవ్వుతూ సైనిక వందనం చేశాడు.

కొద్దిసేపు నిశ్శబ్దం స్థావరించుకుంది. అరుణ్, రహ్మతుల్లా -కాలేజీలో మిత్రులు. కాని ప్రత్యేకించి ఆత్మీయత లేదు వాళ్ల మధ్య. ఇప్పుడు యిద్దరూ కంచెకు యిరుపక్షాలలో వున్నారు.

'మీ కిక్కడ అనుకూలంగా వున్నదా?' అనడిగాడు రహ్మతుల్లా. జవాబు కోసం ఎదురుచూడకుండానే 'నేను చేయగల సహాయం యేదయినా వుందా మీకు?' అన్నాడు.

అరుణ్ తండ్రి వంక చూచాడు.

'డేరాబాబానానక్‌కు వెళ్లే మొదటి గుంపులోనే మేం వెళ్లి పోవాలనుకుంటున్నాం'

ఈ సరికి శిబిరంలోని వాళ్లు చాలమంది వాళ్లచుట్టూ చేరారు. అయినా రహ్మతుల్లా యేమీ చికాకు కనబరచలేదు. విశ్రాంతిగా అలాగే హుందాగా నిలబడి తండ్రీ కొడుకులను నిదానంగా పరికించాడు.

'నేను ఈ ఉదయమే యీ చార్జ్ తీసుకున్నాను. ఇంతవరకు యేం యేర్పాట్లు జరిగినాయో నాకు తెలియదు వివరంగా. మొదటి గుంపు ప్రయాణానికి సిద్ధం అవుతోంధా? ...... చూడు, ఒకపని చేయండి.... నన్నో మారు వచ్చి నా ఆఫీసులో చూడు. ఆ కనిపిస్తున్న పెద్ద బిల్డింగే నా ఆఫీసు...' అని వందగజాల దూరంలో వున్న ఒక ఆర్మీ బరాక్స్ వరుస చూపించాడు. 'నేను అక్కడే వుంటాను. వచ్చి మాట్లాడండి నాకు చేతనయిన సాయం చేస్తాను .'

'అలాగే' అన్నాడు అరుణ్.

'మీరు యే సందులో వున్నారు?'

'ఇరవయి అయిదో లైన్‌లో. సందులో దాదాపు మధ్య...?'

'సరే, నన్ను వచ్చి చూడండి..'

కెప్టెన్ రహ్మతుల్లా ఆ గుంపుకంతటికీ ఒక సెల్యూట్ చేశాడు. నడుచుకుంటూ వెళ్లి దగ్గర్లో వున్న తన జీప్‌ను చేరుకున్నాడు. సైనికులు అతనికి వందనం చేశారు. అంతవరకువున్న చలాకీ తనాన్ని దాచేసి గంభీరంగా ఆ వందనం అందుకున్నాడు. అరుణ్‌కు అతని మీసాలు, కళ్లలో వున్న వింతకాంతి.... తమాషాగా కనిపించాయి.

జీప్ వెళ్లిపోయిన తర్వాత 'అతనే మన శిబిరానికి కొత్త కమేండెంట్ దొర' అనుకున్నారు - అక్కడ చేరినవాళ్లు

చాలా మంది అరుణ్‌ను సమీపించారు తమ విషయం సిఫారసు చేయమని కొందరికి పంచదార ఎక్కువ కావాలట కొందరికి కిరసనాయిల్ అసలే లేదు కొందరయితే తమ యిరుగు పొరుగు సరీగా లేదు గనుక యింకొక డేరాలోనికి మారాలని కోరుకుంటున్నారు ఉన్నట్లుండి అరుణ్‌కు తానో పెద్దవాడయిపోయినట్లు అనిపించింది

ఇతరుల బాగోగుల కోసం శ్రమించడం లాలా కన్షీరామ్‌కు మొదటినుంచి అలవాటు. ఇప్పుడీ అవకాశం దొరికింది. ఆయన ముఖంలో సరికొత్త ఆనందం పులుముకుని వెలిగిపోతూ, అరుణ్ భుజంచరిచి 'యితను నాకుమారుడు అని అందరికీ పరిచయం చేస్తూ - అరుణ్‌తో 'వీళ్లకు యేమయినా సహాయం చేయగల వేమో చూడు.' అన్నాడు.

అంతా క్షణికమైన ఆనందం ఎవరి కష్టాలు, యిబ్బందులు వాళ్లకు వుండనే వున్నాయి. లాలా కాన్షీరామ్ వెనకటి విచారంలో కూరుకుపోయి నింపాదిగా కొడుకుతోపాటు తన డేరాకు నడిచాడు

మరునాడు ఉదయం అరుణ్ కెప్టెన్ రహ్మతుల్లా ఖాన్‌ను చూచాడు. కెప్టెన్ యేదో మిష మీద తన రివాల్వర్ తీసి, తనను కాల్చి పారవేస్తాడేమోనని కూడా అతనికి భయం వుంది. పాకిస్తాన్‌లో ఒక హిందువు అయినా లుప్తం అయిపోతాడు గదా! తన భయానికి తనకే నవ్వు వచ్చింది అతనికి.

అతను కెప్టెన్‌తో వున్న కాస్సేపు అతడికి మనుషులందరూ చకచక నడుస్తూ వుండడం, అతి చురుకుగా సెల్యూట్ చేస్తూ వుండడం, ఫైలు అతని బల్లముందు వుంచుతున్నప్పుడు, దానిని తిరిగి తీసుకువెడుతూ వున్నప్పుడు కూడా ఎంతో వినయాన్ని ప్రదర్శిస్తూ వుండడం.... గమనించాడు. రహ్మతుల్లాఖాన్ అరుణ్‌ను సాదరంగా లోనికి తీసుకు వెళ్లాడు తనముందు కుర్చీలో కూర్చోబెట్టాడు. ఆర్డర్లీని పిలిచి ఒక టీ తీసుకురమ్మని పురమాయించాడు తరువాత సుబేదార్ మేజర్‌ను పిలిపించాడు, కాందిశీకుల ప్రయాణ వివరాలు తెలుసుకునేందుకు గాను.

సెప్టెంబర్ చివరివారం వరకు డేరా బాబాననక్‌కు వెళ్లే సౌకర్యం లేదని తెలిసి వచ్చింది. ఇండియా నుండి పెద్ద పటాలం రావాలి, యీ గుంపులతో పాటు రక్షణగా వెళ్లటానికి. అది అప్పటికి గాని సమకూడదు. వచ్చేవారం. వజీరాబాద్ వరకూ తీసుకు వెళ్లే రైలు సిద్ధం అవుతోంది పోనీ ఈ మార్గాన ఎందుకు వెళ్లగూడదూ? అరుణ్ తమ కుటుంబానికి ఉన్న యిబ్బందులు చెప్పాడు. సంభాషణ మధ్యలో అతని సోదరి రైల్లో జరిగిన కాల్పులలో చనిపోయిందని చెప్పవలసి వచ్చింది. రహ్మతుల్లా యీ దుస్సంఘటనకు ప్రత్యేకించి సానుభూతి కనబరచక పోవడం అరుణ్‌కు ఆశ్చర్యం అనిపించింది. ఇంగ్లీషులో పొడిగా 'సారీ' అన్నాడు. అది లాంఛనం మటుకే మతం పేరిట జరిగిన హింసా కాండను, దారుణ చర్యలను ఖండించలేదు. శిలా విగ్రహంలా తన కుర్చీలో కూర్చుండిపోయి అరుణ్ తలమీదుగా కనిపిస్తున్న గోడవంక తేరిపార చూస్తూ వున్నాడు. ఆ గోడమీద యీ చర్యల కన్నిటికీ యేదో సమర్థింపు వున్నట్లు! డేరా బాబానానక్‌కు వెళ్లే మొదటి కాలినడక ప్రయాణీకుల జాబితాలో అరుణ్ కుటుంబాన్ని, యితర బలగాన్ని చేరుస్తానని మటుకు మాటయిచ్చాడు. ఇంకా వాళ్లకు కావలసిన యే సౌకర్యమయినా సరే చేయడానికి తాను సిద్ధంగా వున్నానన్నాడు.

రెండు రోజుల తరువాత, ఒక ఎండవేళ - మధ్యాహ్నంపూట - కెప్టెన్ రహ్మతుల్లా ఖాన్ లాలాకాన్షీరామ్ డేరా దగ్గర ప్రత్యక్షం అయ్యాడు. అతనితోపాటు చాల మంది బలగం గూడ వున్నారు. శిబిరాలను తనకీ చేయడానికి వచ్చానన్నాడు.

కెప్టెన్ ఆలివ్ గ్రీన్ యూనిఫాంలో వున్నాడు. అరుణ్, లాలాకన్షీరామ్ బయటికు వచ్చి అతన్ని కలుసుకున్నారు. సూరజ్‌ప్రకాశ్ గూడా పక్క డేరానుంచి వెలుపలికి వచ్చి వాళ్ల చెంత నిలుచున్నాడు.

అతనితో మాట్లాడుతూ వున్నప్పుడు, అరుణ్ గమనంలోనికి వచ్చిన విషయం యేమిటంటే కెప్టెన్ రహ్మతుల్లా కళ్లు సునంద మీద పడినాయని. డేరా బయట చెక్క పెట్టెల బల్ల మీద కూర్చుని ఆమె, కూతురు భావనకు జడ అల్లుతోంది.

కెప్టెన్ మాట్లాడుతూ మాట్లాడుతూ ఓ వాక్యం మధ్యలోనే ఆగిపోయాడు.

సూరజ్ ప్రకాశ్ అతన్ని అడిగాడు `అయ్యా! మా యిళ్లలోనికి బీహారునుంచి వచ్చిన కాందిశీకులు చేరారని విన్నాను మరి వాళ్ల దగ్గరనుంచి అద్దెలు ఎవరు వసూలు చేసి యిస్తారు?'

సూరజ్ ప్రకాశ్‌కు మతి పోయిందా అనుకున్నాడు అరుణ్. ఒక్కక్షణం. తాము ఉన్న పరిస్థితిలో ఆస్తుల స్వంతం గురించి గాని అద్దెలను గురించి గాని మాట్లాడం అప్రస్తుతం, అసంగతం!

బహుశ తన అక్కసునంతా బయట పడేసుకుంటున్నాడు సూరజ్ - అనుకున్నాడు అరుణ్

సూరజ్ ముఖం వంక చూచాడు. వాడి వాలకం యథా పూర్వంగా బడుద్ధాయిలాగానే వుంది. తెలివిగా పరిస్థితులను పరామర్శించుకుంటూ ఆలోచించడం అతడికి చేతకాదు. ఆస్తులకు గాని, అద్దెలతో గాని అతనికి యేమీ సంబంధం లేదు. ఈ జీవితం అతనికో 'తమాషా' లాగా కనిపిస్తూ వుంటుంది. బీబీ అమరావతి కూడ పెట్టిన ఆస్తి - కొద్దిపాటిదే అయినా - పోయినా అతనికేమీ పట్టదు పూర్వం విచ్చలవిడిగా కర్చుచేసేవాడు. ఇప్పుడు సిగరెట్లకు ఒక రూపాయి దొరికినా ఎంతో ఆనందంగా వుంటూంది.

ఊహు, సూరజ్ ప్రకాశ్ అవివేకికాడు తనకు చేతనయిన పద్ధతిలో కెప్టెన్‌ను, కేంప్ కమాండెంట్, శ్లాఘించడం చేస్తున్నాడు. అతని భుజంమీద ధగధగ మెరుస్తున్న నక్షత్రాల గుర్తులను అబ్బురంగా చూస్తున్నాడు. అవన్నీ అద్భుతంగా వున్నాయి అతనికి.

కెప్టెన్ రహ్మతుల్లాకు యీ ప్రశ్నకు నవ్వు వచ్చింది. ఈ మనిషి - ప్రశ్న అడుగుతున్నవాడు - అజ్ఞానపు ఆనందంలో ఓలలాడుతున్నట్లున్నాడు.

ఆ తరువాతనే అతను సునందను గమనించాడు. చాలసేపు అతనికళ్లు ఆమె సౌందర్య వీక్షణంలోనే నిలిచిపోయాయి

తననుతాను సంబాళించుకుంటూ 'పాకిస్తాన్ ప్రభుత్వం ఆ విషయంలో నిర్ణయం తీసుకుంటుంది. ముస్లిములు కూడా భారత దేశంలో తమ ఆస్తులను

వదిలివచ్చి వుంటారు గదా. అనేక సర్దుబాట్లు చేయవలసి వుంటుంది ఇది నాకు సంబంధించిన విషయంకాదు - నేను కేవలం సిపాయిని,' అన్నాడు

అతను సూరజ్ ప్రకాశ్ తోనే మాట్లాడుతున్నాడు కాని చూపులు మాత్రం సునంద మీద వున్నాయి. ఆమె మాత్రం బుజాలు వెనక్కుసాచి కూతురుకు జడవేయడంలోనే నిమగ్నమై వుంది.

సూరజ్ ప్రకాశ్‌కు కెప్టెన్ రహ్మతుల్లా చెప్పిన విషయం అర్థం అయివుండదు. అతను చెబుతున్నదానికి శ్రద్ధగా వినడం కూడ లేదు. కేంప్ కమాండెంట్ స్వయంగా - నేరుగా - తనతో మాట్లాడుతున్నాడు. ఇదే అతనికి ఆనందదాయకం! కెప్టెన్ మాట్లాడుతున్నంత సేపు.... 'ఓహో! అలాగా!... అవునవును...' అంటూ తాను ప్రతి మాటా శ్రద్ధగా ఆలకిస్తున్నట్లు అంటున్నాడు. అతడి ముఖం మీద మూర్ఖుడి చిరునవ్వు స్థావరమై వుంది.

ఆ సాయంత్రం అరుణ్‌కు కెప్టెన్ దగ్గర్నుంచి ఒకచీటీ వచ్చింది - యీ సాయంకాలం మా యింటికి, మకాముకు, వచ్చి తనతో పాటు టీ తీసుకోమని ఆహ్వానం! జీపు పంపిస్తాను సమయానికి - అని !

ప్రభారాణికి అతను వెళ్లడం యిష్టంలేదు. ఆ ముస్లింతో సాయిలా పాయిలాగా వుండటానికి అతనికేం పని? వాళ్లు అతని సోదరిని నిర్నిమిత్తంగా చంపేశారు. ఇప్పుడు అతన్ని కూడా చంపివేయవచ్చు. కెప్టెన్ చూడటానికి అదోమాదిరిగా వున్నాడు. అతనితో పరిచయం పెంచుకోవడం అంతయుక్తమైన పనికాదు

అరుణ్ తల్లి మాటలకు నవ్వుకున్నాడు. ముర్రెకాలేజిలో చదువుకునేటప్పుడు అందరూ రహ్మతుల్లాను 'నిరంతర ప్రేమికుడు' అని పిలిచేవారు. కాలేజి అంతటికీ జోరుగా హుషారుగా దుస్తులు వేసుకునేది అతనే. ఫాన్సీ స్పోర్ట్ జాకెట్స్ వేసుకునేవాడు. బూట్లు నిగనిగ మెరిసి పోతూ వుండేవి. టైకి బదులుగా రుమాలు మెడకు చుట్టుకునేవాడు. ఈ రుమాలు సిల్కుది, రకరకాల రంగులలో డిజైన్‌లలో చూడ ముచ్చటగా వుండేది. అప్పుడు కూడా యిలాగే కత్తెర మీసాలు పెంచుతూ వుండేవాడు. ప్రేమకోసం అతను చేసే

ప్రయాణాలు. సాహసాలు గురించి కథలు కథలుగా చెబుతూ వుండేవాడు నగరంలో అన్ని మూలల్లోను తనకో ప్రియురాలు విధిగా వున్నట్లు వర్ణించేవాడు. ఒకటి రెండు మార్లు కొందరు యువతులతో షికార్లు తిరుగుతూ కనిపించాడు కూడా కాని ఎక్కువగా ఒంటరిగానే అగుపడేవాడు. గుండె మీద చేయివేసుకుని మీర్జా గాలిబ్ ప్రేమ గీతాలు పాడుతూ వుండే వాడు. చాల తెలివయిన వాడు జంతువుల చర్మం వర్తకం చేసే కుటుంబం నుంచి వచ్చినవాడు కాలేజి కుర్రవాళ్ల కంటే అయిదు సంవత్సరాలు ఎక్కువ వయసు వున్నవాడు హైస్కూలు చదువు అయిపోగానే ముందుగా కుటుంబ వ్యాపార సంస్థలో చేరి పనిచేయ సాగాడు కాని యీ ఉద్యోగం అంత ఉత్సాహకరంగా లేకపోవడం వల్ల దాన్ని పక్కను పెట్టి కాలేజి కుర్రవాడి విలాస జీవితం గడపాలనే వుద్దేశ్యంతో యిటు వచ్చాడు తరువాత దానినీ వదలి, ఆర్మీలో కమీషన్ ఉద్యోగం సంపాదించాడు స్నేహితులు అతన్ని గురించి వేళాకోళంగా మాట్లాడడం, ఎగతాళి చేయడం చేసేవారు కాదు. భయం భయంగానే వుండేవాళ్లు. అతను యెదురుగా లేనప్పుడు మాత్రం అతని ప్రేమ కలాపాలను గురించి చెప్పుకుంటూ కళ్లలో కొత్త కాంతులు తెచ్చుకుని ఆనందించేవాళ్ళు.

అరుణ్ నవ్వుతూ 'నువేం బెంగపెట్టుకోకమ్మా. నేను చెడ్డ దారుల్లో వెళ్లనులే....' అన్నాడు.

తలచుట్టూ చీర చెరుగు సరిచేసుకుంటూ 'అలాంటి వాళ్లు యే పని చేయడానికయినా వెరవరు.' అంది.

'వాడిని వెళ్లనీ! త్వరగా మన ప్రయాణపు యేర్పాట్లు జరిగేటట్లు చూడు..' అన్నాడు తండ్రి.

ఆఫీసు వున్న బరాక్స్‌కు పక్కనే వున్న ఓ చిన్న బంగళాలో వుంటున్నాడు రహ్మతుల్లా. జీప్‌లో కొన్ని నిమిషాలోనే అక్కడకు చేరుకున్నాడు అరుణ్. రహ్మతుల్లా బయటి వరండాలోనికి వచ్చి అతనికి స్వాగతం చెప్పాడు. 'రా, అరుణ్, రా. ' అంటూ అతనితో కరచాలనం చేశాడు.రహ్మతుల్లా యిప్పుడు మామూలు దుస్తుల్లోవున్నాడు. అరచేతుల సిల్కుచొక్కా. తెల్లని ట్రౌజర్స్. బాగా

పాలిష్ చేసిన చడావులు, యింత ఎండలోను పల్చటి ఆకు పచ్చరంగు రుమాలు మెడకు చుట్టుకున్నాడు

అరుణ్‌కు అతన్ని యిలాంటి దుస్తుల్లో చూడడమే బాగుంటుంది ఇప్పుడు అతనితో మాట్లాడటానికి అంత బెరుకుగా వుండదు. అతనితో కరచాలనం చేసి నడిచాడు ఆర్డర్లీ తలుపు తెరిచి పట్టుకు నించున్నాడు.

'మీ తల్లి దండ్రులతో నగరంలోనే వుండడంలేదా?'

'కుదరదు. ఇరవయినాలుగు గంటలూ ఉద్యోగ విధులతో సరిపోతుంది. అందుకని యిక్కడ వుండడమే అనుకూలం.. .'

'ఇక్కడికి వచ్చి ఎన్నాళ్లయింది?'

'స్వాతంత్ర్యం వచ్చినప్పటినుంచి కంటోన్మెంట్‌లో వున్నాను. ఆరోజు నీకు కనిపించానే, ఆ ఉదయమే ఈ కమేండెంట్‌పని తీసుకున్నాను...'

'పెళ్లి చేసుకున్నావా?'

'ఊహు.. ఇంకా ఒంటరిగానే వున్నాను... ఒంటరినని అందరూ అనుకుంటారు .?' అని చిలిపిగా కన్ను గీటుతూ 'నీ మాట?' అన్నాడు.

'నువ్వు చూచావుగా ఇంకా కాలేదు .'

'ప్రేమించి పెళ్లి చేసుకోవడం మంచిది ..'

నవ్వుతూ మీర్జాగాలిబ్ గీతం ఒకటి ఆలపించాడు రహ్మతుల్లా. 'ప్రేమాగ్నినన్ను ఎప్పుడూ కాల్చేస్తూ వుంటుంది దీనిని నేను ముట్టించలేదు, నేను ముగించలేను.. '

డ్రాయింగ్ రూం ఆకర్షకంగా అమర్చబడివుంది. గది మధ్యలో సోఫాసెట్ వుంది. వాలు కుర్చీలు వున్నాయి ఒక పక్క వ్రాతబల్ల వుంది. దాని మీద చిన్న చిత్రపటం. పెద్ద 'ఫాన్' తిరుగుతూ వుంది. రైల్వే వెయిటింగ్ రూంలలోనే అంత పెద్దది అగుపిస్తుంది అందం కోసం కాకుండా ఉపయోగం కోసం అన్నట్లుగా అది మంచి వేగంతో తిరుగుతోంది.

సెంటర్ టేబుల్ మీద తాగుడు సీసా, గ్లాసులు వుండటాన్ని బట్టి రహ్మతుల్లా ఆ సమయంలో పానీయాలు సేవిస్తున్నాడని అనుకున్నాడు అరుణ్

'విస్కీ తీసుకుంటావా?'

'టీ తీసుకుంటాం అనుకున్నానే నేను?'

'మర్యాద కోసం పెట్టిన పేరు అది టీకి రమ్మని ఆహ్వానిస్తాం నీకు గుర్తుందా -- మనం కాలేజీ కాంటీన్‌లో చిక్కుడు కాయల కూర తినేవాళ్లం. దాన్ని కూడ 'టీ' అనే అనేవాళ్లం కదూ?'

అరుణ్ అతనితో పాటు నవ్వాడు.

'నేను తాగను. నీకు తెలుసు కదూ?' అన్నాడు.

'ఓ గుక్క తీసుకుంటే యింతలో కొంపలేం మునిగిపోవులే. ఇండియా పాకిస్తాన్ తగాదాలు మరచిపోదాం యిప్పుడు. కులాసాగా గడుపుదాం యీ సాయంకాలం'.

'ఉహూ నేను తాగను నన్ను మన్నించు -'

'కనీసం బీర్ అయినా తీసుకో -'

'బీరు కూడా వద్దు -'

'బీర్ మత్తు పదార్థం కాదు. చూడు గాలిబ్ యేమన్నాడో'

'ఓ పవిత్రుడా! సారాయానికి స్వస్తి చెప్పకు.

అది నీ మధువు కంటె మధురమైన జీవజలం!'

'క్షమించు. నేను తాగలేను.'

'సరే నీవే గెలిచావు. టీ తీసుకుందువు గాని-'

తన గ్లాసు చేతుల్లోనికి తీసుకుని తాగడం పూర్తి చేశాడు. నౌఖర్ని బిగ్గరగా అరచి పిలిచాడు. తనకు యింకో గ్లాసు పానీయం తెమ్మన్నాడు. టీ, రొట్టెలు - బిస్కట్లు అరుణ్ కోసం తెమ్మని పురమాయించాడు.

పానీయం త్వరగానే వచ్చింది టీ తయారు చేయటానికి కొద్ది సమయం కావలసి వచ్చింది

కుర్చీలో విలాసంగా తాపీగా కూర్చుని రహ్మతుల్లా చేతిలోని గ్లాసుతో ఆడుకుంటూ - సాయిలా - పాయిలాగా - అర్ధనిమీలిత నేత్రలతో అరుణ్ వంక చూస్తున్నాడు. అతని చెంపలు చిక్కిపోయివున్నాయి చాలామంచివాడు యితడు, స్నేహపాత్రుడు టీ సరంజమా రావడంతో అరుణ్‌కోసం రహ్మతుల్లాయే టీ కలిపాడు

'మీ డేరా పక్కన ఆ చెక్క పెట్టెల మీద కూర్చున ఆ అమ్మాయి ఎవరు?' అనడిగాడు.

అరుణ్ అతను ఎవరి గురించి అడుగుతున్నాడో యిట్టే గ్రహించాడు

'ఎవరు నీవనేది?' - అన్నాడు స్థిరంగానే. అయినా అతని చేతులు వణుకుతున్నాయి టీ కప్పు అందుకుంటున్నప్పుడు.

'అదే! అమేనోయ్ -- ఓ చిన్నపిల్లకు తలదువ్వి, జడ వేస్తూవుంది చూడు -- ఆమెను గురించి నేను అడుగుతున్నది-' అంటూ రహ్మతుల్లా తన గ్లాసులోంచి ఓ పెద్ద గుక్క లోపలకు పీల్చాడు. సాదాగా కనిపించటానికి ప్రయత్నిస్తున్నాడు.

' ఆ అమ్మాయి ఆమె కూతురే!'

అయితే ఆమెకు అప్పుడే పెళ్లి అయిందా? భర్త ఎవరు?'

'తన ఆస్తి - అద్దెల గురించి నిన్ను ప్రశ్నలు అడుగుతున్నాడు గుర్తుందా?' -అన్నాడు అరుణ్ ఓ పేస్ట్రీ నమిలిమింగుతూ.

'ఓ ఆ బడుద్ధాయి ఆమె మొగుడంటావా?'

'ఏం అందులో తప్పేం'

కెప్టెన్ రహ్మతుల్లా తను అలౌక్యంగా ప్రవర్తిస్తున్నానని గుర్తించాడు. హాయిగా శరీరాన్ని విరుచుకుని, నవ్వుతూ..... 'మరేం కోపం చేసుకోకు .. తమాషాకు అన్నాను. ...' అన్నాడు.

బేరర్‌ను పిలచి తన గ్లాసు భర్తీచేయమన్నాడు.

'నా ఉద్దేశ్యం యేమిటంటే - ఆమె చాల అందంగా అగుపిస్తోంది; అతనేమో అయోగ్యుడిలా వున్నాడే ... అని.'

"వాళ్ళిద్దరూ హాయిగా నిష్పేచీగానే వున్నార్లే"

కెప్టెన్ యీ మాటను కాదనలేదు. అతను గంభీరంగా ఆలోచిస్తూ గ్లాసును పెదాలతో చప్పరిస్తున్నాడు. మెల్లగా గుటకలు వేస్తూ "చూడు, నీతో సూటిగా మాట్లాడుతున్నాను. నాకు ఆమె అంటే యిష్టం యేర్పడింది" అన్నాడు.

అరుణ్‌కు యేంజరుగబోతుందో పొడగట్టింది. అయినా యింత నిర్ఘాంతపోతానని అతను కూడా అనుకునివుండడు. అతను యింకా టీ తాగుతున్నాడు, తన కోపం పైకి కనిపించకుండా వుండాలని కొద్దిగా వంగాడు. టీ కప్పు బల్ల మీద వుంచాడు.

కెప్టన్ రహ్మతుల్లా యుక్తి యుక్తంగా వేచివున్నాడు. గ్లాసు పెదాల మధ్య ఆడిస్తున్నాడు. తన ముఖాన్ని ఆ గ్లాసు వెనక దాచుకుని, అరుణ్‌ను పరికించసాగాడు.

అరుణ్ బిగుసుకుపోయికూర్చున్నాడు. శిలాసదృశం అయ్యాడు. చేతులు ముడుచుకుని వొడిలో పెట్టుకున్నాడు.

'నీవేం చేస్తున్నావో గమనించు కోవడం మంచిది - ఆమె నా సోదరి' అన్నాడు.

రహ్మతుల్లా కుర్చీ లోంచి లేచి గదిలో అటు యిటు పచార్లు చేస్తూ 'ఆమె నీకు సోదరి కాదని నీవూ యెరుగుదువు. హిందూ యువకులు ప్రతివాళ్ళను అక్కచెళ్ళల్లంటూ ఎందుకు వెంపర్లాడతారో నాకు సుతరాము అర్థం కాదు' అన్నాడు.

'సోదరి లాంటిది, ఏం వ్యత్యాసం లేదు. నాకు ఆమె అనేక సంవత్సరాలుగా పరిచయం. చాలదా?'

'సోదరికి, సోదరిలాంటివాళ్లకు చాలా వ్యత్యాసం వుంది అరుణ్. సోదరి సోదరియే, తతిమ్మావాళ్లు తతిమ్మావాళ్ళే మీ మతంతో వచ్చిన చిక్కుయిదే. ప్రతి విషయాన్నీ యేదో వేదాంత ధోరణికి మార్చి వేస్తుంది. మామూలు సాంఘిక సంబంధాలను గూడ!'

అరుణ్‌కు యిప్పుడు భయం అనిపించడంలేదు. ఈ స్థితికి అతనికి ఆశ్చర్యంగా వుంది. 'సరే ఏమయితేనేం? త్వరలోనే మా అందరిని వదిలించుకుంటావుగా!' అన్నాడు.

రహ్మతుల్లా విశాలంగా చేతులు ఉపూతూ 'మళ్లీ అంతా రాజకీయం చేస్తున్నావు. నేను చెబుతున్నది సూటిగావిను. చిన్న చిన్న విషయాలను సంక్లిష్టం చేయవలసిన అవసరం లేదు. ఇదే మీ మతంలో వున్న మరో తమాషా విశేషం!' అన్నాడు.

కెప్టెన్ అక్కడితో ఆగి అరుణ్ వంక చూచాడు. తన ధోరణి సరయిన పద్ధతిలో సాగడంలేదని అతనికి ఊహకు అందుతోంది. వేళాకోళంగా మాట్లాడితే అరుణ్‌కు యింకా కోపం వస్తుంది. తనకు అతని సహకారం కావాలి యిప్పుడు.

అరుణ్ కుర్చీ దగ్గరకు తిరిగివచ్చి అతని పక్కన వున్న కాళీకుర్చీలో కూలబడి అతని బుజం మీద చేతులు వేశాడు. ''నేనేదో ఆవేశంతో మాట్లాడుతున్నాను. మీరు తప్పకుండా మా కంటె తెలివిగల వాళ్ళే అయివుంటారు. చూడు, ఒక విషయం ఆలోచించు. నీకూ ఆమె అంటే యిష్టం అనీ, ఆమెను గురించి నాతో మాట్లాడడం నీకు యిష్టం లేదనీ - అంటే నేను అర్థం చేసుకోగలను. అంతేగాని యీ అక్క- చెల్లెలు వరసలు తీసుకురావడం నాకు గిట్టదు, అరుణ్ తనను తాను సమర్థించుకోవలసివచ్చింది. 'ఆమెను గురించి నా అభిప్రాయం అలాంటిది కాదు.!

కాని .... నా అభిప్రాయం మటుకు అదే అంటూ అతను అరుణ్‌ను బుజం మీద తట్టాడు, నవ్వుతూ - తానేదో పరిహాసం మాటలు అంటున్నట్లు.

నవ్వడం అయిపోయిన తరువాత 'నేను ఆమెను కలుసుకునేట్లు యేర్పాటు చేయలేవా!' అన్నాడు.

"ఆమె గుమ్మం ముందే నేను ప్రాణత్యాగం చేయగలనా?

ఆమె నన్ను చంపివేస్తుందా? ఆ కత్తికి వర వున్నాదా?" అంటు గాలిబ్ గీతాన్ని ఆలపించాడు. అతని మెడ మీది రక్తనాళలు ఉద్రేకంతో ఉబకడం అరుణ్ గమనించాడు.

"ఆమె అంటే నీ కంత యిష్టం అయితే, నీవే వెళ్ళి ఆమెను కలుసుకోరాదూ?"

'నాకు నీవు సహాయం చేస్తావనుకున్నాను-'

అరుణ్‌కు పేగులు తిరుగబడినట్టయింది - ఈ రోజుల్లో యింతకంటె అధ్వాన్నమైన సంగతలు జరుగుతున్నాయి. రహ్మతుల్లా ఖాన్ సౌందర్యరాశి అయిన అమ్మాయిని చూచి తన మక్కువ తెలుపు తున్నాడు. ఇది చాలనయం!

'యేవిధంగా?' అనడిగాడు అరుణ్ నవ్వటానికి ప్రయత్నిస్తూ.

రహ్మతుల్లా ఖాన్ కుర్చీలోంచి లేటి పచార్లు చేయనారంభించాడు. మరో వ్రాతబల్ల దగ్గరకు వెళ్ళి దానిమీద వున్న జిన్నా ఫోటోను చేతులలోనికి తీసుకుని ఆ ఫోటో వంక సూటిగా కొంత సేపు చూచాడు. ఫోటో మళ్లీ బల్ల మీద వుంచి, యిటు తిరిగి బల్లను ఆనుకుని నించున్నాడు.

అరుణ్ వంక తేరి చూస్తూ 'ఓసాయంకాలం పూట, ఆమెను యిక్కడకు తీసుకురా -' అన్నాడు.

అతని గొంతులో ఒక 'ముద్ద' తనం వుంది. తాగినందువల్ల కావచ్చు - నరాల బలహీనత వల్ల కావచ్చు. అరుణ్‌కు అతని వుద్దేశ్యం యేమిటో సుస్పష్టం అయింది. అతను యింత సూటిగా చెప్పిన తరువాత అనుమానాలకు తావులేదు.

అరుణ్ కుర్చీలోంచి లేచాడు. "నేను వెళ్ళి పోనా? శిబిరం యిక్కడకు దగ్గరే. నడుచుకుంటూ వెడతాను.'

'కూర్చో కాస్సేపు'

కెప్టెన్ రహ్మతుల్లా కంఠంలో కర్కశత్వం లేదుగాని అధికార దర్పం ఉంది. అరుణ్ వున్న చోటనే ఉండిపోయాడు. అరుణ్‌కు తనను గురించి తనకేమీ భయంలేదు. లోగడ అలాంటి భయం వుండిన మాట వాస్తవమే అతను యిప్పుడు మహావేగంగా ఎదిగిపోతున్నాడు. వెనకటి విషయాలను మహావేగంతోనే విసర్జించేస్తున్నాడు. జీవితం నుంచి ఎన్నో భరవసాలు అడగడంలో అర్థంలేదని తేలిపోయింది. అందువల్ల యెక్కువ ధైర్యం చొరవ యేర్పడ్డాయి. మధు శరీరం కోసం రాత్రిపూట నగరంలోనికి వెళ్లి నప్పటి నుంచీ యీ ధైర్యం అతనికి యేర్పడనారంభించింది. ప్రేమించడం మేమిటో - జీవించడం యేమిటో యిప్పడు నేర్చుకుంటున్నాడు ఉహు. అతనికి యిప్పుడు రహ్మతుల్లా ఖాన్ అంటే భయంలేదు. అయినా యీ గదిలోంచి బయటికి వెళ్లలేకపోతున్నాడు అతని గొంతు స్పందిస్తున్న అధికారం, అతని ఉద్యోగం వెనక వున్న ప్రభుత్వ జులుము, తీర్చిదిద్దిన యీ బంగళ, పిలిస్తే పలికే జవాన్లు, బయటి ఎండలో మిల మిల లాడతున్న జీపు..... యివన్నీ అతన్ని పిరికివాడిని చేసేస్తున్నాయి. అరుణ్ అనిశ్చిత స్థితిలో అలా నించుండి పోయాడు.

రహ్మతుల్లా గ్లాసు కాళీ చేశాడు. చేతి రుమాలతో జిన్నా ఫోటో తుడిచాడు. అతని ముఖంలో నవ్వులేదు. 'మీకు నేను ఎంతయినా సహాయం చేయగలననే విషయం మరచిపోతున్నావు?' అతని కంఠ స్వరంలో యెలాంటి ఉద్రేకమూ లేదు. 'నీవు ఆమెను గనుక యిక్కడకు తీసుకురాగలిగితే-'

అతను ఆగి తనను తాను కూడ గట్టుకున్నాడు.

'అన్నట్లు - ఆమె పేరు యేమిటి?''

'నాకు తెలియదు'

'నిజమని నన్ను నమ్మమంటావా?'

'ఉహు'

'సరే - ఆ విషయం అలా వుంచు ... ఇందాక నేను చెబుతున్నట్లుగా ఓ సాయంకాలం పూట ఆమెను యిక్కడకు తీసుకురాగాలిగితే - నేను నిన్ను నీ కుటుంబాన్నీ నా స్వంత జీపులో జమ్మూ సరిహద్దు మీదుగా తీసుకువెడతాను. మీ రందరూ ఒక అరగంటలో సురక్షితంగా చేరుకుంటారు '

అరుణ్‌కు యింతకన్న అవినీతి దాయకము, శరీరాన్ని - మనస్సును కుంగదీసే సందర్భము యింకొకటి లేదనిపించింది. ఈ దోపిడిలకు దుర్మార్గాలకు యిప్పటికే యెంతో చిక్కిపోయారు. సురక్షితంగా బయటికి వెళ్ళడం కంటె కోరుకోవలసింది యింకేమీ వుండదు. అరుణ్ ముఖంలో రంగులు రకరకాలుగా మారాయి చివరకు ఉద్విగ్నతతో ఇటుకరంగు - ఎరుపు - కు తిరిగింది అతని ముఖం.

'నే నిక వెళ్లిపోతాను-' అని ధైర్యంగా అనేసి గబ గబ గదిలోంచి బయటకు వచ్చాడు.

కెప్టెన్ రహ్మతుల్లా తన మర్యాదలు మరచిపోలేదు. గబ గబ అతని సరసకు చేరి వీడ్కోలు యిచ్చాడు. 'జీప్ వుంది..' అని నింపాదిగా అన్నాడు. అరుణ్ అతని మాటలు సరకు చేయకుండా చీకటిలో కలిసిపోయాడు. కెప్టెన్ అరుస్తూనే వున్నాడు వెనకనుంచి, 'నేను చెప్పింది బాగా ఆలోచించూ.... తరువాత చెప్పు...'

ఆ తరువాతి రోజులలో కెప్టెన్ రహ్మతుల్లా అనేక పర్యాయాలు ఇరవై అయిదవ నెంబరు వీధికి చాలసార్లు వచ్చాడు. ఏదో ఒక మిష పెట్టుకుని వచ్చేవాడు. ఒక్కోమారు అరుణ్ డేరా గుమ్మం వరకూ జీప్ తోలుకు వచ్చేవాడు. లాలా కన్షీరామ్‌ను, ప్రభారాణిని ఎప్పుడూ గౌరవంగా చూచేవాడు. వచ్చినప్పుడల్లా మిలటరీ వందనం చేశేవాడు. అరుణ్ అతన్ని యేమీ అడిగే వాడు కాదు. లాలా కాన్షీరామ్ మటుకు అతను చెప్పే పాద ప్రయాణికుల యేర్పాట్ల వివరాలు బహు శ్రద్ధగా వింటూ వుండేవాడు. ప్రభారాణి అతనికి గమనం యిచ్చేది కాదు. అతను వచ్చి వెళ్లిన ప్రతిసారి 'ఆ వెధవ మిడిగుడ్ల ఆశపోతు..' అనేది. అతను వచ్చినప్పుడల్లా ఛాందినీని యేదో మిష మీద డేరా బయటకు పంపివేసేది.

అతను అనేక పర్యాయాలు వచ్చాడు మత్తెక్కిన జంతువులా కామ జ్వరపీడుతుడై కనిపించేవాడు. అతని నరం నరంలోను ప్రతి అణువులోను యీ కామ ప్రకోపం బాహాటంగా కనిపిస్తూ వుండేది. ప్రతిమారూ సూరజ్ ప్రకాశ్ డేరావయిపు చూస్తూవుండేవాడు. ఈ డేరాలలో ఆంతరికం అనేదిలేదు. లోపల జరుగుతున్నదంతా బయటనించుని వున్నవాళ్లకు ఎవరికయినా కనిపిస్తూనే వుంటుంది. సునంద దాదాపు ప్రతి మారూ డేరాలోనే వుండేది. ఆమె ముఖం వికసించిన పుష్పంలా విరిసివుండేది అతను తేనేటీగలాగ అక్కడే కొట్టు మిట్టులాడుతూ వుండేవాడు. కాస్సేపు పాదాలు కదుపుతూ, కాస్సేపు చేతులు ఊపుతూ, లాలా కాన్షీరామ్‌తో రకరకాల కంఠధ్వనులతో మాట్లాడుతూ వుండేవాడు అతన్ని యిప్పుడు కాల్చివేస్తున్నది ఒక్కటే కోరిక. అది సునంద కామాగ్నిలో తాను దగ్ధం అయిపోవాలి! అతను క్రమక్రమంగా ధైర్యం పుంజుకోసాగాడు వాళ్ల డేరా దగ్గరకు వెళ్లి సూరజ్ ప్రకాశ్‌ను పిలిచేవాడు ఆ మనిషి యింట లేడని తెలిసినప్పుడే ఆ పని చేసేవాడు. ఇప్పటికి కొన్ని రోజులుగా బీబీ అమరావతి భర్త గంగుమల్లు కనబడడం లేదు. అతను ఉన్నట్లుండి ఒకనాడు అంతర్థానం అయిపోయాడు. పైకి యెంతో కుంగిపోయినట్లు కనిపిస్తున్నా బీబీ అమరావతి లాలాకన్షీరామ్‌తో 'పీడ వదిలి నట్లు అయింది. అతను ఎప్పుడూ దండగమారి మనిషే!' అంది. సూరజ్ ప్రకాశ్ యింట లేనప్పుడు యెవరయినా పిలిస్తే యింట్లో ఆడవాళ్లే జవాబు చెప్పవలసి వచ్చేది. రహ్మతుల్లా వస్తున్న వయినం పసిగట్టగానే సునంద ముఖం పక్కకు తిప్పుకు పోయేది. . మరోమూలకు. బీబీ అమరావతే కెప్టెన్ ప్రశ్నలకు పొడిపొడిగా సమాధానాలు యిచ్చేది. సంభాషణ అయిపోయిన తర్వాత కూడా అతను- అక్కడే వేలాడుతూ కనిపించేవాడు. అతనికి సునంద వీపు మాత్రమే కనిపిస్తూ వుండేది. అతను వున్నంత సేపూ ఆమె అటు వైపు ముఖం తిప్పేది కాదు. కాని రహ్మతుల్లా ఖాన్‌కు ఆ వీపే చాలు. ఎంత ప్రణయమయినా ఉద్భవిస్తుంది.

పౌర్ణమి వచ్చింది. అరుణ్ డేరా బయట కూర్చుని వున్నాడు చంద్రుని చూస్తూ. డేరాలలో నుంచి వస్తున్న పలుధ్వనులను గమనిస్తూ కూర్చున్నాడు.

అతని బుజాన్ని ఎవరో తాకినట్లయింది. సునంద! ఆమె చేతిలో ఒక బకెట్ వుంది 'నాతో పాటు నీళ్ల కొళాయిల దగ్గరకురా...' అంది

నీళ్ల కొళాయిలు శిబిరంలో పలుతావులలో వున్నాయి. ఇక్కడకి దగ్గరగా వున్నది యాభయి గజాల దూరంలో - ఆవరణలో. ఆ స్థలం తరువాత ఈ శిబిరం సరిహద్దు. దానిపైన చిన్నవాగు ప్రవహిస్తుంది. కంటోన్మెంట్‌ను, పట్టణాన్ని వేరు చేసేది యీ వాగే.

నీళ్ల కొళాయిల దగ్గర ఎక్కువ జనం లేరు. అయితే సునంద అంతదూరం నడవనేలేదు. అరుణ్‌ను ఆమె సరిహద్దుకంచె దగ్గరకు నడిపించింది.

బకెట్ నేలమీద పెట్టి, కంచెకు వీపు ఆనించి - ఆమె అరుణ్ వయిపు ముఖం పెట్టింది. ఆమెకూడ చంద్రుడినే చూస్తోంది. ఆ చంద్రకాంతిలో ఆమె శరీరం వింతకాంతులు ప్రసరిస్తోంది. ఆమె ఘన స్తనాలు యిప్పుడు బాగా పొడుచుకువచ్చి వాటి నీడలు ఆమె పొట్ట మీద పడుతున్నాయి కూడ. ఆమె వెనకాల, వాగు - సియల్‌కొట పట్టణము చంద్రకాంతిలో ధగధగ మెరుస్తున్నాయి. తనతో మాట్లాడటానికి వచ్చిన దేవతస్త్రీయా యీమె - అనుకున్నాడు అరుణ్. తనతో యేం చెప్పాలను కుంటూంది?

'అరుణ్ - నీ స్నేహితుడు వున్నాడు చూడు... అదే - ఆ ఆర్మీ ఆఫీసరు.. అతను నిన్ను చూడటానికి అంత తరచుగా యెందుకు వస్తుంటాడు ?'

అరుణ్‌కు గుండెలు అగిపోయినట్లు అనిపించిది. ఏమీ బదులు చెప్పకుండా నిలబడిపోయాడు.

సునంద కోపంగా అసహనంతో ఊగిపోతోంది. చంద్రుడు కూడా ఆమె ముఖం మీది గీతలను తుడిచి వేయలేకపోతున్నాడు.

ఆమెకు ఎంత వరకు తెలుసును? - అనుకున్నాడు అరుణ్. ఆమె ఎంతవరకు ఊహించగలగుతోంది?

'అతన్ని ఈ మారు చూచినప్పుడు ఒక విషయం చెబుతావూ అతనికి? -' అంటూ ఆమె చంద్రుని వంక చూచింది ఆమె శరీరమంతా అసహ్యంతో కంపించి పోతోంది

'ఏమని?' - అరుణ్ ఆమె తనవయిపు చూడడంలేదు గనుక బ్రతికి పోయినాను; అనుకుంటున్నాడు.

'అతనికి చెప్పు. అతను నన్ను ముట్టుకోవటానికి ప్రయత్నించాడంటే.. అతన్ని చంపిపారేస్తాను !'

# మూడవ అధ్యాయం

ఆ రోజునుండి అరుణ్ రహ్మతుల్లాతో పోట్లాడడం కోసరం ఎదురుచూస్తూవున్నాడు. అయితే రహ్మతుల్లా అతనికా అవకాశం దొరకకుండా చూస్తున్నాడు అరుణ్‌కు బాహాటంగా యీ కారణం చెప్పిపోట్లాడడం యిష్టంలేదు అలాచేస్తే, సునంద పేరు బయటపడిపోయి ఆమెకు లేనిపోని అప్రతిష్ట వస్తుంది. అదీగాక బలిష్టుడు, అధికారంలో వున్నావాడు అయిన రహ్మతుల్లాతో బాహాటంగా పోట్లాడటానికి తను యెంత మాత్రం చాలడు. అందు చేత అతన్ని యెక్కడో మాటల్లోనే ఒక మూలకు నెట్టి - ఏకాంతంలో తన కోపం అసహ్యం అన్ని వప్పచెప్పాలనుకుంటున్నాడు. కెప్టెన్ రహ్మతుల్లా అతని మానసిక స్థితిని గమనించాడు కావున, అతనితో యేకాంతం అనేది కుదరకుండా చూస్తున్నాడు. అరుణ్ రెండు మార్లు అతని ఆఫీసుకు వెళ్ళాడు. అయితే సుబేదార్ మేజర్ అతన్ని 'కెప్టెన్ యేదో మీటింగ్‌లో బీజీగా వున్నాడని' చెప్పి వెనక్కు పంపివేశాడు. తతిమ్మా సందర్భాలలో అరుణ్ తీసుకు వెళ్ళిన వాళ్ళే వాళ్ళిద్దరితోను వున్నారు. అందరి సమక్షంలోను యీ విషయం ప్రస్తావించాటానికి కుదరదు గద!

ఏమయినా అరుణ్ యిప్పుడు చాందినీతో ప్రేమలో పడిపోయాడు. ఈ ప్రవాహంలో సునందకు యేమయినా అతను అంతగా పట్టించుకునే పద్ధతిలేదు. తతిమ్మావాళ్ళంతా అతని చేతనంలో పొలిమేరలోనే వున్నారు. కెప్టెన్ రహ్మతుల్లా ఖాన్ క్షమించరానంత దుస్సహంగా ప్రవర్తించిన మాట నిజమే. సునందకూడా కష్టపెట్టుకుంది మనసుకు. మధు - నూరేళ్ళ జీవితమూ... అంతమయిపోయి మరణం పాలయింది. శరీరం నుంచి సువాసనుల గుబాళిస్తున్న యీ స్త్రీ.. తన ముందు విశాలంగా విస్తరించుకుంటూ పరచుకుంటుంది.

వాళ్ళ ప్రేమ అంచెలంచెలుగా ఎదగలేదు. వరద వెల్లువగా వాళ్ళ మీదకు ప్రవహించింది. మరునాడు రాత్రి అరుణ్ ఆమెను - చాందినీని నీళ్ల కొళాయిల దగ్గర చేయిపట్టుకున్నాడు. ఆమె విదిలించు కోబోయింది గాని అతను బలంగా ఆమెను నొక్కిపెట్టి ఆమె ప్రయత్నం సాగనివ్వలేదు. ఆమెను ఆవరణలో మరో మూలకు సరిహద్దు గోడ దగ్గరకు లాక్కువెళ్ళాడు. ఆమెను

యీ గోడకు ఆనించి ఆమె మూతిని గొంతును తనవి తీర చుంబించాడు. ఆ అమ్మాయి తంటాలుపడి తన ముఖం పక్కకు తిప్పుకోవటానికి శతధ ప్రయత్నం చేసింది. ఒక స్థితిలో తన ప్రయత్నాలన్నీ విరమించుకొని తిన్నగా వుండిపోయింది ఆమె శరీరం కంపనాలతో ప్రకంపనాలతో ఉడికిపోతూ తన శక్తిని నిరోధాన్ని కోల్పోయింది అతనామెను ముద్దులు పెట్టుకుంటూనే వున్నాడు ఆమె మాత్రం నిస్సత్తువతో అతని బుజాల మీదకు స్పృహ తప్పి పడిపోయింది.

ఆమెకు తెలివి వచ్చిం తర్వాత 'మీ తల్లి దండ్రులు యే మంటారు?' అడిగింది

'వాళ్ళేమంటారు ?'

'ఈ చర్యలకు అంగీకరిస్తారా? ఉహుఁ' అంది.

'నేను నిన్ను ప్రేమిస్తున్నాను, ఛాందినీ!'

'నీవేం మాట్లాడుతున్నావో, నువ్వు ఎరుగుదువా?'

'ఆ ! బుద్ధివుండే మాట్లాడుతున్నాను, నిన్ను వివాహం చేసుకుంటాను-' అరుణ్ నిజానికి యీ మాటలు అనాలని అనలేదు. అయినా అవి ఆకస్మికంగా బయటికి వచ్చేశాయి.

'నీకు పిచ్చెక్కింది'

'అలా మాట్లాడకు, నేను నిన్ను పెళ్ళి చేసుకోబోతున్నాను. అదీ అతి త్వరలోనే. నీకు యిష్టమేనా?'

'ఇదంతా సాధ్యమయ్యేపనికాదు'

'చెబుతున్నాను గదా!'

'మీ తల్లిదండ్రులు యిందుకు యేమాత్రం సమ్మతించరు'

'వాళ్ళెవరు సమ్మతించకపోవటానికి?'

'నా కులం.....'

అతనామె చుబుకాన్ని పైకి ఎత్తి, నిదానంగా ఆమె పెదవులమీద బలంగా ముద్దుపెట్టుకున్నాడు.

'మనం యిప్పుడు స్వతంత్ర భారతంలో వుంటాం ఇక్కడ ఎవరూ కులాల ప్రసక్తి తీసుకురారు '

'మేం అతి బీదవాళ్లం కదా!

'అలాంటి సందర్భాలు యిప్పుడు సరికాదు విభజన అయిపోయాక మన అంతస్థులు మారిపోతాయి-'

అరుణ్ యిలా అనుకోవటానికి యేం కారణం లేదు. అయినా అతనికి అంతనమ్మకం యేర్పడిపోయింది తాము యిప్పుడు పడుతున్న అవస్థలన్నిటికి యేదో మూలం వుండాలి. వీటినుంచి బయట పడినప్పుడు కొత్త మనుషులుగా, కొత్త వాతరవణంలో ప్రభవించాలి అలా కాకపోతే మానవత్వమే మాసిపోతుంది. అతని యువక మేధస్సుకు ఎలాంటి అభ్యంతరాలు కనిపించడం లేదు. భవిష్యత్తంతా అతని చేతుల్లోనే వుంది అతనికి అంత దృఢమైన నమ్మకం, నిశ్చితం

చాందిని అరుణ్‌ను బల్లిలా పట్టుకు నిలబడింది

'నాకు తెలీదు. నేను ఎరుగను-' అంటూంది, అతన్ని ముద్దులతో ముంచెత్తుతూ.

''నన్నునమ్ము'' - అంటున్నాడు అతను ఆమె చెవిలో రహస్యంగా.

చాందినీ, ఆమె తల్లి పద్మిని రెండేళ్ళక్రితం తమ యింటికి వచ్చారు. చాందినీ అతని కంటె రెండేళ్ళు చిన్నది. అంటే నూర్ వయసే వుంటుందన్నమాట. ఆమె తల్లి ఎంత మురిపెం చేస్తుందో - అరుణ్ ఆశ్చర్యపోయాడు. ఒక్కక్షణమైనా పిల్లను వంటరిగా వదలదు. ప్రభారాణి ఆమెను యిక్కడే వుండి కొంతసేపు కుట్టుపని చేయమంటే కుమార్తెతో పాటు తల్లి కూడ అట్టే వుండిపోతుంది. వీలయితే యేదో మిష పెట్టి, కుమార్తె రాకుండానే చేస్తుంది. గుడికి వెళ్లాలనో దూకాణానికి పోవాలనో అమ్మాయికి వంట్లో సరిగా లేదనో యేదో కుంటిసాకు చెబుతురది.

పద్మిని - తల్లి - కూడా ఎంతో హూందా అయిన మనిషి. పని మనిషి అయినప్పటికి యేమి తడబాటు లేకుండా, హూందాగా - దర్పంగా నడుస్తుంది.

ఆర్థికంగా బీదవాళ్ళే కావచ్చును, కాని తల్లి - కూతురు ఎప్పుడు శుభ్రంగా వుంటారు, మంచి బట్టలు కట్టుకుంటారు అరుణ్‌కు ఎఱుక అయినంత వరకు - చాందినికి చదువను, వ్రాయను రాదు ఆమె ఎప్పుడూ బడి ముఖం చూడలేదు

ఈ విషయాలు యేవీ - ఆమె చదువు, అంతస్తు, పెంపకం, దారిద్ర్యం- యివేవీ అరుణ్‌కు ప్రస్తుతం అవరోధంగా అగుపించడమే లేదు ఇప్పుడో కొత్త రూపు వచ్చింది అతనికి - పరిస్థితుల ప్రభావం వల్ల తన కర్మ వశాన సంప్రాప్తం అయింది అది - దాన్ని వదులుకోవడం అతనికి యిష్టంలేదు

ఆమె జాకెట్ వదులు చేసి చేయిలోపలకు పెట్టాడు అనాచ్ఛాధితమైన ఆమె వక్షాలు గట్టిగా తగిలాయి. మొనలు నిక్కబొడుచుకున్నాయి

'ఉహు - వద్దు'

'ఇప్పుడే వద్దంటావా?'

'అవును' - ఆమె తల కిందకు వాలి వుంది. ఆమె నేల వంక చూస్తోంది.

చాందిని కాస్తనలుపుగానే వుంటుంది. అయినా ఆకర్షణీయంగా కనబడుతుంది. అసలు పంజాబ్ యువతులలో అందంగా లేని వాళ్ళంటూ ఎవరయినా వున్నారా? పొడుగు, పొట్టికాని, ఎత్తు. ఆమె శరీరం గువ్వ పిట్టలా వుంటుంది. ముక్కు - గడ్డం యివన్నీ గుండ్రంగా వుంటాయి. సుకుమారంగా సుతి మెత్తగా వుంటుంది ఆమె మొత్తానికి.

పంజాబీ పిల్లలు చాల మటుకు నల్లగా వుండరు. ఇది సామాన్యమైన విషయం. చాందినీకి ఈ సంగతి కూడా తెలుసు. బహుశ అందువల్లనే కావచ్చు ఆమె తన యీడు పిల్లలతో కలవకుండ ఎక్కువగా తల్లినే అంటి పెట్టుకువుంటుంది. ఎక్కువ సేపు ఆమె వంట గదిలో 'సింక్' దగ్గర మోకాళ్లమీద తల వాల్చుకొని కూర్చుంటుంది. చేతులు, తొడలు, మంచి ఆకారంలో వుంటాయి. ఆమె గిన్నెలు పాత్రలు కడుగుతున్నప్పుడు తొడలు గూడ చేతులతోపాటు లయగా ఊగుతూ వుంటాయి. ఆమె యెప్పుడూ యింట్లో

స్వేచ్ఛగా అటు యిటు తిరుగాడడం చూడలేదు అతను. ఎప్పుడైనాతను ఎదురయితే బెదిరిన పక్షిలా పరుగెత్తుతుంది. ఆమె యిప్పుడు నవ్వుతూ వుందని అతను ఎరుగును, ఆ నవ్వు ధారాళంగా ముఖంలో కనిపించక పోయినా ఆమె శరీరం రాగి రంగుకు మారి వుంది. చేతులు రవికను, దూపట్టాను, చీరను, అటు యిటు అనవసరంగా సవరించుకుంటూ తిరుగుతున్నాయి. బహుశ ఆ శరీరం రంగు ఆమెకు తండ్రి నుంచి సంక్రమించి వుంటుంది తల్లి మాత్రం తెల్లగా నాజుకు గానే వుంటుంది తల్లి నిదానంగా వుంటుంది. ఆమెతో పోలిస్తే ఈ అమ్మాయి అంత ప్రశాంతమైనది కాదు అనుకున్నాడు అరుణ్.

'బాగా చీకటిగా వుంది' - అంది ఆమె తల పైకెత్తి చూడటానికి ప్రయత్నం చేస్తూ,

'నిన్ను ప్రేమిస్తున్నాను-'

నీళ్ళ కుళాయి దగ్గర ఆ కంచె దగ్గర కలుసుకోవడం వాళ్ళకు అలవాటు అయిపోయింది. సాయంత్రం పూటలు కలుసుకునే వాళ్లు. ఒక్కోసారి లాలా కాన్షీరామ్ నిద్రపోతున్నప్పుడు మధ్యాహ్నం పూట కూడ కలుసుకోవడం జరిగేది. రాత్రిపూటలు, డేరాలోనే అరుణ్ ఆమె పక్కలోకి దూరుతూ వుండేవాడు. ఛాందిని వణికిపోతూ అతన్ని దూరంగా పొమ్మని తరుముతూ వుండేది. ఛాందినికి భయం, తల్లిగాని - అతని తల్లిదండ్రులుగాని చూస్తే యేం గొడవ అవుతుందోనని. ఆమెను కౌగలించుకు పడుకోవడం అతనికి యెంతో తృప్తిగా వుండేది.

చాందిని అతని ప్రేమలో చక్కగా వికసిస్తోంది, పల్లవిస్తోంది. శారీరకంగా ఎక్కువ మార్పురాలేదు. గువ్వపిట్టలాగ అలాగే వుండింది. ముఖంలో మాత్రం చాల మార్పు వచ్చింది. నేను నిన్ను ప్రేమిస్తున్నాను అని అరుణ్ ఆమెతో పదే పదే అంటున్నాడు. అయినా యీ మాటల ప్రభావం ఆమె మీద అంతగా లేదనే చెప్పాలి. అతను చదువుకున్నవాడు - తనకు చదువంటే యేమిటో కూడా తెలియదు. కాకపోతే వ్యవహార జ్ఞానం వున్నది. అరుణ్‌కు తనంటే యిష్టం అని ఆమెకు బాగా తెలిసిపోయింది.ఈ కుటుంబంతో వివాహ బంధం

యేర్పడటం విషయమే యింకా ఆమెకు జీర్ణం గాకుండా వుంది. భయంతో తల పక్కకు తిప్పేసుకునేది ఆ ఆలోచన వచ్చినప్పుడు. కులం ప్రసక్తి ఒకటే కాదు, ఇద్దరి జీవన విధానాలు, అంతస్థులు వేరు వేరు. అరుణ్ మటుకే అంటున్నాడు - పెళ్ళి చేసుకుంటానని ఏం జరిగినా మాట తప్పనని అంటున్నాడు అతన్ని నమ్మడం తప్ప యింకోమార్గం లేదు తనకు. ఎలాంటి అనుమానాలు, కుశ్శంకలు లేకుండా చాందిని అతన్ని నమ్ముతోంది.

ఇప్పుడు అరుణ్ వెనకాలే ఆమె కళ్ళు ఎప్పుడూ తిరుగుతువుంటాయి. అతని కోసమే జీవిస్తున్నట్లు అనిపిస్తుంది ఇతరుల ముందు యిద్దరు మాట్లాడుకోరు ఆ అవసరం కూడా లేదు. వాళ్ళిద్దరు ఒకర్నొకరు చూసుకున్నప్పుడు ఆమె పెదవుల మీద చిరునవ్వు అవతరిస్తుంది. ఆమె కళ్లు నూతన తేజంతో వెలిగి పోతాయి. అతనికి టీగాని భోజనంగాని ట్రేలో తీసుకువచ్చి అందించినప్పుడు కావాలనే చేతివేళ్ళు తగిలిస్తాడు, స్పర్శిస్తాడు. ఈ వివాహం జరగడంలో యెన్నో ఆటంకాలు అవరోధాలు వున్నప్పటికీ దీనివల్ల తమ స్థాయి అతిశయిస్తుందని ఆమె ఎరుగును లాలా కాన్షీరామ్, ప్రభారాణులంటే ఆమెకు గౌరవము, మర్యాద అందరిలాగానే వాళ్ళను చాచాజీ, చాచీజీ అనిపిలుస్తుంది ఇప్పుడు వాళ్ల పట్ల ప్రత్యేక శ్రద్ధ తీసుకోనారంభించింది. 'మీకేమైనా కావాలా చాచాజీ..', మీకేమైనా కావాలా చాచీజీ ... అంటూ ప్రత్యేకంగా వాళ్లను విచారిస్తోంది. ఇప్పుడు యేదయినా భయం అనిపించినప్పుడు వాళ్ళపక్కన చేరుతోంది, తల్లి సరసన కాక. తల్లి యిప్పటికీ ఆమెను తన రక్షణ లోనే పొదిగివుంచాలని చూస్తున్నప్పటికీ ఛాందీని మాత్రం తల్లి నుంచి దూరంగా జరుగుతూ ప్రభారాణికి దగ్గరవటానికి ప్రయత్నిస్తోంది.

మానసిక సుఖ సంతోషాలతో పాటు, ఆమె శరీరం రంగు విచ్చిపోసాగింది. చర్మానికి యేదో కషాయం పులిమినట్లుగా నలుపు విరిగిపోసాగింది. నూతన వధువుగా తన జీవితం ఎలా మధురం కాబోతోందో ఆలోచిస్తూ ఆమె ముఖంలో ఎప్పుడూ చిరునవ్వు ముద్రితమై వుంటూంది. భవిష్యత్తు గురించి ఆలోచించుకుంటూ కాలం గడపడమే ముఖ్యమైన కార్యకలాపం అయింది తను మంచిగా వుంటుంది అరుణ్‌కు సంతోషం కూరుస్తుంది వివాహ తంతు గురించి ఆలోచించింది. అరుణ్ తల్లి దండ్రులు తనకు బహూకరించబోయే

నగలు నట్రా గురించి తలపోసింది. కొత్త బట్టలు గురించి యోచించింది.... యిలా ఆమె పగటి కలలు ఒక తీరూ, తెన్ను లేకుండా యెటెటో తీసుకుపోతున్నాయి ఆమెను. నిజమైన కలలలాగ అవి కరిగిపోతూ మరో కొత్త వ్యావృత్తి తీసుకువస్తున్నాయి. నిజమైన కలలాగా కాకుండా అవి ఎప్పుడు సుఖ సంతోషాలనే తీసుకువస్తున్నాయి. ఒక్కోమారు - తాను అప్పుడే మధ్య వయస్కురాలు అయినట్లు, తన కుమారుడి పెళ్ళి చేస్తున్నట్లు... తనకు అరుణ్‌కు కలిగిని పెద్ద కుమారుడి పెళ్ళి!.. ఆలోచనలు కలిగేవి.

ఈ కలలన్నీ హృదయానికి స్పందనలు తీసుకువస్తున్నాయి. ఏదో వెచ్చదనం తనివి తీర చేరుకుంటుంది. మనసు ఆనందంతో నిండుతోంది. అరుణ్, తాను శారీరకంగా ఒకటి అవడాన్ని గురించి ఆలోచిస్తే - అప్పుడు రక్తం అంతా ముఖంలోనికి చేరి గుండె కొట్టుకునే వేగం పెరుగుతోంది. ఈ సందర్భాన్ని గురించిన ఆలోచన యితర సన్నివేశాలను త్రోసిరాజు అంటూంది. తన తల్లి చెప్పిన ప్రకారం కూడా యీ సన్నివేశంలో యెంతో బాధ, నెప్పి, వుంటాయి. కాని దానిని పరమ సుఖంగా ఆమె రూపొందించుకుంటూ ఆలోచనల్లో మునిగిపోతోంది. పూల పాన్పుమీద పడుకోవడం. - ఈ పద్దెనిమిది. సంవత్సరాలుగా ఎదురుచూస్తున్న ముహూర్తాన్ని దగ్గర చేసుకోవడం - అరుణ్ తనలో పూర్తిగా ప్రవేశించాటానికి అవకాశం కల్పించడం, అప్పుడు పొందే ఆనందాన్ని గురించే ఆమె ఆలోచనలు నడుస్తున్నాయి. తతిమ్మా వివరాలు అంతగా లెక్కకు రావడంలేదు. ఆ సమయంలో తాను దుస్తులు ధరించి వుంటుందా, వివస్త్రగా వుంటుందా, అరుణ్ యేం యేం చేస్తాడు. తన శరీరంలో యితర అంగాలు ఆసమయంలో ఎలా ప్రవర్తిస్తాయి.. యిలా....! తాను పక్కమీద పవళించి వుంటుంది, దీపాలు ఆరిపోతాయి, తన శరీర పుష్పం అరుణ్‌కు స్వాగతం చెబుతోంది, చివరి వరకు అతన్నిలోగొంటుంది. అరుణ్ లోపలకు సూదిలా బాకులా చొచ్చుకు పోతాడు. అవసరమయితే ఈ ప్రక్రియలో తనకు కొద్దిపాటి నెప్పి బాధ కలిగించటానికీ అతను జంకడు.

ఇలా వివాహ సమాప్తిని గురించి ఆలోచిస్తున్నప్పుడు నోరారా యేడవాలని పిస్తుంది. హృదయాన్ని కాళీ చేసుకోవాలని పిస్తుంది. ఇలా అనిపించడంలో

దోషం యేమి లేదని కూడా తోస్తుంది. తన తల్లి యీ రోజు కోసమే, యీ సందర్భం కోసమే తనను సంరక్షిస్తూ వున్నది. ఇన్ని సంవత్సరాలుగా స్త్రీ పురుషుల సమాగమం యిది. సరైన సమయానికి సరైన ఋతువులో సంప్రాప్తం అవుతుంది. ఇప్పుడా సమయం, ఋతువు వచ్చాయి. అరుణ్ తన గమ్యం మరింక భయం యెందుకు? తను తప్పుగా భావించవలసింది యేముంది? దాన్ని గురించి కలలు కంటే మటుకేం గనుక?

'నన్ను అరుణ్ అని పిలువు చాలు .' అన్నాడు అరుణ్ - అప్పుడు వాళ్ళు సరిహద్దుమిదుగా పట్టణం వంక చూస్తూవున్నారు. అతడు ఆమె నడుమును తన చేతులతో బిగించాడు.

తల అతని బుజాలలో దాచుకుంటూ 'ఉహూ.. ' అంది ఆమె.

'అరుణ్ అను-'

'ఉహూ'

'చెప్పు - '

'మీరు.... తమరు...' అంటూ ఆమె గౌరవ వచనాలు మటుకే వల్లిస్తోంది.

'అరుణ్.. '

'మీరు..... '

ఈ ప్రస్తావనలు ఆమెకు సరికొత్తవి ఎక్కువ దిగ్భ్రమలో పడవేస్తున్నాయి ఆమెను. అరుణ్ యిలా మాట్లాడడం ఆమెకు యెంతో యిష్టం. కళ్ళు అర్ధనిమిలితాలయివుండి, పెదవులు సగం తెరుచుకు వుండి, అతని మాటలు అమృతతుల్యంగా తాగివేస్తుంది ఆమె. ఆ మాటలు వివరంగా వినదు కూడ ఆ శబ్దమే చాలు, పరవశం అయిపోతుంది. ఒంటిరిగా వున్నప్పుడు అతన్ని 'అరుణ్' అని పిలవడం 'అభ్యాసం చేస్తుంది. ఆ రోజు పనులన్నీ అయిపోయినాయి. తల్లి బీబీ అమరావతి గారి డేరాకు వెళ్ళింది. ప్రభారాణి నిద్రపోతూవుంది. మగవాళ్ళు ఎక్కడా కనుచూపు మేరలో లేరు ఒక్కొక్క

అక్షరమే ఒత్తి ఒత్తి పలుకుతూ ఆమె 'అ రు-ణ్-' అనడం అభ్యాసం చేసుకుంటుంది. సంగీత స్వరాలలాగ ధ్వనిస్తున్నాయి, ఆ అక్షరాలు. తన్మయం అయిపోయి అనేక మార్లు ఆ పదం ఉచ్చరిస్తుంది. ణ్-అన్నప్పుడు నాసికా స్వరం వస్తుంది. అతన్ని పిలుస్తున్నట్లుగా ఆ పదాన్ని పలకడం అలవాటు చేసుకుంటుంది అరుణ్ - అరుణ్ - అని మనసులోనే గుణించుకుంటుంది. బయటకు శబ్దం రాకుండా కాస్త ధైర్యం కూడు కున్న తర్వాత బిగ్గరగా, పైకి 'అరుణ్' అంది. ఆ మాట వినబడంతోటే సిగ్గు ముంచెత్తుకు వచ్చింది. తల కిందకు దించుకుని తనను తాను సంబాళించుకుంది. ఆపైన ఎవరయినా తనను గమనిస్తున్నారేమోనని అటు యిటు కంగారుగా చూచింది

అరుణ్ సమక్షంలో మటుకు ఆమె నోరు మూతపడిపోతుంది. అతన్ని పేరుతో పిలవాలని ప్రయత్నంచేస్తుంది. అరుణ్ చెక్కిలిని ముద్దు పెట్టుకుంటూ మృదువుగా యీ పేరు ఉచ్చరించాలని కోరిక. కాని పైకి మాత్రం..... తమరు... అనే వస్తుంది ధ్వని. అప్పుడప్పుడు ఆమె ధోరణికి అరుణ్‌కు కోపం గూడ వచ్చేది. బొత్తిగా అనాగరికమైన పిల్ల. నేర్పరితనం లేదు అలవాటు పడిన పద్ధతుల నుంచి బయటికి రావటానికి చాలా సమయం పడుతుంది. అతి స్వల్ప విషయం అయిన 'పేరు పెట్టి పిలవడంలో' కూడా యింత ఆలస్యమా! అది తనకు ఎంతో ముఖ్యమైన - అత్యవసరం అయిన - మార్పుగా అగుపిస్తోంది. ఉహూ. ఈ అమ్మాయి బొత్తిగా నాజూకుతనం లేనిది, నాకు పనికిరాదు అనుకున్నాడు. కాని ఆమె ముఖం వంక చూచినప్పుడు మాత్రం యీ కోపం అంతా కరిగిపోయి అనురాగం పెల్లుబికి వస్తుంది.

'సరే - నా చెవుల్లో చెప్పు, పోనీ!'

'ఉహూ -'

-ఒకనాడు మధ్యాహ్నం ఎంతో ఉత్సాహంతో అరుణ్ తల్లితో అన్నాడు- 'అమ్మా, నేను చాందినీని పెళ్ళి చేసుకుంటాను'.

మధుమరణం తరువాత రెండు వారాలే గడిచాయి అప్పటికి. ప్రభారాణి యింకా విచారంలోనే కూరుకుపోయివుంది. ఆమె యేదో కొత్త ప్రపంచంలో వున్నట్లు ప్రవర్తిస్తూంది. ఇన్నాళ్ళు అతి ముఖ్యం అనుకుని చేస్తూ వచ్చిన

పనులపట్ల యిప్పుడు అతి ఉదాసీనంగా వుంటూంది. ఉదాహరణకు - భర్త సౌకర్యము చూడడం ఆయనకు యిచ్చే పాలలో తగినంత మీగడ వుంటుందా లేదా. రాత్రి పూట నిద్రపోయేటప్పుడు ఆయన తలకింద రెండు దిండ్లు చక్కగా అమరినాయా లేదా .... యిలాంటివి యిప్పుడు ఆమెను అంతగా ఆకట్టుకోవడం లేదు.ఛాందిని యీ పనులన్నీ చేస్తూ వుండడం ఆమె గమనిస్తూనే వుంది. రోజులు గడిచిపోతున్నాయి. మధు లేకుండా జీవితం నడిచిపోతోంది. తను లేక పోయినా అలాగే నిశ్చింతగా రోజులు దొర్లిపోతాయి. తన శరీర అవసరాలు కూడా ఆమె అతి యాంత్రికంగా నిర్వహించుకుంటూంది. అన్నం తినడం, నీళ్ళు కోసం కోళాయి దగ్గరకు వెళ్ళడం, బట్టలు ఉతుక్కోవడం... . తతిమ్మా సమయంలో ఆకాశం వంక తేరిపార చూడడం, యితరుల వంక గమనిక లేకుండా చూడడం... వాళ్ళలో యెక్కడయినా మధు కనిపిస్తుందేమోనని ఆశ! పైకి వ్యక్తం కాని అడియాస!

అరుణ్ చెప్పినది అర్థం చేసుకోవటానికి ఆమెకు కొంత సమయం పట్టింది.

అనాసక్తంగానే 'యేమిటీ అంటున్నావు?' అంది.

'చాందినిని పెళ్ళి చేసుకుంటానంటున్నాను '

'చాందిని ఎవరు?'

'మన చాందినియే, యింకెవరు?'

'నీకేం పిచ్చెక్కిందా?' - యేమాత్రం కోపం, అసహ్యం లేకుండానే యీ మాట అంది కొన్ని మాటలు ఆమె చేతనంలో చేరాయి. ఒక ప్రతి క్రియ తీసుకువచ్చాయి. మనస్సు పని చేయడం అంటూ జరగడం లేదు.

'పిచ్చికాదు. నాకు ఛాందిని అంటే యిష్టం అందుకని ఆమెను పెళ్లి చేసుకుందాం అనుకుంటున్నాను.'

అప్పుడు డేరాలో వాళ్ళు యిద్దరే వున్నారు లాలా కాన్షీరామ్ బయట నిలబడివుండి సూరజ్ ప్రకాశ్‌తో యేమో మాట్లాడుతున్నాడు వీళ్ళ సంభాషణ ఆయనకు వినబడదు.

ఈ మారు ప్రభారాణి తలపైకెత్తి చూచింది. ఎదురుగా నూతన యవ్వనంతో తొణికిసలాడుతున్న కొడుకు - తనతో వివాహ ప్రస్తావన తెస్తూ నిలబడి వున్నాడు. లోగడలాగనే కాస్త బెదురుగా భయంగానే వుంది అతడి వాలకం. తల్లి ముఖంలోకి సూటిగా చూడడంలేదు అరుణ్. ఆమె యేం అంటుందా అని అతనికి ఆతురతగా భయంగా వున్న మాట నిజమే. ఆమె అతన్ని నవ్వుతో పక్కకు నెట్టాలనుకుంటోంది. చాందిని? తండ్రిగారు వింటే కుర్రవాడిని తెగ బాదిపారేస్తాడు ఆమెకు వెనుకటి విషయాలు స్ఫురణకు వచ్చాయి. మధు స్నేహితురాళ్ళు యింటికివచ్చినప్పుడు అరుణ్ ఆసక్తిగా చూడడం, నూర్ అంటే ఎక్కువ యిష్టం ప్రకటించడం.. యిలా... నూర్ అయితే తమ యింట్లో మనిషే. అప్పుడు అంత బెంగ అనిపించదు..... అతని గొంతులో యేదో దృఢత్వం, మార్దవం, కృత నిశ్చయం కనిపిస్తున్నాయి. ప్రభారాణికి వీటిని గమనించి కాస్త బెదురు కలిగింది.

'వివాహాన్ని గురించి మాట్లాడుకోవలసిన సమయం కాదు ఇది.'

'ఇప్పుడే చేసుకుంటాననడంలేదు. మనం ఇండియాకు వెళ్లాకనే.'

'ఇంట్లో మరణం జరిగింది. ఇంకా ఆభయంలోనే వున్నాం'

'అవును -' అన్నాడు. అరుణ్‌కు అనిపించింది, తల్లి ఈ ప్రస్తవన తెచ్చి తనను మభ్యపరచాలను కుంటూంది. అశక్తుడిని చేయాలను కుంటూంది. 'ఓ సంవత్సరం పోయాకనే-'

'చాందినితో ఎందుకు?'

'ఎందుకు కాగూడదు?'

'చదువుకున్న భార్య కావాలని లేదా నీకు?'

'నాకు చాందినీ యిష్టం-'

'ఇంకెవరయినా మరింత ఆప్యాయంగా కనిపించవచ్చు రేపు...'

'అది వేరేవిషయం. ఆమెనే వివాహం చేసుకుందామనుకుంటున్నాను. అమ్మా!'

అరుణ్ యింత దృఢంగా మాట్లాడడం ప్రభారాణి యిదివరకు యెరగదు అరుణ్‌కు తానంటే యెంత భయమో ఆమెకు యిప్పుడు అర్థం అవుతోంది ముఖంలోనికి చూడలేక పోవటానికి కారణం - భయం, మర్యాద, మన్నన అతని ప్రకృతి అంతా విశ్వాసంతో తొణికిసలాడుతోంది

'మీ నాన్నగారితో మాట్లాడాలి...'

'నాన్నగారు వప్పుకోకపోయినా, ఈ పెళ్ళి నేను చేసుకుంటాను'.

'ఈ యింట్లో కాదు.'

'ఎందుకు కాదు?'

'వారి యిష్టాన్ని మన్నించాలి మనం..'

'మన యిష్టాన్ని గూడా ఆయన మన్నించాలి కదా. చాందినిని వివాహం చేసుకోవడంలో నాకు కానిపని యేమి కనిపించడంలేదు ఆమె బీదరాలు కావచ్చును. కాని నాకు మరెవరి ఐశ్వర్యము అవసరంలేదు. కులానికి సంబంధించినంతవరకు నాకు ఆపట్టింపే లేదు. నాచేతనం అంతా కులప్రసక్తికి ఎదురు తిరుగుతుంది.'

ప్రభారాణికి తన కుమారుడు పెద్దవాడయినాడనిపించింది తన కోసం.తాను పోరాటానికయినా సంసిద్ధం అవుతున్నాడు. అతనంటే హృదయం ద్రవిస్తోంది. పైకి మాత్రం 'ఆ అమ్మాయికి చదువను, వ్రాయను అయినారాదు' అంది. తనకూ యీ మాత్రం చదువు రాదని ఆమెఎరుగును. అయితే అరుణ్ విషయంలో వేరుగా జరగాలని ఆమె కోరిక.

'నేనే ఆమెకు నేర్పుకుంటాను. అవన్నీ అముఖ్యమైన సంగతులు ముఖ్యం మేమిటంటే .... మేమిద్దరం పరస్పరం ప్రేమించుకోవాలి!'

ప్రభారాణి ముఖంలో చిరునవ్వు వెల్లి విరిసింది. అరుణ్ ప్రేమను గురించి మాట్లాడుతున్నాడు! అతని ముఖం సిగ్గుతో కందగడ్డలా తయారవుతోంది ఆడపిల్లలా సిగ్గుపడుతున్నాడు ఆమెకు ఆ క్షణంలో మధు స్మృతిలో మెదిలింది. ప్రేమకూడ అంత ముఖ్యమైన విషయం కాదనిపించింది ఆమెకు అరుణ్ కనీసం బ్రతికి వున్నాడు!

అతని చేతిని తన చేతుల్లోనికి తీసుకుని ' మీ నాన్నగారిని అంగీకరింపచేయాలి!' అంది అనునయంగా.

'మనం ఇండియాకు వెళ్ళిన తరువాత ఆపనిచేస్తాను. కాని.... నువ్వు మాత్రం నన్ను ఆశీర్వదించాలి. నన్ను కాదనగూడదు' అన్నాడు.

'నేనేమీ అనడం లేదు.'

అరుణ్ ఆమె నవ్వుతూ వుండడం గమనించాడు. ఆమె కళ్ళలో కాంతులు తన ఆలోచనలకు విరుద్ధంగా లేవు. 'ఆమెకు దగ్గరగా జరుగుతూ 'అమ్మా- నువ్వెంతో మంచి దానివి. నువ్వంటే నాకెంతో యిష్టం. నా మాట కాదనవు నువ్వు... నాకు తెలుసు. నేనంటే నీకు యిష్టం..' అన్నాడు.

'జాగ్రత్త జాగ్రత్త ..' అంది ప్రభారాణి, అతన్నించి దూరంగా జరుగుతూ......... 'నేనింకా యేమీ చెప్పడంలేదు.'

'నువ్వు అంగీకరిస్తావని నాకు తెలుసమ్మా-' అన్నాడు అరుణ్ ఆనందంతో గంతులు వేస్తూ.

ప్రభారాణి యింకా యీ ఉద్రేకంనుంచి తేరుకోకముందే అరుణ్ డేరాలోంచి బయటకు నడిచాడు.

కొద్ది సమయంలోనే మళ్ళీ వచ్చాడు. ఈ మారు చాందినీని తనతో లాక్కువచ్చాడు. ఆమె అప్పుడు శిబిర అస్పత్రి దగ్గర కనిపించింది.

లాలా కాన్షీరామ్ యేదో అసామాన్యమైన విషయం జరుగుతోందని గమనించాడు. కాని సూరజ్ ప్రకాశ్ ఆయనతో నిరంజన సింగ్‌ను గురించి ప్రస్తావిస్తున్న విషయాలు యెంతో ఆసక్తి కరంగా వుండి, వాటిని వినడంలోనే మునిగిపోయాడు. ఇదేమిటనే విచారం ఆయన మనస్సుకు ఆదుర్దాగా అనిపించలేదు.

నాటకీయంగా 'అమ్మకు పాదాభివందనం చేయి...' అన్నాడు అరుణ్. 'ఆమెకు అంతా చెప్పాను-' చాందినితో.

ఇది అనుకోని సంఘటన. తాను అస్పష్టంగా తలూపినంత మాత్రాన అరుణ్ యింత దూరం పోతాడని ప్రభారాణి ఊహించలేదు అదీగాక యిది

ఎప్పుడో భవిష్యత్తులో జరుగనున్న వ్యవహారం. అంతా అనిశ్చితం. ఎందుకు ఇప్పటినుంచే రగడ చేయడం?

చాందిని తన కాళ్ళ మీద పడబోతూవుండగా ఆమెను పైకి లేవనెత్తి తాను పక్కకు జరిగింది ప్రభారాణి.' అరుణ్ నీకు యేం చెప్పాడోయేమో నాకయితే తెలియదు. నేనయితే ఎలాంటి వాగ్దానాలూ చెయ్యలేదు. బాగావుండండి, యిద్దరూ. సమయమే అన్నిటికీ పరిష్కారాలు చూపుతుంది.'

ఈ మాత్రం మాటనే వాళ్ళు ఆశీర్వచనంగా తీసుకున్నారు. చాందిని మరోసారి వంగి ఆమెకు నమస్కారం చేసింది ఇలాంటి పని చేయిస్తున్నందుకు అరుణ్ మీద చాల చికాకుగా వుంది ప్రభారాణికి. ఆమె పెదవులు బిగించుకు వుండిపోయింది. ఈ మారు మ్రాతం వెనక్కు జరుగలేదు

శిబిరంలో జీవితం - అలా అస్తవ్యస్తంగానే రూపొంది నడుస్తోంది. అనానుకులాలు మేమీ లేకపోయినా దిన దిన గండంగానే ఉండింది. జనం ఆరుగంటల కంతా నిద్ర లేచి పోతారు. సామూహిక పాయిఖానాలలో మలవిసర్జనాది కృత్యాలు చేస్తారు. గవర్నమెంట్ స్టోర్ నుంచి దినసరి సరంజమా- గోధుమ పిండి వగైరా వసూలు చేసుకుంటారు. పదకొండు గంటల ప్రాంతంలో బ్రంచ్ (బ్రేక్‌ఫాస్ట్, లంచ్ కలిపి ఒకే మారు) చేస్తారు. మధ్యాహ్న సమయమంతా శిబిరంలో యితర స్నేహితులను చూస్తూ గడుపుతారు సాయంత్రం యేడు గంటకు రాత్రి భోజనం చేసేస్తారు తరువాత నిద్రలు పోతారు. అరుణ్ కుటుంబం అక్కడ వున్న యీనెలా పదిహేను రోజుల్లో యిక్కడ వివాహాది శుభాకార్యాలు యేమీ జరగలేదు. జనన మరణాలు మాత్రం జరుగుతూనే వున్నాయి నామమాత్రంగా ఒక డిస్పెన్సరీ వుంది రోజూ - రెండుగంటలు పాటు ఒక డాక్టర్ వచ్చి కూర్చుంటాడు. అనారోగ్యాన్ని నిర్లిప్తంగానే తీసుకుంటారు. దొమ్మిలలో దెబ్బలు తిన్నవాళ్ళు తమకు ప్రత్యేక గమనం దొరికేట్లు చూచుకుంటున్నారు. తతిమ్మా వాళ్ళు అనారోగ్యాన్ని గురించి మాట్లాడడమే క్షుల్లకమైనదిగా తలపోస్తున్నారు. వయోధికులు ఎవరయినా జబ్బు చేసి చనిపోతే అదే ఒక మహాప్రసాదంగా భావిస్తునారు. దుఃఖించవలసిన సంగతి కానేకాదు అది. పాత ఎముకలు కొత్త చోట అరమరిక లేకుండా యిమడ లేవు

ఇక్కడే - పరిచితమైన తావులోనే - అవి భూస్థాపితం అయిపోవడం మంచిది. విముక్తి వచ్చినట్లే లెక్క అట్లాంటి వాళ్ళకు.

సర్దార్ జోధ్‌సింగ్ చనిపోయినప్పుడు - కొద్ది రోజులు డయోరియాతో తీసుకుని - అతన్ని, వాగు పక్కన కాళీస్థలంలోనె ఖననం చేశారు. బూడిద గూడా అక్కడ వాగులో కలిపేశారు. దూరంలో వున్న గంగానది వరకు తీసుకువెళ్లాలని ఎవరూ అనుకోనుగూడా లేదు. ఆ వయసు వాళ్లలో, దేశ విభజన గురించిన ప్రతిస్పందన, అతని వద్ద నుంచి బహు విచిత్రంగా వచ్చింది. అతను మూగవాడయి పోయాడు! ఈ కొద్ది నెలల పాటు కొడుకు తేజసింగ్‌తో కాని, మనమరాలు ఈషర్ కౌర్‌తో గాని బహు తక్కువగానే మాట్లాడాడు అతడు చనిపోయిన రోజున ప్రభారాణి చాల చింతాక్రాంతురాలయి కూర్చుండి పోయింది. అతడు తన దుకాణంలో జరిగే సంగతులన్నీ ఆమెకు కథలుగా చెబుతూ వుండేవాడు పూర్వం. తన దుకాణానికి వచ్చే స్త్రీలను గురించి వర్ణించి మరీ చెబుతూ వుండేవాడు. ఆమె ముఖం అలావుంటుంది, ఈమె చేతులు యిలా దూలాల్లా వుంటాయి; మరో ఆమె ముక్కుతో మాట్లాడుతుంది.. అసలు వాళ్ళు సరుకులు కొనటానికి వస్తారనా దుకాణానికి - మీ ఉద్దేశ్యం? ఉహూ తమ సౌందర్య ప్రదర్శన కోసం వస్తారు. అంతే వాళ్ళు తనకు కనుసైగలు చేశారని, కవ్వించారని కూడా అప్పుడప్పుడు చెబుతూ వుండేవాడు.

అతని పలుచటి శరీరం పాడె మిద కాలిపోతూ వుండగా అగ్ని జ్వాలలు వాళ్ళ ముఖాల మీద నీడలు సారించాయి శిబిరంలో యింకా మిగిలి వున్న వాళ్లందరూ అక్కడకు వచ్చారు. లాలా బిమారీ లాల్, అతని కొడుకు పూల్ చంద్; వజీరాబాద్ వెడుతున్న రైలు లో కాందిశీకులుగానే ఇండియాకు వెళ్ళిపోయారు. అలాగే రివిన్యూ ఆఫీసర్ మగత్ రాం- అతని భార్య... వాళ్లను గురించి తరువాత వర్తమాన మేమి తెలిసిరాలేదు. సురక్షితంగా ఇండియకు చేరుకున్నారో లేక మార్గమధ్యంలో మరో శిబిరంలోనే మ్రగ్గిపోతున్నారో తెలియదు. అమృత్ సర్‌కు వెళ్ళే రైలు సిద్ధంగా లేకపోతే కాందిశీకులందరనీ వజీరాబాద్ లోనే మరో శిబరంలో అందాక నిలిపి వేస్తున్నారు; చాల సందర్భాలలో లాహోర్లో ఎక్కువకాలం నిలచి వుండాల్సి వస్తొంది అమృత్‌సర్ రైలు కోసం. మార్గమధ్యంలో

రైలుబండిని ఎవరయినా అటకాయిస్తే - మిగిలిన కాందిశీకులను దగ్గరి శిబిరానికి మారుస్తున్నారు.

లాలా కాన్షీరామ్ ఈశ్వర్‌కౌర్ పరిస్థితిని దృష్టిలో వుంచుకుని ఇండియాకు వెళ్ళి పోయే రైలులో పడమని ప్రోత్సహించాడు వాళ్ళూ సంసిద్ధం అయ్యారు కాకపోతే తీరా రైలు బయలు దేరే రోజున ఈషర్ కౌర్‌కు సుస్తీ చేసింది అందుచేత ప్రయాణం వాయిదా వేసుకోవలసివచ్చింది. ఇప్పుడు వాళ్ళు పాద ప్రయాణికుల గుంపులలో చేరాలనుకుంటున్నారు.రైళ్ళు మారవలసిన సందర్భం వుండేట్లయితే సిక్కుల మీద అత్యాచారాలు ఎక్కువగా జరుగుతున్నట్లు వార్తలు వస్తున్నాయి. కాలి నడకన వెళ్లడం మరీకష్టం. అయినా తోడుగా చాలమంది వుంటారు గనుక యిదే క్షేమకరం!రైలులో అయితే ప్రయాణికులను కంపార్ట్‌మెంట్‌లో విడివిడిగా విభజించి వుంచుతారు. దుర్ఘటన జరిగినప్పుడు స్వయం రక్షణకు గాని యితరుల సహాయం పొందటానికి గాని తగినంత సమయ విరామం వుండదు అదీగాక లాలాకాన్షీరామ్ అతని కుటుంబంలో ఎన్నో సంవత్సరాలు కలిసి గడిపారు గనుక యిప్పుడు గూడ ఆ అండతోనే వుంటే మనసుకు ఎక్కువ సుఖం, తెరిపి. ఈషర్‌కు యిదే అభిమతం.

అయితే సిక్కు కుటుంబాలకు రానున్న దురవస్థ సర్దార్ జోథ్‌సింగ్ అగ్నిజ్వాలలో వ్యక్తం కాలేదు. ఎన్నో వారాలుగా సిక్కులకు శిబిరంలో కొత్త రకం అయిన అవస్థ వచ్చి పడింది. ముస్లింల చేతుల్లో చావు దెబ్బలు తినకుండా వుండాలంటే వాళ్ళకు ఒక్కటే మార్గం - జుట్టును క్షవరం చేయించుకోవాలి. సిక్కుగా అసలు ఆనవాలు తెలియకుండా మారిపోవాలి. సిక్కుమత వ్యవహారం యిందుకు అనుమతించదు. తల, గడ్డం వెంట్రుక కత్తికి తగలగూడదని ఆచారం. సాహసానికి అదో గుర్తు. యుద్ధ సిపాయిగా యోధుడుగా అదో చిహ్నం. ఈ గుర్తును కాపాడుకోవడం అంటే యిప్పుడు ముస్లిములకు 'నన్ను చంపండి - ' అని ఆహ్వాన పత్రం పంపినట్లే !

జోథ్‌సింగ్ కుటుంబం రైలు ప్రయాణానికి సిద్ధం అవుతూ వున్నప్పుడు యీ ప్రసక్తి బయటికి వచ్చింది. అప్పటికి జోథ్‌సింగ్ బతికేవున్నాడు. "నేను

ముసలివాడిని. నేను చంపివేయబడినా యేం యిబ్బంది లేదు. మీ రిద్దరు సురక్షితంగా వుండడం అవసరం, అందుచేత మీ జుట్టు కత్తిరించుకొండి" - అన్నాడు తేజసింగ్, నిరంజన్ సింగ్‌లతో

నెలలుగా నిరంజన్ సింగ్ తమకు జరుగుతున్న అవమానాలకు ఉడికి పోతున్నాడు. అతని భార్య కనే రోజులు చక్కగా ప్రసవం అవాలి, భార్య - పిల్లవాడు కులాసాగా వుండాలి. భారత దేశం చేరుకోవాలి. అంతేకాదు - అందరూ గౌరవ ప్రదంగా మనగలగాలి మనిషి మనుగడసాగించడం కోసం యెన్నెన్నో రాజీలు, సర్దుబాట్లు చేసుకోవలసి వస్తుంది! ఈ రోజున సిక్కుల పితామహుని వంటివాడు - సిక్కుధర్మాన్ని పాటించకండి, అతిక్రమించండి, ప్రాణాలు నిలబెట్టుకోండి - అని చెబుతున్నాడు. సర్దార్ జోథ్‌సింగ్‌ను నిందించి యేం లాభం! అతను వృద్ధుడు, భయస్థుడు. ఆ క్షణంలో ధర్మాన్ని గురించి అతనికి ఆలోచన లేదు. ప్రాణ రక్షణ, పిల్లల క్షేమమే ప్రధానం. ప్రాణం అంత విలువయినది కదా!!

'నేను జుత్తు కత్తిరించుకోను-' అన్నాడతను.

సర్దార్ తేజసింగ్ 'రక్షణ కావాలంటే. అలాగే చేయాలి' అన్నాడు.

'నీవు కత్తిరించుకో కావాలంటే. నేను మాత్రం ఒప్పను.'

'నన్ను గురించి ఆలోచించండి -' అంది ఈషర్ కౌర్

'మన ధర్మం యేం చెబుతుందో తెలుసా?

-అవసరం అయితే ప్రాణాలన్నా యివ్వండి.

అంతేకాని మత ధర్మాన్ని విడనాడకండి.'

'మత ధర్మం యేమి విడిచినట్లు అవదు-' అన్నాడు వృద్ధుడు. నిరంజన్ సింగ్ ఎంత ఉడికి పోతున్నాడో అతను యెరుగును. అతడు యువకుడు, ధృఢకాయుడు. ప్రతిరోజు వంటి నిండా నూనె పట్టించి ఎక్సర్‌సైజ్‌లు చేసి మరీ స్నానానికి వెడతాడు. ఎవరెంత చెప్పినా జుట్టు ముట్టుకోవటానికి అతనికి సుతరాము యిష్టంలేదు. 'ఇండియా చేరుకోగానే మళ్ళీ జుట్టు పెంచుకోవచ్చు.

అమృత్‌సర్ సువర్ణ దేవాలయంలో తపస్సు చేసి ప్రాయశ్చిత్తం చేసుకోవచ్చు.'

నిరంజన్ సింగ్ నిదానంగా ఆలోచించాడు. అతని ముఖం - పొందుతున్న పరాభావాలతో మాడి మసి బొగ్గయి వుంది. అతను చేతి కండరాలు, రొమ్ములు, బిగబట్టి ఉబికించాడు. మీసాలు మెలిబెట్టుకున్నాడు. 'ఉహు ఆ పని నా వల్లకాదు. గురుమహారాజ్‌కు మాట యిచ్చాను. ఇప్పుడు తప్పుగా ప్రవర్తించలేను-' అన్నాడు.

'ఈషర్, నువ్వెందుకు నాగురించి బెంగపడతావు? గురుమహారాజ్ నీ కోసం నన్ను రక్షిస్తాడు - సరేనా?'

ఈషర్ కౌర్ విలపించసాగింది. రక రకాల భయాలు, దోపిడి వార్తలు ఆమెను అతలాకుతలం చేస్తున్నాయి. ఇప్పుడు లోపల బిడ్డగూడ తన్నడం తెలిసివస్తోంది. గందరగోళంగా తయారయింది ఆమె పరిస్థితి. కడుపులో యేం జరుగుతోంది? తాను నాశనం అయిపోతుందా? బతికి బట్టకడుతుందా? ఇదే మొదటి కాన్పు. కడుపులో పిల్ల తన్నుతూ వుంటే - యీ సంఘటన శుభం తీసుకువస్తుందో అశుభం మూట గట్టుకు వస్తుందో తెలిసిరావడంలేదు అన్నిటినీ మించి భర్త తన ఆకారాన్ని మార్చుకోనని మొండి తనం చేస్తూ మరింత భయవహ స్థితి సృష్టిస్తున్నాడు. ఏ క్షణంలో నయినా తనను ఎవరో చంపి వేస్తారని ఒక భయం పట్టుకుంది ఆమెకు. తను చనిపోతుంది. సరే, కడుపులో బిడ్డ యేమవుతుంది? బహుశా అది గూడ చనిపోతుందేమో? ఎలాగయినా బిడ్డ అయినా బ్రతికితే బాగుండను! ఎలా సాధ్యం యిది? భర్త ఒక పక్క జుట్టు గురించి పట్టింపులు పెట్టుక్కూర్చుంటే యిక శ్రేయో మార్గం ఎలా లభిస్తుంది ? అతను మిగలడు, యితరులను మిగల్చడు. పుట్ట బోయే శిశువుతో సహా అందరికీ వినాశం తీసుకువస్తాడు.

ముఖాన్ని దుపట్టాతో మూసుకుంది. ఏడుపు ఆపుకుందుకు ప్రయత్నిస్తోంది కాని ఎక్కిళ్ళు వేగంగా బయటికి వస్తున్నాయి. ఉద్వేగం ఆగడం లేదు. జోధ్‌సింగ్, తేజ సింగ్ ఈషర్ ఏడుపుకు కారణం తనే నంటున్నారని నిరంజన్ ఉక్రోషం. అతను వెంటనే జోధ్‌సింగ్ కాళ్లమీద పడిపోయి, 'తాతగారు! మీప్రాణానికి నా ప్రాణం అడ్డం వేస్తాను నన్నుమాత్రం జుట్టు కత్తిరించుకోమని అనకండి-' అన్నాడు.

ఇంతకు వాళ్లు అనుకున్న ప్రకారం ఆ రైలులో వెళ్లలేకపోయారు సర్దార్ జోధ్‌సింగ్ చనిపోయాడు. అంతటితో ఆ విషయం మరుగున పడిపోయింది శిబిరంలో సిక్కుల మీద అత్యాచారాల గురించి కొత్త కబుర్లు తెలిసి వచ్చినప్పుడల్లా యీ విషయం పైకి వస్తోంది నిరంజన్ మాత్రం లొంగిరావడం లేదు. అందరి జీవితాలు గురుమహారాజ్ చేతుల్లో వున్నాయి. జుత్తుకత్తిరించుకుంటే ఆయన నుంచి దూరం తొలగి నట్లవుతుంది. గురుమహారాజ్ ఎలాంటి ఆపద జరగకుండా కాపాడగలడు.

'గురుమహారాజ్ తన జన్మస్థలాన్నే రక్షించుకోలేక పోయినాడు. ఇక నిన్నేం రక్షిస్తాడు?' అన్నాడు లాలా కాన్షీరామ్.

అతను ప్రస్తావిస్తున్నది గురనానక్ జన్మస్థలం నాన్కనా సాహెబ్ గురించి. అది సిక్కులందరికీ పవిత్ర స్థలం. అది పశ్చిమపంజాబ్‌లో వుంది. దేశ విభజనలో పాకిస్తాన్‌లో భాగం అయిపోయింది అక్కడున్న సిక్కు పిల్లలందరినీ చంపవేశారనీ దేవాలయం మూత పడిపోయిందిని వార్తలు వచ్చాయి

లాలా కాన్షీరామ్ యీ మాటలు నిరంజన్ సింగ్‌తో అన్నప్పుడు చాల నిర్లప్తంగా తాత్త్విక ధోరణిలో ఉన్నాడు అతను యిటీవల యిటువంటి స్థితిలోకి త్వరగా జారుకుంటున్నాడు అతను అంత వేదాంతి యేం కాకపోయినా దైనందిన ప్రార్థనలు, పూజలు శ్రద్ధగా చేస్తాడు. ఆర్యసమాజం వాళ్ళ శిక్షణలో అతనికి విగ్రహారాధనకు వ్యతి రేకత యేర్పడింది ప్రభారాణికి మటుకు హిందు దేవుళ్ళు దేవతలు- ముఖ్యంగా శ్రీ కృష్ణుడంటే - ఎక్కువ యిష్టం. అతనూ కొంత కొంత రాజీమార్గం యేర్పరచుకున్నాడు, దేవుళ్ళతో, కాని యేం లాభం? భగవంతుడితో వ్యక్తిగతంగా - సాక్షాత్తుగా - యేదేనా సంబంధం యేర్పరచుకోవాలి. ఎటువంటి సంబంధం అయినా సరే. తరువాత యింక లోతయిన విషయాలను గురించి బెంగ పెంచుకోనక్కర్లేదు. తన సమయం, శక్తి అంతా వ్యాపార విషయాలను యిరుగు పొరుగుతో సఖ్యతగా వుండటానికి వెచ్చిస్తున్నాడు.

అంతా అలావుండగా - ఒక్కోరోజు అతనిని యేదో ప్రశాంతత ఆవరించి వుంటుంది సరుకులను దింపుకుంటూ గిడ్డంగిలో సర్దిస్తున్నప్పుడో, దుకాణం

వెనక సన్నని సందులో అల్పాచమానం చేస్తున్నప్పుడో, తనకు వ్యాపారరీత్యా ప్రత్యర్థి అయిన సేన్ దుల్లు రామ్‌ను దెబ్బతీయ్యటానికి యేదో కొత్త పన్నాగం తయారు చేస్తున్నప్పుడో - యీ ప్రశాంతత అనుకోకుండా అతన్ని ఆవరిస్తుంది, అతనిపైకి అవతరిస్తుంది. పోటా పోటీలు, వృత్తికి - సంబంధించిన అల్పమైన అబద్ధాలు - అన్నీ మరుగున పడిపోతాయి. మనస్సు ప్రశాంతతలో ఏదో అలౌకికమైన దృశ్యం చూస్తున్నట్లు తలుపులన్నీ తెరుచుకు వుంటాయి. దారులు, ద్వారాలు రంగు రంగుల అలంకారాలతో ముస్తాబు అయి వుంటాయి. జీవ ప్రసారం బంగారు రంగులో సుమనోహరంగా కనిపిస్తుంది.

లాలా కాన్షీరామ్ ఆ మానసిక స్థితిని రెండు మూడు రోజుల వరకు నిలపి వుంచుకునేవాడు. ఒక్కోమారు వారం రోజుల పాటు సాధ్యం అయ్యేది. ఆ రోజుల్లో అతను చాలాహాయిగా, ఉన్నతంగా ఫీలయేవాడు. అతని ముఖంలో ఎక్కువ ముడతలు లేవు. బుగ్గలు మాత్రం సాగి వేలాడుతూ వుంటాయి. ఈ మానసిక స్థితి వచ్చినప్పుడు మాత్రం బుగ్గలు పైకి వెళ్ళి పోయి బిగువుగా తయారవుతాయి. ముఖంలో ప్రసన్నత చోటు చేసుకుంటుంది. రోజా ధోభి శుభ్రం చేసిన దుస్తులే ధరించాలని నియమం యేర్పరచుకున్నాడు. మీసాలు చిన్నవిగా కత్తిరించుకున్నాడు. ముక్కులో వెంట్రుకలు కూడ శుభ్రంగా తీసేసుకునేవాడు. తెల్ల వెంట్రుకలు బయట పడకుండా జాగ్రత్త పడేవాడు. స్నానం చేసిన తర్వాత, శుచి అయిన దుస్తుల ధరిస్తూ ఎంతో ఆనందంగా ఖుషీగా వుండేవాడు. అద్దంలో పదే పదే చూచుకుని షర్ట్, పైజామా సవరించుకుంటాడు. టోపీ తలకు సరిగ్గా అతక్కుపోయి వుండేట్లు అమర్చుకుంటాడు. షూస్ ప్రతిరోజు పనివాడిచేత పాలిష్ చేయించుకుంటాడు.

ఈ రకంగా తయారయి, నూతన శక్తిపాతం - అశీర్వాదం పొందిన ఆ రోజులలో యింటినుంచి దుకాణానికి బయలుదేరేవాడు. దాదాపు సంధిలో వున్నస్థితిలో. కుంగిపోయినట్లు కనిపించే వాడుగాని - మరింత పటిష్టంగా నిగ్గుతేలినట్లుగా అనిపించేవాడు. లౌకికమైన శరీరాన్ని వదిలి వేసినట్లు, ఆముష్మిక ఆనందంతో తిరుగాడుతున్నట్లు ఉండేది. కళ్ళ జోడు లోంచి యితరులను చూస్తున్నప్పుడు వాళ్ళు తననుంచి దూరంకాని దూరంలో వున్నట్లు అనిపించేది.

ఈ స్థితి ఎక్కువ రోజులు కొనసాగేదికాదు. తిరిగి యధాపూర్వపు స్థాయికి దిగజారేవాడు కాని ఆ స్థితిలో వున్న రోజుల్లో మటుకు యేదో దివ్యత్వం అతన్ని ఆవరించి వుండేది. అవును! దివ్య దర్శనం అయినట్లు - శక్తి పాతం పొందినట్లు! సమస్య అల్లా దానిని మాటలలో పెట్టటం, సరీగా వర్ణించగలగడంలో వుంది. అయినా అటువంటి అలౌకిక స్థితిని మాటాల్లో ముంచెత్తక పోతేనేం?

లాలా కాన్షీరామ్ అటువంటి స్థితిలో వున్నాడు ప్రస్తుతం ఎంతో అత్యానందం, పూనిక. ప్రభారాణికి అతను స్నానం చేయడం...... దుస్తులు వేసుకోవడం . యీ తతంగం అంతా అత్యుక్తిగా తోచింది. ఏమిటి ఈ మనిషి వాలకం ! కుమార్తె చనిపోయిన దుఃఖంలో వుండవలసిన మనిషి యిలా హుషారుగా, తన్మయంలో మునిగిపోయి వుండడం యేమిటి? ఈయన పరిస్థితి ముదిరిపోతోంది. ఈ వెర్రి పరాకాష్టకు వస్తోంది. దీన్ని అదుపు చేసుకోకపోతే మరింత ప్రమాదం.

లాలా కాన్షీరామ్ నిరంజన్ సింగ్ బుజాలమీద చేయివేసి 'రా .. కాస్సేపు కూర్చో, చెబుతాను -' అన్నాడు.

'అలాగే చాచాజీ'

'అయితే నీ జట్టు కత్తిరించుకోనంటావు-' అంటూ కళ్ళద్దాంల్లోంచి అతన్ని పరికించాడు.

'అవును. చాచాజీ-'

లాలాకాన్షీరామ్ కళ్ళద్దాలు తీసేశాడు. వాటిని భద్రంగా మడిచి చేతిలో పట్టుకున్నాడు. ఏదో గొప్ప విషయం ఆలోచిస్తూన్నట్లు ముఖం పెట్టాడు

'ఎందుకని?'

' నా కారణాలు మీకు తెలుసును గదా'

'చెప్పు-'

'మత విశ్వాసం-'

'దేనిలో విశ్వాసం ?'

'మత ధర్మంలో'

'మతం యేం చెబుతోంది?'

'జుట్టు కత్తిరించుకోవద్దంటుంది '

'ఆది గ్రంథంలో యీ విషయం వున్నదా?'

'ఉన్నది'

'జుట్టు కత్తిరించుకోవడం కంటె, ప్రాణాలు పోయినా పర్వాలేదు-అంటావు, అంతేనా?'

'అవును. సరిగ్గా అంతే-'

లాలా కాన్షీరామ్‌కు అతని ఉద్దేశ్యం బాగానచ్చింది. తార్కిక జ్ఞానం కంటె విశ్వాసం తీసుకు వచ్చే పూనిక దృఢమైనది. లాలా కాన్షీరామ్‌కు మతం అన్నా ధర్మం అన్నా మక్కువ. తనకు యితరులకు ఒకటే నియమం. అయితే యిది యితర సందర్భాలను తోసిపుచ్చదు. కుండలిని కాలసర్పం లాగ తన రహస్య జ్ఞానానికి కట్టుబడివుంటాడు.

తిరిగి కళ్ళజోడు తెరిచాడు. అతీంద్రియ జ్ఞానస్పర్శలో అదే అతనికి పనిముట్టు. నింపాదిగా దాన్ని ముక్కు మీదికి ఎక్కించాడు. నిరంజన్ సింగ్ వంక అనునయంగా చూచాడు.

'నాయనా, నిరంజన్ నీ మత విశ్వాసం నాకు బాగా నచ్చింది. అయితే ఒక్క విషయం విను. మత ధర్మాలన్నీ మనిషి తన కోసం తాను యేర్పాటు చేసుకున్నవే-'

'ఏమిటి మీ ఉద్దేశ్యం?'

'స్ఫూర్తి పొందిన మనుషులు మన జీవిత విధానాన్ని స్ఫురింప చేస్తూ తయారుచేసిన నియమాలే ఈ మత ధర్మాలు-'

'మనుషులు కాదు, దేవతలు, దివ్యపురుషులు. భగవంతుని అవతారాలు-'

'అంతా ఒకటే. వాళ్ళూ మనుషులే కాకాపోతే మన కంటే ఎక్కువ - ఉన్నతస్థాయి - స్ఫూర్తి పొందిన వాళ్ళు!

నిరంజన్ సింగ్ జవాబు చెప్పలేదు.

'ఈ మతధర్మాలన్నీ మానవ జీవితం సజావుగా సాగిపోతున్నప్పుడు అనుసరించవలసినది. రాక్షస వాతావరణంలో వీటిని అమలు జరపడం కుదరదు వాటిని కాలానుగణంగా అర్థం చేసుకోవడం, అవలంబన చేయడం అవసరం-'

నిరంజన్ సింగ్ మౌనంగానే వుండిపోయాడు.

లాలా కాన్షీ రామ్ అతని ముఖంలోనికి గుచ్చి చూశాడు. ఆ ముఖంలో యెంతో ఆదుర్దా - గందరగోళం!

'ఇవి మామూల రోజులు కావు. ఇలాంటి దారుణమైన స్థితిగతులు నేనెప్పుడు వినివుండలేదు. నీవు యిప్పటి పరిస్థితులలో నీ జుట్టును కత్తిరించుకోవచ్చు. మత ధర్మాన్ని వ్యతిరేకించినట్లు అవదు ఆ చర్యవల్ల'

'మతాన్ని మన యిష్టం వచ్చినట్లు మలుచుకున్నట్లు అవుతుంది.'

-అదే లాలా కాన్షీరామ్ చెప్పాలనుకున్నది. కాని నోరునొక్కుకున్నాడు. మరేదో కొత్త సిద్ధాంతాన్ని ప్రతిపాదించేట్లు అనిపించింది. కాని అతనికి నిజానికి యేమీ తెలియదు. అతని అవగాహన కూడా అంతంత మాత్రమే. అంతకు మించి అతను యేమీ యెరగడు.

'ఉహు... వీలునుబట్టి యిష్టం వచ్చినట్లు మలుచుకోవడం కాదు-' అన్నాడు చాలసేపు అయినాక. 'మతానికి మరో అవకాశం యిచ్చి నీ ద్వారా దాన్ని ప్రవర్తింపచేయడమే! నీవు అంతరించి పోతే, నీతో పాటు మత ధర్మమూ అంతరిస్తుంది గదా!-'

లాలా కాన్షీరామ్ లేచి నిలుచున్నాడు. ఆయన ముఖం వినయంతో నిండిపోయి అదో రకంగా వెలుగుతోంది.

'చనిపోయిన జోధ్‌సింగ్ చెప్పినట్లుగా వినడమే నీకు యుక్తం - అని నేను అనుకుంటున్నాను,' అని చెప్పి అక్కడ నుంచి ముందుకు వెళ్ళిపోయాడు లాలా.

సూరజ్ ప్రకాశ్ యీ విషయాన్ని పరికించే పద్ధతి పూర్తిగా వేరయిన ధోరణిలో వుంటుంది. నిరంజన్ సింగ్ సృష్టిస్తున్న గందరగోళాన్ని అతను చూస్తూనే వున్నాడు. అతనంటే చులకన భావం గూడా ఏర్పడింది.

'అతను సిక్కు, యింతకు-' అన్నాడు భార్యసునందతో అతని వేళాకోళానికి ఆమెకు నవ్వురాలేదు.

'అతను వింటు వుండగా అటువంటి మాటలు అనకు సుమా!' అంది బీబీ అమరావతి.

'మరేం భయపడకు, ఇంకేవో మాటలు అంటాలే -' అన్నాడు సూరజ్, పొగవదలి - సిగరెట్ బూడిద దులుపుతూ. అతను నవ్వుతున్నాడు.

'అసలు మీరు యిందులో జోక్యం కలిగించుకోవలసిన అవసరం యేముంది?' అంది సునంద. ఆమె ముఖం యేదో మత్తులో వున్నట్లుంది. నిజానికి ఆమె మనస్సు వేరే విషయం ఆలోచిస్తూవుంది. దేశ విభజన అయినదగ్గర్నుంచీ ఆమె తల్లిదండ్రుల సమాచారం యేమీ తెలిసిరాలేదు. వాళ్ళు ఆమెను కాశ్మీర్ రమ్మని అంతకు ముందే కబురుచేశారు. ఒకటి రెండు మార్లు యీ విషయాన్ని బీబీ అమరావతికి గుర్తు చేసింది ఆమె. కాని సరయిన అనుస్పందన రాకపోవడంతో సునంద యీ విషయాన్ని నొక్కి రొక్కించలేదు. ఇప్పటి పరిస్థితులను బట్టి తల్లిదండ్రులను చూడగలగడం, కలుసుకోవడం చాల కాలానికి గాని సాధ్యమవదనిపిస్తోంది. ఈ విషయం తలుచుకున్నప్పుడల్లా ఆమె మనస్సు కుంగిపోతుంది. కళ్ళలో నీళ్ళు కదలాడుతాయి. బొమ్మలాగ ఒకచోట కూలబడిపోతుంది- కదలడానికి ఏమాత్రం శక్తిలేని దానిలాగ. చేతనంలో కూరుకుపోయినట్లు స్తబ్ధుగా తయారవుతుంది శరీరం రంగు పాలిపోతుంది. బుగ్గలమీద రెండు ఎఱ్ఱ రంగు జాడలు మాసిపోయినట్లవుతాయి.

'అతని ఆలోచన ధోరణి సజావుగానే వున్నట్లు నాకు అనిపిస్తుంది. అతని మనస్సు చెప్పినట్లుగా అతన్ని నడవనీ, మనం జోక్యం చేసుకోవడం ఎందుకు?'

'అతను సిక్కు, ఇంక మనస్సు ఎక్కడుంటుంది?'

'మనస్సు లేకపోవటానికి సిక్కే అవనక్కర్లేదు. అలాంటి వాళ్లను మరో మనిషిని ఎరుగుదును నేను '

ఆమె యీ మాటలు అంటున్నప్పుడు ఆమె ముఖంలో వెటకారపు నవ్వు ద్యోతకం అవుతోంది భర్త ముఖంలోనికి సార్థకంగా చూచింది. అతన్ని ఎగతాళి చేయాలని, ఆటపట్టించాలని వుంది అమెకు. అతనెంత మూర్ఖుడయినా సూరజ్ అంటే ఆమెకు ప్రేమ, అనురాగం. కాని బీబీ అమరావతి వాళ్ళ ముందు కూచుని వాళ్ళనే చూస్తూ వుండింది.

సునంద ఎదరుగా వుంటేచాలు, సూరజ్ తన్మయుడై పోతాడు. వివాహం అయిన మొదటి సంవత్సరాలలో అతడు ఉన్మత్తునిలా ఆమె చుట్టు తిరుగుతూనే వుండేవాడు. ఆమె కూడ ప్రోత్సహం చూపినప్పుడు సూరజ్ అతి చురుకు అయిపోయేవాడు.

ఆమె డేరా గోడవయిపు వీపు ఆనించి కాళ్ళుముడుచుకుని కూర్చుని వుంది సూరజ్ ఆమె వంకే చూస్తున్నాడు. తనకు మనస్సు లేకపోతే పోయింది, మరేదో వస్తువు మటుకు వుంది. దానితో సమాధానం చెప్పగలడు. ఆమెను తక్షణమే దగ్గరకు తీసుకోవాలని అనిపించింది అతనికి. సరిగ్గా అప్పుడు వాళ్ళ పిల్లలు డేరాలోనికివచ్చారు. దానితో వాతావరణం అంతా మారిపోయింది. సునంద వాళ్ళను దగ్గరకు తీసుకుని మాతృత్వపు విధుల్లో మునిగిపోయింది. 'నీ సంగతి తరువాత చెబుతాను-' అనుకుంటూ నవ్వుతూ సూరజ్ బయటకి వెళ్ళి పోయాడు.

సూరజ్ ఎలాగయితేనేం నిరంజన్ సింగ్‌ను కలుసుకున్నాడు. వాళ్ళిద్దరూ రేషన్ డిపోదగ్గర వారం సామగ్రి వసూలు చేసుకుందుకు వెళ్ళినప్పుడు కలిశారు. సూరజ్ అతన్ని నిలిపి వుంచాడు

'నిరంజన్ ! ఏమిటి నీ గొడవ ?'

నిరంజన్ బుజాలు కుదిపి మిన్నకుండిపోయాడు. సూరజ్ యిప్పుడు తన ఇంటి సొంతదారుకాదు. అందుచేత అతనితో వివరణల అన్నీ యిస్తూ మాట్లాడవలసిన అవసరం లేదు

'చూడు సోదరా! నీకు ముస్లిం యువతితో సంపర్కం పొందాలని లేదా?'

"ఏమిటి?'

'ముస్లిం స్త్రీల సంగతి కూడ చూడగలగడం కోసం కలకాలం బతకాలని లేదా నీకు?'

'నువ్వు మాట్లాడుతున్నది యేమిటి ?'

'నీకు తెలీదుగాని ముస్లిం అమ్మాయిలు ఎంత సరదాగా వుంటారనుకున్నావు?.'

'నీకెలా తెలుసు?'

'వాళ్ల వంక చూస్తే చాలు. వాళ్లు రోజు ఎక్సర్‌సైజ్ చేస్తారు. మాంసం తింటారు. ఆరోగ్యంగా పటిష్టంగా వుంటారు. హిందు అమ్మాయిలయితే కాస్తకే డీలా పడిపోతారు...'

నిరంజన్‌కు నవ్వు వచ్చింది. సూరజ్ చెబుతున్న యే విషయాన్నయినా అభ్యంతరకరంగా తీసుకుందుకు వీల్లేదు. అతని ధైర్యసాహసాలు అటువంటివి. అతనికి కావల్సిందల్లా అంగీకారం, సమర్ధన. ముస్లిం అమ్మాయితో యేకాంతంగా గడిపే సందర్భం తటస్థించినా, సూరజ్ బిత్తరపోయి అక్కడినుంచి దూరంగా పారిపోతాడు తప్ప యింకేం చేయలేడు. అయితే మాట్లాడడం మటుకు ధీమాగా గుండె ధైర్యం వున్నవాడిలా చేస్తాడు. అవతలి వ్యక్తిలో ఉత్సుకత రేపానన్న అతిశయంతో సిగరెట్టు దమ్ము బాగాతీసి నిరంజన్ వంక నవ్వుతూచూచాడు. అతన్ని పూర్తిగా తన అభిప్రాయానికి తీసుకు రాగలిగితే ఎంత బాగుండను! అదే అతనికి తీరని తృప్తి యిస్తుంది.

'చూడు - మనకు అందమయిన భార్యలు ఉన్నారు-' అన్నాడు నిరంజన్-

సూరజ్ తలవిదిలించి కొడుతూ 'దానికీ దీనికీ యేమిటి సంబంధం ?' అన్నాడు.- నిరంజన్ నిజంగా బుద్ధాయే, అనుకున్నాడు.

'దీనికీ నా జుట్టుకు యేమి సంబంధం?'

'భాయి! ముస్లిం అమ్మాయిలు కావాలంటే ఈస్ట్ పంజాబ్‌కే వెళ్లాలి. అక్కడి హిందువులు, సిక్కులు, వాళ్ళను యిప్పటికే పాడుచేయకుండా వుండాలి.నువ్వు ఎప్పటికయినా అక్కడికి సజీవంగా చేరుకుంటేగదా నీకా అవకాశం!'

తన మాటలను మరింత నొక్కుతూ యిలా అన్నాడు - 'నీవు జుట్టు కత్తిరించుకోకపోతే, ముస్లిములు నిన్ను హతమార్చే అవకాశం ఎక్కువ!'

నిరంజన్ అతన్ని పక్కకు నెట్టేస్తూ 'నేను జీవించి వుండటానికే ఎక్కువ అవకాశాలు వున్నాయి-' అన్నాడు.

డేరా బాబానానక్ ప్రయాణానికి తేదీ నిర్ణయం అయింది. జనాన్ని యిందుకు సిద్ధం చేసేందుకు ప్రయత్నాలు జరుగుతున్నాయి. భారతదేశం నుంచి చాల మంచి గూర్ఖా పదదళం వచ్చింది, యీ ప్రయాణంలో తగిన రక్షణలు కల్పించటానికి. దానికి నాయకుడు ఒక యువక గూర్ఖా మేజర్. అతనికి సహాయకులుగా యిద్దరు కెప్టెన్లు, చాలమందిలెఫ్టనెంట్లు ఉన్నారు. ఆలివ్‌గ్రీన్ జీప్స్, మూడు టక్ ట్రక్కులు తీసుకు వచ్చి వాళ్ళు ఒక మధ్యాహ్నం పూట యిక్కడ సాక్షత్కరించారు. అన్ని ట్రక్కులకు పైన బ్రెన్‌గన్ అమర్చారు ఆ సరంజామా అంతా యిక్కడ అమరేసరికి శిబిరంలో కలకలం-హడావడి యేర్పడింది. శిబిరానికి పక్కన ఆవరణలో వాళ్లంత విడిశారు. సాయంకాలాని కల్లా డేరాలు అమర్చుకున్నారు. బ్రెన్‌గన్లు, స్టెన్‌గన్లు.... యీ సరంజామా అంతా చూడడంతో శిబిరంలోని కాందిశీకులకు ఉత్సాహం ఎక్కువకాసాగింది. ఈ సైన్యమే వాళ్లకు విముక్తిదాయకులు. కాందిశీకుల డేరాలనుంచి 'జైహింద్' నినాదాలు అనేక మార్లు వినిపించాయి. ఇది ఇండియాకు నేతాజి సుభాష్ చంద్రబోస్ యిచ్చిన నినాదం.

శిబిరంలోని వారందరూ సరిహద్దు కంటె దగ్గరకు వచ్చి చేరారు మగవాళ్ళు, ఆడవాళ్ళు, పిల్లలు అందరూ బార్బ్‌వైర్ హద్దుకు ఈవల పోగయ్యారు. గూర్ఖా మేజర్, తన సహాయకులతో నిలబడి, వీళ్లందరినీ గమనిస్తూ వున్నాడు.

కెప్టెన్ రహ్మతుల్లా ఖాన్ కూడ అతని సరసనే నిలబడివున్నాడు. అతని భూమి మీద అతను వున్నాడు గనుక యిక్కడ యేం ఉపద్రవం తటస్థిస్తుందోననే భయం అతనికి లేదు. సాధారణంగా శిబిరంలో వున్న జనం స్వేచ్ఛగా అటు యిటు తిరుగాడటానికి వీలుంది. ఈ రోజు బయటి పెద్ద గేటు బిగించి తాళం వేశారు. పాకిస్థాన్ బలాలు కాపలా కాస్తున్నాయి. లోగడ, భారత దళాలు యిలా రక్షణ కోసం వచ్చినప్పుడు చాల తక్కువ సంఖ్యలో మటుకే వున్నాయి. పాకిస్తాన్‌సైనికులు బారాక్స్‌లోనే వాళ్లకు స్తావరం యేర్పరచటానికి వీలయింది. వాళ్ల ఉనికి బహుకొద్ది మందికి మటుకే తెలసి వుండింది. ఈ మారు మాత్రం యీ దళాలు ఎక్కువ సంఖ్యలో వున్నాయి గనుక భారీఎత్తున యేర్పాట్లు చేయవలసి వచ్చింది.

కెప్టెన్ రహ్మతుల్లాకు వాళ్లు వస్తారని ముందుగానే తెలుసు. అందుకు తగిన యేర్పాట్లన్నీ చేశాడు. అయితే అతను కాందిశీకుల శిబిరాలలో యిలా ఉత్సాహం ఉబికి వస్తుందని ఊహించలేక పోయాడు. పాకిస్తాన్ సేనలు గేట్ పక్కనే నిలబడివున్నాయి. అవసరం అయితే యింకా ఎన్నయినా దళాలను పిలిపించగలనని రహ్మతుల్లా ఎరుగను. అందుచేత అతను కాందిశీకుల ఆనందోత్సాహలకు అడ్డుచెప్ప కుండా చూస్తూ వుండిపోయాడు. 'జైహింద్' నాదాలు అతని చెవులకు కఠోరంగా వున్నమాట నిజమే. వాటని ఆపివేయడం ఎలాగో అతనికి తెలియదు. అందువల్ల మిన్నకుండిపోయాడు.

కెప్టెన్ రహ్మతుల్లాఖాన్‌తో పోల్చి చూస్తే, గూర్ఖా ఆఫీసర్లు చాల చిన్నసైజు మనుషులు. అయినా వాళ్ళు భారతకాందిశీకులను చూస్తూ స్థాయిగా స్థిరంగా నిలబడి వున్నారు. రాణాజంగ్ బహదూర్ సింగ్, - గూర్ఖా మేజర్ - నలభయియేళ్ళ దృఢకాయుడు, విశాలమైన భుజస్కంధాలు. జనం వంక చూచి కొద్దిగా కోపం తెచ్చుకున్నాడు. అంతకు ముందు అతనికి కెప్టెన్ రహ్మతుల్లా ఖాన్‌తో అభిప్రాయ భేదం వచ్చింది. శిబిరాలకు పక్కన భారత జాతీయ పతాకం ఎగురవేస్తానంటే కెప్టెన్ అనుమతి నిరాకరించాడు. ఎదురుగా పాకిస్తాన్ జాతీయ పతాకం ఎగురుతూ వుంది. అతను నేపాల్‌కు చెందిన వాడే అయినా యిరవయి సంవత్సరాల నుంచి భారత ప్రభుత్వంకింద సేవచేస్తున్నాడు.

ఈ కాందిశీకుల మత విశ్వాసాలకు సానుభూతి వున్నవాడు. ఇదే అతను చేస్తున్న మొట్ట మొదటి 'ఎస్కార్ట్ డ్యూటీ' రాత్రికి రాత్రి డెహ్రాడూన్ నుంచి యిక్కడకు వచ్చాడు, అమృతసర్ మీదుగా. తమ రక్షణ యావత్తు పాకిస్తాన్ ప్రభుత్వం అనుగ్రహం మీద ఆధారపడివున్నది గనుక కెప్టెన్ రహ్మతుల్లాను అలక్ష్యం చేయగూడదని అతను బాగా ఎరుగను. అయినా కాందిశీకులకు స్ఫూర్తి యివ్వడం కూడా అతని అభిలాష. కంచె పక్కన వాళ్ల దిగాలు పడిపోయిన ముఖాలు చూస్తుంటే అతనికి చాల ఖేదంగా వుంది. వాళ్లను కొంతసేపు అరవనిచ్చాడు. ఆ లోపల తన సహచరులకు యేవేవో కనుసన్నలు చేశాడు. తరువాత రహ్మతుల్లా ఖాన్ వంక నవ్వుతూ చూచి, చేయిఎత్తి కాందిశీకుల వైపు తిరిగి 'జైహింద్' అని అరిచాడు. కంచెవరకు గబ గబ నడుచు కుంటూ వెళ్ళి అక్కడ గుమిగూడి వున్న స్త్రీ పురుషుల నుద్దేశించి 'మీరేం భయపడకండి. మిమ్మల్ని సురక్షితంగా చేరుస్తాము-' అన్నాడు. కెప్టెన్ రహ్మతుల్లా ఖాన్ తాను నిలుచున్న చోటనే కోపంతో ఉగిపోయాడు - కాని యేమీ మాట్లాడలేదు.

ఇండియన్ ఆఫీసర్లను శిబిరంలోనికి వెళ్ళి చూడనివ్వ లేదు. కాని కాందిశీకులను చిన్న చిన్న గుంపులుగా వెళ్ళి చూడవచ్చునని ఆ రోజే అనుమతి యిచ్చారు వాళ్ళకు. ఈ ప్రయాణం లో దాదాపు యిరవయి వేల మంది పాల్గొంటారని ఉజ్జాయింపుగా తేలింది. అందరూ వరుసగా నిలుచుంటే పదిమైళ్ళు దూరం వుంటుందన్న మాట జనవాహిని. అదేమీ అసాధారణమైన విషయం కాదు. ఇరు పక్షాలలోను పదేసి మైళ్ళు పొడుగు జన ప్రవాహం నడిచిపోవడం మామూలే. ఒకటి రావల్పిండి నుంచి బయలుదేరి ఇండియావైపు వెడుతోంది - దాని పొడుగు డెబ్బయి మైళ్ళట ! నిజానికి తూర్పు పడమర పంజాబ్ నడుమ వున్న అయిదు వందల యాభయి మైళ్ళు సరిహద్దు కాందిశీకుల ప్రయాణం కోసమే నిర్ధారితం అయిపోయింది. మైనారిటీలు ఒక పక్కనుంచి మరోపక్కకు - తమ తమ బంధుబలగం వున్న చోటులకు - వెడుతూవున్నారు. కాని యిలా యేర్పాటు చేసి రకణ కల్పించిన సాధారణ గుంపులు, రైళ్ళ ప్రయాణాలు, రెండు చెక్‌పోష్టుల మీదుగా నడిచి వెడతాయి.

పంజాబ్ ఉత్తర ప్రాంతం నుంచి వచ్చే ప్రయాణికులు అమృత్‌సర్ దగ్గర 'వాఘా' చెక్‌పోస్ట్ మీదుగా వెడతారు. దక్షిణ ప్రాంతం నుంచి వస్తున్న వాళ్ళు బహవర్‌పూర్ రాష్ట్రం మీదుగా మక్సెడ్ గంజ్ దారివెంట వెడతారు. ప్రస్తుతం యోచనలోవున్న గుంపు మాత్రం దగ్గర దారిన అమృత్‌సర్ వెళ్లనున్నది. అది వాఘాచెక్‌పోస్ట్‌ను తాకదు. ఈ మార్గంలో మరి రెండు కాందిశీకుల శిబిరాలు వున్నాయి. ఒకటి ప్రసూర్ వద్ద, మరోకటి సరోవర్ వద్ద, రెండు తాలూకా పట్టణాలే. సియల్ కోట జిల్లాకు చేరినవే. ఆ శిబిరాలలోని వారు కూడ వీరిని మార్గ మధ్యంలో కలుసుకుంటారు. ఈ ప్రయాణీకులందరినీ పది పెద్ద గుంపులుగా తీర్మానం చేశారు. ఆర్మీ మనుషులను పూర్తిగా రక్షణ యేర్పాట్లు కోసమే వినియోగించడం కోసం, యీ పెద్ద గుంపులకు (యూనిట్లు) తతిమ్మా సౌకార్యాలను పర్యవేక్షించేందుకు కాందిశీకులలో పెద్ద వారిని, తగిన వారిని నాయకులుగా నియమిస్తున్నారు. ఈ నాయకుని పని యేమిటంటే - తన యూనిట్‌లో వున్నవాళ్ళ నంధరిని కలిసికట్టుగా వుండేట్లు చూడడం, వాళ్ల కేమయినా యిబ్బందులు కలిగితే ఆర్మీ అధికారులకు విన్నవించడం. ప్రతి యూనిట్‌కు దాని రక్షణకు అవసరం అయిన మందుగుండు సామాను, ఆయుధ సామాగ్రి కేటాయిస్తున్నారు. ఆఫీసర్లు యీ వరుసలలో పైనుంచి కిందికి కిందినుంచి పైకి ప్రయాణిస్తూ పర్యవేక్షిస్తూ వుంటారు. భారత ఆర్మీ మనుషులు తుపాకులు ధరించి కాందిశీకులతో పాటు పాదయాత్ర చేస్తారు.

డేరాబాబా నాయక్, భారతదేశంలోని దగ్గర సరిహద్దు నగరం సియల్‌కోటకు నలభయి యేడు మైళ్ళదూరంలో వుంది. రోజుకు అరుమైళ్ళు నడవడం జరగుతుందని అంచానావేశారు. వీలయితే ఎక్కువ మైళ్ళు వెళ్లవచ్చును. కాని లెక్క కోసం అరుమైళ్లు. ఆడవాళ్ళు పిల్లలు వున్నారు గనుక యింతకంటె ఎక్కువ దూరం నడవడం తేలిక కాదు. మరీ నడవ లేని వృద్ధులు యితర కారణాల వల్ల నడవలేక పోయేవాళ్ళ కోసం లారీల్లోకొంత జాగా కూడ కేటాయించారు. మార్గమధ్యంలో పట్టణాలలో బసచేయకూడదు, బహిరంగ ప్రదేశాల మీదుగానే ప్రయాణం సాగించాలి. ఒక చోట ఒక రాత్రి మాత్రమే బస. పస్రూర్, సరోవర్ పట్టణాలలో మటుకు మినహాయింపు. ఎందుకంటే

యిక్కడ ఇతర కాందిశీకులు వచ్చి వీళ్లతో కలవడం అనే తంతు వున్నది గనుక. మేజర్ జంగ్ బహాదూర్ సింగ్ మనుషులు కొంతమంది అక్కడ దిగబడిపోయారు, వస్తూ వున్నప్పుడు వాళ్ళు దీనికి అవసరం అయిన యేర్పాట్లన్నీ చూస్తూ వుంటారు యిప్పుడు ఈ యూనిట్లు అక్కడకు చేరుకునే సరికి వాళ్లూ సంసిద్ధులయి వుంటారు ముందుకు నడవటానికి. మేజర్ జంగ్ బహదూర్ సింగ్ ఒక్కొక్క చోట రెండు రాత్రులు బసకు ఆలోచన చేస్తున్నాడు. దారిలో యేమి ఉపద్రవాలు, అనుకోని సంఘటనలు జరగవని అనుకుంటే వీళ్లనందరినీ పదిహేను రోజులలో భారతదేశానికి తీసుకువెళ్లాలని అతని ఆలోచన.

లాలా కాన్షీరామ్‌ను ఒక యూనిట్‌కు కాందిశీకుల నాయకుడుగా నియమించారు. మేజర్ జంగ్ బహదూర్ సింగ్ ఆయనను ఈ నియమకానికి అంగీకరించమని కోరినప్పుడు, లాలా చాల ఉప్పొంగిపోయాడు.

'నా కంత నేర్పరితనం లేదు సర్. అయినా మీరు అడుగుతున్నారు గనుక నాకు చేతనయిన సహాయం తప్పకుండా చేస్తాను, మాతృదేశం కోసం-' అన్నాడు చేతులు జోడిస్తూ.

తలమీద పాగా గట్టిగా బిగించుకుంటూ, మీసాలు యింపుగా కత్తిరించుకుని - యీ నాయక పదవిలో ఆయన చేసిన మొట్ట మొదటి పని యేమిటంటే ఈషర్ కౌర్ కు ట్రక్కులో ఒక జాగా కేటాయించడం. ఆమె యిప్పుడు పూర్ణగర్భిణి. ఆమె నడవలేదన్న విషయం సువిదితమే. లాలా కాన్షీరామ్ ప్రభారాణిని అరుణ్‌ను కూడా ట్రక్కులలో కూర్చునేట్లు చేద్దామా వద్దా అని క్షణం ఆలోచించాడు. తన కయితే యేం ఫరవాలేదు. హాయిగా కాళ్ళు సాగుతాయి, నడిస్తే. ప్రభారాణి కుమార్తె మరణ వార్త విన్నప్పటి నుంచి డీలా పడిపోయింది. అరుణ్ అసలే అర్భకుడు. అరుణ్ యీ మాట విన్న మీదట తండ్రికి విధి నిర్వహణ మీద చిన్నసైజు ఉపన్యాసం యిచ్చాడు. లాలా నవ్వి పారేస్తూ, నేను ఊరికే తమాషాకోసం అంటున్నాను - అన్నాడు. నిజంగా వృద్ధులు, జబ్బు పడినవాళ్ళు అనేక మంది కనిపించడంతో వాళ్లను యెలాగు వదిలివేయవలసే వచ్చింది, నడవటానికి. ఈషర్ కౌర్‌కు జాగా సంపాదించడమే గగనం అయిపోయింది.

ప్రతిరోజు మేజర్ జంగ్ బహదూర్ సింగ్ డేరాలో గంటల తరబడి గడిపేవాడు యీ యేర్పాట్లన్నీ చర్చిస్తూ కాన్షీరామ్. ప్రయాణీకుల జాబితాలన్నీ తయారయినాయి. లాలా కాన్షీరామ్ తన యూనిట్‌లో వున్న రెండు వేల మందినీ పరిచయం చేసుకోవలసి వచ్చింది ముందుగా. వాళ్లనందరినీ వారి వారి డేరాలలో కలుసుకుని కుటుంబ యజమాని పేరు గుర్తు పెట్టుకోవటానికి ప్రయత్నించాడు. మనుషుల ముఖాలు గుర్తుంచుకునేందుకు చూచాడు. మేజర్ జంగ్ అతనికి జాబితాలు మాత్రం యిచ్చాడు. లాలా కాన్షీరామ్ ఆ రెండు వేల మంది జాబితాను తిరిగి విభజించి వ్రాశాడు. పురుషులు/స్త్రీలు/ పిల్లలు/ జబ్బుమనుషులు/వృద్ధులు... యిలా. ఈ విడి విడి జాబితాలు తయారు చేయడంలో అరుణ్ సహాయం తీసుకున్నాడు ప్రతి పేరుకు ముందుగా వయస్సుకూడ వ్రాయించాడు. ఏ పని చేసినా క్షుణ్ణంగా చేయడమే అతనికి అలవాటు.

మేజర్ జంగబహదూర్ సింగ్ చెప్పాడు, వాళ్లవస్తు సామాగ్రికి. దీనికి అవకాశం వుంటుందని వాళ్ళు అనుకోలేదు ప్రయాణ సమయంలో వాళ్ళు ఆరుబయటనే పడుకోవలసివుంటుంది. డేరాలు వుండవు. తమకు కావలసిన బోజన సామాగ్రి అంతా తామే మోసుకు పోవాలి. లేదా ఎక్కడి కక్కడ కొనుక్కోగలగాలి దారిలో ఆకలి చావులు తటస్థించవచ్చు. ఇలాంటి సందర్భాలలో సాధారణంగా - బయలు దేరిన సంఖ్యలో దాదాపు సగం మందే తమ గమ్యాన్ని ముట్ట గలుగు తారనే విషయం అందరికీ తెలుసు. ఆకలితో చావవచ్చును.. యింకా మార్గంమధ్యలో శత్రువులు మీాదపడి హతమార్చవచ్చును. రక్షణ దళాలు తమ సరంజామ తీసుకుపోవటానికే ట్రక్కులు చాలడం లేదని అంటారు. ఇక కాందిశీకుల సామాన్లు, డేరాలు మోసుకుపోవడం వాళ్ళ వల్ల అయ్యే పనికాదు. అటువంటి పరిస్థితులలో, మేజర్ జంగ్ బహదూర్ ప్రకటన వాళ్ళకు ఆశ్చర్యం గానీ దిగ్భ్రమగానీ కలిగించలేదు తమ సామాను సరంజామా విషయం కాందిశీకులు యింతకు ముందే యేదో యేర్పాట్లు చేసుకున్నారు. కొందరికి ఎడ్ల బళ్ళు, దున్నపోతుల బళ్లు వున్నాయి వాళ్ళ సహకారం తీసుకోవటానికి వీలుంది. లాలా కాన్షీరామ్

యూనిట్‌కూడ యిటవంటి యేర్పాటు చేసుకోగలిగారు. మరికొంత మందికి బైసికిళ్ళు వున్నాయి తతిమ్మా వాళ్ళు తమ బరువులు తామే మోసుకుపోగలరు

సెప్టెంబర్ 24 తేదీని ప్రయాణం ప్రారంభం అవుతుంది. చాంద్రమాసం ప్రధమ దివసం ఆరోజు మేజర్‌కు పౌర్ణమి ప్రాంతాలు అయితే చంద్రుని వెన్నెల అనుకూలంగా వుంటుందనే అభిప్రాయం వుంది. కాని సందర్భం కలిసిరాలేదు. పౌర్ణమి కోసం ప్రయాణం వాయిదా వేయడం అతనికి యిష్టంలేదు

ప్రయాణం యింక రెండు రోజులలో వున్నదనగా సరదార్ తేజసింగ్ కుటుంబాన్ని విధి వక్రగతికి తిప్పింది. నిరంజన్ సింగ్ రోజులు దగ్గరపడుతున్న కొద్దీ దిగాలు పడిపోసాగాడు ప్రతి రోజు అతని జుత్తు కత్తిరింపు విషయం ప్రస్తావనకు వస్తోంది. తన నిరసన విధాయకంగా తెలియ పరుస్తూనే వున్నాడు అతను సరదార్ తేజసింగ్ అతి తటస్థంగా వుంటున్నాడు. నిరంజన్ కత్తిరించుకుంటే నేనూ అలాగే చేస్తాను, అంటున్నాడు ప్రతిరాత్రీ ఈషర్ కౌర్ రోదిస్తోంది రాత్రిపూటలు ఆమె భర్త అభిప్రాయంతో యేకీభవిస్తూవుంటుంది. తతిమ్మా సమయంలో అతని మొండితనం తలబిరుసుతనం ఆమెకు బాధకలిగిస్తాయి. చివరకు యెలాగయితేనేమి ఆమె యేడుపులు, పెడబొబ్బలు నిరంజన్ మనసు కరిగించ గలిగాయి. ఒకరాత్రి అతను అంగీకారం తెలిపాడు, యీ జత్తు కత్తిరింపుకు తమ సంక్షేమం అంతా దాని మీదనే ఆధారపడి వుండేట్లయితే అలాగే ఛేస్తానన్నాడు. ప్రయాణం రేపనగా తప్పకుండా ఈ 'క్షురకర్మ' తతంగంలో పాల్గొంటానన్నాడు అనేక వారాల యీ మధ్య మొదటి మారుగా ఈషర్‌కౌర్ కంటినిండా నిద్రపోగలిగింది. ఇప్పుడు తాము ఇండియాకు ధైర్యంగా చేరుకోగలం అనే విశ్వాసం ఆమెకు కలిగింది. అమృత్‌సర్ చేరుకున్నమీదట సువర్ణాలయంలో జరుపబోయే ప్రాయశ్చిత్త తాపశ్చర్యలలో తానుకూడ పాలు పంచుకుంటానంది. గురుమహరాజ్ మన తప్పిదాలను లోటుపాట్లను క్షమించి మన్నిస్తాడుగాని శిక్షించి యిబ్బంది పెట్టడు. ఆమె ఆ రాత్రి హాయిగా నిద్రపోయింది. ఆ నిద్రలో ఆమెకో కల కూడా వచ్చింది - తన బిడ్డ కులాసాగా చనుబాలు తాగుతున్నట్లు. ఇతర భారత స్త్రీల మాదిరికాక ఈషర్ తనకు ఆడబిడ్డే పుట్టాలని ఆకాంక్షిస్తోంది. మగపిల్లలయితే అల్లరి ఆగం

చేస్తారు. ఆడపిల్లలు బుద్ధిగా నిదానంగా వుంటారు. వాళ్లు పాలుకుడవడం కూడ యేమీ గందరగోళం లేకుండ, ప్రశాంతంగా, కృతజ్ఞతా భావం వుట్టిపడుతూ చేస్తారు. తల్లి సరసన వుండడం ఆడపిల్లలకు యిష్టం. మగపిల్లలు తల్లిని నానాహింసలు పెడతారు.

ఈషర్ కౌర్‌కు వచ్చిన కలలో, ఆమెకు పుట్టిన బిడ్డ లేత ఎర్రని పెదాలతో పాలుతాగుతోంది. ఈషర్ స్తనం తెల్లగా నిగనిగలాడుతూవుంది. చనుమొనను - నల్లని రంగుకు తిరిగిన మొనను ఎర్రని పెదాలు ఆబగా ఆక్రమించుకుంటూ కడుపునింపు కోవడం ఈషర్‌కు కళ్ళకు కట్టినట్లు కనిపిస్తోంది. - ఆ కలలో నల్లని చనుమొన పాలు ఊరుతూ చిన్నబిడ్డ పెదువులలోంచి తప్పించుకుని యివతలకు వస్తోంది అప్పుడప్పుడు. బిడ్డ పెదాలు దాన్ని తిరిగి వశపరుచుకోగలుగుతున్నాయి. పళ్లు లేని చిగుళ్ల స్పర్శ ఈషర్ కేర్ సున్నిత చర్మంపై మనోహరమైన అనుభూతులు తీసుకువస్తోంది. బిడ్డ పక్కలో తన పక్కన పడుకునేవున్నా, యింకా బొడ్డుతాడుతో తల్లి అనుబంధం స్పష్టంగా కనిపిస్తోంది. పిల్ల బొడ్డులోంచి సన్నటి తాడు అలా పొడుగ్గా పొక్కుంటూ వెళ్లి తల్లి అంతరంగంలోనికి చొచ్చుకుపోతూంది. ఈషర్ కేర్‌కు ఓలావాటి అంద వికారమైన మంత్రసాని కత్తెర చేతుల్లో పట్టుకుని యీ తాడు బంధాన్ని తెంపివేయడం కోసరం తన దగ్గరకు వస్తూ వుండడం కనిపించింది. ఈషర్ కేర్ ఉలిక్కిపడిపోయి, 'యీ బంధం తెంపవద్దు..... తెంపవద్దు....' అని అరిచింది.

ఆ అరుపుతోపాటు ఆమెకు మెలుకువ కూడా కలిగింది. వళ్లంతా చెమటతో తడిసిపోయివుంది. డేరా బయట నుంచి కొన్ని గొంతులు వినిపిస్తున్నాయి. బీబీ అమరావతి డేరాలోనికి వస్తోంది. ఆమె చేతులు రెండు కత్తెర బ్లేడ్లలాగ పైకి ఎత్తి వున్నాయి అమె తెల్లని కళ్లు యీ ప్రభాత కాంతిలో యింకా ధగధగ మెరుస్తున్నాయి. 'ఈషర్ లే-లే- త్వరాగా లే. .' అని అరుస్తోంది ఆమె. 'ఘాతుకం జరిగిపోయింది. మన బతుకు బద్దలయి పోయింది.'

ఈషర్ కేర్ తక్షణమే లేచి కూచుంది. ఆమె తండ్రి తేజసింగ్ కూడా అప్పుడే లేచి తలపాగకోసం వెదుక్కుంటున్నాడు. భర్త పక్కమీద కనబడడం లేదు.

'కోడలా .. త్వరగారా నీ దౌర్భాగ్యం నీ భర్త నిప్పంటించుకున్నాడు... కాల్చి వేసుకున్నాడు.'

ఈషర్ కౌర్ తనపూర్ణ గర్భాన్ని ఒడిసి పట్టుకుంది, ఎవరో యిక్కడ దెబ్బ కొట్టారన్నట్లుగా. ఒక్కక్షణంలో డేరా బయటకు చేరుకుంది, బీబీ అమరావతి వెనకనే సర్దార్ తేజసింగ్ ఆమెతో పాటు బయటకు వచ్చాడు. అతను పరుగుతీస్తునే 'యేం జరిగింది యేం జరిగింది అసలు?. ' అంటున్నాడు.

వాళ్లు నీళ్ల కొళాయిల దగ్గర వున్న కంచె తావుకు చేరుకున్నారు. కొద్ది దూరంలో కాలి పోతున్న కట్టెలు కనిపించాయి. ఆ కట్టెల మధ్య ఓ మండిపోతున్న మానవాకారం తీరుబాటుగా కూర్చుని వుంది అంతా దగ్ధమైపోతోంది. ఆ ఆకారమే నిరంజన్ సింగ్ శరీరం.

ఈషర్ కౌర్ యేడుస్తూ మంటల వయిపు పరుగుతీస్తోంది.

'వద్దు వద్దు. అమ్మాయీ ఆలస్యం అయిపోయింది .'

ఈషర్ కౌర్ పెద్దగా యేడుస్తోంది అరుస్తోంది. తనను పట్టు కున్న లాలా కాన్షీరామ్ చేతలు కరిచి విడిపించుకుందుకు ప్రయత్నిస్తోంది.

ఈ పరిస్థితి యిలావుండగా అక్కడ అగ్ని జ్వాలలు గర్జనలు చేస్తూ ఎగసి పడుతున్నాయి చుట్టు దాదాపు ఓ వంద మంది పోగయి వున్నారు. అంతా గందర గోళంగా తయారవుతోంది. కొందరు మంటల మీదికి మన్ను చల్లుతున్నారు, నీళ్ళు పోస్తున్నారు.ఆ మంటలు ఎంతో ఉధృతంగా వుండి ఎవరూ దగ్గరకు వెళ్లటానికి కూడా సాహసించ లేకపోతున్నారు. మంటలలో నుండే ఆక్రందన వినిపిస్తోంది. నిరంజన్ సింగ్ యింకా బతికే వున్నాడు! అతను బాధతో అరుస్తున్నాడు, బిగ్గరగా అతిస్పష్టంగా 'వాహేగురు శిష్యుడిని నేను, వాహే గురు మహానుభావుడు....' అని.

తేజసింగ్ యిప్పుడు గట్టిగా నిట్టూరుస్తూ రోదన స్థాయికి చేరు కుంటున్నాడు.-పరుగెత్తుకు వెళ్లి ఆ మంటలలో తాను గూడ దూకాలని వుంది అతనికి. అయితే అరుణ్, సూరజ్ ప్రకాశ్ అతన్ని కదలనీయకుండా బిగుతుగా పట్టుకునించున్నారు.

'ఓ ! నిరంజన్! ఎంత పనిచేశావు నాయనా.....?' అని రోదిస్తున్నాడు, తేజసింగ్ ఈషర్ కౌర్ తన పిడికిళ్ళతో లాలా కాన్షీరామ్ ఎదురు రొమ్ము మీద బాదుతోంది, తనను విడిచి పుచ్చమని. 'నన్ను వెళ్లనీ, బాబాజీ నన్ను వెళ్లనీ....'

మంటలలో నుంచి మరో ఆక్రందనం, మరో ప్రకటన

'ప్రాణాలయినా పోగొట్టుకుంటానుగాని నా సిక్కు ధర్మాన్ని మాత్రం వదులుకోను.'

ఈషర్‌కౌర్ యింకా బిగ్గరగా రోదిస్తోంది.

ఆ క్షణంలోనే మంటల మధ్య యింతవరకు కూర్చుని వున్న ఆకారం పక్కకు వొరిగిపోయింది. నిరంజన్ సింగ్ తల, వెంట్రుకలు మంటలలో వెలిగిపోతు వుండడం కనిపిస్తోంది. అంతే! అయిపోయింది.

నిరంజన్ సింగ్ వాళ్లందరి ముందు అగ్నికి అహోతి అయిపోయాడు. అక్కడ చేరిన వాళ్లందరిని ఒక గంభీరమైన నిశ్శబ్దం అవరించుకుంది. అతనికి తన జుట్టును గురించి వున్నపట్టింపు శిబిరంలో అందరికీ దాదాపుతెలుసును. దానిని కత్తిరించుకోవడం కంటె ప్రాణాలు తీసేసుకోవడమే శ్రేయస్కరం అని అతను తీర్మానించుకున్నాడన్న మాట! ఇలాంటి 'ఆత్మాహుతి'ని గురించి వాళ్లు ఇదివరకు విని వున్నారు గాని, కళ్లారా చూచి వుండలేదు ఇలాంటి ఆత్మాహుతి తప్పకుండా యితరుల మీద యెంతో ప్రభావాన్ని చూపుతుంది. 'నిన్ననే మాతోపాటు వస్తానన్నాడు...' అని తేజసింగ్ ఆ దృశ్యం వంక తేరపార చూస్తూ వుండిపోయాడు. ఈషర్‌కౌర్ కూడా స్తబ్ధురాలయిపోయింది ఆమె కడుపుబాగా విస్తరించినట్లయింది, చేతులు, స్తనాలు, ముఖం, శరీరం అంతా బాగా పొంగిపోయినట్లయింది. ప్రభాంత కాంతిలో ఆమె చిక్కిపోయి పాలిపోయి అగుపిస్తోంది. కడుపు చిరిగి పోయి కాళ్ళమీద పడుతుందా అన్నట్లుగా వుంది. కాని ఆమె ముఖం మీద మటుకు యేదో ప్రశాంతత ఆవరించుకు వుండింది. కడుపులో వున్న బిడ్డను తలుచుకున్నప్పుడు, సృష్టి రహస్యాలను గురించి ఆలోచిస్తునప్పుడు యిలాంటి ప్రశాంతత ఆమెను ఆకట్టుకు వుంటుంది. ఆమె యిప్పుడు యేడుపు ఆపేసి ఆ మంటల వైపు నిదానంగా చూస్తోంది. అందరూ యీ పనే చేస్తున్నారు.

ఆ నిశ్శబ్దంలో - మండి వారిగిపోతున్న కట్టెల చప్పుడు అంత గమనంలోనికి రావడం లేదు. అదికూడ యీ గంభీర సన్నివేశంలో అంతర్భాగం అయిపోయింది క్షణాలమీద కట్టెలన్నీ మసి, మసి అయిపోయినాయి. ఓ పెద్ద బూడిద కుప్ప యేర్పడింది. ఎవరో అందుకున్నారు - వాహేగురు! వాహేగురు... ఆ కుటుంబంతో యేమాత్రం సంబంధంలేని ఓ వ్యక్తి గొంతు అది. కాని రోదనం, గగుర్పాటు, వణుకు... ఆ గొంతులో స్పష్టంగా వున్నాయి. తతిమ్మావాళ్ళూ యీ సంకీర్తనంలో **పాలు** పంచుకోసాగారు. క్రమంగా యేదో స్పష్టత కూర్చుకుంది 'వాహేగురు! వాహేగురు! వాహేగురు...' అంటూ అందరు ఆ మంటలు ఆరిపోయి - మసి కుప్పగా తయారయిన జాగా చుట్టూ ప్రదక్షణం చేయసాగారు చేతులు కట్టుకువున్నారు, నమస్కారం చేస్తూ ఆ అస్తి సంచయానికి వినయంగా ప్రణామం చేస్తున్నారు. సంకీర్తన సాగిస్తునే వున్నారు

ఈ వార్త అతి త్వరగానే అన్నితావులకు పాకింది. ఆ పగలంతా ఎందరో ఈ బూడిద చుట్టూ ప్రదక్షిణలు చేస్తూనే వుండిపోయారు. కెప్టెన్ రహ్మతుల్లా ఖాన్ కొందరుసైనికులతో పాటు ఆ తావుకు వచ్చాడు. తాను విచారణ జరపాలన్నాడు. శిబిరం లోని యితర సిక్కులు యీ బూడిద కుప్పచుట్టూ అయిదుగురు మనుషులను నించో బెట్టారు కాపలాగా. వాళ్ళ చేతుల్లో కత్తులు వున్నాయి. రహ్మతుల్లా యీ దృశ్యం చూచి, తన ప్రయత్నం విరమించుకుని కొంతసేపు ఆచోట మౌనంగా నిలబడి తిరిగి వెళ్ళి పోయాడు. జనం నుంచి ప్రతి ఘటన యింత స్ఫుటంగా ధృడంగా వున్నది గనుకనే అతను తన మనుషులను తీసుకుని ఆఫీసుకు ఉపసంహరించుకున్నాడు.

నిరంజన్ సింగ్‌కు శిబిరంలో కాందిశీకుల ఉపయోగంకోసం నిలువ చేసి ఉంచిన కట్టెపుల్లలను తీసుకోవడం చాల తేలిక అయిన పనే అయింది. అయితే అతనికి డబ్బాడు కిరసనాయలు ఎలా దొరికిందో, రాత్రపూట ఎప్పుడు లేచి యీ ప్రయత్నాలన్నీ కూరుస్తూ వుండిపోయాడో మటుకు ఎవరికీ ఊహకు అందలేదు. అతన్ని గురించి యితరులు గమనించ గలిగింది, కట్టెపుల్లలకు అగ్గి ముట్టించాక అతను 'ప్రాణాలయినా పోగొట్టుకుంటానుగాని మత ధర్మాన్ని విడనాడను..' అని ప్రకటిస్తూ అరచినప్పుడే శిబిరంలో చాలమంది పెందలకడనే

లేచే వాళ్ళు వున్నారు. అతను కాలి పోతూ వుండడం తాము మొదటగా చూచామంటే తామే ముందుగా చూచామని యిప్పుడు వాళ్ళు పోటీలు పడుతున్నారు. ఈషర్ కౌర్‌కు తేజసింగ్‌కు యీ వివరాలు అంత అభిరుచిదాయకం అయినవీ అవసరం అయినవీ కాదు. వాళ్ళు నిస్సత్తువ లోనే - విస్మయంలో యింకాపూర్తి స్పృహ లేకుండానే -డేరాలోనికి వెళ్లి పోయారు వాళ్ళు దుఃఖంలో మునిగి పోయివున్నారు. నిరంజన్ సింగ్ ఆత్మాహుతి చేసుకున్నాడు, గనుక అమరుడు అయిపోయాడు అతని కోసం యేడవ కూడదు అన్నారు తతిమ్మావాళ్ళు ఈషర్ కౌర్‌కు తనను యేదో మాయ కమ్మివేస్తున్నట్లుగా అనిపించసాగింది. వీళ్లందరు ప్రస్తావిస్తున్న ఈ నిరంజన్ సింగ్ ఎవరు? అతను నిజంగా చనిపోయినాడా? తన గర్భంలో భారంగా తిరుగాడుతున్నది అతని బిడ్డయేనా? అతను తనకు భర్తా ?....

మరుసటి రోజు నిరంజన్ సింగ్ చితాభస్మాన్ని పోగుచేశారు ఎర్ర నూలు సంచిలో చేర్చారు. ఆ సంచిని ఈషర్ కౌర్‌కు యిచ్చారు. ఈ భస్మాన్ని గంగానదిలో కలిపి వేయాలని ఆమె కోరిక ఇందుకు అందరూ అంగీకారం తెలిపారు నా ప్రయాణంలో నాతో పాటే వుంటుంది యీ సంచి అంది ఆమె. శిబిరంలోని వారంతా పగలు, రాత్రి అనకుండా బూడిదపోగు చేస్తూవున్నారు. కొందరయితే యీ భస్మాన్ని నుదుట బొట్టుగా పెట్టుకుంటున్నారు. కొందరు పొట్లం కట్టి తమతో తీసుకుపోతున్నారు ప్రతి వారికీ యేదో గుర్తు తమతో తీసుకువెళ్లాలని కోరిక. చివరకు చితాభస్మం యేమీ మిగల దేమోనని భయం కూడా యేర్పడింది ఒక స్థితిలో. అప్పుడు యింకెవరూ యీ చాయలకు రాగూడదని కట్టడి చేశారు. పూలు, దండలు యేమీలేవు. చెట్ల అకులు మాత్రం సంచుల్లో పోశారు. లాలాకాన్షీరామ్, తేజసింగ్ చెరొక 'ఎముక ముక్కను' తీసుకుని నీళ్ళతో శుభ్రపరచి సంచిలోభద్రపరచారు ఇప్పుడు నిరంజన్ కొన్ని ఎముకల పోగుగా మాత్రం భార్యవొడిలో మిగిలి పోయాడు ఆమె అతన్ని ముద్దుపెట్టుకుని తనతో డేరాలోనికి తీసుకుపోయింది.

ఈ రాత్రిళ్ళు ఛాందిని విపరీతంగా భయపడిపోతోంది. ఎంతసేపూ అరుణ్‌ను అంటి పట్టుకునే వుంటుంది ఆమె చూచిన అసహజమైన చావుమటుకు యిదే. అందుచేతనే ఆమె విపరీతంగా భయానికి లోనయింది

అరుణ్ చెవుల్లో నింపాదిగా అంది - 'బాగా భయంగా వుంది '

'ఎందుకు భయం! నేనున్నాను గదా నీ పక్కన-' అని ధైర్యం చెప్పాడు అరుణ్. ఆమె చొక్కాపై కెత్తి, ఆమె పొట్టకు తన పొట్ట తాకించి స్పర్శసుఖంలో కొంతసేపు మైమరిచిపోయాడు.'

'మిమ్మ్మగురించి కూడా నాకు భయంగా వుంది.'

'నాకేం జరగదు. ఏం ప్రమాదం లేదు నాకు.'

'మీకు నిజంగా నేనంటే ప్రేమేనా?'

'అవును-'

'నిజంగా?'

'నిజంగానే?'

'నన్ను పెళ్లి చేసుకుంటారా?

'చేసుకుంటాను-'

'నన్ను మీ భార్యను చేస్తారా?

'ఊ- చేస్తాను-'

'నిజంగా?'

'నిజంగానే?'

'నన్ను "ఇల్లాలా" అని పిలవండి?

'ఇల్లాలా?'

'మళ్లీ పిలవండి

'ఇల్లాలా ! హృదయేశ్వరీ !'

'ఓహ్!' అంటూ ఆమె అతన్ని బిగియార కౌగలించుకుంది. ఆమె పొట్ట యిప్పుడు అసంకల్పితంగానే అతని శరీరానికి ఒత్తుకుంటూంది.

# నాలుగవ అధ్యాయం

ప్రయాణం ప్రారంభం అవుతున్న రోజున, దానిలోని భాగస్వాములందరూ చివరిమారుగా సియిల్ కోట నగరంవైపు ఆగి ఆగి ఆసక్తిగా చూడసాగారు. ఆ యిళ్ళు, దేవాలయాలు, మసీదులు, చర్చిలు, గోపురాలు, కర్మాగారాలు - యివన్నీ దూరానికి కూడా గుర్తుపట్టటానికి వీలుగాలేచి నుంచుంటున్నాయి. జనం వాటిని గుర్తుపట్టడం పక్కవాళ్ళతో చెప్పడం - వాటితో తమకు వుండిన పరిచయాన్ని తలుచుకోవడం ... యిదే ప్రధాన కర్తవ్యం అయిపోయింది. సూర్యకాంతిలో నగరమంతా వెలిగిపోతోంది. పొలాలన్నీ విశాలంగా పరచుకుని బీడు పడినట్లుగా అగుపిస్తున్నాయి. ఎక్కడా కార్యకలాపం, వ్యవసాయపు ప్రయత్నాలు కనబడడంలేదు. ఈ సంవత్సరం విత్తులు చల్లడం ఆలస్యం అయిపోతుంది - అనుకున్నాడు లాలా కాన్షీరామ్.

నగరంలోని వారి స్నేహితులు వీడ్కోలు యివ్వడం కోసం వచ్చారు. చౌద్రి బర్కత్ ఆలి, మునీర్ - యిద్దరు తెల తెలవారుతూ వున్న సమయానికే శిబిరానికి వచ్చారు. ఇతర కాందిశీకుల ముస్లిం స్నేహితులు కూడా వచ్చి వున్నారు. మునీర్ నూర్ వ్రాసిన ఉత్తరం అరుణ్‌కు అందించాడు. ఉర్దూలో కొన్ని లైన్లు - ఎక్సర్‌సైజ్ పుస్తకంలో నుంచి చింపిన కాగితం మీద వ్రాసింది నూర్. అక్షరాలు అలికిగా సిరా పక్కపంక్తుల మీదకు జారుతూ... నలిగిపోయివుంది కాగితం ; 'ఈ ఉత్తరం యేడుస్తూ వ్రాస్తున్నాను. - ' అని వ్రాసింది నూర్. 'మళ్లీ నిన్ను చూడడం సాధ్యపడుతుందా? జనం యింతగా దుస్సహం దుర్భరం అయిపోతున్నారు. ఎందుకనో భగవంతునికే తెలియాలి. ప్రేమించుకుంటున్నరెండు జీవాలను విడదీయడం ఎందుకు జరుగుతుందో!... నా చివరి క్షణాల వరకూ నిన్ను గురించే తలపోస్తువుంటాను. అల్లా నిన్ను రక్షించుగాక. నిన్ను సర్వదా కాపాడు గాక!'

ఉత్తరంలో అత్యుక్తులు లేవు. లేని పోని వాగ్దానాలు లేవు. పరస్పర ప్రమాణాలు అంతకంటె లేవు. నూర్ అరుణ్‌ను ఇక ముందు చూడగలగడం అసాధ్యం అనే విషయం స్పష్టం అవుతోంది. అతన్ని పోగొట్టుకోవడం ఆమె

మనస్సుకు ఎంత పరితాపం కలిగిస్తోందో యీ నాలుగు పంక్తులు విశద పరుస్తున్నాయి. ఉత్తరం ఆమె కన్నీటితో తడిసిపోయివుంది. ఈ కాగితం అంతా ఆమె దుఃఖ హృదయంలో ముంచి తీసినట్లుంది. అరుణ్ దాన్ని చేతిలోనికి తీసుకుని శ్రద్ధగా చదివాడు. ఏ క్షణంలో నయినా యీ కాగితం చివికి చిరిగిపోయేట్లుగా వుంది.

ఉత్తరం చదువుతూ వుండగా అతని హృదయం బరువెక్కసాగింది. గబ గబ చదివేసి దాన్ని ట్రౌజర్ పాకెట్‌లో భద్రపరుచుకున్నాడు. మునీర్ వంక దిగులుగా చూచాడు. ఇప్పుడు అతని హృదయంలో ఛాందిని స్థావరించుకు వుంది. నూర్‌కు ఎక్కువ ప్రాధాన్యం వున్నట్లు లేదు. జీవితగమనంలో అదో మైలురాయి, అంతే. ఎప్పుడో గడచిపోయిన మైలురాయి - అదీని! గుండెలో నెప్పి, సన్నని బాధ బయలు దేరింది. ఊపిరి కోసం తన్నుకులాడవలసి వస్తోంది.

శిబిరం గేటు బయట, నగరంలోనుంచి వచ్చిన దర్శకులు చాల మంది పోగయ్యారు. పాకిస్తాన్ సైనికులు వాళ్లను లోనికి రానివ్వకుండా అటకాయిస్తున్నారు. కాస్త పరిచయం అయిన పేరు, ఊరు వున్నవాళ్లను మాత్రం లోనికి రానిస్తున్నారు, కాందిశీకుల గుంపులు దశలవారిగా ముందుకు నడుస్తున్నప్పుడు - ఆ చూస్తున్నవాళ్ళు వాళ్ళను నానా దుర్భాషలు ఆడడం, నిందించడం చేస్తున్నారు.

లాలా కాన్షీరామ్ యూనిట్ వరుసలో నాలుగవది. క్రమశిక్షణ కోసం అందరినీ పంక్తి తీర్చి నడిపించడం మంచిదనుకున్నాడు మేజర్. ముందు డేరాలలో ఒక వరస - దానికి సంబంధించిన ఆర్మీ వెహికల్ ; తరువాత మరో వరుస.... యిలా అంతా యేర్పాటు ప్రకారం నడిచిపోతూంది.

లాలా కాన్షీరామ్‌కు తన కుటుంబంతో అంటిపెట్టుకు వుండాలని వుంది. ఉదయం నుంచి తన యూనిట్ యేర్పాట్లు సక్రమంగా జరుగుతున్నాయని దృఢం చేసుకోవటానికి నిర్విరామంగా తిరుగుతూనే వున్నాడు. తన యూనిట్ వంతు రావటానికి ముందే, గేటు దగ్గరకు వెళ్లి అంతా సక్రమంగా వుందా లేదా చూస్తున్నాడు.

ఇందులో అంత నేర్పుగా చూడవలసింది యేమీ లేదు. ఆర్మీ అన్నియేర్పాట్లు పర్యవేక్షిస్తున్నది గనుక అంతా గడియారం లెక్కలను గమనించి చురుకుగా జరిగి పోతోంది. నిన్న సాయంకాలమే కెప్టన్ రహ్మాతుల్లా ఖాన్ మేజర్ జంగ్ బహదూర్ సింగ్‌కు యీ ప్రయాణంలో తరలుతున్న కాందిశీకుల జాబితాలు అధికారికంగా వప్పగించాడు. మేజర్ తను వీళ్లందరి యేర్పాట్లు చూడటానికి బాధ్యత తీసుకుంటున్నానని ఒక ఉత్తరం వ్రాసి యిచ్చాడు కెప్టెన్ ఆఫీసులో. ఇద్దరు కమాండెట్లు - ఈ తతంగం అయిన తరవాత కరచాలనం చేసుకున్నారు. తతిమ్మా భారత పాకిస్తాన్ ఆఫీసర్లతో పాటు తేనీరు తాగడానికి వెళ్లారు. ఇండియన్ సిపాయిలకు ప్రత్యేకంగా టీ యిచ్చి వీడ్కోలు చెప్పారు పాకిస్తాన్ సిపాయిలు. పరస్పరం సహృదయంతో విడిపోవడం - యిక్కడ ఉద్దేశ్యం. ఈ ఆఫీసర్లు, కింది అధికారులు లోగడ గూడ పరిచయాలు వున్నవాళ్లే. మేజర్ జంగ్ దగ్గర వున్న యిద్దరు ఆఫీసర్లు, ఒక కెప్టెన్, ఒక లెఫ్టెనెంట్ - డెహ్రాడూన్ ఇండియన్ మిలిటరీ ఎకాడమీలో కెప్టెన్ రహ్మాతుల్లాతో కలిసి ట్రెయినింగ్ అయినవాళ్లు. వీళ్లందరూ సరదాగా గడపడానికి యింతవరకు యెలాంటి సమావేశాలు జరగలేదు భారత ఆఫీసర్లు తమకు కేటాయించిన ఆవరణలోనే వుండి పోయారు పాకిస్తాన్ ఆఫీసర్లు తమ నివాస భవనాలలోనే వుండిపోయారు. భారతీయులు రేపు ఉదయమే వెళ్ళి పోతున్నారు గనుక - 1947కు పూర్వం వివిధ మత అనుయాయుల మధ్య వుండిన మంచితనాన్ని పునః ప్రతిష్టితం చేయటానికి యేర్పాట్లు జరుగుతున్నాయి యిప్పుడు. టీ పార్టీలు యేర్పాటు అయినా - ఉభయ పక్షాలు చాల గుంభనగా ముభావంగానే వున్నారు. నవ్వులు పెదవులు దాటి పైకి రావడంలేదు.

లాలా కాన్షీరామ్ గేట్ దగ్గర నిలబడి శిబిరం నుంచి బయటకు నడుస్తున్న కాందిశీకులను గమనిస్తున్నాడు. ఎద్దుబండ్లు గర గర శబ్దాలు చేస్తున్నాయి. చాల మంది తమ సంచులు బుజాల మీద మోసుకుపోతున్నారు సైకిళ్ళకు కట్టుకున్నారు. ఆడవాళ్లు తమ పురుషుల సరసన నడుస్తున్నారు. పిల్లల వేళ్లను కాకుండ చేతులనే గట్టిగా పట్టుకున్నారు, ఎవరో వాళ్లను లాక్కుపోతారేమో నని భయపడుతున్నట్లు. పాకిస్తాన్ ఆర్మీ ఒకస్క్వాడ్ గేట్

దగ్గర నిలబడి వుంది. రెండు మెషిన్ గన్లు ఎత్తయిన వేదిక మీద అమర్చి వున్నాయి. కాందిశీకుల రక్షణ బాధ్యత - వాళ్ళు శిబిరాలను దాటి బయటి పడేంతవరకు - యింకా పాకిస్తాన్ ప్రభుత్వానిదే గదా!

భారత అధికారులు ధైర్యంగా అటు యిటు తిరుగుతున్నారు. వాళ్ళ పతకాలు ఎండలో ధగ ధగ లాడతున్నాయి. ఆత్మ విశ్వాసంతో అతి జాగ్రత్తగా వ్యవహరిస్తున్నారు వాళ్లు. వాళ్లందరి వద్ద రివాల్వర్లు వున్నాయి. స్టెన్‌గన్లు వీపులకు వేలాడుతున్నాయి. కాందిశీకుల వంక చూచినప్పుడల్లా ధైర్యం చెబుతూ ప్రోత్సాహిస్తున్నట్లుగా నవ్వుతున్నారు. స్నేహ పూర్వకంగా 'త్వరగా తెమలండి కదలండి...' అని హెచ్చరిస్తున్నారు.

లాలా కాన్షీరామ్ ముస్లిం గుంపులోంచి ఎవరో పైకి లేచి పడుతూ తనను అందరూ గమనించాలని ప్రయత్నం చేస్తున్నట్లు అనిపించింది. ముఖం పరిచయంగా వున్నట్లుంది. మళ్లీ అపరిచితమైనదిగానే అనిపిస్తోంది. చీకిరి కళ్లు, పాన్‌తో మొద్దుబారిన పెదవులు, వెకిలి నవ్వు - వాలకం. తలకు ముస్లింటోపీ, అపరిచితుడా! కాదు... అతను గంగుమల్.

గంగుమల్ చాల రోజులుగా కనిపించడంలేదు. బహుశ అతన్ని ముస్లింలు చంపేసి వుండాలి.. లేదా అతను బీబీ అమరావతిని, కుటుంబాన్ని వదిలేసి భారత దేశానికి వెళ్లే ఏ రైలులోనో వెళ్లిపోయి వుండాలి - అనుకున్నారు. బీబీ అమరావతి అతని కోసం కన్నీరు వృధా చేయలేదు. పీడవిరగడ అయిందనే అనుకుంది. లాలాకాన్షీరామ్ తో అతన్నిగురించి ఎప్పుడూ మర్యాదగా మాట్లాడలేదు అమే అతన్ని దగ్గరకు తీసిందని - గృహ కృత్యాలకు ఒక మనిషిగా వాడుకుందనీ అనుకుంటాడు కాన్షీరామ్

గంగుమల్ ముస్లిం మతం తీసుకుని వాళ్లతో కలిపిపోయి వుంటాడని అతనికి యింతవరకు స్ఫురించనే లేదు. అతనే తనగమనం కోసం యిందాకటి నుంచి తాపత్రయ పడుతున్నాడు లాలా కాన్షీరామ్ తన కళ్లనుతాను నమ్మలేక పోయాడు ముందు. గబ గబ అడుగులు వేసి ఆ ముస్లిం గుంపు చెంతకు నడిచాడు. గంగుమల్ అతన్ని ఆప్యాయంగా చేతులు అంది పుచ్చుకున్నాడు. ఒక మూలకు తీసుకు వెళ్లి `సంభాషణ ప్రారంభించాడు.

'ఏమిటి యిదంతా గంగుమల్?'

'నేనిప్పుడు గంగుమల్ కాదు. గులామ్ మహమ్మద్ నా పేరు-' అంటూ అతను నవ్వుతున్నాడు. అతని గొంతు అస్థిరంగా కాస్త యిబ్బంది పడుతున్నట్లు కూడా అనిపించింది కాన్షీరామ్‌కు

'అలాగా!... అయితే యేమిటీ పని? బీబీ అమరావతి యేమంటుంది ?'

'ఆమెతో చెప్పవలసిన అవసరం లేదు కాన్షీరామ్, ఆమె ఎంతటి నోటి దురుసు మనిషో నీవూ ఎరుగుదువు. నాకు జీవితం విసుగయి పోయింది ఆమెతో, అందుకనే వదిలేశాను....'

'అయితే మటుకు ముస్లిం మతం తీసుకోవడం?'

'ఎందుకు తీసుకోగూడదు? భారతదేశం నాకు యేం యిచ్చింది గనుక?'

'ఇప్పుడు మాత్రం?'

'ఇప్పుడు నాకు ఫోర్త్ స్ట్రీట్‌లో రెండు భవనాలు వున్నాయి-'

'అలా అనకు-'

'అవి నా ఆస్థులు. ఇక్కడ ముస్లింగా మారిపోయి వుండదలుచుకున్నాను. అవి - రెండు భవనాలు - నా ఆస్థులుగానే చెలామణి అవుతాయి.'

ఈ ప్రకటనలో యేదో కిటుకు వున్నదనిపించింది కాన్షీరామ్‌కు, బీబీ అమరావతీ అతన్ని సరిగ్గా ప్రవర్తించేటట్లు చేయగలమనిషి !

'ఇప్పుడు ముస్లిం భార్యనుకూడా కట్టుకుందా మనుకుంటున్నాను.'

లాలా కాన్షీరామ్ తన్నుకు వస్తున్న నవ్వును ఆపుకోలేక పోయాడు. జీవితం యిలా లయలు, అవలయలు తీసుకుంటున్నదన్నమాట - అనుకున్నాడు.

'ఆ రకంగా సుఖంగా వుండగలననుకుంటే అలాగే చేయి.....

'తప్పకుండా ! అందులో ఎంతో సుఖం వుందని నీకు మాత్రం అనిపించడం లేదూ?'

'అవునవును అట్లాగే !' - అన్నాడు లాలాకాన్షీరామ్ అతని ముఖం లోకి మరింత గుచ్చి చూస్తూ, అతని వెనక యిప్పుడో చప్పుడు వినిపించింది.

'ఇలా జరుగుతుందని ఎవరనుకున్నారు? ' అని బీబీ అమరావతి గొంతు వినవచ్చింది. ఆమెకు ఎవరు సమాచారం అందచేశారో కాన్షీరామ్‌కు ఆశ్చర్యం అయింది. ఆమే సాక్షత్తు యిక్కడే నిలబడింది, గంగుమల్ వంక తేరిపారచూస్తూ.

బీబీ అమరావతి భర్తను నిందించలేదు, తన్నలేదు. అతని వంక తేరిపారచూస్తూంది, అంతే, వాడి కళ్లతో తరువాత ఆమెకు వెల్లువలా నవ్వు వచ్చింది. అతని వంక చూస్తున్న కొద్దీ యీ నవ్వు తెరలు బలం పుంజుకోసాగాయి. గంగుమల్ అక్కడ నుంచి పారిపోకపోవడం లేక చేయిచేసుకోక పోవడం లాలా కాన్షీరామ్‌కు ఆశ్చర్యం అనిపించింది. బీబీ అమరావతి నవ్వుతూ వున్నంతసేపూ అతను ఆమె వంక తేరిపార చూడడం తప్ప యింకేం చేయడం లేదు. కొంత సేపు అయిన మీదట అతడూ నవ్వడం ఆరంభించాడు. ఆమె లాగ బిగ్గరగా వెర్రి మనిషిలా కాకుండా, స్వప్రజ్ఞ వున్న మనిషిలా పగ తీర్చుకుంటున్నా నన్న ఆనందంలో! అతను నవ్వడం సజావుగానే వుంది.

గుంగుమల్లే మొదటగా మాట్లాడనారంభించాడు.

'నీవు వెళ్లిపోయే ముందు ఒకమారు చూడకుండా పంపించి వేయడం మంచిది కాదనుకున్నాను' అన్నాడు, తమకంగా ఆమె వంక చూస్తూ.

'ఆహా... హా... హా... ఒక మారు చూడకుండా...' అంటూ అతని మాటలనే అర్థం పర్థం లేకుండా వప్పచెప్పతోంది తన నవ్వుల కెరటాల మధ్యనుంచే. అతని వంక అంతులేని ఉత్సాహంగా చూస్తోంది ఆమె, ముఖ్యంగా తలపైటోపీని గమనిస్తూ.

'ఇదంతా నిజమేనని నీకు తెలుస్తోందా?'

'ఆహా... హా... హా... '

'నవ్వకు అలా వెర్రిదానిలా '

'ఇంకేం చేయనూ?'

'నేను నీ ఆస్తిపాస్తులను సంరక్షిస్తున్నాను. దానికి యిదొక్కటే మార్గం అందుకే యిలా చేశాను..?'

'ఆహా .. హా.. హా... '

'నీ తరపున ఏజెంట్‌గా వ్యవహరిస్తాను. '

వాళ్లిద్దరి మధ్య తాను నిలబడివుండడం అసందర్భంగా తోచింది లాలా కాన్షీరామ్‌కు. వాళ్లను వంటరిగా మాట్లాడుకోనివ్వడం మంచిది. ఇద్దరిలో ఎవరూ కూడా ఆరోగ్యంగా వున్నట్లు కనబడడం లేదు. బీబీ అమరావతి సన్నబడిపోయి గడకర్రలా తయారయింది. ఆమె స్థనాలు జారిపోయి బొడ్డుదాకా వేలాడు తున్నాయి. కంఠం మీద రక్తనాళాలు ఉబికి వచ్చి కనిపిస్తున్నాయి. ఎలాంటి ఆనందమూ వాటిని మళ్లీ మామూలుస్థాయికి తీసుకు రాలేదనిపిస్తుంది. గంగుమల్లు కూడా చూపులకు యింతే అసహ్యంగా వున్నాడు.

ఈ స్థితిలోకూడా యిద్దరూ ఒకరి వంక మరొకరు తమకంతో ఆపేక్షగా చూచుకుంటున్నారు అచూపులు వాళ్లను గమనించగల స్థాయికి తీసుకు వస్తున్నాయి.

ఇప్పుడు బీబీ అమరావతి నవ్వడంలేదు. ఇప్పుడు ఆమె గంగుమల్లు వంకనే ఛూపునిలిపి వుంది. లాలా కాన్షిరామ్ అక్కడే నిలబడి వున్నాడన్న ప్రజ్ఞ ఆమెకు ఎంత మాత్రం లేదు. ఆమె ఉపిరి పీలవడం కూడా నిలిపి వేసినట్లుంది.

ఏదో మంత్రం ఉచ్చరిస్తున్నట్లుగా 'నువ్వు మాతో రా. నీవు మాతోనె వుండాలి..' అంది ఆమె, చాల నెమ్మదిగా.. ఒక్కొక్క మాట తూచి తూచి

'ఊహు...' అన్నాడు గంగు మల్లు.

'అయితే నీకు కావలసిందల్లా నా డబ్బు అన్నమాటేగా...' ఆమె కళ్లల్లో మళ్లీ ఎర్రదనం పుంజుకుంది.

'కాదు...'

ఆమె తిరిగి అతి నింపాదిగా 'మాతో వచ్చెయ్యి..' అంది

'ఊహు..'

ఇద్దరూ కొంత సేపు మౌనంగా వుండిపోయారు.

'పద - కాన్షీరామ్, మనం వెళ్లిపోదాం యింక..' అని ఆమె గిరుక్కున వెనక్కు తిరిగింది.

ఈ స్థితిలో కూడా .. అంటే గంగుమల్లును మళ్లీ తన ఆధిపత్యం లోనికి తెచ్చుకోవడంలో విఫలం అయిపోయినప్పుడు కూడా ఆమె చిత్త స్థైర్యాన్ని కోల్పోలేదు, నోరు పారవేసుకోవడం లేదు. పరాజిత అయిన మనిషిలా కుంగిపోయింది. ఇన్నాళ్లూ తాను ఓ బొగ్గు ముక్కను వజ్రంగా భావించి చూపుతూ వచ్చింది. అది కేవలం బొగ్గు ముక్కేనని యిప్పుడు తేలిపోయింది తన అంతరంగంలో చెలరేగుతున్న మధనానికి ఆమె బాహ్యరూప కల్పనలు చేయదలుచుకోలేదు. ఆమెకు దారిలో సూరజ్ ప్రకాశ్ కనిపించాడు. తండ్రిని గురించి వినవస్తున్న వార్తలు నిజమేనా?.. అని అడిగాడు ఆమె చికాకుతో అతన్ని అదిలించి 'నీవేమీ యిప్పుడు ఆయన్ను చూడనవసరం లేదు..' అని వెనక్కు పంపివేసింది. లాలా కాన్షీరామ్‌తో ఆమె... 'ఈ పద్ధతే నాకు బాగానే వున్నదనిపిస్తోంది. కుటుంబ ఆస్థిపాస్థులు కుటుంబంలోనే వుండిపోతాయి' అంది. ఆమె నవ్వాలని ప్రయత్నించింది, ఏదో కర్కశమైన ధ్వని మటుకే ఆమె గొంతులోనుంచి బయట పడింది. వాళ్లయూనిట్ గేట్ దాటి బయటకు వెడుతూ వున్నప్పుడు గంగుమల్లు అక్కడ లేకుండా అదృశ్యం అయిపోయాడు. అతన్ని గురించి ఎవరినీ తనతో మాట్లాడనివ్వలేదు ఆమె. తన డేరా దగ్గర ఓ ఆయిల్ డ్రమ్ చూచుకుని దానిమీద స్థాయిగా కూర్చుంది. సునంద చేస్తున్న ప్రయాణపు యేర్పాట్లను పర్యవేక్షించ సాగింది.

పాదయాత్ర మొదటిరోజున బీబీ అమరావతి దాదాపు మౌనంగా వుండిపోయింది. ఆమె ఎప్పుడూ మాట్లాడుతూ రాజసం ప్రదర్శిస్తూ వుండే మనిషి, లాలా కాన్షీరామ్ ఉద్దేశ్యం ప్రకారం. ఎదటి వాళ్లకు వ్యతిరేకంగా యేదో

మాట అని, తన మాట నిలబెట్టు కుందుకు శతధాప్రయత్నం చేసే మనిషి అందుకనే ఆమె అంటే ఆ వీధిలో అందరికీ హడలు. ఈ రోజున ఆమె ఓడిపోయిన యోధురాలుగా అగుపిస్తోంది. ఆమె రక్షాకవచం పడిపోయింది. ముసలి మనిషి. నిటారుగా నడవడం కూడా చేత కాకుండా పోతోంది. ఈ మధ్యకాలంలో లాలా కాన్షీరామ్‌కు దిగులు తీసుకు వచ్చిన అనేక ఉదంతాలలో యిది ప్రధానమైనది, ఎక్కువ ప్రభావితం చేసినదీ కూడా. బీబీ అమరావతిని సింహంలా అతను ఎరుగును. పట్టువిడవని మనిషిలా, నలుగురూ భయపడే మనిషిగా - ఎరుగును. ఆమెతో ఎన్నో మార్లు పోట్లాడవలసి వచ్చిన సందర్భాలు అతనికి యేర్పడినా, ప్రతిమారూ ఆమె తన అభిప్రాయాలకే అంకితమై పోయి వాటిని సుతరామూ ఒక్క అంగుళం మేరయినా సర్దుబాటు చేసుకోకపోవడం అతనికి ఆశ్చర్యం కలిగిస్తూ వుండింది. ఆమెను యిలా దిష్టిబొమ్మలా చూడడం అతనికి బాగాలేదు. ఆమె మళ్లీ సింహంగా తయారవాలి.

ఎవరితోనూ మాటలు కలపకుండా - ఆమె నిరాశానిస్పృహలతో కూరుకుపోయిన మనిషిలా నడుస్తూ వుండింది. సూరజ్ ప్రకాశ్ సంతానం - భావన, నవకాంత్‌లకు యీ పాదయాత్ర ఎక్కువ వినోదప్రాయంగా అనిపించసాగింది. నవ్వులు కేరింతలూ కొడుతూ ఒక మనిషి నుంచి మరో మనిషి దగ్గరకు దూకుతూ ఆనందిస్తున్నారు. వాళ్లు మాట్లాడటానికి ప్రయత్నించినప్పుడు కూడా ఆమె తిట్టి పైకి పంపివేసింది. ఆమె వంటరిగానే నడుస్తోంది.

లాలా కాన్షీరామ్‌ను 'ముకుందుని తల్లి యేమయిందో కనుక్కున్నావా?' అని అడిగింది తాపీగా.

'హత్య అయిపోయిందిట... అతను చెప్పాడు...'

'మరి ముకుందుడు?'

'అతన్ని గురించి వార్తయేమీ లేదు. బహుశ అతన్నీ వధిస్తారు. సిటి ప్రిజన్‌లో చాల మంది హిందూ నేరస్థులను కాల్చి చంపేశారని విన్నాను.'

'వాడూ ముస్లిం అయిపోయివుంటాడు.' అంది ఆమె, ముఖం నిండా అసహ్యం, ద్వేషం పులుముకుని. ముర్రే కాలేజి దాటి రామలీల మైదానాలమీద నుంచి వెళ్లిపోతున్న కొద్దీ నగరం దూరమయిపోతోంది. తతిమ్మా వాళ్లమాదిరే, లాలా కాన్షీరామ్ తనకు సంభవించిన నష్టాన్ని మనసులోనే గుణించు కుంటున్నాడు ఎన్నో రకాలుగా నష్టం! నగరం దాటి దూరంగా వెడుతున్న కొద్దీ భవిష్యత్తును గురించి ఆలోచనలు ముసురుకోసాగాయి. ఇంతవరకూ గడిచింది ఒక ఎత్తు అయితే యిక ముందు యింతకంటే ఎన్నో రెట్లు కష్టాలను అనుభవించవలసి రావచ్చును. ఇంతవరకు తాను తన ప్రమేయం లేకుండానే ఎన్నో 'చావులు' చచ్చాడు. తనలో అనేక భాగాలు... ఎక్కువ భాగాలు... చని పోయాయి తతిమ్మావి యింకా శక్తివంతంగా సజీవంగా వున్నాయి. తాను యిప్పటికీ సొంతం చచ్చిపోయిన వాడి కింద, పరాజితుడు అయినట్లూ లెక్కకాదు. ఇక ముందు జరగవలసిందే ఎంతో వుంది. దానిని గురించి తలుచుకుంటూ వుంటేనే అడగులు తడబడుతున్నాయి.

మొదటిరాత్రికి వాళ్లు సియల్ కోటకు ఆరు మైళ్ల దూరంలో వున్న గున్నాకలన్ గ్రామంలో ఆగారు పాదయాత్రికులు సియాల్‌కోట వదిలిన మూడు గంటలకు ఆ గ్రామానికి చేరుకున్నారు కంటోన్మెంట్ యేరియాలో కొందరు వీళ్లను చూడటానికి స్వల్పంగా పోగయినారు గాని.... తతిమ్మా మార్గ మధ్యం అంతా ఏమీ యిబ్బంది లేకుండా ఎదురు దెబ్బ లేకుండానే నడిచింది. వెడల్పాటి రోడ్డు మీద నడిచారు, రోడ్డుకు రెండు పక్కల చెట్లు వున్నాయి. వాళ్లు నడుస్తున్నప్పుడు రోడ్డు మీది దుమ్ము పైకి లేచి దుప్పటిలా పరుచుకుంటూంది. మార్గ మధ్యంలో వాళ్లకు ఎవరో వదిలేసిన దుస్తులు, చెప్పులు, సొట్టలుపడ్డ స్టీల్ ట్రంకులు, చేతికర్రలు.. యిలాంటి సరంజామా అగుపించాయి. లోగడ వెళ్లిపోతున్న కాందిశీకులపై, ముస్లింలు జరిగిన దొమ్మీకి యివే సాక్ష్యాలు అయితే కంటోన్మెంట్‌కు దగ్గర తావు గనుక యిది, యిక్కడ ఎక్కువ హింస, దౌర్జన్యం జరగలేదు కనీసం తాము కర్ణాకర్ణిగా విన్నంత విహ్వాలం లేదు

గున్నీకలన్ బాహ్యాపరిసరాలలో అచ్ఛాదనలేని ఆవరణలో విడిసింది యీ పాదచారుల దళం గుంపులు గుంపులుగా వచ్చి చేరే పురుగుల పుట్టల

లాగ యీయూనిట్లు క్రమంగా వచ్చి ఆవరణలో విస్తరించుకున్నాయి సైన్యం ఆదేశించింది - అందరూ బారులు తీర్చి మకాం చేస్తే బాగుంటుందని అయినా అందరూ గుంపులు గుంపులుగానే తయారయ్యారు. కాళీజాగా కనిపిస్తే చాలు, గుంపులు దానినే తమ నివాసస్థలంగా తయారుచేసుకున్నాయి జనప నార చాపలు, దుప్పట్లు, పరచుకుని విశ్రాంతిగా పడుకున్నారు కొన్ని కుటుంబాలు కలిసి సమిష్టిగా భోజనం తయారు చేసుకున్నారు ఎవరూ ఎలాంటి ఫిర్యాదు చేసుకోలేదు. దగ్గరల్లోనే నీటి భావులు వున్నాయి మల మూత్ర విసర్జనకు మరో పక్కన వున్న జాగా వాడుకున్నారు

ఛౌద్రి బర్కత్ అలి, మునీర్ యీ ఆరుమైళ్ళు లాలా కాన్షీరామ్ కుటుంబంతో కలిసి నడిచి వచ్చారు వాళ్ళు ఒక జాగా చూచుకుని మకాం యేర్పరచుకోగలిగే సరికి మూడు గంటలు అయింది. పొలాలలో నీడలు పొడుగులు సాగుతున్నాయి.

ఛౌద్రి బర్కత్ అలి - నిలువెల్లా కంపించిపోతూ, 'యిక మేం వెనక్కు వెళ్ళి పోతాం-' అన్నాడు. 'ఖుదా హాఫీజ్, బ్రదర్ కాన్షీరామ్' అన్నాడు చేతులు జోడిస్తూ.

ఛౌద్రి చేతులు తన చేతుల్లోనికి తీసుకుని ఆదరంగా 'అవి జీవితంలో మధురమైన సంవత్సరాలు-' అన్నాడు.

ఇద్దరూ కంటనీరు పెట్టుకున్నారు.

ఇన్ని వారాలు ఎంతో ఉద్రేకంతో ఉద్వేగంతోగడచి పోయినాయి. ఇంకా చెప్పుకోవలసింది యేమి లేదనిపించింది.

'మా కోసం చాల శ్రమ తీసుకున్నావు. కాన్షీరామ్!'

'అలా అనకు - కాన్షీరామ్!'

ప్రభారాణి వయిపు తిరిగి 'సోదరీ ! ఖుదా హాఫీజ్ - భగవంతుడు దయామయుడు -' అన్నాడు.

'మన జీవిత కాలంలో కాక పోవచ్చునుగాని, మన పిల్లల తరంలో యీ జరిగిన తప్పిదానికి పరిహారం తప్పకుండా సమకూరుతుంది - అన్నాడు ఛౌద్రి కాన్షీరామ్‌తో. 'మనం సోదరమానవులం. మతం మనను విడదీయలేదు.'

'అవును నీవు చెప్పింది సరి-

'పాకిస్తాన్ మరో పాతికేళ్ళ కంటే మనలేదు'

మునీర్ రోజంతా మాట మంతి లేకుండా బిగుసుకుపోయి వున్నాడు. అసలు అతను యెందుకు వచ్చినట్లు - అని నివ్వెరపోయాడు అరుణ్ నడవడం అతనికి యిబ్బంది, కష్టం అనిపించలేదు - వెళ్ళి పోవాలంటే యిష్టం లేకుండావుంది.

'నీకు ఉత్తరం వ్రాస్తాను, మునీర్!'

'తప్పకుండా రాయి ఎక్కడున్నానరే నీ చిరునామా తెలియ పరుస్తూవుండు'

'నూర్‌ను అడిగినానని చెప్పు-'

- ఈ మాటలో అబద్ధం యేమిలేదు అని చెప్పుకున్నాడు అరుణ్. నూర్ సమక్షం దొరక కుండా పోయింది. అయినా ఆమెను మరిచిపోవడం మటుకు సాధ్యం కాదు. జీవితంలో ప్రేమ, ప్రణయం ఎన్నోమార్లు వస్తాయి, పోతువుంటాయి. దృక్పధాలు మారిపోతాయి. అయినా ప్రథమ ప్రేమను మరచిపోవడం అంటూ-జరగదు. అది అతి కోమలమైనది సుకుమార మైనది. మునీర్ వెళ్ళిపోతున్నాడు. ఇదే ఆఖరు క్షణం. నూర్‌తో తన అనుబంధం తెగిపోతుంది. అరుణ్ అతి చింతా క్రాంతుడయ్యాడు.

'అలాగే' అన్నాడు మునీర్.

'అమెకు నాప్రేమ అందించు -' అన్నాడు అరుణ్.

మునీర్ అతని కళ్ళలోకి గుచ్చిచూస్తూ 'అలాగే!' అన్నాడు.

ఇద్దరు కౌగలించుకున్నారు.

ఛౌద్రి బర్కత్ ఆలీ, మునీర్ వెనక్కువెళ్లి పోయారు. లాలా కాన్షీరామ్, అరుణ్ చాలసేపు వాళ్ళు వెళ్ళిన దిక్కుగానే చూస్తూనిలబడిపోయారు. వాళ్ళు సైకిళ్ళ మీద వెడుతున్నారు. కొద్దిసేపటిలోనే కనుమరుగు అయిపోయారు.

లాలా, అరుణ్ చూస్తూ వుండిపోయారు తప్ప యేమి మాట్లాడుకోలేదు లాలా బర్కత్ ఆలీ గురించి ఆలోచిస్తున్నాడు అరుణ్ మటుకు మునీర్, నూర్‌లను గురించి యోచించడంలేదు ఇప్పుడతను బిల్ డేవిడ్ సన్ గురించి ఆలోచిస్తున్నాడు. ఆ రోజు కాందిశీకుల శిబిరాలలో తమను చేర్చటానికి అతను సహాయం చేశాడు. దరిమలా ఒక్కమారు మాత్రం అరుణ్ అతన్ని బరాక్స్‌లో కలుసుకున్నాడు అతను ఇంగ్లండ్‌కు బదిలీ అయిపోయాడనీ దేశం విడిచి స్వస్థలానికి వెళ్ళిపోయాడనీ మునీర్ చెప్పాడు. వెళ్ళేముందు తమ దగ్గరకు వచ్చి సెలవు తీసుకోకపోవడం కాస్త ఆశ్చర్యం అనిపించింది. అరుణ్‌కు. బహుశ అతని యిబ్బందులేవో అతనికి వుంటాయి - అనుకున్నాడు. అయినా, ఏమిటి ఆ యిబ్బందులు, ఎలాంటివి అయివుంటాయి . అని అలోచించసాగాడు.

ఆ సాయంత్రం యింతవరకూ జీవితంలో చవిచూచి ఎరుగని ఓ సుందర దృశ్యం అతని ముందు సాక్షాత్కరించింది అలాంటి సుందరత అతను స్వప్నంలో కూడా ఊహించలేడు. సాయంకాలం అవుతున్న కొద్దీ ఆ ఆవరణ అంతటా ప్రశాంతత పరుచుకుంది. అరుణ్ నగరంలో పెరిగినవాడు పగలు,రాత్రి అనేవి కాలమానాన్ని కొలవటానికి పనికివచ్చే తూనికరాళ్ళు మటుకే అతనికి. అంతకంటె వాటికి మనోహరమైన రూపాలు, ప్రయోజనాలు వున్నాయని అతను ఊహించివుండలేదు. ఉదయం కళ్ళు తెరిచి చూచేసరికి, సూర్యోదయం అయింది. ప్రపంచం అంతా వెలుగుతో నిండిపోయింది. దుకాణదారులు దీపాలు వెలిగించేంత వరకు సూర్యాస్తమయం అయిందన్న సంగతే తెలియదు. ఆకాశం వంక చూస్తే అంతటా చీకటి అలుముకు పోయి వుంటుంది. సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు .. యివన్నీ మన సౌకర్యం కోసం సాధనాలు, ఇతర మనుషుల మాదిరిగానే వీటికి ప్రత్యేకమైన వ్యక్తిత్వం అంటూ వుంటుందనీ, తమదే అయిన జీవం వుంటుందనీ, మనుషులను ప్రభావితం చేయడం కూడా చేతనవుతుందనీ అతను యింత వరకూ ఆలోచన చేయలేదు.

సూర్యుడు మెట్లుదిగి పోతున్నట్లుగా, మహారాజులాగ దర్పంగా హుందాగా అడుగులు వేస్తూ కిందకు జారుతున్నాడు. అరుణ్‌కు ఆ దృశ్యం

వంక సూటిగా చూడగూడదని ఎవరో చెప్పారు. అలా చేస్తే కంటి చూపు దెబ్బతింటుందట! కాని యీ సాయంకాలం, ఆ సూర్యతేజం ఏమాత్రం హానికరం కాకుండా అవతరిస్తోంది. ఎంత ముద్దయిన ఎరుపురంగు ముద్ద ! దాని వంక రెప్పలార్చకుండా చూచాడు. భూమికంటె సూర్యుని వైశాల్యం ఎక్కువని పుస్తకాలలో చదివాడు. ఇప్పటి భారీ 'సైజు' అతని మనస్సును ఆకట్టుకున్నట్లయింది. ఈ ఆకారం క్రమంగా పొలాల పొదలమీదుగా నడిచి భూమిలోనికి కృంగిపోతోంది. భూమినంతటినీ తనతో పాటు లోపలకు లాగివేస్తున్నట్లు పీల్చి వేస్తున్నట్లు వుంది. ఎంతో శక్తివంతంగా వుంది.

మసక చీకటి అలుము కుంటుంది. తరగతి గదిలో లాగ అంతటా నిశ్శబ్దం నగరాలలో యిలా చీకటి కనిపించదు. సొంతం చీకటి ఆవరించుకునేవరకూ అదంతా పగటి విస్తరణే అవుతుంది. చీకటి పడిందంటే యిక దానికి రాత్రి అనిపేరు. ఇక్కడ యీ మసక వెలుతురు - మసక చీకటి వాతావరణానికి కొత్త రూపు రేఖలు తీసుకువస్తున్నట్లు వుంది. ఈ వెలుతురు ఎక్కడనుంచి వస్తోందో అరుణ్ అంచనా వేయలేక పోయాడు. సూర్యుడు మాయమైపోయాడు. చంద్రరేఖ బహుపలచనగా వుంది. ఇంత కాంతిని సరఫరా చేయటానికి ఆ సన్నని రేఖకు శక్తిచాలదు అయినా భూమి విచిత్రమైన వెలుగుతో భాసిస్తోంది ఓ! తప్పకుండా ఈ వెలుగు భూమినుంచే జారీఅవుతూ వుండాలి! భూమి ఉపరితలంపైన వున్న జల్లెడ రంధ్రాల నుంచి వస్తూవుండాలి. తాను ఎంత అదృష్టవంతుడు! జీవితంలో మొదటి మారుగా ఈ వెలుగును చూస్తున్నాడు. ఇదే నిజమైన వెలుగు, భూమి అందిస్తున్న వెలుగు!

ఈ నిశ్శబ్దం మటుకు ఎంతకాదు ! కల్తీలేని కలుషితం కాని నిశ్శబ్దం యిది. చప్పుళ్ళు లేవని కాదు పైన పక్షులు కిలకిలా రావాలు చేస్తూ తిరుగాడుతున్నాయి. శిబిరంలోనుంచే సవ్వడులు వస్తున్నాయి. పొలాలలో చిన్న చిన్న కీచురాళ్లు విచ్చలవిడిగా తిరుగుతున్నాయి గ్రామంలోని ఓ నీటి యంత్రం పనిచేస్తున్న శబ్దం వినవస్తుంది. రోడ్డు మీద అప్పుడప్పుడూ చప్పుడు చేసుకుంటూ యే కారో లారీయో వెళుతోంది ఈ శబ్దాలు అన్నిటినీ మించి, వీటినన్నిటినీ తనలో యిముడ్చుకుని నిశ్శబ్ద వాతావరణం స్థావరించుకుని

వుండింది ఈ నిశ్శబ్దమే ఒక శబ్దం ఆకాశంనుంచి అదృశ్యహస్తాల మీదుగా భూమిలోని సకల చరాచర జీవరాశుల మీద యీ నిశ్శబ్దం స్రవిస్తోంది జలపాతంలా. దీనికి శబ్దం ఒక్కటేకాదు బరువు - వస్తువుకూడా వున్నాయి అరుణ్ ఈ నిశ్శబ్దాన్ని గమనించగలుగుతున్నాడు, స్పర్శిస్తున్నాడు

క్రమంగా చీకటి వృద్ధి అవుతోంది పొలాలలోనికి నడిచి వెళ్లవలెననిపిస్తోంది. శిబిరంనుంచి దూరంగా జరిగిపోవాలి.

ఒక రక్షక భటుడు అతన్ని ఆపాడు.

'ఎక్కడకు వెడుతున్నావు?'

'బహిర్దేశానికి. '

'ఎక్కువ దూరం వెళ్లకు. ప్రమాదం..'

'ఫరవాలేదు. భయంలేదు. '

అడుగులు భారంగా వేస్తూ నడుస్తున్నాడు. అంతా కొత్తగా వుంది. తెలియని తనం. పూర్వం అనుభూతిలోనికి రాని వింత ధోరణి. ఈ పొలం దున్నడం అయిపోయింది. తిరుగతీసిన భూమి పెల్లల మీదుగా అడుగులు సాగుతున్నాయి. నడుస్తున్నకొద్దీ తాదాత్మ్యం ఎక్కవయిపోతోంది. కొత్త పరిచయాలు, కొత్త మూలాలు యేర్పడుతున్నాయి పొలాల మీదుగా వాతావరణం అంతా వాయుభరితమై వుండడం చూస్తుంటే శూన్యతకు కూడా బరువు వున్నదనిపిస్తోంది. దీనికీ ఒక ఆకారం వుంది ఆ అకారం తనను కౌగలించుకుంటూంది. ఆకాశానికి భూమికి మధ్య యేమీ కాదనుకుంటున్న శూన్యత అతన్ని తనలోనికి తీసుకుంటూంది. అతను గాఢంగా ఊపిరిపీలుస్తున్నాడు. తృప్తిగా వుంది. ఆకాశంలోనికి నిటారుగాతల ఎత్తి నడుస్తున్నాడు. ఈ వాతావరణం మెడమీంచి చల్లగా దూసుకుపోతోంది. కొద్ది దూరంలో రక్షక భటుల అడుగుల చప్పళ్లు వినవస్తున్నాయి. కాందిశీకులు వంట చేసుకోవటానికి వెలిగించిన అనేక 'అగ్నులు' కూడా కనిపిస్తున్నాయి. కుడి పక్కగా ఆర్మీ తన డేరాలు, పటాలం యేర్పాటు చేసుకుంటూంది. బండ్లనుంచి విడదీసిన ఎద్దులు తన వయిపు వస్తున్నాయి. ఏమీ ప్రమాదం లేదు. అన్నీ చుట్టూ పరుచుకు వున్నాయి.

నక్షత్రాలు వెలుగుతూ వచ్చాయి. ఇంకా అతను శిబిరానికి వెళ్లకుండా యిక్కడే తారట్లాడుతున్నాడు. ఇప్పుడు పూర్తిగా చీకటి పడిపోయింది. సన్నని చంద్రరేఖ కూడా మాయమయింది. ఆకాశంలో ఎత్తుగా అసంఖ్యాకంగా నక్షత్రాల వెలుగులు ప్రసరిస్తున్నాయి అతనికి కొన్ని పేర్లు తెలుసు సప్త ఋషి మండలం. యిలా! ఇంతకుముందు చూచి వుండని నక్షత్రాల గుంపులు కూడా యిప్పుడు కనిపిస్తున్నాయి అతనికి. కీచురాళ్ల రొద ఎక్కువయింది. ప్రతి పొదలోనూ అవే. చెట్ల మీదనూ అవే. తతిమ్మా చప్పుళ్లన్నీ సర్దుమణిగాయి మిల్లు పని చేయడం ఆపి వేసింది. రోడ్డు మీద వాహనాల సంచారం లేదు ఎక్కడో దూరంలో సంతలోంచి వినవస్తున్నట్లుగా శిబిరంలోని శబ్దాలు మాత్రం చేరువ అవుతున్నాయి. తను, కీచురాళ్లు, నక్షత్రాలు... యివే యిక్కడ వున్నది ఛాందిని గూడా తనతో వుంటే ఎంత బాగుండును అనుకున్నాడు ఆమెతో ప్రణయం నెరిపితే యిప్పుడెంత బాగుంటుంది! ఈ నేల మీద - తిరుగబడి బయటికి వస్తూ లోపలి వాసనలను బహిరంగ పరుస్తున్న భూమి మీద - శయనిస్తే ఎంత బాగుంటుందో! ఛాందినిని తన బుజాలలో ఒడిసి పట్టి ప్రణయావేశంతో కలిసిపోతే! ఈ కోరిక యిదివరకు ఎన్నడూ ఎరగనంత దృఢంగా రూపొందుతోంది అతనిలో శరీరంలో రక్తం పరుగులు తీస్తోంది ఎదుర్రొమ్ము మీద చేతులతో రుద్దుకో వలసి వస్తోంది ఆ వేగంతో సర్దుబాటు అవటానికి. ఇక్కడ ఒంటరిగా నిలబడి వుండడం అతనికి భయావహం అవసాగింది. ప్రియురాలు దగ్గర లేకపోతే యీ వాతావరణం అంతా అలవికాని అరణ్యంలాగ తయారవుతుంది. శిబిరం వయిపు వెనక్కు నడక సాగించాడు.

నేల గట్టిగా తగులుతోంది పాదాల కింద అయితేనేం చల్లగా వుంది. రాత్రి అతనికి బాగా నిద్ర పట్టింది. అప్పుడప్పుడు చంటి పిల్లల యేడుపులు, ముసలివాళ్ల దగ్గులు, కాపలా మనుషుల పలకరింపు కేకలు వినవస్తున్నాయి అవి అతన్ని యిబ్బంది పెట్టటం లేదు. విశాలమైన ఆవరణ గనుక యివన్నీ దానిలో ఆర్చుకు పోతున్నాయి. మధ్యమధ్యలో అతను లేచి కూర్చుని ఆకాశంలో నక్షత్రాల వంక తేరిపార చూస్తున్నాడు. ప్రతి మారు వేరు వేరు రూపాలు కనిపిస్తున్నాయి. అర్ధ నిద్రలోనే అతను ఛాందిని వంక చూచాడు. చాలా దూరంలో పడుకుని వుంది. అందరూ బస్తాలలాగ, మూటలలాగ పడుకున్నారు

తనకు ఆమెకు మధ్య చాల మంది వున్నారు అవును ఆమెను లేపి తనతో బాటు బయటకు - ఆరు బయటకు తీసుకుపోవాలి. అయితే యింతలోనే నిద్ర ముంచుకు వచ్చింది.

నారోవల్ చేరుకునేంతవరకు చాందిని అతనితో బయటకు రావటానికి అంగీకరించలేదు. గున్నా కలన్ దగ్గర అదనంగా ఒక రాత్రి గడపవలసి వచ్చింది. అనుకున్న ప్రకారం మరు రోజే ప్రయాణం సాగలేదు వాళ్లలో చాలమందికి - కాలినడకన ఆరుమైళ్లు యేకటాకిన నడవడం జీవితంలో యిదే ప్రథమ పర్యాయం. కొందరికి కాళ్లు బొబ్బలు కట్టాయి. కొందరికి కడుపు ఉబ్బరింత ప్రారంభం అయింది. చాలా మంది అలసి సొలసి పోయారు. తనకు యెంత యిష్టం లేక పోయినా మేజర్ జంగ్ బహదూర్ గున్నా కలన్‌లో అదనపు రోజు విశ్రాంతి మంజూరు చేయవలసే వచ్చింది. మరునాడు బడియానాలో ఆగకుండా నేరుగా పస్రూర్ వరకు నడిచిపోయి యీ సమయాన్ని ఆదా చేసుకోవాలనుకున్నారు. పస్రుర్ గున్నాకలాన్ నుండి పదిమైళ్ల దూరం. సియల్ కోట నుంచి అయితే పదహారు మైళ్లు.

గున్నాకలనే లో వుండిన రెండవరోజు అరుణ్ ఛాందినితో మాట్లాడాడు.- 'ఈ సాయంత్రం నీవు నాతో పాటు పొలాల వైపు రావాలి.'

'ఏం పొలాలు?'

'అదుగో అక్కడ కనిపిస్తూ వున్నవి..' అంటూ అతను దిక్చక్రం వైపు చూపాడు.

'ఎందుకు?' అంది ఆమె ఆశ్చర్యపోతూ.

'ఈ ఆరు బయలు ఎంత విస్తరించి వుందో చూడటానికి'

'ఆరు బయలు చూడటానికా?'

'అవును..'

'ఏమిటి అంత ప్రత్యేకత?'

'ఎంతో అందంగా సుందరంగా వుంటుంది..' అన్నాడు అతను నవ్వుతూ. ఆమె ఆలోచిస్తున్నట్లుగా కొంతసేపు నిదానంగా వుండిపోయింది.

'ఊహు. నేను రాను..' అంది తరువాత నింపాదిగా.

'ఎందుకు?'

'చాల ప్రమాదం బయట తిరగడం'

'ఎలా?'

'ముస్లిములు యీ ప్రాంతాల అంతటా తిరుగుతున్నారు.'

'శిబిరానికి 'దగ్గరగానే తిరుగాడుదాం .'. అతని గొంతు బొంగురు అయింది. అతని చెంపల్లో సిగ్గు చేరుతోంది.

'ఊహు..' అంది ఆమెకూడా సిగ్గు కనబరుస్తూ.

'నీతో యేకాంతంగా గడపాలని వుంది..'

ఆమె ముఖం మీది సిగ్గు తెరలు మెడకిందకు కూడా పాకాయి. తల ఆడించింది.

'మనం చాల సేపు ఏకాంతంగానే వున్నాంగా?'

'అదీ యిదీ ఒకటి కాదు..'

ఆమె నేల చూపులు చూస్తూ యేమిటో అంది.

'అదీగాక యిక్కడి అరు బయలు... అదో వేరే ప్రపంచం..?'

ఆమె యేమీ పలక లేదు.

'వస్తావుగదూ?'... అన్నాడు అతను, యిప్పుడు నిశ్చయం అయిపోయి.

ఆమె తల ఊపింది. నేల మీద పాదాలతో తాడించింది.

'నాకు భయంగా వుంది బాబూ!'

'నన్ను చూస్తే భయమా?'

'కాదు.. ఊరికినే... భయం...'

'దేన్ని గురించి'

'నాకు తెలియదు.'

ఆమె కళ్లు దించుకుంది. నేలను కాళ్లతో రాస్తోంది.

ఆమె పాదాలు అందంగా వుంటాయి. మడమలు బలిష్టమయినవి. పాదం బాగా కండబట్టి ఆర్చిలాగ వంగి వుంటుంది. వాటిని చూడడం అతనికి ఉత్సాహకరంగా వుంది.

'నేనంటే నమ్మకం లేదా యేమిటి?' అన్నాడు. అతనిలోని కోరిక గొంతులో ధ్వనిస్తోంది.

'నమ్మకం వుంది.'

'అలా అయితే రావాలి. తప్పదు.. కేవలం కొన్ని నిమిషాలు...'

ఆమె కళ్లలో ఎర్రని జీరలు అవుపించాయి. తరువాత అవీ కామనతో తడిసిపోయాయి. ఇంకా తల ఊపుతూనే, కాళ్లు ఆడిస్తూనే 'నేను రాలేను బాబు ..' అంది.

పదయాత్రా ప్రయాణికులు నింపాదిగా నడుస్తున్నారు. పస్రూర్‌లో నాలుగు రోజులు ఉండిపోవలసి వచ్చింది. అది తాలూకా ఊరు. అక్కడి కాందిశీకుల ప్రయాణపు యేర్పాట్లు యింకా పూర్తికాలేదు. మేజర్ జంగ్ బహదుర్ సింగ్ యిక్కడ విడిచి వెళ్లిన లయజన్ ఆఫీసరు ఫిర్యాదు చేశాడు - పాకిస్తాన్ అధికారులు కావాలనే అనవసరంగా ప్రతి కార్యకలాపాన్ని ఆలస్యం చేస్తున్నారనీ, యిబ్బందులు కలుగచేస్తున్నారనీ. ఈ కాందిశీకులు ముస్లింలతో ముఖాముఖి పోరాటానికి దిగవలసి వస్తుందేమోనని హెచ్చరించాడు కూడా. పట్టణంలో అనేక మంది ముస్లిం ఆగంతకులు పోగయివున్నారు. పాకిస్తాన్ అధికారులు ప్రయాణాన్ని ఆపు చేయించి వుంచడం యీ దొమ్మీలకు, దోపిడీలకు వీలు కల్పించడం కోసరమే.

ఊరి బయట ఓ పెద్దబడి ఆవరణలో, కట్టడాలలో విడిసివున్నారు కాందిశీకులు. కొంతమందయితే బిల్డింగులలో చోటు సంపాదించుకోగలిగారు.

తతిమ్మావాళ్లు ఆరుబయటి స్థలాలలోనే వుండి పోవలసి వచ్చింది. ఇక్కడ రెండు వేల మంది మటుకే వున్నారు కాందిశీకులు వేరే ఒక యూనిట్ ప్రతేక్యంగా యేర్పాటు చేయకుండా యీ రెండు వేలమందనీ యిప్పటి పది యూనిట్లులోనే సర్దివేయాలని తీర్మానం అయింది. శిబిరంలో ముస్లింలు మీద పడతారేమోననే వార్తలు బాగావ్యాపించాయి. రాత్రుళ్ళు యెవరూ నిద్రపోవడం లేదు భారత ప్రభుత్వ అధికారులు ఎక్కువ జాగరూకంగా వున్నారు నాలుగు రాత్రులూ అరుణ్ మేలుకునే వున్నాడు. సూరజ్ ప్రకాశ్ కూడా. అంటే మగవాళ్ళుకొన్ని వందల మంది జాగరణ చేస్తూనే వుండిపోయారు, ఏవేవో కుటుంబ విషయాలు మాట్లాడుకుంటూ వున్నారు గాని 'అల్లాహో! అక్బర్' అనే దండయాత్ర అరుపులు యేక్షణంలో వినవస్తాయోనని ఆదుర్దాగానే వున్నారు ఉండి ఉండి నిద్రపోతున్నారు.

దండయాత్ర అంటూ యేమి జరగలేదు. ప్రసూర్ వచ్చిన అయిదవ రోజు పాదయాత్రికులు మళ్లీ ప్రయాణం ఆరంభించారు. నాలుగు రోజులు నిద్రలేకపోవడం వల్ల మగవాళ్ళ నరాలన్నీ పీక్కు పోతూవున్నాయి. మేజర్ జంగ్ వాళ్ళ నందరినీ ఉత్తేజితులను చేయాలని ప్రయత్నం చేస్తున్నాడు. అయినా అందరి అవస్తా స్పష్టంగా కనిపిస్తూనే వుంది. దారిలో కనిపిస్తున్న ప్రతి గ్రామంలోనూ, యింతవరకు జరిగిన అల్లకల్లోలాల చిహ్నాలు విరివిగా కనిపిస్తున్నాయి. మానవ శరీర అంగాలు తెగి పడిపోయి రోడ్ల పక్కన యింకా దుమ్ము కొట్టుకుంటూనే వున్నాయి. దుర్గంధం భరించడం కూడ కష్టం అయిపోతోంది. అన్ని గ్రామాలలోనూ గడ్డాలు పెంచిన ముస్లింలు తప్ప యితర జనాభా కనిపించడంలేదు హిందూ, సిక్కుదేవాలయాలు రూపుచెడిపోయి శిథిలాలయాలుగా తయారయినాయి. వాటి గోడల మీద ఉర్దూ భాషలో బూతుమాటలు వ్రాసివున్నాయి మార్గమధ్యంలో భారత ఆఫీసర్లు, ముస్లిం గ్రామస్థులను అడుగుతున్నారు - 'యింకెవరన్నా హిందువులు మీ మీ ఊళ్ళలో మిగిలి వున్నారా?' అని. దానికి ముస్లింలు కొంటె నవ్వులతో మీరే వెదికి చూచుకొండి అని సమాధానం యిస్తున్నారు. కొన్ని గ్రామాలలో మేజర్ జంగ్ జీప్‌లో వీధులన్నీ తిరిగి బాకాలో చెబుతున్నాడు..... హిందువులు

సిక్కులు ఎవరయినా వుంటే వెంటనే వచ్చి కాందిశీకుల శిబిరాలలో చేరిపోండి - అని అతని మాట కాళీయిళ్ళ గోడలకు తాకుతున్నాయి అంతే, ఒక చిన్న గ్రామంలో అయితే - వున్నదే యిరవయి యిళ్ళు, అన్ని యిళ్ళు పాడుపడిపోయినవి. గోడలు, యిళ్ళు ధ్వంసం అయినాయి. ఇళ్ళలో సామగ్రి, ఫర్నిచర్ అంతా చిందర వందరగా వుంది. ఆఖరుకు వీధి కుక్కలు కూడా యెక్కడా తిరుగాడుతూ కనబడడంలేదు కాందిశీకులు యీ దృశ్యాలన్నీ తరువాత తాముగానే చూడగలుగుతున్నారు భారత ఆఫీసర్లు వాళ్లను ఎంతో సముదాయించు దామని ప్రయత్నించినా ఫలితం కనబడడం లేదు.

అదేదో విచిత్రంగా - లాలా కాన్షీరామ్ ఆరోజు చాల ఉత్సహంగా వున్నాడు. దిక్చక్రం వరకు పరుచుకు వున్న పొలాలు, విశాలమైన మామిడి తోపులు, రహదారిని చేరుతున్న కాలిబాటలు రోడ్డు వారగా వున్న నీడ నిచ్చే చెట్లు, చెఱువులలో దున్నపోతులను కడుగుతున్న బలిష్టులు - ఎన్నో బావులు ఎద్దులు, బావుల పెర్షియన్ గిలకలు, చల్లగా వీస్తున్న గాలి.... యివన్నీ తాను తన మాతృ దేశం అయిన పంజాబ్‌ను యింకా వదలిపోలేదని గుర్తుగా నిలిచి వున్నాయి. తన బాల్యం, సంభ్రియాల్ గ్రామంలో గడిపిన రోజులు, . యివన్నీ గుర్తుకు వచ్చాయి. ఈ వాతావరణానికీ దానికీ యేమి వ్యత్యాసం లేదు. అతడు నాలుగు రాత్రిళ్ళు అవిరామంగానే గడిపాడు. అయినా యెందుచేతనో అలసట అనిపించడంలేదు. ముఖ్యంగా ప్రస్రూర్ దాటిని తరువాత వున్న వాతావరణం పంజాబ్ రూపకల్పనకు సాక్షీభూతంగా వుండి అతనికి కొత్త ఉత్తేజాన్ని ఉత్సాహన్ని యిస్తున్నట్లున్నది. బావుల మీద గిలకలు చేస్తున్న శబ్దాలు అతని చెవులకు పసందయిన సంగీతంలా అనిపిస్తున్నాయి. లాలా కాన్షీరామ్ బహుజాగ్రత్తగా అడుగులు వేస్తున్నాడు, అయినా అతని అంతరంగం విచారంలోనే ఆనందంగా పల్లవిస్తోంది.

ఈ కాందిశీకుల ప్రయాణ ప్రవాహం మీద మొదటి దండయాత్ర అతి త్వరలోనే తటస్థించింది. మిషన్‌గన్లమోతలు వింటూ కాన్షీరామ్ గుండెలు అవిసిపోయాయి. హాయిగా వున్నామనే ఆలోచన పటాపంచలయిపోయింది. భారత అధికార్లు అరిచి చెబుతున్నారు - ఎక్కడివాళ్ళు అక్కడ ఆగిపోండి,

కూర్చోండి, రోడ్డు మీద కూర్చుని వుండిపోండి మరేం భయపడకండి.'
లాలాకాన్షీరామ్ యేం జరుగుతుందో తెలుసుకోవడానికి ముందే ప్రభారాణిని వాటేసుకొని నేల మీద కూలబడిపోయాడు. అరుణ్ కోసం అరిచాడు అతను దగ్గరగా వచ్చాడు. అతడు చాందినిని చేతుల్లో బిగించి పట్టుకున్నారు. వాళ్ళు కాన్షీరామ్ దంపతుల చెంతనే కూల బడ్డారు. పద్మిని, బీబీ అమరావతి, సునంద, సూరజ్ ప్రకాశ్, సర్దార్ తేజసింగ్ కొన్ని అడుగుల దూరంలో కూలబడివున్నారు. ఎక్కడి వాళ్ళు అక్కడ ఆగిపోయి నేలను ఆశ్రయించుకు కూర్చున్నారు.

దూరంగా కాల్పులు జరుగుతున్నాయి. ఏమీ కనిపించడంలేదు. 'అల్లాహో అక్బర్' అనే అరుపులు వినవస్తున్నాయి ఆ గర్జనలమధ్య మనుషుల చావుకేకలు అరుపులు స్పష్టంగా వున్నాయి. లాలా కాన్షీరామ్ కుటుంబం కూర్చున్న తావుకు దగ్గరగానే రోడ్డుకు యిరుపక్కల భారత సిపాయిలు తమ స్థావరాలలో వున్నారు ఒక జీపు కొందరు ఆఫీసర్లతో అటు యిటు ప్రయాణం చేస్తోంది ఒక ఆఫీసరు అదే పనిగా అరుస్తూ ఆదేశిస్తున్నాడు. 'అలాగే కూర్చుని వుండండి భయపడవద్దు.'

మిషన్ గన్ పేల్చిన చప్పుళ్లు చాల వినిపిస్తున్నాయి. ఒంటరి కాల్పులు కూడాను. సరికొత్త అలజడి అరుపులు వస్తున్నాయి యిప్పుడు రోడ్డుకు ఎడమవయిపుగా.

ఆ జాగా అంతా బల్ల పరుపుగా చదునుగా వుంది. ఆ ముందు మామిడి తోపులు వున్నాయి ఆపైన యేమున్నదో యేం జరుగుతున్నదో తెలిసిరావడం లేదు. ఈ తోపులకు ఆవలనుంచే యీ దొమ్మీ జరుగుతూ వుండాలి.

ప్రయాణీకుల గుంపులకు అంటి పట్టుకు వుండి వాళ్ల రక్షణ భారం మాత్రం వహించాలని భారత సైనికులకు ఆదేశాలు వున్నాయి పై వాళ్లు పిలిస్తే తప్ప ముందుకు వెనక్కు కదలకూడదు. నాలుగవ యూనిట్‌కు సంబంధించిన సిపాయిలు వాళ్ల దగ్గరే కనిపెట్టుకు వుండి పోయారు. ఏం జరుగుతోందో జాగ్రత్తగా గమనిస్తూ ఆదుర్దాగా ఎదురు చూస్తూ వున్నారు. వాళ్ల చేతుల్లో

రైఫిల్స్, స్టెన్ గన్లు సిద్ధంగా వున్నాయి ఆకాశం వంక తేరి పార చూస్తున్నారు వాళ్ల ముందున్న గుంపులకే పరిమితం అయివుంది, అల్లరి దొమ్మీ అంతా

అలాగే రెండు గంటల సేపు అక్కడ నిలిచి వుండి పోయారు భయం ఆదుర్దాలతో జనం కొట్టుమిట్టు లాడుతున్నారు. చాలమంది వణికి పోతున్నారు దైవప్రార్థనలు చేసుకుంటున్నారు కొందరు ఆడవాళ్లు యేడవడం ప్రారంభించారు. కాల్పుల మొదటి వరుసలు సర్దుమణిగాక తేజసింగ్ లేచి వెనక్కు వెళ్లాడు లారీలు వున్న తావుకు, ఈషర్ కౌర్ ఎలా వుందో చూడటానికి. సూరజ్ ప్రకాశ్ అతనితో పాటు వెళ్లాడు అరుణ్ చాందినిని యింకా బిగియ బట్టుకునే కూర్చున్నాడు. ఆమె భయంతో ఆకులా అల్లల్లాడి పోతున్నది. ఆమె అతనిమీదకు పూర్తిగా వాలిపోయి కళ్లు మూతలు పడకుండా చూస్తూవుండి పోయింది. పద్మిని తాను కూర్చున్న చోటి నుంచే అంతా గమనిస్తూ వుండింది అరుణ్ చాందినిని అంత బిగిగా పట్టుకు కూర్చోవడం ఆమెకు రుచించలేదు భయ విహ్వాలమై పోయిన అమ్మాయి కళ్లల్లోకి చూచింది ప్రభారాణి కదలకుండా కూర్చున్నచోటనే వుండిపోయింది. లాలా కాన్షీరామ్ మోకాళ్ల మీద పైకి లేచాడు. సిపాయిలను 'యేం జరుగుతోంది?' అని అడిగాడు. వాళ్లు తమకేమీ తెలియడం లేదని సమాధానం చెప్పారు.

మధ్యాహ్నంపూటకి క్విలా సోభాసింగ్ చేరుకున్నాక గాని వాళ్లకు వివరాలు యేమీ తెలిసిరాలేదు. పాదయాత్రికులను అటకాయించారు, దొమ్మీ చేశారు. రెండు, మూడు యూనిట్ల మీద కత్తులు దూయడం కూడా జరిగింది. మొదటి యూనిట్ క్విలా సోభాసింగ్ చేరుకుంది. అది పర్సూర్‌కు యేడు మైళ్ల దూరంలో వుంది. వాళ్లు అక్కడ మకాం చేయటానికి యేర్పాట్లు చేసుకుంటున్నారు. వెనకాల వున్న యూనిట్లు యింకా పర్సూర్ కాందిశీకుల శిబిరాన్ని వదలనే లేదు. రెండవయూనిట్ మామిడి తోపులను దాటిన తర్వాత - కొంత దూరం పోయిన మీదట వాళ్లకు తుపాకి కాల్పుల చప్పుళ్లు, 'అల్లాహో అక్బర్' 'యా అలీ' అనే నినాదాలు వినవచ్చాయి. వాళ్లకు కుడి పక్కగా కొందరు అశ్వికసైనికులు అగుపించారు. భారతసైన్యం వాళ్ల మీద కాల్పులు ప్రారంభించింది. వాళ్లు తమకు ఎడమ వైపున వున్న మామిడి తోపులోనికి

పరుగుతీశారు. కుడి వైపునుంచి వచ్చిన అలజడి వాళ్లను భయపెట్టి కుడివైపు పరుగెత్తేట్లు చేయడానికే. మామిడితోపులో చాలమంది ముస్లిములు సాయుధులై వున్నారు. ఇక అప్పుడు రెండవ ఎదిరింపు మొదలయింది. కాందిశీకులు, ముస్లిములు ముఖాముఖి తలపడ వలసి వచ్చింది. భారత సైన్యం యేమీ సహాయం చేయలేక పోయింది. అందరూ కలిసి పోయారు గనుక యిప్పుడు కాల్పులు జరపటానికి కుదరదు, కాలిస్తే తమ మనుషులకే హాని! బాయొనెట్లు బిగించి తోటలో ప్రవేశించారు. వాళ్లలో చాలమంది చనిపోయారు, కాందిశీకులలో వందలాది సంహారం అయిపోయారు. కొంతసేపటికి కల్లోలం సద్దు మణిగింది. ముస్లిం గుంపులు గుఱ్ఱాలమీద దౌడుతీసి వెళ్లిపోయారు. కాందిశీకులలో కొందరు యువతులను తమతో తీసుకుపోయారు. గాలిలో దుమ్ము ఆకాశం దాకా చెలరేగింది.

ఆ పొలాల వెంబడి చాల గ్రామాలు వున్నాయి. దోపిడి గాళ్లు యీ గ్రామాలలోనికి వెళ్లిపోయారు. ఇప్పుడు వాళ్లను వెంబడించడమా, వద్దా అనేది మేజర్ జంగ్ బహదూర్ నిర్ణయించుకోవాలి. ఈ లోయలోను, చెట్ల మధ్య వాళ్లకు బోలెడు రక్షణ వుంటుంది గనుక ఆపని ఉచితం కాదని అతను అనుకున్నాడు. కాందిశీకులలో మిగిలినవాళ్లను రక్షించగలిగితే చాలు తాను. ఈ దొమ్మీ చిన్నదే, కొద్ది మందిని మాత్రమే పొట్టన పెట్టుకుంది. మిగిలిన వాళ్లను రక్షణ స్థలానికి తీసుకు పోవడం యుక్తమైన పని.

ఈ కల్లోలం జరిగిన స్థలం దగ్గరకు లాలా కాన్షిరామ్, అతని గుంపు చేరుకునే సరికి రోడ్డు నిండా అనేక వస్తువులు చిందర వందరగా పడి వుండడం, తలపాగాలు, ఆడవాళ్ల పరదాలు, చెప్పులు, గొడుగులు, ఆహార పదార్థాలు... యిలాంటివన్నీ చెల్లా చెదరయి భీభత్సంగా పడివుండడం కనిపించింది. రోడ్డు మీదనుంచి తోపువైపుకు - కుడి వేపునుంచి వస్తున్న గాలుల్లో వాటిని ఎడమవైపు తరుముకు పోయినట్లుగా అవన్నీ మ్రూలలకు చేరి పడి వున్నాయి. రోడ్డు వారగా ఒక మైలు దూరం వరకూ విస్తరించి వుంది తోట. ఆ పొడుగునా మృత దేహాలు పడిపోయి వున్నాయి. రోడ్డు మీద కూడా కొన్ని శవాలు జబ్బు చేసి, అలసటతోను జనం చనిపోయినప్పుడు వాళ్లను బంధువులు

రోడ్డు వారగానే దహనం చేసి ముందుకు వెళ్లి పోతారు. ఈ శవాలను వాటి పాటికి వాటిని వదలి వేసి వెళ్లడమే మంచిదనిపించిది. లెక్కకు మిక్కిలిగా వున్నాయి. ఇవన్నీ పోగు చేస్తూ కూర్చుంటే ఎన్నో - ఎంతో సమయం వెచ్చించాల్సి వస్తుంది. సాయంకాలం పూట కొందరు వచ్చి ఆ పనిని తీరుబడిగా చేయవచ్చును. ఇప్పటికి తక్షణ కర్తవ్యం - యీ కాందిశీకుల గుంపులను, మిగిలిన వారిని, సురక్షితస్థానం అయిన క్విలా సోభాసింగ్‌కు చేర్చడమే!

నడుస్తున్న వాళ్లు శవాలను దాటుకుంటూ వెళ్లవలసి వచ్చింది. ఆడవాళ్లు దుపట్టాలు ముఖం మీద వేసుకున్నారు ఇంకా దుర్వాసన ప్రారంభం కాలేదు. మృతులు చాలామంది బాగా దుస్తులు వేసుకునే వున్నారు. ఆడవాళ్లు మాత్రం - కొందరు - రొమ్ములు నగ్నస్థితిలో, పక్కన శిశువులతో పడి వున్నారు పిల్లల ముఖాలు రోడ్డును కరుచుకు వున్నాయి. మగవాళ్లు బోర్లాను, పక్కలకు పడివున్నారు వాళ్ల నోళ్లు తెరుచుకునే వున్నాయి. కొందరు స్త్రీలు మూటల్లాగ పడిపోయారు. నేలమీద రక్తపు జాడలు వున్నాయి. చెట్ల మీద కూడా నెత్తురు మరకలు. మృత శరీరాలు మాత్రం దాదాపు శుభ్రంగానే వున్నాయి. వాళ్లు అసహజంగా వాలిపోయి వున్నారు గనుకనే చనిపోయారనుకోవలసి వస్తోంది.

తోట దాదాపు ముగిసిపోతూ వుండగా, లాలాకాన్షీరామ్ డాక్టర్ చంద్రభాను శరీరాన్ని చూచాడు. ఒకకాలు పడిపోయిన చెట్టుకొమ్మ మీద వుంది. చేతులు బార చాపుకు వున్నాడు. అతని కళ్లు తెరుచుకునే వున్నాయి, రోడ్డు మీద పోతున్న వాళ్లను గమనిస్తున్నాడు అన్నట్లుగా.

లాలా కాన్షీరామ్ ఈ శరీరాన్ని చూడడం తోటే తడబడ్డాడు. ప్రభారాణి ముఖాన్ని అవలకు జరిపేయాలనుకున్నాడు, కాని ఆమె అంతలోనే డాక్టర్ చంద్రభాను మృతదేహాన్ని గమనించింది. 'అతని భార్యయేమయిందో!' అన్నాడు లాలా కాన్షీరామ్.

'పిల్లల మాట యేమిటి?'

వాళ్లు క్విలా సోభాసింగ్ చేరుకున్న తర్వాత తెలిసి వచ్చింది, చంద్రభాను భార్య - ముగ్గురు పిల్లలు ప్రాణాలతో బతికి బయట పడ్డారని, పందొమ్మిది,

పదిహేడు యేళ్ల అమ్మాయిలను - అతని కూతుళ్లను - దుండుగులు తమతో తీసుకు వెళ్లారు. తతిమ్మా వాళ్లకు కూడా తమ పరిచయస్థులను గురించిన యిలాంటి దారుణ పరిణామాలే తెలిసి వచ్చాయి

మరుసటి రోజు కాందిశీకుల గుంపులు క్విలా సోభాసింగ్‌నుంచి నారోనాక్‌కు తరలుతున్నప్పుడు యిదే మాదిరి ఎదురుపోరాటం తటస్థించింది. ఈ మారు చివరి యూనిట్లు దాడికి గురి అయినాయి. అక్కడ యేం జరిగిందో ముందున్న యూనిట్లకు సుతరామూ తెలియరాలేదు. ఎన్నో విపత్తులు వెనకాల ఆర్మీమనుషులు చాలమంది వున్నారు. వారే యీ దెబ్బలు తినవలసి వచ్చింది. అయినా - మొత్తంమీద రెండు వందల మంది హిందువులు, సిక్కులు హతులయ్యారు. చాలా మంది స్త్రీలను యెత్తుకు పోయారు గాయపడిన వారి సంఖ్య వందలకు పెరిగింది.

అలీపూఃర్ సియాయిదీన్ అనే ముస్లింలు ఎక్కువ మంది వున్న ప్రాంతంలో రెండవ దొమ్మీ జరిగింది. యూనిట్లలో ముందుభాగం ఈ సరికే మంజోక్ చేరుకున్నారు. ఈ గ్రామం క్విలా సోభా సింగ్ నుంచి యేడు మైళ్ల దూరంలో వుంది. కాందిశీకులు అవిశ్రాంతమయిన రాత్రి గడిపింది యిక్కడనే. మంజోక్ గ్రామంలో నలభయి, యాభయి కుటుంబాలు మటుకే వున్నాయి. వీళ్లనుంచి ఎలాంటి విపత్తు సంభవించదనుకున్నారు. కాని ఆలీపూర్ సియాయిదీన్ దరిదాపులలోనే వుంది అక్కడి నుంచి ఒక తండావచ్చి ఆ రోజు ఎదుర్కొన్నది ఆ రాత్రి కాందిశీకులు ఎక్కువగా విడిది యేర్పాట్లు చేసుకోలేదు, చాలమంది 'షూస్' కాళ్లకు వుంచుకునే నిద్ర పోయారు. వంటలు చేసుకోలేదు. నిన్న మిగిలిన భోజన సామాగ్రే సర్దుకు తిన్నారు. రాత్రంతా గాయపడిన వాళ్లు బాధపడుతూ మూలుగుతున్నారు. మరునాడు తెల్లవారడం తోటే ప్రయాణం ఆరంభం అయింది. జిల్లా ముఖ్యపట్టణం అయిన నారోవర్ ఆరుమైళ్ల దూరంలోనే వుంది. అక్కడ కాందిశీకుల శిబిరం వుంది. ఎంత త్వరగా అక్కడకు చేరుకుంటే అంత క్షేమకరం

ఉదయం పదిగంటలయింది. సియాల్ కోటనుంచి బయలుదేరి తొమ్మిదో రోజు. ముప్పైఆరుమైళ్ల దూరం వచ్చారు. ముందున్న యూనిట్లు

నారోవర్ శిబిరాల మేరకు చేరుకున్నాయి. అక్కడి కాందిశీకులు లోనికి వస్తున్న వారిని చూడటానికి గాను బారులుతీరి నిలుచున్నారు. వాళ్ల సంఖ్య పదిహేను వందల వరకు తరిగిపోయింది. వస్రూర్ దాటిన తరువాత ఎవరూ స్నానాలు చేయలేదు కొందరు కొన్ని రోజులుగా గడ్డం కూడా చేసుకోలేదు. భోజన సామాగ్రి తరిగిపోయింది. కొందరయితే రెండు రోజులుగా యేమీ తినలేదు. అందరూ దిగజారి పోయారు. శిబిరంలోని కాందిశీకులు వీళ్లకు హుషారుగా చేతులు ఊపి స్వాగతం చెప్పారు కాని వీళ్లలో ఎవరూ ఆ స్వాగతానికి అనుస్పందన చెప్పలేదు. వాళ్లు నేరుగా నడిచి తమ గుడారాలు ఎక్కడో కనుక్కోసాగారు. వాళ్ల మీద రెండు దాడులు జరిగినాయనే వార్త అప్పుడే యిక్కడకు చేరింది. వీళ్లకోసం వేడి వేడి టీ తయారుగా వుండింది. మగ్గులలోను, టంబర్లలోను టీ యిచ్చారు. వీళ్లూ గటగట దొరికినంత వరకు తాగేశారు. తరువాత డీలా పడిపోయి తమ సామాన్ల మూటల మీదనే పడుకుని నిద్రపో నారంభించారు. తీరికగా సాయంత్రంపూట, నిద్రనుంచి లేచిన తర్వాతగాని తమ వస్తు సామాగ్రి సరిచూచుకుని సర్దుకు కూర్చోలేక పోయినారు.

నారోవర్ సబ్ - డిస్ట్రిక్ట్ ముఖ్య పట్టణం. ఊళ్లో విద్యుద్దీపాలు వున్నాయి. శిబిరంలో కూడా విద్యుద్దీపాలు వెలుగుతూన్నాయి. అందరికీ విశ్రాంతిగా వుండేందుకు వీలయినన్ని డేరాలు వున్నాయి. ఇక్కడ ఆసుపత్రి కూడా వుంది. ఇంకా యితర సౌకర్యాలు కొన్ని వున్నాయి. మేజర్ జంగ్ బహదూర్ సింగ్ యిక్కడ ఒక వారం రోజుల పాటు విడిసి వుందామని నిర్ణయించాడు. కాందిశీకులకు అలసట తీర్చుకోవటానికి, తిరిగి ప్రయాణం చేసేందుకు అవసరం అయిన సత్తువ సంపాదించటానికి ఆ మాత్రం విరామం అవసరం.

# అయిదవ అధ్యాయం

నరోవర్‌లో వుండగా అరుణ్‌కు రెండు విపర్యయాలు జరిగాయి. ఒకటి· అతనో మనిషిని చంపాడు. రెండు. అతన్నుంచీ చాందిని దూరం అయిపోయింది, మంచికే!

నరోవర్ ఒక మాదిరి పట్టణం. ఎక్కువ మంది ముస్లిం జమీందార్లు అక్కడ వుంటారు. దానికి దగ్గరలోనే జఫర్‌వాల్ అని మరో పట్టణం వుంది. ఈ రెండు పట్టణాలకు సూటిగా ఓ రహదారి వుంది. ఆ పట్టణంలో కూడా జమీందారులు అధిక సంఖ్యలోనే వున్నారు.

డేరాబాబా నానక్ సరిహద్దు నరోవర్ నుంచి ఎనిమిది మైళ్లు మాత్రమే. పంజాబ్ అయిదు నదులలో ఒకటి అయిన 'రవి' అక్కడ నుంచి ప్రవహిస్తుంది. రాష్ట్రం ఉత్తరప్రాంతంలో యీ నదే రెండు కొత్త ప్రభుత్వాలకు సరిహద్దు. ఎక్కువ మంది హిందువులు, సిక్కులు యీ నదిని దాటి వెళ్లిపోయి భారత ప్రాంతాన్ని సురక్షితంగా చేరుకోగలిగారు. అయినా యింకా ఒక వేయి మంది కాందిశీకులు నరోవర్ శిబిరంలో చిక్కుకు పోయివున్నారు. సియల్ కోట్ నుంచి బయలు దేరి వస్తున్న యూనిట్లతో వీళ్లు కూడా కలువవలసి వుంది. అక్కడి శిబిరాలు అత్యధిక సంఖ్యలో కాందిశీకులను యిక్కడ రక్షిస్తూ వచ్చాయి. ఇప్పుడయితే గుడారాలు, డేరాలు ఎన్నో వరుసలు కాళీగా వున్నాయి. సియాల్ కోటనుంచి వచ్చిన యూనిట్లను ముందుగా యీ డేరాలు ఆక్రమించుకోమన్నారు. తరువాత అవసరం అయితే కొత్తవి వేయించ వచ్చుననుకున్నారు.

లాలా కాన్షీరామ్ పాత డేరాలను రెండింటిని సంపాదించాడు తన గుంపుకోసం. కొత్తగా వేస్తున్న వాటికంటె యివి నిజానికి చిన్నవి. అయినా సౌకర్యాలకు, యితర అనుకూలాలకు యివే మిన్న. ఒక డేరాలో - తాను, ప్రభారాణి, అరుణ్, పద్మిని, చాందిని. రెండో డేరాలో - బీబీ అమరావతి, సునంద, సురాజ్ ప్రకాశ్, తేజసింగ్, ఈషర్ కౌర్. పద్మినికి చాందినిని అరుణ్ కౌగిలిలో చూసినప్పటినుంచి మనసులో బాధగానూ భయంగానూ వుంది. తేజ

సింగ్‌ను, ఈషర్ కౌర్‌ను యీ డేరాకు పంపి తాను కూతురుతో సహా రెండవ డేరాకు మారుదామనుకుంది. ఈషర్ కౌర్ దుఃఖంలో వుంది గనుక లాలా కాన్షీరామ్ దగ్గరనే పెట్టుకుని ఊరడిస్తూ వుండడం యుక్తమని సూచనగా మనవి చేసుకుంది. కాని లాలా, ప్రభారాణి కూడా దీనికి అంగీకరించలేదు. వాళ్ల ప్రతి పనికీ చాందిని మీదనే ఆధారపడుతున్నారు. అందుచేత తల్లి కూతురు తమ వద్దనే వుండిపోవాలని అన్నారు. అరుణ్‌కు ఆరోజు తండ్రి అంటే యెంతో ఆత్మీయత ఉబికిపోయింది. ఎంతో ఆనందించాడు తండ్రి ఆ నిర్ణయం తీసుకున్నందుకు.

ఆ సాయంకాలం వాళ్లు బాగా అలసిపోయివున్నారు. కాస్త భోజనాలు ముగిసిన తరువాత ఒళ్లు తెలియకుండా పడుకుని నిద్రపోయారు. ఇంకా పక్కలు వేస్తూ వుండగానే అరుణ్ తన కోరికలకు రూపకల్పన చేయనారంభించాడు. ఎన్నో రోజుల విరామానంతరం యీ రోజు చాందినిని తిరిగి తన కౌగిలిలోనికి తీసుకో బోతున్నాడు. అతను వేచివుంటే బాగానే వుండేది కాని మనసు ఆగడంలేదు. పద్మినికి తమ విషయం అనుమానంగా వున్నదని అతను ఎరుగును. కాని ఎంతసేపని ఆమె నిద్రపోకుండా కూర్చుండిపోగలదు ? ఆమె తెలివిగలదే కావచ్చును, కాని అరుణ్ అంతకు తీసిపోయిన వాడేమీ కాదు. ఏదో చప్పుడు చేస్తాడు ఉన్నట్లుండి. ఆమె కదిలినట్లయితే యింకా మెలుకువగా వున్నట్లే లెక్క. ముందు ఒక గంట సేపు ఎలాంటి చప్పుళ్లు చేయకుండా వుండడం మంచిది. తరువాతనే పరీక్ష చేయవచ్చును. చాందిని వైపు మెల్లగా దొర్లాలి. ఇప్పుడు రాత్రిళ్లు చలిగా వుంటున్నాయి. అందుకని మొద్దు దుప్పట్లు, కంబళ్లు వాడుతున్నారు... ఆ తరువాత ఎలాగూ చాందిని పక్కన చేరితే కావలసినంత వేడిమి. ఏదేనా పొరపాటు జరిగి తాను నేరుగా పద్మిని పక్కనే చేరిపోతే యేమవుతుంది? - పొరపాటు జరిగితే యింకేమన్నా వుందా? అతనికి నవ్వు వచ్చింది. ఊహు. ఇటువంటి పొరపాటు నేను చేయను అనుకున్నాడు. జాగ్రత్తగా వుండడం అవసరం. అతను తనలో తాను యేదో ఇంగ్లీషు ట్యూన్ పాడుకోవడం మొదలు పెట్టాడు. ప్రభారాణి అతని సంగీత స్వరం విననే విన్నది. తలెత్తి

చూచింది. అతను నవ్వాడు; పాట కొనసాగిస్తూనే. చాందిని యింకా పక్కలు అమరుస్తూవుంది. కదులుతున్న ఆమె శరీరం అతని మనస్సులో కొత్త కదలికలు తీసుకు వస్తోంది. ఈ రాత్రి ఎలాగయినా ఆమెను దగ్గరకు చేర్చుకోవాలి. బహు జాగ్రత్తగా మెలిగి తన సంకల్పం నెరవేర్చు కోవాలి.

అతను దుప్పటి మీద తలవాల్చి - పద్మినికి ఒక గంట సమయం యివ్వాలనుకుంటూనే - తనకు తెలియకుండానే నిద్రలో కూరుకుపోయాడు. తెల్లవారి నిద్రలేచిన తర్వాతగాని అతనికి రాత్రంతా వృధాగా పోయిన సంగతి గమనానికి రాలేదు. గబగబ లేచి, దుప్పటి పక్కకు పడేసి చుట్టూ కలయ చూచాడు. సూర్యుడు అప్పుడే తేజోవంతుడై, డేరాలోనికి తన కిరణాలను ప్రసరిస్తున్నాడు. తండ్రి, తల్లి, చాందిని యింకా ముసుగుల్లోనే మునిగివున్నారు. పద్మిని మాత్రం తన పక్కమీద లేచి కూర్చుని అతని వంక తేరి చూస్తోంది. ఆమె రాత్రంతా తన కోసం అలాగే కూర్చుని వుండలేదుగదా! తలమీద ఓ శాలువ కప్పుకుంది. ఏదో ప్రార్థన శ్లోకాలు చదువుకుంటున్నట్లు ఆమె నోరు ఆడుతూ వుంది. ఆమె చూపులు మాత్రం అరుణ్ వంకే వున్నాయి ముఖం మటుకు గంటు పెట్టుకు వుంది. అరుణ్ తన నిరాశను వ్యక్త చేయకుండా 'అప్పుడే ఎందుకు లేవడం?' అనుకుంటూ మళ్ళీ పక్కమీదకు దొర్లాడు. ఇంట్లో అందరూ లేచేంత వరకు యీ మారు అతను పక్కమీద నుంచి కదలలేదు. పద్మినిని ఒంటరిగా చూడవలసి రావడం అతనికి భయవహం అయింది.

ఆరోజు సూరజ్ ప్రకాశ్ అరుణ్‌తో 'ఈమధ్యాహ్నం పట్టణాలలో స్త్రీలను నగ్నంగా వీధుల్లో నడిపిస్తారట. నీవు వెళ్లి చూచి వస్తావా?' అన్నాడు.

అరుణ్ అప్పుడు తనను తాను సంబాళించుకుంటున్నాడు. అతను లేచిన తర్వాత పద్మిని అతన్ని గమనించే పని పెట్టుకోలేదు. బహుశ తను భయంతో లేనిపోనివి ఊహించుకుంటున్నాడేమో చాందిని అతనికి ఫలహారం పెట్టింది. పద్మిని డేరాలోనే వుంది. అయినా ఏమీ జోక్యం కలిగించుకోలేదు. ఆమే తెచ్చియిస్తే సరిపోయేది. కాని అలా చేయలేదు. టీ గ్లాస్ చాందిని చేతుల్లోంచి తీసుకుంటూ అరుణ్ కావాలనే తన వేళ్ళు తాకించాడు. పద్మిని యిది గమనించింది కాని ఆమె ముఖం గంటుపెట్టుకోలేదు

అరుణ్ సూరజ్ చెప్పిన మాటలు విని ముందు ఆనందించాడు. తరువాత ముఖం గంభీరంగా పెట్టి 'ఎవరా నగ్న స్త్రీలు? ఊరేగింపు చేస్తున్నది ఎవరు? అనడిగాడు.

ఉత్సాహంతో చేతిలోని సిగరెట్ తిన్నగా వుండడం లేదు సూరజ్‌కు. అతని చేతి వేళ్ళు అలవోకగా కదలుతున్నాయి. ముఖంలో మొరటుతనం చోటు చేసుకుంది.

'సరోవల్‌లోని ముస్లింలు - ఇంకెవరని? హిందూ స్త్రీలను' అని జవాబు చెప్పాడు.

శిబిరంలోని వారంతా ఆ కబురు విన్నారు. కాందిశీకుల శిబిరంలో యింత మంది హిందు, సిక్ స్త్రీలు వచ్చి వున్నారని తెలుసుకుని ముస్లింలు ఉబలాట పడిపోతున్నారు. రాత్రికిరాత్రి యీ సమాచారం శిబిర వాతావరణాన్ని మార్చివేసింది. నిన్నటి దాక స్మశాన శాంతి యిక్కడ ప్రవర్తిల్లుతూ వుంది వేయిమంది కాందిశీకులు యిక్కడ వున్నారన్న మాటేగాని అందరూ వయోధికులు రోగిష్టు వాళ్లను. తమంత తాము సరిహద్దుదాక నడిచి వెళ్ళలేని వాళ్లే. ఇప్పుడు శిబిరంలో కొత్త వాళ్లు వేలసంఖ్యలో వచ్చి చేరారు: అందుచేత నగరంలో మళ్ళీ మతోన్మాదం పాముపడగలాగ పైకిలేచింది. హిందువులను దెబ్బతీయాలంటే యేదయినా యిలాంటి ఘాతుక చర్యే చేయాలి. శిబిరం మీదకు దండెత్తి వచ్చేవాళ్లే కాని అందుకు సమయం కావాలి. ఏదో ఒకటి త్వరత్వరగా చేయాలనే ఆతురత ఒకటి వాళ్ళను వేధిస్తూవుంది. వాళ్ళ ఆధీనంలో చాలమంది హిందు, సిక్కుస్త్రీలు వున్నారు. ఎత్తుకుపోయిన చాలమంది ఆడవాళ్లను స్వంత యిళ్లల్లోకిలాక్కు పోయారు ఒక్కో ముస్లిం - ఒక్కో స్త్రీని గుంజుకువెళ్లి తన ఆస్తిలాగనే యింట్లో వుంచేసుకున్నాడు ఇతర ముస్లింల సమ్మతి తీసుకుని, యీ ఆడవాళ్ళకు మతం మార్పిడి చేయించాడు, పెళ్ళిచేసుకున్నాడు తతిమ్మా వాళ్ళు ఉమ్మడి ఆస్తిగా వుండి 'రేప్'కు గురి అయిపోతూవున్నారు. సామూహికమైన 'రేపులు' బహిరంగ సమావేశాలలోనే జరుగుతున్నాయి. 'రేపు'తో ఉర్కోవడం లేదు తమ ఉల్లాసంకోసం కొందరి స్తనయుగ్మం కత్తిరించేస్తున్నారు, చంపివేస్తున్నారు కూడా. చాల మంది గర్భిణిస్త్రీల కడుపుల కోసేశారు. ఉమ్మడి

రేవులు కోసం విచిత్రానందంకోసం కొంతమందిని అట్టేవుంచుకున్నారు వాళ్ళ యిష్టం వచ్చినట్లు - యీ స్త్రీలను వస్తువులుగా వాడుకుంటున్నారు. ఈ దుశ్చర్యలు మళ్ళీ మళ్లీ జరుగుతూ వస్తున్నాయి

ఇటీవల నరోవాల్‌కు కొని రాబడ్డ కొందరు యువతులను నడివీధిలో నగ్నంగా తిప్పాలని నిర్ణయించుకున్నారు ఆ నగరవాసులు. ఇటువంటి సమారంభాలు జరిగేటప్పుడు స్దానిక అధికారులు, పోలీసు, మిలిటరీ ఎటువంటి జోక్యము కలిగించుకోదు. ఒకే ఒక షరతు యేమిటంటే యిలాంటి ఊరేగింపు కాందిశీకుల శిబిరం చెంతకు మాత్రం తీసుకు వెళ్లగూడదు. అలా జరిగితే కాందిశీకులలో ఉద్రేకాలు చెలరేగి - పోట్లాటలకు కారణం అవుతుంది - అని. ఈ షరతు ఊరేగింపు జరుపదలుచుకున్నవాళ్ళకు ఎలాంటి అభ్యంతరమూ అనిపించలేదు. దీనిని గురించి వార్తలు ఎలాగూ శిబిరంలో వారికి చేరతాయి. వాళ్ళు కుమిలి కుమిలి చస్తారు. ఆ మాత్రం చాలును.

'మన గుంపులలోనుంచి కొందరు యువతులను తీసుకువెళ్లారు గదా. వాళ్లను కూడా ప్రదర్శించరు గదా!' అన్నాడు కాన్షీరామ్ యీ వార్త విన్నాక.

సూరజ్ ప్రకాశ్‌కు యిటువంటి అభ్యంతరంయేంలేదు. గొంతు తగ్గించి 'నువ్వు వెళ్లి చూస్తావా, లేదా?' అని అడిగాడు అరుణ్‌ను. మధ్యాహ్న భోజనం అయిన తరువాత వాళ్లిద్దరూ యెవరితోను చెప్పకుండా శిబిరం నుంచి అంతర్ధానం అయిపోయారు.

సూరజ్‌కు ఉత్సాహం ఊబికిపోతోంది. పట్టణంలో ప్రవేశించిన తరువాత యిది మరీ ఎక్కువ కాసాగింది. వాళ్లు యిద్దరు దాదాపు ముస్లిముల మాదిరే వేషధారణ, వాలకం మార్చుకున్నారు. తాత్కాలిక అవసరం కోసం ముస్లిం పేర్లు కూడా అనుకున్నారు. మెడల్లో రుమాళ్లు చుట్టుకున్నారు. సుంతీ అయిన వాళ్ళ లాగ కనిపింప చేయడం ఎలానో సూరజ్ అరుణ్‌కు మళ్లీ ఒకమారు పాఠం చేప్పాడు.

సియల్ కోట నుంచి బయలుదేరటానికి ముందు సూరజ్ మరో శిబిర వాసిదగ్గర్నుంచి సైకిలు కొనుక్కున్నాడు. పాదయాత్రలో తన పిల్లలను యీ సైకిలు మీదనే తీసుకువెడుతున్నాడు. ఇప్పుడు దీని మీదనే పట్టణానికి

వెడదామని అరుణ్‌కు సూచించాడు తరువాత నడిచి వెళ్లడమే శ్రేయస్కరం అనితోచింది. పట్టణం యిక్కడకు అరమైలు దూరంలో మాత్రమే ఉంది. బైసికిల్ లేకుండా వుంటే బజార్లలో తిరగడానికి అన్నీ చూడటానికి మరింత వీలుగా వుంటుంది

ఈ వీధుల పేర్లు కూడా వాళ్ళకు తెలియవు నిజానికి తెలియవలసిన అవసరం కూడాలేదు. ఎందుకంటే యిక్కడ వున్నది రెండే రెండు వీధులు. ఒకదానికొకటి నిలువుగా వుంటాయి. శిబిరంలోనుంచి నేరుగా నడుచుకుంటూ వెడితే వీటిలో ఒకటి తగులుతుంది. వాళ్ళు యీ బజారుకు చేరుకోగానే ఊరేగింపు రెండో బజారులో జరుగుతుందని తెలియ వచ్చింది. అప్పటికే వీధి వారగా జనం పోగయివున్నారు రెండు వీధుల కూడలిలో జనం యిసుకవేస్తే రాలకుండా పోగయ్యారు.

ఇంతకంటే దిగజారిన, నికృష్టమయిన జన సందోహం మరెక్కడా వుండదని పించింది అరుణ్‌కు. ఆ జనం అపరిశుభ్రంగా, మోటుగా వున్నారు. వాతావరణం అంతా కర్కశంగా, యేమాత్రం కోమలత్వం లేకుండా వుంది. ఈ మనుషులు, వీధి, కట్టడాలు ... అన్నిటి మీద యేదో మొద్దుతనం పులిమినట్లు, అనిపిస్తోంది. జనంలో చాల మంది అర్ధచంద్రాకారపు గడ్డం పెంచుకున్నారు. కొందరు మాత్రం గడ్డం శుభ్రంగా గొరిగించుకునే వున్నారు అందరి నోళ్ళలోను, 'పాన్'లు బిగబట్టి వున్నాయి. రోడ్డు మీదంతా ఎర్రటి ఉమ్ములు అట్టలకట్టి వున్నాయి. 'అరుణ్, సూరజ్‌కూడా పాన్ కొనుక్కుని వేసుకున్నారు. పై అంతస్తు యిళ్ళ కిటికీలు, ద్వారబంధాలు మూసివున్నాయి. కింది దుకాణాలు మాత్రం తెరిచి వున్నాయి గుంపుల్లో జనం దుకాణాల ముందు మెట్లమీద బైఠాయించడమో నిలబడి వుండడమో చేస్తున్నారు. తతిమ్మావాళ్ళు బజారు వీధి పొడుగునా పంక్తులు కట్టి నిలబడ్డారు, నాలుగు వరుసలుగా. రోడ్డు మీద అమ్మకం దారులు (స్వీట్లు, టాయ్‌లెట్ సామాన్లు అమ్మేవాళ్లు) తమ సరుకుల బల్లను ఒక పక్కకు నెట్టివేశారు. ఈ జన సందోహంలో యిదో ప్రత్యేక స్థలంగా రూపొందింది. అప్పటికి మధ్యాహ్నం మూడు గంటలు మాత్రమే అయింది. దుకాణదారులు తమ నూనె లాంతర్లు వెలిగించేశారు. సూర్య రశ్మిలో వాటి

పొగ అంతటా వ్యాపించి వాతావరణాన్ని కొంతలో కొంత కలుషితం చేస్తోంది. పాన్, సిగరెట్ దుకాణాలనుంచి కూడా పొగలు బయలు వెడలుతున్నాయి. మధ్య భారతానికి చెందిన ముస్లిములు కొందరు కనిపించారు అక్కడ అరుణ్‌కు, అయినా యిదంతా పంజాబ్ ముస్లిముల గుంపుగానే అనిపిస్తోంది. అందరూ మగవాళ్లే - మచ్చుకైన ఒక్క స్త్రీ కూడా అగుపించడంలేదు. ధృఢకాయులయిన మగవాళ్ళు దండలు కండలు తీరిన వాళ్ళు. జుట్టు అంట కత్తెరవేసుకుని బాగా నూనె రాసుకున్నారు. కళ్ళు కాటుక పొరలతో నల్లగా నిగనిగలాడుతున్నాయి. మామూలు చొక్కాలు, లుంగీలు ధరించి వున్నారు. మధ్య మధ్య లుంగీపొర పైకి ఎత్తి కాళ్లకు గాలి తగిలేట్లుగా విసురుకుంటున్నారు. వాళ్లలో చాలమందికి తాయిత్తులు రక్షరేకులు కూడా వేలాడుతూ కనిపిస్తున్నాయి. వెండి, రాగి గొట్టాలతో, నల్లని తాడుతో మెడకు చేతులకు మణికట్టుకు చుట్టుకున్నారు. అయితే అందరి నీ ఒక గుంపుగా - అందరిలోనూ సామాన్య ధర్మంగా - చేస్తున్నది ఒక విషయం వుంది. అది వాళ్ల ముఖాలలో గూడుకుట్టకున్న చూపు. రాగ రంజితమై ఉత్సుకతమై ఇంద్రియలోలత్వంలో తడిసిపోయిన చూపు అందరి ముఖాలలోను కొట్టవచ్చినట్లుగా కనిపిస్తోంది. అంతేకాదు. అందరి కళ్లు తూర్పుదిక్కుగా ఎదురు చూపులు చూస్తున్నాయి. ఊరేగింపు ఆ దిశనుంచే రావలసి వుంది.

చిట్ట చివరకు ఊరేగింపు రానేవచ్చింది. అరుణ్ అందరినీ లెక్కబెట్టాడు. నలభయి మంది ఆడవాళ్లు వున్నారు. జంటగా నడుస్తూన్నారు. వాళ్ళ వయసు పదహారునుంచి ముప్ఫయి వరకు వుంటుంది. ఊరేగింపులో పరాకాష్టయేమిటంటే - యీ నలభయి మందికీ వెనగ్గా, చివరగా అరవయి యేళ్ళుదాటిని స్త్రీలు యిద్దరు వున్నారు. అందరూ వంటి మీద నూలు పోగయినా లేకుండా - దిగంబరంగా వున్నారు. వాళ్ళ తలలు బోడులు చేశారు. చంకలుగూడ శుభ్రంగా గొరిగారు. మర్మావయవాలు తావున కూడా శుభ్రంగా క్షౌరం చేశారు. బట్టలు జుట్టు లేకపోవడం వల్ల వాళ్ళు పసిపిల్లల మాదిరో, తైల ప్రభావం వల్ల చెడిపోకుండా వుంచిన పిండాలమాదిరో కనిపిస్తున్నారు. పిర్రలు, స్తనాలు మాత్రం వాళ్ల వయసును ఊహించటానికి ఆధారంగా వున్నాయి. నేల చూపులు

చూచుకుంటూ అడుగులో అడుగు వేసుకుంటూ నానా అసహ్యంగానూ నడుస్తున్నారు వాళ్లు. అందరూ యేడుస్తున్నారు కంటి వెంట నీటిధారలు కనిపించడంలేదు గాని నిట్టూర్పులు, వెక్కిళ్ళు వినవస్తున్నాయి. వాళ్ల చేతులు నిర్బంధం లేకుండానే వున్నాయి. అయినా ఎవరూ మానానికి అడ్డంగా చేతులు పెట్టకోలేదు. వాళ్లలో జీవశక్తి అడుగంటి పోయింది. నైతిక నాణ్యత దిగజారిపోయింది. వాళ్ళ వంటిమీద గీతలు, చారలు చూస్తూవుంటే వాళ్ళు ఎలాంటి శారీరక అఘాయిత్యానికి లోనయినారో తెలుస్తుంది. వాళ్ళ యజమానులు వెనకనే నడుస్తూ, ఎవరయినా కాస్త మందకొడిగా అడుగులు వేస్తున్నట్టు అనిపిస్తే చరకోలాతో జడిపిస్తూ అదిలిస్తున్నారు. ఊరేగింపుకు ముందు ఒక డ్రమ్మర్ - వీరి రాకను ప్రకటిస్తూ వాద్యం చప్పుడు చేసుకుంటూ నడుస్తున్నాడు.

ఊరేగింపు నిర్వహిస్తున్నవాళ్లకు, పోగయిన గుంపులోని జనానికి చెప్పక చెప్పుతూ వున్న ఒక ఒప్పందం వున్నట్లుంది. గుంపులో నుంచి యెవరూ ముందుకు దూకి ఆ స్త్రీలను పట్టుకోవటానికి గాని, ఊరేగింపుకు అడ్డం తగలడానికి గాని ప్రయత్నించడంలేదు. దానిని మినహాయించి యేమాత్రం సున్నితం - సునిశితత్వం మిగలలేదు యిక్కడ. ఇది కేవలం ఊరేగింపు అనడానికి వీల్లేదు. దౌష్ట్యం, దుర్జనత్వం యిక్కడ మూర్తీభవించాయి. చీకటికి అజ్ఞానం - అవివేకం తోడు అవుతున్నాయి. భయోత్పతం భూమి మీద విచ్చలవిడిగా వదలినట్టు అనిపిస్తోంది.

ఊరేగింపు బజారుమీదుగా వెడుతోంది. అసహ్యం, అశ్లీలం అయిన చర్యలు గూడా ప్రవాహంలా దానితోనే వెడుతున్నాయి. నిందా వాక్యాలు - బూతుమాటలు, అశ్లీల చేష్టలు, ఉమ్మివేతలు, చిల్లర నాణేలు - వాడిన పువ్వులు - సిగరెట్ ముక్కలు - బీడీలు - స్త్రీల మీదకు విసరివేయడం జరుగుతోంది. ఆడవాళ్లు దగ్గరకు వచ్చిన కొద్దీ ఆ గుంపులోని జనం విచ్చలవిడి ప్రవర్తన ఎక్కువ అవుతోంది. 'వాళ్లను రేప్ చేయండి' 'దూలాలు లోపలకు తోయండి' 'హిందూ లంజముండలు--' 'సైతాన్ స్త్రీలు' యిలా నోటికి వచ్చినట్లల్లా తిట్లు, బూతు మాటలు అంటున్నారు దాదాపు అందరూ వాళ్ల

మీదికి ఉమ్మేస్తున్నారు ఏ నోరూ అకలుషితంగా లేదు; ఏ నాలుకా అపరుషంగాలేదు. ఉమ్మి వేతలు మామూలు జనం మీద కూడ పడుతున్నాయి. అయినా ఎవరూ పట్టించుకోవడంలేదు. మొదటి వరుసలోవున్న మగధీరులు లుంగీలు పైకి ఎత్తి తమ మగతనాన్ని వాళ్లకు ప్రదర్శిస్తున్నారు. రక రకాల అల్లరి, ఆగం. అయితే ఒక విషయం - ఎవరూ రాళ్లు విసరడం లేదు. అదే జరిగితే ఊరేగింపు ఛిన్నాభిన్నం అయ్యేది ఆగిపోవలసి వచ్చేది. వాళ్ళకు కావలసింది స్త్రీ నగ్న ప్రదర్శన మర్మావయవాల వంక అందరూ కళ్ళు తెరుచుకుని ఆసక్తిగా ఆత్రంగా చూస్తూన్నారు. మూక వుమ్మడి ప్రదర్శన వల్ల ఆ సుకుమారమే లోపించింది. వైభవం మరుగయింది. మగవాళ్ల కళ్లన్నీ అక్కడే అతుక్కుపోయినాయి. ముందు భాగం చూడడం అయ్యాక ఆ స్త్రీలు అడుగులు ముందుకు వేశాక పిర్రలు వాటిమీద వాతలు, గీతలు చూస్తున్నారు అంతే ఆత్రంగా.

ఆ స్త్రీలు తమ ముందునుంచి వెడుతూ వున్నప్పుడు సూరజ్ ఒకమారు మోచేత్తో అరుణ్ డొక్కలో పొడిచాడు. తరువాత అరుణ్ తన పక్కనున్న సంగతే మరచిపోయినట్లు యీ ప్రదర్శననే తిలకిస్తూ ఆనందానుభూతులు పొందుతున్నాడు. అరుణ్ అక్కడ నిలుచో లేకపోతున్నాడు, ఆ దృశ్యం చూడలేకుండా వున్నాడు. కాళ్ళువణుకుతున్నాయి. నీరసంగా తాము నిలబడివున్న దుకాణం కింది మెట్టుమీదకు కూలబడిపోయాడు. అది ఓ మందుల దుకాణం. నేటివ్ వైద్యం చేసే ఒక డాక్టరుది. ఆ హకీమ్ సాహెబ్‌కు నలభయి. సంవత్సరాలుంటాయి. దుకాణం మధ్య బాసీపీరం వేసుకు కూర్చున్నాడు. చుట్టూ మందు సీసాలు పరుచుకువున్నాయి. ఎదురుగా ఓ కొయ్య బీరువా వుంది. అరుణ్ కూర్చుని వున్నాడు. అతని పక్కన నిలబడి వున్నవాళ్ళు ఊరేగింపు పక్క నుంచి వెడుతున్నప్పుడు కాళ్ళు ఎగరేస్తూ గంతులు వేస్తూవున్నారు. అరుణ్‌కు దాదాపు తన్నులు తగులుతున్నాయి. ఆ కాళ్ల మధ్యనుంచే అతను 'హకీమ్' ను చూస్తూన్నాడు. హకీమ్ సాహెబ్ తన ముఖాన్ని చేతులతో కప్పేసు కున్నాడు. నిట్టూరుస్తూ అరే, అల్లా... అల్లా.. అల్లా.. అంటున్నాడు విచారంగా. తరువాత నమాజు చేస్తున్న ఫక్కీలో

మోకాళ్ళు నేలకు ఆనించి కూర్చున్నాడు. అతని ముఖంలో తీర్చరాని దు:ఖం, బాధ అగుపిస్తున్నాయి. కనురెప్పలు మూసుకుపోయాయి, యిక ముందు ఎన్నడూ తెరచుకోవా - అన్నట్లు. ఎత్తిన చేతులతో ముష్టి అడుగుతున్నట్లు పంజాబిలో యిలా అన్నాడు. 'రబుల్- అలామిన్ - వాళ్లను క్షమించు. ఈ క్రూరులను రక్షించు . -ఓ! అల్లా! ప్రభువా! ఈ స్త్రీలను కాపాడు.'

ఆ తరువాత వేరే రకమైన అరుపులు పెడబొబ్బలు వినిపించాయి. అరుణ్ బజారు వంక తిరిగాడు, అదేమిటో అర్థం కాలేదు. ఆడవాళ్ళ ఊరేగింపు యీ సరికి బాగా ముందుకు వెళ్లింది. చూస్తున్న జనం విపరీత ఆవేశానికి లోనయినారు. ఇక్కడ వున్న జనం యేమి చూచి నవ్వుతున్నారు? అతను సూరజ్ వంక చూచాడు, అతడూ నవ్వుతువున్నాడు. ఏం జరిగిందో తెలుసుకోలేక అరుణ్ మళ్లీ నిమగ్నమై వున్నాడు. అరుణ్‌కు వొళ్లు గగుర్పొడిచింది. ఈరోజు యిలాంటి మిశ్రితం లేకుండా గడిచిన ట్లయితే బాగుండేది. ముస్లింలను తిట్టుకుంటూ, అసహ్యించుకుంటూ కూర్చోగలిగేవాడు. ఇంతకన్నా దారుణం చూడవలసింది లేదు. అనుభవించవలసింది లేదు. జన్మకంత సరిపడ ముస్లిం లంటే ద్వేషం పోగుచేసుకునే సంఘటనలు చూచాడు.. కాని.. యిప్పుడు హిందు స్త్రీల కోసం ప్రార్థనలు చేస్తున్న హకీం సాహెబ్‌ను చూచిన తరువాత యేం అనుకోవాలో అతనికి అర్థం కాకుండా పోయింది. అతని అవగాహన రథానికి అడ్డుగోడ పడింది.

ఊరేగింపు అంతంలో యిందాక ఎందుకు అరుపులు వినవచ్చాయి? అసలు యేంజరిగింది?' అని అడిగాడు అరుణ్ - శిబిరానికి తిరిగి వస్తున్నప్పుడు.

'ముడతలు పడిపోయిన ఆ ముసలి పీనుగులు యిద్దరు ఛివర వున్నారు చూడు. వాళ్లను చూచి జనం నవ్వుతున్నారు.'

'అలాగా!'

సూరజ్ అరుణ్ ముఖంలోనికి చూచాడు.

'ఏమిటి అలా వున్నావు, అరుణ్. నీవు యీ ప్రదర్శనను ఆనందంగా చూసినట్లు అనిపించదే!'

'చూచాను. చూచాను...?'

'మనం యిక్కడో సారా దుకాణంలోనికి వెళ్లి కొద్దిగా తీర్థం పుచ్చుకు వెడదాం. మనను ఎవరూ గుర్తించరులే' అన్నాడు సూరజ్.

'నేను మత్తు పానీయాలు తాగనని నీకు తెలుసుగదా !'

'నేనూ తాగను. అయినా ఈ రోజు ప్రత్యేకం గదా !'

'ఏమిటి ప్రత్యేకం ?'

'ఓహో ! కన్నుల విందు ?'

అరుణ్ అతని ముఖం వంక చూచాడు. అతడు తన్మయత్వంలో మునిగి వున్నాడు. వాళ్లు శిబిరం వంక నడకసాగించారు.

అరుణ్, సూరజ్ ఒక్కళ్లూ కాదు యిలా వచ్చింది. ఇంకా చాల మంది వచ్చారు. ఆ సాయంత్రం శిబిరంలో యీ ఊరేగింపును తప్ప మరో ప్రస్తావన తీసుకురాలేదు ఎవ్వరూ. ఆ ఊరేగించిన స్త్రీలలో డాక్టర్ చంద్రభాను కుమార్తె ఒకతె కూడా వున్నదని ఎవరో గమనించినట్లు చెప్పారు. రెండో అమ్మాయి యేమయిందబ్బా - అని ఆశ్చర్యం వెలిబుచ్చారు. ప్రతి సందులోను గుంపులు పోగయ్యాయి. అందరూ గుసగుసలుగా మాట్లాడుకుంటున్నారు. స్త్రీలు నోటి మీద వేళ్లు వేసుకుని సిగ్గు చచ్చిపోయి వింటున్నారు. రామ ! రామ ! రామ!.... అనుకుంటున్నారు కొందరు.

ఆ రాత్రి అరుణ్ తన సరసకు రాగానే చాందిని అడిగింది 'నీవు నిన్న రాత్రి అంతా యేమయిపోయావు.? రాలేదు ?'

ఆమెకు భయం పట్టుకున్నట్లుంది. కొద్దిగా కోపం కూడా.

ఆమెకు జవాబు చెప్పకుండా, ఆమెను తన కౌగిలిలోనికి తీసుకుని పెదాలమీద ముద్దు పెట్టాడు

చలికి వణుకుతున్నాడు. ఆమెను బిగించి కౌగలించుకుని శరీరానికి కావలసిన వెచ్చతనం సంపాదించాడు.

అతను చాల సున్నితంగా ప్రవర్తిస్తున్నాడు. ఈ రోజు కామం, తపన అతన్ని ఆవేశపరచడం లేదు. మృదుత్వం మాత్రం వుంది. ఆమె గోళ్లను

అతనిలో గుచ్చుతోంది అతనామెను ముద్దుపెట్టుకోవడం తప్ప యింకేమీ ముందుకు పోవడం లేదు

'నిన్న రాత్రి ఎందుకు రాలేదు ?'

'మీ అమ్మ మేలుకునే కూర్చుని వుండింది' అన్నాడతను ఆమె చెవిలో రహస్యంగా.

'అయినా ఫరవాలేదు'

ఆమె ముఖం మీద మృదువుగా స్పృశించాడు. వేళ్లతో మెల్లగా ఆమె ముక్కును స్పర్శించాడు. ఆమె చెవులు లాలిత్యంతో సవరించాడు. ముఖం అంతా రుద్దడం అయిన తరువాత కంఠం స్పర్శించసాగాడు.

'నీతో పాటు ఈ పొలాలలో తిరగాలని వుంది' అంది ఆమె.

అరుణ్ హృదయం ఎగిరిగంతు వేసింది.

'వెడదాం. వీలయినంత త్వరగా !'

'అయితే మరి ఎప్పుడు ?'

అతనామెను మరింత దగ్గరగా లాక్కున్నాడు. మృదువుగా పెదాలు స్పర్శించాడు. అనేకమార్లు ముద్దుపెట్టుకున్నాడు. ఆ అమృతాన్ని తనలో మధురంగా ఆస్వాదిస్తున్నాడు.

'డేరా బాబా నానక్ వెళ్లాక'

'మరి మనం వివాహం చేసుకునేది ఎప్పుడు ?'

'ఉష్.... నెమ్మదిగా. అందరికీ వినబడుతుంది.'

'ఎప్పుడు, చెప్పు'

'త్వరలోనే'

'నాకు చాలా భయంగా వుంది'

నగ్న స్త్రీల ప్రదర్శన గురించిన వార్తలు విన్నాక శిబిరంలోని ఆడవాళ్ల వదనాలు అవనతం అయినాయి.-

'నాకు తెలుసు !'

ఆమె అతన్ని తన శరీరానికి గట్టిగా ఒత్తుకుంది. తన నాలుకను అతని నోట్లో జొనిపింది.

'ఏమయినా చెప్పమంటావా ?'

'ఉ'

ఆమె అతని హృదయంలో తన తల దాచుకుంది.

'నా సర్వస్వం నీదే !'

అరుణ్ ఆమె వీపును లాలనగా స్పర్శించాడు.

'ఇంతకు ముందు ఎవరినీ తాకనివ్వలేదు'

అరుణ్ ఆమె తల చేతుల్లోనికి తీసుకున్నాడు.

'ఇప్పుడు.... నన్ను నీవు స్వీకరించాలి.'

- అరుణ్ కోరుకుంటున్నదీ యిదే, యిన్నాళ్లూ. అయినా దానంతట అదిగా ఈ సమర్పణ జరిగినప్పుడు అతనికంత అభిరుచి దాయకంగా అనిపించలేదు. అతని మనస్సులో మధ్యాహ్నం చూచిన నగ్నప్రదర్శన జుగుప్స యింకా బాధిస్తూ వుంది. అతనికి మృత్యు గుహ్వారంలో వున్నట్లు అనిపిస్తోంది. కాని ఆమె మాటలు వింటూ వుంటే హృదయం కరిగిపోతోంది. ఇదే సమాగమం లాగ వుంది. బాధాతప్తమయిన మనస్సు కొంత ఊరట పొందింది. ఈ స్థితికి రావటానికి ఆమె అంతరంగం ఎంతో అవస్థ, అతలాకుతలం పడివుండాలి. అన్ని మాటలలో తనను తాను సమర్పణ చేసుకోవాలంటే, నిరాశా నిస్పృహలలో మునిగిపోయినందువల్లనేనా ? ఎంతయినా ఆమె హిందూ అమ్మాయి గదా !

'నన్ను నీ దానిని చేసుకో' అంటూంది యిప్పుడు, చేతిని అతని మీద వేసి....'యిప్పుడు, యిక్కడే..!'

'డేరా నానక్ చేరిన తరువాత !' అంటూ అతను గుసగుసగా చెప్పి ఆమెను ముద్దుపెట్టుకున్నాడు.

చిన్నపిల్లలాగ అతని బుజాల మీద వాలిపోయింది చాందిని. ఒక క్షణం అతనితో గుసగుసలు చెబుతోంది. మరుక్షణం - అతను ఆమె ఉచ్ఛ్వాస నిశ్వాసాల లయలను గమనించ సాగాడు. అతని బుగ్గల మీద పడుతున్నాయి ఆ గాలులు. ఆమెది దృఢమైన శరీరం పడుకున్నప్పుడు మాత్రం తేలికయిపోతుంది. అరుణ్ ఆమెనో గువ్వపిట్టలాగ భావిస్తాడు. అతనికి నిద్రపట్టేస్తుందేమోనని భయంగా వుంది నింపాదిగా ఆమె తలను తన బుజం మీద నుంచి తీసి నేలమీద జాగ్రత్తగా అన్చాడు. మెల్లగా ఆమెకు శాలువ కప్పాడు. ముందుకు వంగి ఆమె నుదుటిని ముద్దుపెట్టుకున్నాడు. తరువాత తన పక్కమీదకు చేరి విశ్రాంతిగా పడుకుని తాపీగా ఆలోచిస్తూ రాత్రంతా గడిపివేశాడు.

మరుసటి రోజు రాత్రి - అది వాళ్లు వచ్చిన మూడవ రోజు - శిబిరం మీద పెద్దపెట్టున దాడి జరిగింది. అంతా అనుకోకుండా అధాటుగా జరిగింది. ఎవరూ ఊహించలేదు. పగలు గూడా ఎవరూ చూచాయగానయినా అనుమానించలేదు. నగ్న స్త్రీల ప్రదర్శన క్రోధాన్ని అంత మొందించకపోగా మరింత పెరిగేట్లు తయారు చేసింది జాఫర్ వాల్ నుంచి చాలామంది ముస్లింలు వచ్చారు. బహుశా యీ కారణంగానే దాడి జరిగి వుండాలి. అయితే అది హటాత్తుగా మీద పడేంత వరకు శిబిర వాసులకు యే మాత్రం ముందు హెచ్చరిక అనేదే లేకుండా పోయింది. రాత్రి ఎనిమిది గంటల ప్రాంతంలో అది జరిగింది.

అరుణ్ శిబిరాలకు ఒక మూలవున్న పాకీదొడ్డికి వెళ్లాడు. 'నరాయే తక్బీర్.... అల్లా హో అక్బర్...' అనే నినాదాలు వినిపించాయి ఉన్నట్లుండి. దుండగీళ్లు సైన్యం యొక్క కళ్లు కూడా కప్పగలిగారు నేర్పుగా. ఎలా వచ్చారో శిబిరం లోపలకు వచ్చేశారు. మిషన్‌గన్ కాల్పులు అదే పనిగా వినిపించసాగాయి ఏదో పీడకలనుంచి అప్పుడే మేల్కొన్నట్లు శిబిరం అంతా ఒక్కసారి గందరగోళమయిన ధ్వనులతో మునిగిపోయింది.

అరుణ్‌కు యేం జరుగుతూ వున్నదో తెలియదు. భయంతో శరీరం అంతా ఉండచుట్టుకు పోయినట్లయింది. హడావడిగా పాకీదొడ్డిలో వున్నవాడు

లేచి ట్రౌజర్ పైకిలాక్కుని గుండీలు పెట్టుకున్నాడు అతని కాళ్ళు వణికిపోతూన్నాయి. పాకీ దొడ్డి బయటకు వచ్చిన తరువాత కొంతసేపు గోడను పట్టుకుని నిలిచివుండి స్థాయి చిక్కించుకోవలసి వచ్చింది విద్యుత్ తీగలు తెగిపోయివున్నాయి చంద్రకాంతి విస్తరించి వున్నందువల్ల వీధులు చీకటిలో కూరుకుపోకుండా తగు మాత్రంగా కనబడుతూనే వున్నాయి కొందరు అటు యిటు పరుగులు తీస్తున్నారు. కొందరు కేకలు పెడుతున్నారు. అతడు వడివడిగా తమ డేరా వయిపు పరుగు తీశాడు. ఎక్కువ గందరగోళంగా వున్న వీధులను తప్పించుకుంటూ తన డేరాను చేరుకోగలిగాడు. లోపల ఎవరూ లేరు. డేరా ఖాళీగా వుంది. అతని శరీరం చల్లబడిపోయింది. ఖంగారుగా యివతలకు వచ్చాడు. పక్కడేరాలో కూడా ఎవరూ లేరు. అందరూ ఎక్కడికో అదృశ్యం అయిపోయారు దూరంగా కొందరు పరిచయస్థులు కనిపించినట్లు అనిపించింది. కాని వీధి అంతా నిర్మానుష్యంగానే వుంది అతను పరుగు తీశాడు. గందరగోళం తారాస్థాయిని వుంది. సహాయం కోసం ఆక్రందనలు అన్ని దిక్కుల నుంచి వినబడుతున్నాయి. అరుణ్ సరిహద్దు కంచె దగ్గరకు వెళ్లాడు. అక్కడో భారత మిషన్‌గన్ స్థావరం వుంది. అక్కడ నుంచి పట్టణం వయిపు కాల్పులు సాగిస్తున్నారు అతనికి ముందు పరుగెత్తుతున్న వాళ్లలో ఒకతను పడిపోయాడు ఎవరు అతన్ని పడిపోయేట్లు చేశారో తెలియలేదు. అతను నింపాదిగా డేక్కుంటూ వెడుతున్నాడు యిప్పుడు. మరో మిషన్‌గన్ స్థావరం కూడా దాటి వెళ్లాడు. ఇక్కడ నుంచి రైల్వేస్టేషన్ వయిపు కాల్పులు సాగిస్తున్నారు. ముందుగా నిలబడ్డ ఒక సిపాయి స్టెన్ గన్‌తో అటువయిపే కాల్పులు చేస్తున్నాడు. అతను కంచెను ఆనుకుని నిలుచున్నాడు, తుపాకి ఒక చెక్క బల్ల మీద ఆనించి వుంచాడు. అరుణ్ అతను ఉద్వేగంగా పైకి ఎగరడం, గిర్రున తిరగడం, కిందకు పడడం చూచాడు. ఇప్పుడు అతనికి అర్థం అయింది. ఎవరో యిక్కడకు - యీ స్థలం మీదకు కాల్పులు జరుపుతున్నారు. అరుణ్ డేక్కుంటూ నడుస్తున్నాడు - . రుగు తీస్తున్నట్లుగా కంచె దగ్గర కొంతసేపు వేచి వుండి, శిబిరం వెనక్కు వెళ్లాడు ఎడమవయిపు అనేక భూములు వున్నాయి. గున్నాకలన్‌లో మోస్తరుగా పెద్దపొలాలు కాదు.

ఈ భూముల్లో యిళ్లు వున్నాయి  చాలామంది కంచె మీద వాలివున్నారు, పొలాలవయిపు పరుగులు తీస్తున్నారు.  ఆ బయలు మరీ విచ్చలవిడిగా అందిపోయేట్లు వున్నదని గమనించి అతను ఎడమవయిపు పరుగుతీయసాగాడు. అక్కడ రైల్వే ఆవరణ, రైల్వే కట్టడాలు అనేకం వున్నాయి.

రైల్వే ఆవరణ నుంచి కూడా 'యా ఆలీ !' అనే అరుపులు వినరావడం అతనికి అక్కజం అనిపించింది. చంద్రకాంతిలో అక్కడ కొంతమంది గుమిగూడి వుండడం కనిపించింది.  భారత సేనలు వాళ్లను ముందుకు రాకుండా అటకాయిస్తున్నాయి.

అరుణ్ గిరుక్కున వెనక్కుతిరిగి పొలాల వైపు పరుగుతీస్తున్నాడు దేక్కుంటూనే వెళ్లి - లేకపోతే ఎక్కడ తుపాకి గుండు దూసుకుపోతుందోనని భయపడతూ - కంచెమీద నుంచి దూకి బయటపడ్డాడు  ఒకమారు జారి కింద పడ్డాడు.  లేచి మళ్లీ పరుగు తీయసాగాడు.  ఒక చెరుకు తోటలో ప్రవేశించాడు.  తతిమ్మా పొలాలలో యేదేదో గందరగోళం జరుగుతున్నట్లు వున్నది గాని యిక్కడ మాత్రం ప్రశాంతత అలుముకునే వుంది.  అతనికి ఓపిక నశించి పోయింది.  దురుసైన చెరుకు గడల పొదలను దూసుకుంటూ వెళ్లి, నేలమీద సాగిలపడిపోయాడు - శిబిరానికి అభిముఖంగా, గుండె వేగంగా కొట్టుకుంటున్న చప్పుడు వినవస్తోంది.  కటిక నేలమీద పడివున్నాడు గనుక యీ వినపడడం మరింత స్ఫుటంగా వుంది.

శిబిరం నగరానికి అభిముఖంగా శిబిరానికి, నగరానికి నడుమ సియల్‌కోట - డేరా బాబా నానక్ రైలు మార్గం నడుస్తోంది.  నారోవర్ రైల్వేస్టేషన్ యిక్కడకు తూర్పు దిశగా వుంది.  పడమరగా రైల్వే ఆవరణలు వున్నాయి.  శిబిరానికి వెనగ్గా పొలాలున్నాయి.

దండయాత్ర తెరలు తెరలుగా వస్తోంది.  అరుణ్ చాలా గంటలపాటు దాన్ని గమనిస్తూ వుండిపోయాడు.  కొంతసేపు భారీగా తుపాకి వేట జరిగింది. భారత పక్షం నీరసపడిన తర్వాత, కొందరు ముస్లింలు తుపాకులు, కర్రలు, కత్తులు తీసుకుని శిబిరం మీదకు వచ్చి పడ్డారు.  అరుణ్‌కు 'అల్లాహో అక్బర్'

అంటున్న అరుపులు మాత్రం వినవస్తున్నాయి. అంటే కొత్తగా దండయాత్ర మొదలయిందన్నమాట ! తుపాకి కాల్పులు వినవస్తున్నాయి - అనేక మూలల నుంచి. భారత సిపాయిలు నలుమూలలకు చెదిరి ఎదురు కాల్పులు యిస్తున్నారన్నమాట నగరం నుంచి శిబిరం వయిపు కాల్పులు జరుగుతున్నాయి రైల్వేస్టేషన్ నుంచి భారీ ఎత్తున శిబిరం వయిపు కాల్పులు వస్తున్నాయి. ఈ రెండు తావుల నుంచి మిషన్ గన్లు విజృంభిస్తున్నాయి.

దండయాత్ర జరుపుతున్నవాళ్లకు - కాల్పులు జరుపుతున్న వాళ్లకు చక్కటి సమన్వయం వున్నట్లు తోస్తోంది. ఎందుకంటే - 'అల్లా హో అక్బర్' అనే నినాదం వినిపించడంతోటే కాల్పులు ఆగిపోతున్నాయి. ఒక తరంగం దోపిడి - హత్యలు అయిపోయిన తర్వాత మళ్లీ కాల్పులు మొదలవుతున్నాయి.

శిబిరంలోని జనమంతా అటుయిటు చెల్లాచెదురుగా పరుగుతీశారు. ఆ చీకటిలోనే కొందరు నగరం వయిపు పరుగులు తీశారు. దుండగులను తప్పించుకున్నవాళ్లు రైలు ఆవరణలోను స్టేషన్ వెనక తలలు దాచుకుంటున్నారు. కొందరిని దుండగులు పొలాలలోనికి పరుగులు తీయించి వెంబడించారు. అరుణ్ వున్న చెరకు తోట కూడా అంత సురక్షితమయిన ప్రదేశం కాదు. అతనికి కొన్ని గజాల దూరంలోనే కొందరుసంచరిస్తున్నట్లు అలికిడి అవుతోంది, కనబడుతోంది కూడ.

తన తల్లిదండ్రులు, చాందిని యేమయిపోయినారో అని మనస్తాపం మొదలయింది అరుణ్‌కు. జనం గుంపులు గుంపులుగా దగ్గరకు వస్తున్నారు. అరుణ్ లేచి యింకా ముందుకు పరుగుతీశాడు. చెఱకు తోటను దాటి అతనో పంటకాలువను - గుంటను - చేరుకున్నాడు ముందుగా దాన్ని చూడకుండా అడుగువేసి కాళ్లు తడిచేసుకున్నాడు దానిలో తలమునకలుగా పడిపోకుండా శ్రమపడి తనను తాను కాపాడుకున్నాడు. అవతలి పక్క ఒక ఆనకట్టవుంది, అతను దాని కిందకు వెళ్లిపోయాడు. అతనికి కుడి పక్కగా రెండు యిళ్లు అగుపిస్తున్నాయి. కిటికీల లోంచి వెలుతురు కనిపిస్తోంది. అతను ఆ రెండు యిళ్లను తప్పించుకుని యింకా ముందుకు పరుగుతీశాడు మరో చెఱకు

తోట అగుపడింది దానిపైన ఓ మట్టిరోడ్డు. అక్కడ చెదురు మదురుగా యిళ్లు వున్నాయి. కాని ఎవరినీ సహాయం అర్థించటానికి భయం అడ్డువస్తోంది. అతనిప్పుడు యేకబిగిన పరుగుతీయడం లేదు. కాస్సేపు పరుగు, మరికాస్సేపు నడక... యిలా సాగిస్తున్నాడు ప్రయాణం. బయటచాల చలిగా వుంది. అయినా అతనికి వళ్లంతా చెమటలు పోస్తున్నాయి. చేతి రుమాలు బయటకు లాగి నుదుటి మీద చెమట తుడుచుకున్నాడు. చలి నుంచి రక్షణగా చొక్కా బొత్తాములు పైదాకా పెట్టుకున్నాడు.

ఇప్పుడతనొక బీడుపడిన పెద్దపొలంలో వున్నాడు. శిబిరంలో జరుగుతున్న కోలాహలం యిక్కడకు వినిపిస్తూనే వుంది ; మైలుదూరంలో వున్నా ఆ పొలంలో కొన్ని చెట్లమాటున ఒక కొట్టం కనబడింది. తగరపు రేకులు ఆచ్ఛాదనగా యిది పెద్ద కొట్టం, బాగా దగ్గరకు వచ్చి చూస్తేగాని యిక్కడ ఈ కట్టడం వున్నట్లుగా తెలియడం లేదు, చెట్ల మాటున వున్నందువల్ల. లోపల దీపాలు వున్నట్లు లేవు. అందుచేత ధైర్యంగా దానివైపు వెళ్లాడు. ఒక మూలన ఆర్మీ జీప్ నిలిచివుండడం కనిపించింది. ఆశ్చర్యపోయాడు. కొంతసేపు నిలిచి గమనించాడు. ఇక్కడ యీ జీప్ యేం చేస్తోంది ? కొట్టం బయటగాని లోపలగాని ఎవరూ ప్రాణులువున్నట్లు అలికిడి అవడమే లేదు. అన్ని దిక్కులా పరికించి చూచాడు. నాలుగయిదు వందల గజాలు నడిస్తే తప్ప మరో యిల్లు చేరువ అవదు. చప్పుడు కాకుండా అడుగులు ముందుకు వేశాడు. ఒక గుడ్లగూబ అరుచుకుంటూ ఒకచెట్టు మీద నుంచి మరో చెట్టు మీదకు దూకింది. అరుణ్ హటాత్తుగా ఆగిపోయాడు. అతనికి యేం చేయవలసిందీ స్ఫురించ లేదు. అతనికి అలసటగా వుండడమే గాక ఆకలిగా కూడా వుంది. మళ్లీ నింపాదిగా నాలుగు అడుగులు ముందుకు వేశాడు. కొట్టం ద్వారందాకా వెళ్లి యిదితెరచి వుందో లేదో చూద్దాం అనుకున్నాడు. బయటనుంచి తాళం కనిపించడం లేదు. తలుపునెట్టితే తెరుచుకో లేదు. లోపల తాళం వేసినట్లుంది. నింపాదిగా దానిచుట్టూ తిరిగాడు. పేడ, గడ్డి వాసనేలు మాత్రం వస్తున్నాయి. ఒక కిటికీ పక్కగా వెడుతున్నప్పుడు లోపల యేదో సంచలనం వున్నట్లు అనిపించింది. పరుగుతీసి ఒక చెట్టు కిందనక్కాడు. అలా చెట్ల కింద

నుంచి పరుగెత్తుతూ వెళ్లి కొట్టానికి అవలివైపు వెళ్లాడు. ఆ పక్క కిటికీ తెరచి చూచేటప్పటికి అతనికి దిగ్భ్రమ కలిగింది. ఒక స్త్రీ గొంతు వినిపించింది 'దుర్మార్గుడా. నా జోలికి రాకు, నన్ను పాడుచేయకు, వదిలెయ్యి' అని. ఆ స్త్రీ ఎవరో కాదు, సునంద.

తరువాత కొన్ని నిమిషాల పాటు అతను కలలోమాదిరి వ్యవహరించాడు అతను యేం చేస్తున్నాడో ఎరగడు తరువాత, తన సాహసానికి తనకే ఆశ్చర్యం అనిపించింది. కాని ఆ క్షణంలో తాను ఆ పని చేస్తున్నట్లు ఎరగడు పిల్లిలా నడుచుకుంటూ వెళ్లి కిటికీ గాజు తలుపు దగ్గర ముఖం పెట్టాడు. అతని గుండె వేగంగా కొట్టుకుంటూంది. భయంతో నోరు తెరుచుకు వుండి పోయింది. కిటికీ అద్దానికి చెవివొగ్గి వింటున్నాడు. చంద్రకాంతి పడుతూ వున్నా లోపలి దృశ్యం కన్నులకు అగుపించడం లేదు. బహుశ యీ కొట్టంలో లోపల గోడలు, విభాగాలు వున్నట్లున్నాయి. ఎక్కువ ప్రయత్నం మీద తాను చూస్తున్నది ఒక గది లోపలిభాగాన్ని అని తేలింది. సునంద గొంతు తిరిగి వినిపించింది. 'నన్ను వెళ్లిపోనివ్వు. దుర్మార్గుడా! నన్ను నా దారిని వదిలెయ్యి' ఎవరో ఆమె నోరు నొక్కి వేస్తున్నట్లుంది. ఉండి ఉండి మాట్లాడ గలుగుతోంది. అరుణ్ బుగ్గలు చల్లబడిపోయాయి, కిటికీ అద్దాలకు జోడించి వుంచడం వల్ల. అతను తన దృష్టి కోణాన్ని మార్చాడు. కిటికీ అద్దాన్ని చేతి రుమాలుతో తుడిచాడు. కిటికీ తెరవాలని ప్రయత్నం చేశాడు. లోపల గడియలు బిగించి వున్నట్లున్నాయి. అద్దాలన్నీ భద్రంగా వున్నాయి. అతనికి చంకల్లో చెమటలు పోస్తున్నాయి. బుజంతో కిటికీని అనేక పర్యాయాలు బలంగా నెట్టాడు. చివరకు అనుకోకుండా కిటికీ తెరుచుకుంది గబాలున - లోన గడియలు లేవన్నమాట. షట్టర్లు మాత్రం చలికి బిగుసుకుపోయి వుంటాయి. షట్టర్లు గోడలకు తగిలి చప్పుడు చేయకుండా వాటిని చేతితో ఆపి వుంచాడు, భద్రంగా వాటిని పక్కకు జరిపి. లోపల దృశ్యం యిప్పుడు స్పష్టంగా చూడగలుగుతున్నాడు. మరుక్షణంలో అతను లోపలకు దూకేశాడు. ఇప్పుడు గదిలో వున్నాడు.

ఎండుగడ్డి మీద నిలబడి వున్నాడు అతను రెండు గదుల మధ్య ద్వారం వుంది. దానికి తలుపులు మాత్రం లేవు. తడిసిపోయిన బూట్లను పక్కకు పెట్టి మెల్లగా శబ్దం చేయకుండా ముందుకు నడిచాడు కొన్ని నిమిషాలుగా యేమీ అలికిడి వినరావడం లేదు. అతని గుండె బహు వేగంగా కొట్టుకుంటూంది. గుండె కొట్టుకోవడం తలలో కూడా ప్రతిధ్వనిస్తోంది. సునంద యేడుస్తూ వుండడం వినవస్తోంది. శరీరంలో శక్తి అంతా కోల్పోయి, రక్తం అంతా ఓడ్చుకుపోయిన మనిషి చేసే విలాపం అది.

గోడకు ఆనుకుని నిలుచుని, రెండు గదుల మధ్య వున్న వరండా వంక చూచాడు. ఒక మూలగా గడ్డిమేటులు యింటి కప్పు వరకూ ఎత్తుగా పడివున్నాయి. తరువాత వ్యవసాయపు పనిముట్లు అనేకం అక్కడ చేర్చి వుండడం కనిపించింది. ఓ కొయ్య నాగలి కూడా వుంది. దూరంగా కొట్టానికి బయటకు చేర్చే యినుప ద్వారం వుంది ఆ తరువాత - సునంద, కనీసం సునందలా వున్న స్త్రీ రూపం - కనిపించింది. దూరంగా ఓ మూల గడ్డితో పరుపులాగ పరిచివుంది. దాని మీద సునంద పడివుంది. ఆమె తల అతను చూస్తున్న తావుకు అవతలివైపు వుంది. అతనికి ఆమె కాళ్లు మాత్రం కనబడుతున్నాయి. ఆమె కాళ్ల మధ్య ఆమె మీదికి వంగి ఒక పురుషుడు వున్నాడు.

చంద్రకాంతి యిప్పుడు కిటికీలోంచి గదిలోనికి బాగా పడుతోంది. లోపలి దృశ్యం స్పష్టంగా కనబడుతోంది. ఆమె యింకా యేడుస్తూనే వుంది. నింపాదిగా - సుతి మెత్తగా. ఆమెకు ఊపిరి ఆడడం గూడా కష్టంగా వున్నట్లుంది ఆ వేదనతో. 'నా మీద నుంచి లేచిపో' అంటూంది యిప్పుడు ఆమె. ఆ మనిషి మాత్రం కదలలేదు. బదులుగా పెద్దగా నవ్వడం ఆరంభించాడు. ఆ నవ్వు కొట్టం అంతటా ప్రతిధ్వనిస్తోంది. వికటాట్టహాసం. అతను వంకరగా నవ్వుతూనే 'ఏదో ఒక రోజున నిన్ను అనుభవిస్తానని నేను బాగా ఎరుగుదును' అంటున్నాడు. విజయగర్వంతో తృప్తితో నవ్వుతున్నాడు. 'నీవు సుందరాంగివి. నన్ను మాత్రం చాలా కాలం వేచి వుండేట్లు చేశావు' అన్నాడు.

అతని మాటలు వినడానికి ముందే అతను ఎవరయి వుంటాడో అరుణ్‌కు తెలిసిపోయింది. పొడగాటి బలమైన మనిషి. ఆ నవ్వు కూడా అతన్ని పట్టియిచ్చేస్తోంది. అలా గుర్తు తెలియడంతోటే అరుణ్ వివశుడైపోయాడు ఏం చేస్తున్నాడో అతనికే తెలియదు. ఆలోచించడం కోసం ఆగిపోలేదు. నింపాదిగా అడుగులో అడుగు వేసుకుంటూ ఆ గదిలోనికి ప్రవేశించాడు వ్యవసాయపు పనిముట్లలోంచి పదునైన కొయ్య కర్ర - బల్లెంలాంటిది తీసుకున్నాడు. దాన్ని గట్టిగా చేతుల్లో ఎత్తి పట్టుకుని ఆ గదిలోనికి చేరాడు నిద్రలో నడిచిపోతున్నట్లుగా ముందుకు వెడుతున్నాడు. అతనేం చేస్తున్నాడో అతనికి తెలియదు. కొయ్య బల్లెం ఎత్తి పట్టుకున్నాడు. చప్పుడు చేయకూడదనే స్పృహ లేకపోయినా యే మాత్రం సవ్వడి లేకుండా నడుస్తున్నాడు వాళ్లకు దగ్గరగా చేరుకున్నాడు. సునంద నిట్టూర్పులు, వెక్కిళ్లు వినవస్తున్నాయి. ఆ మగవాడి తలమీద కొయ్య బల్లెంతో చేతనయినంత బలంగా దృఢంగా కసిగా మోదాడు

నట్లటి చిక్కటి జుట్టు అనమాలు పెట్టుకున్నాడు గురిచూచి మరీ దెబ్బ వేశాడు. ఆమె మీద యింకా పడుకునే వున్నాడు ఆ మనిషి. ఆమెను యింకా చేతుల్లో బిగించి పట్టుకునే వున్నాడు. ఈ దెబ్బ తగలడంతో అతని చేతుల బిగువు సడలి పోయింది. పక్కకు ఒరిగిపడిపోయాడు అంతే, ఆ తరువాత ఆ మనిషి మరి కదలలేదు. అరుణ్ యింకా వదలకుండా అతన్ని కర్రతో మోదుతూనే వున్నాడు, పిచ్చెత్తిన వాడిలాగ సునంద కెవ్వున కేక వేసి లేచి కూర్చుంది. 'నేనే.... అరుణ్... నేనే...' అన్నాడు అతను ఆమెకు వినబడేట్లుగా. అయినా ఆ పడిపోయిన మగవాడిని మోదడం మటుకు యింకా నిలపలేదు. వీలయినంత వరకు బల్లెం పైకి ఎత్తి బరువుగా బలంగా అతన్ని మోదుతున్నాడు. ఒకసారి కాదు - రెండు సార్లు కాదు.. అలా కొడుతూనే వున్నాడు.

చివరకు అతను ఆగిపోయాడు. అలసటతో ఒగర్పు వస్తోంది బల్లెం ఒక చేతపట్టుకుని ఆ మనిషి వంక చూచాడు. ముఖం పక్కకు కదిలించాడు

తలంతా పచ్చడి పచ్చడి అయిపోయింది. రక్తం ముఖాన్ని కప్పేసింది. బుజాలమీదుగా పాకుతోంది నేలంతా రక్తం జాడలు. అతన్ని వెల్లకిలా దొర్లించాడు. మోకాళ్ల మీద కూర్చుని గుండెల మీద చేయివేసి పరికించాడు. చెవితో వినాలని ప్రయత్నం చేశాడు. చాలసేపు విన్నాడు. ఒక చెయ్యిపైకెత్తి దాన్ని కిందకు వదిలేశాడు. అలాగే రెండో చేయి పైకెత్తి దాన్ని వదిలాడు రెండు చేతులూ నిర్జీవంగా నేలకు పడ్డాయి. మళ్లీ ఒకమారు చెవి అతని గుండె దగ్గర ఆన్చాడు ఉహు ఇంక యే మాత్రం సందేహం అవసరం లేదు. కెప్టెన్ రహ్మతుల్లా ఖాన్ నిజంగానే చనిపోయాడు.

పైకి లేచి అరుణ్ తన చేతిలోని కొయ్యబల్లెం వంక చూచాడు. గొగ్గులు గొగ్గులుగా అనాకారంగా వుంది అది. అయితేనేం బరువుగా పదునుగా వుంది. దాని చివర రహ్మతుల్లా రక్తంతో తడిసిపోయి నల్లనయింది. దాని వంక చూచి విభ్రాంతుడైపోయాడు అరుణ్. చికాకు, భయం విసుగు, గందరగోళం. ఇప్పుడేం చేయాలనే ఆలోచన ప్రారంభం అయింది. తల తిరుగుతోంది అతనికి. వళ్లంతా చెమటతో తడిసిపోయివుంది. ఒక చేత్తో నుదురు తుడుచుకున్నాడు. రహ్మతుల్లా శరీరం వంక, బల్లెం వంక మార్చి మార్చి చూస్తున్నాడు. నిర్ధారణ అయింది యిప్పుడు అతనికి. తాను ఓ మనిషిని చంపివేశాడు. ఆ ఆలోచన రావడంతోటే అతనికి భయంతో వణుకు ప్రారంభం అయింది. బల్లేన్ని ఒక మూలకు గిరాటు వేశాడు. ఎండు గడ్డి మీద పడింది అది. తల ఆడిస్తూ, వెళ్లి సునంద సరసన కూర్చున్నాడు.

'నేనతన్ని చంపేశాను' అన్నాడు అరుణ్, ఆమెకు బలాన్ని యివ్వటానికి ప్రయత్నిస్తూ, తద్వారా తనూ బలం పుంజుకుంటూ.

సునంద అతన్ని ఆనుకుని కూర్చుని యేడవసాగింది. పెద్దగా నిర్మోహమాటంగా.... మనసును కాళీ చేసుకుంటూ యేడుస్తూ వుంది ఆమె. తనకంటె పెద్ద వాళ్లను ఓదార్చడం ఎలానో అరుణ్ ఎరుగడు. సునంద అతని మీద తన సుకుమారమైన చేతులను, బుజాలను వేసి యేడుస్తూ వుంటే అతనికి ఉక్కిరి బిక్కిరి అయిపోతోంది. అతని లాగూ అంతా తడిసిపోయింది.

అందువల్ల అతనికీ చలిగా వుంది. చేతితో గడ్డిమేటులో సవరిస్తూ వణికిపోతూ అలాగే కూర్చుండి పోయాడు, ఆమె యేడుస్తూ వున్నంత సేపూ.

'ఎంత సేపయింది నీవు యిక్కడకు వచ్చి ?' అనడిగింది సునంద.

'కొన్ని నిమిషాలు మాత్రం'

నిశ్శబ్దం.

'ఇక్కడికి ఎలా వచ్చావు ?' అని అడిగాడు.

'అతను లాక్కువచ్చాడు -'

'శిబిరం నుంచేనా ?'

ఆమె అవునని తల ఊపి ముక్కు చీదుకుంది.

శిబిరంలో యేం జరిగిందని అడుగుదామనుకున్నాడు అరుణ్. తన తల్లి దండ్రులు, చాందిని యేమయినారో !

అలా కాకుండా 'భావన, నవకాంత్ ఎక్కడున్నారో చూచావా ?' అనడిగింది ఆమె.

'లేదు వదినా - చూడలేదు. వాళ్లు ఎక్కడ ?' అన్నాడు అతను.

ఆమె మళ్లీ యేడుపు ప్రారంభించింది. పిడికిళ్లతో గడ్డివామును గుద్దుతోంది. 'నాకు మాత్రం యేం తెలుసును ? - వీడు నన్ను పట్టి లాగి యిక్కడకు యీడ్చుకువచ్చాడు' అంది.

ఆమె ఉక్కిరి బిక్కిరి అవుతోంది.

'నేను యిక్కడ కూర్చుని వుండలేను. పైగా పక్కన ఛాడి శవం !'

వాళ్లు అక్కడనుంచి లేచి పక్కనున్న చిన్న గదిలోనికి చేరారు. వెడుతూ వెడుతూ అరుణ్ రహ్మతుల్లా శవాన్ని కాళ్లతో తన్నాడు.

'మనం యిక్కడ నుంచి వేగిరం వెళ్లిపోవాలి. అతని జీప్ ఈ పక్కను వుంది. ఎవరో వొకరు అతన్ని వెదుక్కుంటూ వస్తారు'

'అతని దగ్గరో తుపాకి వుంది. వెళ్లి తీసుకురా ...'

'తుపాకి ఉపయోగించడం ఎలానో నాకు తెలియదు'

'ఫర్వాలేదు. తెచ్చి దగ్గర వుంచుకో మంచిది'

అరుణ్ మళ్లీ ఆ పెద్ద గదిలోనికి వెళ్లాడు. ఇక్కడ నుంచి పారిపోవడం ఎలానా అని మనసులో యోచనలు చేస్తున్నాడు. సరిహద్దు యిక్కడికి చాలా దూరం వుంది. తమంత తాము అక్కడికి నడుచుకుంటూ వెళ్లడం కానిపని. చాందిని ఎక్కడుంది ? తల్లి దండ్రులు యేమయినారు ? వాళ్లు సరిహద్దు దగ్గరకు చేరుకున్నారా ?, అసలు బతికి వుండి వుంటారా ? శిబిరంలో యేం జరుగుతోంది ? ఆర్మీ యీ సరికి ప్రశాంతత తీసుకురాగలిగిందేమో ! తాను వెళ్లి చూస్తే గాని తెలియదు. కాని ఎలా వెళ్లడం ? సునందను ఎక్కడ వదలడం ? ఆమెను తనతో తీసుకువెళ్లడం ఎలా ?

కెప్టెన్ రహ్మతుల్లా షర్ట్ వేసుకు వున్నాడు. అతని ట్రౌజర్లు, ఓవర్ కోట్ పక్కనే పడివున్నాయి. ఇవి సివిల్ దుస్తులు. అధికారిక దుస్తులు కావు. అరుణ్ అతని ట్రౌజర్ జేబులు వెదికాడు. అక్కడ తుపాకి దొరకలేదు. ఇష్టం లేకపోయినా శవం దగ్గరకు వెళ్లి పరీక్షించాడు. అక్కడ ఎక్కడా తుపాకి వున్న జాడలేదు. గబగబ పక్క గదిలోనికి నడిచాడు. ఏదో గుర్తువచ్చినట్లుగా మళ్లీ వెనక్కు నడిచి అతని ట్రౌజర్లు, జెర్కిన్ ఓవర్‌కోట్ తీసుకున్నాడు.

సునంద ఓ గడ్డివాముకు వీపు ఆనించి కూర్చునివుంది.

'మనం యిక్కడ నుండి వెళ్లిపోవాలి, త్వరగా. నీవు యీ దుస్తుల్లోనికిమారు'

'ఏ దుస్తులు ?'

అరుణ్‌కు సునంద దుస్థితికి దిగులు అనిపించింది. ఎన్నో యేళ్లుగా ఆమెను ఆత్మీయంగా ఆప్యాయంగా ఆరాధనగా చూస్తూ వున్నాడు. దగ్గర కూర్చుని చాలాసేపు ఓదార్చవలసిన సందర్భం. కాని యిప్పుడు సమయం లేదు. వీలయినంత త్వరగా యిక్కడనుంచి బయట పడాలి.

'నీవు మగవాడి దుస్తులు ధరించాలి ఈ చీరతో యిక్కడ నుంచి బయట పడడం అసాధ్యం '

'ఇంకా నాకు పోగొట్టుకోవలసింది యేముంది ?'

ఆమె వెక్కి వెక్కి యేడుస్తోంది.

'ఓ .. భాబీ.... నేను చెప్పినట్లు చేయి.... త్వరగా .'

ఆమె కన్నీళ్లు తుడుచుకుంది.

'అతని దుస్తులు వేసుకోమంటావా నన్ను'

'అలా అయితే. నావి వేసుకో. నా ట్రౌజర్లు తడిసిపోయి చల్లగా వుంటాయి. వాటినే వేసుకో ..'

ఆమె పరిస్థితులతో రాజీపడతూ అందుకు అంగీకరించింది. అరుణ్ మరో పక్కకు తిరిగి నిలుచున్నాడు. ఆమె రహ్మతుల్లా ట్రౌజర్లు లోనికి మారింది. అరుణ్‌కు సాధ్యమయినంత త్వరగా యిక్కడ నుంచి బయట పడాలని వుంది. ఆ తొందరలో సునంద దుస్తులు మార్చుకోవటానికి ముందే వెనక్కు తిరిగి ఆమెను చూచాడు. ఆమె రహ్మతుల్లా ట్రౌజర్లను కాళ్ల దగ్గరపైకి మడిచింది. తన పొడుగుకు సరిపోయేట్లుగా. తన రవికను ట్రౌజర్‌లోనికి దోపింది. ఇప్పటి దుర్భర స్థితిలో సైతం - అరుణ్ ఆమె అందాన్ని, బలమైన శరీర సౌష్టవాన్ని గమనించగలిగాడు. అందమైన పొందికైన విగ్రహం ఆమెది. జెర్సీ వుండడం మంచిదయింది. అది వేసుకోకపోతే ఎవరూ ఆమెను పురుషుడుగా అనుమానించలేరు.. జెర్సీ వదులుగా వుండి ఆమె స్తనయుగ్మాన్ని చక్కగా మరుగుపరచ గలుగుతుంది. ఆమె చీరతో తలపాగా తయారుచేసి ఆమె తలకు కట్టాడు. ఒక చివర తోకలాగా కిందకు వేళ్లాడేట్లు చేశాడు. ఇప్పుడామె పూర్తిగా ముస్లిం యువకుడి దుస్తులలో తయారయింది.

'ఇంతకూ మనం ఎక్కడకు వెడుతున్నాం ?'

అరుణ్‌కు యీ ప్రశ్నకు జవాబు తెలియదు. 'శిబిరానికి తిరిగి వెళ్లడమే మంచి పని అనుకుంటాను' అన్నాడు. ఆ మాటలు అన్నతరువాతనే యిదే చేయవలసిన పనిగా అతనికి అనిపించింది.

'చంపబడటానికా ?'

'ఏం జరుగుతోందో తెలుసుకోవడం కోసం'.

'అవును. తెలుసుకోవాలి'. ఆమె గుండెల్లో బాధ ఒక్కక్షణం బయటకు వచ్చింది. తన పిల్లలు యేమయినారో తెల్సుకోవాలి.

'ఇప్పుడు టైం ఎంతయింది ?'

అరుణ్ తన చేతి గడియారంలో మెరుస్తున్న అంకెల వంక చూచాడు.

'మూడు అయింది'

'అప్పుడే తెల్లవారిపోయినట్లయింది !'

అరుణ్ తన బూట్లు ధరించి కిటికీలోంచి బయటకు దూకాడు. భయపడుతూ అక్కడ కాస్సేపు నిలబడ్డాడు. చంద్రుడు దాదాపు అస్తమించాడు. ఇదివరకటి కంటె యిప్పుడు ఎక్కువ చీకటిగా వుంది. అరుణ్ చెవులు నిక్కబొడుచుకుని వినసాగాడు. దూరం నుంచి యేదో సవ్వడి వినవస్తోంది గాని తుపాకి కాల్పులు జరుగుతున్నట్లు లేదు. ఆమెకు చేయి అందించి సునంద కూడా కిటికీ గుండా బయటపడేట్లు సహాయం చేశాడు. ఇద్దరూ నాలుగు అడుగులు వేశారు. చుట్టూరా కలయచూచారు పరిస్థితి అవగాహన చేసుకోవడం కోసం. సునంద అతనిచేయి పట్టుకునే వుంది. వాళ్లు జీప్ దగ్గరకు వచ్చారు. ఆ నిశీధిలో అదో ఖడ్గమృగం లాగ నిలచి వుంది. అరుణ్ జీప్‌లో ఒక సంచి వుండడం గమనించాడు. ఆ సంచిలోనే వుంది రహ్మతుల్లా రివాల్వర్ గన్. దానిలోనే అతని అధికారక దుస్తులు, చాలా చేతిరుమాళ్ళు, నిద్రపోయేటప్పుడు వేసుకునే దుస్తులు, మరోచొక్కా.... యింకా యితర సరంజామా వున్నాయి. జీప్‌లో ఒక కంబళి కూడా వుంది. మరో జత బూట్లు వున్నాయి. ఇతను సియల్ కోట నుంచి నరోవర్‌కు ఎప్పుడు బయలుదేరాడా అని ఆశ్చర్యపడ్డాడు అరుణ్. చాల తయారయే వచ్చాడు యీ ప్రయాణానికి!

అరుణ్ గన్ తీసుకుని తన జేబులో పెట్టుకున్నాడు. వాళ్లు మరికొంత దూరం నడిచి చెట్లు దాటి ఆవరణ - బయలుకు చేరుకున్నారు. నిలబడి

నిదానంగా గమనించారు. చంద్రుడు క్రమంగా మరుగు అవుతున్నాడు ఆకాశంలో, నక్షత్రాలు ధగధగ మెరుస్తూ భయపెడుతున్నాయి. అనేక నేత్రాలు తమను గమనిస్తున్నాయనుకున్నాడు అరుణ్. దూరం నుంచి రకరకాల సవ్వడులు వినిపిస్తున్నాయి. అవి యేవి యేమిటో అర్థం కావడం లేదు. ఆ ప్రాంతంలో వున్న యే యింటి నుంచీ దీపాల వెలుగు కనబడడం లేదు ముందుకు పోవటానికి భయంగా వుంది. మరో గంటసేపు యీ కొట్టంలో గడపథమే మంచిదనిపించింది. అరక్షణ స్థితి గతులలో, ప్రస్తుతం వాళ్లకు కావలసింది తాత్కాలిక రక్షణ. అది కొట్టంలోనే చక్కగా అమరుతుంది.

ఇష్టం లేకపోయినా మళ్లీ కొట్టానికే వెళ్లారు అరుణ్ జీప్‌లోని కంబళి తీసుకున్నాడు. గడ్డి మీద పడుకుని యిద్దరూ ఆ కంబళి కప్పుకున్నారు. సునంద మాట్లాడుతోంది. అరుణ్ మాదిరిగా దండయాత్ర జరుగుతున్నప్పుడు ఆమె తమ డేరాలో లేదు. కొద్ది డేరాల దూరంలో వున్న తన స్నేహితురాళ్లను చూడటానికి వెళ్లింది. మొదటివిడత దుండగీళ్లు వచ్చినప్పుడు, వీళ్లందరూ భయవిహ్వాలురై పోయారు. ఆమె తమ డేరా దగ్గరకు పరుగు తీయసాగింది. అయితే ఆ వీధి మొగదలలోనే కెప్టెన్ రహ్మతుల్లాఖాన్ ఆమెను పట్టుకుని తనతోపాటు రాకపోతే కాల్చిపారవేస్తానన్నాడు.

సునంద వెక్కి వెక్కి యేడుస్తోంది.

'నన్ను చంపనిచ్చినా బాగుండి పోయేది!'

అరుణ్ యేమీ మాట్లాడలేదు. అతని ట్రౌజర్లు ఆరుతున్నాయి. కంబళి కింద వెచ్చగా కూడా వుంది. సునంద నుంచి యింకా వివరాలు వినవలెనని లేదు అతనికి.

'జీప్‌లో కూర్చున్నప్పుడు నన్ను ముట్టుకోనని వాగ్దానం చేశాడు. తన మనుషులు నా పిల్లల విషయం చూచుకుంటారన్నాడు. నాతో కొంత సేపు గడపడమే తన ధ్యేయం అన్నాడు. పిల్లల దగ్గరకు తీసుకువెళ్లి దింపుతా నన్నాడు'.

అరుణ్‌కు నిద్రవస్తోంది కడుపు ఆకలితో నకనకలాడుతోంది ఉన్నట్లుండి అతనికి మెలుకువ వచ్చింది. సునంద యిప్పుడు మౌనంగా వుంది. ఆ చీకటిని చీల్చుకుంటూ చూచాడు అరుణ్ ఆమె నిద్రపోతోందేమోనని. ఆమె కళ్లు తెరుచుకునే పడుకుని వుంది. ఇంటికప్పు వంక చూస్తోంది. పక్కగదిలోనే ఒక శవం పడివున్నదన్న సంగతి కూడా అతనికి గుర్తుకు వచ్చింది మళ్లీ నిద్ర రాలేదు

ఒక కారు యింజన్ మోత వినవచ్చింది. ఇద్దరూ లేచి కూర్చున్నారు. ఆ కారు దగ్గరగా వస్తోంది. వాళ్లు కిటికీ తలుపు మూసివేసి దానికి దగ్గరగా నిలుచుని గమనిస్తూవున్నారు. సునంద 'మనం యేం చేద్దాం ?' అంది అరుణ్ ఆమె పెదవులు తన చేతితో మూసివేశాడు. ఆ కారు యిప్పుడు ఆగిపోయింది కొట్టం నుంచి కొద్ది దూరంలోనే వుంది. పొలాలు దాటి తర్వాత వున్న మట్టిరోడ్డు మీద వుంది.

వాళ్లు ఊపిరి బిగబట్టి వింటున్నారు. కారు మళ్లీ దగ్గరకు వస్తున్నట్లు లేదు. ఎవరో లౌడ్ స్పీకర్లో గట్టిగా స్పష్టంగా మాట్లాడడం వినిపించింది. ఆ మాటలు యిలా వినిపించాయి · 'శిబిరంలో యిప్పుడు ప్రశాంతత నెలకొన్నది ఎవరైనా కాంది శీకులు యిక్కడ - యీ ప్రాంతంలో దాక్కుని వుంటే వెంటనే మా దగ్గరకు వచ్చిచేరండి శిబిరానికి తీసుకు వెడతాం' ఈ ప్రకటన మళ్లీ - కొన్ని సెకన్ల తరువాత రెండో మారు వినిపించింది.

అరుణ్ కిటికీలో నుంచి బయటకు దూకాడు. సునందకు సహాయం చేసి ఆమె బయట పడేట్లు చేశాడు. ఆమె చేయి పట్టుకుని మట్టిరోడ్డు దగ్గరకు పరుగు తీశాడు. ఒక ఫర్లాంగ్ దూరం మాత్రమే వుంది. చెట్లను దాటుకుంటూ వెళ్లాలి. చెట్ల గుబురుల్లో వాళ్లు వుండగా కారు బయలు దేరుతున్నట్లు శబ్దం వినవచ్చింది. ఆ చెట్లలోంచి ఒక ఒంటరి గుడ్లగూబ కూత వేస్తోంది. అరుణ్ అరిచాడు..అతని కంఠస్వరం వృక్షాలలో ప్రతిధ్వనించింది కూడా. అతను మళ్లీ అరిచాడు కాని ప్రయోజనం లేకపోయింది. ఆగమని అరిచిన కేకలు వాళ్లను చేరనే లేదు కారు వెళ్లిపోయింది. కారు వెనక దీపాలు దూరమైపోతూ కనిపిస్తున్నాయి.

రోడ్డు మీదికి చేరుకున్నారు ఏదయినా ప్రకటన నిజంగా వినవచ్చిందా తమకు - అని ఆశ్చర్యం, అనుమానం కలిగినాయి యిద్దరకీ తమ చెవులను తామే నమ్మలేకపోతున్నారు. అదే కారు మరోచోట యిదే ప్రకటన చేస్తూ వుండడం వినిపించింది. తమ దురదృష్టాన్ని నిందించుకున్నారు. శిబిరానికి యిప్పుడు తిరిగి సురక్షితంగా పోవచ్చు గదా - అనిమటుకు సంతోషించారు

ఉత్సాహంగా నడుస్తున్నారు. అరుణ్‌కు దారి తెలుసును, అయినా అప్పుడప్పుడు ఆగి సరైన దారినే వెడుతున్నామా లేదా అని పరీక్షించు కుంటున్నాడు. సునంద యీ ప్రకటన కేవలం మోసం చేయడం కోసం చేసినదేమో అంది. అలా అయితే మనను మనం చంపేసుకుందాం - అన్నాడు అరుణ్ వాళ్లకు నిరంజన్ సింగ్ గుర్తుకు వచ్చాడు. తతిమ్మా పొలాలలోంచి చప్పుళ్లు వినవస్తున్నాయి. కాని దారిలో ఎవరూ కానరావడం లేదు. వాళ్లు శిబరం చెంతకు చేరుకునే సరికి తెలతెలవారుతోంది. ఒకపొద మాటుకు వెళ్లి సునంద తన మామూలు దుస్తులలోనికి మారింది. ఆమె చీరకు రక్తం మరకలు అంటుకువున్నాయి. పంటకాలువ దగ్గరకు వచ్చినప్పుడు వాళ్లు ముఖము, చేతులు కడుక్కున్నారు. రక్తం కంటబడి అప్పుడు వాళ్లకు భయం విపరీతం అవసాగింది. ఈ ప్రాంతంలోనే శిబిరానికి తిరిగి వెడుతున్న కాందిశీకులు కొందరు కనిపించారు. వాళ్ల శరీరాల మీద దుస్తులమీద నెత్తురు జాడలు వున్నాయి. వాళ్లందరూ బడలి, శక్తి సడలి, హడలిపోయి వున్నారు. వాళ్ల ముఖాలలో యెలాంటి కళా కాంతులూ లేవు. ఒకటే బెంగ, భయం. ఇతరులకు యేమయిందో, యెలా వున్నారో తెలుసుకోవాలని అందరికీ ఆదుర్దాగా వుంది.

వాళ్ల ముందు చాల కోలాహలం వున్నట్లుంది. మెయిన్ గేట్ నుంచి చాల జీపులు ముందుకు వెనక్కు నడుస్తున్నాయి. సునంద అరుణ్ చొక్కా పట్టుకులాగి అతన్ని ఆపింది

'అరుణ్ నీవు చూసింది ఒక్కముక్కయినా బయటపెట్టవద్దు'.

'నేనేం చూడనే లేదు, భాభీ. నీవూ - నేను యీ రాత్రంతా యితర కాందిశీకులతో గడిపి వేశాం. అంతే !'

ఈ రాత్రి గడిచిన సంఘటనలను మరిచిపోవాలనే పూనికతో అతను జేబులోనుంచి రహ్మతుల్లా ఖాన్ చేతి తుపాకి తీపి పొలాలలోనికి విసిరిపారేశాడు.

సునంద అతని కళ్లలోనికి పరీక్షగా చూచింది. ఆమె శరీరం భయంతో వణికిపోతోంది. ధైర్యం కోసం వెంపర్లాడుతోంది పాదాలు పైకెత్తి ఆమె అరుణ్‌ను పెదవుల మీద ముద్దుపెట్టుకుంది.

వాళ్లు ముందుకు నడిచారు. గేటు దాటి శిబిరంలోనికి ప్రవేశించారు.

వాళ్లను యితర కుటుంబ సభ్యులు వివిధ రీతులలో కలుసుకున్నారు: అందరూ ఒకచోటే కూర్చుని వున్నారు - ఒకే డేరాలో ప్రభారాణి తటాలున లేచి అరుణ్‌ను కౌగలించుకుంది. పిల్లలు పరుగు పరుగన వచ్చి సునంద కాళ్లను చుట్టేశారు. కుర్రవాడు యేడుపు ప్రారంభించాడు. ఆ యేడుపులోను- 'ఎక్కడకు వెళ్లావు మమ్మీ' అంటున్నాడు. బీబీ అమరావతి కూర్చున్నచోటు నుంచి కదలలేదు. సునంద వంక అనుమానంగా చూచింది. 'సూరజ్ ప్రకాశ్ కనిపించడం లేదు. నువ్వు ఎక్కడకు వెళ్లావు ?'

సునందకు హృదయభారం అధికం అయింది. 'నేను అరుణ్‌తో వున్నాను' అంది. అరుణ్ 'అవును. మేం ఓ కొట్టంలో దాక్కున్నాం, మాతోపాటు అనేక మంది కాందిశీకులు కూడా వున్నారు' అన్నాడు.

అరుణ్ 'నాన్నగారు యెక్కడ ?' అన్నాడు గుండెలో గుబులు పడుతూనే.

'కులాసాగానే వున్నార్లే. శిబిరం ఆఫీసుకు వెళ్లారు' అని సమాధానం చెప్పింది తల్లి.

వాళ్లు మౌనంగా వుండిపోయారు. వాళ్ల ముఖాలలో ఎలాంటి భావాలు కదలాడడం లేదు.

అరుణ్ చుట్టూ చూచాడు.

'పద్మిని, ఛాందిని ఎక్కడ ?' అనడిగాడు తల్లిని.

ప్రభారాణి, అమరావతి యిద్దరూ మూలుగుతూ విచారంగా కూర్చున్నారు.

'అబ్బాయీ, నీకు ఎలా చెప్పేది ?' అంది ప్రభారాణి కొడుకుతో

'ఏమయింది, అమ్మా ?'

నిశ్శబ్దం అందరూ నిర్భావంగా చూస్తున్నారు. ఈషర్ కౌర్ యేడవడం మొదలు పెట్టింది.

'ముస్లింలు చాందినిని ఎత్తుకుపోయారు. ఆమె ఎక్కడ వుందో తెలియదు'.

అరుణ్ మూగపోయాడు ఈ చెప్పే మాటలనే కాస్త వేరే పద్ధతిలో చెబితే ఎంత బాగుండేది ! అమ్మకు అకస్మాత్తుగా ఆశ్చర్యాలు కలిగేట్లు మాట్లాడడం అలవాటే.... అనుకున్నాడు అరుణ్

ప్రభారాణి అతని మనసులోని భావాలు చదివేసినట్లు, అవి సరయినవేనని అంగీకరిస్తున్నట్లు తల ఊపింది. ఇంతకంటే మరో మార్గం లేదు యీ విషయం చెప్పటానికి. చాందినిని ఎత్తుకుపోయారు చాందిని యిక్కడ లేదు యిప్పుడు.

'పద్మిని ఎక్కడ ?'

'కేంప్ ఆఫీసుకు వెళ్లింది. మీ నాన్నతో పాటు మీ నలుగుర్ని గురించి వర్తమానం తెలుసుకోవటానికి ప్రయత్నిస్తున్నారు'.

సునంద కూతురు భావన తల్లిని చుట్టివేస్తు 'నాన్న ఎక్కడ అమ్మా ?' అని అడుగుతోంది. సునంద ఆ పిల్లకు యేదో సమాధానం చెప్పటానికి ప్రయత్నిస్తోంది. అరుణ్ శిబిరం ఆఫీసుకు వెడదామని లేచాడు

పద్మిని కళ్లు యేడుపుతో వుబ్బి వున్నాయి. ముఖం మీద గీతలు, చారలు. లాలా కాన్షీరామ్ లేచి వచ్చి అరుణ్‌ను దగ్గరకు తీసుకున్నాడు. కన్నీరు అణుచుకోవటానికి ప్రయత్నం చేస్తున్నాడు ఆయన. అరుణ్ రాత్రంతా తాను యెక్కడున్నదీ చెప్పాడు.

అరుణ్ పద్మిని వయిపు చూపుతూ 'ఈమెకు దెబ్బలు తగిలాయా దుండగీళ్ల చేతుల్లో' అనడిగాడు.

'లేదు. అదంతా ఆమె చేసుకున్నదే ఇతసేపూ ఆమె తలబాదుకుంటూ ముఖం గీరుకుంటూ కూర్చుంది '

పద్మిని ముఖం మీద బాదుకోవడం మొదలెట్టింది, మళ్లీ యేడుస్తూ. అరుణ్ వయిపు చూడలేదు ఆమె. ఊరికే ఆకాశం వంక చూస్తోంది. లాలా కాన్షీరామ్ ఆమె చేతులు గట్టిగా పట్టుకున్నాడు ఆమె పెనుగులాడుతూ విడివడటానికి ప్రయత్నం చేస్తోంది. దెబ్బ తిన్న జంతువులాగ ములుగుతోంది.

సూరజ్ ప్రకాశ్ శరీరం తరువాత బయలు పడింది. కడుపులో బాకుతో పొడిచారు ఎవరో ముఖం కూడా విరూపం చేశారు. రెండు కనుగుడ్లు పీకేశారు ఆ రోజు రెండు వేలకు పైగా మృత కళేబరాలు బయటపడ్డాయి. పగతీర్చుకోవడంలో ఎంత రాక్షసంగా ప్రవర్తించవచ్చునో యీ శరీరాలను చూడడంతో తెలుస్తుంది. ప్రతి శరీరం చిత్ర హింసలకు, విచిత్ర హింసలకు ఆలవాలం అయింది.

కాని చాలమంది జాడ, జవాబు తెలియలేదు. వాళ్లలో చాంధిని ఒకతె. అన్నీ లెక్కలు తేల్చుకున్న మీదట - చనిపోయినవాళ్లు లేక తప్పిపోయిన వాళ్లు దాదాపు మూడువేల మంది వరకు తేలారు. అందులో చాల మంది స్త్రీలు.

రాత్రి జరిగిన దొమ్మీ. పాకిస్తాన్ సేనల సహాయ సహకారాలతోనే జరిగిందని మేజర్ జంగ్ బహదూర్ సింగ్ నిశ్చితాభిప్రాయం. మిషన్ గన్ల మోతలు, సుశిక్షితులయిన సిపాయిల పర్యవేక్షణలోనే దుండగీళ్లు దుష్కృత్యాలు చేశారు. వాళ్లలో కొందరిని తానే చంపాడు. వాళ్లు పాకిస్తాన్ సైనికులే. తన మనుషులు చాలమంది, ఆరుగురు ఆఫీసర్లు యీ దొమ్మీలో హతులయ్యారు. డేరా బాబా నానక్ చేరుకోవడంతోటే గట్టి 'రిపోర్ట్' దాఖలు చేస్తానన్నాడు.

'రాత్రంతా ఎక్కడున్నారు నాన్నా ?' అని అడిగాడు అరుణ్.

'మేజర్ జంగ్ బహదూర్ సింగ్ డేరాలలో గడిపాం మొదటి చప్పుళ్లు వినిపించడంతోటే మేం అక్కడకు పరుగుతీశాం ఆయన మాకు ఆశ్రమం యిచ్చాడు. నీ కోసం అంతటా వెదికాం.'

అలా చేయాలని తన తండ్రికి ఆలోచన వచ్చివుండడం యుక్తం. మేజర్ జంగ్, భారత సిపాయిలు శిబిరంలో రెండు ప్రత్యేక డేరాలలో విడిసివున్నారు. తతిమ్మా వాళ్లందరూ చెల్లా చెదరయి అటు యిటు పొలాలలోనికి పరుగులు తీస్తుంటే లాలా కాన్షీరామ్ మాత్రం తన డేరాలోని మనుషులను తీసుకుని మేజర్ జంగ్ చెంతకు వెళ్లాడు.

'సూరజ్ ప్రకాశ్ మీ దగ్గర్నుంచి ఎప్పుడు మారుపడిపోయాడు ?'

'అదే విచిత్రం ! మేం పరుగెత్తుతున్నప్పుడు అతను మాతోనే వున్నాడు. తరువాత యేమయిపోయాడో అగుపడనే లేదు'

'పద్మిని - చాందిని ?'

'వాళ్లు నీళ్ల కొళాయి దగ్గరకు వెళ్లివున్నారు. పద్మినిని యీ ఉదయం వరకు మేం చూడలేదు. ఆమె చెబుతూంది. ముగ్గురు మనుషులు చాందినిని బలవంతంగా గుంజుకుపోయినారని !'

అరుణ్ యేడుపు దిగమింగుకున్నాడు.

'వాళ్లు పద్మినిని మటుకు యెందుకు వదిలేశారు ? ఆమె కూడా కంటికి నదురుగానే వుంటుంది గదా !'

లాలా కాన్షీరామ్ ముఖం కిందకు దించుకుని నేల వంక చూస్తున్నాడు. ఆయన ముఖంలో అన్నీ ఎరిగిన అన్నీ తెలుసుకున్న వివేకం విస్తరించుకువుంది. పైకి మాత్రం అమాయకుడుగా కనిపిస్తాడు గాని ఆయనకు లోకరీతుల్లోని తీరులన్నీ క్షుణ్ణంగా తెలుసును.

'కుమార్తెను వదిలివేయండి. నన్ను తీసుకుపోండి' అని ఆమె వాళ్లను ప్రార్థించింది. కాని వాళ్లు ఆమె మొరవినలేదు. లారీతో కొట్టారు. ఆమె స్పృహ

తప్పి పడిపోయింది. అలా స్పృహ లేకుండా పడివున్నప్పుడే ఎవరో ఆమెను చెరిచారని గూడా ఆమె అంటూంది.'

అరుణ్‌కు హృదయం చితికిపోయినట్లయింది. రాత్రికి రాత్రి తన కలలన్నీ పటా పంచలు అయిపోయినాయి. అతను పద్మిని వంక, తండ్రి వంక మార్చి మార్చి చూచాడు. అతనికి ఆ యిద్దరిపట్ల కొంత యేహ్యాభావం వీళ్లు యిద్దరే తమ నిద్దరినీ ఒకటి కాకుండా చేసినవాళ్లు ! వాళ్ల అభిప్రాయాయలకు భయపడి తాము దూరంగా వుండిపోవలసి వచ్చింది. చెట్టు మీద పండు పక్వమై వినియోగానికి అనువుగా వుంది. కాని దాన్ని పరిరక్షిస్తూ పాములలాగ చుట్టుకు వున్నారు వీళ్లిద్దరూ. అయితే యిప్పుడు ఎవరో ఆ పండును కోసివేసి నిర్ధాక్షిణ్యంగా తమ కాళ్ల కింద రాచి పారేశారు.

ఆ రోజంతా శిబిరంలో పలుమూలల నుంచి యేడుపులు, పెడబొబ్బలు వినిపిస్తూనే వున్నాయి. తమ బంధువుల వివరాలు తెలుస్తున్న కొద్దీ కొత్త తెరలుగా విలాపాలు బయలు పడుతున్నాయి. అరుణ్‌కు యీ సంతాపం, విలాపం యేమీ గొప్పగా అనిపించడంలేదు. చాందిని తనకు దొరికితే చాలు, దక్కితే చాలు - తతిమ్మా ప్రపంచం అంత ఊడ్చిపెట్టుకుపోయినా యింక తాను యేమీ బెంగపడడు. అతను ఆవరణ అంతా అనేకమార్లు చుట్టాడు. ప్రతి మృత దేహాన్ని పరీక్షించి చూచాడు. చాందిని గురించిన వివరాలు అందరికీ చెప్పాడు. కనిపించిన వాళ్లనంతా ఆమెను గూర్చిన జాడయేమైనా దొరికిందా అని అడిగాడు. పాకిస్తాన్ అధికారులు యిప్పుడు స్నేహ పూర్వకంగా ప్రవర్తించడం ప్రారంభించారు. దొమ్మి చేసిన వాళ్లలో చాలామంది నాయకులను అరెస్టు చేశాం అన్నారు. భారత సిపాయిలతోపాటు జీపుల్లో తిరిగి ఎత్తుకుపోయిన ఆడవాళ్లను తిరిగి తీసుకు వచ్చేందుకు సహకరించారు. అరుణ్ అలాంటి జీప్ ఒకదానిలో ఎగిరి కూర్చుని నగరంలోకి ఎన్నో పర్యాయాలు వెళ్లాడు. వెదకులాటలో పాల్గొన్నాడు. కొందరు స్త్రీలు రోడ్లమీద పడిపోయి కనిపించారు. కొందరు మగవాళ్లు కూడా దొరికారు. కాని చాందినీ, యింకా కొందరు స్త్రీలు దొరకలేదు.

ఆ రాత్రి అరుణ్ భోజనం చేశాడు, యిరవయి నాలుగు గంటల తరువాత. ముద్దలు మింగుతున్న కొద్దీ కడుపులో మంటలు కాలిపోతున్నట్లు అనిపించింది. అతను చపాతీలు లాక్కుని వుండలు చుట్టి మింగసాగాడు. టీ గ్లాసు అతని పక్కన ఉంచుతూ తల్లి 'యింతకంటె యింకెవరూ చేయగలది యేమీ లేదు' అంది. అరుణ్ ఒక్క గుక్కలో టీ తాగేశాడు. అది వేడిగా కిందికి దిగుతూ లోపల దహించుకుపోతోంది. ద్రావకంలాగ అతి తనను సమాప్తం చేసినా బాగుండును ! తరువాత శిబిరం ఆఫీసుకు వెళ్లి అక్కడే అర్ధరాత్రి వరకు వేచివుండిపోయాడు. అతని ముఖం డీలా పడిపోయింది. జీప్ వచ్చిన ప్రతిసారి ముఖం ఎత్తి పైకి చూచేవాడు. దొరికిన ఆడవాళ్లను వాళ్లకు సంబంధించిన కుటుంబీకులు తోడ్కొని వెడుతున్నారు. ఎవరికీ యీ పునస్సమాగమంలో ఆనందం వున్నట్లు లేదు. ఆడవాళ్లు యిలా చెడిపోయి, మకిలి అయిపోయి - తిరిగి రాకుండా పోయినా మహాబాగే అనుకుంటున్నారు గూడా కొందరు.

వాళ్లు యింకొక రోజు వేచి వున్నారు - ఎదురు చూడడం, వెదకడం వాళ్ల పని ఆ రోజుల్లో. దొమ్మీ జరిగిన రెండు రోజుల తరవాత మేజర్ బహదూర్ యింక ఆ ప్రయత్నం విరమించుకున్నాడు. ఇకపై దొరకవలసిన వాళ్ల వ్యవహారం సివిల్ అధికారులకు వదిలివేయవలసిందే. మేజర్ కాంది శీకులను సరిహద్దు దాటించటానికి నడక ప్రారంభం చేశాడు.

నరోవర్ నుంచి డేరా బాబా నానక్ వరకు జరిపిన ప్రయాణం యింత వరకు చేసిన దానికంటె భిన్నమైనది. ఇప్పుడు పాదయాత్రికులలో యేమాత్రం క్రమశిక్షణ లేదు. ఏదో రకంగా దెబ్బతినని కుటుంబమే లేదు. కాందిశీకులందరినీ యేదో నిస్సత్తువ, నిరాశ ఆవరించుకుంది. వాళ్లు తమ తమ యూనిట్లతో ప్రయాణం చేయడం లేదు యిప్పుడు. గుంపులు గుంపులుగా నడుస్తున్నారు. ఒక గుంపుకు మరో గుంపుకు మధ్య దూరం కూడా ఎక్కువయి పోయింది సరిహద్దు యింకా ఎనిమిది మైళ్ల దూరం వుంది. వేగంగా నడవాలి, త్వరగా సరిహద్దు దాటి భారత దేశంలో పడిపోవాలని అందరూ అనుకుంటున్నారు.

గాయపడ్డవాళ్లు చాలామంది వున్నారు గాని వాళ్లను తీసుకువెళ్లేందుకు 'స్ట్రెచర్లు' లేవు. గాయాలకు తాత్కాలికంగా యేవో కట్లు కట్టుకుని కుంటు కుంటూ నడుస్తున్నారు వాళ్లు. అంతగా నడవలేని వాళ్లను వాళ్ల బంధువులు బుజాలమీద మోసుకువస్తున్నారు.

నరోవర్‌కు సరిహద్దుకు నడుమ జస్సార్ అని ఒక ముస్లిం గ్రామం వుంది. కాందిశీకులకు భయంగానే వుంది. అయితే వీరి స్థితి మరీ హృదయ విదారంగా సానుభూతి ప్రేరూపించేదిగా వుండడం వల్ల ఆ గ్రామంలోని ముస్లిములందరు బారులు తీరి నిలబడి వీళ్లను చూస్తూ నించుండిపోయారు గాని యింకేం చేయలేదు. హిందువులకు, సిక్కులకు వ్యతిరేకమైన నినాదాలను గూడా పలికించలేదు వాళ్లు. గాయపడి, బీదపడి, భంగపడి, నిస్తేజంగా కదిలిపోతున్న మానవ సమూహాలను చూచి వాళ్లు ఊరికే నిలబడి వుండిపోయారు. పిల్లలయితే యేడవడం లేదుగాని దిగాలు పడిపోయి వున్నారు. మరీ వృద్ధులయినవాళ్లు హిస్టీరియా రోగుల లాగ ఊరికే రోదిస్తూ వున్నారు. పదయాత్రికులను ఎదుర్కోవటానికి బదులు జస్సార్‌లోని కుటుంబీకులు దప్పిక గొన్నవాళ్లకు తమ యింట్లోనుంచి త్రాగే నీరు తెచ్చి యిచ్చి సేవలు చేశారు. 'హుదా హఫీజ్' అని కొందరు నినాదాలు చేసి చేతులు ఊపుతున్నారు. చాలామంది చూస్తూ వుండిపోయారు అంతే !

అరుణ్ మటుకు యెప్పుడు స్వేచ్ఛా భారతావని మీద కాలూనుతామా అని ఎదురుచూస్తూ వున్నాడు. ఇప్పుడు రవి నది వంతెన దాటి సురక్షిత ప్రాంతానికి చేరుకున్నారు గనుక అతని ఉద్రేకాలన్నీ సమిసిపోయాయి. చాలమంది భారత భూమిని ముద్దుపెట్టుకుంటున్నారు. కొందరు రవి నదిలో స్నానం చేసి తాము పొందిన విమోచనాన్ని ఉత్సవంగా గడుపు కుంటున్నారు. తన తండ్రి కూడా యిటువంటి 'సెంటిమెంట్ల'కు లోనవడం అరుణ్ గమనించాడు. దారిపొడుగునా ఆయన సియల్‌కోట పట్టణాన్ని గురించే మాట్లాడుతూ వున్నాడు. ఇప్పుడాయన కిందకు వంగి కొద్దిగా మట్టి చేతుల్లోకి తీసుకుని వేళ్లతో పిసుకుతున్నాడు. ఆయన కళ్లల్లో నీళ్లు చేరుకున్నాయి.

చాల ఉద్వేగంగా ఉచ్ఛ్వాస నిశ్వాసాలు విడుస్తున్నాడు. తండ్రి కొడుకు ఒకరివంక ఒకరు చూచుకున్నారు. లాలా కాన్షీరామ్ తృప్తిగా చిరునవ్వు నవ్వాడు. అరుణ్ ఆయన తృప్తిని ఆనందాన్ని పంచుకోలేకపోయినాడు. ఆయన తల ఆడిస్తూ వుండగానే అతను ముఖం పక్కకు తిప్పుకున్నాడు. లాలా కాన్షీరామ్ చేయిపైకెత్తి 'వందేమాతరమ్' అని ఎలుగెత్తి అరిచాడు. అరుణ్ నిరవధికంగా అలవాటు చొప్పున ప్రవహించుకుపోతున్న నదివంక చూస్తూ వుండిపోయాడు.

పద్మిని నరోవల్ కాంపు నుంచి ఆ రోజు కదిలిరావటానికి ఒక పట్టాన అంగీకరించలేదు. చాందిని దొరికేంత వరకు యిక్కడే వుండిపోతానంటుంది. లాలా కాన్షీరామ్ చాలా సేపు చాలా కష్టపడి ఆమెను సముదాయించి తీసుకురావలసి వచ్చింది. శిబిరం యిప్పుడు పూర్తిగా తీసివేస్తున్నారు. ఆమె ఎక్కడ వుంటుంది ? చాందిని ఎక్కడ వున్నదో తెలుసుకునే మార్గం ఆమెకు యేమున్నది గనుక ? ... ఇంత జరిగిపోయిన తర్వాత చాందిని తిరిగి యిక్కడకు రావాలనుకుంటుందో లేదో యెవరు యెరుగుదురు ?

'ఆమె తిరిగివస్తే మటుకు ఎవరు పెళ్లిచేసుకుంటారు ?' అని అడిగాడతను కళ్లజోడులోనుంచి చూస్తూ ముఖం పైకెత్తి.

'నేను!'

వాళ్లు తమ డేరాలో కూర్చుని వున్నారు. ప్రభారాణి పక్కన యిప్పుడు యింకెవరూ లేరు లాలా కాన్షీరామ్ జ్ఞానోపదేశం చేయటానికి ప్రయత్నిస్తున్నాడు , ఆ బొగ్గుల కొట్టు యజమానురాలు పద్మినికి. 'నీ విచారం నాకు తెలుసు. నీ సంతాపంలో మేమూ పాలు పంచుకుంటాం. అయితే ప్రపంచంలో యితర విషయాలు కూడా చూసుకోవాలి గదా !'

అరుణ్ ఆ జవాబు చెప్పినప్పుడు అంతటా నిశ్శబ్దం ఆవరించి వుంది. లాలా కాన్షీరామ్ అతని వంక పరుషంగా చూచాడు. తాను విన్నది నిజమేనని ఆయనకు అనిపించడం లేదు.

'ఈ ఆడవాళ్లను ఎవరో ఒకళ్లు ఆమోదించి దగ్గరకు తీయవలసిందే వాళ్ల ప్రమేయం లేకుండా జరిగిపోయిన వాటికి వాళ్లను బాధ్యుల్ని చేసి బ్రతుకులు బండలు చేయలేం కదా !' అన్నాడు అరుణ్ దృఢంగా.

లాలా కాన్షీరామ్ అతని అభిప్రాయంతో యేకీభవించాడు - మనసులో. అయితే యీ బొడ్డూడని కుర్రవాడు తన అభిప్రాయాలతో వ్యతిరేకించి చరించడం అతను సహించలేడు.

'నీకింకా ప్రపంచానుభవం లేదు. లోకం ఎలాంటిదో నీకు సుతరామూ తెలియదు' అన్నాడు మరింత పరుషంగా కొడుకుతో, పైకి. తలూపి - అనామోదకంగా - 'నాకు పుస్తకంలో మాటలు పప్పచెప్పతావా ?' అని మళ్లీ పద్మని వంక తిరిగాడు.

చాందిని గురించి అరుణ్ మాట్లాడింది అదే ఆఖరు సారి. ఆమె ఎలాగూ తెలియరాని జాడలకు వెళ్లిపోయింది. తిరిగివచ్చే మాటకల్ల. ఎందుకు లేనిపోని విషయాన్ని గురించి రగడ చేసుకోవడం ?

నరోవల్ దాటిన తరువాత శిబిర కాందిశీకుల ప్రయాణం గురించి అతనంత శ్రద్ధ, ఆసక్తి కనబరచలేదు. ఎత్తుకుపోబడిన స్త్రీల జాబితా తయారు చేశారు. వాళ్లు దొరికినట్లయితే భారత దేశానికి పంపే యేర్పాట్లు చేయమని స్థానిక అధికారులకు చెప్పారు. చనిపోయిన వాళ్లు, జాడ దొరకనివాళ్ల జాబితా కూడా యింకొకటి తయారు చేశారు. తరువాత కాందిశీకులు ఎనిమిది మైళ్ల చివరి ప్రయాణానికి సన్నాహం అయినారు.

అరుణ్‌కు యీ ప్రయాణంలో ఓ వింత సంధిలాంటి ఉత్సాహం బయలుదేరింది. అతను తన కుటుంబంతో అంటిపెట్టుకుని లేడు. గబగబ చురుకుగా ముందుకు నడిచి వెడుతున్నాడు. తరువాత మళ్లీ వెనక్కు వస్తున్నాడు. సియల్‌కోటలో తమ యింటిని వదలి యివతలకు వచ్చేస్తున్న రోజు గుర్తుకు వచ్చింది ఇప్పుడు మళ్లీ కొత్త ప్రారంభం ! ఈ ప్రయాణం ఎప్పటికి ముగుస్తుంది, ఎలా ముగుస్తుంది, ఎక్కడ ముగుస్తుంది -- యేమాత్రం

ఊహకు అందడం లేదు. అతనికెంతో అదుర్దాగా గందరగోళంగా వుంది. మత సంఘర్షణ, దొమ్మి, దోపిడీలు - అతన్ని యిప్పుడు ఆకట్టుకోవడం లేదు నూర్‌ను చాందినీని వదలి వేశాడు. నూర్‌తో ప్రారంభం అయింది అసలు. తప్పటడుగులు ఆమెతో కలిసివేశాడు. చాందిని అతన్ని పర్వత శిఖరాలమీదకు తీసుకుపోయింది. ఆమె లేకపోతే ఆమె ఆలంబన దొరకకపోతే తన జీవితం ఎలా వుండేది ? దానికేమయినా విలువ వున్నదా అసలు ?

అతని యవ్వన శరీరంలో యేదో తుపాను. దీనికి తట్టుకోలేక అతను అటు యిటు తిరుగుతున్నాడు అవసరం లేకపోయినా యితరులకు హెచ్చరిస్తున్నాడు 'త్వరగా నడవండి, ముందుకు పదండి ...' అనవసరంగానే యితరులకు సహాయ సహకారాలు అందిస్తున్నాడు. ఓ పిల్లను ఎత్తుకోవడమో, ఓ సంచీ మోయడమో - తరువాత వున్నట్లుండి వాటిని రోడ్డుమీద పడేసి తన దారిని తాను వెళ్ళి పోవడమూ చేస్తువున్నాడు. ఏం చేయాలో తెలియక కొట్టుకుంటూన్నాడు. జేబుల్లో చేతులు పెట్టుకుని పంక్తులు తీరి నడుస్తున్న వాళ్లను గమనిస్తూ నవ్వుకుంటున్నాడు. పిరికి వెధవల్లారా; అని మనసులోనే తిట్టుకుంటున్నాడు. ఆ మాటకు అర్థం యేమిటో అవసరం యేమిటో అతనికి తెలియదు. దారికి అడ్డం వచ్చిన రాళ్ళను తన్ని రోడ్డు మీద నుంచి పొలాల మీదకు విసురుతున్నాడు. తిట్లు ... యితరులను తనను గూడ!

నదీ ముఖానికి దగ్గరగా వచ్చారు. నేల ఇసుకపర్రగా రూపొందుతోంది. మోటయిన వెదరు మొక్కలు విస్తారంగా అగుపిస్తున్నాయి. సురక్షితప్రాంతానికి చేరువ అవుతున్నారన్నమాట, స్వాతంత్ర్యానికి దాపవు తున్నారన్నమాట. దీనిలో యేదో మహత్వం వుంది. ఏదో ప్రీతి ఆప్యాయత వున్నాయి. గబ గబ పరుగెత్తుకు వెళ్లి నదీ గర్భం వంక అనురాగంగా చూడనారంభించాడు. రవి - చీనాబ్ - జీలం - బియస్ - సట్లెజ్ - యీవీ ఈ అయిదు నదులు. ఈ పేర్లను తన మనసులో తాను మననం చేసుకున్నాడు. ప్రత్యేకించి ఒక వరుసలో కాదు. ఏది మనసుకు తోస్తే అది. ఈ అయిదు నదులు-తన రక్తంలో ప్రవహిస్తున్నాయి. ఈ భూమికి - తాను - కాళ్ళు అన్చినిలుచున్న భూమికి - ఎంత ఋణ పడివున్నాడో. ఈ నదులకు తాను అంతే ఋణగ్రస్తుడు. ఇప్పుడ రవి నదిని దాటుతున్నాడంటే - మూడు నదులను తన వెనకగా శాశ్వతంగా వదిలేసి

వెళ్ళిపోతున్నాడన్నమాట! అందుకు ఒక్క నిమిషం పాటు అయినా అతనికి విచారం అనిపించలేదు. పేరులేని - బహు వేగంగా ప్రవహించే ఆ ఉపనది - ఆ మూడింటి కంటేనూ అకలుషితమైనది, మధురజలాలు కలది. ఊహు తాను ఈ నదిని వదలి వెళ్లడం లేదు. తనతో పాటు ముందుకు తీసుకువెడుతున్నాడు. ప్రేమ సాగరం యిది ఇది తనతో పాటు ఎంత దూరమైనా తోడుగా వస్తుంది. దీన్ని ఎక్కడా వదిలి వెళ్లవలసిన అవసరంలేదు. ఆ నదీ గర్భం ఎక్కడయినా ప్రవిస్తుంది.

చేతిలోని మట్టిని గట్టిగా పిసుకుతూ తిరిగి నేలమీదనే జారవిడుస్తూ అతని తండ్రి 'వందేమాతరమ్-' అని మళ్లీ మళ్లీ అంటున్నాడు

తల్లిచేతులు జోడించి భూమికి నమస్కారం చేస్తోంది. 'ఒక్కక్షణం-' అని అరుణ్ వెనక్కు పరుగుతీశాడు. 'వెనక్కురా వెనక్కురా. ఎక్కడికి ఆ పరుగు?' అని అరుస్తూన్నాడు వెనక నుంచి లాలా కాన్షీరామ్.

అరుణ్ వెనక్కువెళ్లాడు. సరిహద్దు వంతెన దాటాడు. కనిపించకుండా మాయమయ్యాడు. ఆగటానికి ముందు చాలసేపు పరుగుతీశాడు ఓ చెట్టు కొమ్మను తెగగొట్టి చేతి బెత్తం తయారు చేసుకున్నాడు. దానిని గాలిలో బలంగా ఉత్సహంగా ఊపుతున్నాడు.

'రండి- రండి- కదలండి-' అని కాందిశీకులను హెచ్చరిస్తున్నాడు. తన చేతి బెత్తంతో గాలిని రెండుగా చీల్చాలని ప్రయత్నిస్తున్నాడు.

'పదండి - నడవండి-' అని పిల్లలను అదిలిస్తున్నాడు. వాళ్ళు భయంతో అతనికి దూరంగా పరుగు తీస్తున్నారు.

'ఈ కుర్రాడికి మతి పోయినట్లుంది-' అన్నాడు కాందిశీకులలో ఒక పెద్దాయన, మరో మనిషితో. అరుణ్ బెత్తాన్ని గాలిలో ఊపుతున్నాడు. వాళ్ళు తమకు బెత్తం తగలకుండా పక్కకు తప్పుకుంటున్నారు.

# ఆరవ అధ్యాయం

డేరా బాబానానక్ నుంచి లాలాకాన్షీరామ్ కుటుంబం త్వరత్వరగా అమృత్ సర్‌కు కదిలింది. అక్కడ నుంచి నేరుగా ఢిల్లీకి చేరుకుంది.

అమృత్ సర్‌లో కొందరు బంధువులున్నారు. వాళ్ల దగ్గరకు వెళ్లారు ముందు. కాని ఆదరం అంతగా లభించలేదు. బంధువులు నవ్వారు. మీరు కులాసాగా బతికి బయట పడ్డందుకు చాల సంతోషం అన్నారు. కొందరు టీ యిచ్చారు. కొందరు తినడానికి పదార్థాలు యిచ్చారు. కాని ఎవరూ ఉండటానికి ఆశ్రయం యివ్వలేదు ఏవేవో క్షమాపణలు, కారణాలు చెప్పారు. తుదకు చోటు చాటడం లేదని, పంజాబ్ నుంచి వచ్చిన బంధువులు, అతిథులు యిప్పటికే ఎక్కువగా వున్నారు. రక్త బంధువులు అంటే యేమిటో యిప్పటికే అర్థం అయింది లాలాకాన్షీరామ్‌కు. నీవు రక్త బంధువువు అయితే- యింటిలోనికి చొచ్చుకు పోవచ్చును. ఎవరూ యివ్వకపోయినా, పలుకరించకపోయినా అక్కడ బిచాణా వేయ వచ్చును. కాని - యిప్పటి మాదిరిగా - దూరపు బంధువులు అయితే బయటి వరాండాలోనే కూర్చుని బయటకు వచ్చేసేయాలి

ప్రభారాణి కాన్పూర్ వెడదామని సూచించింది. ఆమె తల్లిదండ్రులు ఆమె చిన్న తనం లోనే గతించారు. ఇద్దరు అన్నలు ఆమెను పెంచి పెద్ద చేశారు. వాళ్లిద్దరూ జీవన గతిని వృద్ధి పరచుకోవటానికి చాల కాలం క్రితమే కాన్పూర్ వెళ్లారు. అయితే కాన్పుర్ చాల దూర ప్రాంతం అనిపించి లాలా కాన్షీరామ్ ఆ ప్రస్తావనను ఆదిలోనే తుంచివేశాడు. ఇంకా కొన్ని ఆలోచనలు వున్నాయి. జలంధర్ వెళ్ళవచ్చును, లుధియాన వెళ్ళవచ్చును. అంబాల పోవచ్చును. ఇవీన్న తూర్పు పంజాబ్‌లో పెద్ద పెద్ద పట్టణాలు. అయితే అవేవీ లాలా కాన్షీరామ్‌కు అంత యోగ్యమయినవిగా అనిపించడంలేదు. వాటికి వచ్చిన దోషం యేమిటి? అని అడిగింది. ప్రభారాణి. జవాబుకోసం వెదుక్కుంటూ అతను చివరకు 'అక్కడి శబ్దాలునేను భరించలేను.-' అన్నాడు. పంజాబ్ అంతటిలోనూ వాసయోగ్యం అయినది ఒక్కటే పట్టణం వున్నది అది సియల్‌కోట్.

అరుణ్ ఉబుసుపోక కోసం అన్నట్లుగా ఢీల్లీ పేరు సూచించాడు. లాలా కాన్షీరామ్ వెంటనే అంగీకరించాడు. అతడికి ఆశ్చర్యం అనిపించింది. తండ్రి గారు తమను జిప్సీలలాగ ఊరూరు తిప్పుతూ వుంటారు గాబోలు!

అమృత్‌సర్‌లో ఒక కాందిశీక శిబిరంలో రెండు వారాలపాటు గడిపారు. ఈ మారు యిక్కడకు రావలసిన వారి కోసం. భారత సరిహద్దుకు చేరుకున్నాం. యింక మనకష్టాలు గట్టెక్కాయి - అనుకోవటానికి వీల్లేదు. ఇక్కడ వసతి భోజన సౌకర్యాలు అంతంత మాత్రంగానే వున్నాయి. పైగా స్థానికులు వీళ్ళనుచూచి ఈసడించుకోవడం ఎక్కువ అయింది. వీళ్ళు కనిపిస్తే చాలు ముఖాలు ముడుచుకుంటున్నారు. వాళ్ళ సంఖ్య రోజు రోజుకు ఎక్కువయిపోతోంది. భోజన పదార్థాలు తరిగిపోతున్నాయి. శీతకాలం వస్తోంది. అందరికీ సరిపడ కంబళ్ళు లేవు. అందరూ సానుభూతి వాక్యాలు చేప్పేవాళ్ళే. అవి వాక్యాలుగా మటుకే ఉండి పోతాయి. డేరా బాబా నానక్‌లో వాళ్లను లారీలలో పడేసి అమృత్ సర్‌కు పంపారు. డేరా బాబా నానక్ లోని వాళ్ళు వీళ్లను వీలయినంత త్వరగా వదిలించుకోవాలనుకున్నారు. అలాగే చేశారుకూడా. ఇప్పుడు అమృత్ సర్ లోను యిదే వరస. ముందుకు పంపివేయడమే మంచిది! వాళ్ళు ఎక్కడికి వెళ్లాలో యెవరూ చెప్పడంలేదు. మీ యిష్టం వచ్చిన టౌన్ ఎంచుకోండి అక్కడే వుండిపొండి. అంతే! వాళ్ళకుదొరికిన సహాయ సహకారాలన్నీ ప్రయివేట్ మనుషులనుంచి, ట్రస్టులనుంచి మాత్రమే. ప్రభుత్వం వాళ్ళకు సహాయం చేయగల హంగులు, వసతులు కలిగిలేదు. స్వాతంత్ర్యం వచ్చిన రెండు నెలలకు - యిప్పటికీ పరిస్థితులు అదుపులోనికి రాలేదు - ఎక్కడ యేమి వున్నదో తెలిసి రావడం లేదు.

'కనీసం మనకు యిప్పుడు స్వతంత్రం వున్నది -' అనుకున్నాడు అరుణ్, అమృత్‌సర్ వీధుల్లో తిరుగాడుతూ.

విమానాల లోంచి తుపాకులు పేల్చినట్లు ఊరంతా పాడుపడివుంది. నగరంలోని ప్రధాన వీధి హాల్ బజార్‌లో ఒక్క కట్టడం అయినా విరూపం చెందకుండా లేదు. అంతా నాశనం అయిపోయింది. ఇంటి కప్పులు లేచి

పోయాయి. కిటికీ రెక్కలు కాలిపోయాయి. గోడలు శిథిలావస్థలో వున్నాయి. ప్రతి బ్లాక్, ప్రతి బజారూ, యిలాగే వున్నాయి. బొగ్గు మసి నల్లగా అంతటా అలుముకుంది. అనేక అంతస్తులు భవనాలు బూడిద కుప్పలుగా మాత్రం కూలిపోయి కనిపిస్తున్నాయి యిప్పుడు ఇవి ముస్లిముల యిళ్ళు, వాళ్లను యిప్పుడు యిక్కడనుంచి తరమివేశారు చాలమంది హిందు, సిక్కుల యిళ్ళు కూడ నాశనం అయినాయి.

పద్మిని అమృత్‌సర్‌లోనే వుండిపోతానంది. చాందిని ఎప్పుడో ఒకనాటికి కనగొనబడి యిక్కడకు తీసుకురాబడుతుందిని ఆమె నమ్మకం. బీబీ అమరావతి, సునంద. ఈషర్‌కౌర్, తేజసింగ్ వీళ్ళు మాత్రం లాలా కాన్షీరామ్ కుటుంబంతో పాటు ఢిల్లీకి ప్రయాణం అయ్యారు.

వాళ్ళ ఢిల్లీ ప్రయాణం అనేక ఆపుదులలతో అవిలయలతో సాగుతోంది. అధికారులకు వాళ్లను త్వరగా పంపివేయాలనేవుంది. అయితే ప్రతిస్తాయిలోను యేవో అటంకాలు యేర్పడుతున్నాయి. వేచి వుండవవలసి వస్తోంది

కాందిశీకుల శిబిరంనుంచి అమృత్‌సర్ స్టేషన్‌కు వెడుతూ వున్నప్పుడు కూడా వాళ్ళ టాంగాలు ఒక సందు దగ్గర గంటకుపైగా నిలిపివేయబడ్డాయి.

లాలాకాన్షీరామ్ అవిశ్రాంతుడైనాడు. టాంగాలు ఎందుకు నిలచిపోయినాయో యెవరూ చెప్పలేక పోతున్నారు. వాటి డ్రైవర్లు జాడ లేకుండాపోయారు. దారిలో వెడుతున్నవాళ్లను యెవరినో అడిగితే ముస్లిం స్త్రీల ప్రదర్శనం - ఊరేగింపు రాబోతూ వున్నదని అతి అలవోకగా జవాబు చెప్పాడు. సరోవాల్ అనుభవంమీద అది ఎటువంటి ప్రదర్శనవో అందరికీ తెలిసిపోయింది. ఎవరికీ అంత ఆసక్తి, కుతుహాలం అనిపించలేదు. ఇలాంటి వన్నీ యిక్కడ అతి మామూలు అయిపోయినాయన్నమాట! టాంగాలలో స్త్రీలు మాత్రం సిగ్గుతో తలలు వంచుకున్నారు. లాలా కాన్షీరామ్ తనకు జవాబు చెప్పిన మనిషి వంక తేరిపార చూచాడు. అరుణ్ నరోవల్‌లో తాను, సూరజ్ ప్రకాశ్ కలిసివెళ్లిన సందర్భం గుర్తు తెచ్చుకున్నారు. అమృత్‌సర్ దేవాలయం అమృతకలశం' వెనుక భాగం యిక్కడకు స్పష్టంగా కనిపిస్తోంది;

సిక్కులు ఎవరయినా యీప్రదర్శించ బడబోతున్న స్త్రీలను గురించి కన్నీటి బొట్టు రాలుస్తారా అని చూస్తున్నాడు అతను

ఆడవాళ్లనుగురించి అంటున్న బూతులమాటలు, తప్పుడు కూతలు టాంగాలలో వున్న వారి చెవులను కూడా తాకుతున్నాయి. లాలా కాన్షీరామ్ రెండుచేతులతోను రెండు చెవులు మూసుకున్నాడు టాంగా డ్రయివర్లు ఈ సంరంభం అయిన తరువాత అమితానంద పడుతూ తిరిగి వచ్చారు. అరుణ్ వాళ్ళ ముఖాల వయిపు చూడలేక పోయాడు.

తరువాత రైల్వేస్టేషన్ దగ్గర - వాళ్లు ఢిల్లీకి ప్రయాణం చేయవలసిన రైలుబండి యింకా సిద్ధం కాలేదు. వందలాది ముస్లిముల కళేబారాలతో నిండిన బండి ఒకటి యిప్పుడే వచ్చింది. ప్లాట్‌పాంను దానికోసం ఖాళీచేస్తున్నారు. ఈ రైలులో పాకిస్తాన్‌కు వెడుతున్న కాందిశీకులు వున్నారు. అమృత్ సర్‌కు ఆవలి సిగ్నల్ దగ్గర అది అగిపోయివుంది. అప్పుడే అందులో వున్న ముస్లిములను హత్యకు గురిచేశారు.

లాలా కాన్షీరామ్,.యితర హిందు కాందిశీకులు వెయిటింగ్‌రూం లో వేచివున్నారు. చావగా మిగిలినవాళ్ల ఆక్రందనలు వినవస్తున్నాయి. ఈ ఆక్రందనలు యీ సరికి సుపరిచితమైనవే అయిపోయినాయి హిందు కాందిశీకులు ‘వాళ్ళకు తగిన శాస్తే జరిగింది’ - అని లోలోన ఆనందిస్తున్నారు. లాలా కాన్షీరామ్ సిగ్గుతో చితికి పోతూ నేల వంక చూస్తున్నాడు మిగిలిన ముస్లిం కాందిశీకులను తీసుకుని ఆ రైలు లాహోరుకుపోవటానికి కొన్నిగంటల సమయం పట్టింది. మృత దేహాలన్నిటిని ఒక పక్కకు తోసి వేశారు. ఆ తరువాత ఢిల్లీ వెళ్ళే రైలు వచ్చింది ప్లాట్ ఫ్లాం మీదికి. ప్లాట్ ఫాం యిటీవలనే శుభ్రంగా కడగబడింది. అయితేరక్తపు జాడలు మాత్రం పూర్తిగా పోలేదు. ఇండియన్ సిపాయిలు తుపాకులతో రక్షణ యివ్వటానికి సిద్ధంగా నిలబడి వున్నారు. కాని వాళ్ళు కూడా పాకిస్తాన్ సిపాయిల మాదిరే దిష్టిబొమ్మలు. ముస్లిములను రక్షించడంలో విఫలులయ్యారు

తరువాత ఒక పోలీసు అధికారి వచ్చాడు ప్రతి పెట్టెలోనికీ ప్రయాణీకుల జాబితా తయారు చేయడంకోసం. ప్రతి వారూ తమ పేరు ప్రయాణికుల పేరు

పాకిస్థాన్‌లో ఎక్కడనుంచి వచ్చింది భారతదేశంలో యేనగరానికి యెందుకు వెడుతున్నదీ చెప్పాలి. ఇటువంటి జాబితాలు లోగడ అనేకం తయారుచేయడం జరిగింది. - డేరాబాబానానక్‌లోను, అమృతసర్ లోను తాము వంట సామాగ్రి తెచ్చుకున్న మునిసిపల్ దుకాణాల లోను, - అయినా ప్రతిచోట పరగడుపే! లాలా కాన్షీరామ్‌కు చివర ప్రశ్నకు- ఎందుకు వెడుతూన్నారు?- అన్నదానికి చాల చికాకు వేస్తుంది తాను ఢీల్లి ఎందుకు వెడుతున్నోడని వాళ్ళ ఉద్ధేశ్యం? 'జవహారలాల్‌నెహ్రూగారితో కలిసి విందులు కుడవటానికి.... స్వాతంత్ర్య మహోత్సావాన్ని జరుపుకోవటానికి-' అనిబదులు చెప్పాడు కసిగా.

కాందిశీకుల రైలులో ప్రయాణం చేయటానికి ఎలాంటి టిక్కెట్లు అవసరంలేదు. అ సంగతి కొందరికి మహాదానందం కలిగిస్తోంది. 'అవును ఇప్పటికి మనకు స్వాతంత్ర్యం వచ్చింది మన రైలు బళ్లలో మనం ప్రయాణం చేయటానికి టిక్కెట్లు కొనుక్కోవలసిన అవసరం యేముంది. గనుక!' అనుకున్నాడు- ఒక సిక్కు యువకుడు, లుంగీకట్టుకు కూర్చుని రైలు బయలుదేరే సమయానికి- రైలు టాప్ మీద పుట్‌బోర్డుల మీద కిటికీ చువ్వలు పట్టుకు వేలాడుతూ ఇంజన్ గదిలో గార్డువేన్‌లో .. యిలా వేలాది అధిక ప్రయాణికులు తయారయ్యారు. అరుణ్ యీ దృశ్యం చూడడం కొసం కిటికీ లోంచి ప్లాట్‌పాం మీదకు వచ్చాడు. అయితే ఆ క్షణంలోనే రైలు ముందుకు సాగడం ఆరంభించింది. కాస్తలోరైలు ప్రయాణం 'మిస్' అయ్యేవాడే అరుణ్. గిరుక్కున వెనక్కుతిరిగి పరుగుతీసి కిటికీ ఊచపట్టుకుని లోపలకు దూకాడు.లాలా కాన్షీరామ్‌కు కోపం అగలేదు - 'తెలివితక్కువ వాడా! క్షణంలో రైలు తప్పి పోయేది. నీవు యిక్కడే దిగబడి పోయేవాడివి -' అన్నాడు.

నిజానికి యీ భయానికి తావులేదు. రైలు బయలు దేరి వెళ్ళిపోవటానికి ముందు అనేక చోట్ల చాలసేపు ఆగిపోవలసివచ్చింది. ఆది ఎందుకు ఆగిపోతోందో యెవరికీ తెలిసేది కాదు. ఇంజన్ గర్జన చేసేది. నాలుగయిదు నిమిషాలు,రైలును నింపాదిగా నడిపేది. తరువాత సన్నగ కీచు శబ్దంచేసుకుంటూ ఆగిపోయేది. జనం కిటికీలోంచి. తలలు ముందుకు సాచి గార్డు కాబిన్ వంక

చూచేవాళ్ళు. రైల్వే అధికారులు ఆత్రంగా అటు యిటు తిరుగుతారు. తరువాత రైలు మళ్ళీ బయలు దేరేది. అమృత్ సర్ దాటి అవతలకు వెళ్ళే సరికి - అరైలు బహు భారంతో చక్రాలు నలిగిపోతూ నీరసంగా నడుస్తూ వుండింది

దారిలో ప్రతిస్టేషన్‌లోను గంటలతరుబడి ఆగుతుంది యీ రైలు. సిక్కులు, హిందువులు అనుమానంగా యీ రైలు పెట్టెలలో ప్రవేశించి తనిఖీ చేస్తారు. ఎవరయినా ముస్లింలు వున్నారేమో నని వాళ్ళ అనుమానం. ప్రతిచోట కొందరు దిగిపోయేవాళ్ళు. కొందరు లోపలకు చేరుకునే వాళ్ళు. చోటు కొసం ప్రతి కంపార్ట్ మెంటులోను యుద్ధాలు జరుగుతూ వున్నాయి. జలందర్ స్టేషన్లో ఈ రైలు యేడు గంటల సేపు నిలచివుంది. లుధియానాలో అయిదుగంటలు. అంబలాలో అయితే 'ఔటర్ సిగ్నల్స్' దగ్గరే నిలచిపోయింది. ఇంక యీ రైలు కదలదేమోనని అందరూ నిర్ధారణకు వచ్చేశారు.

అమృత్ సర్ వదలి యిరవై యెనిమిది గంటలయింది మామూలు గా అయితే నాలుగు గంటలలో పూర్తి అవవలసిన దూరం అది. ఇప్పుడు రాత్రిసమయం. ఈ రైలులో వాళ్లకు యిది రెండవ రాత్రి . రైలు స్టేషనుకు వెలుపలనే నిలచివుంది. రెండు పక్కల బహిరంగ క్షేత్రాలు, చాల దూరంగా నగర భవనాలు అగుపిస్తున్నాయి. రైలు పైన కూర్చునవాళ్ళు కిందికి దిగివచ్చి పట్టాలమీద బైఠాయించి కబుర్లు చెప్పుకుంటూన్నారు. కొందరు బయట పొలాల వయిపు వెళ్లి బహిర్దేశ కార్యక్రమం ముగించుకుని కులాసాగా తిరుగాడుతున్నారు. దారి పొడుగునా తినుబడిసామాన్లు మాత్రం తక్కువయి పోయాయి. తమ దగ్గర వున్న పదార్థాలనే వాళ్ళు నములుతున్నారు. అంబలా స్టేషన్ వస్తుందేమో, యేమైనా వేడి వేడి పదార్థం తినడానికి దొరుకుతుందని అందరూ యెదురు చూస్తూన్నారు. రైలు మాత్రం కదలికలేకుండా అలాగే పడివుంది గార్డుకు ఇంజనుడ్రైవర్‌కు కూడా సమాచారం యేమిటో లేశమాత్రమైనా తెలియదు. ఎదురుగా ఎర్ర సిగ్నిల్. అది ఎప్పటికీ పచ్చ రంగుకు మారడంలేదు. అంతే! గంటలు గడిచిపోతున్నాయి. సాయంత్రం ఏడుగంటల ప్రాంతంలో రైలు ఆగింది. ఇప్పుడు రాత్రి పదిగంటలయింది.

సరిగా ఆ సమయంలో ఈషర్‌కౌర్ కూర్చున్న చోటు నుంచి లేచింది. ప్రభారాణి వయిపు వంగి ఆమె చెవిలో యేదో రహస్యంగా గొణిగింది

ప్రభారాణి ఆశ్చర్యంతో 'నిజంగానా?' అనడిగింది ఈషర్‌కౌర్ అవును అని తల ఊపింది సునంద వాళ్ళవైపు చూచింది. బీబీ అమరావతి విషయం యేమిటని అడిగింది.

'ఆమెకు నొప్పులు ప్రారంభం అయినాయట!'

ముగ్గురు ఆడవాళ్ళు ఈషర్ కౌర్ వంక తేరిపార చూచారు. ఆమె శరీరం మెలికలు తిరిగిపోతోంది. ఆమె నెప్పులను తట్టుకోవడానికి ఎంతో బాధపడిపోతూంది.

'కూర్చో, అలా నించోకు, కూర్చునేవుండు-' అంటూంది, సునంద ఆ పిల్లపట్ల జాలిగా.

మగవాళ్ళు కూడా ఆమె వంక పరిశీలనగా చూడసాగారు. కొన్ని క్షణాలు ప్రభారాణి వాళ్లతో యేమి మాట్లాడలేదు. ఆమె భర్త చికాకుగా చూచాడు ఆమె వంక. "ఏమయింది?"

'ఆమెకు నొప్పులు ప్రారంభం అయినాయట?-' అని రెండోమారు చెప్పింది ప్రభారాణి. లాలాకాన్షీరామ్‌ను కరుణా సముద్రం ముంచివేసింది. ఇంతకుముందు చికాకు పడ్డందుకుగాను నొచ్చుకున్నాడు. ఈషర్‌కౌర్ వంక నిదానంగా చూచాడు. ఆమె అతనికి కుమార్తె వంటిది. ఆమె పెళ్లి అయినరోజులు గుర్తువచ్చాయి అతనికి. నిన్ననో మొన్ననో అన్నట్లుగా వుంది. ఇప్పుడు అమ్మాయి గుడ్డిగా వెలుగుతున్న పుసుపు పచ్చని దీపం కింద నీరసంగా కూర్చుండిపోయింది. పై పెదవి చెమటతో తడిసిపోయింది. చేతులు రెండు జారగిలపడిపోయాయి. ఆమె పొట్ట భారీగా పెరిగి వుంది. ఊపరితీసుకోవడం కూడా గగనం అయిపోతోంది. బెదిరిపోయిన కళ్లతో చుట్టూ వున్న వాళ్ళను ఒక్కొకళ్లను చూస్తోంది. బయటి చీకటివైపు, లాలాకాన్షీరామ్‌వైపు తన తండ్రివైపు చూస్తూవుంది, దీనంగా. మళ్లీ యింకో తెర నెప్పులు వచ్చాయి. ముఖమంతా చెమట కమ్మింది. నెప్పుల తీవ్రత తగ్గింది. నీరసంగా ముఖాన్ని చేతులతో కప్పుకుని యేడుస్తోంది. ఆమె కడుపంతా శిశువు అల్లకల్లోలంగా ఆక్రమించుకు వున్నట్లుంది.

ఆమెకు యేం చేయటానికీ తోచడం లేదు. ఊపరి పీల్చడం గూడా చేతకావడం లేదు.నోరు తెరిచి నోటితో గాలిపీలుస్తోంది. ముఖాన్ని చేతులతో కప్పుకుని యేడుస్తూ వుండిపోయింది. తరువాత ఉన్నట్లుండి కన్నీళ్ళు తుడుచుకుని దుపట్టాతో తల. కప్పుతుంది.

ప్రభారాణి పక్కన ఆమెకు కొంత చోటు చేశారు. ఆమె సిగ్గు పడుతూ 'కొన్ని గంటల నుంచి యిలా నెప్పులు వస్తున్నాయి-' అంది.

'ఎందుకు చెప్పావుకావు? మనం లూధియానా దగ్గర దిగిపోయే వాళ్లం గదా!'

ఆమె బుజాలు కుదుపుకుంది.

'తగ్గి పోతాయనుకున్నాను.'

ఆమె కళ్ళు మళ్లీ నీళ్ళతో నిండిపోయాయి. ఆమె ముఖం చిన్నగా సుకుమారం గావుంటుంది. ముఖం పాలిపోయి యిప్పుడు చూడటానికి అంత యిదిగాలేదు. కళ్ళ చుట్టూ కండలు వాచిపోయాయి. ముక్కుకొన మొద్దుబారిపోయింది. బుగ్గలు పొంగి సాగినాయి. అయినా ఆమె యిప్పుడు చూడటానికి కూడా కొంత అర్హతగా వుంది. కళ్లు కిందకు దించుకుని, పెదాలు ఉద్రేకంతో కదులుతూ, ఏదో అమాయకత్వం నిలువెల్లా వ్యాపించి వుండగా... ఆమె పరిస్థితులతో రాజీపడాలనే పద్ధతిలో వుంది. ముందు నుదిటి మీద చెమటలు తుడిచివేసుకుంది. అందరి మధ్య పొందికగా కూర్చుని చిరునవ్వు తెచ్చుకోవటానికి ప్రయత్నిస్తోంది, కళ్ళలో నీళ్లు పేరుకుంటూన్నాకూడా.

ఆడవాళ్ళుయెంత చురుకుగా అక్కడ ప్రసవానికి తగిన యేర్పాట్లన్నీ చేసిందీ లాలా కాన్షీరామ్ చాల రోజుల వరకు గుర్తు వుంచుకున్నాడు. అతనికి చాల యిబ్బందిగా వుంది. ఈషర్ కౌర్‌తో మాత్రం నింపాదిగా 'యేమి భయపడుకు అమ్మాయీ, అంత సవ్యంగా జరుగుతుంది-' అన్నాడు. రైలు స్టేషన్లోనే ఆగివున్నా యేం చేయాలో అతనికి తెలిసివుండేది కాదు. ప్రభారాణి అతని యిబ్బందిని గమనించి 'మీరేంఖంగారు పడనవసరం లేదు. అంతగా అయితే అమ్మాయి యిక్కడే పురుడు పోసుకుంటుంది,' అంది.

రైలు పెట్టెలో కొంత జాగా కాళీచేశారు ఈ జాగాకు అడ్డంగా ఒక తెర కట్టారు. యితర మనుష్యులు చూడటానికి వీలులేకుండా అందరు సహాయం చేయటానికిముందుకు వచ్చారు. కొందరు ఇంజన్ దగ్గరకు వెళ్ళి ఓ బకెట్‌తో వేడినీళ్ళు తీసుకువచ్చారు ఆడవాళ్లు తమ పెట్టెలలోంచి శుభ్రమైన తువాళ్ళు, దుప్పట్లు తీసి ప్రభారాణికి అందచేశారు అరుణ్ యెక్కడైనా ఆడ డాక్టరువున్నదేమో చూసి వస్తానన్నాడు 'ఆడ డాక్టర్ అవసరం యేముంది?' అన్నది బీబీ అమరావతి, మంత్రసానితనంలో తన చాకచక్యాన్ని నైపుణ్యాన్ని ఎవరో కించపరుస్తున్నారన్నట్లుగా

ఈ రాత్రంతా యిక్కడే గడిపి వేయ వలసివస్తుందని వర్తమానం అందింది ముస్లిం కాందిశీకులతో కూడిన ఒక రైలు అంబాలా స్టేషన్ వద్ద పట్టాలు తప్పిపోయింది. ఈ ఆలస్యం అంతా ఆ కారణంవల్లనే. ఈ రైలు లాహోరు వెడుతోంది. మార్గమధ్యంలో అంబాల వద్ద యీ ప్రమాదం జరిగింది. రైలు అసలు యిక్కడ ఆగవలసిన పనిలేదు ఎవరో స్టేషన్ వైపు 'స్విచ్' పడేసి రైలును పక్కపట్టాలకు తప్పించారు సరిహద్దు కంచెలకు కొట్టుకుని కొన్ని పెట్టెలు తలకిందులయ్యాయి ఢిల్లీ మార్గం అంతా కప్పబడి పోయింది అంతా పరిశుభ్రం చేయటానికే ఎంతో సమయం పడుతుంది. ఎన్నో ప్రాణాలు పోయాయి.

ఈషర్‌కేర్‌కి అర్థరాత్రి దాటిన తరువాత నిజమైన నెప్పులు ప్రారంభంఅయినాయి ఆమె అరుపులు మొదలెట్టింది కంపార్ట్ మెంట్‌లో వున్నవాళ్ళు ఒకళ్ల ముఖాలు ఒకళ్ళు చూచుకోవడం తప్ప యింకేం చేయలేకపోయారు. కొందరు వృద్ధులు అంతా సవ్యంగా జరిగేట్లు చూడమని భగవంతుడిని ప్రార్థించారు రైలుపెట్టె బయట చాల మంది పోగయ్యారు అందరికీ ఆసక్తిగా వుంది. లోపల యేం జరుగుతోంది? లాలా కాన్షీరామ్ వాళ్లందరికి బయటకు తోలేస్తున్నాడు. కంపార్ట్ మెంట్‌కు కొద్ది దూరంతో పోగయ్యారు యిప్పుడు వాళ్ళందరూ

అరుపులు హృదయాన్ని చీల్చి వేసేట్లున్నాయి. ఎవరో చిత్రహింసకు గురిఅవుతున్నట్లు వుంది చిన్నగాప్రారంభం అయి, చాల గాఢంగా చొచ్చుకు

పోతూన్నాయి ఆ కేకలు. తెర వెనకాల పోగయిన స్త్రీలు ఈషర్‌కౌర్‌ను ఓదారుస్తున్నారు, సంబాళిస్తున్నారు. కాస్త తట్టుకో ఎక్కువసేపు యిలా అవస్థ వుండదు, 'వాహేగూరు... అని చెప్పు..' ఆమె వారి సూచనలన్నీ అనుసరిస్తూనే వుంది. ఉండి ఉండి నెప్పులు తీవ్రంగా వచ్చినప్పుడు సూటిగా కేకలు వేస్తూవుండింది. తరువాత చాలసేపు ఆయసపడుతూ ఒగరస్తూవుంది. ఆపైన నిస్తబ్ధంగాకూర్చుంటూంది.

ఈ వార్త అంతటా వ్యాపించినట్లుంది. ఎక్కడినుంచో ఒక లేడీ డాక్టర్ గారు యిక్కడ ప్రత్యక్షమై తెరవెనక్కు వెళ్ళి పరిస్థితిని పర్యవేక్షిస్తోంది. తెరలు తెరలుగా నొప్పులు వస్తున్నాయి. ఉండి ఉండి గుండెలు అవిసిపోయే కేకలు వేస్తోంది. రైలు కంపార్ట్ మెంట్ అంతా యీ కేకలు తప్ప నిశ్శబ్దంగా తయారయిపోయింది. మగవాళ్లకు ఒకళ్ళు ముఖాలు ఒకళ్ళు చూచుకుందుకు కూడా సిగ్గుగా వుంది. ప్రసవ వేదన, అరుపుల ఆక్రందనలు.. యిదే వాతావరణం.

తెల్లవారు జామున నాలుగు గంటల ప్రాంతంలో ముస్లిం కాందిశీకుల రైలు - అంబాలలో దిగబడిపోయినది - ఆవలి పట్టాలమీద నుంచి లాహోరు ప్రయాణం పున:ప్రారంభించింది. రకరకాల పుకార్లు బయలుదేరాయి. వందలాది మనుషులు చనిపోయారు, నాలుగు బోగీలు యింజను - నుగ్గునుగ్గు అయిపోయినాయి. ఇంజన్ డ్రయివర్ హిందువును చంపేశారు. లేదు అతనికి ముందుహెచ్చరిక యిచ్చారు. అందువల్ల ఇంజన్ నుండి దిగిపోయి పొలాల వెంట పరుగుతీశాడు. ఏడు వందలమందిచనిపోయారు. నాలుగు వందల మంది చనిపోయారు. లేదు, లేదు - చనిపోయిన వాళ్లు యిరవయి మంది మాత్రమే.రైలుతోపాటు ప్రయాణం చేస్తున్న పాకిస్థాన్ ఆర్మీమనుషులు స్టేషన్లోని హిందువులను కాల్చి చంపేశారు. స్టేషన్లో వున్న హిందు ఆర్మీ పాకిస్తాన్ వాళ్ల నందరినీ చంపేసింది. రైలు పట్టాల మీద నుంచి బోగీలను తొలగించటానికి 'క్రేన్ల' కు బోలెడు సమయం పట్టింది. ఢిల్లీ నుంచి కొత్త ఇంజన్ కూడా వచ్చింది.

వీటిలో దేన్ని నమ్మాలో దేన్నివిసర్జించాలో నిర్ణయించుకోవడం కష్టం. అయితేఆ ముస్లిం రైలు - యీ ఆగి వున్న రైలును దాటిపోతూ వున్నప్పుడు

ఎటువంటి నినాదాలు, అరుపులు వినరాలేదు. రైలు లోపలనుంచి యేడుపులు పెడబొబ్బలు మాత్రం వినిపిస్తున్నాయి. కాని యేపెట్టెనయినా పరికించి చూడగలిగే లోపలే అది ముందుకు దూసుకుపోతుంది గదా? కనుక విషయం యేమిటో వివరం యేమిటో తెలియదు. హిందు కాందిశీకుల రైలు మాదిరే ఆ రైలు కూడ కిక్కిరిసి వుంది. దానిపైన కూడ కుటుంబాలుకూర్చుని వున్నాయి రైలు యిప్పుడే వేగం పుంజుకుంటూంది కాందిశీకుల వర్గాలు రెండూ ఒక దానిని మరొకటి ఉదాసీనంగా పరామర్శకంగా చూచుకున్నాయి.

ఉదయం అయిదు గంటల ప్రాంతంలో, ఆగిపోయిన పదిగంటల తరువాత, ఈ రైలుకు ఎర్ర సిగ్నల్-పచ్చ సిగ్నల్‌గా మార్పు అయింది. ఢిల్లీ రైలు ముందుకు నడక ఆరంభించింది. అతి నిదానంగా నడుస్తోంది. ఔటర్ సిగ్నల్‌ను దాటి ఎన్నో లైన్ల మధ్య వెడుతూ ముఖ్యమైన పట్టాలమీదకు చేరుకుంది. స్టేషన్ ఆవరణలో ప్రవేశించింది. ఇన్నర్ సిగ్నల్ దాటుతోంది. ప్లాట్ ఫారాలు యింకా కొద్ది దూరంలో వున్నాయి. సరీగా యిప్పుడు దెబ్బతిన్న బోగీలు పక్క పట్టాలలో పడి కనిపించాయి. క్రేన్లు యింకా వాటిని పైకి లాగడానికి ప్రయత్నం చేస్తున్నాయి. దాదాపు నడుస్తున్న వేగంలోనే వెడుతూంది ఈ రైలు. మృతదేహాలన్నీ ఒక లైనుగా చేర్చి పడివున్నాయి. అన్నిటికీ ముసుగులు కప్పారు పైన కప్పిన బట్టను బట్టి కొన్ని శిశువుల దేహాలేనన్న విషయం గూడా తెలుస్తోంది.లాలాకాన్షీరామ్ మొత్తం శవాలను లెక్కబెట్టగలిగాడు. తొంభై నాలుగు వున్నాయి. బాహుశా తతిమ్మా వన్నీ యింకెక్కడో పంక్తులు తీర్చి వుంటారు - అనుకున్నాడు.

ఢిల్లీ రైలు యీ మృత దేహాల పక్కనుంచి వెడుతున్నప్పుడు, రైలు కంపార్ట్‌మెంట్‌లో నుంచి సన్నని గావుకేక వెలువడింది. ఈషర్‌కౌర్ ప్రసవించింది. ఈ ప్రపంచంలోని ఒక కొత్త జీవుడు ప్రవేశించాడు. తెర వెనుక ప్రశాంతత సంతరించుకుంది. పసిపిల్ల రోదనం మటుకు సన్నగా వినవస్తోంది. మగవాళ్లు ఎంతో భారం దిగిపోయినట్లుగా ఒకళ్ల వంక మరొకళ్లు చూచుకున్నారు. ఆడవాళ్ళు దేవుడికి వందనాలు సమర్పించారు. రైలు మెల్లగా ముందుకు నడుస్తోంది. అందరూ బయటకు చూస్తూవుంటే రైలు పెట్టెలోని కొత్త ప్రాణి మటుకు తనను గమనించమన్నట్లుగా రోదిస్తోంది.

ప్రభారాణి తెరలోపలనుంచి బయటకు వస్తూ 'ఆడపిల్ల' అంది ఎవరూ ఆనందం ప్రకటించకపోవడంతో ఆవిడే మళ్లీ 'ఈషర్ కౌర్ ఆడపిల్లే కావాలను కుంది-' అని కలిపింది.

రైలు అంబాల స్టేషన్లో యిరవైనాలుగు గంటలు ఆగింది. దాన్ని ఒక పక్క ప్లాట్‌ఫాం మీదకు నెట్టారు. లోపలున్నవాళ్లకు యిది "చక్రాల మీద ఇల్లు"గా తయారయింది. చాల మంది అంబాలలోనే దిగిపోయరు. అక్కడే వుండిపోయి తమ జీవితగతిని, అదృష్టాన్ని పరీక్షించుకోవాలనుకున్నారు. ఇక్కడ రైలులోనికి కూడ కొంతమంది కొత్త వాళ్ళు ప్రవేశించారు. ఆడవాళ్ళు బట్టలు ఉతుక్కున్నారు. తలలు దువ్వుకున్నారు పిల్లలకుస్నానాలు చేయించారు. మగవాళ్ళు కూడా చాలా మంది శుభ్రంగా స్నానం చేశారు. ప్లాట్‌ఫాం అంతా కూడా ఒక శిబిరమే అన్నట్లు రూపొందింది. కొందరు చిల్లర అమ్మకం దారులు వచ్చారు. కొన్ని సాంఘిక సేవా సంస్థల వాళ్లు టీ, ఫలహారం ప్యాకెట్లు పంచిపెట్టారు కాందిశీకులకు రైలు మరునాటి వరకు ఢిల్లీ కి వెళ్లదని ప్రకటన అయింది గనుక చాలమంది ఊరు ఎట్లా వుందో చూద్దామని దిగిపోయారు. రైలు అంబాల కంటోన్‌మెంట్ స్టేషన్లో ఆగివుండింది. వాళ్ళు అక్కడ టాంగాలు చేసుకుని నగరంలోనికి ప్రయాణించారు. లాలా కాన్షీరామ్, అరుణ్ కూడా వెళ్లారు. సాయంత్రం వాళ్ళు వచ్చిన తరువాత అడిగింది ప్రభారాణి 'ఎలా వుంది వూరు?' అని. 'చాల దరిద్రంగా వుంది. ఒళ్లు కంపరం ఎత్తేట్లుగా వుంది' అన్నాడు లాలాకాన్షీరామ్.

రైలు ప్రయాణం సాగుతోంది..ప్రయాణంలో చివరి అంతస్తులో వున్నారు. సాయంకాలానికల్లా ఢిల్లీ చేరుకుంటారు. లాలా కాన్షీరామ్ భార్యను ఆప్యాయంగా పిలిచాడు. అలా ఆప్యాయత ఆనోటి వెంటవిని చాల రోజులు అయింది ఆమె. మాట్లాడడం కోసం దగ్గరకు రమ్మని ఆయన మాటలలో చెప్పలేదుగాని ఉద్దేశ్యం మటుకు అదేనని ఆమె గ్రహించింది అతని పక్కన కూర్చుంది. అరుణ్ అటువయిపుకు జరిగాడు. ఈషర్‌కౌర్, ఆమె కూతురు తెరచాటున యింకా నిద్రపోతూవున్నారు, విశ్రాంతిగా. సునంద పిల్లలుగూడ ఆ తెరల మధ్యనే నిశ్చింతగా నిద్రపోతున్నారు. అందరూ ఎక్కడ జాగా దొరికితే అక్కడల్లా కూలబడ్డారు.

'ఆ ప్రాంతం యేమిటో యెరుగుదువా?' అనడిగాడు, బొద్దయినవేలు దూరప్రాంతం వయిపు చూపుతూ, ప్రభారాణికి అతని తలనుదగ్గరకు తీసుకుని లాలించి ఒడిలో - గుండెల మీద - పెట్టుకుని ఊరడింపు పొందాలని, యివ్వాలని అనిపించింది. వెనకటి రోజుల్లో అయితే అలాగే చేసింది. వాళ్లు యింటి దగ్గర్నుంచి బయలు దేరిన తర్వాత యిటు వంటి ప్రశ్న అయన యింత వరకు అడగ లేదు అయన యింతవరకు ఆడగలేదు. ఒక్కటంటే ఒక్క ప్రశ్న వేయలేదు అయన యిప్పుడు చాల చిక్కిపోయి కనిపిస్తున్నాడు.ముఖం మరీ చిన్నబోయింది మధు మరణం ఆయనకు ఎంతో సంతాపం తీసుకువచ్చిందని ఆమె ఎరుగును. ఆయన ఒక్కమాటయినా అనలేదు. కాని ఆయన లోపల ఎంత బాధపడుతున్నాడో ఆమెకు క్షుణ్ణంగా తెలుసును. కత్తిలాంటి బాధ నింపాధిగా, నిశ్శబ్దంగా, నిరవధికంగా ఆయన్ను చీలుస్తూవుంది, లోలోపలే

'తెలియదు. ఏమిటది?' అందిఆమె కళ్ళలో నీళ్లు నింపుకుని.

ఒక క్షణం లాలాకాన్షీరామ్‌కుఅనిపించింది, ఆమెకు జవాబు తెలుసుననీ తన దగ్గర్నుంచి జవాబు వినడం కోసం తెలీనట్లు నటిస్తోందనీ. తలకిందకు వాల్చి ఆమెను పరిశీలనగా చూచాడు.

కాని ఆమెకునిజంగా తెలియదు. ఆమె అబద్ధం చెప్పలేదు. ఆమె యేడుస్తూవుండింది. ఎందుకు ఏడుస్తోందో ఆయనకు తెలీదు.

తలపైకెత్తి ఆయన హుందాగా 'అదే కురుక్షేత్రం!' అన్నాడు.

'కురుక్షేత్రం?'

ప్రభారాణికి ఎంతో సంతృప్తి అనిపించింది.

'అవును, పాండవులు, కౌరవులు మహాభారత యుద్ధం చేసింది యిక్కడే!' అన్నాడు ఆయన.

ప్రభారాణి కింధకు వంగి కిటికీలోనుంచి బయటకు చూచింది, చూడగలంత మేర ఆమె ముఖంలో ఎంతో మర్యాద, మన్నన ద్యోతకం అవుతున్నాయి.

'పవిత్ర పుష్కరిణి ఎక్కడ ?'

అది యిక్కడకు కనిపించదు. కురుక్షేత్ర పట్టణం కూడా యిక్కడి నుంచి అగుపించదు. కొద్ది దూరంలోనే వుంది. ఇవి అన్నీ పొలాలు.'

ప్రభారాణి కళ్ళు విశాలం చేసుకుని మరీ చూచింది

చిన్న తనం నుంచీ వింటూవచ్చిన మహాభారత కధలు - గాధలు ఆమె మనసులో మెదల సాగాయి. 'అరుణ్, యిటు రా..' అనిఅతన్ని పిలిచింది తాను యిప్పుడు తెలుసుకున్న సంగతి అతనికి చెప్పింది. అరుణ్ అంత ఆసక్తి చూపకపోవడంతో ఆమె నొచ్చుకుంది. భర్తవయిపు తిరిగి 'ఎప్పుడో ఒకనాడు నన్ను ఆ చెరువు దగ్గరకు తీసుకువెళ్లండి. అక్కడ స్నానం చేయాలి-' అంది

'తప్పకుండా తీసుకువెడతాను. ముందు మనం ఎక్కడో అక్కడ సెటిల్ అవాలి. తరువాత తప్పక తీసుకువెడతాను.-'

వాళ్ళు నిశ్శబ్దంగా అంతా గమనిస్తున్నారు. ఒక గ్రామం పక్కగా వెడుతోంది రైలు. మరో గ్రామం కూడా వెళ్ళి పోయింది. మట్టి, యిటుక ఇళ్లు, వంకరటింకరగా గొందులు చెరువులు - వాటి దగ్గర దున్న పోతులు. చాల చాలచెట్లు, ఆవులు మేత మేస్తున్నాయి కొంతసేపు కురుక్షేత్ర పట్టణం ఆకాశంలో లీలగా కనిపించింది. 'ఇదంతా పవిత్రమైన స్థలం. ధర్మం కోసం మహానాయకులు పోరాడిన చోటు. తప్పకుండా తీసుకువెడతాను-' అంటూనే లాలాకాన్షీరామ్ 'నీకు ఈవిషయం తెలుసునా?' అనడిగాడు.

'ఏమిటిది?'- కురక్షేత్రాన్ని గురించి మరిన్ని వివరాలు తెలుసుకుందుకు సిద్ధమై కూర్చుంది.

'నేను ద్వేషాన్ని విసర్జించేశాను.-'

ప్రభారాణి అతని వంక చూచింది విస్మయంగా. లాలా కాన్షీరామ్ పొలాల వంక చూచాడు. ఆయన ముఖంలో ఉత్సుకత, ఆదుర్దా అంతరించాయి. అయన ముఖం యిప్పుడు కొత్త ప్రశాంతతతో నిండి వుంది. విచారం కూడా కొంత మేర అలుముకుంది.

'ద్వేషమా?'

'అవును. ఇప్పుడు నేను ముస్లింలను ద్వేషించడంలేదు.-'

-ఇది ఏమాత్రం ఊహించని సన్నివేశం. లాలాకాన్షీరామ్ ఎప్పుడూ ముస్లింలను గురించి ఏమీ ద్వేషపూరితంగా మట్లాడలేదు. ద్వేషం దాచుకున్నాడు దెబ్బలు తిన్నప్పుడు కూడా ప్రభారాణికి అతని మానసిక స్థితి ఎలాంటిదో తెలుసు. అతన్ని బాగా అర్థం చేసుకోవడం ఆమెకే చేత నవును. ముస్లింలను గురించి ద్వేషంగా వుండటానికి తగినంత కారణం వుంది ఆయనకు. దీన్నిగురించే తలుచుకుంటూ పగతీర్చుకునే ఉపాయం ఆలోచించ వచ్చునుగదా!.... ఇప్పుడువాళ్ల జీవన విధానం మారిపోయింది మారిపోవడం కాదు, నాశనం అయిపోయింది. ఆమెకు ఎంతో ఉన్మత్తత కలుగతోంది ఎవరయినా ముస్లిం దగ్గరగా దొరికతే చేతులతోనే పిసికి చంపేస్తుంది.

'ద్వేషం వల్ల యేమీ ప్రయోజనం లేదు-' అంది ఆమె పవిత్రమైన హిందు స్త్రీ ముసుగులు వేసుకుని. కాని ఆమె హృదయంలో మటుకు ద్వేషం, పగ గూడు కట్టుకు పోయివున్నాయి.

'అదికాదు. నేను అనేది, ద్వేషం వల్ల యేమి ప్రయోజనం లేని మాట నిజమే. ముఖ్యంగా నా మధు నాకు తిరిగిరాదు-'

ఆయన అతికష్టంమీద తన వాక్యం పూర్తి చేయగలిగాడు.

ప్రభారాణి అనిశ్చత స్థితిలో ఆయన్ను గమనిస్తూంది.

'నేను అనేది యేమంటే - పాకిస్తాన్ వాళ్లు మనకు యేంచేశారో, యిక్కడ మనమూ ముస్లింలకు అదే చేస్తున్నాం-'

ప్రభారాణి ఆయన్ను గమనిస్తోంది. ఆయన వాదనలో వస్తున్న వివిధాంశాలను పట్టుకోవటానికి ప్రయత్నిస్తోంది. అవును, అవును తల ఆడించాలని వుంది ఆమెకు. కాని అలా చేయడం లేదు

'ప్రతి ఒక్క దురాగతము.....

'వాళ్లు మనవాళ్లను వేలమందిని చంపారు నిష్కారణంగా. ఆడవాళ్లను చెరిచారు. మనను యిళ్లు వాకిళ్లు లేకుండా తరిమారు-'

'మనమూ యిక్కడ అదేపని చేస్తున్నాం. సరిగ్గా అదే చేస్తున్నాం.-'

'మీరేం అంటున్నారో నాకు అర్థం కావడంలేదు-'

'నీ కళ్లతో నీవే చూచావుగదా !'

'ఏం చూచాను?'

'మనం భారతదేశంలో ముస్లింలకు యేం చేస్తున్నామో చూస్తునే వున్నావుగదా!'

ప్రభారాణికి భర్త వైఖరి కాస్త చికాకు అనిపించింది.

'సరే, యిప్పుడు వాళ్లంటే ద్వేషం లేకుండా వుండండి-' అంది. ఆమె కంఠ స్వరాన్ని బట్టి, చీర సర్దుకోవటాన్ని బట్టి తానుమాత్రం భర్తతో యీ విషయంలో ఒకటి కాదనే విషయం స్పష్టపరిచింది, 'నేను మాత్రం జీవితాంతం వాళ్ళను ద్వేషిస్తూ అసహ్యించు కుంటూనే వుంటాను-'

'ఉహు నీవు అలా చేయవు'

'చేస్తాను'

'ఉహు - చేయవు'

అతడు ఎంతో నింపాదిగా తన అభిప్రాయాలను ప్రకటించాలని చూస్తూన్నాడు. ఆమె చేతులనుతన చేతుల్లోనికి తీసుకోవాలని అనిపించింది. కాని కంపార్ట్ మెంటులో యితరులు వున్నారని జంకాడు. ఆమె వైపు జరిగాడు. అతని బుజం ఆమె బుజం మీద ఒరిగివుంది. అతని తల ఆమె రొమ్ము మీద ఆనుతోంది. ఆమె అతని జుత్తు పలచబడి పోతున్నదనీ, బట్ట తల వచ్చేస్తున్నదనీ గమనించింది. అతను నోరు, కళ్ళు సగం సగం మూసుకుని ఆలోచనల్లో మునిగిపోయివున్నాడు. వాతావరణంలో మార్పులకు అతని ముఖం పూర్తిగా వడిలిపోయివుంది ఏమయినా అతను తనను మార్చటానికి మొండిగా ప్రయత్నం చేయనందుకు సంతోషించింది అతను ఆమె వంక చూడడమయినాలేదు.

'మనం అందరం సమానంగా నిందితులమే-' అన్నాడు అతను తాపీగా. అమృత్ సర్‌లో మనం చూచిన ఆ పిల్లలందురూ, మనకు మధులాగానే, ఎవరికో ఒకళ్లకు కుమార్తెలే గదా! అంబలాలో మనం చూచిన శవాల్లో ఎందరో మన అమ్మాయి లాంటి వాళ్ళే వున్నారు.'

ప్రభారాణి తనకు తెలియకుండానే యేడుస్తూ వుండిపోయింది. మధు..మధు... మధు... అంటూంది నింపాదిగా. విపరీతంగా తల ఊపుతోంది. భర్త చెప్పుతున్నదానితో ఆమెకు అంగీకారం లేదు.

'క్షమించాలి. అదొక్కటే మార్గం. మనతో మనం సమాధాన పడటానికి-'

ఆమె తల నెమ్మదిగా ఊపుతూ యింకా యేడుస్తూనే వుంది.

'మరో మార్గం లేదు.'

'అదే చివరి ఉపాయం-కావచ్చు కాని నాకు దాన్లో నమ్మకం లేదు-'

'నమ్మకం యేర్పరచుకోవాలి. క్షమాగుణంతోనే అంతా సరిపడుతుంది.'

ఆమె యేమీ మాట్లాడకుండా యేడుస్తూ వుండిపోయింది. ఇతరుల ఉనికిని మరచిపోయి తన తలను ఆయన బుజాలమీద ఆన్చి - యిద్దరితలలు యిప్పుడు ఒకటిగా అంటుకు వుండేట్లు చేసింది. అరుణ్ వాళ్లను గమనిస్తూనే వున్నాడు. ముందు యేమవుతుందో అతని ఊహకు అందదు. తన తండ్రి పద్ధతే యింత. ఎప్పుడూ యేదో కొత్త విషయం తీసుకు వచ్చి ఆమెను ఆశ్చర్యంలో ముంచి మతి లేకుండా ప్రవర్తించేట్లు చేస్తాడు. అయితే యిలా పదిమందిలోను ఒకళ్లకు మరొకళ్ళ అతుక్కు పోవడం చూడటానికి బాగాలేదు. అతనికి అరుచికరంగా వుంది.

లాలాకాన్షీరామ్ 'మనమూ అవే తప్పులు, పాపాలు చేశాం. మనను వాళ్లూ క్షమించాలి?' అన్నాడు.

వాళ్లు ఢిల్లీలో రైలు దిగినప్పటికి కొద్దిగా వానజల్లు పడుతోంది. ఇంత వరకు వాతావరణం అనుకూలంగానే వుండింది. పదయాత్ర చేస్తున్న పదిహేను

రోజులపాటు వర్షం పడనేలేదు. ఒక్కసారి మటుకు అమృతసర్‌లో వున్నప్పుడు కొద్దిగా వర్షం వచ్చింది. ఢిల్లీలో ఆకాశం మూసుకుపోయివుంది. కొద్దిపాటి జల్లు పడుతోంది.

'ఈ ప్రారంభం శుభదాయకంకాదు-' అన్నాడు లాలా కాన్షీరామ్-

'మీకు యీ చాదస్తాలు ఎప్పటి నుంచి?' అన్నది అతని భార్య,

లాలాకాన్షీరామ్ - ఢిల్లీ ప్రభుత్వ కేంద్రస్థానం గనుక యిక్కడకు రావటానికి అంగీకరించాడు మంత్రులందరు యిక్కడేవుంటారని తల్చుకుంటేనే అతని ఒళ్లు పులకరిస్తుంది ఇక్కడ వ్యాపార సంబంధమయిన లావాదేవీలు ఎక్కువ వుంటాయి గనుక తనకు చేతినండా పని వుండవచ్చును. కాని యీ స్వాగత వాతావరణం ఆనందదాయకం కాదు. ప్లాట్ ఫాం మీద యేమాత్రం స్నేహభావం లేనట్టి ముఖాలే కనిపిస్తున్నాయి. తమ లగేజి తీసుకువెళ్లటానికి ఒక్క పోర్టర్ అయినా దగ్గరగా రాలేదు. పోర్టర్లకు తెలుసు యీ కాంది శీకుల వద్ద ఎక్కువ డబ్బు వుండదనీ, యీ పంజాబీలు బేరసారాలు ఎక్కువగా చేసే పీనాశులనీ. అందుచేతనే వాళ్లెవరూ ఈ చాయలకు రాలేదు. ఆ వానలోనే అరుణ్ రెండు మార్లు తిరగవలసివచ్చింది, వాళ్ల దగ్గరున్న కొద్ది సామాను వెయిటింగ్ రూంకు తీసుకుపోవటానికి.

స్టేషన్ చాల పెద్దది వెయిటింగ్ హాల్స్ బాగా విశాలంగా వున్నాయి. కాని ప్రతిచోట జనం తండోపతండాలుగా వున్నారు.

లాలా కాన్షీరామ్ తేజసింగ్ గంటల తరుబడి పంక్తులలో నించుంటే తప్ప కాందిశీకులను నమోదు చేసుకుంటున్న అధికారులను కలుసుకో లేకపోయారు. 'రిహబిలిటేషను ఆఫీసర్లు' అంటే అందరికి మర్యాద, మన్నన. అయితే అతని మాటలు, - లాలా కాన్షీరామ్ తో అన్నవి, అతి కటువుగాకర్కశంగా వున్నాయి.

'ఎందుకు వచ్చారు ఢిల్లీకి?'

లాలా కాన్షీరామ్ అతని వంక ఆశ్చర్యంగా చూచాడు.

'నేను పాకిస్తాన్ నుంచి వస్తున్నాను' అన్నాడు, యిదే తగిన సమాధానం అని నిర్ధారించుకుంటూ

ఆ ఆఫీసరు సకిలించాడు. 'అవునవును. నాకు తెలుసు. కాని ఢిల్లీకే ఎందుకు వచ్చారు?' అనడిగాడు.

లాలా కాన్షీరామ్‌కు యేం సమాధానం చెప్పాలో తెలియలేదు. భారతదేశంలో యేతావుకువెళ్ళినా తాను అక్కడకు ఎందుకు వెళ్లాడో చెప్పుకోవలసిన స్థితి వచ్చిందన్నమట!

ఢిల్లీకి ఎందుకు వచ్చారు? ఆ అధికారి యింకా రెట్టించి అడిగాడు.

'ఇక్కడే వుండిపోదామనుకుంటున్నాను-'

'ఇక్కడ ఎందుకు? తూర్పు పంజాబ్ లోనే వుండిపోవచ్చు గదా. మీ పంజాబీలందరు మోర యెత్తుకొని సరాసరి ఢిల్లీకి వచ్చేస్తారు ఎందుకని?'

ఆ ఆఫీసర్ లాలా కాన్షీరామ్ కంటె కనీసం పదేళ్లు చిన్నవాడు వయసులో. అయిన అతన్ని దబాయించి అడుగుతున్నాడు. లాలాను పసిపిల్లవాడుగా చూస్తున్నాడు. అతని నోట్లో పాన్ వుంది - అదే పనిగా వెనకాల గోడమీద ఉమ్మి వేస్తున్నాడు.

లాలా కాన్షీరామ్ నోరు నొక్కుకు వుండిపోయాడు. ఇంకేం మాట్లాడ లేదు.

'ఇది దేశానికి రాజధాని. ఇక్కడ పనిలేని వాళ్ళందర్ని యిష్టం వచ్చినట్లు తిరగనివ్వలేం. నగరాన్ని పాడు చేయనీయం..' అని తరువాత ' యిక్కడ మీ బంధువులెవరయినా వున్నారా?' అన్నాడు.

'లేరు'

'పోనీ మీకు యేదయిన ఉద్యోగం యిక్కడ వుందా?'

'లేదు'

'మీరు యేంచేస్తారు?'

'ధాన్యపు వర్తకం'

అతను లాలాకాన్షీరామ్ పూర్తి చేసిన దరఖాస్తు వంక చూచాడు.

'ఈ అమరావతి, సునందలు ఎవరు? వాళ్లతో మీ బంధుత్వం యేమిటో వ్రాయలేదే!'

'వాళ్ల మగవాళ్ళు పాకిస్తాన్‌లో పోయారు ఇప్పుడు వాళ్ళు మా కుంటుంబంలో భాగం అయిపోయారు.'

'ఇంత పెద్ద కుటుంబమా? మీ అబ్బాయి యింకా స్టూడెంటే! మిమ్మల్నందర్నీ ఎవరు పోషిస్తారు ?'

'నేను పోషించుకుంటాను సార్. నాకు కావలసిందల్లా ఉండటానికి యింత చోటు, తలదాచుకోవటానికో గూడు.'

తేజసింగ్ ఆఫీసర్ ముందుకు వచ్చి నిలబడ్డాడు.

నేను 'లాలాజీతోనే వున్నాను సర్' అన్నాడు.

'మీరెందుకు ఢిల్లీ వచ్చారు?'

లాలాను అడిగనట్లుగానే అతన్నీ అనేక ప్రశ్నలు వేశాడు ఆ ఆఫీసర్.

'అయ్యా, నాఅల్లుడు పాకిస్తాన్‌లో చనిపోయాడు.'

సర్దార్ తేజసింగ్ యీ విషయం తనకు అనుకూలంగా పరిణమిస్తుందని ఆశిస్తున్నాడు.

లాలాకాన్షీరామ్ 'సర్, మా అమ్మాయి పాకిస్తాన్‌లో పోయింది.' అన్నాడు.

'అవునవును... మీరందరు యెవరో ఒకర్నిపోగొట్టుకున్న వాళ్ళే' అన్నాడు అధికారి - నిర్లక్ష్యంగా చికాకుగా.

లాలా కాన్షీరామ్‌కు యీ సంభాషణ తనకు అనుకూలమైన ధోరణిలో సాగడం లేదని అర్థం అయిపోయింది. ఆ ఆఫీసరు తమను యే జలందర్‌కో లూధియానకో వెళ్ళి పొమ్మనేట్లున్నాడు. ఆ ఊళ్ళంటే తనకు అసలే అసహ్యం. అతని గుండె జారిపోయింది. కళ్ళు చీకట్లు కమ్ముకున్నాయి.

తన అహాన్ని కనిపింప చేయకుండా వినయంగా 'అయ్యా, మీరునన్ను రక్షించకపోతే మేము సర్వనాశనం అయిపోతాం నాకో చిన్న యిల్లు, చిన్న దుకాణం యిప్పించండి చాలు .' అన్నాడు.

ఆఫీసర్ కళ్లు ముఖంలోంచి పొడుచుకు ముందుకు వచ్చాయి. 'ఏమిటి? ఇల్లు - దుకాణమూనా? ఎక్కడున్నాయి ?' అన్నాడు.

'ముస్లిములు వదలివెళ్లిన యిళ్లు, దుకాణాలు లేవా?'

లాలాకాన్షీరామ్ అంత వరకే విన్నాడు. ఢిల్లీలోమూడు వేలమంది ముస్లిములు వున్నారు. వీళ్లంతా యిళ్లు, వాకిళ్లు, దుకాణాలు వదిలేసి వెళ్ళిపోయారు.

'మేము మా ఆస్తిపాస్తులను పాకిస్తాన్‌లో వదిలేసుకుని యిక్కడకు వచ్చి పడ్డాము. దానికే దీనికీ ముడిపెట్టటానికి వీలుండవచ్చుగదా!'

ఆఫీసర్ తన కుర్చీలోనే వెనక్కు వాలాడు. నవ్వుతోవూగి పోతున్నాడు. తనకు ఎడమవైపునకు వున్న ఆఫీసర్‌తో 'విన్నారా, యీ మాట! ఈ ముసలాయనకు ఓ యిల్లు, ఓ దుకాణం కావాలట! కాందిశీకుల ఆస్తి యిచ్చి వేయమంటున్నాడు.-' అన్నాడు, ఆ ఆఫీసర్. ముందు ఓ ముసలామె దిగాలుగా నిలబడి ప్రశ్నలకు సమాధానాలు చెబుతోంది.

ఆ ఆఫీసర్ నోరు మరింత వెళ్లబెట్టి నవ్వుతున్నాడు.

మొదటి ఆఫీసర్ 'మనం ఈస్క్రీనింగ్ అంతా అంబాలాలోనో అమృత్ సర్‌లోనే చేయవలసి వుండింది. వాళ్లను యే ఆధారము లేకుండా యిక్కడకు రానివ్వడం చాలా తప్పిదం అయిపోయింది' అన్నాడు.

రెండో ఆఫీసర్ 'అవును' అన్నట్లుగా తల ఆడించాడు వాళ్లు మాట్లాడుకుంటూ వుండగా లాలా కాన్షీరామ్ దిగాలుపడిపోయి గుటకలు మింగుతూ నిలుచుండిపోయాడు. అతడు చాల చిన్న పోయాడు, దిగ్భ్రమ పొందాడు. ఏమీ లేకుండా యీ టేబుల్ ముందునుంచీ వెళ్ళిపోగూడదనుకున్నాడు.

ఆఫీసర్ అతని ముందుకు వంగి 'లాలాజీ, మీరు యేదో స్వప్నలోకంలో వున్నారు. ఇప్పుడు నవంబర్ మధ్య రోజులుగదా? ఆరులక్షల హిందువులు, సిక్కులు యీ సరికి ఢిల్లీకి వచ్చి చేరుకున్నారు. మీ కోసం యిప్పుడు యిల్లు దుకాణం ఎదురుచూస్తూ కాళీగా, పడివున్నాయనికుంటున్నారా మీరు? అవన్నీయిదివరకేయిచ్చి వేశారు. కొందరు కాందిశీకులు బలవంతంగా ఆక్రమించేసుకున్నారు,'అన్నాడు.

లాలా కాన్షీరామ్ స్వరూపం వైపు ఒకమారు ఎగాదిగాచూచి అతని వినయం తనను ఆకట్టుకోగా, ఆవినయం తీసుకువచ్చిన హుందాతనంతో మనసు ఆకర్షితం అయి - యిలా అన్నారు ఆఫీసర్ : 'యిప్పుడు మీరున్న పరిస్థితిలో నేను మిమ్మల్ని తూర్పు పంజాబ్‌కు తిప్పి పంపివేయాలి. లేదా మీ అవస్థ మీరుపడండి యీ రాజధానిలో అనివదలివేయాలి కాని మీ వయస్సును చూచి - ఆగౌరవం కొద్ది...' అని కొద్దిగా కళ వెశపడ్డాడు, తర్వాత 'సరే.... మీ కిద్దరికీ యేదయినా కాందిశీకుల శిబిరంలో చోటు యిస్తాను అవీ ఖాళీగా లేవు గానీండి; ఎక్కడో సర్దుబాటు చేస్తాను'

పెన్ తీసి లాలా, తేజసింగ్‌ల దరఖాస్తుల మీద యేదో గెలికాడు. అతను వ్రాస్తూ వుండగా లాలా కాన్షీరామ్ మనసులో అనుకున్నాడు. మళ్లీ కాందిశీకుల శిబరమే నా గతి ! కాదు.. కాదు... వద్దు

'ఏదయినా యింటిలో ఒక చిన్న గది అయినా సరే యిప్పించండి - సర్-' అన్నాడు.

'నేను చెప్పాను కదూ! కింగ్స్‌వే కాంప్' అని అతను యిద్దరినీ దాదాపు కసిరికొట్టాడు. అంతవరకు చూసిన మన్నన కూడాఅనవసరం అనుకున్నాడేమో కూడా.

లాలా కాన్షీరామ్ తానుపొందిన అవమానం, పరాభవం కుటుంబం ముందు ప్రదర్శించదలుచుకోలేదు. తాను సుఖంగా ఆనందంగా వున్నట్లే కనిపించడ్డానికి నటిస్తున్నాడు. ఏదో ఒకటి. తలదాచుకోవటానికో చోటు. త్వరలోనే యింకేదయినా మంచిది సంపాదించుకోవచ్చును !

ఆయన వెంటనే కేంప్‌కు తరలి వెళ్లలేదు. ఆ రాత్రి అంతా స్టేషన్‌లోనే గడిపాడు. ఈ లోపల మనసులోనే కొన్ని ఆలోచనలు చేసుకున్నాడు. తన గ్రూపులో యితరులు యిక్కడకు కొద్ది దూరంలోనే వున్న ఛాందినీచౌక్ చూడటానికి వెడుతూ వుంటే, తానుమాత్రం 'నేను రాను, మీరు వెళ్లండి' అన్నాడు. తాను ఈషర్‌కౌర్‌కు తోడుగా వుండిపోతానన్నాడు. వాళ్ళు వెయిటింగ్ హాలులో ఒకమూలగా పక్కలు పరచుకున్నారు. ఈషర్‌కౌర్ వళ్ళు మరిచి నిద్రపోతోంది. ఈషర్‌కు యీ సంగతి తెలియదు. ఆమె మరుపుతెరలలో సుఖంగా నిద్రపోతోంది. 'ఎవరో ఒకళ్ళు ఆమెతో తోడుగా వుండవలసిందే గదా!' అనుకున్నాడు సమర్ధనగా.

ఇంకా వానపడుతూవుంది. ఆకాశం ఓ పద్ధతిగా వుందని అనుకోవటానికి వీల్లేదు. చాందినీ చౌక్, రెడ్‌ఫోర్ట్ యీ పేర్లు వాళ్ళకు ఎన్నో యేళ్ళుగా గొప్పగా వినిపిస్తున్నవి. అలౌకికమైన సౌందర్యం అక్కడ విలసిల్లుతూవుంటుంది. తేజ సింగ్ తో సహా అందరూ టౌన్ హాల్ గార్డెన్స్ ద్వారా ఆ బజార్లు చూడటానికి వెళ్లారు.

'రోడ్లన్నీ, దీపాలతో ఎలా మిల మిల మెరుస్తున్నాయో, మీరు చూచివుండాల్సింది' అంది ప్రభారాణి తిరిగివచ్చాక

లాలా కాన్షీరామ్ యీ విషయానికి యేం గమనం యివ్వలేదు. అతను ఆలోచనలలో నిమగ్నుడైవున్నాడు. తనుకు అంతాపోయింది. సంపాదించు కున్నదంతా పోయింది. తన జేబులో వున్న మూడువేల రుపాయాలు యిప్పుడు రెండు వేలకు తగ్గిపోయాయి. ఇవి మాత్రం యింకా యెన్నాళ్ళువస్తాయి గనుక?..... అయితే యిక్కడ అందరూ అంత అసానుభూతి పరులుగా వుండక పోవచ్చును. అయితే ఎవరి దగ్గరకు వెళ్ళాలి తను? ఎవరి దయా దాక్షిణ్యాలను సంపాదించాటికి ప్రయత్నించాలి? అతను ఆలోచించాడు. బుర్ర బద్దలు కొట్టుకున్నాడు. తన చుట్టూ జరుగుతున్నదానికి అతి తక్కువ గమనం యిచ్చాడు.

తెల్లవారిన తరువాతగూడా ఆకాశం మేఘావృతమై వుండింది. అయితే వానపడడంలేదు. లాలాకాన్షీరామ్ తన కార్యక్రమం యేమిటో నిర్ణయించు కున్నాడు. అసలు యీ ఆలోచన యింత వరకు రానందుకు ఆశ్చర్యపోయాడు.

అదే చేయవలసిన పని! తతిమ్మావాళ్ళు భయపడిపోయి వెనక అడుగు వేయవచ్చును కాని తనకు నైతిక బాధ్యత వున్నది. ఈ విభజన తమ మీద రుద్దబడింది. ఇది తాము కావాలని యేకోశాన అనుకోలేదు. యేమాత్రమూ అందుకు అవసరం అయిన యితర యేర్పాట్లు చేయనేలేదు! కావాలంటే శిబిరాలు, శాలువలు తీసుకుపోనీ. ఇవేగా వాళ్ళు యింత వరకు తమకోసం చేసింది! ఉహు లాభంలేదు. తాను వెళ్లి యీ యేర్పాటుకు తమందరి తరపున అంగీకారం తెలిపి అమలు జరిపిన పెద్ద మనిషి ముందు నిలబడి అడుగుతాడు. తగిన పరిష్కారం చూపమని నిగ్గదీస్తాడు.

దారి కనుక్కుంటూ, బస్సుల మారుతూ, చిల్లర డబ్బుల కోసం జేబులు వెదుక్కుంటూ, ఆలస్యం చేస్తున్నందుకు కండక్టర్లకు క్షమాపణలు చెప్పుకుంటూ, తన కష్టనష్టాలు చెప్పుకుంటూ, ఇతరుల కథలు కూడా వింటూ, ట్రాఫిక్ యింత ఎక్కువగ వుండటాన్ని గురించి అశ్చర్యపడుతూ, 'బిగ్ఆఫీస్' అని ఎవరో పరిచయం చేసిన భవనం ఎంత అద్భుతం గావుందో గమనిస్తూ, 'లోక్‌సభ' ఎంత రాజసంతో ఉట్టి పడుతోందో మెచ్చుకుంటూ, అనేక భవనాల మీద ఎగురుతూన్న త్రివర్ణ పతాకాన్ని కిందికి వంగి చూస్తూ..... చిట్టచివరకు ఎలాగయితనేం అతను నెహ్రూ నివాసగృహానికి చేరుకోగలిగాడు. తతిమ్మావాళ్ళు తమకు అదే యిష్టం అయితే వెళ్ళి ఆ శిబిరాలలో మగ్గిపోనీ. తాను మాత్రం ఒక దుకాణం, ఒక నివాసగృహం సంపాదించాలి. తన చాకచాక్యం అంతా వినియోగించాలి యిందుకోసం. 'ప్రైమ్‌మినిష్టర్'ను యిందుకు ఒప్పించడం ఎలాగో తనకు తెలుసు.

తీరా చూచేసరికి అతనికి ఆశ్చర్యం అయింది - తనకు వచ్చిన ఆలోచనే యింతకు ముందే అనేక మందికి కలిగినందుకు. నెహ్రూ యింటి ముందు యిప్పటికే వందలాది జనం గుమిగూడి వున్నారు. పోలీసులు ఎవరినీ యింటి లోనికి పోనివ్వడంలేదు. అతడు గంటల తరుబడి వేచివున్నాడు. జనంలో చాల మంది నినాదాలు చేస్తున్నారు. ఇది ముందుగా యేర్పాటు చేసుకున్న ప్రదర్శన యేమికాదు ప్రతిమనిషి తన కోసం, తన హక్కుల కోసం మటుకే

పోరాడుతున్నాడు. అటువంటి గుంపును అదిలించడం, అటకాయించడం పోలీసులకు చాల తేలిక. వాళ్ళు గేటు తెరవనే లేదు. తరువాత తెలిసివచ్చింది, నెహ్రూ అసలు ఆరోజు ఊళ్లోనే లేరట! 'మీరు వార్తాపత్రికలలో చూడలేదా? నెహ్రూ ఈ రోజు బొంబాయి వెళ్లారు-' అన్నాడు ఒక పోలీసు అధికారి. వీళ్ళు ఉత్త అబద్ధాల కోరులు - అనుకున్నాడు. లాలా కాన్షీరామ్. ఎందుకంటే కార్లు లోపలకు పోతున్నాయి. ఇవతలకు వస్తున్నాయి. యధావిధిగా ఒక పొడగాటి మిల మిల మెరుస్తున్న కారువస్తుంది గేటు విశాలంగా తెరుస్తారు. కాందిశీకులు ఎవరయినా ఎగబడి లోపలకు వెళ్ళటానికి ప్రయత్నిస్తే వాళ్ళను మాత్రం పట్టుకుని వెనక్కు విసిరేస్తారు. గేటు మళ్లీ మూసేస్తారు. ఇదీ జరుగుతున్న తతంగం.

లాలా కాన్షీరామ్‌కు యిదంతా జరగని పని, ప్రయోజనం లేని ప్రయత్నం అని తెలిసి వచ్చింది. గుంపులోనుంచి ఎవరో చెప్పారు.

'పునరావాస సౌకర్యాల మంత్రి దగ్గరకు వెళ్ళు' 'సానుభూతిపరుడైన ఒక పార్లమెంట్ మెంబర్‌ను పట్టుకో', పునరావాస ఆఫీసరుకు లంచం యివ్వు', ఏరియా కస్టోడియన్లను దర్శించు', అదేం కాదు. కన్నాట్ సర్కస్‌లో ఆంజనేయస్వామిగుడికి వెళ్ళి ప్రదక్షిణలు చేయి!... యిలా రకరకాల సలహాలు సూచనలు వస్తున్నాయి.

లాలాకాన్షీరామ్‌కు యిదంతా ఎంత నిరాశపూరితమైన వ్యవహారమో తెలిసివచ్చింది. పునరావాస సౌకర్యాల మంత్రి యిల్లు, యం.పి. యిల్లు యిప్పుడు ఎవరు వెదికి కనుక్కుంటారు? అది తనకు చేతకాని పని. మరో రోజు వచ్చి నెహ్రూను సందర్శించడమే యుక్తమయిన కార్యం. కాని ఊరికే కూర్చుని రోజులు గడిచిపోనివ్వడం చేయలేడు తను. తనంతతానే యేదో యిల్లు వెదికి కనుక్కుంటాడు. - యేదో అద్దె యిల్లు సంపాదిస్తాడు.

ఈ నిర్ణయం తీసుకుని రైలుస్టేషన్‌కు తిరిగివచ్చాడు. సర్దార్ తేజసింగ్ ఈషర్‌కౌర్ కనిపించలేదు. 'వాళ్ళు యేరీ? అనిఅడిగాడు.

'వాళ్లకు ఒక పరిచితుడు కనిపించాడు. అతడు ఢిల్లీ సమీపం లోని షహదారలో వుంటాడట అతడు వాళ్ళను తనతో తీసుకువెళ్లాడు. వాళ్లు యింక అక్కడే వుంటారట!'

మంచిపని అయింది. వాళ్లకు యోగ్యమయిన నివాస స్థలం దొరికింది. మంచి నివాసం. కాందిశీకుల శిబిరం కంటె మంచిది. ప్రభారాణి యీ వార్తను భర్తకు చాలా అనందంగా చెప్పింది. లాలాకాన్షీరామ్‌కు చాల పెద్ద దెబ్బతిన్నట్లయింది. మరో అనుబంధం తెగిపోయిందన్నమాట! ఒకటొ కటిగా అతని అంగాలన్నీ ఊడిపోతూన్నాయి. అతను సాలోచనగా తన చేతులు తడిమి చూచుకున్నాడు.

'నేను వచ్చేదాక నన్నా వాళ్లు అగివుండాల్సింది' అన్నాడు.

బీబీ అమరవతి, సునంద, అరుణ్ ఆయన వంక తేరిపారచూచారు.

ప్రభారాణి అంది : 'ఆ మనిషి మమ్మల్ని కేవలం కాకతాళీయం గా చూచాడు, కలుసుకున్నాడు. వాళ్లు అతనితో వెళ్లకపోయినట్లయితే ఆ యింటికి వెళ్లడం ఎలాగో వాళ్లకు దారి తెలిసివుండేది కాదు, తరువాత. చివరకు ఎలానయితేనేం ఆ దురదృష్ట జాతకురాలికి కొంత ఊరట కలిగింది. తేజసింగ్ యీ సాయంత్రం వచ్చి మిమ్మల్ని కలుసుకుంటానన్నాడు లెండి'

లాలా కాన్షీరామ్ ఓడిపోయినవాడి మాదిరి, విసిగిపోయి నిలబడ్డాడు.

'వాళ్లు యిద్దరూ కళ్ల నీళ్లు పెట్టుకున్నారు వెళ్లేటప్పుడు' అంది ప్రభారాణి నింపాదిగా భర్త ఎంత బాధపడుతున్నాడో ఆమెకు తెలుసు. 'ఈషర్ యేమన్నదో తెలుసా ? మీరు ఆమెకు తండ్రి కంటె మిన్న అయిన వారనీ, ఎంతో ఉపకారం చేశారని తెగ శ్లాఘించి చెప్పుకుంది'.

'ఇంతకూ అతనెవరు ? ఆ కొత్తగా వచ్చిన వాడు ?'

అరుణ్ 'అతనో సిక్కు అధికారి సర్దార్ తేజసింగ్ భార్య ద్వారా వాళ్లకు బంధువట ! బాగా వున్నవాళ్ల లాగ వున్నాడు' అన్నాడు.

లాలా కాన్షీరామ్ ప్రగాఢంగా నిట్టూర్చాడు. వెళ్లి తన వాళ్ల దగ్గర తాపీగా కూర్చున్నాడు.

బీబీ అమరావతి అతన్ని ఓదార్చటానికి ప్రయత్నించింది. 'వాళ్లు వెళ్లడం మంచిదే అయింది ..'

లాలా ఆమెవైపు తిరిగి 'ఎన్నో సంవత్సరాలుగా కలిసి వున్నాం గదా !' అన్నాడు

తరువాత మూడు రోజులపాటు లాలా కాన్షీరామ్ అరుణ్‌ను వెంట తీసుకుని ఢిల్లీలోని ప్రతి ప్రాంతాన్ని అన్వేషించాడు, అద్దెకు యేదయినా యిల్లు దొరుకుతుందేమోనని. దర్యగంజ్. చాందినీ చౌక్, లాలా కువన్, కారీ బేలీ, పదార్, పహరిధీరజ్, రూయ్ మాండి, బారాతుటి, బార్వా, సుబ్రిమండి.. యిలా అనేక ప్రాంతాలు. 'న్యూ'ఢిల్లీకి మాత్రం వెళ్లలేదు. ఆ పేరే వాళ్లను భయపెట్టినట్లు అయింది. పాత ఢిల్లీలో యేప్రాంతాన్నీ విడవకుండా చూచారు. కుటుంబంమటుకు స్టేషన్‌లోనే కాపురం చేస్తోంది.

ప్రతి చోటా ఒకటే పద్ధతి. కాందిశీకుల ఆస్తిపాస్తుల కస్టోడియన్ దగ్గరకు వెడతారు ; ఈ ఆఫసర్లు చాలమంది పంజాబీలు. వాళ్లమటుకు వాళ్లు పశ్చిమ పంజాబ్ నుంచి కొంతకాలం యిక్కడకు వలస వచ్చిన వాళ్లే. అయితేనేం, యిప్పుడు వచ్చి తమ ముందు బారులు తీర్చి నిలుచుంటున్న పంజాబీల కంటె భిన్నమైన జాతిలా కనిపిస్తున్నారు. అధికార మదంతో మురిసిపోతూ వాళ్లు ఏ మాత్రం ఓపిక, నిదానం లేకుండా వున్నారు కనీసం కాందిశీకులతో అలా ప్రవర్తిస్తున్నారు. 'అయ్యగారిని మంచి పోకడకు తీసుకురావటానికి ఓ వెయ్యి రూపాయిలు ఈనాం యివ్వాలి...' అని ఎవరో రహస్యంగా చెవిలో ఊదారు. ఇది బారాతురి ఆఫీసులో లాలా కాన్షీరామ్ పొందిన ఉపదేశం. అతను ఉలిక్కిపడ్డాడు ఈ మాటలు వినడంతోటే. అలా అయితే యింక తన దగ్గర వెయ్యి రూపాయిలు మటుకే మిగులుతాయి. ప్రతి గవర్నమెంట్ ఆఫీస్ దగ్గర యిదే సమాచారాన్ని ఎవరో ఒకరు అందజేస్తూనే వున్నారు.

'వాళ్లు ప్రజా సేవకులు. ప్రజల సౌకర్యాలు చూడడం వాళ్ల ధర్మం' అనుకుంటున్నాడు లాలా కాన్షీరామ్. ఈ లంచం డబ్బు తన శక్తికి మించినది గనుక యిలా అనుకోవడం తప్ప యింకేం మార్గం లేదు.

గుమాస్తా ' ఆ ప్రజాసేవ చేస్తూనే వున్నారు. వెయ్యిరూపాయిలు యిస్తే రిఫ్యూజీ ఫ్లాట్ వస్తుంది నెలకో పదిహేను రూపాయిలు అద్దె కట్టుకుంటే చాలు. అంతకంటే యింకేం కావాలి ?' అన్నాడు.

ముందుగా చెల్లించవలసినది ఎక్కువ అయిపోయింది అని గునవసాగాడు లాలా కాన్షీరామ్. 'మరి దుకాణం కావాలంటే ?' అని అడిగాడు.

'మరో వెయ్యి రూపాయిలు సమర్పించుకో' అన్నాడు గుమాస్తా యేమాత్రం బెరుకు లేకుండా.

లాలా కాన్షీరామ్ ఎదురుగా నిలబడే వున్నా, ఆ గుమాస్తా యేదో ఫైలు తీసి ముందు వేసుకుని పనిచూచుకుంటున్నట్లు నటించసాగాడు. సొరుగులోనుంచి ఓ 'సాండ్‌విచ్' పైకి తీసి, నోట్లో వేసుకుని నమలసాగాడు. అయితే అతను లాలాను పంపివేయలేదు, గమనిస్తూ వుండిపోయాడు.

'ఇంతకూ నీ దగ్గర డబ్బు వుందా ?' అనడిగాడు సాండ్‌విచ్ నములుతూనే.

'ఊహు. లేదు.'

ఆ తరువాత గుమస్తా యింక అతని ముఖం చూడలేదు. మరో ఫైలు తీసి చదువుకోసాగాడు, నములుతూనే.

ఏ ఆఫీసులో కూడా ఆఫీసరే స్వయంగా వాళ్లతో మాట్లాడలేదు. ఆఫీసరు ఓ చిన్న గదిలో కూర్చుని వుంటాడు. చుట్టూ పది మంది కూర్చుని కబుర్లు చెబుతూ వుంటారు. వాళ్లందరూ వంతుల వారీగా అతని చెవులో యేవో రహస్యాలు ఊదుతూ వుంటారు. చాల సేపు ఆఫీసర్ తల ఊపుతూ

అడిస్తూ మాత్రమే గడపడం - లాలా కాన్షీరామ్ గమనించాడు. శీతాకాలం మొదలయింది. లాలా, అరుణ్ చౌకదుకాణాలలో కొనుక్కున్న 'పుల్ ఓవర్లు' ధరించారు. కాని 'కస్టోడియన్లు' మాత్రం ట్వీడ్ సూట్లలో, మంచి బూట్లలో మెరిసిపోతూ కూర్చున్నారు. చాలమంది మెడలకు ఉన్ని రుమాళ్లు చుట్టుకున్నారు. వాళ్లు గుంపుల వయిపు చూచే పద్ధతి గూడా విచిత్రంగా వుంది. బాగా ఊరిన బుగ్గల్లోంచి మిలమిల మెరుస్తున్న కళ్లతో చూస్తారు.

లాలా కాన్షీరామ్ మరో కాందిశీకుడిని అడిగాడు · 'ఈ ఆఫీసర్లు కూడా మనలాగే కాందిశీకులు గదా !' అని.

'ఒకప్పుడు. ఇప్పుడు కాదు'.

ఎక్కడ చూచినా జనం - గుంపులు, గుంపులు. లోపల దొరగారి దగ్గర కొద్దిమందే. బయట మాత్రం వందలు వందలు ! రకరకాల తరహాలకు చెందిన మనుష్యులు. వాళ్లు వెషభాషలు, పద్ధతులు వేరు వేరుగా వున్నాయి. పంజాబీ భాషే అయినా ఆనుడికారం మాకు అర్థం కాదు. పఠానులాగ ఎర్రని ముఖాలు. ఆడవాళ్లలాగ షల్వార్లు ధరిస్తారు. వాళ్లు తలపాగాలు గూడా అదో రకంగా వున్నాయి. వీళ్లందరూ లాలా కాన్షీరామ్ యింతవరకు చూచివుండని పంజాబ్ ప్రాంతాలనుంచే వచ్చారు. ముల్తాన్, జాంగ్, నేషేహ్రా, డేనా ఇస్మాయిల్ ఖాన్ - లేకపోతే వాయవ్య సరిహద్దు రాష్ట్రాల నుంచి - పెషవర్, యింకా పైనుంచి వచ్చిన వాళ్లు.

వాళ్లలో చాలమంది మధ్య పంజాబ్ క్షేత్రం నుంచి వచ్చారు. వాళ్లతో వున్నప్పుడు లాలా కాన్షీరామ్‌కు కొత్తగా అనిపించేది కాదు. వాళ్లూ అతని మాదిరే దృఢంగా వుండేవాళ్లు. పుట్టెడు విచారం వున్నా, వదనంలో చిరుమందహాసం చెరిగిపోదు. ఈ గుంపుల్లో స్త్రీలు చాల తక్కువ. మగవాళ్లే ముందుకు వచ్చి తమ దరఖాస్తు యిచ్చి గోడు చెప్పుకుంటున్నారు.

వాళ్లు ఓ ఆఫీసును యిప్పుడే సందర్శించి వచ్చారు. ఇది మూడో రోజు యీ వెదుకులాటలో అనుభవం గడిస్తున్న కొద్దీ లాలా కాన్షీరామ్ ముఖం

గిడసబరిపోతోంది. ప్రతి ఆఫీసులోను ఒకే మాదిరి జవాబులు వినవస్తున్నాయి. 'కాందిశీకుల ఆస్తులు అప్పుడే యితరులకు యివ్వడం అయిపోయింది. మీరు చాలా ఆలస్యంగా వచ్చారు! ఇది నవంబర్ మధ్యవారం, ఢిల్లీలో ఆరు లక్షల మంది కాందిశీకులు యీ వరకే వున్నారు. ఉహు.... యిప్పుడు యెక్కడా ఫ్లాట్స్ లేవు. దుకాణాలు లేవు...' ఈ సంభాషణకు తగిన ముగింపుగా 'డబ్బు యేమన్నా సమర్పించుకోగలరా ?' అని అడుగుతున్నారు. డబ్బు ఎరచూపిస్తే యేమయినా పనికావచ్చు. లేకపోతే యేం లేదు అయితే వాళ్ల దగ్గర డబ్బు వున్నదా ?

లాలా కాన్షీరామ్ యిప్పటికి బాగా పాలిపోయాడు. అతని ముఖంలో యిప్పుడు రక్తం లేదు. మరో కాందిశీకుల శిబిరానికి వెళ్లడం అతనికి యిష్టం లేదు. నెలల తరుబడి వాటిలో వుండి గుండెలు అర్చుకుపోయినాయి. జీవితంలో యింతవరకు యిలాంటి నికృష్ట స్థితిలో పడిపోలేదు అరక్షణీయులు అయిపోలేదు. అతడేమీ శ్రీమంత కుటుంబంలో పుట్టలేదు. వస్తు సంబంధమైన సుఖాలు కాదు అతను కోరుకుంటున్నది. అయినా అతనికో వెచ్చదనం అలవాటయిపోయింది. జీవితపు చీకటి కోణంలో ప్రభారాణి అతనితో వెలుగు, వెచ్చుతనం సంపాదించి పెట్టింది. దాన్ని భద్రపరిచింది. ఇప్పుడా భద్రత తొలిగిపోయింది. ప్రభారాణి తనతోనే వున్నది గాని ఆ వెలుగు, వెచ్చుతనంమటుకు అంతర్ధానం అయిపోయాయి. ఈ శిబిరాలలో అనేక కళ్లు తమనే గమనిస్తున్నాయి. అనేక చెవులు తమ మాటలనే వింటున్నాయి. ప్రతివాడూ యితరులను విచిత్రంగా చూచేవాడే. ఎవరికీ ప్రత్యేకత లేదు. పేరు ప్రతిష్టలు అంతకన్నా లేవు. అతనికి యిలాంటి దుస్థితి అక్కర్లేదు. తనకు పేరు, ప్రత్యేకత మళ్లీ సంపాదించుకోవాలి. కీర్తి కాకపోవచ్చు, పేరయినా సంపాదించగలగాలి గదా ! ఈ శిబిరాలలో అనవరతము వీస్తున్న గాలి అతని శరీరాన్ని చిల్లులు పొడి చేసినట్లయింది. అతని చుట్టూ గోడలు వుండాలి. తలుపులువుండాలి. పడుకోవటానికి శుభ్రమైన పక్కవుండాలి శుభ్రమైన దుప్పట్లు వుండాలి. ప్రభారాణి తనతో యేకాంతంలో వుండాలి భార్యతో

ఒంటరిగా వున్నప్పుడే మధుగూడ తమతో ఉన్నట్లు అనిపిస్తుంది అతనికి. ఈ కొద్ది నెలల కాలంలోనే వెనకటి జ్ఞాపకాలను స్ఫురణకు తెచ్చుకోవడం చేతకాకుండా పోయింది. మధు ముఖం ఎలా వుండేది ? ఆమె ముక్కు ఆకారం యేమిటి కళ్లు ఎలా వుండేవి ? ఒక్కొక్కటి గుర్తువస్తున్నాయి గాని అన్నీ సమరసంగా సమకూరడం లేదు. పూర్వపు వాసనలు, స్మృతులు పూర్తిగా యేర్పడడం లేదు భార్యతో యేకాంతంలో వున్నప్పుడు - అది కొన్ని క్షణాల కాలమే అయినా - మధు అతనికి తిరిగివచ్చినట్లు అనిపించేది. వాళ్లు యేకాతంగా వున్న ప్రతిమారు యిలా జరగడం లేదు ఆ రూపకల్పన కోసం ఎంతో సేపు వేచివుండవలసి వస్తోంది. అరుణ్ కూడా దగ్గర వుండటానికి వీల్లేదు ఆ సమయంలో. ఆ విచిత్రం యేమిటో ఆ సంవిధానం యేమిటో అతనికి తెలియదు. అది ఆకారంలో పోలికలు కావచ్చును వైఖరిలో సామ్యం కావచ్చును. ఏమయితేనేం, ఆ సమయంలో తన గుండెల్లోని బాధ తగ్గిపోతోంది. ఆ రూపకల్పన అయిపోయినప్పుడు గూడా కొన్ని గంటల తరబడి ఆ సుఖానందాలలో వుండిపోగలుగుతున్నాడు. ఊహు. ఇప్పుడు యే శిబిరాలలోను వుండాలని లేదు. తెలియని వాళ్ల మధ్య కాపురం చేయాలని లేదు. అతనికో యిల్లు కావాలి. ప్రభారాణితో యేకాంతం కావాలి. ఆ యేకాంతంలోనే యిద్దరు పిల్లలనూ చూచుకోవాలి.

ఈ ప్రాంతాలు అన్నింటిలోను వేరే అద్దెకు యేమన్నా ఫ్లాట్స్ దొరుకుతాయేమోనని గూడా విచారించారు. స్థానికులకు పంజాబీలంటే బాగా భయంలా వుంది. వాళ్లకు ఎవరూ యిళ్లు అద్దెకు యివ్వ సాహసించడం లేదు. తాము ఫలానా అని చెప్పడం తోటే తలుపులు మూసివేస్తున్నారు. 'పంజాబీలా ? .... ఊహు.... మీకు యిళ్లు యివ్వం. మీరు దెబ్బలాడతారు, తగాయిదాలు తీసుకు వస్తారు...' ఆర్య సమాజం మనిషిగా లాలా కాన్షీరామ్‌కు వివాదాలు వాగ్వాదాలు అంటే యిష్టమే. ఈ మనుషులతో హృదయం విప్పి మాట్లాడాలనే తపన వుంది. తమలపాకులు నములుతూ వుండడం తప్ప జీవితంలోని కష్ట సుఖాల గురించి వాళ్లకు యేం తెలుసును ? పంజాబీలకు

జీవితంలో ఎన్ని దౌర్భాగ్యాలు దాపురించాయో వాళ్లు యెరుగుదురా ? ఒకసారి తలుపు వేసిం తర్వాత, గబగబ బాదినా ఎన్నిసార్లు పిలిచినా అవి మళ్లీ తెరుచుకునేవి కాదు. ఒక మనిషి అయితే కిటికీ తెరిచి మరీ అరిచాడు 'ఇందాకనే చెప్పాను గదూ, మీరు తగాదాలమారి మనుషులని. ఎందుకు తలుపులు బద్దలుకొడతావు ?' ఎక్కడయినా తప్పిజారీ ఫ్లాట్ యిస్తామన్నా దానికి అద్దె చాలా ఎక్కువ చెప్పేవారు. అంతేకాదు పగిడి కూడా కావాలనే వాళ్లు. కొన్ని వేల రూపాయిల నల్ల ధనం అడిగేవారు.

బారాతుటిలో ఆఫీసర్ అయితే వాళ్లను నిర్దాక్షిణ్యంగా గదిలోంచి వెళ్లగొట్టేశాడు. లాలా కాన్షీరామ్‌కు విచారం పరాకాష్టకు అందుకుంది. బరాతుటి చౌక్‌లో అరుణ్ అతని సరసనే వున్నాడు. అతను తండ్రిగారిని సమాధాన పరచటానికి ప్రయత్నించాడు. కాని అతనికే దుర్భరమయిన పరిస్థితి ! అన్ని ప్రయత్నాలు అయినాయి. అన్నింటా పరాభవం ఎదురయింది. ఆ పెద్ద చౌరస్తాలో వాహన సౌకర్యాలు, జన సంచారం దేనితోనూ నిమిత్తం లేకుండా వడివడిగా వచ్చి పోతున్నాయి. వేగంగా పరుగులు తీస్తున్నాయి. ఢిల్లీ నగరం చూస్తే, అసలు దేశ విభజన జరిగిందనీ పంజాబ్‌లోను, బెంగాల్‌లోను అనేక నగరాలు, పట్టణాలు నాశనం అయిపోయినాయని తెలియనే తెలియదు. ఢిల్లీలోని కొన్ని ప్రాంతాలనుంచి ముస్లింలను తరిమి కొట్టారు. అయితే కట్టడాలకు ఆస్తులకు వచ్చిన ప్రమాదం యేమీ లేదు. అన్నీ ఉన్నవి ఉన్నట్లుగానే వున్నాయి. నగర ఔద్ధత్యం యేమీ తగ్గలేదు. బారాతుటిలో దుకాణాల వరసలు వున్నాయి. తండ్రీ కొడుకు యీ సంరంభం మధ్య నిలబడ్డారు. అది మధ్యాహ్న సమయం. ఎప్పుడో ఉదయం రైల్వే స్టేషన్ నుంచి బయలుదేరారు. ఒక గ్లాస్ టీ మాత్రం తాగారు. ఒక బన్ కొరికారు. అంతే. వేరే భోజనం యేమీ లేదు మధ్యాహ్నం కూడా. వాళ్ల ఎదురుగా ఒక రెస్టరెంట్ అగుపిస్తోంది. శిథిలమైన కట్టడమే. అయినా హోటలు పేరుమాత్రం కొత్తగా చెక్కిన బోర్డు మీద కనిపిస్తోంది. 'మాస్టర్ హోటల్ !' అరుణ్ దాన్లోకి వెళ్లి యేమన్నా తిందాం అని అన్నాడు. లాలా కాన్షీరామ్ తలఊపాడు. కాని కదల లేదు.

'ఇక్కడే ఒక్క నిమిషం వుండు అరుణ్, యిప్పుడే వస్తాను' అని లాలా కాన్షీరామ్ బయలుదేరాడు ఆయన నీరసంగా పరాజితుడిలా గందరగోళంలో మునిగిపోయినవాడుగా కనిపిస్తున్నాడు.

'ఎక్కడికి వెడుతున్నారు ?'

'ఇప్పుడే వస్తాను గదూ !'

'నేను వస్తాను మీతో -'

'ఉహు. ఇక్కడే వుండు నేను పునరావస శాఖ ఆఫీసుకు వెళ్లి వస్తాను'

'కాని ఆఫీసర్ యేమాత్రం వీలులేదని యిప్పుడే గదా చెప్పాడు'

'అవునవును. నాకు తెలుసు' అంటూనే లాలా కాన్షీరామ్ ఆ ఆఫీసు వున్న సందులోనికి వడివడిగా నడిచి వెళ్లాడు. అరుణ్‌కు ఈ పరిస్థితి యేమిటో అర్థం కాలేదు. అతను అయోమయంగా నిలుచుండిపోయాడు. చాందినీ చౌక్ వెళ్లే ట్రాంవకటి వచ్చి నిలచింది. గంట వాయిస్తూ చప్పుడు చేస్తోంది. తండ్రిగారిని గురించి అతనికి భయంగా వుంది. ఎంతో నీరసించి నిస్తేజుడైపోయాడు ఆయన. కొద్దిసేపు అక్కడే నిలచివుండి, యిదిపనికాదని తానుకూడా రిఫ్యూజీ ఆఫీస్ వయిపు వెళ్లాడు.

ఆఫీసు తలుపులకు తెరలువున్నాయి. లోపల యేం జరుగుతూ వున్నదో బయటకు కనిపించదు. గుమస్తాల హాలును దాటివెళ్లి అరుణ్ సన్నని దారిగుండా నడిచి 'కస్టోడియన్' గది ముందుకు చేరుకున్నాడు. తండ్రిగారు అక్కడికే వెళ్లి వుంటారని అతనికి అనిపించింది. అన్నిటికంటే ఆశ్చర్యం, అతన్ని ఎవరూ అభ్యంతరపెట్టకుండా లోపలకుపోనిచ్చారు. తండ్రిగారు అతన్ని చూచి నిర్ఘాంతపోయారు. ఆయన తన కన్నీళ్లను దాచుకుందుకు ప్రయత్నం చేశాడు. ఆయన యేడుస్తూ వున్నాడా ? తండ్రిగారు .... యిలా బహిరంగ ప్రదేశంలో.... యేడుస్తూ వున్నాడా ?

ఆఫీసర్ అరుణ్‌ను చూడడం తోటే కొంత ఊరట పొందినట్లు కనిపించాడు.

'చూడు. మీనాన్నగారిని బాగా కనిపెట్టి వుండు. ఆయన రోదిస్తున్నారు. నేను చేయగలిగింది యేమీ లేదు. ఎక్కడా యిళ్లు అనేవే లేవు !' అన్నాడు

ఆయన మాటలు చాల సానుభూతిని కనబరుస్తున్నాయి. కాని మాట్లాడే పద్ధతి కరుకుగా వుంది. వాళ్లకు సహాయం చేయలేని తన అశక్తతకు ఆయన నవ్వుతూ వున్నట్లుంది. తెచ్చిపెట్టుకున్న నవ్వు. అరుణ్ తండ్రిగారిని బయటకు నడిపించుకు వెళ్లాడు.

వాళ్లు చౌక్‌వయిపు నడుస్తున్నారు. అరుణ్ తండ్రిగారి బుజాలమీద చేతులు వేశాడు, స్నేహితుని లాగ. అరుణ్ యింత వరకు యెప్పుడూ తండ్రిగారిని యింత ఆత్మీయంగా తాకివుండలేదు. ఆయన బుజం ఎముకలు పొడుచుకువచ్చి తగులుతున్నాయి.

మాస్టర్ హోటల్ చాల చిన్న ప్రదేశం కాకపోతే మెట్లెక్కి రెండో అంతస్తుకు వెడితే హాయిగా కూర్చోవటానికి కుర్చీలు, బల్లలు విరివిగా వున్నాయి. వాళ్లు పై అంతస్తులో మెయిన్ హాలులో కూర్చున్నారు. అరుణ్ తన కోసం నాన్, మాటన్ కర్రీ పురమాయించాడు. లాలా కాన్షీరామ్ మటుకు బిస్కట్లు, టీ మాత్రమే తీసుకుంటానన్నాడు. ఆయన పెదాలు వణుకుతూనే వున్నాయి. ఏడుస్తున్న దానికంటే అధ్వాన్నమయిన స్థితి యిది. ఒక బిస్కత్తు తుంపి నోట్లో పెట్టుకోబోతాడు. కాని పెదవులు చలించిపోతాయి ఆ బిస్కత్తు తుంపును సరిగ్గా తినలేకపోతున్నాడు. కన్నీళ్లు చేరుకుంటున్నాయి. కాని బయటకు రాకుండా లోపలకు వెళ్లిపోతున్నాయి. చెల్లాచెదరయి పోతున్నాడు మనిషి. టీ తాగుదామని కప్పు చేతిలోనికి తీసుకుంటే చేయి వణికి పోతోంది. అందుచేత దానిని బల్లమీదనే వదిలివేశాడు. పెదవులు వణుకు తూన్నాయి. బుగ్గలు పొంగిసాగుతున్నాయి. అరుణ్‌కు తాను నాన్, మటన్ కర్రీ పురమాయించినందుకు సిగ్గు అనిపించింది. అయితే యిప్పుడు నిదానంగా ఆ ఆహారం తీసుకోసాగాడు. ఏమీ మాట్లాడడం లేదు. గాజు కిటికీలో నుంచి చౌక్‌లో వున్న జన సంచారం సమ్మర్దం కనిపిస్తూనే వుంది. అరుణ్ ఒక్కడే దానివంక చూస్తున్నాడు. లాలా కాన్షీరామ్ మటుకు మరెటో చూస్తున్నాడు.

అరుణ్‌కు అర్థం కాకుండా పోతోంది.

ఒక కుటుంబానికి ఎంత అనర్థం వచ్చింది.

అంత నిరసన. అంత తగ్గింపు.

జీవశక్తే బలహీన పడిపోయినట్లు అయింది.

'అంత బెంగపెట్టుకోకండి, నాన్నా ఎక్కడో అక్కడ యిల్లు దొరక్కపోదు నింపాదిగా చూచుకుందాం' అన్నాడు.

లాలా కాన్షీరామ్ నిదానంగా భారీగా తల ఆడించాడు

'నాన్నా....'

అరుణ్ చేతిలో ఆహారపు తునక వుంది.

'నాన్నా. యేమిటిది ?'

లాలా కాన్షీరామ్ అరుణ్‌కు తనను గురించి ధైర్యం చెప్పటానికి ప్రయత్నం చేశాడు. నవ్వు తెచ్చుకున్నాడు ముఖం మీదకు. కాని ఆ నవ్వు యే పిశాచమో నవ్వుతున్నట్లు వుంది! ఆయన ముఖం గంభీరం అయిపోయింది, బిగుసుకుపోయింది.

'యేమిటది నాన్నా ?

లాలాకాన్షీరామ్ కొన్ని క్షణాలపాటు యేమీ జవాబు చెప్పలేదు. అందుకు బదులుగా తలకిందకు దించుకుని తన పాదాల వంక చూచుకున్నాడు. బిస్కట్ ముక్క కొరకటానికి మళ్లీ ప్రయత్నం చేశాడు. పెదవులు తీవ్రంగా కదులుతున్నాయి. ఆయన యిక లాభం లేదని కుర్చీలో వెనక్కు జారగిలబడి, చేయి పక్కకు పెట్టుకున్నాడు.

'నాన్నా'

'సరే ! నీకు తెలుసుకోవాలంటే విను. మధు !'

'నాన్నా. నాకు తెలియనే తెలియదు...'

- ఆ సాయంత్రం వాళ్ళు కింగ్స్ వే కాంప్ (శిబిరానికి) తరలారు. అది ఆలీపూర్ రోడ్డు మీద వుంది. అక్కడ వాళ్లకు ఓ ఆహ్లాదకరమైన సంఘటన ఎదురయింది. వాళ్లు వుండబోయేది గుడ్డ తెరలతో తయారు చేసిన డేరాలలో కాదు. ఇటుకలతో కట్టిన కట్టడాలలోనే ! త్వర త్వరగా తయారు చేయించారు కాందిశీకుల కోసం యీ బారాక్స్ (వరుసలు). ఇవి డేరాలకంటే విశాలంగా ఎక్కువ సదుపాయాలతో వున్నాయి. వాళ్లకు రెండు పక్కపక్క గదులు యిచ్చారు. పన్నెండు అడుగుల చదరపు గదులు. చిన్నవి. ఈ గదులకు ముందు ఆచ్ఛాదన వున్న వరండాలు కూడా వున్నాయి. వీటిని వంట గదులుగా ఉపయోగించుకోవచ్చు. గదుల నేల గచ్చు చేసి వుంది. కాన్వాస్ తెరల మధ్య నాలుగు నెలలు నానా అవస్థలు పడ్డ తరువాత, యీ రెండు చిన్న గదులూ వాళ్లకు యెంతో విశాలంగా రాజభవనం లాగ కనిపించ సాగాయి. లాలా కాన్షీరామ్ తన లాఠీతో గోడల మందాన్ని పరీక్షిస్తున్నాడు. అవి పలచగానే వున్నాయి. అయినా ఫర్వాలేదు. పనికి వస్తాయి. ఆ సాయంత్రమే అతను కుటుంబ సభ్యులందరకూ మంచాలు కొన్నాడు. కొత్త దుప్పట్లు కొన్నాడు. బీబీ అమరావతితో 'యిప్పుడు మీ సౌకర్యాలు చూడడం నా బాధ్యత' అన్నాడు బిగ్గరగా. ఆమె నవ్వింది - అంత విచారం లోను. 'సునంద యేదో పనిచూచుకుంటుంది' అంది. 'అందుకేం తొందర లేదు. నిదానంగా ఆలోచిద్దాం' అన్నాడు లాలా కాన్షీరామ్.

ఆ రాత్రి మళ్లీ వాన పడింది. ఈ రోజుల్లో ఆకాశం ఎప్పుడూ మేఘావృతమై వుంటోంది. వర్షం మటుకు యిప్పుడే వస్తోంది. అయితేనేం, యిప్పుడు వాళ్లకు మంచి రక్షణ వుంది. తలదాచుకోవడానికి తడవకుండా వుండటానికి ఓ యింటి కప్పు వుంది. 'బాగా వర్షం కురవనీ !' అనుకున్నాడు లాలా కాన్షీరామ్ కొంత తృప్తితో, సమాధానంతో. అలాగే భారీ వర్షం కురిసింది.

# మొదటి అధ్యాయం

లాలా కాన్షీరామ్ బస్‌స్టాప్ దగ్గర ఒక గంటకంటె ఎక్కువ సేపే నిలిచివుండవలసి వచ్చింది బస్ కోసం. అతని పరితాపం అల్లా యేమిటంటే కాందిశీకుల శిబిరంకింగ్స్‌వే కాంప్ నగరానికి ఒక మూలవుండగా, వాళ్లు తమకు రావలసిన కాంపెన్‌సేషన్ల గురించి దరఖాస్తులు యివ్వవలసిన ఆఫీసులన్నీ - ప్రభుత్వ కచేరీలు - మరోమూల వున్నాయి. న్యూఢిల్లీలో 'పి' బ్లాక్‌కు బయటనిలబడి వున్నాడు అతను. ప్రభుత్వ పరిభాషలో దీనిని 'రిహాబిలిటేషన్ ఆఫీసు' - పునరావాస కార్యాలయం - అంటారు. అద్భుతంగా కనిపించే లోకసభ బిల్డింగ్ పక్కగా వున్న ఒక అందవికారము - చూపులకే అసహ్యం అనిపించే కట్టడం యిది. సాయంకాలం అయిదుగంటలు అవటానికి యింకా కొద్ది నిమిషాలు మాత్రమే బాకీ వున్నాయి. తాను ఆతురతగా యిక్కడ నాలుగు గంటల నుంచి నిలబడే వున్నాడు. ఇది 'రిక్వెస్ట్ స్టాప్'. అతను ప్రతిమారు చేయిఎత్తి బస్ ఆపాలని ప్రయత్నం చేస్తూనే వున్నాడు. బస్ మాత్రం నిర్లక్ష్యంగా - ఆగకుండా - వెళ్లిపోతూనే వుంది. ఒకటి తరువాత మరొకటి. ఢిల్లీకి వచ్చిన మొదటి రోజుల్లో ఈ బస్‌లను చూస్తూవుంటే ఎంతో హుషారుగా ఆనందంగా వుండేది. సియల్‌కోటలో యిటువంటి యేర్పాటు లేదు. అక్కడయితే టాంగా తీసుకోవాలి లేదా కాలినడకను వెళ్లాలి. పాత ఢిల్లీలో కొద్దిపాటి దూరాలకు టాంగాలు వస్తాయి. కింగ్స్ వేకేంప్ నుంచి 'పి' బ్లాక్‌కు దూరం పదిమైళ్లు. ఇంతదూరం ప్రయాణం చేయాలంటే బస్‌లో వెళ్లడం తప్ప యింకేం మార్గం లేదు. లాలా కాన్షీరామ్‌కు కొద్దిపాటి సుంకం చెల్లించి, అల్లంత దూరం ప్రయాణం చేయడం చాల యిష్టం అనిపిస్తోంది. యూనిఫాంలో వున్న ఒక మనిషి 'టికెట్, ప్లీజ్.... టికెట్, ప్లీజ్....' అని అరుస్తూ తిరుగుతున్నాడు. లాలా కాన్షీరామ్ అతని కోసం వేచి వుండలేదు. కిటికీ పక్కగా ఓ చక్కటి సీట్ చూచుకుని, పదిలంగా కూలబడి అప్పుడు తాపీగా అరుస్తాడు : 'ఓ !. కండక్టర్ ! పి బ్లాక్ ఒక టిక్కెట్ యివ్వండి' అని. ఎంతో ఆప్యాయంగా ఒక్కోనాణెమూ కండక్టర్ చేతిలో పెడతాడు. అతనివంక

నవ్వుతూ చూస్తాడు. తాను ఎంత మంచివాడయిందో యీ నవ్వులోనే తెలుపుతాడు.

ఢిల్లీ వచ్చి రెండున్నర నెలలయింది. బస్ ప్రయాణాలు అంటే విసుగు యేర్పడిపోయింది, వెనకటి ఉత్సాహం చచ్చిపోగా. కింగ్స్ వే కాంప్‌లో బాగానే వుంటుంది. అది బయలుదేరే చోటు కనుక సీట్ తేలికగానే దొరుకుతుంది. మరి 'పి' బ్లాక్ దగ్గర బస్ దొరకడమే గగనం. 'రిక్వెస్ట్ స్టాప్' అనేది పేరుకు మాత్రమే. లాలా కాన్షీరామ్ చేయెత్తి తన 'రిక్వెస్ట్' తెలిపాడు. అంతేకాకుండా ముఖం నిండా దిగులు పులుముకుని, చాలాసేపటి నుంచి యిక్కడ పడిగాపులు పడివున్నాను - త్వరగా నన్ను ఉద్ధరించు - అన్న ప్రార్థన కళ్లలో కనబడేట్లు చూస్తూ డ్రైవర్ వంక దీనంగా చూచాడు. అయితేనేం ? బస్ మాత్రం అతన్ని లక్ష్యం చేయకుండా తుర్రుమని పారిపోయింది

ప్రతిరోజూ అనుకుంటాడు - రిక్వెస్ట్ స్టాప్ వద్ద నిలబడగూడదు - అని నాలుగు వందల గజాల అవతల వున్న రెగ్యులర్ స్టాప్ దగ్గరకు పోయి నిలుచుంటే మంచిది. అయితేనేం.... మానవుడిలో వున్న బలహీనతలు అంత బలమైనవి. ఎన్నిమార్లు దెబ్బలు తింటూ వున్నా యీమారు చూద్దాం, యింకోమారు ప్రయత్నిద్దాం - అనే చెబుతుంది మనస్సు. సెక్రటేరియట్ నార్త్ బ్లాంక్ దగ్గరకు వెళ్లి రెగ్యులర్ స్టాప్‌లో నిలుచోవటానికి శరీరం సహకరించదు.

ఈ రోజు మరీ అధ్వాన్నంగా వుంది. ఇంతసేపు ఎప్పుడూ వేచి వున్నది లేదు యిది వరకు. ఇప్పుడు ఆఫీసులు కూడా మూసివేశారు. గనుక యిక్కడికి బస్‌లు వస్తాయనే ఆశలేదు. అప్పుడు నార్త్ బ్లాక్‌కు నడక ప్రారంభించాడు. అక్కడ తొమ్మిదో నెంబరు స్పెషల్ బస్ తీసుకోవాలి. ఆఫీసులు వదిలాక అది అక్కడ నుంచి బయలుదేరుతుంది. లాలా కాన్షీరామ్ మొదటి స్పెషల్ బస్‌లో ప్రవేశం సంపాదించలేకపోయాడు. అయితేనేం, రెండో బస్‌లో కిటికీ పక్కసీట్ దొరికింది. బస్ తాపీగా ఢిల్లీ పురవీధులలో తిరుగుతూపోతూ వుండగా, తన చేతిలోని ఫైల్‌పుటలు తిరుగవేస్తూ కాలక్షేపం చేస్తున్నాడు అతను. 'పి' బ్లాక్‌కు ఎన్నిమార్లు వెళ్లాడో లెక్కలేదు. లెక్కబెట్టడం అంటూ వస్తే యిది యిరవయ్యో

మారో, ముప్పయో మారో అవుతుంది. అయినా ఖింతవరకు సాధించింది యేమిటి ? ఇంకా ప్రాథమికమైన దర్యాప్తులు కూడా సమాప్తం కాలేదు. సరయిన 'ఫాం' సంపాదించడమే కొన్ని వారాలు పట్టింది. స్థిర, చర ఆస్తులకు వ్యత్యాసం యేమిటో తెలుసుకోవడం కొన్ని వారాలు పట్టింది. అవి వేరు వేరు ఫారాలలో నింపవలసి వుండింది. ప్రతి కాగితం మీద ఎవరిదో 'సాక్షి' సంతకం తీసుకోవలసి వచ్చింది. ఈ సాక్షులు తమ కుటుంబ సభ్యులు కాగూడదు. సర్వసతంత్రులయి, నీకేమీ సంబంధం లేనివాళ్లయి వుండాలి. తరువాత, యీ సాక్షులు ఆఫీసర్ల ముందు దస్కత్తులు చేయాల్సి వుంటుంది - ఆ ఆఫీసర్ల వీలు, సాలు కనుక్కోవాలి. వాళ్లకు అనుకులం అయినప్పుడే నీవు మనుషులను తీసుకువెళ్లాలి వాళ్ల ముందుకు.... ఇలా ఎన్నో లాంఛనాలు.... సంప్రదాయ సిద్ధమైన యేర్పాట్లు చిట్టచివరకు - అంతా గడిచి గట్టెక్కితే - ప్రభుత్వం నీకు యేదో కాంపెన్‌సేషన్ - పరిహారం - యివ్వటానికి పూనుకుంటుంది. నీకు రావలసిన పరిహారం, యితర కాందిశీకుల లెక్కలన్నీ పూర్తిగా తేలేంత వరకు వేచివుండవలసిందే భారతదేశంలో ముస్లింలు ఎంత ఆస్తి వదలి వెళ్లారో లెక్కలు తేలడం కోసం కూడా నీవు వేచి వుండవలసివస్తుంది. అంతా అర్థం అవుతోంది గదూ ! ఇంత మతలబు వుండగా లెక్కలు తేలడం అంటే అంత తేలికగా ఎలా ముగుస్తుంది ? అంతవరకు నీవు యెక్కడున్నావో అక్కడే పదిలంగా కూర్చుని వుండాలి. నీ అవస్థలు నీవే పడాలి.

జన సంచారం ఎక్కువ వుంటుంది గనుక బస్ బహు నిదానంగా వెడుతోంది. దర్యాగంజ్‌లో యిద్దరు స్కూటర్ - రిక్షా డ్రైవర్లు రోడ్డు మధ్య బండ్లు నిలుపుకుని పిచ్చాపాటీ మాట్లాడుకుంటున్నారు. వాళ్ల పనిపూర్తయేంత వరకూ రోడ్డు మీద రాకపోకలు నిలచిపోయి వుండవలసిందే. వాళ్లు ఒకళ్ల పక్కన ఒకళ్లు నిదానంగా బండి నడుపుకుంటూ మాటలు కలుపుకుంటూ వెడుతున్నారు. బస్ డ్రైవర్ హార్న్ మోగిస్తూనే వున్నాడు. కాని వాళ్లు దాన్ని సరుకు చేయరు. ఢిల్లీలో లాలా కాన్షీరామ్‌కు ముచ్చట కూర్చే మరో విషయం యిది. ఇక్కడ అనుక్షణమూ యేదో కొత్తదనమే, ఉత్సాహమే. అందుకనే సియల్ కోట కంటె ఢిల్లీ మిన్న అనిపిస్తుంది. అతను తన సీట్‌లో నుంచి లేచి

బస్‌లోనే ముందుకు వెళ్లి రిక్షా డ్రైవర్లు మాట్లాడుకుంటూ నడవడం గమనించసాగాడు. రిక్షా డ్రైవర్లు దారి యివ్వకుండా తమపాటికి తాము నింపాదిగా నడుస్తూ వుండడం ఆయనకు నవ్వు తెప్పించింది. లాలా నవ్వుతుంటే - మనసారా - బస్ డ్రైవర్‌కు కోపం ఎక్కువవుతోంది.

కింగ్స్ వే కాంప్ దగ్గర బస్ దిగేటప్పటికి ఏడు గంటలు అయింది. శీతాకాలం రోజులు. త్వరగా చీకటి పడిపోతుంది. శిబిరానికి వెలువల చిన్నపాటి సంత బజారు తయారయింది. చిల్లర మల్లర సామాన్లన్నీ యిక్కడే దొరుకుతున్నాయి - నులక మంచాల నుంచి టాయిలెట్ సామాన్ల వరకు. లాలా కాన్షీరామ్ యింటికి వెళ్లడం కోసం వడివడిగా అడుగులు వేస్తున్నాడు. వెచ్చని దుస్తులు వేసుకోకపోవడం వల్ల కాస్త చలి అనిపిస్తోంది. బజార్లో యేదో 'టెన్షన్' పోగయినట్లు అనిపించింది. అక్కడక్కడ జనం గుంపులు గుంపులుగా పోగయి మాట్లాడుకుంటున్నారు. పాన్ షాపులముందు, టీ దుకాణాల ముందు - ముఖ్యంగా రేడియో సెట్లు వున్నచోట జనం వింతగా గుమిగూడి వున్నారు.

లాలా కాన్షీరామ్ యిది గమనిస్తూనే వున్నాడు కాని మరేదో విశేషం యిందుకు కారణం అయివుంటుందని అనుకోలేదు. ఎవరినీ యేమీ విచారించలేదు కూడ. తన ఆర్థిక పరిస్థితిని గురించి చింతిస్తూ - తన బరాక్స్ వరకూ నడిచి గదిలోనికి ప్రవేశించాడు.

ఆడవాళ్లంతా ఒకచోట పోగయివున్నారు. బీబీ అమరావతి, సునంద వాళ్ల గదికి వచ్చారు. వాళ్లు మంచాల మీద కూర్చుని వున్నారు.

ప్రభారాణి ఆయనలోనికి రావడంతోటే 'మీరు విన్నారా ? గాంధీ గారిని హత్య చేశారట !' అన్నది.

'ఎప్పుడు ?' అనడిగాడు లాలా కాన్షీరామ్ నిర్ఘాంతపోయి.

'ఈ సాయంకాలమే. ఇంకా వివరాలన్నీ తెలిసిరాలేదు'

'హత్య జరగడం మంచిపనే ! ఆయన మన జీవితాలన్నీ నాశనం చేశాడు' అంది బీబీ అమరావతి.

లాలా కాన్షీరామ్ ఆమె మాటలు వినలేదు గదిలోకి సాంతం ప్రవేశించకుండానే వెనక్కి తిరిగి అడుగులు వేసి మళ్లీ బజారువయిపు నడిచాడు

మొదటి గుంపులో చేరాడు. వాళ్లంతా గునగునలుగా మాట్లాడుకుంటున్నారు

'గాంధీగారిని హత్య చేశారట గదా. నిజమేనా ?' అనడిగాడు ఒకవ్యక్తిని.

'మీకింకా తెలీదా ?'

'ఆయన చనిపోయారా ?'

'ఆహా ! చనిపోయారు.'

ఆల్ ఇండియా రేడియోలోంచి భక్తి గీతాల ఆలాపన వినవస్తోంది. తరువాత వార్తా ప్రసారం వచ్చింది దీనిలో హత్యను గురించి నిర్ధారణగా చెప్పారు. గాంధీగారు ఆ సాయంత్రం ఒక దుండగుని చేతిలో హత్య చేయబడ్డారట ! బిర్లాహౌస్‌లో తన గదిలోనుంచి ప్రార్థనలు జరిగే తావుకు నడుస్తున్నారట ఆయన. ఒక ఆసామి ఆయన్ను ఎదురుగా వచ్చి మూడుమార్లు పేల్చి చంపాడట ! గాంధీగారు ప్రాణాలు వదిలేముందు 'హేరామ్' అన్నారట. అంతే ! నేలకు ఒరిగిపోయారు. హత్య చేసిన దుండగుడు హిందువేనట ! ఏమాత్రం అపార్థాలకు తావురాకుండా వుండడం కోసం - దుండగుడు మైనారిటీ కులాలకుచెందినవాడు కాడు, అని మరీ చెబుతున్నారు.

ఆ సాయంత్రం యిలాంటివే మరికొన్ని ప్రకటనలు వచ్చాయి. జవహర్‌లాల్ నెహ్రూ రేడియోలో ప్రసంగించారు. తమ జీవితాల నుంచి వెలుగు ఎగిరిపోయినట్లయిందన్నారు. అది మామూలు వెలుగు కాదన్నారు. ఉజ్వలమైన కాంతి పుంజం. అది యిప్పుడు రూపుమాసిపోయింది. భారతదేశం చీకటిలో మునిగిపోయింది

లాలా కాన్షీరామ్ యీ ప్రసంగాలన్నీ విన్నాడు. కాని వీటికి ఎక్కువ ప్రాధాన్యం యివ్వలేదు. మనసులో యేదో మూలనుంచి ప్రబోధం వస్తూనే

వుంది · యివి మంచి మాటలు, తప్పకుండా విను ! అని. గాంధీగారు చనిపోయారు పూర్తిగా చనిపోయారు. ఆ తరువాత - యేం జరిగితే యేమిటి? అంతా క్షుల్లకమైన విషయమే.... గాంధీగారు లేకపోయిన తర్వాత, అనిపించింది అతనికి

అరుణ్ యీ వార్తలు నది దగ్గర వుండి విన్నాడు అతను హిందు కాలేజిలో చేరాడు. ఢిల్లీలోని నాలుగు మగవాళ్ల కాలేజిలలో అది ఒకటి ఢిల్లీ యూనివర్సిటీ కోర్సులు వేరయినవి గనుక అతన్ని ఎం.ఏ. రెండవ సంవత్సరం తరగతులలో చేర్చుకోలేదు. అందుచేత అతను కింది తరగతిలోనే చేరవలసి వచ్చింది. ఒక సంవత్సరం వృధా అయినట్లయింది. సియల్ కోట పక్కగా ఒక నది ప్రవహిస్తుంది; కాని అది చాలా చిన్నది. ఢిల్లీలో అయితే యీ నగరాన్ని ఒరిసిపట్టుకుని యమునా నది - పవిత్రమైనది - ప్రవహిస్తోంది. అరుణ్ కాలేజి బోటింగ్ క్లబ్‌లో సభ్యుడుగా చేరాడు. కాలేజి కాంప్ స్థలం నుంచి నాలుగు మైళ్ల దూరం. బోట్‌హౌస్ మధ్యదారిలో వుంది ఇరుపక్కలనుంచి రెండు మైళ్ల దూరం. ఒక్కోమారు క్లాసులు అయిపోయినా కాలేజిలో వుండిపోయి బోట్ క్లబ్‌లో పనికూడా పూర్తిచేసుకునే యింటికి వస్తాడు. కాశ్మీరీ గేట్ దగ్గర - కాలేజి దాటగానే - యేదో దుకాణంలో కాస్తంత ఫలహారం చేస్తాడు. మధ్యాహ్నం పూటలు కాలేజి లైబ్రరీలో చదువుకుంటూ గడిపేస్తాడు. అప్పుడు నది దగ్గరకు సైకిల్ మీద వెళ్లి - ఒక బోటు తీసుకుని తానే స్వయంగా నడుపుకుంటూ ఒక గంటసేపు గడుపుతాడు. అతను స్వభావతః వంటరివాడు. ఒంటరిగా ఆడుకునే ఆటలే అతనికి ఆనందం కూరుస్తాయి. సియల్ కోటలో టెన్నిస్ ఆడేవాడు. ఎక్కువ యితరులతో కలివిడితనం అవసరం లేదు దీనికి. పడవ నడుపుకుంటూ పోవడం అంటే యింకో మనిషితో ప్రమేయం లేనే లేదు.

బోటు లోపలకు తెచ్చాడు. సుఖంగా వుంది మనసుకు. సాయంత్రం ఉక్కగా ఉండింది. అయితే నీళ్ల మీదకు వచ్చాక హాయిగా అనిపిస్తోంది. బోట్లను పంచియిచ్చే ఆసామి దగ్గర రేడియో వుంది. అరుణ్ అతనికి 'తెడ్లు' వాపసు చేస్తున్నప్పుడు విన్నాడు యీ విషాదవార్త.

సైకిల్ అందిపుచ్చుకుని గబగబ యింటికి బయలు దేరాడు. హంతకుడు ముస్లిం కాదు అని ఎంత బాహాటంగా ప్రకటనలు చేస్తూవున్నా, యీ సందర్భంగా మత కల్లోలాలు ప్రారంభం అవుతాయని అతనికి అనిపించింది. జామా మసీదు ప్రాంతంలో యింకా చాలామంది ముస్లింలు వున్నారు. ఇతర ప్రాంతాలలోనూ విరివిగానే వున్నారు గొందులు సందులు దాటుకుంటూ ఇంద్రప్రస్థ వుమెన్స్ కాలేజి దగ్గరకు వచ్చాడు. అక్కడ నుంచి అలిపూర్ రోడ్ తీసుకుని నేరుగా కేంప్‌కు శిబిరానికి చేరుకున్నాడు.

ఇవన్నీ అతనికి అరిష్టమైన నెలలు ఢిల్లీ వచ్చిన తరువాత గానీ ఛాందినీ పోయిందన్న విషయం తెలిసిరాలేదు. నారోవర్‌లో ఆమెను ఎవరో ఎత్తుకుపోయినప్పుడు తాము అక్కడనుంచి బయలుదేరబోతున్నారు. అతనికి మనస్తాపం కలిగిన మాట వాస్తవమే గాని ఎక్కువ విచారించటానికి వీలులేకపోయింది. ఇప్పటికి పరిస్థితులు కొంతలో కొంత స్థిమిత పడినాయి గనుక, హృదయం విప్పుకుని సమాలోచన చేయగలుగుతున్నాడు.

హృదయం రక్తం స్రవిస్తోంది. ప్రతిరాత్రీ, యీ రాత్రి సంవత్సరాల తరుబడి పొడిగించబడితే బాగుండను అనిపిస్తోంది పడుకునేటప్పుడు అనుకుంటాడు · 'ఓ ! భగవంతుడా ! తెల్లవారనివ్వకు' అని. నిద్రలో మునిగిపోతాడు. నిద్రలో గూడా ప్రశాంతత యేమీ వుండదు. అర్ధరాత్రి మెలుకువ వచ్చినప్పుడు విచారం ఎక్కువవుతుంది. అటుయిటు దొర్లుతున్నాడు తప్ప మళ్లీ నిద్ర పట్టకుండా వుంది. ఛాందినీ వెళ్లిపోయింది. బహుశ ఎక్కడయినా యింకా బతికే వుందేమో తెలియదు. ఎక్కడ వుందో యే స్థితిలో - రూపంలో - వుందో తెలియదు. అటుయిటు కదులుతాడు అరుణ్. నిద్రను కౌగలించుకోవాలని ప్రయత్నం. పగలు రాకుండా వుంటే బాగుండును. గడియారం చూచుకున్నాడు. రెండు గంటలు దాటి పదిహేను నిమిషాలు అయింది. అంటే రాత్రి యింకా నాలుగు గంటల సమయం వున్నదన్నమాట. బాధను అణుచుకోవలసిన అవసరం. బాధ హృదయంలో గూడు కట్టుకుంటూంది. ఏదో తీయని బాధ. అనారోగ్యకరమైన తీపిదనం నోటిలో

చేరుకుంటుంది దాన్ని అక్కడే నిలిపి వుంచాలి ఇంకా చీకటిగానే వుంది. నిద్రపోవాలి. మూడు గంటలు అయింది. నాలుగు, అయిదు, చీకటిలో పదిహేను నిమిషాలయినా నయమే. సూర్యుని వేడిమికి లేవడం కంటే - ఎంతసేపయినా పడుకుని వుండడమే మంచిది ! ఓ ఛాందనీ ! ఛాందినీ ! ఛాందినీ !

అతడు ఉదయం అవడంతోటే లేచాడు కాని అతని చేతనంలో కొంత భాగమే మేల్కొన్నట్లు అయింది. ఆ భాగం కాలకృత్యాలు తీర్చుకుంది. దుస్తులు వేసుకుంది. సైకిల్ ఎక్కి బయటకు వెళ్లిపోయింది. తతిమ్మా భాగం జడంగా అలాగే వుండిపోయింది. ఉహు. అది తనను వెనక్కులాగుతోంది. బస్‌కు ఎదురుగా వెళ్లి గుద్దుకుందాం అనుకుంటున్నాడు. వినాశం అయిపోదామని వుంది, అతనికి. ఇంకా అనేక దెబ్బలు తినడం కోసం యింకా బతికే వున్నాడు. మృత్యువు తారసిల్లినట్లయితే, యింకేమీ బాధ వుండదు. తన బాధను స్మరించాలని వుంది, స్పర్శించాలని వుంది - అతనికి. ఈ బాధలో యింకా ఆ పిల్లను గురించిన బంధం వుంది. ఆ బాధ లేకపోయినట్లయితే బంధం కూడా తెగిపోతుంది !

అతని తండ్రి పద్మిని నుంచి ఉత్తరం వస్తుందని ఎదురు చూస్తున్నాడు! అందరూ ఆ ఉత్తరం కోసరమే కాచుకొని వున్నారు. కాని ఎలాంటి ఉత్తరమూ లేదు, ఎలాంటి వర్తమానమూ లేదు. అరుణ్‌కు యిలా యే వర్తమానమూ లేకపోవడమే మంచిదనిపించింది. ఉత్తరం వచ్చి మాత్రం యేం లాభం! ఆమెను గురించి యే సమాచారమూ తెలియలేదని ఉత్తరం వచ్చి మాత్రం యేం లాభం ? ఆమెను గురించి - చావు వార్త తీసుకువచ్చే ఉత్తరం వస్తే యేమయినట్లు ? ఆమె దొరికినట్లయితే, ఎంత భాగం తిరగి వచ్చినట్లు ? ఆ తిరిగి వచ్చింది తన ఛాందిని కాకపోవచ్చు ! తాను సంతోషంగానే ఆమెను స్వీకరిస్తాడు. కాని ఆమె కూడా తనను సంతోషంగా స్వీకరించగలగాలి గదా ! ఆమె యేం చేస్తోందో యేం అంటుందో అతనికి తెలియదు. ఇలా యేమీ జరగకపోవడమే, తెలియకపోవడమే మంచిది. కనీసం అతనికి స్మృతి ఉన్నది.

పగలు - రాత్రి. రాత్రి - పగలు. కాలేజిలో ఆడపిల్లలు కనిపించేవాళ్లు. బస్తీ పిల్లలు. నాగరీకులు, దర్జాలు కనిపింపచేసేవాళ్లు. వాళ్లు అతనికి బుట్ట బొమ్మలలాగ అనిపించేవాళ్లు. జీవం లేకుండా దిష్టిబొమ్మల్లా వుండేవాళ్లు. దీనికంటే వెనకటి జ్ఞాపకాలే ఎంతో మేలు

ఈ రెండున్నర నెలల నుంచి యిదీ వ్యవహారం. ఛాందిని అతని ఆత్మలో కనిపించని భాగం అయింది. ఆమె అతనితో తిని తిరిగింది. అతనితో పడుకుంది. కాకపోతే కాస్త దూరంగా ఉండి పోయింది, అంతే. ఆ దూరాన్ని తగ్గించటానికి వీల్లేదు గనుక అతనికి యిప్పుడు బాధగా వుంది.

అరుణ్ గబగబ సైకిల్ తొక్కుతున్నాడు. పరిస్థితి అదుపుదాటి యింతకంటె అధ్వాన్నం అవడానికి ముందే యింటికి చేరుకోవాలని అతని ఆలోచన. నగరంలో యేదో దొమ్మీ, కొట్లాట జరుగుతుంది, తప్పదు. ముస్లిములను కాకపోతే పంజాబీ కాందిశీకులనయినా హింసిస్తారు.

సైకిల్ వరండాలో పెడుతూనే 'వార్తలు విన్నారా ?' అనడిగాడు.

'విన్నాను. నీవు విన్నది చెప్పు -' అన్నాడు తండ్రి.

'అదే !'

'ఎక్కడ నుంచి వస్తున్నావు యిప్పుడు ?'

'నది దగ్గర్నుంచి'

'కాశ్మీరీ గేట్ నుంచి కాదా ?'

'కాదు'

'నగరంలో యేం జరుగుతోందో తెలుసుకోవాలని వుంది'

'నాకూ అలాగే అనిపిస్తోంది'.

వాళ్లు చాల చింతాక్రాంతులయివున్నారు.

'బాగుంది. ఆయన పోవడమే మంచిపని. మనకు యేం తెచ్చిపెట్టాడు గనుక - అనర్థము, దుఃఖము తప్ప -' అంది బీబీ అమరావతి.

'అలా అనకమ్మా'

'ఎందుకు అనగూడదు నేను అంటున్నది నిజం కాదా ?'

లాలా కాన్షీరామ్ మాట్లాడలేదు.

'నీ పరిస్థితే చూచుకో. ఇప్పుడున్న "దుకాణం" సియల్ కోటలో నీ దుకాణంలో ఎన్నోవంతు ?'

వరండాలో ఒక మూల లాలా కాన్షీరామ్ కొన్ని చెక్కముక్కలు పేర్చి దుకాణం లాగా తయారు చేసుకున్నాడు. ప్రతి ఉదయం అక్కడ చిల్లర సామాన్లు అమ్ముతాడు. ప్రభారాణి అతనికి సరుకులను గదిలోనుంచి వరండాలోనికి తీసుకువచ్చేందుకు సహాయ పడుతుంది. సాయంత్రం మళ్లీ వాటిని గదిలోనికి చేర్చడంలో సహాయం చేస్తుంది. ఇక్కడ పోటీ కూడా ఎక్కువగానే వుంది. బయట పెద్ద దుకాణం లాంటిది వుంది. లోపల తోటి కాందిశీకులు పెట్టుకున్న యిటువంటి చిన్న చిన్న దుకాణాలు చాలా వున్నాయి. ఈ చిన్న కొట్టు మీద వచ్చే ఆదాయంతో యీ సంసారం గట్టు ఎక్కాలి !

లాలా కాన్షీరామ్‌కు బాగా దెబ్బతిన్నట్లు అయింది. ఆ చిన్న దుకాణం ప్రారంభించినప్పటి నుంచి తలపాగా చుట్టుకోవడం మానివేశాడు. తలపాగా దర్జాకు దర్పానికి గౌరవానికి చిహ్నం. ఇప్పుడు తనకు దర్జాయేం మిగిలింది గనుక, తలపాగా ధరించాలి ? ఓ టోపీ పెట్టుకుంటున్నాడు లేదా తన బీద అంతస్తును ప్రపంచానికి ప్రదర్శిస్తూ తలమీద యేమీ అచ్ఛదనే లేకుండా కూర్చుంటున్నాడు.

'నేను సర్వనాశనం అయిపోయినాను. పోనీ నీ అదృష్టంమటుకు ఎలా వుందో చూడు' అంది బీబీ అమరావతి.

'అవుననుకో. అయినా ఆయన మరణించాడంటే... గుండె కొట్టుకుంటుంది. బాధతో మెలి తిరిగుతోంది.'

'గుండె ! బాధ ! కొట్టుకోవడం !! మెలితెరగడం !! నువ్వు ఉత్త బేలమనిషివి-'

'గుండె మెలితిరగడం తప్పదమ్మా గాంధీ గారిలాంటి వ్యక్తి యే నూరేళ్లకో ఒకడు వస్తాడు' అంది సునంద.

నరోవాల్‌లో దురంతం జరిగిన తరువాత, సునంద ముఖ కవళికలే మారిపోయాయి. ముఖం మీద దుఃఖ చ్ఛాయలు పరుచుకు వున్నాయి. ఇదివరకు ఆమెను ఎరిగివున్నవాళ్లకు యీ మార్పు యిట్టే తెలిసివస్తుంది. ఇదివరకటి చలాకీతనం, స్ఫురద్రూపం లేనేలేవు యిప్పుడు. ప్రపంచంలో మరోకొనకు వలసపోయినట్లుగా వుంది ఆమె వాలకం. అయితే హుందాతనం, దర్పం - వీటితోనే మెలగటానికి ప్రయత్నిస్తోంది. ఆమె భర్త చనిపోయాడు ఆమె మీద అత్యాచారం జరిగింది. ఆమె మానం, మర్యాద నాశనం అయిపోలేదు - కనీసం ఆమె దృష్టిలో అందుకనే ఆమె అరుణ్ విషయంలో ఎలాంటి అరమరిక లేకుండా ప్రవర్తించ గలుగుతోంది. అతనితో పరాచకాలు ఆడుతోంది అతని తమాషా మాటలకు నవ్వుతోంది. గువ్వ పిట్టలాగ అమాయకంగా తిరుగుతోంది. ఏదో విచిత్రమైన పరిస్థితి తటస్థించి తన పరిపూర్ణత, కన్యాత్వం తనకు తిరిగి వచ్చేసినట్లుగా అనిపిస్తోంది ఆమెకు. అంతమాత్రమే కాదు. ఆమెలో అంతులేని విషాదం గూడుకట్టుకు వుంది. ఆమె వాలకమే మారిపోయింది, కుంచించుకుపోయింది.

'నీవు అలా అనడం మహా భేషుగ్గా వుందిలే' అంది బీబీ అమరావతి ఆమె మాటలకు అగ్గిలాపైకిలేస్తూ 'నీ భర్త పోయినాడు.... నీకు యింత కన్నా అన్యాయం జరగటానికి యింకేం మిగిలిపోయిందని ?'

అరుణ్, సునంద ఒకరివయిపు మరొకరు చూచుకున్నారు.

'దేశ విభజన వల్ల అదంతా జరిగింది. దేశ విబజనకు అంగీకారం, ఆమోదం తెలిపిన వాడు గాంధీ !'

'ఆమాట నిజం కాదు' అన్నాడు అరుణ్ చారిత్రక అంశాలను సరిదిద్దాలనే, ధోరణిలో 'ఆపని చేసినవాళ్లు నెహ్రూ, పటేల్... యితర నాయకులు !'

'వాళ్లందరూ గాంధీ తొత్తులు కాదూ ?'

'లేదు. అక్కడ మళ్లీ మీరు పొరబడుతున్నారు చివరి రోజులలో వాళ్లెవరూ ఆయన మాటవిననే లేదు'

బీబీ అమరావతి అరుణ్ వంక అనామోదసూచకంగా చూచింది అతను యిటీవల నెలల్లో యింత వికారంగా తయారయినాడేం ? ముక్కుమీద గూడా మొటిమలు లేస్తున్నాయి.

నవకాంత్ యేడుస్తూ వచ్చాడు యింతలో, సోదరి కొడుతున్నదని ఫిర్యాదు చేస్తూ. సునంద లేచి పక్కగదిలోనికి వెళ్లిపోయింది.

'ఆయన్ను చంపినవాడు ఎవరో పంజాబీ దేశస్తుడే అయివుంటాడు. నేనా పంజాబీని తప్పు పట్టను' అంది బీబీ అమరావతి. తాను కూడా లేచి వెళ్లిపోతూ. అది కేవలం ఆమె ఊహమటుకే. ఆరోజంతా అందరూ అలాగే అనుకున్నారు. తరువాతి రోజుగాని తెలిసిరాలేదు హంతకుడు మహారాష్ట్ర దేశీయుడని, తీవ్రమైన మత తత్వవాది అనీ.

ప్రభారాణి యేమీ మాట్లాడకుండా కూర్చుంది. ఆమెకు యిలాంటి వివరాలన్నీ తెలియవు. ఆమెకు గాంధీ ఒక మహాత్ముడు.... మహానుభావుడు! మహాత్ముడి మరణం దేశాన్ని తప్పకుండా క్షోభపరుస్తుంది. అందుకని ఆమెకు ఎంతో విచారంగానే వుంది

'ఇంక నిప్పువేయాలి' అనుకుంటూ లేచింది ఆమె.

'ఉహు. ఈ రోజు వంట చేయకు'

ఆమె ఒక క్షణం ఆలోచించింది 'అవును మీరు చెప్పిందే సరి !' అంది.

'కావాలంటే నీవు తినవచ్చు. అరుణ్ కూడా తినవచ్చు. నేనుమాత్రం తినను'

'నేనూ తినను' అన్నాడు అరుణ్.

వాళ్లు మంచాల మీద కూర్చుండి పోయారు, యేమీ మాట్లాడకుండా. పక్కగదిలో సునంద కొత్తగా కొనుక్కున్న 'కుట్టుయంత్రం' ముందు పనిచేసుకుంటూ కూర్చున్నట్లు అరుణ్ చప్పుడును బట్టి అనుకున్నాడు.

రోజులు గడవటానికి యీ మార్గమే వాళ్లకు అనుసరణీయం అయింది. ఎక్కడో ఒక వాడకంలో వున్న కుట్టుమిషన్ కొనుక్కున్నారు. సునంద కుట్టుపని ఆర్డర్లు తీసుకుంటూంది. ఎక్కువగా పిల్లల దుస్తులు కుడుతుంది , దుస్తుల మరమ్మతు కూడా చేస్తుంది.

అరుణ్ చాలామార్లు బజారుకు వెళ్లాడు, రేడియోలో వార్తలు వినడానికి. లాలా కాన్షీరామ్ కూడా అతనికితోపాటు నడిచాడు. మొట్టమొదటి మారుగా లాలా కాన్షీరామ్‌కు దేశ స్వాతంత్ర్యం తీసుకు వచ్చిన ఆశీర్వాదం యేమిటో తెలిసి వచ్చింది. బజార్లో చాలామంది జనం పోగయి వున్నారు. కొన్ని దుకాణాలు మూతలు పడివున్నాయి. కొన్ని యింకా తెరిచే వున్నాయి. జనం గుంపులు గుంపులుగా అక్కడక్కడ గుమిగూడి వున్నారు. అన్ని ముఖాలు పాలిపోయి నిర్జీవంగా వున్నాయి అందరూ పశ్చిమ పంజాబ్ నుంచి వచ్చిన కాందిశీకులే. దేశ విభజన తాలుకు దొమ్మీలో, దోపిడిలలో దెబ్బతిననివాడు మచ్చుకు ఒక్కడయినా లేడు వాళ్లలో. అయినా అందరూ యిప్పుడే కొత్తగా దెబ్బతిన్నట్లు బాధపడుతున్నారు. గాంధీ మరణం వాళ్లకు గొప్ప దారుణ చర్యగా, వ్యక్తిగత నష్టంగా గోచరిస్తోంది. కొందరు బీబీ అమరావతి మాదిరే మాట్లాడుతున్నారు, గాంధీయే అన్ని అనర్థాలకు మూలకారణం అన్నట్లుగా. చాలమంది యేడుపు మినహాగా పెదవులు బిగబట్టి నోళ్లు నొక్కుకుని నిలుచున్నారు. మాట్లాడుతున్నవాళ్లు కూడా జనాంతికంగానే వ్యవహరిస్తున్నారు. వార్తా ప్రసారం ప్రారంభం అవడంతోటే, అందరి నోళ్లూ కట్టుబడుతున్నాయి. ప్రసారం అంతం అవడంతోటే మళ్లీ గుసగుసలు - సన్నసన్నగా మాటలు.

లాలా కాన్షీరామ్‌ను ఆకట్టుకున్నదేమంటే - ఈ సంఘటనను ప్రతి వ్యక్తీ హుందాగా ఎదుర్కొంటున్నాడు. గర్వంగా బుజాలు నిలిపి స్వీకరిస్తున్నాడు. ఆ విషయం చూస్తున్నవాళ్లందరికీ స్పష్టంగా తెలుస్తోంది. దేశ స్వాతంత్ర్యం రాకముందు - అంటే పారతంత్ర్యంలోనే వున్న రోజులను - గుర్తు తెచ్చుకున్నాడు. అప్పుడు ప్రజలు ఎంత ఆత్మస్థైర్యంతో వుండేవాళ్లు ! ఒక భారత నాయకుడు చనిపోవడం .... ఆయన కోసం ప్రజలందరూ బాహాటంగా దుఃఖ పూరితులు అవడం ? అది అప్పటి రోజుల్లో అసాధ్యం అయిన సంగతి. అప్పుడు విచారం

వుండేది ; రోడ్లమీదకు వచ్చేవాళ్లు - కాని ఆ చర్యల్లో హుందాతనం వుండేది కాదు. బ్రిటిష్ వారు పట్టుకు దంచుతారేమోనని భయం పీకుతూ వుండేది హింసలు దౌర్జన్యాలు జరుగుతాయేమోనని కుంగిపోయేవాళ్లు. తమ మనుషులే తమకు వ్యతిరేకంగా తిరుగుతారేమోనని భయపడేవాళ్లు ఈ భయాలకు ప్రతి చర్యగా అన్ని పనులూ ఉద్రిక్తస్థాయిలో అతిగా చేసేవాళ్లు, గోల పెడుతూ యేడ్చేవాళ్లు, అలాగే పెద్దగా నినాదాలు చేసేవాళ్లు. . . ఈ రోజు జనం గర్వంగా నిలబడివున్నారు. స్థాయిగా, బింకంగా, ఆత్మస్థైర్యంతో వున్నారు. గతంలోలాగ, వాళ్లను యిలా చేయి - అలా చేయి అని క్షణక్షణము ఆదేశించే నాయకులు లేరు యిప్పుడు. వాళ్లకు తోటినట్లుగానే ప్రవర్తిస్తున్నారు. లాలా కాన్షీరామ్ గర్వంగా తల ఎత్తి నిలుచున్నాడు బుజాలు వెనక్కు కుంచించుకున్నాడు. అతనికి యిప్పుడు ఎలాంటి సంకోచాలు లేవు , ఎలాంటి అవరోధాలు లేవు.

కాని ఈ స్తితి అంతా యదార్థమేనా ? రాత్రి - నిద్రపోవటానికి ముందు పక్కమీద విశ్రాంతిగా పడుకుని ఆలోచించడం ఆరంభించాడు కాన్షీరామ్. తన వ్యక్తిత్వం ఎంత దెబ్బతిని పోయింది ! తాను పూర్వపు మనిషి కానేకాడు. ఆస్థిపాస్థులు ఎంత పరాధీనం అయిపోయినాయి ! మధు గతి యేమయింది? ఆలోటును ఎవరూ భర్తీ చేయలేరు గదా ! భవిష్యత్తు అంతా నిరాశగా నిస్తేజంగా ముందు పరుచుకువున్నట్లుగా అనిపిస్తోంది. ఎన్నో సంవత్సరాల ఆర్భాటం, ఆందోళన ముందు ముందు వుంది. ప్రతిదానికీ వరుసలుతీరి నించోవడం, దరఖాస్తులు నింపి సమర్పించుకోవడం.... అభ్యర్థనలు యిలాంటివి యింకెన్నో వున్నాయి. ఓ కందకం ముందు నించున్నట్లు వుంది. ఈ కందకానికి ఆవలి పక్క యేముందో తెలియదు. ఈ సొరంగం ఎంత దూరం వుందో అర్థం కాదు. స్వేచ్ఛ ఆవిర్భావం అవుతున్నప్పుడు యిలాంటి వివరాలన్నీ అవసరం లేదు స్వేచ్ఛను స్వాతంత్ర్యాన్ని యేదీ అడ్డగించలేదు. దేశ విభజనకు వాళ్లు అంత తేలికగా త్వరగా తమ ఆమోదం తెలిపివుండవలసింది కాదేమో !

ఆయనకు నిద్రరావడం లేదు. ఆలోచిస్తూ పడుకున్నాడు. హాయిగా పక్కమీద పరుచుకు పడుకున్నా కాళ్లు నెప్పులుగా సాగుతున్నాయి. బాగా

అలసటగా వుంది. కళ్లు మూసుకుంటే 'పి' బ్లాక్ అక్కడి ఆఫీసర్లు వాళ్ల ముఖాలలో వున్న కర్కశత్వం తన విషయాలను పరిష్కరించాలనే ఆదుర్దా యే మాత్రమూ లేకపోవడమూ - అన్నీ కనిపిస్తున్నాయి. కళ్లు తెరిస్తే డేరా కప్పు కనిపిస్తోంది. కళ్లు తెరిచినా మూసుకున్నా పరిస్థితి ఒక్కటిగానే వుంది. ప్రభారాణితోను, అరుణ్‌తోను యీ సంగతులు ప్రస్తావిద్దామనుకుంటున్నాడు. స్వాతంత్ర్యం తీసుకువచ్చిన మరో అనర్థకం యేమిటంటే - కుటుంబ సభ్యులతో హాయిగా మనస్ఫూర్తిగా మాట్లాడుకోవడం చేతకాకుండా పోయింది. భార్యతోగాని కుమారునితో గాని ముఖాముఖి ప్రస్తావన మృగ్యం అయిపోయింది. ఆప్యాయత చెక్కుచెదరకుండానే వుంది. లక్ష్యం, శ్రద్ధ అలాగే వున్నాయి. వాళ్లు తనను యిదివరకు మోస్తరుగానే గౌరవిస్తూ వున్నారు. అయినా అందరిమధ్య ఆలంబన, ఆధారం 'దారం' తెగిపోయినట్లు అనిపిస్తోంది. ఏదో అదృశ్య శక్తి తమనందరినీ దూరంగా తరిమికొడుతోంది. వాళ్లను కలుపుకురావడం తనకు చేతకాకుండా పోతోంది. రైలులో కొద్దిసేపు భార్యతో వెనకటి ఆదరం పునః ప్రతిష్టితం చేయగలిగాడు. అదీ కొద్దిసేపు ! తరువాత మళ్లీ రాలేదు ఆ స్థితి!

అరుణ్, ప్రభారాణి వాళ్ల వాళ్ల మంచాల మీద అలాగే పడుకుని దొర్లుతున్నారు. వాళ్ల కళ్లు తెరుచుకునే వున్నాయి. ఇంటి కప్పువైపు చూస్తున్నారు. అరుణ్‌కు లేచి కూర్చుని తండ్రిగారితో సంభాషించాలని వుంది. కాని చేతకావడం లేదు. ఇద్దరి మధ్య ఒక గోడ కొత్తగా అవతరించినట్లు అతనికి అనిపిస్తోంది. ఏదో దాపరికం, చేయరాని పని ! వివరంగా ఫలానా అని తెలియదు. - తండ్రిగారు చాల ఓర్పుగా నేర్పుగా ప్రవర్తిస్తున్నారు. తన భయాలను బాధలను భంగపాటులను యేకాంతంగానే అనుభవిస్తున్నారు. అరుణ్‌కు అందుకనే ఆయనంటే గౌరవం ఎక్కువ అయిపోతోంది. అయినా ఆయనతో యిదివరకు లాగ హృదయం విప్పి మాట్లాడటానికి జంకుగానే వుంది.

ప్రభారాణికి భర్త మేలుకుని వున్నాడని తెలుసు. అయినా ఆయన్ను పలుకరించి మాటలలో దింపడం యిష్టం లేదు. ఆమెకూ యిలాంటి సంకట స్థితే. వాళ్లతో - భర్త, కొడుకులతో - యిదివరలాగ హాయిగా కులాసాగా మాట్లాడలేకపోతోంది. తనలోనికి తాను కుచించుకు పోతోంది.

వాళ్లు ముగ్గురు బాగా మెలుకువగానే వున్నారు. గుండె లోతులలోనికి పోయి అవిశ్రాంతత కొనితెచ్చుకోలేకపోతున్నారు. ఒకళ్లతో ఒకళ్లు మాట్లాడుకోలేక పోతున్నారు. ఏదో అపరాధభావం వాళ్లను కట్టిపడవేస్తోంది. నిద్ర రావడం లేదు. నిద్ర రావడం లేదని దానిమీద కోపం వస్తోంది. వాళ్ల హృదయాలను విషాదం కమ్మేసింది. మరింత కుంగిపోతున్నారు, కుమిలిపోతున్నారు.

పక్కగదిలో సునంద కుట్టుయంత్రం బాగా వేగంగా నడుస్తోంది. అప్పుడప్పుడు ఆగిపోతోంది. ఉండి ఉండి కొద్దిపాటి చప్పుడు మాత్రం చేస్తోంది - ఒకచుట్టు రెండు చుట్లు మాత్రమే తిరుగుతున్నట్లు. ఆమె చక్రాన్ని చేతితో కుదుపుతోంది కాబోలు ముందుకు వెనక్కు.... ఉన్నట్లుండి వేగం పుంజుకుంటూంది. ఇక యీ యంత్రం ఆగదా .... అనిపిస్తోంది.

అరుణ్ ఆమెను గురించి ఊహించసాగాడు. బహుశ ఆమె దారాలను తెల్లని పళ్లతో పెదవులతో కొరుకుతూ వుంటుంది. చేతులతో - ఆ సున్నితమైన చేతులతో - యంత్రం చక్రాలను అటుయిటు కదలాడిస్తూ వుంటుంది. మృదువయిన చేతులు సుకుమారాన్ని మరచిపోయి మొద్దుబారిన యంత్రం వెనక తడుములాడవలసి వస్తోంది ! అరుణ్ ఆమెతో కూడా ముఖాముఖి యిదివరకటి మోస్తరుగా వ్యవహరించలేకపోతున్నాడు.

కుట్టుయంత్రం బరబర తిరుగుతోంది. చక్రం బహు వేగంగా నడుస్తోంది. దారం కిందకు పైకి ఆడుతూవుంది. కొద్దిపాటి చప్పుళ్లు చేస్తూ గుడ్డలను కుడుతోంది, అతుకులు వేస్తోంది. రెండు గదుల తలుపులు ఆ యంత్రం వేగానికి అనుస్పందనగా ఊగిసలాడుతున్నాయి.